కొంతమంది ప్రసిద్ధులు జీవిత చరిత్రలు రాస్తారు. మరి కొందరు అనుభవాలకు గ్రంథరూపం యిస్తారు. ఇంకా కొందరు జ్ఞాపకాల దొంతర్లను పేరుస్తారు. ఎలా చేసినా అవి యితరులకు ఆసక్తి దాయకాలు, విజ్ఞానదాయకాలు అయితే వాటిని చదువరులు ఆదరిస్తారు

ఎం.వి.రామమూర్తితన యించుమించు ఏబది సంవత్సరాల జీవితంలో ఎన్నో సంఘటనలు చూచారు; ఎన్నింటిలోనో పాల్గొన్నారు. వారిది అనుభవ జ్ఞానం. ఆయన జ్ఞాపకాలు ప్రత్యేకతను రంగరించు కున్నాయి; విశిష్టమయినవి. ఆమాటకు వస్తే ప్రతి వ్యక్తీ విలక్షణుడే.

అనేక ప్రజోద్యమాలను చూచిన మనిషి, పెక్కు ఉద్యమాలలో పాల్గొన్నవ్యక్తి, పౌరుడిగా తన బాధ్యతలను విస్మరించక నెరవేర్చిన మానిసి యీ గ్రంథకర్త. ఆయన పాల్గొన్న ఉద్యమాలు, పని చేసిన సంఘాలు యీనాడు బహుళ ప్రచారం కలవి కాకపోయినా భవిష్యత్తుకు పనికి వచ్చేవి; ఉపయుక్తాలు ఆలోచనలకు, భావాలకు ప్రాధాన్యతను యిచ్చే వారికి ఈ గ్రంథం అవశ్యం పఠనీయం

జయ పబ్లికేషన్సు నెం.1

# ఏడుపదులు

రచన ఎం.వి. రామమూర్తి



ముఖచిత్రం శ్రీ కె గంగాధర్

ప్రతులకు :
**జయా పబ్లికేషన్సు**
9, ఎం.ఐ.జి హెచ్ కాలనీ,
మెహిదీపట్నం హైదరాబాదు - 500 028
ఫోన్ · 220 156

ముద్రణ
**వాసిరెడ్డి ప్రింటర్సు**
37, అరవిందనగర్,
హైదరాబాద్ - 500 029
ఫోన్ · 6349263

వెల రు. 120=00

# ఈ గ్రంధం ఎలా వెలువడింది ?

సర్వసాధారణంగా ప్రసిద్ధి చెందినవారు జీవిత చరిత్రలు రాస్తారు. సంస్కర్తలు, సంఘ సేవకులు, రాజకీయవేత్తలు, రాజకీయ నాయకులు, వైవిధ్యం కల, వ్యక్తిత్వం కలవారు. చివరకు పేరుపొందిన నేరస్తులు, మోసగాండ్రు, విచిత్ర జీవితాలను గడిపినవారు తమ అనుభవాలను ఇతరులకు ఎరుక పరుస్తారు. నేను అంతగా పేరు ప్రఖ్యాతులు కలవాడిని కాను. సామాన్య మానవుడిని.

నేను సిద్ధాంత కర్తను కాను. బహు ప్రజారంగాలలో కార్యకర్తను. అలా నాకు అనేక అనుభవాలు సంప్రాప్తించినయి. తద్వారా ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నాను. కార్యాచరణ చేసే వ్యక్తి తప్పులు, పొరపాట్లు చేయడం సహజం కేవలం ఆలోచనలతో కాలం వెళ్లపుచ్చుతుండే మనిషి ఎప్పుడూ తప్పటడుగు వేయడు. అసలు అతడు అడుగు వేస్తే కదా!

ఆచరణ వాదినయిన నాకు సిద్ధాంతం లేక పోలేదు. అందరిలాగా నేను కూడా నా జీవితంలో అనేక దశలు దాటాను. మొదట్లో జాతీయవాదిగా, తరువాత మార్క్సిస్టుగా, దరిమిలా హ్యూమనిస్టుగా రూపొందాను. ప్రఖ్యాత మేధావి, తత్వవేత్త, రాజనీతిజ్ఞుడు ఎం.ఎన్.రాయ్ భావాలచే ప్రభావితుడనయ్యాను. 1942 నుండి ఆయన అనుచరుడిగా, సహచరుడిగా జీవయాత్ర సాగించాను. అనేక ఉద్యమాలలో కృషిచేశాను.

ఎమర్జెన్సీ వచ్చింది తే 26-6-75ది ఉదయమే నన్ను డెటిన్యూగా ప్రభుత్వం అరెస్టు చేసింది జైలులో తీరికగా మంచి పుస్తకం రాస్తే దానిని శ్రమకోర్చి అచ్చు వేయిస్తానని నా సహచరి మల్లాది సుబ్బమ్మ నాకు హామీ యిచ్చింది. విడుదల కోసం హైకోర్టులో వ్యవహారం చేస్తే అది నా విలువయిన కాలాన్ని హరించింది. మంచి అవకాశాన్ని నేను జారవిడుచుకున్నాను

ఆంధ్ర ప్రదేశ్‌లో రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ చరిత్ర రాయమని శ్రీ పోలు సత్యనారాయణ నన్ను ప్రోత్సాహపరిచాడు. తరువాత ఆం.ప్ర. రాడికల్ హ్యూమనిస్టు సంఘంవారు ఆ చరిత్ర రాయటానికి ఒక ఉపసంఘాన్ని నియమించారు. అందులో

నూ ఒక సభ్యుడిని. సహజంగా బద్ధకస్తుడనయిన నేను ఆ కార్యం సాధించలేకపోయాను.

కాలం దొర్లిపోసాగింది. ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వాన ప్రకటించబడిన ృష్ణా పత్రికను తను తిరిగి వెలువరించాలని తపన పడిన శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు ఆ రుతో దిన పత్రికను ప్రచురించ గలిగారు. ఆయన కూడా ఎమర్జెన్సీ డెటిన్యూయే. నా ంద ఆయనకున్న ఆదరాభిమానాలతో నా 'అనుభవాలను, జ్ఞాపకాలను' గ్రంథస్థం యమన్నారు. అవి 'ఈనాడు ఎవరికి కావాలి? ఎవరికి లాభం? ఏమి ప్రయోజనం?' ని నా సందేహాలను వెలిబుచ్చాను. 'అలా నిస్పృహ చెందాల్సిన పనిలేదు. ఈ తరానికి లియని విషయాలు అనేకం మీ వ్యాస పరంపరలో దొర్లగల అవకాశం వుంది. తప్పక రాయండి అచ్చువేస్తాను' అన్నారు శ్రీ పిరాట్ల. ఆ మాట ప్రకారం తే. 15-8-1994 నుండి అవిచ్ఛిన్నంగా, ధారావాహికంగా విజయవాడ, హైదరాబాదుల నుండి వెలువడే తమ దినపత్రికలో అచ్చువేశారు. నేను పేరుపెట్టని నా వ్యాస సముదాయానికి ఆయనే 'ఏడుపదులు' అని నామకరణం చేశారు.

సమాజ చరిత్ర విలువల చరిత్రయే అనేవారున్నారు. మానవ విలువలు సామాజిక జీవితాన్ని నిర్దేశిస్తాయి. పెద్దల యెడ గౌరవం, పిన్నలయెడ వాత్సల్యం, సహచరిపై అనురాగం, స్నేహితుల పట్ల సమాదరం యివన్నీ ప్రేమకు రూపాలు. ప్రేమ, కరుణ, సహనం, స్వేచ్ఛ, సత్యనిరతి, విశ్వాసం, మరొక వ్యక్తిని తన ప్రయోజనాలకు సాధనంగా వాడుకోకపోవటం యివి ప్రధాన మానవ విలువలు. మానవ విలువలు ప్రతి వ్యక్తి జీవితాన్ని నియంత్రణం చేయాలి. అలా వాటిని రంగరించుకోవటానికి నా జీవిత కాలం ప్రయత్నించాను. ఎంతవరకు సఫలీకృతుడనయినానో యితరులు తేల్చాలి. ఈ విలువలు నా జీవితానికి సప్త కోణాలు అనినా తప్పు కాదు.

ఎందుకు యీ ప్రసంగం అని చదువరులు విస్తుపోవచ్చును. నా జీవితం వైవిధ్యంతో కూడుకొని వున్నదని తెలియజెప్పాలనే ఆకాంక్ష నన్ను యీ వ్యాఖ్యానం చేయటానికి పురికొల్పింది. ఆ మాటకు వస్తే మానవలోకంలో ప్రతి వ్యక్తీ విలక్షణంగా జీవయాత్ర సాగిస్తాడు. ప్రతి ఒక్క వ్యక్తి తనకు తానే సాటి. అలాగే నేనూను.

అనేక ఉద్యమాలలో పెక్కుమంది మిత్రులతో కలసి పనిచేశాను. వారి పేర్లను జ్ఞాపకం ఉన్నంతవరకు ఉటంకించాను. ఎవరి పేర్లనయినా మరచిపోతే అది బుద్ధిపూర్వకం కాదని విజ్ఞప్తి చేస్తున్నాను. అనుభవాలను, జ్ఞాపకాలను వివరించే సందర్భంగా ఎవరి మనస్సుకయినా కష్టం కలుగజేస్తే అది అనాలోచింతం మాత్రమే నని మనవి చేయడం నావిధి. కొన్ని సందర్భాలలో యితరుల పేర్లముందు శ్రీ, తరువాత గారు అనేపదాలు అచ్చులో ఎగిరి పోయినయినయి క్షమార్హుడను.

ఈ గ్రంథంలో నా అనుభవాలన్నింటిని ఏకరువు పెట్టలేదు. అన్యులకు ఆసక్తి కలిగించేవి, ఇతరులను ఆకర్షించేవి మాత్రమే పేర్కొన్నాను సమాజానికి ఉపకరించేవి యిందులో చోటుచేసుకున్నాయి. చదివిన ఈ గ్రంథం అనుభవాల మాల అయినా దీనిని ఒక రకంగా జీవిత చరిత్ర అన్నా తప్పులేదు. వీలయినంత మేరకు కాల గమనాన్ని పాటించాను. ఈ వ్యాస సంకలనంలో నేను పాల్గొన్న సప్త ఉద్యమాలు పేర్కొనబడినాయి. మానవవాదం, హేతువాదం, పౌరహక్కులు, ప్రజాస్వామ్యం, మహిళా స్వేచ్ఛ, సేవారంగం, విద్య / ప్రబోధం వీటితో సంబంధం వున్నవి అవి. ఇవి నా జీవితంలోని సప్తభుజాలు. మానవులందరిలో హేతుత్వ శక్తి వుంది, కనుక అందరూ సమానులు. ప్రతి మానవునికి విలువ వుంది, హుందాతనం ఉండాలి. మానవ సమాజానికి మానవ వ్యక్తియే మూలాధారం. స్వేచ్ఛా పిపాస ప్రతి మానవుని లక్షణం; సత్యాన్వేషణ దాని ప్రతిచ్ఛాయ. మానవుడు ప్రాయికంగా హేతువాది కనుక అతడు / ఆమె నీతిమంతులు కాగలవారు. శాస్త్రజ్ఞానం (సైన్సు) మానవాభ్యుదయానికి దోహదం చేస్తుంది. శాస్త్రీయ దృష్టి, శాస్త్రీయభావ, శాస్త్రీయ వైఖరి ఆవశ్యకాలు. ఇవి నా జీవితంలో నేను పాటించిన సూత్రాలు.

చదువరులకు ప్రయోజనకరమయితే నా ప్రయత్నంలో కృతకృత్యుడనయినట్లే. కనీసం కాలక్షేపానికి వినియోగపడినా సంతోషమే. సాహసం చేసి యిలా అనుభవాలకు, జ్ఞాపకాలకు గ్రంధరూపం యిచ్చిన నన్ను పాఠకులు మన్నిస్తారని నా ఆశ.

... ఎం.వి. రామమూర్తి

# కృతజ్ఞతలు

ఆత్మకథ రాయమని చాలాకాలం క్రిందటే ప్రోత్సహించిన సర్వశ్రీ పోలు సత్యనారాయణ, పిరాట్ల వెంకటేశ్వర్లుల హితవు మరువరానిది ధారావాహికంగా ప్రచురించిన కృష్ణా పత్రిక సంపాదకులకు నేను ఋణపడి వున్నాను. దినపత్రికలో వరుసగా చదువుతూ బాగున్నాయని నన్ను వెన్ను దట్టిన సహృదయులను విస్మరించలేను. వీటికి పుస్తకరూపంయిమ్మని ప్రోద్బలం చేసిన నా సహచరి మల్లాది సుబ్బమ్మను యీ సందర్భంగా జ్ఞాపకం చేసుకోవడం నా విధి.

గ్రంధావిష్కరణ సభకు అధ్యక్షత వహించిన ఆంధ్ర హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, శ్రీ ఆవుల సాంబశివరావుకు, ప్రసిద్ధ మానవవాది పౌరహక్కుల ఉద్యమ నాయకుడు శ్రీ వి.ఎం. తార్కుండేకు నా కృతజ్ఞతలు.

వ్యాస ప్రతులను నాకు అందించిన కృష్ణాపత్రిక అధిపతుల సహాయాన్ని గుర్తుంచుకోవడం నా కర్తవ్యం.

సర్వాగ సుందరమయిన ముఖచిత్రాన్ని అనతికాలంలో వేసి యిచ్చిన కళాకారులు కె.గంగాధరం గారి పట్ల నాకు వున్న గౌరవభావాన్ని వ్యక్తీకరించడం నా విధ్యుక్త ధర్మం.

పుస్తకాన్ని అతి తక్కువ సమయంలో అచ్చువేసిన వాసిరెడ్డి ప్రింటర్సు యజమానురాలు కుమారి వాసిరెడ్డి పార్వతికి నా ధన్యవాదాలు.

చిట్టచివరగా నా సంతానాన్ని గురించి చెప్పడం అసమంజసం కాదు ఈ గ్రంధాన్ని వెలువరించటంలో సర్వ విధాలా నాకు తోడ్పడిన నా పుత్రిక మల్లాది (పర్సా) విజయలక్ష్మిని, సభా నిర్వహణ బాధ్యత చేపట్టిన నా జ్యేష్ట పుత్రుడు శ్రీ కె.ఆర్. మల్లాదిని ప్రత్యేకంగా పేర్కొనడం అప్రస్తుతం కాదు. నా అభ్యుదయాన్ని ఆకాంక్షించే నా తృతీయ కుమారుడు శ్రీ వెంకట్ మల్లాదిని, నా కోడళ్ళు సర్వశ్రీ ఉషా మహాలక్ష్మి, సత్యకళ్యాణి, మంజులను యీ సమయంలో నేను పేర్కొనడం న్యాయం.

పుస్తక ప్రతిని తయారు చేసిన శ్రీమతి యం. అనసూయ, సరిచూచిన శ్రీమతి ఎస్.సంధ్యల సహాయాన్ని నేను ఉపేక్షించటం సరికాదు.

... గ్రంధకర్త

# ఈ పుస్తకంలో ఇదీ వరుస

# ఉప్పు సత్యాగ్రహం

మా నాన్నగారు సోమసుందరం గారు, ప్రభుత్వోద్యోగిగా తరచు బదిలీ చేయబడుతున్నందున నేను 3 సంవత్సరాలు బాపట్లలో మేనమామల యిళ్ళల్లో వుండి, 3, 4, 5 ఫారాలు హైస్కూలు చదువు సాగించాను. ఆ రోజుల్లో ఖద్దరు ప్రచారం బాగా సాగుతుండేది. నా మేనమామ పెద్ద కుమారుడు పురుషోత్తం నాకన్నా రెండు క్లాసులు పైగా చదువుతుండేవాడు. వాళ్ళ యింటికి ఎదురుగా వెదుళ్లపల్లికి చెందిన శ్రీ బొడ్డుపల్లి సుబ్బయ్య ఖద్దరు దుకాణం వుండేది. పురుషోత్తం ఆయన ప్రభావానికి లోనయి ఖద్దరు వస్త్రాలు యింటింటికి వెళ్ళి అమ్ముతుండేవారు. ఆనాడు అతడు నాకళ్ళల్లో వీరునిలా కనపడేవాడు. దేశభక్తునిగా దర్శనమిచ్చేవాడు అతని విలువ అయిన దుస్తుల్ని వదిలివేసి ఖద్దరును ధరించేవాడు. మాది సంపన్న కుటుంబం కాకపోయినా నా తల్లిదండ్రులకు నేను ఏకైక సంతానం కనుక నన్ను ఆప్యాయంగా పెంచారు. నా మేనమామ కుమారునితో సమదీటుగా 'సన్ ప్రూఫ్', 'ట్వీడు', ఉన్ని వస్త్రాలతో దుస్తులు కుట్టించేవారు. అవి విదేశ వస్త్రాలు. చారల చొక్కా గుడ్డ 'పాపిలీన్' గజం రెండున్నర అణాలకు (నేటి పైసల లెక్కల 15 పై.) దొరికేది. 'సన్ ప్రూఫ్' ట్వీడ్ గజం ఆనాడు 5 రూపాయలుండేది. నేడు బజారులో దొరికే లడ్డుకు మూడింతలు సైజు గల నేతి లడ్డు 2 అణాలకు (12పై) దొరికేది. విదేశ వస్త్ర దహనం సాగుతుండేది. నేను నా విదేశీ వస్త్రాలతో తయారయిన కోటులను వదిలేసి ఖద్దరును చేపట్టాను. మహాత్మాగాంధీ ప్రబోధం వలన సామాన్య పౌరులలోకూడ కల్గిన వీరావేశం అది, స్వదేశీ ఉద్యమాభిమానం అది.

మరో సంఘటన గుర్తుకు వస్తున్నది. ఉప్పుసత్యాగ్రహం రోజులు అవి. సముద్రం బాపట్లకు 5మైళ్ళు (8 కి.మీ) దూరంలో వుంది. అక్కడ ఉప్పు తయారుచేసేవారు సత్యాగ్రహులు. శ్రీ మల్లాది యజ్ఞనారాయణ సత్యాయగ్రహంలో దూకాడు. ఆయన ప్లీడరు. ఆయన అధ్యక్షతన జరిగిన సభలో శాసనానికి వ్యతిరేకంగా తయారు చేస్తిన ఉప్పు పొట్లాలు అమ్మేవారు. చిన్న పొట్లం ఒక అణాకు అమ్మేవారు. పొట్లాలను కొనడానికి జనం ఎగబడేవారు. అలాంటి ఒక సభలో విద్యార్థిగా వున్న నేను అతి కష్టంమీద ఒక అణా పొట్లం కొనగలిగాను. ఆరోజు నేను బహ్మానంద పడిపోయాను. 'నేనూ దేశభక్తుణ్ణే' అని గర్వపడ్డాను. అలా శాసనోల్లంఘనం చేసిన వారికి 6 నుండి 18 నెలలు వరకు శిక్షలు పడేవి. అరస్టు చేయగానే 'బోలో స్వతంత్ర భారత్ కు జై' అనే నినాదాలు యిస్తూ పోలీసుల వెంట జైలుకు వెళ్ళేవారు సత్యాగ్రహులు. ఆనాటి త్యాగం, స్థిరసంకల్పం అలాంటివి.

# భగత్‌సింగ్ ఉరి

నాస్మృతి పథంలో యిప్పటికీ మెరిసే విషయాన్ని ప్రస్తావించటం నా విధ్యుక్త ధర్మం. అది 1931వ సంవత్సరం కేంద్ర శాసన సభలో బాంబు వేసి ఆత్మత్యాగానికి సిద్ధపడి పోలీసులకు పట్టుపడిన భగత్ సింగ్‌ను నికృష్ణ బ్రిటిషు ప్రభుత్వం ఉరితీసిన రోజు అది. దేశభక్తులందరినీ కలిచివేసింది యీ దుర్ఘటన. బాపట్ల హైస్కూలు విద్యార్థులు బడినుండి నిష్క్రమించారు. సమ్మెను ప్రకటించారు. ఎదురుగా వున్న టౌను హాలు ఆవరణలో గుమికూడారు. శ్రీ పంచాప కేశయ్యర్ ఆనాటి ప్రధానోపాధ్యాయులు. పాఠాలు చక్కగా చెప్పేవాడు. అయితే క్రమశిక్షణను పాటింపచేయటంలో ఆయన కాయనే సాటి. పేము బెత్తం తీసుకొని ఆయన హుటాహుటీని విద్యార్థుల దగ్గరికి వచ్చాడు. 6వ ఫారం విద్యార్థులు ముందున్నారు. మమ్మల్ని వెనుక వైపు నుంచోమని వారంతా ముందు వరుసలో నుంచున్నారు ప్రధానోపాధ్యాయుడు మా దగ్గరకు వచ్చాడు. మా గుండెలలో రైళ్ళు పరుగెత్తగాసాయి. మీకంత భయమయితే మీరు వెనుక నున్న సరివి తోటల్లోకి పారిపొమ్మన్నారు విద్యార్థి నాయకులు కొంతమంది వెనుకకు వెళ్ళారు. చాల మంది వెనుక వరుసలో నిల్చున్నారు ముందు వరుసలో వున్న విద్యార్థులలో ఒకడయిన నామేనమామ కొడుకు పురుషోత్తంను చెవి మెలివేస్తూ 'ఏమిరా స్ట్రయికు చేస్తావా'? అని బెదిరింపుగా అన్నాడు పంచాప కేశయ్యర్. మాష్టారు చెయ్యిని తీసి విదిలించాడు పురుషోత్తం. వాడి ధైర్యానికి అందరం మనస్సులో జోహారు అర్పించాం. 'మేము ఈ రోజు బడికి రామండీ' అన్నారు విద్యార్థి నాయకులు. ఆయన ఖిన్నుడయి తిరిగి మౌనంగా వెళ్ళిపోయాడు. మరునాడు అరరోజు గైరుహాజరుకు అర్ధణా (యినాటి 3 పైసలు) జరిమానా విధించాడు. రెండు రోజులకు మానాన్నగారు వచ్చారు. జరిమానా అర్ధణా యిమ్మన్నాను. ఇవ్వనన్నాను. అయితే రైలు దగ్గర కూలికి మూటలుమోసి సంపాదించుకొని కట్టా నన్నాను 'నీ యిష్టం అని' వెళ్ళిపోయారు ఆ సంవత్సరంలో నేను నావేలు విడిచిన మేనమామ శ్రీ కప్పగంతుల వెంకట సుబ్బమ్మ గారి యింట్లో చదువుకుంటూ వుండేవాడిని. ఆయన ప్లీడరు గుమాస్తా. నిరంతర ఖద్దరు వస్త్రధారుడు; దేశభక్తుడు. (తరువాత ఆయన రెండవ కుమారుడు రామమూర్తి రెండుసార్లు జైలుకు వెళ్ళి సుమారు 2 సంవత్సరాలు జైలులో వున్నాడు.) ఆయన నన్ను ఆప్యాయంగా పిలిచి ఆదరించి అర్థణా యిచ్చాడు. జరిమానా చెల్లించాను. జరిమానా చెల్లించమనే దాకా విద్యార్థి ఉద్యమం ఆనాడు ఎదగలేదు. పెద్దగా రాజకీయాలు తెలియని హైస్కూలు విద్యార్థులను కూడా ఊపి వేసింది ఆనాటి దేశభక్తి భావం. లేత వయస్సులో మనస్సులో పడి బీజ ప్రాయపు ఆనాటి భావాలు కాలక్రమేణ దేశభక్తులను ప్రభావితం చేసాయి; తయారుచేసాయి

# 'భగత్‌సింగ్ బ్యాడ్జీ ధరించడం ఉత్తేజకరం'

మా నాన్నగారు గుంటూరు జిల్లా పొన్నూరు సబ్‌మేజిస్ట్రేట్‌గా వుండేవారు. భగత్ సింగ్ బొమ్మ వున్న బ్యాడ్జిని ధరించిన వారిని పోలీసులు అరెస్టు చేసి కోర్టులో హాజరు పరిచేవారు. వారికి ఆరు మాసాల ఏడి ఖైదు వరకు మా నాన్నగారు విధించేవారు. నేను ఆ రోజుల్లో భగత్ సింగ్ బ్యాడ్జిని ధరించి ఊళ్ళో తిరుగుతుండేవాడిని. ఒక రోజు ఉదయం ఆ ఊరి సబ్‌ఇన్‌స్పెక్టర్ మా నాన్నగారి దగ్గరకు వచ్చాడు. భగత్‌సింగ్ బ్యాడ్జి పెట్టుకున్న వాళ్ళను అరెస్టు చేసి మీ ముందు కోర్టులో హాజరు పరుస్తుంటే మీ అబ్బాయి బ్యాడ్జి పెట్టుకుని తిరగడం బాగాలేదు అని చెప్పాడు. మా అబ్బాయిని మందలిస్తానని మా నాన్నగారు అతనికి హామీ ఇచ్చి పంపేశారు. తర్వాత నన్ను పిలిపించి అలా బ్యాడ్జి ధరించి తిరగడం మంచిది కాదని, మానివేయమని కోరారు. నేను కోపంతో వూగిపోయాను. మీరు కాబట్టే ఈ దరిద్రపు బ్రిటిషు ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు. నేనయితే ఏనాడో వదిలి వేసేవాడిని అన్నాను. ఈ మాటతో మా నాన్నగారికి అలవికాని దుఃఖం వచ్చింది. కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు. తన గాథ వినిపించారు. 'తల్లిని నా 11వ ఏట పోగొట్టుకున్నాను. నా తండ్రి మరల వివాహం చేసుకున్నాడు. మా 50 ఎకరాల అగ్రహారపు మెట్ట భూమి మీద సంవత్సరానికి రెండు వందల లోపు ఆదాయం వచ్చేది. నా తండ్రి రివెన్యూ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం చేశాడు. సచ్ఛీలుడు. లంచం అనే మాట ఎరుగని మహనీయుడు. ఆయనకు ఇల్లు గడవడం కష్టంగావుండేది. 1912లో బిఎ ప్యాసు కాగానే వెంటనే ఉద్యోగంలో చేరాను. మిడిల్ స్కూల్ హెడ్ మాస్టర్‌గా నాకు నెలకు 80 రూపాయలు జీతం. నా తండ్రి ఒక డిప్యూటీ కలెక్టర్ మాట విని నా ఉపాధ్యాయ వృత్తిని విసర్జింప చేసి నెలకు 25 రూపాయలు మాత్రం ఇచ్చే తాలూకా హెడ్ గుమాస్తాగా నన్ను చేర్పించాడు. మా రోజుల్లో పితృవాక్య పరిపాలన మా ఆదర్శం. కిక్కురుమనకుండా చేరాను. పొలాలమీది ఆదాయం నా తండ్రికి వదిలివేశాను. గతిలేక ఈ ప్రభుత్వ తాబేదారుత్వానికి సిద్ధపడ్డాను' అని ముగించాడు. దీనంగా వున్న ఆయన ముఖం చూచినా నా కోపం తగ్గలేదు. విసుగుతో అక్కడినుండి లేచిపోయాను. ఇప్పుడు దానినంతా తలచుకుంటే నాది అహంభావమా లేక దేశభక్తో తేల్చుకోలేకుండా వున్నాను.

మా నాన్నగారు తెనాలిలో ఉద్యోగం చేస్తుండేవారు. కొలది రోజులు సెలవు మీద ఉన్నారు. నేను నల్లరంగు ఖద్దరు కోటు వేసుకుని గాంధీ టోపీ పెట్టుకుని తిరుగుతుండేవాడిని. మా నాన్నగారు నన్ను మందలించలేదు. ఒకనాడు ఆయన పనిమీద గుంటూరు వెళ్ళారు. అక్కడ గుంటూరులో భీభత్స దృశ్యం తాండవమాడుతున్నది. సైమను కమిషన్ గుంటూరుకు వచ్చినపుడు నిరసన సూచకంగా మున్సిపలు ఆఫీసును మూసివేయించిన కాంగ్రెస్ మున్సిపలు ఛైయిర్మనుగా పేరు ప్రఖ్యాతులు పొందిన నడింపల్లి నరసింహారావుగారిని పోలీసులు అరెస్టు చేశారు. వేలమంది ప్రజలు నిరసనగా ప్రభుత్వ కార్యాలయాల ముందు, పోలీసు స్టేషన్ల ఎదుట, కోర్టుల వద్ద గుమిగూడారు. విదేశీ ప్రభుత్వం గజగజలాడింది. ఆయనను

గుంటూరు నుండి ఎలా తరలించాలో వారికి మొదట్లో స్ఫురించలేదు. తరువాత ఒక పథకం వేశారు. పన్నెండు బస్సుల్లో రిజర్వు పోలీసులను ఎక్కించారు. ఆ బస్సులు ఎనిమిది దిక్కులకు వెళ్ళాయి. ఏ బస్సులో శ్రీ నరసింహారావు వున్నారో ప్రజలెవ్వరికీ తెలియదు. ప్రజలు కోపోద్రిక్తులయి ఆయనను రక్షించుకోవాలని వీధులలో తిరుగుతున్నారు. ఏ క్షణాన పోలీసులు తుపాకులు కాలుస్తారో అని భయపడుతున్నారు కూడా. ఈ సంగతి తెలిసిన మా నాన్నగారికి ఖారు పుట్టింది. ఆ పోలీసు బలగం తెనాలి వచ్చి గాంధీ టోపీ పెట్టుకున్న వాళ్ళ నందరినీ కాల్చేస్తారని మా నాన్నగారు భయపడ్డారు. హుటాహుటిన తెనాలిలో మా యింటికి వచ్చారు. ఆరోజున ఎందువల్లనో నేను స్కూల్కి పోలేదు. నన్ను చూచి ఆయన సంతోషం పట్టలేక కౌగిలించుకుని ఆనందభాష్పాలు విడిచారు. ఆయన పుత్రప్రేమకు ఒక్క క్షణం విస్మితుడినయ్యాను.

నరసింహారావుగారిని వినుకొండ దాకా బస్సులో తీసుకుని వెళ్ళి అక్కడ రైలెక్కించి జైలుకు పంపారని తర్వాత తెలిసింది. ఈ గుంటూరు పట్టణమే దరిమిలా చరిత్ర ప్రసిద్ధమయింది. గాంధీ టోపీ పెట్టుకుని వీధిలోకి వచ్చిన వారి నందరినీ పోలీసులు చితకబాదారు. వారు వీధి ప్రక్కనున్న ఇళ్ళల్లో జొరబడితే ఇళ్ళలోని వాళ్ళను కొట్టారు. వారికి దాహం ఇచ్చిన వారిని కొట్టారు. ప్రజలను భీతావహులను చేయడానికి పోలీసులు అలా దుర్మార్గంగా ప్రవర్తించారు. ఈ విషయం బ్రిటీషు పార్లమెంటులో చర్చకు వచ్చింది. ఇండిపెండెంట్ లేబరు పార్టీ నాయకుడు భారత స్వాతంత్ర్యాభిలాషి శ్రీ ఫెన్నరు బ్రాక్వే గాంధీటోపీ పెట్టుకుని పార్లమెంటుకు వచ్చాడు. 'గాంధీ టోపీ పెట్టుకోవడం తప్పా, దానిని ధరించడం నిషేధం చేశారా?' అని బ్రిటీషు ప్రభుత్వాన్ని నిలదీశాడు. హోంశాఖామంత్రి తన విచారం వెలిబుచ్చాడు. తప్పుడు పని చేసినా 'లా' ప్రకారం చేసే బ్రిటీషువారు అలా అభిప్రాయ ప్రకటన చెయ్యడంలో ఆశ్చర్యం లేదు.

# గుంటూరు రాష్ట్రకాంగ్రెస్ మహాసభ

మహాత్మా గాంధీ గారు కాంగ్రెస్ సంస్థ ఏకైక ప్రతినిధిగా రెండవ 'రౌండు టేబిలు' సమావేశానికి వెళ్ళి విఫలులయి తిరిగి వచ్చారు. ఆయన వచ్చేటప్పటికే జవహర్‌లాల్ ప్రభృతులను అరెస్టు చేసింది బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం. కాంగ్రెస్‌వారు ప్రతిఘటనోద్యమాన్ని ప్రారంభించారు. ఆ సందర్భంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ మహాసభను గుంటూరులో రహస్యంగా జరిపారు. కాకినాడకు చెందిన శ్రీమతి వేదాంతం కమలాదేవిగారు అధ్యక్షులు. పోలీసులకు ఈ విషయం ఆనాకే తెలిసి వారి నందరినీ అరెస్టు చేశారు. సుమారు 170 మంది బందీలుగా గుంటూరు సబ్‌జైల్‌కు తీసుకుని వచ్చారు. అప్పుడు మా నాన్నగారు గుంటూరులో స్పెషల్ సబ్ మేజిస్ట్రేట్. ఆ ఉద్యోగ హోదాలోనే ఆయన 'సబ్‌జైలు సూపరింటెండెంట్'. ఇంత సంఖ్యలో వచ్చిన బందీలను చూచి మా నాన్నగారు అదిరిపోయారు. సబ్‌జైలులో యాభై మంది ఖైదీలకే చోటు సరిపోతుంది. అయితే కాంగ్రెసువారు అహింసావాదులని, వారు జైలు నియమాలను ఉల్లంఘించరని మా నాన్నగారికి తెలుసు. అందులో

గుంటూరు జిల్లా వాస్తవ్యులయిన కొండా వెంకటప్పయ్యగారు, నేతి చలపతి రావుగారు ఇలాంటి నాయకులు వున్నారు. ఆయన ఒక పథకాన్ని నాయకులకు సూచించారు. మరి యువకులయిన కాంగ్రెస్ వారిని రాత్రి వేళ జైలు గదులలో బంధించేటట్లు మిగతా వారిని జైలు వరండాలలో నిద్రపోనిచ్చేటట్లు ఆయన ప్రతిపాదన. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు అంగీకరించలేదు. 'కాంగ్రెస్ వారిని ఇలా రెండు వర్గాలుగా చీల్చడం అసమంజసం. అన్యాయం' అని ఆయన అన్నారు. మా నాన్నగారు ఈ పరిణామానికి దిగాలు పడ్డారు. 'కాంగ్రెస్ వాదులుగా జైలు నియమాలను అందరూ మామూలుగా పాటిస్తారు. కానీ ఏ యువకుడయినా ఆకతాయి చేష్టగా జైలునుండి వెళ్లిపోయి నేను జైలుద్దాటి వచ్చాను అని అంటే నా ఉద్యోగం ఊడుతుంది అని మా నాన్నగారి వాదన. నిజానికి తీవ్రవాద భావాలున్న యువ కాంగ్రెస్‌వారు అనేకమంది ఉన్నారు. చేసేది లేక తమకు బాగా పరిచయం వున్న నేతి చలపతి గారిని ఆశ్రయించారు. కొండా వెంకటప్పయ్యగారికి నచ్చచెప్పమని ప్రాధేయపడ్డారు. చలపతి రావుగారి సౌజన్యంతో రాజీ కుదిరింది. మా నాన్నగారి ప్రతిపాదనను కొండా వెంకటప్పయ్యగారు ఆమోదించారు. సర్వశ్రీ మద్ది సుదర్శనం, ఊటుకూరి పున్నారావు లాంటి వణిక్ప్రముఖులు ఆహార వస్తువులను సరఫరా చేశారు. ఖైదీలో వండుకునే వారు. రోజూ సంతర్పణలాగ సాగేది.

జిల్లా పోలీసు సూపరింటెండెంట్ భారతీయుడు. ఆయన జైలులో కాపలా పోలీసుల పనిని తనిఖీ చేయడానికి వచ్చాడు. జైలు వరండాలలో వున్న కాంగ్రెస్ ఖైదీలను చూచి అక్కడవున్న జైలు సూపరింటెండెంట్‌గా వున్న మా నాన్నగారిని చూచి మీరు వాళ్ళనందరినీ జైలు గదుల్లోకి నెట్టండి. అవసరమైన పోలీసు సిబ్బంది 'బెయినట్లు యిచ్చి పంపుతాను అన్నాడుట. మా నాన్నగారు ఇలా జవాబు ఇచ్చారట, 'ఖైదీల బాధ్యత నాది. నేను కోరిన కాపలా పోలీసులను పంపడం మీ బాధ్యత. దాంతో పోలీస్ సూపరింటెండెంట్ ఉగ్రుడయి జిల్లా కలెక్టర్ వద్దకు హుటాహుటిన వెళ్లాడుట. కలెక్టరుగా వున్న ఆ బ్రిటిషు జాతీయునితో 'మీ మేజస్ట్రేట్ కాంగ్రెస్ పార్టీ అభిమాని' అని ఫిర్యాదు చేశాడుట. 'నా మేజిస్ట్రేట్ విషయం నాకు తెలుసు. అతడు తన బాధ్యతను సక్రమంగా నెరవేర్చగలడు. అతడు కోరిన పోలీసు సిబ్బందిని కాపలా నిమిత్తం పంపండి' అన్నాడుట కలెక్టర్. ఈ సంఘటన రెండు విషయాలను తెలియజేస్తుంది. భారతీయ ఉద్యోగుల్లో కొందరు క్రూరంగా ప్రవర్తించగలరని, మరికొందరు ఉదారంగా నడుచుకుంటారని తేటతెల్లయింది.

దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి భార్య చావు బ్రతుకుల్లో వుంది. ఆమె తన భర్తను చివరిసారిగా చూడకోరింది. వెంకటప్పయ్యగారు గుంటూరు సబ్‌జైల్‌లో వున్నారు. నేతి చలపతిగారు వచ్చి ఆ రాత్రికి వెంకటప్పయ్యగారిని యింటికి వెళ్లనిమ్మని మా నాన్నగారిని కోరారు. 'నేను సమ్మతించినా వెంకటప్పయ్యగారు అంగీకరించవద్దా?' అని మా నాన్నగారు ప్రశ్నించారు. ఆ బాధ్యత నాది. నేను వారిని ఒప్పిస్తాను అన్నారు నేతి చలపతి గారు. ఎంతో కష్టం మీద వెంకటప్పయ్యగారి సమ్మతిని సంపాదించారు చలపతి గారు. ఆ రాత్రి వెంకటప్పయ్యగారు యింటికి వెళ్లి తెల్లవారిన తర్వాత తిరిగి జైలులోకి వచ్చారు.

గుంటూరు వాసు హైస్కూలులో 1932-33లో ఎస్ఎస్ఎల్సి క్లాసు చదివాను. ఆనాటి హెడ్ మాస్టరు బుద్ధిరాజు రామచంద్ర రావుగారు. ప్రఖ్యాత అధ్యాపకుడాయన. క్రమశిక్షణా భావాన్ని విద్యార్థుల్లో పెంపొందించడానికి కృషి చేసిన వ్యక్తి. నేను స్కూలులో చేరిన తొలి రోజున క్లాసుకు వెళ్ళాను. అప్పుడు నేను చాలా పొట్టిగా వుండేవాడిని. రామచంద్ర రావుగారు తరగతి తీసుకుంటున్నారు. నేను క్లాసు వాకిట్లో నిలబడ్డాను. నన్ను చూసి ఆ పొట్టి అబ్బాయి ప్రక్కన కూర్చోమన్నారు. ఆ మాటకు తోటి విద్యార్థులు నవ్వారు. ఆ పొట్టి విద్యార్థియే రానాటి కమ్యూనిస్టు సిద్ధాంత మేధావి శ్రీ ఏటుకూరి బలరామమూర్తి.

రామచంద్ర రావు గారు కేవలం పరిపాలనా వ్యవహారాలు చూసుకునే హెడ్మాస్టరు మాత్రమే కాదు. ఆయన జాగ్రఫీ క్లాసు తీసుకునేవారు. మామూలుగా ఆ విషయం విసుగు కల్గించేదిగా వుండేది. కాని ఆయన దానిని చాలా ఆసక్తికరంగా చేసేవారు. దేశాల శీతోష్ణస్థితి, పంటలు, నదీ నదాలు, పర్వతాలు వాటిని గురించి చెబుతుంటే కథలు విన్నట్లుండేది. ఒకసారి ఒక పొడుగాటి విద్యార్థిని, బాగా వయసున్న వానిని మాస్కో నగరం ఎక్కడుందో 'మ్యాపు'లో చూపించమన్నారు ఆయన. అతగాడు ఆ నగరం కోసం బ్రిటనులో వెదుక సాగాడు. మాష్టారుకు కోపం వచ్చింది. ఆయన పొట్టివారు. నిగిరి గంతేసి అతని జుట్టు పట్టుకుని వంగదీసి వీపుమీద నూరాట గ్రుద్దులు గుద్దారు. 'మూడుసార్లు ఎస్ఎస్ఎల్సి తప్పితే మూటలు మోయాల్సి వస్తుందిరా అన్నారు. ఆ కాలంలో స్కూలు ఫైనలు పరీక్షను మూడు పర్యాయాలకన్నా ఎక్కువగా రాయనిచ్చేవారు కాదు. అందుకని ఆయన అలా అన్నారు. ఆయనంటే విద్యార్థులకు సింహస్వప్నం. అయితే ఆయన యెడల విద్యార్థులకు అభిమానం. గౌరవం.

## ఆనాటి లెక్చరర్లు, ప్రిన్సిపాలు

అది 1933-34 విద్యా సంవత్సరం. నేను గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఇంటర్మీడియట్ చదువుతున్న కాలం. ఆనాడు హైస్కూలు చదువు 11 సంవత్సరాలు. ఐదు క్లాసులు 6 ఫారాలుగా వుండేది. 1930 - 31 వరకు బాపట్లలో ఇంగ్లీషులోనే లెక్కల పుస్తకాలు వుండేవి. 1931-32లో తెలుగులో లెక్కల పుస్తకాలు వచ్చాయి. కాలేజీలో అంతా ఇంగ్లీషులోనే చదువు. భాషా మాధ్యమం మారడంతో కొంచెం కష్టంగానే వుండేది. పోటీలు పడి చదివే వాళ్ళం. మాకు పీటర్ రత్నం అని కాలేజిలో లెక్కల లెక్చరరు ఉండేవారు. ఆయనకు మంచి అధ్యాపకుడని పేరుండేది. తమాషా ఏమంటే యాభై నిమిషాల క్లాసుకు ఆయన 10 నిమిషాలు ఆలస్యంగా వచ్చేవాడు. పది నిమిషాలు ముందుగా వెళ్ళేవాడు. అంతా పాఠం చెప్పే సమయం అరగంటన్న మాట. ఆ అరగంటలో సూత్రాలు అందరికీ అర్థమయ్యేలా చెప్పేవాడు. రోజుకు ఒక సూత్రం చెప్పి ఒక లెక్క మాత్రం చేసేవాడు. చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయేవాడు. ఆ సూత్రం క్రింద వున్న లెక్కలన్నింటినీ చెయ్యవలసిన బాధ్యత మాది. అలాగే ఇద్దరు ముగ్గురం కలసి జట్టుగా చేరి చేసేవాళ్ళం. ఒకరికి అలవికాని లెక్క మరొకరికి సులువయ్యేది. మరునాడు శ్రీ రత్నం క్లాసులో కొత్త సూత్రం,

దాని క్రింద లెక్క చేసి మీకు ఆన్సరు రాసి లెక్క ఉందా అని అడిగేవారు. క్లాసు మొత్తానికి ఒకటో ఒకో వుండేది. దానిని ఆయన రెండు నిమిషాల్లో ఇలా చేస్తే ఆన్సరు వస్తుందని చెప్పి, లెక్కల్లో 2, 3 భాగాలు వేసి తర్వాత మీరు పూర్తి చేసుకోండనేవాడు. మరో సెక్షనులోకి లెక్కల లెక్చరరు అన్నీ తనే చేసి చూపించేవాడు. విశ్వవిద్యాలయం వారి పరీక్షలలో మా క్లాసులోనే అత్యధికంగా విద్యార్థులు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. స్వయం కృషిని ప్రోత్సహించిన ఘనత రత్నం గారిది.

తర్వాత ఆయన విదేశాలకు వెళ్ళి చాలా ఉన్నత పదవులను నిర్వహించాడు. అమెరికన్ అయిన డా. జె. రాయ్‌స్ట్రాక్ మా ప్రిన్సిపాలు. ఆయన మరచిపోవడానికి వీలులేని వ్యక్తి విద్యార్థులను అత్యధికంగా అభిమానించేవారు. ప్రేమించేవాడు. సహాయం కావలసిన బీద విద్యార్థులకు కులాల, మతాల ప్రసక్తి లేకుండా కాలేజీ ఫీజు తన స్వంత పైకంలో చెల్లించేవాడు. తన విద్యార్థులకు భావ ప్రకటనా సామర్థ్యం, వక్తృత్వ శక్తి వుండాలని ఆయన ఆకాంక్ష. కాలేజీలో యున్న విద్యార్థులందరినీ పది విభాగాలుగా చేసి వాదనా పటిమ పెంచే క్లబ్‌లను ఏర్పాటు చేశాడు. వాటిని ఎ క్లబ్, బి క్లబ్ అని అలా పిలిచేవారం. వాటి నిర్మాణ పద్ధతి కూడా విచిత్రం. ప్రతి క్లబ్బులో బిఎ చివరి సంవత్సరం చదివే విద్యార్థి అధ్యక్షుడు. బిఎ మొదటి సంవత్సరం చదివే విద్యార్థి అని పిలిచేవారు. ఇలా రెండవ సంవత్సరపు విద్యార్థి కార్యదర్శిగాను, 1వ సంవత్సరపు విద్యార్థి సహాయ కార్యదర్శిగాను నియమింపబడేవారు. (ఆనాడు కాలేజీ విద్యార్థులందరికీ కలిపి విద్యార్థి యూనియన్ వుండేదికాదు) ఈ పద్ధతి వల్ల కాలేజీలో సీనియర్లకు, జూనియర్లకు మధ్య సయోధ్య, సహకారం ఏర్పడేవి. ఇరువురూ లాభించేవారు. ప్రతి వారం ఒకే రోజున ఈ క్లబ్‌లు సమావేశమయ్యేవి. పేర్కొనబడిన నలుగురు విద్యార్థులు మాట్లాడేవారు. వారు విధిగా మాట్లాడవలసిందే. తప్పించుకోవడానికి, నిరాకరించడానికి వీలులేదు. అలా వేదికను ఎక్కడానికి వుండే భయం పటాపంచలయ్యేది. మాటలను ఏరుకోవడం నేర్చుకునేవాళ్లు. ఇలాంటి క్లబ్బులవల్ల ఎంతోమంది ఉపన్యాసకులుగా తయారయ్యారు. అలాంటి క్లబ్‌లోనే నేను మొదటిసారి మాట్లాడాను. అది అంతా జె.రాయ్‌స్ట్రాక్ చలవ.

డా. జె.రాయ్‌స్ట్రాక్ మరో సందర్భంగా చిరస్మరణీయుడు. ప్రాచ్య పాశ్చాత్య నాగరికతలను (సంస్కృతులను కాదు సుమండి) పోల్చి మాట్లాడేవాడు. ఆ మాటలు ఇప్పటికీ నవ్వు పుట్టిస్తాయి. కానీ అవి సత్యాలు. భారతీయులు ఇతరులు చూడకుండా భోజనం చేస్తారు; బహిరంగ ప్రదేశాల్లో దేహకర్మలను నిర్వర్తిస్తారు. పాశ్చాత్యులు దీనికి పూర్తిగా విరుద్ధంగా ప్రవర్తిస్తారు. బహిరంగంగా భోజనాలు చేస్తారు; తలుపులు వేసుకుని మల విసర్జన, మూత్రం పోయడం చేస్తారు. మన దేశస్థులలోని కులాచారాలు భోజన విషయంగా ఎలా పనిచేస్తాయో క్లుప్తంగా కొట్టవచ్చినట్లుగా స్ట్రాక్ చెప్పాడు. ఇప్పటికీ ఈ అలవాట్లు పూర్తిగా మారలేదు కదా!

# భట్టీయాన్ని ప్రోత్సహించిన
# మద్రాసు లయోలా కాలేజీ

**1935–37** సంవత్సరాలలో నేను మద్రాసులో చదివాను. అది రోమన్ కాథలిక్కులలో తీవ్రవాదులయిన జెసూట్ల విద్యా సంస్థ. లయోలా కాలేజీగా పేరు ప్రఖ్యాతులు పొందిన కళాశాల. విద్యార్థిగా నా జీవితంలోని కొన్ని విషయాలను గురించి ముచ్చటిస్తాను. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో నా సహాధ్యాయి అయిన శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి నాతోపాటు కాలేజీలో, హాస్టలులో వుండేవారు. అతడు జస్టిస్ పార్టీ నాయకుడుగా 9 సంవత్సరాలు గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షుడుగా వున్న కుప్పుస్వామిగారి కుమారుడు. నేను ఆ రోజుల్లో పూర్తిగా ఖద్దరు దుస్తులను ధరించేవాణ్ణి. చంద్రమౌళిని కూడా ఖద్దరు వస్త్రధారణ చేపట్టమని అదే పనిగా నసపెట్టేవాడిని. నా మాట పెడచెవిన పెట్టేవాడు. తరువాత మా జీవితాలు మారిపోయాయి. అతడు కాంగ్రెసులో చేరి అసెంబ్లీ మెంబరు అయ్యాడు. అప్పటికి నేను కమ్యూనిస్టుగా మారి, రాయిస్టుగా రూపొంది, ఎం.ఎన్. రాయ్ స్థాపించిన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రద్దయిన దరిమిలా పార్టీ రహిత ఉద్యమాన్ని బలపరిచే రాడికల్ హ్యూమనిస్టు నయ్యాను.

ఆనాటి విద్యార్థుల చైతన్యంను గూర్చి చెప్పటం ఉచితం. ప్రథమ భారతీయ గవర్నరు జనరలు (1947-50) అయిన శ్రీమాన్ సి. రాజగోపాలచారి 1935 నాటికే పేరెన్నికగన్న కాంగ్రెస్ మహా నాయకుడు. ఆయనను ఉపన్యసించమని మా కాలేజీ విద్యార్థి సంఘం కోరింది. ఆయన అంగీకరించి వచ్చి ఉపన్యాసం చేశారు. విశేషం ఏమంటే ఆ సభకు విద్యార్థి యూనియన్ అధ్యక్షుడే సభాధ్యక్షుడుగా వ్యవహరించాడు. విద్యార్థులు ఉపన్యాసకుని అనేక చిక్కు ప్రశ్నలు వేశారు. ఆయన ఓపికగా, నెమ్మదిగా, ఓర్పుగా సమాధానాలు చెప్పారు. ప్రశ్నలడిగిన విద్యార్థులను ఎవరూ మందలించ లేదు. పైగా ప్రోత్సహించారు.

కాలేజీ ప్రిన్సిపాలు ఫాదర్ సియాన్ అనే ఫ్రెంచి దేశస్థుడు. అతగాడు మంచి మార్కులు తెచ్చుకొనే విద్యార్థులను చాలా అభిమానించే వారు. హాస్టలులో వున్న అలాంటి కుర్రవాళ్ళను తెల్లవారుజామున వారి గదులకు వచ్చి నిద్రలేపి చదివించేవాడు. వారం వారం పరీక్షలుండేవి. ఈ పరీక్షల మార్కులు, 3 నెలల, 6 నెలల పరీక్షల మార్కులు అన్నింటిని ఒక పెద్ద సైజు రిజిష్టరులో రాసి వాటిని ప్రతి రోజూ చూస్తుండేవాడు. ప్రతిభగల కుర్రవాడు ఏ కారణం వల్లనైనా బద్ధకించ మొదలిడితే అతనిని పిలిపించి మందలించే వాడు, ప్రోత్సహించేవాడు. ఒకసారి కళాశాల వార్షికోత్సవ సంచికలో ఒక వ్యాసం ప్రకటితమయింది. విపరీతంగా వర్షం కురుస్తున్నదట. ఒక విద్యార్థి ప్రిన్సిపాలుగారికి ఫోను చేసి 'కాలేజీ ఇవాళ పనిచేస్తుందా' అని అడిగాడు. 'కాలేజీకి యివాళ సెలవు లేదు' అని ప్రిన్సిపాలు సమాధానం. 'ఎలా రాగలను?' అని విద్యార్థి ప్రశ్న. 'కాలేజీ బస్సులు అన్ని మూలలకు వచ్చి మిమ్మల్ని తీసుకొని వస్తాయి' అని ఫాదర్ సియన్ హామీ, నా తల్లిదండ్రులు యీ వాతావరణంలో బయటికి పోవద్దంటున్నారు అని విద్యార్థి మాట. ఒక ఉద్వేగ స్వరం పలికింది.

అబ్బాయ్! నీ విద్యా సముపార్జన యెడ శ్రద్ధ వహించటమే నీ విధ్యుక్త ధర్మం. ముందు నీ చదువు తర్వాతనే తల్లిదండ్రులు. మన కాలేజీ ముఖ్య సందేశం మర్చిపోవాకు. 'బట్టీ పెట్టు, బట్టీ పెట్టు, బట్టీ పెట్టు. నీ మెదడు బ్రద్దలయ్యే వరకు. దానిని సమాచారంలో నింపు. ఈ చివరి హెచ్చరికతో ఫోను పెట్టేశాడు ఫాదర్ వియాన్. ఈ వ్యాసాన్ని ఆంగ్ల శాఖకు అధిపతిగా వున్న ఫాదర్ ముర్ఫీ (ఐరిష్ దేశస్థుడు) వార్షిక సంచిక సంపాదకుడుగా ప్రచురించాడు. ఆయన దీనిని రాశాడని ప్రతీతి. ఈనాడు ఎంట్రన్స్ పరీక్షలలో మార్కుల కోసం 'కోచింగు కేంద్రాలకు' వేలకు వేలు కుమ్మరించి నమూనా ప్రశ్నల సమాధానాలను అదే పనిగా బట్టీ పెట్టడం సాగుతున్నది. 1935 సంవత్సరం లయోలా కాలేజీ చదువు వీటికి ఆదర్శమేమో!

## లోపభూయిష్టమైన ఆనాటి విద్యావిధానం

ఇంటర్మీడియటు పరీక్షలో నాకు ఫస్టు క్లాసు వచ్చింది. తరువాత చదువుకు మద్రాసు లయోలా కాలేజీలో చేరాను. బి.ఎ. ఆనర్సు మాథమేటిక్స్‌లో సీటు వచ్చింది. ఆనర్సు చదువు మూడు సంవత్సరాలు. మొదటి సంవత్సరం చివరన ఇంగ్లీషులో విశ్వ విద్యాలయ పరీక్షను ప్రిలిమినరి అని పిలిచేవారు. చివర సంవత్సరం చివరి గణిత శాస్త్రంలో విశ్వవిద్యాలయ పరీక్ష. దీనిని ఫైనలు అనేవారు, ప్రిలిమినరి ప్యాసు కానిది ఫైనలు పరీక్షకు కూర్చోవటానికి వీలులేదు. అయితే ఆ పరీక్షకు కూర్చునేలోగా ఎప్పుడయినా ప్యాసుకావచ్చును. 1వ సంవత్సరంలో ఒకసారి, 2వ సంవత్సరంలో రెండుసార్లు, 3వ సంవత్సరంలో ఒకసారి మొత్తం నాలుగు అవకాశాలు ప్రిలిమినరి ప్యాసు కావటానికి ఉండేవి

ఇంగ్లీషులో ఛార్లెసు లాంబ్, డిక్వెన్సీ, రాబర్ట్ లిండ్, ఛెస్టర్ టాను లాంటి ఆంగ్ల రచయితల వ్యాసాలు అధ్యయన విషయాలు. ప్రతి వారం ఆంగ్లంలో వ్యాస రచన క్లాసు వుండేది. ఒకసారి కాంబినేషను క్లాసులో నేను ఈచ్ అండ్ ఎవ్రీ అనే పద సముదాయాన్ని వాడాను. ఇది ప్లీడర్ల వడికట్టు మాట కనుక రాయరాదన్నాడు ట్యూటరు. శైలి మీద అంత పట్టుదల నేను 1వ సంవత్సరం చివర ప్రిలిమినరి పరీక్ష తప్పాను. వారం వారం జరిగే పరీక్షలలో మాథమాటిక్సులో 65 నుండి 75 శాతం దాకా మార్కులు వచ్చేవి. కాలేజీ ప్రిన్సిపాలు ఫాదర్ వియాను నన్ను పిలిపించారు. థర్డ్ ఆనర్సు (ఆనర్సు 1వ సంవత్సరంలో) 16 మంది విద్యార్థులం. కనుక అందరూ ఆయనకు గుర్తే. నీకు లెక్కలలో బాగా మార్కులు వస్తున్నాయి. లెక్కలలో కూడా నీకు తక్కువ మార్కులు వస్తే నిన్ను కాలేజీ నుండి పంపించి వేసేవాడిని. నీవు ప్రిలిమినరీలో ప్యాసయి లెక్కల్లో నాసిరకం మార్కులు వస్తే నీకు బి.ఎ. రెండవ సంవత్సరంలో ప్రవేశం యిచ్చేవాడిని. నీవు లెక్కల్లో బాగా రాణిస్తున్నావు కనుక నిన్ను 4వ ఆనర్సు క్లాసులోకి పోనిస్తున్నాను. బాగా చదివి ప్రిలిమినరి పూర్తి చేసుకో అన్నాడు. 4వ ఆనర్సులో రెండుసార్లు ఇంగ్లీషు పరీక్షలలో ఉత్తీర్ణుడను కాలేకపోయాను. అప్పుడు [illegible] (మార్కులు వేయించుకోవడం అమలులో లేదు). మద్రాసు విశ్వ విద్యాలయంలో ప్రిలిమినరిలో 40 శాతం మార్కులువస్తే కాని ప్యాసు లేదు. ఎంతోమంచి శైలి రాస్తే తప్పు ప్యాసు చేసే

వారు కాదు. ఆనాడు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఆనర్సులో (ప్రిలిమినరి)కి 35 శాతం మార్కులు చాలు. బి.కామ్ ఆనర్సు అయితే 33 1/3 శాతం చాలు. ఇలా పరీక్షల ప్రమాణాలలో తేడాలుండేవి. పాదర్ నీయాను నన్ను మళ్లీ పిలిపించారు. నీకు అవకాశమిచ్చినా నీవు ఇంగ్లీషు పరీక్షలో ఉత్తీర్ణుడవు కాలేక పోయావు. నీకు సీటు పోయినట్లే. గణిత శాస్త్రంలో మార్కులు బాగా వచ్చిన నీబోటి విద్యార్థిని పోగొట్టు కోవలసినందుకు చింతిస్తున్నాను అని ముగించాడు తన మాటలను. నాకు బాధ కలిగింది. మరొక్క అవకాశం యివ్వండి. 5వ ఆనర్సు క్లాసుకు ప్రమోటు చేయండి ఈసారి తప్పితే నాకు 3 సం. వరకు నష్టం అవుతాయి. దానికి సిద్ధపడతాను అని అభ్యర్థించాను. ఆయన ససేమిరా కాదు అన్నాడు. నిరాశతో వెనుదిరిగాను. గణిత శాస్త్ర విద్యార్థికి ఆంగ్లంలో ప్రసిద్ధ రచయితల శైలి ఎందుకవసరమో యిప్పటికీ నాకు అర్థం కావడం లేదు. నా చదువు మళ్ళీ ఇంటర్మీడియట్ స్థాయికి దిగిపోయింది. గణిత శాస్త్రంలో బాగా రాణించి బ్రిటన్‌లోని కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయానికి పోవాలన్న నా ఆశ అడియాసలయ్యింది. గుంటూరు వచ్చి మరల బి.ఎ.లో చేరాను. నా విద్యా కార్యక్రమం యిలా దెబ్బతిన్నందుకు కరుడుకట్టిన ఛాందస భావాలు కల విశ్వ విద్యాలయ పాలక వర్గం బాధ్యులు కదా! అని యిప్పటికీ నా మనస్సులో మెదులుతున్నది. విద్యార్థుల జీవితాలతో తెలివి తక్కువగా, మూర్ఖంగా చెలగాటం ఆడవద్దని విద్యా వేత్తలను, విద్యా సంస్థల అధికారులను కోరడం అనౌచిత్యం కాదు.

# విద్యార్థి ఉద్యమంలో ప్రవేశం

ఆనర్సు కోర్సులో నుండి 'డిస్ ఆనర్సు'లో (అగౌరవం) తిరుగు ముఖం పట్టిన నేను మరల ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో బి.ఎ.లో చేరాను 1937 జూన్‌లో. వామపక్ష ఉద్యమాలు సంఘటితమవుతున్న కాలం అది. కమ్యూనిస్టులు విద్యార్థులలో కృషి చేయనారంభించిన రోజులవి. వారి ఊరేగింపులలో పాల్గొనేవాడిని. ఒక వందమంది విద్యార్థులం ఊరేగింపు తీసాం. ఎర్రజెండా పట్టుకుని నా సహ విద్యార్థి (బి.ఎ. 1వ సం.) కొల్లా వెంకయ్య అగ్రభాగాన జెండా పట్టుకుని నడిచేవాడు. (దరిమిలా ఆయన 1969లో నక్సలైటు ఉద్యమ నాయకుడుగా కొల్లా వెంకయ్య గారు అని గౌరవ సూచకంగా పిలువబడేవాడు) ఎగరాలి ఎగరాలి ఎర్ర జెండా అని తల ఎగురవేసి ఆయన పాడుతుంటే ' ఆయన తల ఎక్కడ ఎగిరిపోతుందో అని చమత్కరించేవారు చూచే పౌరులు. (ఆయన బక్క పలచగా, పొడుగుగా ఉండేవాడు) ఊరేగింపు చాలాదూరం తిరగాలి కనుక మాలో చాలామంది కాఫీ హోటల్సులో తిని ఊరేగింపు వరుసలో చేరేవాళ్లు. ఆకలి మంటలో మలమల మాడే అనాధలందరు లేవండోయ్ అని మేము పాడుతుంటే కమ్యూనిస్టు వ్యతిరేకులు 'వీళ్ళకా ఆకలి మంట అని యీసడించేవారు. విప్లవ చైతన్య కార్యక్రమాల్లో కూడా హాస్యాన్ని గమనించగల మెలకువ నాది.

ఆ కాలంలో డిటెన్షను విధానం ఉండేది. మార్చిలో విశ్వవిద్యాలయపు పరీక్షలయితే డిసెంబరులో అర్ధ సంవత్సర పరీక్ష పెట్టి అందులో తప్పిన వారిని విశ్వవిద్యాలయపు పరీక్షకు పోనిచ్చే వారు కాదు. ఇది అన్యాయమన్నారు విద్యార్థులు. పరీక్షా విధానమే లోపభూయిష్టమయినపుడు, మార్కులు విద్యార్థుల ప్రతిభకు గీటురాళ్లు కానప్పుడు, విశ్వవిద్యాలయపు పరీక్షలకు యింకా మూడు నెలల గడువు వున్నప్పుడు ముమ్మందుగా యూనివర్సిటీలో పరీక్షకు పోనివ్వననడం అన్యాయం అనిపించింది. అప్పటికే విద్యా విధానపు అవకతవకల వల్ల దెబ్బతిని వున్నానేమో 'డిటెన్షన్లు నశించాలి' అనే నినాదం నన్ను ఆకర్షించింది. 'డిటెన్షను విధానం ఎత్తివేయాలి' అని ఆందోళనకు పూనుకున్నారు విద్యార్థులు. కమ్యూనిస్టు విద్యార్థులు నాయకత్వం వహించారు. అప్పుడు సైపు అనే అమెరికను ప్రిన్సిపాలు. అతడు పట్టుదలగలవాడు. అతనిని 'మూర్ఖుడు'గా అభివర్ణించేవాళ్లు. అతడు లొంగలేదు. విద్యార్థుల సమ్మె ప్రారంభించారు. సమ్మె పదిరోజులు సాగింది. కాని కళాశాల అధికారులు స్పందించలేదు. విద్యార్థులలో నిస్పృహ పొడసూప నారంభించింది. ప్రతి రోజూ గుంటూరు గాంధీ పార్కులో విద్యార్థుల సభ జరిగేది. మాకినేని బసవ పున్నయ్య బి.ఎ. రెండవ సం. విద్యార్థి. మంచి వక్త. ఆయన ఉపన్యాసం ఉత్తేజకరంగా సాగేది. ఆయన మాటలు విన్న తర్వాత ఆరిపోతున్న 'బల్బులు'లా వున్న మా ముఖాలు మరల దేదీప్యమానంగా వెలిగేవి. ఇలా ప్రతిరోజూ ఆయన పెట్రోమాక్సు లైట్లులాంటి మాకు గాలి కొట్టేవాడు. ఆ బసవ పున్నయ్యే తర్వాత గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ కార్యవర్గ సభ్యుడుగా, తెలంగాణా పోరాటాన్ని నడిపిన విశాలాంధ్ర కమిటీ సభ్యుడుగా, కమ్యూనిస్టు కేంద్ర కమిటీ మెంబరుగా, కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) సెక్రటేరియట్ సభ్యుడుగా, మార్క్సిస్టు పత్రిక పీపుల్స్ ఏజ్

సంపాదకుడుగా మార్క్సిస్టు సిద్ధాంత మేధావిగా రూపొందాడు.

1937 నవంబరు - డిసెంబరు సమ్మె విజయవంతం కాలేదు. అయినా 1938 చలికాలంలో మరల ఆందోళన ప్రారంభించాం. ఈసారి కూడా డిటెన్షను సమస్యపైనే విద్యార్థుల సమ్మె సాగింది. నా సహ విద్యార్థులు సర్వశ్రీ వేములపల్లి శ్రీకృష్ణ, కొల్లా వెంకయ్య ప్రభృతులు నాయకత్వం వహించారు. నేను కార్యకర్తగా మొదటిసారి పార్కులోని సభలో ఉపన్యసించాను. వేదిక అంటే భయపడే నాకు కాళ్ళు వణికినాయి. వేదికమీద ముందుగా చిన్న పిట్టగోడ లాంటిది ఉంది. నా వణుకు సభాసదులకు కన్పించదని తోచింది; ధైర్యం వచ్చింది. సుమారు 20 నిమిషాలు మాట్లాడినాను. వేదిక దిగి వస్తుంటే నాకే ఆశ్చర్యం కల్గింది నా సాహసానికి. సమ్మె చాల కాలం సాగింది. మరల వైఫల్యం ఎదురయింది. కాకపోతే ఈ సమ్మెలో క్రైస్తవ విద్యార్థినీ విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు. కుల మతాలకు అతీతంగా విద్యార్థి ఐక్యత నెలకొన్నది.

# కమ్యూనిష్టులు; కులతత్వం

**1939** మార్చిలో బి.ఎ. పరీక్షలు. విద్యార్థి ఉద్యమ ఒత్తిళ్ళకు లోనయిన నాకు అనారోగ్యం కలిగింది. పరీక్షకు చదవడానికి తగిన శక్తి లేకుండా పోయింది. తేలికగా ఉత్తీర్ణుడను కాగల విషయాలలో మాత్రమే పరీక్ష రాయుతలి ాను. తెలుగు మాతృభాష కనుక, గణిత శాస్త్రం నాకు కరతమాలకం అవటం చేత ఆ రెంటికి పరీక్షకు వెళ్ళాను. ప్యాసు అయ్యాను. ఇంగ్లీషు (ఆనాడు 1వ విభాగంగా వుండేది) మిగిలిపోయింది. 1939 సెప్టెంబరులో పరీక్షకు పోతలిచాను. గుంటూరులో అద్దె గదిలో వుండి చదవ సిద్ధపడ్డాను. ఆనాడు పులుపుల శివయ్యగారు గుంటూరు జిల్లా కమ్యూనిష్టు కమిటీ కార్యదర్శి, తత్వశాస్త్రాన్ని మార్క్సిజం పరంగా అధ్యయనం చేసిన వ్యక్తి. తరువాత కాలంలో పలనాడు - అలనాడు వెలలేని మాగాణిరా, కంపెనీ వాడొచ్చి కొంప తీశాడురా అనే పాట రాసి ప్రసిద్ధుడయ్యాడు. ఆయన అద్దె యింటిలో నివసిస్తుండే వాడు. ఆయన తీసుకున్న మూడు గదులలో ఒక గదిని నాకు అద్దెకు యిచ్చాడు. తాత్విక విషయాలను నాకు విశదంగా చెప్పేవాడు. కమ్యూనిష్టు భావాలు కలవాడినిగా వున్నందున కార్యదర్శి గారికి సన్నిహితంగా ఉంటున్నందున నేను పార్టీ సభ్యుడను అనే అభిప్రాయంతో చాలామంది ఉన్నారు. ఒకరోజు పార్టీ సభ్యుడు ఒకాయన వచ్చి నాతో ఒక విషయం చెప్పాడు. శివయ్యగారి స్థానంలో శ్రీ మాకినేని బసవ పున్నయ్యను పతిపాదించారట జిల్లా కార్యదర్శిగా. అయితే ఆయన అభ్యర్థిత్వానికి మద్దతుగా ప్రతిపాదకులు పలికిన మాటలు తనకు బాధ కలిగించాయట. 'గుంటూరు జిల్లాలో రైతాంగంలో కమ్మవారు అధికమయిన పలుకుబడి గలవారు. కనుక కమ్మ కులానికి చెందిన శ్రీ బసవ పున్నయ్యను కార్యదర్శిగా చేస్తే పార్టీ పెరుగుతుంది' అనే మాట వినపడిందట. శ్రీ బసవ పున్నయ్య ఎన్నికయ్యారు. ఈ సరళి నచ్చలేదు ఆ పార్టీ సభ్యునికి. తోటి సభ్యునిగా నన్ను కలసి తన వ్యథ నాతో వెళ్ళబుచ్చుకున్నాడు. విని ఊరుకున్నాను. ఇలా జరిగిందో లేదో నేను విచారించ లేదు. పార్టీ రహస్య జీవితం గడిపే రోజులు. ఇతరులు నాతో యిలాంటి విషయాలు ముచ్చటించరు. ఇంతకూ ఆ పార్టీ సభ్యుడెవరు? బ్రాహ్మణ కులంలో పుట్టిన వ్యక్తి. పులుపుల శివయ్యగారు కూడా బ్రాహ్మణుల కుటుంబంలో నుండి వచ్చినవారే. అందుకే ఆయన మీద ఆ పార్టీ సభ్యునికి అంత అభిమానం. శివయ్యగారికి, బసవ పున్నయ్య గారికి, ఆ మాటకు వస్తే తిదితర కమ్యూనిష్టులకు కుల దృష్టి లేదు. కమ్యూనిష్టులకు కుల భావనే లేదు. ఈ కథ నిజమయినా అలాంటి వాదన కుల దృష్టితో చేయబడిందని నేను భావించను. ఏదయినా బసవపున్నయ్య గారు జిల్లా కార్యదర్శి అయిన తరువాత పార్టీ పెరిగిందనేది పచ్చి నిజం. చాలామంది వ్యక్తులు తమ భావాలపరంగా, తమ ఆలోచనలను అనుసరించి పరిస్థితులను, సంఘటనలను అంచనా వేయటం తరచు చూస్తున్నాం. కమ్యూనిష్టులకు కులదృష్టి లేదు కాని జనంలో వున్న కులతత్వాన్ని వాడుకోవడానికి వారు వెనుతీసేవారు కారని ఎన్నికల పోరాటాలలో వారు అభ్యర్థులను ఎంపిక చేసిన తీరు రుజువు చేసింది.

మరో విచిత్రమయిన అంశం గమనార్హం. 1937-39లో బ్రాహ్మణ కులంలో

పుట్టినవారు అనేకమంది ప్రముఖంగా గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీలో వుండేవారు. సర్వశ్రీ పులుపుల శివయ్య, ప్రతాప రామసుబ్బయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి, పోలేపెద్ది నరసింహ మూర్తి అలాంటివారు. ఇందులో ఆశ్చర్యపడవలసిన విషయం లేదు. బ్రాహ్మణులలో ముమ్మందుగా విద్య వుండేది. వారు ఇతరులను విద్యకు దూరం చేసినందు వల్ల, తాము చదువుకున్నందు చేత విద్య మొదట్లో వారి సొమ్మయింది. విషయ గ్రహణం చేయగల సత్తా విద్య వల్ల లభిస్తుంది కనుక వారు కొంగ్రొత్త భావాలను స్వీకరించకల్గారని నా ఉద్దేశ్యం. అంతేకాదు పూజారి కుటుంబాలవారు ముమ్మందుగా దేవుని త్రోసిరాజంటారు. దేవుని ప్రతి రూపమయిన విగ్రహాన్ని కడిగి శుభ్రం చేసే వ్యక్తికి ఆ దేవుడు రాయి మాత్రమేనని, విగ్రహం మాత్రమేననే భావన కలుగటంలో అబ్బురమేమీ లేదు. అందువల్లనే పూజారి కుటుంబాల నుండి వచ్చిన పులుపుల శివయ్య, ఎం.ఎన్. రాయ్ లాంటి వారు మొదట్లో కమ్యూనిస్టులు కావడం జరిగింది. ఇది నా ఆలోచన. దీని మీద పరిశోధన చేసి నిగ్గు తేల్చాల్సిన విషయం.

# కమ్యూనిష్టు 'కొరియరు'

**1939** సెప్టెంబరు పరీక్షలో ఇంగ్లీషులో బి.ఎ. పరీక్ష ప్యాసయ్యాను. మా నాన్నగారు తెనాలిలో తహశీలుదారుగా వుండేవారు. ప్రభుత్వోద్యోగి కుమారుడిని కనుక నన్ను పోలీసులు అనుమానించేవారు కాదు. ఈ అంశాన్ని పులుపుల శివయ్యగారు అవగతం చేసుకున్నారేమో నాకు కొరియరు పని వప్పచెప్పారు. రహస్యంగా వెలువడే పత్రాలను పత్రికను నా ద్వారా పంపిణీ చేయించే ఏర్పాటు చేశారు. కార్యకర్తగా నేను అందుకు సిద్ధపడ్డాను. తెనాలిలో ఉదయం బయలుదేరి రేపల్లె తాలూకా పల్లెకోనలో సామాగ్రిని చదలవాడ పిచ్చయ్యగారికి యిచ్చి (దరిమిలా ఆయన ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శిగా పేరు పొందారు), తరువాత పొన్నూరులో పెండ్యాల లోకనాథం గారికి అందచేసి, బాపట్ల వెళ్లి అక్కడి ఆర్గనైజరుకు అందించి తరువాత ఒంగోలులో ఛాదిన సుబ్బారావుగారి పేరనున్న అచ్చు ఆఫీసుకు చేర్చేవాడిని. సాయంత్రానికి యింటికి చేరేవాడిని. ఒకసారి తూర్పు పాలెంలో వుంటున్న బసవ పున్నయ్యగారికి చేతితో నడపటానికి వీలయిన అచ్చు యంత్రాన్ని యిచ్చి వచ్చాను. ఇలా నాలుగు నెలలు పైగా జరిగింది. ఇదంతా పోలీసులు కనిపెట్టడం లేదని అనుకుండేవాడిని ఆ రోజుల్లో.

అది ఆదివారం. మా నాన్నగారు క్యాంపుకు పోలేదు. సిఐడి ఇన్‌స్పెక్టర్ మా యింటికి వచ్చాడు. నాన్నగారితో పెద్దగా శబ్దం చేయకుండా మాట్లాడుతున్నాడు. నేను గమనించాను. ఏదో విశేషం ఉన్నదని గ్రహించాను. ఇన్‌స్పెక్టర్ వెళ్లిపోయాడు. మా నాన్నగారు నన్ను పిలిచారు. వారి గంభీర వదనం చూచి ఏదో ముఖ్యమయిన విషయం నాతో ముచ్చటించ పోతున్నారని ఊహించాను. విషయం వివరించారు. నేను కొరియరుగా పనిచేస్తున్నానని సిఐడి పోలీసులు గ్రహించారట. నాన్నగారి మీది గౌరవంతో నన్ను అరెస్టు చేయలేదట. నన్ను అరెస్టు చేయకుండా వుండాలంటే నేను మద్రాసు ప్రెసిడెన్సీ దాటి వెళ్లాలట. (ఆనాడు మైసూరు, బనగానపల్లి స్వదేశ సంస్థానాలు మినహా దక్షిణాది ప్రాంతమంతా మద్రాసు ప్రెసిడెన్సీలో వుండేది) నేను అలాచేస్తే పోలీసులు నా జోలికి రారట. పోలీసుల వైఖరి నాకు ఆశ్చర్యం కలిగించ లేదు. ఆ రోజుల్లో క్రిమినలు ట్రైబ్స్ ఆక్టు వుండేది. ఎరుకలవారిని (ఈనాడు సుగాలీలు అని వారు పిలువబడు తున్నారు), ఏనాదివారిని యింకా అలాంటివారిని నేరజాతులుగా పరిగణించి క్రైస్తవ మత ప్రచారకుల పర్యవేక్షణలో సెటిల్మెంటులలో నివాసం ఏర్పరచుకోమని ఆదేశించింది బ్రిటిషు ప్రభుత్వం. ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లె నవల ఆ కులాల వారి సెటిల్మెంటు జీవితాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రించింది. ఈ శాసనాన్ని చట్టాల జాబితాలలో నుండి తొలగించిన తర్వాత కూడా వారిపై పోలీసు నిఘా ఉండేది. అర్ధరాత్రి వేళ వారు పోలీసు స్టేషనుకు హాజరయి స్టేషను రైటరుకు తమ రాక తెలియజెయ్యాలి. అలా వారు పోలీసుల ఎదుటికి వస్తే త్రాగిన మైకంలో రైటరు వారిని బూతులు తిడ్తూ ఏమ్రా మీరు వుండడానికి మా పోలీసు స్టేషను ఏరియా మాత్రమే దొరికిందే. రేపు రాత్రి నాకు కనపడ్డారో మీ తోలు వలుస్తాను అని కేకలు పెట్టేవాడు. అదే పద్ధతిలో యీ సిఐడి ఇన్‌స్పెక్టర్ నన్ను ఆదేశించాడు. మా నాన్నగారితో 'పరేనండి!

ఆయన చెప్పినట్లే చేస్తాను' అన్నాను. మా నాన్నగారు నేను అంత త్వరగా అంగీకరించినందుకు సంతోషించారు. మరునాడు పులుపుల శివయ్యగారిని కలిసి విషయమంతా చెప్పాను. బెనారస్ విశ్వ విద్యాలయంలో చదువుకో (ఆనాడు కాశీని బెనారస్ అనేవారు. ఇపుడు వారణాసి అని పిలుస్తున్నారు) అన్నారు. సమస్య తేలిపోయింది. **1940** జూన్‌లో మాలవ్యాగారు స్థాపించిన విశ్వ విద్యాలయంలో ఎం.ఎ., ఎల్‌ఎల్‌బి రెండు కోర్సుల్లో చేరాను.

# త్రిపుర కాంగ్రెస్

1939లో మహాత్మాగాంధీ రాజకీయ విధానాన్ని, ఎదుర్కొని కాంగ్రెసులోని దక్షిణ పక్షనాయకులను ఎదిరించి కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేసి గెలిచాడు సుభాష్‌చంద్రబోసు. రాష్ట్ర కాంగ్రెస్ కమిటి సభ్యులు కాంగ్రెసు మహాసభకు ప్రతినిధులు. సుమారు 260 మంది సభ్యులు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసులో వుంటే అందులో 28 మంది తప్ప తతిమ్మా వారంతా సుభాష్ చంద్రబోసు ప్రత్యర్థి అయిన డా॥ పట్టాభి సీతారామయ్యగారిని బలపరిచారు. బెంగాలు రాష్ట్రకాంగ్రెసు కమిటీలో 600 మంది సభ్యులలో ఒక్కరు (శ్రీ ప్రపుల్ల చంద్రబోసు - తరువాత రాష్ట్ర ముఖ్యమంత్రి అయినాడు) తప్ప మిగతా 599 మంది సుభాష్ చంద్రబోసుకు అనుకూలంగా వోటువేశారు అపుడు భాషాభిమానం పనిచేసింది. రాష్ట్రాభిమానం వెల్లుబికింది మొత్తం 3 వేల మంది కాంగ్రెసు మహాసభకు ప్రతినిధులు. పోటీ తీవ్రంగా జరిగింది. కమ్యూనిస్టులు, ఎం.ఎన్ రాయ్ అనుచరులైన రాడికల్సు, కాంగ్రెసు సోషలిస్టులు, కాంగ్రెసులోని తీవ్రవాద జాతీయ వాదులు అందరూ బోస్‌ను బలపరిచారు. ఫలితాల కోసం అందరూ ఉత్కంఠతో ఎదురుచూచారు అధిక సంఖ్యాకులు బోస్‌కు వోటు వేశారు 'పట్టాభి ఓటమి నా ఓటమి' అని గాంధీజీ ప్రకటించాడు. మహాత్మాగాంధితో సంప్రతించి కార్యనిర్వాహక వర్గాన్ని ఏర్పాటు చేయమని కాంగ్రెసు అధ్యక్షుని కోరే తీర్మానాన్ని గోవింద వల్లభపంత్ తరువాత ఉత్తర పరగణాల ముఖ్యమంత్రి త్రిపుర మహాసభలో ప్రవేశపెట్టాడు. కాంగ్రెసు నిబంధనావళి ప్రకారం అధ్యక్షుడుకార్యనిర్వాహకవర్గ సభ్యులను పేర్కొనాలి పంత్ తీర్మానం నియమావళికి వ్యతిరేకం కనుక దానిని చర్చకు పెట్టకుండా త్రోసివేయమని ఎం ఎన్.రాయ్ సలహా యిచ్చాడు. అప్పటికే అతడు 'గాంధీజీ నాయకత్వానికి కాంగ్రెసులో ప్రత్యామ్నాయ నాయకత్వం కావాలనే వ్యక్తి. అలా జరిగి వుంటేజాతీయ కాంగ్రెసుదక్షిణపక్ష, వామపక్షాలుగా చీలిపోయేది. దేశ స్వాతంత్ర్య పోరాటం మరోమలుపు తిరిగేది. సుభాష్‌చంద్రబోస్‌ను 105 డిగ్రీల జ్వరంతో కాంగ్రెసు మహాసభ పందిరిలోకి తెచ్చారు. పంత్ తీర్మానాన్నిబోస్ త్రోసివేయలేదు. ఆ సభలో బెంగాల్ యువకులు కొందరు అసభ్యంగా ప్రవర్తించారు. దానితో కుపితుడయిన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాష్‌తీర్మానంపై తన అనుయాయులను తాటస్థ్యం పాటించమన్నాడు. అందువల్ల పంత్ తీర్మానం నెగ్గింది. పంత్ తీర్మానాన్ని అనుసరించి వర్కింగు కమిటీని వేయ పూనుకుంటే 'నీవు కార్యనిర్వాహక వర్గాన్ని వేసుకో నా సహచరులు దాంట్లో వుండరు ఇరువర్గాలు ఒకచోట మెసలటం కుదరదు' అన్న వైఖరి తీసుకున్నాడు మహాత్ముడు. " ఆయన కాదన్నాడు కనుక నీకు నచ్చిన వారితో వర్కింగు కమిటీని నిర్మించు" అన్న ఎం.ఎన్.రాయ్ సలహాను కాదని,

'సంయుక్తనాయకత్వం కావాలన్న భారత కమ్యూనిస్టుల నినాదాన్ని పరిగణించి బోసు రాజీనామా చేశాడు కలకత్తా అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో. ఆనాడు బెంగాలు తుకతుక ఉడికిపోయింది గాంధీజీ ఎడల వ్యతిరేకత ఉధృతమయింది. అఖిలభారత కాంగ్రెసు సమావేశానికి వెళుతున్న కాంగ్రెసు కార్యదర్శిగా వున్న ఆచార్య కృపలానీ చొక్కాచించారు బెంగాల్ యువకులు. రాజేంద్ర ప్రసాద్‌ను కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. నగరపోలీసులలో అధిక సంఖ్యాకులు బీహారీలు. వారు భాషాభిమానంతో బీహారువాడయిన రాజేంద్రప్రసాదును ఎదిరించి పూనుకున్న బెంగాల్ యువకులపై విరుచుకుపడ్డారు. ఇది కలకత్తా అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశపు కథ. సుభాష్ చంద్రబోసు రాజీనామా పెట్టిన తరువాత 'ఫార్వర్డు బ్లాకు' అనే 'గ్రూపు'ను కాంగ్రెసులో ఏర్పరిచాడు.

నాది చిన్న పిల్లల పెళ్ళి. నాకు 17 సంవత్సరాలు, నా భార్య సుబ్బమ్మకు 11 సంవత్సరాలు నిండలేదు. ఆమె 13 సంవత్సరాలు నిండక ముందే కాపురానికి వచ్చింది. 14 సంవత్సరాలు నిండిన మూడు నెలలకే మగబిడ్డను కన్నది. ఆమె రెండో పిల్లవాడు 1940 మార్చిలో పుట్టాడు. బారసాల చేసుకోవడానికి పీటలమీద కూర్చోమన్నారు మా నాన్నగారు. అప్పటికే నాకు హిందూ మతంమీద, దేవుని మీద నమ్మకం పోయింది. రాంఘర్ కాంగ్రెస్‌కు వెళ్లడానికి పైకం ఇస్తే పీటలమీద కూర్చుని పూజలు చేస్తానన్నాను. ఆ నాటికి నేను మార్క్సిస్టును. అలా అనటం కమ్యూనిస్టు నీతికి భంగకరమని నాకు తోచలేదు. పై పెచ్చు అది కమ్యూనిస్టు నీతి అనే భావించాను. ఉద్యమాన్ని పెంచడానికి, పార్టీని బలపరచుకోవడానికి జిత్తులు, అసత్యాలు వీటిని చేపట్టడం తప్పులేదు; ఇతరులను వాడుకోవడం తెలివికల కమ్యూనిస్టు చేసే పని. మా నాన్నగారు 'సరే' అన్నారు. మార్చి 4న పిల్లవాడు జన్మిస్తే 11వ రోజున అంటే మార్చి 14న నేను పీటలమీద కూర్చున్నాను. మా తల్లిగారి కోరిక ప్రకారం ఆమె సోదరునిపేరు 'కామేశ్వర రావు' పెట్టాను. ఆ సాయంత్రమే రాంఘర్‌కు రైలెక్కాను.

శ్రీ మంతెన వెంకట రాజు గుంటూరు జిల్లాలో తీవ్రవాద భావాలున్న కాంగ్రెస్ యువ నాయకుడు. వారిది బాపట్ల తాలూకా మంతెన వారి పాలెం. మొదట్లో కమ్యూనిస్టులను ఆదరించిన ఆయన తర్వాత కమ్యూనిస్టు వ్యతిరేకి అయినాడు. రైలులో ఆయనను కలిశాను. రాంఘర్‌లో ఎక్కడ ఆశ్రయం పొందాలో తెలియని నేను ఆయన సహాయాన్ని అర్థించాను. నన్ను కాంగ్రెస్ డెలిగేటుగా చేస్తానన్నారు. నన్ను 'మంతెన రామరాజు' పేరుతో వ్యవహరించమన్నారు. నేను ఎగిరి గంతేశాను. ప్రతినిధుల బసలో చేరాను. మంతెన వెంకట రాజుగారు సోషలిస్టు నాయకుడు శ్రీ జయప్రకాష్ నారాయణ్‌ను కలవదలిచారు. అప్పటికి ఆంధ్ర, కేరళలలో వరుసగా సర్వశ్రీ సుందరయ్య, నంబూద్రిపాద్‌లకు నప్పజెప్పాడు జయప్రకాష్ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ శాఖలను. వారు కమ్యూనిస్టులు కాని వారిని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీనుండి తరిమి వేశారు. ఇది మంతెన వెంకట రాజుకు వ్యథ కలిగించింది. నన్ను తన వెంట నాయకుల శిబిరాల ప్రదేశానికి తీసుకుని వెళ్లారు ఆయన. నన్ను వాకిట్లో కూర్చోబెట్టి తను జయప్రకాష్‌తో మాట్లాడడానికి వెళ్లారు. ఆంధ్రలో సోషలిస్టు పార్టీ బాధ్యత తనకు నప్పచెప్పమని కోరారట. ఆనాడు కమ్యూనిస్టు మోజులో వున్న జయప్రకాష్ అందుకు సమ్మతించలేదు. నిరాశతో తిరిగి వచ్చారు వెంకట రాజుగారు. తర్వాత కొంత కాలానికి నిషేధం పోగానే ఆంధ్రలో, కేరళలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ బోర్డులు తీసివేసి వాటిస్థానే కమ్యూనిస్టు కమిటీల బోర్డులు వ్రేలాడకట్టారు సర్వశ్రీ సుందరయ్య, నంబూద్రిపాద్‌లు. దాంతో జయప్రకాష్‌కు జ్ఞానోదయమయింది. హిందూ పత్రికలో తను ఘోరమయిన తప్పిదం చేశానని జయప్రకాష్ అంగీకరిస్తూ వ్యాసాలు నాలుగు రాశాడు. అయితే జరుగవలసిన అపకారం సోషలిస్టు ఉద్యమానికి జరిగిపోయింది. సంయుక్త సంఘటన పేరుతో కమ్యూనిస్టులు తాము చేతులు కలిపే సోదర పార్టీలను చంపాలని మార్క్సిస్టు మహా నాయకుడు లెనిన్ బహిరంగంగా

చెప్పినా, రాసినా జయప్రకాష్ పట్టించుకోలేదు. ఇదంతా ఆయన స్వయం కృతాపరాధం.

వర్కింగ్ కమిటీ వారి తీర్మానం అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో చర్చకు వచ్చింది. కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి మౌలానా అజాద్‌తో పోటీ చేసిన ఎంఎన్ రాయ్ ప్రత్యామ్నాయ తీర్మానం నోటీసిచ్చాడు. అధ్యక్ష స్థానంలో వున్న మౌలానా ఆజాద్ ఎంఎన్ రాయ్‌కి తీర్మానం ప్రవేశ పెట్టడానికి ఐదు నిమిషాల కాల వ్యవధి ఇచ్చాడు. ఆ సమయం తీర్మానం చదవడానికే సరిపోతుందని, ఇది అన్యాయమనిచెప్పి తన నిరసన తెలియపర్చడానికి తనవేదిక దిగిపోబోయాడు ఎంఎన్ రాయ్. అతనిని వారించి, తీర్మానాన్ని కార్యదర్శి అయిన కృపలానీ చేత చదివించి, ఐదు నిమిషాల్లో రాయ్‌ని వ్యాఖ్యానించమని అన్నాడు అజాద్. తన అసమ్మతిని తెలియజేసి అలాగే ఐదు నిమిషాలు మాట్లాడాడు రాయ్. తీర్మానంపై నెహ్రూ గంట సేపు ఉపన్యసించాడు. ఇదీ ఆనాటి కాంగ్రెస్‌లోని అంతర్గత ప్రజాస్వామ్యం.

కాంగ్రెస్ మహాసభ గాలివానకు దెబ్బతిన్నది. నాయకుల, ప్రతినిధుల, ప్రేక్షకుల వసతులు బదాబదలయినవి. ప్రతినిధుల సభ మైదానంలో జరిపారు. "నీవు కమ్యూనిస్టువు. తీర్మానాలు వోటుకు వస్తే కమ్యూనిస్టులకు వోటు వెయ్యవద్దు. పట్టుబడతావు. నాకు మాట వస్తుంది" అన్నారు మంతెన వెంకటరాజు గారు. సరే అన్నాను కాని నేను కమ్యూనిస్టును కదా! ప్రతినిధులు సుమారు 2500 మంది వున్నారు. వర్కింగ్ కమిటీ తీర్మానానికి కమ్యూనిస్టులు పెట్టిన సవరణకు అనుకూలంగా సుమారు 30 వోట్లు వచ్చాయి. అందులో నా వోటు ఒకటి. అయితే ఆ గందరగోళంలో నన్ను ఎవరూ గమనించలేదు.

రాంఘర్ కాంగ్రెసులో కమ్యూనిస్టు నాయకుల శిబిరానికి వెళ్ళి కమ్యూనిస్టు సాహిత్యాన్ని మూటగట్టుకొని వచ్చాడు ఒక మిత్రుడు. తెనాలి తాలూకాలో ఒక గ్రామానికి కరణంగా పనిచేస్తున్న ఆ మిత్రుడు (అతని పేరు గుర్తు రావటం లేదు) నా వెంట తెనాలి వచ్చాడు. మా నాయన తహశీలుదారు కనుక మా యింట ఆసారస్వతం కొంత కాలం భద్రం చేయటం మంచిదని, ఆ తర్వాత దానిని పంపిణీ చేయవచ్చని అతడు సూచిస్తే నేను సమ్మతించాను. ఆ మూట మొత్తం మా యింటిలో పెట్టాను. మా నాన్నగారు దానిని చూచారు. వెంటనే నన్ను పిలిచి, 'నీ యిష్టం వచ్చిన రాజకీయాలు చదువుకో. నాకు అభ్యంతరం లేదు. కాని యీ సారస్వతాన్ని నా యింట్లో నుండి తీసివెయ్యి. లేకపోతే నా ఉద్యోగం పోతుంది' అన్నారు. భయపడ్డాను. అప్పటికే నేను సంతానం వున్న కుటుంబీకుడిని. మా నాన్నగారి జీతం తప్ప మాకు ఆదాయం లేదు. నా చదువు పనికి వచ్చేది కాదు. కాగా పై చదువు చదవాల్సి వుంది. నాకు అప్పటికి 22వ సంవత్సరం నడుస్తున్నది. మా నాన్నగారి కోరికను మన్నించి ఆ సారస్వతాన్ని కరణం మిత్రునికి అందించాను. వాతావరణం వేడెక్కి సాగింది. కాశీ విశ్వవిద్యాలయానికి విద్యా సముపార్జన కోసం వెళ్లాను.

రాంఘర్ కాంగ్రెసుకు వెళ్లే త్రోవలో ఒక సంఘటన జరిగింది. నేను బాపట్లలో రైలెక్కి 3వ క్లాసు పెట్టెలో పై 'బెర్త్'పై పడుకున్నాను. ఆనాడు సీట్లు, బెర్తుల రిజర్వేషను లేదు. నిడుబ్రోలులో ఆచార్య రంగా (ఆనాటి కిసాన్ సభ తాలూకు రైతు నాయకులు, తరువాత కృషికార్ లోక్ పార్టీ వ్యవస్థాపకులు, తరువాత స్వతంత్ర పార్టీ వ్యవస్థాపక నాయకులలో ఒకరు. ఇప్పుడు కాంగ్రెసు లీడరు) నేనున్న పెట్టెలో ఎక్కారు. ప్రక్కన కూర్చుని వున్న సహచరునితో మాట్లాడుతున్నారు. 'కమ్యూనిస్టుకు కమ్యూనిస్టు పార్టీ ముద్ర వుండాలా? ముద్రలేని ఆంబోతు ఆంబోతు కాకపోతుందా?' అన్నారు. (ఆవులను దాటే విత్తు కొట్టని ఎద్దును ఆంబోతు అంటారు కోస్తా ప్రాంతంలో) ఈ మాటలు నా స్మృతిపథంలో నిల్చిపోయాయి. తెనాలి వచ్చిన తరువాత పార్కులో సమావేశానికి వెళ్లాను. అక్కడ ప్రతి ఆదివారం సాహిత్యంలో అతిరథ మహారథులు గుమికూడేవారు. సర్వశ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి, (తరువాత ఆయన తనను రామస్వామి అని పిలుచుకున్నారు) కొడాలి ఆంజనేయులు, కొడవటిగంటి కుటుంబరావు, ఆయన సోదరుడు కొడవటిగంటి కృష్ణమూర్తి, ప్లీడర్లు పుచ్చా పూర్ణానందం, పిల్లలమర్రి వచ్చేవారు. అది ఒక అరాజక క్లబ్. అది సంఘం కాదు; రిజిష్టర్డు సంఘం అసలే కాదు. దానికి అధ్యక్షుడు అంటూ ఎవరూ లేరు. ఎవరైనా దేనినయినా ప్రస్తావనకు తేవచ్చును. బూతులు మాట్లాడినా ఎవరూ అడ్డగించరు. అభ్యంతరపెట్టరు. కాకపోతే ప్రసంగానికి, వ్యాఖ్యకు ఎవరయినా ప్రతివాదన చేస్తే, ప్రతి వ్యాఖ్య చేస్తే, అది బాణంలా గుచ్చుకుంటే బాధపడరాదు. ఉడుక్కోనరాదు. ఆ అరాజక క్లబ్ను సమావేశం అనే అనడం ఉచితంగా వుంటుంది- నేనూ వుండేవాడిని. దానికి సభ్యత్వం లేదు కదా! నేనే అందరిలో వయస్సులో చిన్నవాడిని. నన్ను వాత్సల్యంతో చూచేవారు పెద్దలు. అక్కడ రంగా గారి మాటలను చెప్పాను. వెంటనే కొడాలి ఆంజనేయులు గారి వద్ద నుండి బాణంలా జవాబు వచ్చింది.

(కొడాలి ఆంజనేయులుగారిది అసలు బందరు. ప్రసిద్ధ కవి. కాంగ్రెసువాది. స్వరాజ్య వీరులు. కాంగ్రెసు చరిత్ర రచించిన పట్టాభి సీతారామయ్య గారి అనుంగు స్నేహితుడు). చెప్పకపోయావా! అచ్చు వేసిన అంబోతు చేలో పడ్డే కొట్టకుండా అదిలిస్తారు. అదే ముద్రలేని అంబోతు అయితే గ్రామస్తులు దానిని తరిమి చావకొట్టేసంత పని చేస్తారు' అన్నారు. అందరూ ఫక్కున నవ్వారు. వారి సమయస్ఫూర్తిని మెచ్చుకున్నారు. వారి వాక్యాలలోని సత్యాన్ని గ్రహించారు. కమ్యూనిష్టు పార్టీ కార్యకర్తనయిన నాకు సంతోషం కలిగింది.

# బెనారెస్‌లో విద్యార్థిసంఘ కార్యకలాపాలు

**1940** ఏప్రిల్‌లో శ్రీ తరిమెల నాగిరెడ్డి బెనారెస్‌లోని కాశీ విశ్వ విద్యాలయాన్ని వదిలి పెట్టాక [illegible] ఆయనకు విద్యార్థి లోకంలో పెద్ద పేరు ప్రఖ్యాతులుండేవి. పార్లమె[illegible]ఎక [illegible]నమంత్రిగా వున్నాడు. విశ్వ విద్యాలయపు విద్యార్థులందరు - అన్ని - [illegible] - వోట్లేచ్చి ఎన్నుకుంటారు పార్లమెంటు లీడరును, పెద్ద పోటీ అది [illegible]రు 3వేల మంది విద్యార్థులు పాల్గొనేవారు. ఆయన అప్పుడు కమ్యూనిస్టే. అయితే ఆయన సౌమ్యుడు, మంచివాడు, పెద్ద మనిషి, నిజాయితీపరుడు అని విద్యార్థులు అతనిని పొగిడేవారు. ఈ నాగిరెడ్డియే దరిమిలా ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ నాయకుడయి, ఆంధ్ర నక్సలైటు వర్గ నాయకుడయి, దరిమిలా విప్లవ కమ్యూనిస్టు వర్గ భారత నాయకుడు అయి నాగిరెడ్డిగారుగా భాసిల్లారు.

శ్రీ నాగిరెడ్డి మీది గౌరవం కొంత కమ్యూనిస్టు విద్యార్థులపై కూడ ప్రసరించింది. విశ్వ విద్యాలయంలో చేరిన మొదటి సంవత్సరం నేను కమ్యూనిస్టుగా బయటపడ లేదు. 'ముసుగు కమ్యూనిస్టు'గా వుండేవాడిని, విద్యార్థి కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనేవాణ్ణి. మేము చేసిన పోరాటాలలో మూడు ముఖ్యమైనవి. వాటిని యిక్కడ వివరంగా ఉటంకించటం సందర్భోచితంగా వుంటుంది.

హాస్టలులో వుండే విద్యార్థులకు వైద్యం చేయటానికి వైద్యులుండేవారు. వైద్య బృందానికి నాయకుడుగా ముఖ్య వైద్యుడుండేవాడు. అతని పేరు మంగళ సింగ్ అని గుర్తు. అతడు క్రితం సంవత్సరాలలో సరిగా వైద్యం చేయక విద్యార్థుల మరణానికి కారణభూతుడయినాడు. టైఫాయిడ్‌తో బాధపడే విద్యార్థికి విరేచనాలకు మందిచ్చి చంపాడుట. ఇలా ఎన్నో ఆరోపణలు అతనిపై. హాస్టలు విద్యార్థుల సమావేశం జరిగింది. హాస్టలులోని విద్యార్థుల సంఖ్య 1500 అయితే 500 మంది సభకు వచ్చారు. ఆయనపై ఫిర్యాదులను విచారించటానికి ఒక కమిటీని నియమించారు. ప్రజల అవసరాల విషయం అటుంచి ప్రజల మనోభావాలను గ్రహించి ప్రజలను స్పందింపచేసే సమస్యలను ఎంపిక చేయటంలో కమ్యూనిస్టులు వారికే సాటి. విచారణలో ముఖ్య వైద్యుడు అసమర్థుడని, అతడు ఆ ఉద్యోగంలో కొనసాగితే విద్యార్థులలో మరణాల సంఖ్య పెరుగుతుందని తేలింది. కమిటీ అలా నివేదిక సమర్పించింది. అతనికి 'యమదూత' అనే బిరుదు యిచ్చి అతనిని ఉద్యోగం నుండి తొలగించాలని ఆందోళన ప్రారంభించాం. ప్రతి హాస్టలు విద్యార్థి రాత్రి 8 గంటలకు హాజరు రిజిష్టరులో సంతకం చేయాలి. దస్కతులు చేయమని సమ్మె చేశాం. తత్ఫలితంగా ముఖ్య వైద్యుని ఆ ఉద్యోగం నుండి తొలగించి ఆరోగ్యశాఖాధికారిగా వేశారు అధికారులు.

'లా' డిగ్రీ కోర్సులో 3, 6 నెలల పరీక్షలకు ఫీజులు వసూలు చేసేవారు. ఆ పరీక్షలు జరిపేవారు కాదు. పెట్టని పరీక్షలకు ఫీజులు తీసుకోవటం అన్యాయమన్నాం. ప్రొ వైస్ ఛాన్సలరు వద్దకు రాయబారం వెళ్లాం. రాయబార బృందంలో నేనూ వున్నాను. 'మీ వాదన సమంజసం. తప్పక పరీక్షలు పెట్టాను' అన్నాడు ఆయన. దీంతో నాయకులలో తత్తర బయలుదేరింది. ఆయన ప్రతిపాదనకు అంగీకరించి

బయటకి వస్తే విద్యార్థులు నాయకుల చర్మం వలుస్తారని వారికి తెలుసు. వెంటనే 'ఏదో సూత్రపరంగా అభ్యరంతరం చెప్పాం కాని యధాతధ స్థితిని మార్చటానికి మేము యిష్టపడడం లేదు' అన్నాం. 'సరే. మీ ఇష్టం. మీరు చెప్పారు. నేను విన్నాను.' అన్నాడు. చావుదప్పి కన్ను లొట్టపోయి బయటకి నడిచాం. విద్యార్థులకు యీ విషయం చెప్పాం. సమయోచితంగా ప్రవర్తించినందుకు నాయకులను పొగిడారు. పరీక్షలు లేవు కాని పరీక్షల ఫీజులు కట్టడం ఆగలేదు. తప్పుడు అంచనాలలో పొరపాటు పద్ధతులలో పోరాటం సాగించినందుకు అదీ ప్రతిఫలం.

మూడవ పోరాటం విచిత్రంగా నడిచింది. రాత్రి 10 గంటలకు హాస్టలు గదులలో దీపాలు ఆరిపోయేవి. తెల్లవారు జామున 4 గంటలకు వచ్చేవి. రోజూ ఉదయం 2 గంటలు, సాయంత్రం 2 గంటల వ్యవధిలో స్నానానికి నీళ్లు వచ్చేవి. 24 గంటలూ దీపాలు వెలగాలని రోజంతా నీటి సరఫరా వుండాలని సమ్మెకు ఉపక్రమించాం. సమ్మెకు ముందు ప్రొ వైస ఛాన్సలరు గుర్తూ గారి వద్దకు వెళ్లాం. ఆయన మా కోర్కెలు అంగీకరించడానికి ఆశక్తత వెల్లడించాడు. విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షుడుగా వున్న సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు కలకత్తా వెళ్ళినందుకు ఆయన వచ్చేవరకు సమ్మె చేయవద్దని గుర్తూ గారు కోరారు. మాకు కావలసింది పోరాటం. ససేమిరా సమ్మె ఆగదన్నాం. నాల్గు రోజులు గడిచింది. ఉపాధ్యక్షులు రాగానే హాస్టలులో విద్యార్థులనందరిని ఆర్ట్సు కాలేజీ హాలులో సమావేశం కావాలని గంట మోగించారు. హాస్టలు విద్యార్థులందరమూ వెళ్లాం. ఆనాటి రాధాకృష్ణ పండితుని ఉపన్యాసం యిప్పటికీ చెవులలో గింగిరమంటున్నది. ఆయన ఉపన్యాస ధోరణి యిలా సాగింది. 'మీరు సమ్మె చేశారు. న్యాయమైన కోర్కెలకు సమ్మె చేయడం సబబే. దీపాలు రాత్రి అంతా వెలగాలని మీ డిమాండు - రాత్రిళ్లు ఎక్కువగా చదివితే మీ ఆరోగ్యాలు చెడిపోతాయని రాత్రి 10 గంటలకే తీసివేస్తున్నాం. అలా కాదని మీరు రాత్రి మొత్తం అంతా దీపాలు వెలగాలని కోరుకుంటున్నారు. నాకు అభ్యంతరం లేదు. మీ డిమాండును నేను అంగీకరిస్తున్నాను.' విద్యార్థులు అందరూ - నాయకులు తప్ప - చప్పట్లు కొట్టారు. దాంతో ఉపాధ్యక్షుని పథకం పారింది. మరల ఉపన్యాసం ప్రారంభం. 'మీరు రోజంతా నీళ్లు కావాలంటున్నారు. అదే సమంజసమే. 'క్యాంపస్'లో బావులలో నీరు చాలక అలా చేస్తున్నాం. ఇంకా నాలుగు బావులు తవ్విస్తున్నాను. ఉత్తరువు ఇచ్చాను. అవి తయారు అయ్యేవరకు ఓపిక పట్టండి' మరల విద్యార్థులు సంతోషంగా చప్పట్లు కొట్టారు. నాయకత్వం వహించినవారం మొగాలు వేలాడేసుకున్నాం. రాధాకృష్ణ పండితుడు ఈ అవకాశాన్ని జార విడుచుకోతల్చలేదు. మళ్లీ అందుకున్నాడు. 'నేను యీ విశ్వ విద్యాలయంలో ఉన్నతోన్నత పదవిలో ఉన్నవాడిని. ఈ విశ్వ విద్యాలయ నిర్వహణ బాధ్యత నాది. ఆ విషయం మీకు తెలుసు. నేను మరో పట్టణం వెళ్లి నాలుగు రోజులలో తిరిగి వస్తానని తెలిసి కూడా మీరు సమ్మెకు పూనుకున్నారు. ఇది చాల పొరపాటు పని కాదా? మీరు ఇంత అనాలోచితంగా ప్రవర్తిస్తారని నేనుఊహించలేదు. మిమ్మల్ని ఎవరో తప్పుదారి పట్టించారు' నాయకులం మేము కలక్కుమన్నాం. ఏదయినా మీరు మీ కోర్కెలను సాధించుకో గలిగారు. మీకు శుభం' ముగిసింది ఉపన్యాసం.

నాయకశ్రేణి విద్యార్థులు తప్ప తతిమ్మా విద్యార్థులంతా విజయ గర్వంతో నడిచారు. మేము దీనవదనాలతో ఓటమి పాలయి వెనుతిరిగాం. తొందరపాటుతో ప్రవర్తిస్తే పోరాటాలు దెబ్బతింటాయనే దానికి ఈ సమ్మె ఒక ఉదాహరణ.

# రాధాకృష్ణ పండితుల సమయోచిత ప్రవర్తన

బెనారెస్ విశ్వ విద్యాలయంలో రాధాకృష్ణ పండితుడు ఉపాధ్యక్షుడుగా వున్న కాలంలో నేను విద్యార్థిగా వుండటం నా అదృష్టమని చెప్పవచ్చు. (జ్యోతిష శాస్త్ర అదృష్టం కాదు సుమండీ) నేను ఆశించని విషయాలు తెలుసుకున్నాను. నేను ఊహించని అంశాలు గ్రహించగల్గాను.

విశ్వ విద్యాలయంలో విద్యార్థుల ఆంధ్ర సంఘం ఉండేది. వార్షికోత్సవానికి ఉపాధ్యక్షుని ఆహ్వానించాం. ఆయన తెలుగువాడు కదా! వేళకు ఆయన సభకు విచ్చేశారు. సభలో విద్యార్థులు క్రిక్కిరిసి కూర్చున్నారు. ఎదురుగా తెలుగు ముఖాలు కనపడ్డాయి ఆయనకు. 'నేను విశ్వ విద్యాలయ బాధ్యతలను నిర్వర్తిస్తున్నంత కాలం మీరు (తెలుగు విద్యార్థులను ఉద్దేశించి) యీ విశ్వ విద్యాలయం అందించే అవకాశాలను, సౌకర్యాలను వినియోగించుకోవచ్చని మీకు హామీ ఇస్తున్నాను అన్నారు. ఆంధ్ర విద్యార్థులు తమ హర్షాన్ని చప్పట్లతో తెలియ జేశారు. ఈ మాటలు అని ఆయన హాలంతా కలియ జూచాడు. అనేకమంది ఇతర భాషల విద్యార్థులు ఆయనకు కనబడ్డారు. (వారంతా మా అతిథులు). వెంటనే 'అయితే ఒక మాట. ఇతర ప్రాంతాల వారికి, ఇతర భాషల వారికి నష్టం కలిగే విధంగా కాదు.' ఇతర భాషలవారి కరతాళ ధ్వనులు మున్మురంగా విన్పించాయి. చేతి రుమాలు గాలిలో వేస్తూ ఆయన నిష్క్రమించాడు. ఆనాడే ఆయన సమయ స్ఫూర్తికి ఆయనను మెచ్చుకోకుండా వుండలేక పోయాను.

సోషలిస్టు, కమ్యూనిస్టు విద్యార్థులందరు భారతదేశ స్థాయిలో ఒకే విద్యార్థి సంఘంలో కలిసి పనిచేశాం. నేను మొదటి సంవత్సరంలో వుండగా కాన్పూరులో జరిగిన భారత కార్యనిర్వాహక వర్గ సమావేశంలో తగాదాలు వచ్చాయి. విడిపడ్డారు సోషలిస్టులు బెనారెసులో సోషలిస్టులు 'బెనారస్ స్టూడెంటు అసోసియేషను'ను పెట్టుకున్నారు. కమ్యూనిస్టు విద్యార్థులు 'బెనారస్ స్టూడెంటు ఫెడరేషను' పేరుతో వ్యవహరిస్తున్నారు నేను మా సంఘానికి ఆర్థిక కార్యదర్శిని. క్రితం సంవత్సరంలో మా కమ్యూనిస్టు విద్యార్థి బృందానికి చెందిన 'బట్రూ' అనే మిత్రుడు పార్లమెంటు నాయకత్వానికి పోటీచేసి తేజ ప్రతాపసింగు అనే బీహారుకు చెందిన రాజ వంశీకుడి చేతిలో 56 వోట్ల తేడాతో ఓడిపోయాడు. బట్రూ పంజాబీ అయినా 3000 వోట్లలో యించుమించుగా సగందాకా వోట్లు వచ్చాయి. అతడు మంచి వక్త, కార్యకర్త. అతడు ఇంజనీరింగు విద్యార్థి. అతడిని ప్రభుత్వం అరెస్టు చేసింది. మా స్టూడెంటు ఫెడరేషను సమ్మెకు, ఊరేగింపుకు పిలుపు ఇచ్చింది. విద్యార్థులందరూ కాలేజీలకు హాజరు కాలేదు. ఊరేగింపుకు 1500 మంది, హాస్టలు విద్యార్థులలో కనీసం 500 మంది వస్తారని ఆశించాం. ఊరేగింపు కదిలే సమయం గడిచి అరగంట అయింది. ఎక్కడో ఏదో కుట్ర జరిగి ఉంటుంది. 11 మందిమి మాత్రమే గుమిగూడాము. ఈ కొద్ది సంఖ్యతో ఊరేగింపు తీయడానికి సిగ్గుపడ్డాం. విశ్వ విద్యాలయానికి 4 మైళ్ల దూరాన (6 కి.మీ. పైన) దశాశ్వమేధ ఘాటులో సోషలిస్టు విద్యార్థులు 30 మంది వచ్చి ఊరేగింపులో చేరారు. అప్పటికి మా కమ్యూనిస్టు విద్యార్థుల సంఖ్య 30కి పెరిగింది. 60 మంది 'బ్రిటిషు ప్రభుత్వం నశించాలి' అని నినాదాలు

యిస్తూ మరో 2 మైళ్లు (3 కి.మీ) వెళ్ళి టౌసుహాలు చేరాం. సభ పెట్టాం. ప్రజలు సభకు బాగానే వచ్చారు. ఉపన్యాసాలు అయిపోయాయి. బ్రిటిషు ఇండియా ప్రభుత్వ చర్యసు నిరసిస్తూ ఆలిండియా విద్యార్థి సంఘ కేంద్ర సంఘ సభ్యుడయిస బత్రాసు అభిసందిస్తూ తీర్మానం ప్రవేశ పెట్టాం. సోషలిస్టు విద్యార్థులు పేచీ పెట్టారు. 'విద్యార్థి నాయకుడు కామ్రేడ్ బత్రాసు అభిసందిస్తాం' అని సవరణ ప్రతిపాదించారు.మేము యిష్టపడలేదు. ఇరువర్గాలు చీలిపోయి రెండు సభలు నిర్వహించాం.

మరునాడు 'సోవియటు మిత్రమండలి' సభకు ఆర్ట్సు కాలేజ్ హాలుసు ప్రిన్సిపాలు 'నాగ్' యివ్వసంటే ఉపాధ్యక్షుడయిస రాధాకృష్ణ పండితుని ఇంటికి వెళ్లాసు. సాదరంగా ఆహ్వానించి ఆససమిచ్చాడు. నీవు 'ఫరూక్ గ్రూపు విద్యార్థివి కదా' అని అడిగాడు. ఫరూక్ అంటే 'ఆలిండియా స్టూడెంటు ఫెడరేషసు'గా వ్యవహరించే కమ్యూనిష్టు విద్యార్థుల ప్రాబల్యంలోని సంఘ భారత కార్యదర్శి. అవుసని సమాధాసం చెప్పాసు. 'నిన్న సాయంత్రం మీకు, సోషలిష్టు విద్యార్థులకు తగాదా జరిగింది కదా!' అని ప్రశ్నించాడు. 'అవుసు' అని జవాబు యిచ్చాసు. 'అది దురదృష్టకరం కదా!' అని తస భావం వెలిబుచ్చాడు. నేసు ఆయసతో ఏకీభవించాసు. వెంటనే మాట మార్చి, 'ఇంతకూ నీవు వచ్చిస పని?' అని మాటలు అర్థాంతరంగా ఆపివేశాడు. నేసు వచ్చిస కారణం, నా కోర్కె తెలియజేశాసు. 'ఇంత చిన్న పని కోసం నాదాకా రావాలా? వెళ్లి నేసు చెప్పాసని 'నాగ్'గారితో చెప్పి హాలు వాడుకో' అని సమావేశం ముగించాడు. ఇదే రాధాకృష్ణ పండితుని పనితీరు. 'నీవు తప్పుడు పసులు చేస్తున్నావు. నిన్ను విశ్వ విద్యాలయం నుండి గెంటి వేస్తాసు' అని అసలేదు. 'నీ చర్యలు నేసు కనిపెట్టున్నాసు సుమా' అన్నట్లు మాట్లాడి నా అభ్యర్థసను అంగీకరించి పంపించేశాడు. దీనినే ఇంగ్లీషులో 'టాక్టు' అంటారు. దీనిని వాడగలరు కాని నిర్వచించలేదు. సమయోచిత ప్రవర్తస రాధాకృష్ణ పండితుని సొమ్ము.

# రాధాకృష్ణ పండితుని సమయపాలనం

**లా** కాలేజీ రెండవ సంవత్సరంలో మద్రాసు రాష్ట్ర కవులుదారీ చట్టాలను అధ్యయనం చేసేవారం. మా ప్రిన్సిపాలు తమిళుడు. ఆయనకు పాండిత్యం తక్కువయినా వాగాడంబరం ఎక్కువగా వుండేది. మద్రాసు కవులుదారీ శాసనాలను ప్రత్యేక అధ్యయన విషయంగా తీసుకున్న విద్యార్థులం పరీక్షల ముందు సమావేశం అయ్యాం. దానికి ఉపాధ్యక్షుడుగా వున్న రాధాకృష్ణన్ గారిని ఆహ్వానించాం. ఆయన సకాలానికి సభకు విచ్చేశారు. ప్రిన్సిపాలు రాలేదు. మీ ప్రిన్సిపాలుగారు రాలేదా అని నన్ను అడుగుతుండగానే ఆయన వచ్చాడు. 'మీ కారు యిబ్బంది పెట్టిందా' అని అడిగి వూరుకున్నారు రాధాకృష్ణన్ గారు. తాను సమావేశంలో 15 నిమిషాలు ఉండగలుగుతానని ముందే చెప్పారు. ఆ ప్రకారం 15 నిమిషాలు కాగానే చిరునవ్వులు చిందిస్తూ వెళ్లిపోయారు.

మరోసారి నేను వుంటున్న బిర్లా హోస్టలు 'ఎఫ్' బ్లాకు విద్యార్థుల వార్షికోత్సవానికి పిలిచాను. 15 నిమిషాలు మాత్రం వ్యవధి యివ్వగలనన్నారు. 'సరే' అన్నాను. సరిగ్గా అయిదు గంటలకు వచ్చేశారు. 5 గంటల 15 నిమిషాలకు సభను విడిచి విశ్రమించారు.

ఉపాధ్యక్షుని రాకపోకలను బట్టి గడియారాలను సరిదిద్దుకోవచ్చనే మాట అమలులో వుండేది.

# బెనారెస్‌లో కమ్యూనిస్టు విద్యార్థిగా...

నేను లా ఫైనలు, ఎం.ఏ ఫైనలు తరగతులకు చేరేటప్పటికి (1941-42) కమ్యూనిస్టు విద్యార్థిగా నేను బయటపడ్డాను. 1940-41లో అర్ధరాత్రి పక్కలు కొడపెట్టే మైదానాల్లో జరిగే రహస్య సమావేశాల్లో పాల్గొనేవాడిని. మాకు భయం పోగట్టడానికి తప్ప ఆ సమావేశాల్లో రహస్య విషయాలు ఏమీ లేవు. నేను అప్పటికి కమ్యూనిస్టు పార్టీలో 'అసోసియేటు' సభ్యుడిని మాత్రమే. పార్టీలో నాలుగు దొంతర్లు వుండేవి. ఆక్టివిస్టు, అసోసియేటు సభ్యుడు, 'కాండిడేటు', పూర్తి సభ్యుడు యివి తరతమ భేదాలు. (1941 చివర నెల నాటికి 'కాండిడేటు' అయ్యాను) మా 'స్టడీ సర్కిలు'లో నేను, శ్రీ మాదాల నారాయణ స్వామి యింకా తదితరులు మొత్తం అయిదుగురం వుండేవాళ్లం. ఆ మాదాల నారాయణ స్వామియే ఈనాడు సిపిఐ (ఎం.ఎల్) నక్సలైటు శాఖకు ఆంధ్రప్రదేశ్ కార్యదర్శి. శ్రీ నీలం రాజశేఖర్ రెడ్డి మాకు 'జాన్ స్ట్రాచీ' రాసిన గ్రంథాలు పాఠం చెప్పేవారు. తరువాత ఆయన భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా రూపొందారు. ఆయనను 1941 తొలి మాసాలలో రహస్యంగా బెనారెస్ కంటోన్మెంటు స్టేషనులో రైలు ఎక్కించాను.

కమ్యూనిస్టుల వ్యవహార సరళిని ఎరుకపరచటానికి రెండు సంఘటనలను తెలియజేయడం అవసరం. శ్రీ బలదేవ్ సింగ్ బెనారెస్ స్టూడెంటు ఫెడరేషను ప్రధాన కార్యదర్శి. రాకూరుసింగ్ కాశీ జిల్లా కమిటీలో విద్యార్థి విభాగపు బాధ్యుడు. ఒకరోజు 'నిన్ను కలుస్తాను. నాకు రహస్య ప్రదేశం చూడమని' రాకూర్ సింగ్ ఆదేశించాడు. అతని ఉత్తర్వును పాటించాను. ఠాకూర్ సింగ్ వచ్చాడు. నా పనిని గురించి అజమాయిషీ చేశాడు. 'పార్టీకి ... విరాళాలు ఎందుకు వసూలు చెయ్యలేక పోతున్నావు?' అని నిలదీశాడు. 'నా మనస్తత్వం ఆ పనికి అనువయినది కాదు' అనేది నా జవాబు. తరువాత బలదేవ్ సింగు ప్రసక్తి తెచ్చాడు. నాకు 'అతనికి విరోధమంటారు మిత్రులు. నాకు అతనిపై ద్వేషం లేదు. పగవుంటే ఎప్పుడో అతనిని సాధించే వాడినని చెప్పాడు. 'ఏమి చేయగలిగేవారని' అమాయకంగా అడిగాను. అతని సమాధానం నన్ను దిగ్భ్రాంతికి లోనుచేసింది. గుండెదడ పుట్టింది. తేరుకోవడానికి రెండు నిమిషాలు పట్టింది. ఇంతకూ అతను అన్నది ఏమిటి? 'ఎలా అతనిని నాశనం చేయగలనా అని కదూ నీవు నన్ను ప్రశ్నించింది, చెప్తా విను. 'నిన్ను కలుస్తాను. రహస్య స్థావరం ఏర్పాటు చెయ్యి'మంటాను. నేను అక్కడికి వచ్చే సమయానికి ఆ స్థావరం ఆచూకీ పోలీసులకు తెలియపరుస్తాను. పోలీసులు నన్ను అతడు ఏర్పాటు చేసిన రహస్య ప్రదేశంలో అరెస్టు చేస్తారు. తరువాత బలదేవ్ ద్రోహం చేసి నన్ను పట్టించాడని పార్టీకి వర్తమానం పంపుతాను. దాంతో అతని రాజకీయ జీవితం సమాప్తం. నేను అలా చేయలేదే!' అసలు యిలాంటి ఆలోచన శిసలయిన కమ్యూనిస్టుకు - ఏ కారణం వల్ల కాని - ఎలా వస్తుందనేది యిప్పటికి నా వూహాకు అందని విషయం.

రెండవ సంఘటన 1941-42లో జరిగింది. అప్పటికి నేను కమ్యూనిస్టునని విద్యార్థులందరికి తెలుసు. బిర్లా హాస్టలులో సుమారు 240 విద్యార్థులుండేవారు. ఆ హాస్టలులోని కమ్యూనిస్టు కార్యకలాపాలకు నేను బాధ్యుణ్ణి. ఒకసారి బిర్లా

హాస్టలు హాలులో 'ఆలిండియా స్టూడెంటు అసోసియేషను' ప్రధాన కార్యదర్శి 'షా' మీటింగును ప్రకటించారు. ఆయన సోషలిస్టు. మాకు వ్యతిరేకి. నేనూ సభకు వెళ్ళాను. సభకు సుమారు వందమంది విద్యార్థులు వచ్చారు. 'షా' ఉపన్యాసం ప్రారంభించాడు. ఒక మళయాళ విదార్థి- దృఢకాయుడు - మాట మాటకు అడ్డుతగులుతున్నాడు. సమావేశాన్ని ఏర్పాటు చేసిన 'వి.ఎన్.కాక్' అనే విద్యార్థి నన్ను పిలిచి అతనిని అదుపు చెయ్యమన్నారు. 'అతనెవరో నాకు తెలియదు. అతనిని కంట్రోలు చెయ్యగల శక్తినాకు లేదు' నీవు ఏ చర్య తీసుకున్నా నాకు సమ్మతమే.' అని నా నిస్సహాయతను వెలిబుచ్చాను. మళయాళ విద్యార్థిని 'ఆర్ముగం! నీవు గోల చేయవద్దని' కాక్ కోరాడు. ఆర్ముగం వినలేదు. మీటింగును ధ్వంసం చేశాడు. కాక్‌కు విద్యార్థులలో బలం వుంది. అతడు ఆర్ముగంను కంట్రోలు చేయగలడు. కాని చెయ్యలేదు. తరువాత తెలిసింది కారణం. కాక్, ఆర్ముగం [illegible] లోఫర్సు పార్టీ సభ్యులట. ఆ పార్టీ పేరు వినటం నాకదే మొదటిసారి. వాకబు చేశాను. విశ్వ విద్యాలయంలో చదువుకని వచ్చి, దానిపై అభిమానం పెంచుకొని, అక్కడ వున్న కోర్సులనన్నింటినీ ఒకదాని తరువాత మరియొక దానిని చదువుతూ పన్నెండు, పదిహేను సంవత్సరాలు చదివేవారు ఆ పార్టీ సభ్యులట. వారిలో ఒకరు మరి యొకరితో తగవు పడరాదట, కొట్టుకొనకూడదట. ఈ సంఘటన జరిగాక మా 'సెల్' మీటింగులో యీ విషయం ప్రస్తావనకు తెచ్చాను. నా కోపాన్ని వెలిబుచ్చాను. 'మేమే ఆర్ముగాన్ని పంపించాం' అనేదే 'సెల్' బాధ్యుని సమాధానం. నేను షాక్ తిన్నాను.

**1941** డిసెంబర్‌లో పాట్నాలో . అఖిల భారత విద్యార్థి మహాసభ జరుగుతుందని వర్తమానం వచ్చింది. అక్కడ చర్చకు వచ్చే రాజకీయ తీర్మానం ముసాయిదా మాకు చేరింది. బ్రిటను, జర్మనీల మధ్య జరిగే యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమని ఆ ముసాయిదా ముఖ్యాంశం. దానిని అధ్యయనం చేసి తయారయి పాట్నా వెళ్లాం. కాశీ, లక్నో మొదలగు ప్రదేశాలలోని యు.పి. విద్యార్థులను (ఆనాడు యు.పి. అంటే యునైటెడ్ ప్రావిన్సెను) రెండు రోజులు ముందుగా పాట్న చేరమన్నారు. అలాగే చేరాం. పాట్న ఆహ్వాన సంఘానికి బలగం లేదు. ఖాళీ స్థలం చూపి ఇదే సమావేశ ప్రదేశమన్నారు. రెండు రోజులు గోతులుత్రవ్వి స్తంభాలు పాతి షామియానాను నిలబెట్టాం. రేపు మహాసభ ప్రారంభమనగా 'సరాళా గుప్త' అనే మహిళా కామ్రేడ్ అర్ధరాత్రి తన ఎర్రరంగు చీరచించి తెల్లారేటప్పటికి విద్యార్థి జెండాను కుట్టి తయారుచేసింది. బెంగాలు నుండి వచ్చే 100 మంది కామ్రేడ్స్ ఆనాడు అనగా 1941 డిసెంబరు 29న ఉదయం పాట్నా చేరారు. ఆహ్వాన సంఘం కామ్రేడ్ వారిని ఆహ్వానించి 'ఇక యుద్ధం ప్రజా యుద్ధం' అన్నాడు. బెంగాల్ మిత్రులకు కోపం వచ్చింది. యావన్మంది - 16 మంది మహిళా కామ్రేడ్స్‌తో సహా - ఆహ్వాన సంఘ సభ్యుల్ని తిట్టేన తిట్టు తిట్టకుండా తిట్టారు. ఈ వార్త ప్రతినిధుల బసకు చేరింది, కలవరం పుట్టింది. శ్రీమతి 'పెరిన్ బరూచా' (ఆమె రమేష్ చంద్ర భార్య అయ్యారు దరిమిలా) అనే మహిళా కామ్రేడ్ వచ్చి 'రష్యా యుద్ధంలో ప్రవేశించాక యుద్ధ ప్రభావం మారిపోయింది. రష్యా చేసే యుద్ధం ప్రజా యుద్ధం. బ్రిటను చేసే యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధం. కనుక భారతీయులం బ్రిటిషు యుద్ధ యత్నాలను ఎదిరించాలి. విజయులమై స్వతంత్ర భారత దేశాన్ని రష్యా ప్రక్కన నిలబెట్టాలి'. అని మనుపు అనుకున్నాం. 'సామ్రాజ్యవాదులు రెండు శిబిరాలుగా చీలిపోయారు. బ్రిటను నాయకత్వాన ఒక సామ్రాజ్యవాద ముఠా రష్యాకు అండగా చేరింది. కనుక రష్యా, బ్రిటనుల యుద్ధ యత్నాలను బలపరచాలి. ఇది ప్రజా యుద్ధం.' అనేదే ఆమె ప్రసంగ పాఠం. ప్రతినిధులు ఆమె మాటలను వినదలుచుకోలేదు. ఎగతాళి చేసి వెళ్లగొట్టారు. అంత ఢిల్లీ విశ్వ విద్యాలయ అధ్యాపకుడయిన యగ్‌దత్ శర్మ రంగ ప్రవేశం చేశాడు. వివరించాడు; విశదీకరించాడు. ప్రతినిధులు సమ్మతించడం లేదు. 29, 30 తేదీలలో ప్రతినిదులు కొందరు ఎదురు తిరిగి ఉపన్యసించారు. అందులో లక్నోకు చెందిన నక్వీ, ఒరిస్సాకు చెందిన రౌత్రాయ్ ముఖ్యులు. వీరిరువురూ కమ్యూనిస్టులు కాదు. రౌత్రాయి ఒరిస్సా కాంగ్రెసు నాయకుడు. హరేకృష్ణ మెహతాబ్ సన్నిహిత అనుచరుడు. అప్పటికి స్టూడెంటు ఫెడరేషనులో అడపాదడపా కమ్యూనిస్టులు కాని విద్యార్థులు ఉండేవారు. రేపు చివరి రోజ అనగా 'ముందు ప్రజా యుద్ధ తీర్మానానికి వోటివ్వండి. తరువాత చూసుకుందాం' అనే పార్టీ ఉత్తరువు ప్రతినిధులందరికీ తెలియజెయ్యబడింది. వర్కింగు కమిటీ ప్రవేశ పెట్టిన ప్రజా యుద్ధ తీర్మానానికి వ్యతిరేకంగా ఆరుగురు వోటు చేశారు. తీర్మానం నెగ్గింది. నేనూ కమ్యూనిస్టు ప్రతినిధిగా అధికార తీర్మానానికి అనుకూలంగా చేయి ఎత్తాను. తే 1-1-1942న 'ఇది ప్రజా యుద్ధం', ఫాసిస్టులతో పోరాడటానికి మాకు తుపాకులు ఇవ్వండి' అనే నినాదాలిస్తూ పాట్నా

వీధులలో ఊరేగాం.

తరువాత తెలిసిన విషయాలు నన్ను మరీ గందరగోళంలో పడవేసినాయి. తే. 24-12-41నే బొంబాయి ట్రేడ్ యూనియన్ కార్యనిర్వాహక వర్గ సమావేశంలో ప్రజా యుద్ధ తీర్మానం భారతదేశంలో మొదటిసారిగా ప్రజా సంఘంలో ప్రవేశ పెట్టారుట. 'డియోలి'లో జైలులో వున్న కమ్యూనిస్టు నాయకులు 'జైలు డాక్యుమెంటు' అనే పత్రాన్ని తయారు చేశారు. దానిలో బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ హారీపొలిట్ సూచనను అనుసరించి ప్రజాయుద్ధ మిది యని జైలులోనే కామ్రేడ్స్ రాసారు. అందులో మాటలు కొన్ని విచిత్రంగా వున్నాయి. 'మేము మార్క్స్-ఎంగెల్సులను వదిలి గాంధీ నెహ్రూలను అనుసరించాము. మార్క్సిస్టు పరిజ్ఞానం లేని మీరు (సభ్యులను ఉద్దేశించి) మమ్మల్ని సరిదిద్ద లేకపోయారు. 'తాము చేసిన తప్పుకు నాయకత్వం సభ్యులను తప్పు పట్టింది. భలారే!

ఈ నూతన 'వినాదం చాలా మంది సభ్యులకు మింగుడు పడలేదు. పార్టీ కార్యకలాపాలకు 2, 3 నెలలు దూరంగా వుండి తరువాత 'లైను'లో పడ్డవారు అనేకులు. ఒక సంఘటన యీ సందర్భంగా చెప్పుకోతగింది. రహస్య జీవితం గడుపుతున్న ఒక కామ్రేడ్ వద్దకు మరో కామ్రేడ్ వెళ్లి 'కామ్రేడ్! ఇది ప్రజా యుద్ధం' అన్నాడు. రహస్య జీవితం గడిపే కామ్రేడ్‌కు కోపం వచ్చింది. ఆ మాట అన్న కామ్రేడ్‌ను గొంతు పట్టుకున్నాడు. 'ద్రోహి' అని నిందించాడు. అపుడు బహిరంగంగా బయట తిరిగే కామ్రేడ్ తన చేతిలోని పార్టీ తీర్మానాన్ని 'అండర్ గ్రౌండ్' అతని పైకి విసిరేశాడు. అది చదివి అతడు నిర్ఘాంత పోయాడు. ఇది కట్టుకథ కాదు. నిజాన్ని యిన వాస్తవ గాథ.

**1942** ఏప్రిలు ఆఖరుకు బెనారెస్ నుండి లా ఫైనలు పరీక్ష రాసి ఇంటికి చేరాను. 1935 నాటి తొలి కమ్యూనిస్టు శ్రీ మాడభూషి వెంకటాచారి కలిసి స్థానిక కమ్యూనిస్టు పార్టీకి 'రిపోర్టు చేసుకున్నావా' అన్నాడు. లేదు అన్నాను. తాము చేసిన తప్పులకు సభ్యులను విమర్శించే కమ్యూనిస్టు నాయకత్వం మీద గౌరవం పోయింది. కాశీలో వుండగా ఎం.ఎన్. రాయ్‌పై డాంగే రాసిన విమర్శక వ్యాసం 'అతి తీవ్రవాదం అతి మితవాదం అవుతుంది' అనే దానిపై బిర్లా హాస్టలులో పాఠం చెప్పాను. 1938 నుండి ఎం.ఎన్. రాయ్ పత్రిక 'ఇండిపెండెంటు ఇండియా'ను అప్పుడప్పుడు కొనడం అలవాటు. అన్ని రాజకీయ సిద్ధాంతాలను పునః సమీక్ష చేద్దామనుకున్నాను. కమ్యూనిస్టు, కాంగ్రెస్ సోషలిస్టు, రాడికల్ సారస్వతాలను ముందర వేసుకొనే కూర్చున్నాను. ఎం.ఎన్. రాయ్ ముస్ముందుగా 'లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్ మెన్' అనే దానిని స్థాపించాడు. గాంధీ వాదాన్ని, నాయకత్వాన్ని దుయ్యబట్టేవాడు. కాంగ్రెసులో గాంధీ నాయకత్వానికి ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని నెలకొల్పాలని ప్రయత్నించాడు. సుభాష్ చంద్రబోస్‌ను త్రిపుర ఎన్నికలలో బలపరిచాడు. తర్వాత అతనిని రాజీనామా చెయ్యవద్దని ఎంతో ఒత్తిడి చేశాడు. కాంగ్రెసు నుండి వైదొలగిన తర్వాత ఎం.ఎన్. రాయ్ 1940లో 'రాడికల్ డెమొక్రాటిక్' పార్టీని స్థాపించాడు. గాంధీజీ 'క్విట్ ఇండియా' ఉద్యమం పెట్టాలన్నాడు. అది ఫాసిస్టు శక్తులకు పరోక్షంగా ఉపయోగ పడుతుందని రాయ్ విమర్శించాడు. 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని ఎదుర్కోమని పిలుపునిచ్చాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం గెలిస్తే భారతదేశానికి స్వరాజ్యం రాకపోగా బానిసత్వ సంకెళ్లు యింకా గట్టిపడతాయని, నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీ, షింటో జపానులను ఓడించే క్రమంలో బ్రిటిషు సామ్రాజ్యవాదం మరింత బలహీన పడుతుందని, ఆ క్రమంలో భారతదేశాన్ని దోచుకుంటున్న బ్రిటిషు సామ్రాజ్య వాదులకు భారతీయ పెట్టుబడిదారులతో వున్న భాగస్వామ్యంలో భారత పెట్టుబడిదారుల వాటా పెరుగుతుందని, అందుకని అధికారాన్ని నారికి హస్తగతం చేయటానికి బ్రిటిషు సామ్రాజ్య వాదులు సిద్ధపడే పరిస్థితి వస్తుందని ఎం.ఎన్. రాయ్ వాదించాడు. 'బ్రిటిషు సామ్రాజ్యవాదులు బంగారపు పళ్లెంలో భారత ప్రజలకు స్వరాజ్య ఫలాన్ని అందిస్తారట' అని జాతీయవాదులు పరిహసించారు. కమ్యూనిస్టులు తీసిపోలేదు. వారు ఆయనను అపహాస్యం చేశారు. 'ఫాసిస్టులు గెలిస్తే, బ్రిటిషు తదితర సామ్రాజ్యవాదులు ఓడిపోతే తప్పనిసరిగా ఆయా దేశాల కార్మికులకు విముక్తి కలుగుతుందని' ఆనాటి కమ్యూనిస్టులు సిద్ధాంతీకరించారు. కాని చరిత్ర వారిని మోసం చేసింది. బర్మా, ఇండోనేషియాలలో స్వరాజ్యం రాలేదు. పైగా బానిసత్వం పెరిగింది. నిజానికి బ్రిటిషువారు భారత ప్రజలకు స్వేచ్ఛను ప్రసాదిస్తారని రాయ్ అనలేదు. భారత పెట్టుబడిదారులకు అధికారం యుద్ధానంతరం బ్రిటిషువారు యిస్తారని అన్నాడు. ఈలోగా భారత ప్రజలు సంఘటిత పడి స్వాతంత్ర్యాన్ని తాము పొందాలని అన్నాడు. ఈసంగతి జాతీయ వాదులకూ, కమ్యూనిస్టులకు తెలుసు. అయితే, దానిని వక్రీకరించి అతనిని తిట్టిపోశారు. చరిత్ర ఎం.ఎన్. రాయ్‌ని సమర్థించింది. యుద్ధానంతరం బ్రిటిషువారు కాంగ్రెసుకు అధికారం ధారాదత్తం చేశారు. కాంగ్రెసు నాయకత్వం భారత పెట్టుబడిదారులకు వత్తాసు

పలికే వర్గమని అనేకమంది స్వేచ్ఛా కాముకులు, అభ్యుదయవాదులు నమ్మేవారు.

ఆ కాలంలో నేను ఆలోచించుకుని ఎం.ఎన్. రాయ్ ఆలోచనా ధోరణి సరి అయినదని నిర్ధారించుకున్నాను. పార్టీలో చేరాను. కాంగ్రెసు నాయకులను అరెస్టు చేసింది విదేశీ ప్రభుత్వం. విద్యార్థులు సమ్మె చేశారు. జాతీయవాదం ఉధృతంగా వున్న రోజులవి. ఆంధ్ర క్రైస్తవ కళాశాల గేటువద్ద పదిమందిమి నిల్చొని 'అరెస్టు అయింది మీ నాయకులు కాదు. పెట్టుబడిదారుల మద్దతుదారులు' అని చెప్పటం ప్రారంభించాం. 'వీళ్లు బ్రిటిషువాళ్ల పెద్దకొడుకులురా' అని కాంగ్రెసు విద్యార్థులు మమ్మల్ని హేళన చేసి తిట్టారు. **1941** చివరన ప్రజాయుద్ధ నినాదమిచ్చి, యుద్ధ యత్నాలకు సాయం చేస్తామన్న కమ్యూనిస్టులు కాంగ్రెసు నాయకుల అరెస్టులను ఖండించారు. వారి విడుదలను డిమాండ్ చేశారు.

## పదమూడు వేల గోల

**1940** జూను నుండి ఫాసిస్టు వ్యతిరేక యుద్ధానికి సాయం చేయ పూనుకున్నాడు ఎం.ఎన్. రాయ్. అప్పటికి బ్రిటిషుజాతి హిట్లరుతో గట్టిగా పోరాడ నిశ్చయించిందని ఎం.ఎన్. రాయ్‌కు నమ్మకం కుదిరింది. **1941** డిసెంబరు నుండి కమ్యూనిస్టులు ప్రజాయుద్ధమనే పంథాను స్వీకరించి బ్రిటిషువారి యుద్ధ యత్నాలకు సాయం చేయపూనారు. **1942**మేలో యుద్ధ యత్నాలకు సహాయం చేసే భారత కార్మిక సంస్థలకు ధన సహాయం చేస్తామంది ప్రభుత్వం. అందుకు అంగీకరించాడు రాయ్. అప్పటికే ఆలిండియా ట్రేడ్ యూనియను నుండి విడివడి 'ఇండియను ఫెడరేషను ఆఫ్ లేబర్' అనే కార్మిక సంస్థను ఎం.ఎన్. రాయ్ స్థాపించాడు. దాని కార్యదర్శి అతడే. 'ఆలిండియా ట్రేడ్ యూనియను'లో జాతీయ వాదులున్నారు. వారు యుద్ధ వ్యతిరేకులు. అయినా వారితో పొత్తు సాగిస్తున్నారు కమ్యూనిస్టులు. జాతీయవాదులతో ఐక్యత పోతుందని కమ్యూనిస్టులు బ్రిటిషు ఇండియా ప్రభుత్వ ప్రతిపాదనను తిరస్కరించారు. ఇంతా ధన సహాయం సంవత్సరానికి **13**వేలు మాత్రమే. ఈ ధన సహాయాన్ని 'ఇండియన్ ఫెడరేషను ఆఫ్ లేబరు' తీసుకున్నదనేది బహిరంగ విషయమే. జాతీయవాదులకు, కమ్యూనిస్టులకు రాయ్‌ను తిట్టడానికి అవకాశం దొరికింది. బ్రిటిషు సామ్రాజ్యవాదుల ఏజెంటనే దుష్ప్రచారం సాగించారు. ఇది కాకిగోలగా సాగింది. 'మీ అబ్బాయికేం అతని నాయకునికి సామ్రాజ్యవాద ప్రభుత్వం పైకం యిస్తున్నది కదా!' అని మా యింటికి వచ్చి మా నాన్నగారితో మాట తూలినవారున్నారు. ఈ తిరస్కారాలను అవమానాలను భరిస్తూ మేము – ఎం.ఎన్. రాయ్ అనుచరులం ఊరుకోలేదు. ఎదురుదాడి ప్రారంభించాం. 'పదమూడు వేల గోల' అనే శీర్షికతో చిన్న పుస్తకం వేశాం. ప్రతి సభలో ఉపన్యాసాన్ని 'పదమూడువేల గోలతో' ప్రారంభించాం. తార్కికంగా వాదించాం. విదేశీ ప్రభుత్వ సహాయాన్ని 'ఆలిండియా కార్మిక సంస్థలు' తీసుకోవటం క్రొత్త కాదు. జెనీవాలోని ఐ.ఎల్.ఒ. సభలకు ప్రతినిధులను పంపే నిమిత్తం ప్రభుత్వం యిచ్చే వసతులను, సౌకర్యాలను ఎప్పటినుంచో వాడుకుంటున్నాయి. 'జాతీయ ప్లానింగు కమిషను'ను జవహర్‌లాల్ నెహ్రూ ప్రారంభిస్తే దానికి బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వం రవాణా

ఇత్యాది సౌకర్యాలను ఒనగూర్చింది. ఈ వాదన మధ్య తరగతి ప్రజలకు నచ్చలేదు; కారణం వారు దీనిని వినదల్చుకోలేదు. పల్లె ప్రజలలో మాకు ఇబ్బందులు కలుగలేదు. ఒక గ్రామంలో - గుంటూరు జిల్లా పెదనందిపాడు అనుకుంటాను - ఈ సమస్యపై మాట్లాడుతూ యిలా అన్నాను. 'మీరు మీ గ్రామంలో శివాలయం కట్టు పూనుకున్నారు. గ్రామంలో వేశ్య వెయ్యి రూపాయలు విరాళమిస్తానన్నది. మీరు తీసుకుంటారా లేదా? బ్రిటిషు ప్రభుత్వం వేశ్యలాంటిది. మాకు దాని మీద గౌరవం లేదు. అభిమానం లేదు. ఉమ్మడి శత్రువైన ఫాసిస్టు దేశాలపై యుద్ధంలో యుద్ధరం కలిసి పనిచేయ నిశ్చయించాం. అంతే. 'నా ఉపన్యాసం విన్న తరువాత దాని మీద ప్రజలెవరూ ప్రశ్నించలేదు.

ఎం.ఎన్. రాయ్ హేతువాది. తార్కికుడు. ఆలోచనలకు ప్రాధాన్యత యిచ్చే మనిషి. స్వీయాభిమానాలను, ఆవేశకావేషాలను ప్రక్కకునెట్టి నిర్ణయాలు చేయగల దిట్ట. అందుకు నిర్భయంగా తాను నమ్మిన పంథాను చేపట్టాడు. అయితే ఇది భారతదేశం. ఇక్కడ సూటిగా ఆలోచించడం అరుదు. కేవలం భావాలకు, అభిప్రాయాలకు విలువ ఇచ్చే జనం ఈ వాస్తవాన్ని గ్రహించకుండా ఎం.ఎన్. రాయ్ 13వేలు తీసుకుంటాననడం పొరపాటు చర్యే. భారత - చైనా యుద్ధం 1962లో వచ్చే వరకు ఎం.ఎన్. రాయ్ అనుచరులకు ఈ మచ్చ పోలేదు. భారత ప్రజలు వారిని క్షమించలేదు.

ఎం.ఎన్. రాయ్ అనుచరులు విద్యార్థి ఫెడరేషను నుండి విడివడి 'అఖిల భారత రాడికల్ స్టూడెంట్సు యూనియను' నెలకొల్పారు. దాని శాఖలను దేశమంతటా ఏర్పాటు చేయటానికి నిశ్చయించాం. జిల్లా ముఖ్య పట్టణాలలోనే గాక వారికి పలుకుబడి వున్న తాలూకా పట్టణాలలో కూడా శాఖలను ఏర్పరచి మహా సభలను జరిపేవారు. **1943, 1944** సంవత్సరాలలో సత్తెనపల్లిలో 'గుంటూరు జిల్లా రాడికల్ స్టూడెంటు యూనియను మహాసభకు' నేను అధ్యక్షత వహించాను. అప్పటికి నేను ఆంధ్ర రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యాలయ కార్యదర్శిని. ఆఫీసు గుంటూరులో వుండేది. ఆ పార్టీవారు ఫ్రెంచి విప్లవ దినోత్సవం చేసేవారు. ఆ విప్లవ నినాదాలయిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వాటి అంతరార్థాలను ప్రజలకు ఎరుకపరిచేవారు. ఫ్రెంచి విప్లవంలోని 'జాకొబెన్'ల వలె భారతదేశంలో ప్రజాస్వామ్య విప్లవం తేవాలని వారి ఆకాంక్ష. రైతులు, వ్యవసాయ కూలీలు, కార్మికులు, పట్టణాలలోని దిగువస్థాయి, మధ్య తరగతి వారి బహుళవర్గ నాయకత్వం కావాలని మా అభిలాష. మేము కార్మిక వర్గ నాయకత్వాన్ని కాదన్నాం. కార్మిక వర్గ తాత్విక ప్రభావాన్ని అక్కరలేదన్నాం. ఇపుడు ముమ్ముందుగా కావలసింది ప్రజాస్వామ్య విప్లవమని, సోషలిజం కాదని వాదించాం. పట్టణాలలో వీధి మూలల్లో ఉపన్యాసాలు యిచ్చాం. బహుళ ప్రజానీకాన్ని ప్రబోధితం చేయటానికి కృషి చేశాం.

గుంటూరులో కమ్యూనిస్టుల విద్యార్థి సంఘం 'అఖిల భారత విద్యార్థి ఫెడరేషను' (ఎ.ఐ.ఎస్.ఎఫ్) భారత మహాసభ జరిగింది. **1944** చివరిలోనో లేక **1945** మొదట్లోనో అనుకుంటాను. అప్పుడే కొలది రోజులు ముందే ద్వితీయ ప్రపంచ యుద్ధ స్వభావాన్ని గురించి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ అధినేత స్టాలిను ప్రసంగించాడు. 'ఈ యుద్ధం మొదటి నుండి ప్రజా యుద్ధమే' అని చెప్పాడు. అంటే రష్యా యుద్ధంలోకి వచ్చినప్పటి నుండి - **21** జూన్ **1941** నుండి - (కమ్యూనిస్టులు చెప్తున్నట్లు) మాత్రమే కాదన్న మాట. ఈ అవకాశాన్ని నేను తదితర రాడికల్సును జారవిడుచుకో తలచలేదు. వెంటనే 'స్టాలిను ఎం.ఎన్. రాయ్ వాదాన్ని సమర్థిస్తున్నాడు' అని ఇంగ్లీషులో కరపత్రం వేసి విద్యార్థులకు ముఖ్యంగా మహాసభ ప్రతినిధులకు అందజేశాం. మామూలు పరిస్థితుల్లో అయితే కమ్యూనిస్టు విద్యార్థులు ఘర్షణకు దిగేవారు. కాని వారు ఆ ప్రయత్నానికి పూనుకోలేదు. తమ భావాల మీద తమకే నమ్మకం సడలుతున్నపుడు ఆత్మ విశ్వాసం, పట్టుదల క్షీణిస్తాయి కదా!

రాడికల్ డెమొక్రాటిక్ పార్టీలో పనిచేసేటప్పుడు ఒక అనుభవాన్ని, చదువరులకు తెలియజేయటం అవసరం. నేను కామ్రేడ్ జి.ఎన్. హరి (గుత్తికొండ నరహరి, గుంటూరు జిల్లా గూడవల్లి నివాసి) కృష్ణాజిల్లా వీరులపాడు వెళ్లాం. నరహరి మా పార్టీలోకి రాకముందు రంగాగారి అనుచరుడు బంధువు కూడాను. సంఖ్యలో రాడికల్సును చాల అల్పాతి అల్పసంఖ్యలో వున్నా మాకు ఆత్మవిశ్వాసం మెండు. సాహసం మా లక్షణం. వీరులపాడు కమ్యూనిస్టుల కంచుకోట అని పేరు పొందింది. శ్రీ వట్టికొండ రంగయ్య, అతని సోదరుడు యిద్దరే మాకు అభిమానులు; అండదండ. (వట్టికొండ రంగయ్యగారు ఆయన భార్య వట్టికొండ విశాలాక్షి కవులు. 'ప్రజావాణి' అనే పత్రికను గుంటూరు నుండి నడిపారు). భోజనానంతరం రాత్రి **10** గంటలకు

గ్రామ కూడలిలో సభ. పసిపిల్లలతో సహా సుమారు వెయ్యిన్నర దాకా స్త్రీ పురుషులు వచ్చారు. 'ముందడుగు' నాటకం రాసిన శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు గ్రామమది. సభలకు రావటం, ప్రొద్దుపోయిన దాకా ఉపన్యాసాలు వినటం కమ్యూనిస్టులు ప్రజలకు అలవాటు చేశారు. అన్ని రాజకీయ పార్టీలవారూ అన్ని సభలకు వస్తారు. మా సభకు కామ్రేడ్ నరహరి అధ్యక్షుడు. నేను ఉపన్యాసకుణ్ణి. ఉపన్యాసం ప్రారంభించాను. ఒక యువకుడు వేదిక వద్దకు దూసుకుని వచ్చాడు. అతడే శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు. గ్రామ కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి. ముస్మెందుగా తనకు వేదిక కావాలన్నాడు. తను మాట్లాడుతానన్నాడు. వీల్లేదన్నాను. ఎవరి మీటింగులో వారే మాట్లాడుతారన్నాను. ఇంకా నలుగురు యువకులు లేచి నిలుచుని కేకలు వేయసాగారు. ఘర్షణకు దిగనున్నారని గ్రహించాను. కొలది రోజులలో ఈ ఊరిలో జరిగే సుందరయ్యగారి సభలో మమ్మల్ని మాట్లాడనిస్తామని అంగీకరిస్తే మీకు ఈరోజు వేదిక ఇస్తామన్నాను. నీవు సుందరయ్య మీటింగులో మాట్లాడేంత తాహతు కలవాడివా అని గద్దించాడు. అయితే ఈ వేదిక మీద మీరు మాట్లాడడానికి వీలులేదు. కావాలంటే ఉపన్యాసం అయిన తర్వాత మీ యిష్టం వచ్చినన్ని ప్రశ్నలు అడగండి అని సమాధానం చెప్పాను. 20, 30 మంది వేదికను సమీపించే నిమిత్తం సభలో ముందుకు వస్తున్నారు. సభలో ఖద్దరు కట్టిన వాళ్లు అరువది ఏళ్ళ వాళ్ళు కన్పించారు. అయితే ఈ సమస్యను గ్రామస్తులకే వదిలివేస్తాను. ఒకరి సభలో మరొకరు మాట్లాడడం మీ గ్రామ సంప్రదాయం అయితే దానిని పాటిద్దాం అన్నాను. ఆ వూళ్ళో ప్రతి గ్రామంలోలాగానే రెండు గ్రామ పార్టీలున్నాయి. పెద్ద గ్రామ పార్టీ వారు కమ్యూనిస్టులలో చేరారు. చిన్న గ్రామ పార్టీవారు కాంగ్రెస్‌లో వున్నారు. కాంగ్రెస్‌లో వున్న వయస్సు మళ్లిన వాళ్లు ఇద్దరు ముగ్గురు లేచారు. చాల్లే ఊరుకోండిరా. ఆయన ఎంత పెద్ద మనిషిలా మాట్లాడుతున్నారు. మీరు ఆగడానికి దిగారు. ఆయన ప్రశ్నలకు సమాధానం చెప్తానన్నాడుగా. చివరకు అడగండి మీ ప్రశ్నలను అని గదమాయించారు. ఏమనుకున్నారో ఏమో కమ్యూనిస్టు యువకులు మౌనంగా వుండిపోయారు. నేను గంట, నరహరి గంట మొత్తం రెండు గంటలు మాట్లాడాం. అపుడు ప్రశ్నలు అడగడం మొదలు పెట్టారు. ఆ ప్రశ్నలకు సందర్భం, వరస వాయిలేవు. రష్యాలోని అక్టోబర్ విప్లవానికి ముందు కేంద్ర కమ్యూనిస్టు కమిటీలో లెనినుకు ట్రాటస్కీకి మధ్య వచ్చిన అభిప్రాయ బేధాలను గురించి కూడా అడిగారు. ప్రశ్నలకూ జవాబులకే రెండు గంటల సమయం పట్టింది. అప్పటికి రాత్రి రెండున్నర గంటలయింది. అలా సభ ఆలస్యంగా ముగియడం ఆ గ్రామస్థులకు అలవాటే. ఇక చాల్లే లేవండిరా అంటూ పె..లివాళ్ళు లేచారు. అందరూ లేచారు. సభ ముగిసింది. కమ్యూనిస్టులకు వారి పనే ప్రధానంగాని నైతిక సూత్రాల పట్టింపు లేదని నాకు మరోసారి అవగతమయి..ది.

అది 1944వ సంవత్సరం. అప్పటికే యుద్ధంలో మిత్ర రాజ్యాల గెలుపు ఖాయమని తేలిపోయింది. స్వరాజ్యం రావడం తథ్యమని ఎలాంటి రూపును భారతదేశం పొందాలని, ఎలాంటి ఆర్థిక విధానం దానికి కావాలని ఆలోచనలు మొదలయినాయి. ఈ అంశాలను ముమ్మందుగా గ్రహించిన వారు రెండు వర్గాలు. ఒకటి భారతీయ పెట్టుబడిదారుల వర్గం. రెండవది ఎం.ఎన్. రాయ్ అనుచరులయిన రాడికల్ డెమోక్రాట్ల సముదాయం. జాతీయవాద నాయకులకు, కమ్యూనిష్టులకు ఆ ఊసే లేదు. ఎం.ఎన్. రాయ్ భారత రాజ్యాంగ నమూనాను తయారు చేయించాడు. అందులో సర్వ సాధారణమయిన పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థను కాక నిర్మాణ ప్రజాస్వామ్య విధానాన్ని సూచించాడు. ప్రజా సంఘాల ద్వారా ప్రజా ప్రతినిధులపై అజమాయిషీ వుండేలాగున ఏర్పాటు చేశాడు. ప్రజా సంఘాలు అభ్యర్థులను ఎంపిక చేయటానికి, ప్రజా ప్రతినిధులను అదుపులో వుంచడానికి, పౌరులకు రాజకీయ ప్రబోధం చెయ్యటానికి వీలుగా వాటి నిర్మాణం వుండాలన్నాడు. అధికారం పిరమిడు లాంటి పద్ధతిలో వుండటం మంచిదని సూచించాడు. పంచాయతీలకు ఇతోధిక అధికారాలు వుండేటట్లు రాజ్యాంగ రచన చేయించాడు. దీనిని ప్రజల ముందు చర్చకు పెట్టాడు రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ మహాసభలో ఆమోదింపచేసి.

భారతదేశ రాజ్యాంగ ముసాయిదా కన్న 'ప్రజల ప్లాను' గొప్పది. దేశ ప్రగతి ప్రణాళికా పరంగా సాగాలని, అదుపు ఆజ్ఞలేని పెట్టుబడిదారీ విధానం పనికిరాదని, అటు పెట్టుబడిదారీ విధానమూ యిటు సోషలిజమూ కాకుండా సహకార ఆర్థిక విధానాన్ని భారతదేశం చేపట్టాలని ఎం.ఎన్. రాయ్ అభిప్రాయం. సర్వశ్రీ వి.యం. తార్కుండే, జి.డి. పరేఖ్, బియన్ బెనర్జీలు ప్రణాళికా రచయితలు. ముమ్మందు వ్యవసాయానికి, చిన్న పరిశ్రమలకు, తర్వాత భారీ పరిశ్రమలకు చోటు పెట్టారు ఆ 'ప్లాను'లో. ఉత్పత్తుల, వినియోగదారుల సమిష్టి సహకార సంఘాలపై నొక్కి పెట్టారు ప్లానులు. భారీ పరిశ్రమలు లేక కీలక పరిశ్రమలు వీటి స్థాయిని నిరసించ లేదు కాని ప్రాధాన్యత ముమ్మందుగా వ్యవసాయానికి, చిన్న స్థాయి పరిశ్రమలకు యిచ్చారు ప్రణాళికా రచయితలు. ఈ ఆలోచనా విధానానికి విరుద్ధంగా భారతీయ పెట్టుబడిదారుల ప్రముఖులు ఒక 'ప్లాను'ను సూచించారు. దీనిని 'భారతదేశ ఆర్థికాభివృద్ధి ప్లాను' అని పిలిచారు. కాని ప్రజలు దానిని 'బొంబాయి ప్లాను' అని 'మాస్టరు ప్లాను' అని పిలవసాగారు. ఈ ప్లాను యెడ హర్షం వెలిబుచ్చారు కమ్యూనిష్టులు వెంటనే. తరువాత కొంత కాలానికి దాని ప్రాతిపదికలను అంగీకరిస్తూనే సవరణలను సూచించారు. పెట్టుబడిదారుల 'ప్లాను'లో భారీ పరిశ్రమలు ఇది ప్రాధాన్యత విషయమయి, ముందు వెనుకల విషయమయి, వారి ఆలోచనా ధోరణే ఈ ఆర్థిక ప్రణాళికే రష్యా ప్రణాళికను అనుసరించింది. ఈ పద్ధతి ప్రణాళిక నిరుద్యోగుల్ని పెంచుతుంది. ఉద్యోగావకాశాలు సన్నగిల్లుతాయి. ప్రజల జీవన ప్రమాణాలు సన్నగిల్లుతాయి. వారికి వినియోగ వస్తువులు అందుబాటులోకి రావు.

కొంత కాలానికి గాంధీవాదులు సైతం 'భారత దేశానికి' 'గాంధీ ప్లాను' తయారు చేశారు. కాంగ్రెసువారు, కమ్యూనిష్టులు ఏ ప్లాను తయారు చేయలేదు. స్వరాజ్యం వచ్చిన తరువాత జవహర్ లాల్ నెహ్రూ తయారు చేయించిన రెండవ ఆర్థిక ప్రణాళిక

రష్యావారి ప్లానుల ననునరించి వుంది. 'మహలనోబిస్' నెహ్రూకు సలహాదారుడు. ఆయనకు రష్యా ప్లాను పద్ధతి యిష్టం.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక దరిమిలా ప్రణాళికలకు సమూనా అయింది. దాంతో నిరుద్యోగం పెరిగింది. ద్రవ్యోల్బణం హెచ్చింది. వేల కోట్ల రూపాయలు కీలక పరిశ్రమలలో ఇరుక్కొని పోయాయి. దేశ ఆర్థిక పురోగతి అస్తవ్యస్తమయింది. దేశ ప్రజల ధనం. శ్రమ దుర్వినియోగం అయ్యాయి. ఎం.ఎన్. రాయ్ తయారు చేసిన 'ప్రజల ప్లాను' విధానాన్ని ఆమోదించి అమలు చేసి వున్నట్లయితే ఈ విపత్కర పరిణామాలు సంభవించేవి కావు. కవులుదారీ చట్టాలు రూపొందించి, దేశ వ్యవసాయ దారులకు భద్రత కలిగించి, వ్యవసాయ ఉత్పత్తిని పెంచి, దాని మూలంగా వచ్చే ధనాన్ని పరిశ్రమలకు పెట్టినట్టే దేశ భవిష్యత్తు మరో రకంగా వుండేది. ముందుచూపు కాంగ్రెసువారి సొత్తు కాదు కదా! పెట్టుబడిదారులు వారి లాభాలను వారు ఆశించారు. దేశ ప్రజల బాగోగులకన్నా బ్రహ్మాండమయిన 'దేశ' ఔన్నత్యాన్ని కాంగ్రెసు ఆదేశించింది. 'దేశం అంటే మనుషులేనోయ్' అన్న గురజాడ సూక్తిని మరచిపోయి అలా ప్రవర్తించింది. దానివల్ల దేశ ప్రజలు నష్టపడ్డ విషయం ఇప్పుడు అంటే స్వరాజ్యం వచ్చిన సుమారు **40** ఏళ్ళకు తెలుసుకున్నాం. 'చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నట్లుంది' మన పరిస్థితి.

# కలకత్తా రాడికల్ మహాసభ

1944లో కలకత్తా రాడికల్ డెమొక్రటిక్ పార్టీ మహా సభకు ప్రతినిధిగా వెళ్ళాను. ఆంధ్ర ప్రాంతం నుండి సుమారు 20 మందికి పైగా ప్రతినిధులుగా వచ్చారు. పార్టీ కేంద్ర కమిటీ ప్రవేశ పెట్టిన రాజకీయ తీర్మానం చర్చకు వచ్చింది. మొదటి వాక్యం ప్రజాస్వామ్యం ముందడుగు వేస్తున్నది అనేది. ఎం.ఎన్. రాయ్ సభకు అధ్యక్షత వహిస్తున్నాడు. 'నాది ఒక సవరణ వుంది' అన్నాను. మీ సవరణను మరెవ్వరయినా బలపరుస్తున్నారా అని అధ్యక్షుడు ప్రశ్నించాడు. ఒక్కరూ లేచి నిలబడలేదు. మర్యాద కోసమయినా తెలుగువారు కూడా నాకు వత్తాసు రాలేదు. అభిప్రాయాల బలాబలాలు సంఖ్యను బట్టి వుండరాదని కదా మన పార్టీ సూత్రం అని రాయ్ ఎపుడో చెప్పిన మాటను ఉటంకించాను. 'మాట వరుసకు అన్నాను. సెకండరు అక్కరలేదు. ఇంతకూ మీ సవరణ ఏమిటో చెప్పండి అన్నాడు. చర్చిలు, రూజ్ వెల్టుల ప్రత్యాఘాతక (రియాక్షనరీ) పాత్రను అధిగమించి ప్రజాస్వామ్యం ముందడుగు వేస్తున్నది అని వుండాలి అని దృఢంగా పల్కాను. సరే మీకు మాట్లాడడానికి ఎంత కాల వ్యవధి కావాలి? తెలియజేయండన్నాడు. పది నిముషాలు చాలునన్నాను. వేదిక ఎక్కాను. నా దృక్పథాన్ని విశదీకరించాను. తర్వాత ఎం.ఎన్. రాయ్ నా సవరణ ఎందుకు అవసరం కాదో, ఎందుకు అభిలషణీయం కాదో ఏబది నిమిషాలు మాట్లాడాడు. నాకున్న అభిప్రాయం లాంటివే తదితరులకు వుండవచ్చునని, వారు ఏ కారణం వల్లనయినో వ్యక్తం చేయడం లేదని ఆయన అభిప్రాయి పడ్డారేమో! కామ్రేడ్ రామమూర్తికి నా విశదీకరణ నచ్చితే ఆయన తన సవరణను ఉపసంహరించవచ్చు అని ప్రకటించాడు. నా అభిప్రాయం మార్చుకోలేదు అని జవాబు ఇచ్చాను. సవరణను వోటింగుకు పెట్టాడు. సవరణకు అనుకూలంగా నాదొక్కటే వోటు.

మూడు వేలమంది ప్రతినిధులలో ఏ ఒక్కరూ నన్ను బలపరచలేదు. సవరణ వీగిపోయింది. ఇంతకూ ఈ సంఘటనను ఎందుకు ఉటంకించినట్లు? ఎం.ఎన్. రాయ్ ప్రజాస్వామ్య మనస్తత్వాన్ని, దృక్పథాన్ని, భావాన్ని ఇది రుజువు చేస్తుంది. అంతేకాదు స్వీయ భావాత్మకం, బాహ్యస్థితిగతుల ననుసరించి ఆలోచన (వస్తునిష్ట. ఈ రెంటి తేడాను తన ఉపన్యాసంలో రాయ్ వివరించాడు. ఒక వ్యక్తి చేసిన చర్యను మదింపు వేసేటప్పుడు ఆ వ్యక్తి మనోభావాలు, ఉద్దేశ్యాలు, ఆలోచనలు వీటిని బట్టి కాక ఆ చర్య ఫలితాలను బట్టి ఆ చర్య మంచిదా లేక చెడ్డదా అని ఆలోచించాలి. చర్చిల్, రూజ్‌వెల్టులు సామ్రాజ్యవాదులే. అందులో చర్చిల్ మరీ కరుడు గట్టిన సామ్రాజ్యవాది. కాదనేది లేదు. అయితే వారి చర్యలు ప్రజాస్వామ్యం ముందడుగు వేయడానికి దోహదం చేసాయా లేక ప్రజాస్వామ్య తిరోగమనానికి బాటలు వేసింవా అనేది ముఖ్యం. మనం మన స్వంత భావాలను బట్టి, ఇష్టాయిష్టాలను బట్టి ఆ చర్యలను మదింపు వేయడం అసమంజసం. ఇదీ రాయ్ ప్రవచించిన భావ సరళి. ఈ విశ్లేషణా విధానాన్నే మేము – రాడికల్సుము – ఆయన వద్ద నేర్చుకున్నది. ఉదాహరణకు కుటుంబ నియంత్రణ అనే సమస్యను తీసుకుందాము. అనేక మంది, అనేక వర్గాల వారు, అనేక దేశాలవారు – ముఖ్యంగా పారిశ్రామికంగా

ముందడుగు వేసిన దేశాలవారు – ఇది అవసరమని తృతీయ ప్రపంచ ప్రజలకు చెప్తున్నారు. జనాభా అత్యధికంగా వున్న అభివృద్ధి అవుతున్న దేశాలు ఈ సమస్యను వస్తు నిష్ఠతో చూడాలి. దీనిని ప్రతిపాదించిన వారు ఏ ప్రయోజనాలను ఆశిస్తున్నారు వారి ఉద్దేశ్యాలు ఏమిటి అనే ఆలోచన మీద ఆధారపడి మన వైఖరిని నిర్ణయించు కోవడం పొరపాటు. అది భారత ప్రజలకు మేలు చేస్తుందని తలిస్తే మనం దానిని అమలు పరచాలి. ఇదీ వస్తు నిష్ఠతో సమస్యను పరిశీలించడమంటే. మార్క్సిజం ఉన్నతోన్నతమయిన తత్వమని చెప్పేవారు. తమను మార్క్సిస్టులని పిలుచుకునే వారు చాలామంది ఈ విశ్లేషణా విధానాన్ని అనుసరించడం లేదు. పైకి మార్క్సిజం స్వీయాత్మక భావనను నిరసిస్తుంది అంటారు. ఆచరణలో వారూ - . - అదే స్వీయాత్మక భావనను ప్రదర్శిస్తారు. ఇది ఈనాటి ద్వంద్వ నీతి. ఆ మాటకు వస్తే ఒక్క మార్క్సిస్టులలోనే ఈ లక్షణం కనపడుతున్నదని అనుకోవడం తప్పు. ఈ పొరపాటు దృక్పధాన్ని ఇదితరులలో చాలామంది ఆమోదిస్తున్నారు. 'సరిగా ఆలోచించడమనేది' అభ్యాసవశాత్వంట బట్టించుకోవలసిన గుణం.

# రాడికల్ రోజుల్లో రగడలు

**1942** నుంచి సోషలిస్టు, కమ్యూనిస్టు రాడికల్ వర్గాల మధ్య వైషమ్యాలు, తగాదాలు, సంఘర్షణలు, కొట్లాటలు పెచ్చుపెరిగాయి. మూడు తెగలవారూ బొంబాయి లాంటి కార్మిక కేంద్రాలలో ఘర్షణ పడేవారు. కార్మికుల విశ్వాసాన్ని చూరగొనాలనే ప్రయత్నంలో అవి మొదలయినాయి. ప్రతి దినం బొంబాయిలో ఏదో ఒక మూల ఈ మూడు రాజకీయ గ్రూపులు హాకీ 'బ్యాట్ల'తో, కర్రలతో కొట్టుకునేవారు. అవి రాను రాను సంఖ్యాపరంగా పెరుగుతున్నాయే కాని తరగటం లేదు.

ఎం.ఎన్. రాయ్ యుద్ధ యత్నాలకు సహాయం చేయతలచిన అన్ని కార్మిక సంఘాలలో 'ఇండియన్' ఫెడరేషన్ ఆఫ్ లేబర్ పేరుతో అఖిల భారత కార్మిక సంస్థను నిర్మిస్తే దాని మహాసభ 1944లో బీహారులోని ఝూరియాలో జరిగింది. అది బొగ్గు గనుల ప్రాంతం. దానికి గుంటూరులో కార్మికోద్యమంలో పనిచేస్తున్న నేనూ ప్రతినిధిగా వెళ్ళాను. అక్కడ జరిగిన ఒక సంఘటన ఇప్పటికి నా స్మృతి పథంలో మెదుల్తున్నది. మహాసభ చివరి రోజున కార్మికుల బహిరంగ సభ జరిగింది. ఆ సభను ప్రశాంతంగా జరుపు కోవటానికి చురుకైన ప్రతినిధులను జన సమూహంలో అచ్చటచ్చట వుండమన్నారు సభ 'ఆర్గనైజర్లు'. అలాగే నేనూ,- కర్నాటక రాడికల్ నాయకుడు ఎం.ఆర్. షెట్టి ఒకచోట నుంచున్నాం. అక్కడ కార్మిక వర్గానికి చెందని మధ్య తరగతి మనుష్యులు అశాంతిలో కదులుతున్నారు. ఏదో అవాంఛనీయ పరిస్థితి ఉదయించ పోతున్నదని గ్రహించాం. ముందుగా జమ్నాదాసు మెహతా, ఎం.టి. ఖానులాంటి కార్మిక నాయకులు ఉపన్యసించారు. చివరగా ఎం.ఎన్. రాయ్ లేచాడు. 30 వేలమంది కూడిన సభను కలియచూచాడు. ఉత్తేజ స్వరంతో ప్రసంగాన్ని ప్రారంభించాడు. వెంటనే సభలో నుంచి అనేక ప్రదేశాల నుంచి ఒకే రకపు నినాదం వెలువడింది. అదే 'ఎం.ఎన్. రాయ్ ముర్దాబాద్'. ఎం.ఎన్. రాయ్ పతనాన్ని కోరుతూ యిచ్చే ఆ కేకలు వినటం ఎం.ఆర్. షెట్టి తన చేతి కర్రతో మా వద్దనున్న ఆందోళనకారుని మోదటం క్షణంలో జరిగింది. అదే సమయంలో ఒక వందమంది విచ్చిన్నకారులు నేలకూలారు. సభలో గందరగోళం జరుగుతుందనే భయంతో పదివేల మంది సభను విడిచి వెళ్ళిపోయారు. 'ఇదంతా కమ్యూనిస్టుల కుట్ర' అని షెట్టి పలికాడు. తన దెబ్బతిన్న వ్యక్తి కోసం వెతికాడు. అతడు లేడు. 'తన పని నెగ్గించుకొని తప్పుకున్నారు కమ్యూనిస్టులు' అని వ్యాఖ్యానించాడు షెట్టి. కొట్లాటను దగ్గరగా వుండి చూడటం నా జీవితంలో అదే మొదటిసారి.

ఝూరియాలో కార్మిక మహాసభను పూర్తిచేసుకొని కలకత్తాలో జరిగే రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ మహాసభకు చేరాం. ఆ మహాసభ మొదటి రోజు ఉదయాన ప్రవేశ పత్రాలు లేకుండా మహాసభ 'పెండాలు'లోకి జొరబడపోతున్న వందమంది సుభాష్ చంద్రబోస్ అనుయాయులను అడ్డగించారు. ద్వారపాలకులుగా వున్న బెంగాల్ మిత్రులు. అక్కడే రాష్ట్ర ప్రభుత్వపు పోలీసులు 150 మంది దాకా వున్నారు. సభా నిర్వహణ బాధ్యత వహించిన వారు వచ్చి అచ్చట వున్న ఉన్నతోన్నత పోలీసు అధికారితో మాట్లాడారు. అక్రమ ప్రవేశకులను నిరోధించమన్నారు. ఆ

పోలీసు ఆఫీసరు జవాబు విచిత్రంగా వుంది. 'మిమ్మల్ని చూస్తూ వుండమని మాత్రమే రాష్ట్ర ప్రభుత్వ ఆదేశం'. ఇవి ఆయన మాటలు. 'అయితే మేం మీద మిమ్మల్నే ఆధారపడమంటారా' అని ఆహ్వాన సంఘ పెద్ద ప్రశ్న. 'మీ యిష్టం' అని క్లుప్తమయిన సమాధానం వచ్చింది. మా వాళ్లు ఒక రెండు నిమిషాలు ఆలోచించారు. బొంబాయి రాష్ట్రానికి చెందిన కామ్రేడ్స్‌ను పిలిచారు. వారికి నాయకుడు వ్యాపార నౌకల కార్మిక సంఘనేత శ్రీ మంగళ్. అతని మిత్రులు కార్యరంగంలోకి దిగారు. వారి చేతిలో 2 అడుగుల రూళ్ల కర్రల లాంటివి మాత్రమే ఉన్నాయి. వారు కదలడం అక్రమ ఆందోళనకు దిగిన ఫార్వర్డ్ బ్లాకు బెంగాలీలు మట్టికరవటం అర నిమిషంలో జరిగిపోయింది. ఇదంతా చూస్తూ శిలా ప్రతిమల్లా నుంచొని ఉన్నారు పోలీసులు. ఈ గందరగోళాన్ని తదితర ప్రతినిధులకు తెలియకుండా ఆహ్వాన సంఘ వలంటీర్లు ఈ ప్రదేశానికి మహాసభకు అడ్డుగోడగా వున్నారు.

ఈ పని బెంగాల్ కామ్రేడ్స్ చేయలేక కాదు. అలా జరిగితే వారిని ఆందోళనకారులు గుర్తు పట్టడం, తరువాత హత్యలు సంభవించడం తప్పనిసరి అని 'కాగల కార్యం' మరాఠీ కామ్రేడ్స్ చేత చేయించారు. మరునాడు జాతీయ పత్రికలు 'ప్రజలపై రాడికలు వాదుల దాడి' అనే శీర్షికల క్రింద యీ వార్తను ప్రకటించాయి. నివ్వెరపోయాం. మహాసభ రోజు రాత్రివేళ షామియానాలో ఉపన్యాసాలు సాగుతున్నాయి. మహాసభలో మూడు వేలమంది ప్రతినిధులు, ఆరువేలమంది అభిమానులయిన ప్రేక్షకులు వున్నారు. అకస్మాత్తుగా షామియానా మధ్య భాగంలో మంటలు లేచాయి. వెన్వెంటనే అక్కడి వారిని మరో చోటికి కదిలించి నల్గురు వలంటీర్లు నాలుగు స్తంభాలను ఎక్కి షామియానా నాల్గు మూలలా కత్తిరించి మంటలు షామియానా మొత్తాన్ని నాశనం చేయకుండా కాపాడారు. ఎవరో షామియానాపై ఆసిడ్ బల్బు వేశారు. 'మన పార్టీని, మన ఉద్యమాన్ని మనమే రక్షించుకోవాలి' అని పిలుపునిచ్చాడు ఎం.ఎన్. రాయ్. ఆ రోజుకు మహాసభ ముగిసింది. రాత్రి పది గంటలకు ఇతర రాష్ట్రాల ప్రతినిధుల నుండి ఒక వందమంది వలంటీర్లు కావాలని, వారు సభా ప్రాంగణంలో సమావేశం కావాలని మైకులో చెప్పారు. వలంటీర్లు జమ అయినారు. నేనూ వలంటీరుగా ముందుకు వచ్చాను. మంగళ్ నన్ను చూచాడు. 'కామ్రేడ్ నీవు రాష్ట్ర నాయకత్వంలో వున్నావు కదా, ఇది నీ పని కాదు' అన్నాడు మంగళ్. నీ క్రమశిక్షణను, కార్యదక్షతను గురించి విన్నాను. స్వయంగా చూడాలని తహతహ పడ్తున్నాను. నన్ను ఆపవద్దు' అని ప్రాధేయపడ్డారు. అతడు అంగీకరించాడు. వలంటీర్లను 3 విభాగాలు చేశారు. ఒక్కొక్క విభాగం వారు రెండు గంటలు డ్యూటీ చేయాలి. అవి డిసెంబరు రోజులు. వీధి స్తంభాల దీపాలు ఒక గజం మేర వృత్త ప్రదేశానికి మాత్రమే వెలుగునిచ్చేవి. మాకు వంద అడుగుల దూరంలో చేతి బ్యాటరీ లైట్లు కదులుతున్నాయి. అవకాశం చూచి బాంబులు వేయటానికి సిద్ధంగా వున్నారు ప్రత్యర్థులు. అలా రక్షించుకున్నాం మా మహాసభను.

ఆంధ్ర రాష్ట్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ మహాసభ కాకినాడలో జరిగింది. పార్టీ భారత కార్యదర్శులలో ఒకరైన శ్రీ కె.కె. సిన్హా మహాసభను ప్రారంభించారు. ఆ సందర్భంగా బహిరంగ సభ జరిగింది. ముప్పది మంది విప్లవకారులు సభను

భగ్నం చేయ ప్రయత్నించారు. వారు 'అదే పనిగా అడ్డు ప్రశ్నలు చేస్తున్నారు. వలంటీర్లు వారిని అదుపు చేయలేక పోతున్నారు. వారిని సభానంతరం ప్రశ్నలు వేయుమని, వాటినన్నింటికి తప్పక సమాధానాలు యిప్పిస్తానని వారిని కోరాను వారు నా మాటలను పెడచెవిన పెట్టారు. గోల సాగించారు. గత్యంతరం లేక వారిపై బల ప్రయోగం చెయ్యమని వలంటీర్లను అభ్యర్థించాను వారు కర్రలతో గొడవ చేసేవారిని సమీపించారు. సభ జరుగుతున్న పార్కుకు ఎదురుగా ఇంట్లో కాపురముంటున్న సర్కిలు ఇన్‌స్పెక్టరు వచ్చాడు. ఆయన రాక చూచి కర్రలు దింపమన్నాను వలంటీర్లను. ఆయన వచ్చి 'ఏం జరుగుతున్నదని' నన్ను అడిగాడు. ఏవో అడ్డు ప్రశ్నలు వేస్తున్నారని ఆయనను చెప్పాను. ఆయన వెళ్ళి వాళ్ల వద్ద నిలుచున్నాడు. వారి గోల ఆగిపోయింది.

# 1946 అసెంబ్లీ ఎన్నికలు

గాంధీ వాదానికి ప్రత్యామ్నాయంగా మరో పంథాను 1919 నుండి ఎం.ఎన్. రాయ్ సూచించడం సర్వజన విదితం. కాంగ్రెస్‌లో రాడికల్ కాంగ్రెసువాదిగా పని చేసిన తీరు, రాడికల్ డెమోక్రాట్‌గా పార్టీని నడిపిన పద్ధతి దీనికి నిదర్శనాలు. అందుకే కాంగ్రెస్ అధ్యక్ష పదవికి 1940లో మౌలానా అజాద్‌తో పోటీ చేశాడు. తను ఓడిపోతానని తెలుసు. అయినా సిద్ధాంతం కోసం పోటీకి దిగాడు. భారత దేశానికి స్వాతంత్ర్యం తప్పనిసరిగా వస్తుందని తెలిసి రాజ్యాంగం ఇలా వుండాలని, ఆర్థిక ప్రణాళిక ఇలా సాగాలని ముమ్మందుగా ఊహించి, వాటిని రూపొందించి, వాటిని గురించి ప్రచారం చేసిన ఎం.ఎన్. రాయ్ 1946 అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేయడంలో ఆశ్చర్యం లేదు. కాంగ్రెస్‌కు ప్రజాదరణ వుందని తెలుసు. తన రాడికల్ పార్టీకి కాంగ్రెస్‌పై నెగ్గే అవకాశాలు లేవని ఆయన గ్రహించక పోలేదు. అయినా ఎన్నికల సమయం భావ ప్రచారానికి వీలని తలచి ఎన్నికల బరిలోకి తన రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని దించాడు. తన పార్టీ దేశవ్యాప్త అసెంబ్లీ ఎన్నికల్లో ఘోరంగా ఓడిపోయింది. మార్క్సిజం పట్ల తనకు అనుమానాలు మెండయినాయి. అప్పటిదాకా తామే శిసలయిన కమ్యూనిస్టులమని రాడికల్ డెమోక్రాట్లు తలిచేవారు. సంప్రదాయ కమ్యూనిస్టులు దారి తప్పిన ప్రయాణీకులు అని ఆయన భావించేవాడు. మార్క్సిజాన్ని వదిలి హ్యూమనిజాన్ని స్వీకరించాడు. ఇదంతా అతని ఓటమి ఫలితం అని ప్రత్యర్థులు ప్రచారం చేశారు. ఇంతకన్నా ఘోరమయిన పొరపాటు మరొకటి లేదు.

ఆంధ్ర ప్రాంతంలో రాడికల్ పార్టీకి కొన్ని ప్రాంతాలలో మాత్రమే సభ్యులుండేవారు. విజయ నగరం, విశాఖ పట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు (ప్రకాశం జిల్లా ఏర్పడక ముందు గుంటూరు) జిల్లాలో పార్టీ యూనిట్లు వుండేవి. ఆనాడు ప్రధాన కార్యదర్శి శ్రీ జి. ఎన్.హరి నన్ను గుంటూరు – తెనాలి పట్టణాల అసెంబ్లీ సీటుకు పోటీ చేయమన్నాడు. నేను ససేమిరా కాదన్నాను. అయితే పార్టీ నిధికి రెండు వేల రూపాయలిమ్మన్నారు. అంగీకరించాను. ఇచ్చాను. ఎనిమిది స్థానాల్లో పార్టీ అభ్యర్థులను నిలిపాం. అసెంబ్లీ అభ్యర్థుల నుండి విరాళాలు కోరకుండా వారిని తమ ఎన్నికల ఖర్చులను భరించమన్నాం. 18వేల రూపాయలు వసూలు అయినవి. ఎంతో సారస్వతాన్ని ప్రచురించాం. 10 కరపత్రాలను రాష్ట్ర కార్యాలయం వేసింది. గుంటూరు, నెల్లూరు జిల్లాలో ఒక దళిత (మాదిగ) కులానికి చెందిన వందనం గారిని, కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాలో (దళిత) (మాల) కులానికి చెందిన పి. సత్యానందం గారిని పార్టీ అభ్యర్థులుగా క్రైస్తవులకు ప్రత్యేకంగా రిజర్వు చేసిన సీట్లకు పోటీ చేయించాం. సుమారు 242 ఓట్లతో వందనం గారు 'మాల' కులానికి చెందిన అరుణ రాఘవులు(కాంగ్రెస్) సత్యానందం గారు మాదిగ కులానికి చెందిన కమ్యూనిస్టు అభ్యర్థి విల్సన్ చేతిలో సుమారు 290 ఓట్లతో ఓడిపోయారు. మా అభ్యర్థులు ఎన్నికలకు ముందు రాడికల్ డెమోక్రాట్‌లు కాదు. వారికి పార్టీ తీర్థం ఇచ్చాం. వారికి పార్టీ పేరు అవసరం. మాకు అభ్యర్థి అవసరం. ఇది మా ప్రధాన కార్యదర్శి నరహరి ఆలోచన. ఈ

అపజయానికి ఆయన చింతించాడు. వారు అపజయం పాలయితే నేను సంతోషించాను. [illegible] అభ్యర్థులు గెలిస్తే వారు కాంగ్రెస్‌లో చేర్తారని నా భయం. ఏదయినా ఆ బెడద తీరిపోయింది.

ఇలా ఎన్నికల కోసం క్రొత్త వారిని అభ్యర్థులుగా మా పార్టీ ఒక్కటే నిలబెట్టలేదు. కమ్యూనిస్టులూ ఆ ఘనకార్యం చేశారు. విల్సన్ బెనారెస్‌లో లా కాలేజ్‌లో నా క్లాస్‌మేట్. అప్పుడు అతడు కమ్యూనిస్టు వ్యతిరేకి. అలాంటి వానిని ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ స్వతంత్ర అభ్యర్థిగా బలపరిచింది. కేవలం కులం ప్రాతిపదికపై అతనిని ఎంపిక చేశారు కమ్యూనిస్టులు. శాయశక్తులా కృషి చేశారు. గెలిపించుకున్నారు. తరువాతి చరిత్ర చెప్పడం అత్యవసరం. దాని నుండి గుణపాఠాలు తెలుసుకోవలసి వుంది. మద్రాస్ ప్రెసిడెన్సీలో ఇరువురు కమ్యూనిస్టులు సర్వశ్రీ పిల్లల మర్రి వెంకటేశ్వర్లు, ఆనంద నంబియారు కార్మిక నియోజక వర్గాల నుండి గెలిచారు. అయిదుగురు అసెంబ్లీ మెంబర్లు వుంటే రాజ్యాంగ నిర్ణయ సభకు ఒకరిని సభ్యునిగా ఎన్నుకోవచ్చు. కాంగ్రెస్ అభ్యర్థులుగా గెలిచిన ఇరువురు కాంగ్రెస్ వారు సుందరయ్యగారికి లోపాయికారిగా వోటేస్తామన్నారట. నాలుగు వోట్లు వున్నాయి. ఇంకొక్క వోటు కావాలి. తాము బలపరచి గెలిపించుకున్న విల్సన్ తమకు వోటివ్వక పోతా[illegible]ని తలిచారు కమ్యూనిస్టులు. ఈ విషయం పసిగట్టారు కాంగ్రెస్ వారు. శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు శ్రీ ప్రకాశం పంతులు గారిని కమ్యూనిస్టుల పథకాన్ని భగ్నం చేయమన్నారట. వెంటనే రాజ్యాంగ నిర్ణయ సభకు నిన్నే ఎన్నిక చేస్తాం అని పంతులు గారు సందేశం పంపారట. సుందరయ్యగారి కోసం విల్సన్‌ను వోటిమ్మని కమ్యూనిస్టులు ప్రాధేయపడితే నేనయితే నేం, సుందరయ్యగారు అయితేనేం? ఇరువురమూ కామ్రేడ్లమేగా. నన్నే ఉండమంటున్నారు నా మనుషులు అన్నాడట విల్సన్. అతడు రాజ్యాంగ నిర్ణయ సభ్యుడయ్యాడు కాంగ్రెస్ చలవ వల్ల. భారత దేశంలో ఒక్క కమ్యూనిస్టును కూడా రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యునిగా రాకుండా చేసిన ఘనత శ్రీ ప్రకాశం పంతులుగారికి దక్కింది. ఎత్తుగడల పేరుతో చాణక్యరాజనీతిని వాడి దెబ్బతిన్నారు రాడికల్ డెమోక్రాట్‌లు, కమ్యూనిస్టులు. రాడికల్ వాదులు తమ అభ్యర్థులను గెలిపించుకోలేక పోయారు. కమ్యూనిస్టులు తమ అభ్యర్థిని విజయుణ్ణి చేసి విఫలులయినారు. తేడా అంతే. అయినా అప్పటికి వారిరువురూ మార్క్సిస్టులే కదా? వారి నీతి ఫలితం ఇది.

# 1946ఎన్నికల సంఘటనలు

ఎన్నికల్లో అనేక వింతలు సంభవిస్తాయి. సంఘటనలు జరుగుతాయి. ఇపుడు జ్ఞాపకం చేసుకుంటే తమాషాగా వుంటుంది. బాపట్ల ఒంగోలు తాలూకాలు కలిపి ఒక అసెంబ్లీ సీటు. కాంగ్రెస్, కమ్యూనిస్టు, రాడికల్ మూడు పార్టీలే ఆ సీటుకు పోటీ చేశాయి. సుప్రసిద్ధ కాంగ్రెస్ యువ నాయకుడు శ్రీ మంతెన వెంకట్రాజు కాంగ్రెస్ అభ్యర్థి. కమ్యూనిస్టు అభ్యర్థి శ్రీ కొల్లా వెంకయ్య ఆ నాటికి జిల్లా నాయకుడు. శ్రీ రావిపూడి వెంకటాద్రి రాడికల్ పార్టీ అభ్యర్థి. అభ్యర్థులందరూ బాపట్ల తాలూకా వారే. కాంగ్రెసు అభ్యర్థి శ్రీ మంతెన వెంకట్రాజు గెలిచాడు. అక్షరాస్యులకే ఓటు. విజయుడైన రాజుగారికి 39 వేల పైచిలుకు ఓట్లు వచ్చాయి. కమూన్యినిస్టు అభ్యర్థి 11 వేల చిల్లర ఓట్లు 'పోలు' చేశాడు. రాడికల్ అభ్యర్థికి సుమారు 16 వందల ఓట్లు పడ్డాయి.

గుంటూరు - తెనాలి సీటుకు పోటీ చేయుటానికి యిష్టపడని నన్ను బాపట్ల - ఒంగోలు తాలూకా నియోజక వర్గంలో రాడికల్ పార్టీ ప్రచారం చెయ్యమని పార్టీ నన్ను ఆదేశించింది. అందుకు అంగీకరించి కార్యక్రమంలోకి దిగాను. నాగండ్ల నివాసి, త్రిపురనేని కవిరాజు బ్రాహ్మణేతర ఉద్యమంలో పెరిగి ఎం.ఎన్. రాయ్ ఉద్యమంలో చేరిన శ్రీ రావిపూడి వెంకటాద్రి (ఇపుడు హేతువాద ఉద్యమ నాయకుడు) రాడికల్ పార్టీ అభ్యర్థి. అద్దె కారులో మైకు ఏర్పరచుకొని అభ్యర్థి. నినాదాలిచ్చే యువకుడు, నేను, నియోజక వర్గం మొత్తం పర్యటించాం. గ్రామాలలో అప్పటికప్పుడు మామూలు గ్రామ కేంద్రాలలో ఉపన్యాసాలిచ్చాం. కొన్ని గ్రామాలలో మాకు ఎదురయిన సన్నివేశాలు గుర్తుకు వస్తున్నాయి.

అది ఉప్పు కొండూరు గ్రామం. ఊరి 'సెంటరులో'నే కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల ఎన్నికల కార్యాలయాలు వున్నాయి. అక్కడ మా కారు ఆపాం. ముందుగా కాంగ్రెసును దుయ్యబడుతూ మాట్లాడాను. కమూన్యినిస్టులు చప్పట్లు కొట్టారు. తరువాత కమ్యూనిస్టు పార్టీని విమర్శించాను. కాంగ్రెసువారు హర్షం వెలిబుచ్చారు. రాడికల్ పార్టీ ప్రాశస్త్యాన్ని ఉగ్గడించాను. ఇరు పార్టీల సభ్యులు, అభిమానుల ముఖాలు జేవురించాయి. వారిలో గుసగుసలు మొదలయినయి. కీడు శంకించింది నా మనస్సు. వీలయినంత త్వరగా ఉపన్యాసం ముగించాను. కొందరు శ్రోతలు మా వద్దకు వచ్చి 'చీకటి పడ్డది ఈ రోజు రాత్రికి మా ఊళ్ళో ఉండమని' కోరారు. ఆ గ్రామంలో మా అభిమానులు ఒక్కరూ లేరు. అక్కడ మకాం వేస్తే ఆ రాత్రి మమ్ములను ఏం చేస్తారో అని భయపడి, మరో గ్రామంలో కార్యక్రమం వుందని సెలవు తీసుకున్నాం.

చీమకుర్తి గ్రామం చేరాం. ఇపుడు గ్రనైట్ రాళ్లు దొరుకుతున్న ప్రదేశం. అక్కడ 4 వీధుల కూడలిలో కారు ఆపి ఉపన్యాసం మొదలు పెట్టాను. ఆ ఊరిలో వైశ్యుల ప్రాబల్యం వుంది. కమ్యూనిస్టు గ్రామ కమిటీ లేదు. వారి జెండాలు కనపడలేదు. అంతా కాంగ్రెసు జెండాలమయం. కాంగ్రెసును గురించి గట్టిగా నాలుగు మాటలు అన్నానో లేదో ఏబదిమంది చేతుల్లో రాళ్ళు తీసుకొని మా మీద విసరటానికి సిద్ధంగా వున్నారు. ఆ గ్రామంలో కాంగ్రెసును పల్లెత్తుమాట అనరాదట.

మహో పార్టీవారు కనిపించ రాదట. అపహాసం మూర్తీభవించింది అప్పుట. చేసేది లేక అరగంట సేపు మాట్లాడతామనుకున్న నేను 10 నిమిషాల్లో ఉపన్యాసం ముగించాను. కారును కదిలించమన్నాను. కారు కదిలిందో లేదో వెన్వెంట రాళ్లు విసిరేశారు మామీద కాంగ్రెసు యువకులు. సర్వ సామాన్యంగా వైశ్య కులస్థులకు భయం ఎక్కువ అంటారు. ఈ ఊరి పరిస్థితి వేరుగా కన్పించింది. ఆశ్చర్యంతో ఆ వూరు వదిలాను.

ఆచార్య రంగాగారి అనుచరుడు శ్రీ పుల్లెల రత్తయ్య ఇదుపుల పాడు నివాసి. మనకు వ్యతిరేకి అయినా తెలిసిన వ్యక్తి ఉన్నాడు కదా అనే ధైర్యంతో ఆ గ్రామంలో ప్రవేశించాను. ముందుగా కమ్యూనిష్టు పార్టీని ఏకివేశాను. తరువాత కాంగ్రెసు సంగతి ఎత్తాను. చేతుల్లో రాళ్ళు పట్టుకొని మామీద వాటిని విసిరేయటానికి సిద్ధంగా వున్నారు. మా కారు క్లీనరు కుర్రవాడికి తమ కారు దెబ్బతింటుందని భయం ఆవరించింది. కారు దిగి చేతిలో కారు హేండిలు పట్టుకొని 'రాండ్రా! రాళ్ళు వేశావో మీలో ఎవరో ఒకరు నా చేతిలో చచ్చారన్నమాటే' అన్నాడు. అతని ఉద్రేకం చూసి నేను కలవరపడ్డాను. ఏమి ఘోరం జరుగుతుందోనని ఆందోళన చెందాను. 'ఎందుకోయి అంత తొందర పడుతావ్! అహింసావాది పుల్లెల రత్తయ్యగారి వూరు ఇది' అన్నాను. రత్తయ్య పేరు వినగానే కాస్త వెనుకంజ వేశారు యువకులు. కారును పోనిమ్మని డ్రైవరుతో చెప్పాను. కారు ఫర్లాంగు దూరం వెళ్లింది. చూస్తే కారులో క్లీనరు లేడు. అతనికేం ప్రమాదం సంభవించిందోనని తల్లడిల్లాను. కారు ఆపాము. నింపాదిగా మా వైపు నడచి వస్తున్నాడు క్లీనరు. అతని వంటిమీద దెబ్బలు లేవు. అతడు సురక్షితంగా వున్నందుకు 'హమ్మయ్యా' అని నిట్టూర్పు విడిచాను.

ఒంగోలు పట్టణానికి 5 మైళ్ళ దూరాన కారుమంచి గ్రామం ఉంది. రైతాంగంలో అత్యధిక సంఖ్యవారు కాంగ్రెసు మనుషులు. గ్రామం చౌరస్తాలో నా ప్రసంగం ప్రారంభించాను. జనం బాగానే గుమిగూడారు. కాని వారి ముఖాలలో అసంతృప్తి, ద్వేషం తొణికిస లాడుతున్నాయి. అంతకుముందే ఆ గ్రామస్థులు దౌర్జన్యపరులనే పేరు వుంది. అది ఎందుకు వచ్చిందో నాకు తెలియదు. మాకు ముప్పు కల్గుతుందనే అభిప్రాయం కలిగింది. గ్రామాన్ని ఆనుకునే మాదిగపల్లె వుంది. సరిహద్దు రోడ్డు దాటాను. ఒక 'లౌడ్ స్పీకరు' గ్రామం వైపు త్రిప్పించాను. మరోటి పల్లెవైపు వుంది. ఉపన్యాసం మొదట్లోనే గోరావందనం గారికి జై' అన్నాము. 'గాలి వందనం గారికే మీ వోటు' అన్నాము. పల్లెల్లోని వారి మొగాలలో ప్రసన్న భావం పొడసూపింది. ఉపన్యాసం ధారాళంగా సాగుతున్నది. గంట మాట్లాడాను. మీటింగు వోటు మాకు అనుకూలయినది కదా! కాంగ్రెసు పార్టీని తూర్పారపట్టాను. రోడ్డు అవతల నుంచొని చాలామంది గ్రామస్థులు వింటున్నారు. ఒక్కరూ నోరు మెదపలేరు; నిరసన తెలుపలేదు. సరిహద్దు రోడ్డును దాటలేదు. అప్పటికే గ్రామానికి పల్లెకూ బద్ధ శత్రుత్వం వుండేది. అదీ అసలు రహస్యం.

ఎన్నికలు నాకు ఎంతో అనుభవాన్ని పెంచాయి. ప్రజల మనస్తత్వం, ఉద్వేగాలు, అభిమాన దురభిమానాలు కరతామలకం అయినాయి. విరివిగా సారస్వతం పంచాము.

# ఎం.ఎన్.రాయ్‌తో...

ఎం.ఎన్ రాయ్ ప్రతి సంవత్సరం వేసవిలో శిబిరాన్ని ఏర్పాటుచేసి చర్చలను నిర్వహించేవాడు. ఆ శిబిరాలే అతని ఉద్యమానికి జీవగర్రలు. ఒక్కొక్కపుడు అవసరాన్ని బట్టి అవి నెల రోజులు కూడా కొనసాగిన సందర్భాలు ఉన్నాయి. 1940 వేసవి శిబిర చర్చలు 1940లో రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ఆవిర్భావానికి దారితీసింది. 1946లో జరిగిన శిబిరపు చర్చలు రాడికల్సు మార్క్సిజాన్ని వదిలి హ్యూమనిజాన్ని తమ తత్వంగా స్వీకరించటానికి దోహదం చేసింది. ఆ శిబిరాలు ఆంధ్ర ప్రాంతంలో వేసవి సెలవుల తరువాత కోర్టులు తెరిచే కాలంలో జరగడం వల్ల నేనూ, ఎ.జి.కె. (కీర్తిశేషుడు ఆవుల గోపాల కృష్ణమూర్తి) శిబిరాలకు వెళ్ళలేకపోయే వాళ్ళం. చర్చలు నిర్మొగమాటంగా, నిస్సంకోచంగా, సూటిగా, స్పష్టంగా వస్తు-నిష్ఠతో జరిగేవట.

1946లో బొంబాయిలో రాడికల్ డెమొక్రాటిక్ పార్టీవారు నిర్వహించిన చర్చాగోష్ఠి జరిగింది. రాష్ట్ర శాఖల కార్యదర్శులను చర్చలకు ఆహ్వానించారు. నేను రాష్ట్ర కార్యాలయ కార్యదర్శిగా బొంబాయి వెళ్ళాను. 22 సూత్రాలను చర్చకు పెట్టారు. అవి హ్యూమనిస్టు సూత్రాలు. ఇన్నాళ్ళుగా మేము విశ్వసిస్తున్న మార్క్సిజం స్థానంలోకి హ్యూమనిజం ప్రవేశించింది. మార్క్సిజంలో ద్వంద్వం ఉందని రాసి వుంది. ఆ భావం నాకు స్పష్టంగా తెలిసేది కాలేదు. ఎం.ఎన్. రాయ్‌ని వివరించమన్నాను. ఆయన కొంత వివరించాడు. ఫలోక్తిగా నాలో కమ్యూనిస్టు మనస్తత్వం చావలేదన్నాడు. పని తొందరలో తను వెళ్తున్నందున ఆ అంశాన్ని శిబ్‌నారాయణరేతో చర్చించమన్నాడు. 1946 వేసవి శిబిరంలో మార్క్సిజం ఎలా లోపభూయిష్టమో, మన అవసరాలకు ఎలా చాలనిదో ముమ్మండుగా చర్చ ప్రారంభించి, రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ పాలి కాపులైన సర్వశ్రీ వి.ఎం. తార్కుండే, వి.బి. కర్నిక్‌ల అభ్యంతరాలను, అడ్డు పుల్లలను అధిగమించి మార్క్సిజం యొక్క అసమగ్రతను వెలికితీసిన మేధావి శిబ్‌నారాయణరే. ఆయనను ఎం.ఎన్. రాయ్ ఆదరించాడు. అభిమానించాడు, బలపరిచాడు. శిబ్‌నారాయణతో మాట్లాడాను. (ఆయన శివనారాయణ బెంగాలిలో 'వ', 'బ'లకు బేదం లేదు) ఈ ప్రపంచం సత్యం. ఈ ప్రపంచంలో వ్యక్తులున్నారు. సంఘాలున్నాయి. సమాజం యావత్తు వున్నది. వ్యక్తులకు ఆలోచనలు, భావాలు వుంటాయి. సమాజపు పోకడలో కొన్ని ధోరణులు దర్శనమిస్తాయి. వాటి వెనుక కొన్ని సూత్రాలు గోచరిస్తాయి. మార్క్సిజం చారిత్రక నియతి వాదాన్ని ఆమోదిస్తుంది. మానవుని ఉనికి అతని భావాలను నిర్ణయిస్తుంది. మానవ వ్యక్తి సామాజిక జీవి. సమాజంలో వర్గాలున్నాయి. అవి తమ తమ స్వీయ ప్రయోజనాలను ఆశించి కృషి చేస్తుంటాయి. దాంతో వర్గ కలహం ఏర్పడి వర్గ సంఘర్షణకు దారితీస్తుంది. వర్గ సంఘర్షణే చరిత్ర గతిని నిర్ణయిస్తుంది. సామాజిక స్థితిగతులు, భావాలు యీ రెండూ చరిత్ర పోకడను నిర్దేశించే విషయంలో పాత్ర వహిస్తాయి. ఒక చెంప యిలా చెప్తూ, మరో చెంపన సామాజిక స్థితిగతులే అంటే ఆర్థిక రంగంలోని ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు మాత్రమే చరిత్ర గతిని నిర్ణయిస్తాయని చెప్పటం మార్క్సిజంలోని ద్వంద్వం. నిజానికి భావాలు, సామాజిక

సంబంధాలు యీ రెండూ వాస్తవమైన, సత్యమయిన యీ ప్రపంచంలో భాగాలే. వాటి పుట్టుక ఒక చోటే సుండే. మానవ ప్రపంచం నుండే. హ్యూమనిజంలో యీ ద్వంద్వం లేదు. ఈ వివరణ నాకు నచ్చింది.

రాయ్ అనుచరులు తమను వరుసగా రాడికల్ కాంగ్రెసు వాదులని, రాడికల్ డెమొక్రట్‌లని, పార్టీని రద్దుచేసిన తరువాత రాడికల్ హ్యూమనిస్టులని అభివర్ణించుకుంటున్నా కమ్యూనిస్టులు మాత్రం వారిని 'రాయిస్టులు' అని పిలిచేవారు. నిజానికి 'రాయిస్టు' అనే పదాన్ని రాయ్ ఏవగించుకునేవాడు. ఒక కథ ఆ కాలంలో వినిపించేది. క్రొత్తగా రాయ్ అనుచరులలో చేరిన ఒకాయన · · వెళ్ళి 'కామ్రేడ్ రాయ్' నేను యిపుడు రాయిస్టును అన్నాడు. 'తెలివి తక్కువగా మాట్లాడకు. నేను 'రాడికల్ను'ను కోరుకుంటాను అన్నాడు రాయ్. 'రాడికల్' అంటే 'విషయం యొక్క మూలానికి పోయేవాడు' అని అర్థం. రాయ్ పట్ల ద్వేషభావం పెంచుకున్నా బహుశః రాయ్ మేధస్సును కమ్యూనిస్టులు గుర్తించక తప్పలేదేమో! ప్రప్రథమంగా మెక్సికోలో కమ్యూనిస్టు పార్టీని స్థాపించిన ఘనత, 1919 నాటి ద్వితీయ ప్రపంచ కమ్యూనిస్టు సభలో లెనినుతో విభేదించగా అతని సిద్ధాంత పత్రాన్ని కూడా లెనిను ఆమోదింప చేస్తే అతనికి లభించిన పేరు ప్రఖ్యాతులు, ముస్ముందుగా భారత కమ్యూనిస్టు పార్టీని రష్యాలో 1920లో స్థాపించిన విషయం, 1928 వరకు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఆయన పాత్ర అతని యెడ - అంతర్గతంగా, తమకు తెలియకుండానే గౌరవ భావం సంప్రదాయ కమ్యూనిస్టులకు కలిగిందేమో! వ్యక్తులనుబట్టి సిద్ధాంతాన్ని పిలవటం అంటే వ్యక్తిని గౌరవించినట్లే కదా! మార్క్సిజం, లెనినిజం, స్టాలినిజం, మావోయిజం అని అంటున్నాం. గాంధీయిజం అంటున్నాం కాని 'నెహ్రూరాయిజం', 'బోసిజం' అనటం లేదే! అనాలోచితంగా ఎం.ఎన్. రాయ్‌కి సంప్రదాయ కమ్యూనిస్టులు సమర్పించిన నివాళి 'రాయిజం' అనే పద ప్రయోగం.

ఎం.ఎన్. రాయ్ ఆంధ్ర ప్రాంతాన్ని పలుమార్లు పర్యటించాడు. ఒకసారి వచ్చినపుడు సంగం జాగర్లమూడిలోని శ్యామసుందర్ ఇంటిలో బస ఏర్పాటు చేశారు. భోజనానంతరం రాయ్ దంపతులూ, జి. నరహరి, ఆవుల గోపాల కృష్ణమూర్తి, నేను, శ్యామయిస్ట్ (శ్యామ సుందర్‌ను అలా ఆప్యాయంగా పిలిచేవాళ్ళం) కూర్చుని మాట్లాడుతున్నాం. ఏదో మాటల సందర్భంలో నన్ను రాయ్ 'మాజీ కమ్యూనిస్టు రామమూర్తి ఏమంటాడు' అన్నాడు. అంతకుముందు చాలామంది రాడికల్ డెమోక్రట్‌లకు కమ్యూనిస్టు మనస్తత్వం పోలేదని రాయ్ ఘాటుగా విమర్శించాడు. 'ఇండిపెండెంటు ఇండియా' (స్వతంత్ర భారతం) అనే పార్టీ వార పత్రికలో. నా ముఖం జేవురించింది. నాకు అప్పటికి 28 సంవత్సరాల వయస్సు. ఏదో ఘాటైన ఎదురు జవాబు యివ్వాలనే తాపత్రయం నా ముఖంలో కన్పించిందేమో ఎలెన్ రాయ్ (ఎం.ఎన్. రాయ్ పత్ని) 'నీవూ మాజీ కమ్యూనిస్టువేగా' అని రాయ్‌తో అన్నది. దాంతో రాయ్ విరగబడి నవ్వాడు. దాంతో వాతావరణంలో ఉద్రిక్తత తగ్గి చల్లబడింది. ఎలెన్ రాయ్ సమయ స్ఫూర్తికీ, ఎం.ఎన్. రాయ్ హాస్య ప్రవృత్తికీ నేను నా మనస్సులో నివాళు లర్పించాను. తనను ఘోరంగా ఎగతాళి చేసినా ఆనందించగల వ్యక్తి ఎం.ఎన్. రాయ్.

# ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటులో...

విశాఖపట్నం మీద బాంబు పడటంతో ఆంధ్ర విశ్వ విద్యాలయం వాల్తేరు నుండి గుంటూరు వచ్చింది. ఆనాడు ఉపాధ్యక్షుడు సర్ సి.ఆర్. రెడ్డిగారు రిజిస్ట్రారు జస్టిస్ పార్టీ నాయకుడు కుర్మారెడ్డి గారి కుమారుడు శ్రీ కె.పి. గోపాల స్వామి, రెడ్డి నాయుడు గారికి తనకు వున్న దోస్తిని బట్టి గోపాల స్వామిని కొంచెం చిన్నచూపు చూసేవాడు సి.ఆర్. రెడ్డి. దాంతో గోపాల స్వామి గారికి రెడ్డిగారిపై కినుక జనించింది. ఆయనను గట్టిగా విమర్శించే వ్యక్తి కోసం వెతుకుతూ తనకు పరిచయమైన నన్ను గెలిపించారు సెనేటుకు పట్టభద్రుల నియోజక వర్గం నుండి.

సి.ఆర్. రెడ్డిగారు ఉపాధ్యక్షుడుగా వుండగా లైబ్రరీలో వున్న కమ్యూనిస్టు సాహిత్యాన్ని బీరువాలో పెట్టి తాళం వేయించాడు. దరిమిలా వచ్చిన ఉపాధ్యక్షుడుగా రాధాకృష్ణ పండితుడు తాళాలు తీయించి 'ఆ పుస్తకాలు చదవండి. నేనూ చదివాను. అవి అంత ఉపయోగకరం కావని తెల్సుకున్నాను' అని బహిరంగంగా చెప్పాడు. ఆయన వెళ్లిపోగానే మరల ఉపాధ్యక్షుడయిన రెడ్డిగారు మరల పాత వైఖరినే చేపట్టాడు.

సి.ఆర్. రెడ్డిగారిది ఘాటైన హాస్యం. స్వతంత్ర అభ్యర్థులను గురించి కాంగ్రెసు సభ్యుడుగా ఆయన చేసిన వ్యాఖ్య మరువరానిది. స్వతంత్ర అభ్యర్థులు ప్రపంచ జ్ఞానంపై ఆధారపడరు. అలా అన్న వ్యక్తి తర్వాత స్వతంత అభ్యర్థిగా పోటీచేశాడు. ఎప్పుడూ ప్రజలకు విద్యాధికులకు తేడాను గురించి మాట్లాడేవాడు. ఒకసారి నేను ఆయన ఉన్న సభలో అనధికార సభ్యులను గురించి ప్రస్తావించాను. అనధికారికి, అధికారికి మనస్తత్వంలో తేడా స్వల్పమన్నాడు.

వేసవి సెలవులలో కాలేజీ విద్యార్థుల చేత వయోజన విద్యా కేంద్రాలు నిర్వహింప చేయాలని తీర్మానం పెట్టాను. అపుడు నేను అఖిల భారత వయోజన విద్యా సంస్థ సభ్యుణ్ణి. తీర్మానం ఆమోదింపబడ్డది. తీర్మానానికి విశ్వ విద్యాలయపు పైకం ఖర్చు చేయమనకపోతే ప్రభుత్వం నుండి ధన సహాయం అడిగి తీర్మానాన్ని అమలు పర్చటానికి తను సిద్ధమేనన్నాడు. అందుకు నేను సంతోషించాను. ఎంత కాలానికి తీర్మానపు అమలు ఊసేలేదు. ఉత్తరం రాశాను. నేను ఊరక వున్నాననుకున్నావా, తల మునకలయి తాటి ప్రమాణం లోతున వున్నాను విశ్వ విద్యాలయపు పనులలో. ఏదయినా నీవు మేధావివి కనుక యిచ్చటికి (వాల్తేరుకు) వచ్చి, నా అతిథిగా వుండి నా స్థితిగతులను గమనించు. ప్రభుత్వానికి 'గ్రాంటు' కోసం రాశాను. అయినా అణుబాంబును చరఖాతో ఎదుర్కొనే యీ కాంగ్రెసు ప్రభుత్వం నుంచి ఏం ఆశించగలవు. ఆయన వ్యాఖ్యలు పరుషంగా, బాధపెట్టేవిగా వుండేవి.

సి.ఆర్. రెడ్డిగారికి ఎం.ఎన్. రాయ్ మీద అభిమానం. ఆయన 'జైలునుండి ఉత్తరాలు' అనే గ్రంథానికి (అవి రాయ్ కాబోయే భార్య ఎలెన్‌కు రాసినవి) పీఠిక రాశాడు. నేను ఎం.ఎన్. రాయ్ అనుచరుడిని కనుక నామీద వాత్సల్యం. ఒకసారి విశ్వ విద్యాలయ స్నాతకోత్సవ సందర్భంలో కలిసి 'నేను కామ్రేడ్ రాయ్ పుస్తకాల నన్నింటిని యూనివర్సిటీ లైబ్రరీకి కొన్నాను' అన్నాడు. 'మీ విధ్యుక్త ధర్మం మీరు నెరవేర్చారు' అని జవాబిచ్చాను. 'కొంటె పిల్లవాడా' అని నన్ను,

సంబోధించి నా వీపు మీద ఆప్యాయంగా దెబ్బవేశాడు.

సి.ఆర్. రెడ్డిగారిది విచిత్ర మనస్తత్వం. ఒకవేళ ఏదైనా మంచి చెయవలసి వస్తే దానిని తనే చేయాలి. ఇతరులు సూచిస్తే తిరస్కరిస్తాడు. ఒక్కసారి కాలేజీ అధ్యాపకుల జీతాలు పెంచమని నేను తీర్మానం పెట్టే ఆ విషయాన్ని 'సిండికేటు'కు వదలి వేయమన్నారు. ఆయన మనస్తత్వం తెలిసిన నేను నా తీర్మానాన్ని ఉపసంహరించుకున్నాను. తరువాత కాలేజీ అధ్యాపకుల జీతాలు పెరిగేటట్లు చూచాడు ఆయన. శ్రీ సి.ఆర్. రెడ్డి ప్రత్యర్థి వర్గంలో నేను చేరాను. ఎం.వి. కృష్ణారావు గారు (దరిమిలా మంత్రి కాకినాడ వైద్య కళాశాల స్థాపకుడు), దిగుమర్తి రామస్వామి గారు (ప్రసిద్ధ గాంధేయవాది) వీరు యిరువురు ఆయనను గట్టిగా విమర్శించే వారు. విశాఖ పట్నానికి చెందిన శ్రీ సర్వేశ్వర శాస్త్రి (ప్లీడరు) సిండికేటు మెంబరుగా వుండేవారు. ఆయన కూడా మా పక్షమే. 'సమాచారం తెలియ జేస్తున్నాను, విశదీకరిస్తున్నాను' అంటూ మా విమర్శల ఫిరంగులకు మందుగుండు సరఫరా చేసేవారు. ఒక సెనేటు మీటింగు విషయం చెప్పక తప్పదు. రెండు తీర్మానాలకు నోటీసు యిచ్చాను. ఒక దానిని విశ్వ విద్యాలయ చట్టపు సెక్షను 6 (ఎ) క్రింద అనుమతి నిరాకరిస్తున్నానని, కొట్టివేస్తున్నానని ప్రకటించాడు సి.ఆర్. రెడ్డిగారు. రెండవ తీర్మానానికి కూడా అదే గతి పట్టుందని ముందుగా లేచి 'ఈ తీర్మానం సెక్షను 6 (ఎ) పరిధిలోకి రాదు' అన్నాను. వెంటనే 'అయితే దానిని సెక్షను 6 (బి) క్రింద త్రోసివేస్తున్నాను' అని ప్రకటించాడు. నాకు విపరీతమైన బాధ కలిగింది. విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షుని మీద అవిశ్వాస తీర్మానం పెట్టటానికి విశ్వ విద్యాలయ శాసనం అవకాశం కల్పించ లేదు. ఈ విషయం తెలిసిన నేను మౌనంగా వున్నాను. నా ముఖం జేవురించింది. గమనించిన సి.ఆర్. రెడ్డి 'నేను ఏం చేసేది చట్టం అలా వుంది' అని విచారిస్తున్నట్లు పైకి కనపడ్తూ నన్ను ఎద్దేవా చేశాడు. నాకు మండి పోయింది. అసలే బాధపడ్తున్న నన్ను ఆయన అవమానించినట్లు నాకు తోచింది. వెంటనే లేచి 'ఉపాధ్యక్షా శాసనానిది కాదు లోపం. శాసనానికి యివ్వబడిన భాష్యం లోపభూయిష్టం' అని పలికాను. ఈసారి ఆయన క్రుద్ధుడయినాడు. 'మరో ఉపాధ్యక్షుడు వస్తే ఆయన నుండి మరో భాష్యం నీవు స్వీకరిద్దువు గాని' అని నన్ను గేలి చేస్తూ మాట్లాడాడు. వయస్సులో వున్నానేమో (అపుడు నాకు 30 సంవత్సరాలు నిండలేదు) వెంటనే మాటల బాణం విసిరాను. 'ఉపాధ్యక్షా! ఆరోజు కోసం నిరీక్షిస్తున్నాను'. ఆయన దీనికి తిట్టుకోలేక, మారు మాటాడక 'ఎజండాలో' తరువాత 'అయిటము'ను చదివాడు.

విశ్వ విద్యాలయపు అధ్యాపకుల జీతాలు అధ్వాన్నంగా వుండేవి. అధ్యాపకులు మూడు రకాలుగా ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు. లెక్చరర్లలో రెండు తెగలు. సీనియర్లు, జూనియర్లు. జూనియరు లెక్చరరు జీతం– పిహెచ్‌డి, డిఎస్‌సిలకు సహితం రూ. 125 నుండి 200 వరకు. కనీసం యీ రెండవ తరగతి రద్దు చేయమన్నారు. శ్రీ పాములపాటి కృష్ణయ్య (జస్టిస్ పార్టీ నాయకుడు; అతని చదువు రెండవ ఫారం దాటలేదు) పంచాయితీ సంస్థల నుండి సెనేటు సభ్యుడిగా ఎన్నికయినాడు. వచ్చీరాని ఇంగ్లీషులో నా పనివాడు (ఆయన ఆ కాలంలో సాంకేతిక విద్యాలయాన్ని

అంటే తాపీ మేస్త్రీలు, వడ్రంగులు వగైరాలను తయారు చేసే సంస్థను యుద్ధావసరాల కోసం నడిపేవారు) రిక్షాలో పోతుంటే మీ మేధావంతుడు గుంటూరు తారురోడ్డు మీద పాదరక్షలు లేకుండా నడుస్తున్నాడు అని శ్రీ సి.ఆర్. రెడ్డిని ఎగతాళి చేశాడు. 'గుంటూరు ఎండలు మీ మీద ప్రభావం చూపుతున్నాయి' (అంటే మీ మతి పోయినట్లుంది) అని సి.ఆర్. రెడ్డిగారు పరిహసించారు. కృష్ణయ్యకు విద్యా ప్రావీణ్యత లేదు కాని ప్రపంచ జ్ఞానం ఆయన సొత్తు. వెంటనే లేచి 'నేను వాల్తేరులో వుండడం లేదు' అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు. . ఆ కాలంలో ప్రభుత్వ పిచ్చాసుపత్రి వాల్తేరులో వుండేది. అంటే సి.ఆర్. రెడ్డి గారికి మతిభ్రమించి నందువలననే వాల్తేరులో వుంటున్నారని ధ్వని.

కయ్యం, నెయ్యం, వియ్యం సరి సమానులలో జరగాలి అన్నారు. ఆనాటి హాస్యాలు, అపహాస్యాలు, విమర్శలు, ప్రతి విమర్శలు ఆమోదయోగ్యమయిన సరళిలో వుండేవి.

1944లో ఖుర్జా నుండి కలకత్తా వెళ్తున్నాం రాడికల్ వాదులం. ఏదో మాటల సందర్భంగా 'మనం జమ్నాదాసు మెహతాను వాడుకుందాం' అన్నాను. (జమ్నాదాసు మెహతా కమ్యూనిస్టేతర కార్మిక నాయకుడు. ప్రభుభక్తి పరాయణుడని మా రాడికల్‌వాదుల అభిప్రాయం. అయినా యుద్ధ యత్నాలకు ఉమ్మడిగా కృషి చేయాలని ఆయనతో కలిసి అఖిలభారత కార్మిక ఫెడరేషను స్థాపించాం.) అదే రైలు పెట్టెలో మాతోపాటు ప్రయాణం చేస్తున్న శివనారాయణరే 'కామ్రేడ్! నీవు మాజీ కమ్యూనిస్టు లాగున్నావు. అయినా అతనిని వాడుకోటానికి నీకెవరిచ్చారు అధికారం?' అని నిలవేశాడు. అప్పటిదాకా నాకు ఆ భావం స్ఫురించ లేదు. ఇప్పటికీ కమ్యూనిస్టులు అదే భాష వాడుతున్నారు; వాడతారు. తామే విశుద్ధ పవిత్రులన్నట్లు అందరినీ తక్కువ చూపు చూస్తూ వారిని పనిముట్లలాగ వాడుకుంటారట. వారికి మనుషులు - తాము తప్ప యితర వ్యక్తులు - పార్టీ కోసం వాడుకొనటానికి కేవలం సాధనాలు మాత్రమే. ఇది మార్క్సిస్టు నీతి (ఇటీవల కొందరు మార్క్సిస్టులు పునరాలోచన చేస్తున్నారనుకోండి).

ఈ నీతి విషయమైన చర్చ నా జీవితంలో మహోకసారి చేయవలసి వచ్చింది. నేను రాడికల్ డెమొక్రాట్‌గా ఉండగానే నన్ను కె.వి. గోపాలస్వామిగారు సెనేటు ఎన్నికలలో గెలిపించారు. తరువాత నాకు తెలిసింది. చనిపోయిన పట్టభద్రులందరు నాకు వోటువేశారట. ఆ విధానం యిలా జరిగింది. ప్రతి వోటరుకు 'బ్యాలటు' కాగితం రిజిస్టరు పోస్టులో పోయేది. వోటరు చనిపోయి వుంటే అది తిరిగి వచ్చేది. ఆ వోటు పత్రాలపై ఫోర్జరీ దస్తులలో రిజిస్ట్రారుకు యిష్టుడనైన నా పేర మొదటి వోటు నమోదయేది. అది నా విజయ రహస్యం. ఇది తెలిసినా నేను బాధపడలేదు. మా మనస్సులో వ్యధ లేదు. ఆనాడు రాడికల్ వాదులు మార్క్సిస్టులు. అంతేకాదు; 'శిసలయిన, అసలయిన మార్క్సిస్టులం' అని మమ్ము అభివర్ణించుకునే వారం. సాధనం ఏదయినా చెడ్డదయినా - లక్ష్యం, గమ్యం మంచిదయితే చాలు. అదే ఆనాటి మార్క్సిస్టు నీతి.

నా పదవి కాలం ముగిసింది. 'మరల పట్టభద్రుల నియోజక వర్గం నుండి అభ్యర్థిగా నుంచోమని, మిమ్మల్ని గెలిపించు కుంటామని' అధికార పదవులను ఆక్రమించిన వారికి సన్నిహితులయిన వారి వద్ద నుండి వర్తమానం వచ్చింది. అప్పటికి నా తాత్విక భూమిక మారింది. మార్క్సిజాన్ని వదలి రాడికల్ హ్యూమనిజాన్ని స్వీకరించారు రాడికల్ డెమొక్రాట్లు. లక్ష్యం, సాధనం రెండూ మంచివిగా, దొడ్డవిగా వుండాలనే సూత్రం వచ్చింది. నాకు సహాయం చేయ సిద్ధపడిన వారి కోరికను సవినయంగా తిరస్కరించాను. వార్త తెచ్చిన వ్యక్తి నవ్వాడు. 'ఎంత పిచ్చివారండీ మీరు' అని వెనుతిరిగాడు.

ఈ నీతి మీద చర్చసాగే కాలంలో ఆల్డస్ హక్స్లీ 'లక్ష్యాలు, సాధనాలు' అనే పేరుతో గ్రంథం రాశాడు. దానికి జవాబుగా లండనులో కాపురముంటున్న 'షెల్ వాల్కర్' అనే కమూన్యినిష్టు మేధావి 'లక్ష్యాలా సాధనాలా? ఏవి ముఖ్యం? అనే శీర్షికతో గ్రంథం రాశాడు. మార్క్సిస్టులకు, మార్క్సిస్టేతరులకు నీతి విషయమయి తీవ్రమయిన అభిప్రాయభేదాలు వుండేవి. మామూలు నీతి సూత్రాలను కమ్యూనిస్టేతరుల

పట్ల కమ్యూనిస్టులు అన్వయించరు. వారిలో వారికి - పార్టీలో సభ్యుల మధ్య - మామూలు నీతి సూత్రాలను పాటిస్తారు. పార్టీలో అబద్ధ మాడరాదు. మోసం చేయరాదు. ఇది ద్వంద్వ నీతి. అందువల్లనే పార్టీలో నుండి బహిష్కరించబడిన వ్యక్తి పట్ల అమానుషంగా ప్రవర్తిస్తారు. లేనిపోని అసత్యాలు పలుకుతారు. బుద్ధిపూర్వకంగా - తమకు అబద్ధం అని తెలిసిన విషయాలను - నిందలు వేస్తారు. అసత్య ప్రచారం చేస్తారు.

మార్క్సిస్టు నీతికి నేను ఒకసారి గురి అయ్యాను. కాశీనుండి 1942 ఏప్రిల్‌లో నేను తిరిగి వచ్చిన తరువాత కమ్యూనిస్టు నాయకుడు పులుపుల శివయ్యగారు కన్పించారు. దగ్గరకు పిలిచి 'ఏం చేస్తున్నావు?' అని ప్రశ్నించారు. 'ఎం.ఎన్. రాయ్ రాడికల్ పార్టీలో పనిచేస్తున్నాను' అనేది నా జవాబు. 'ఓహో! అలాగా! ప్రస్తుతం నీ 'హాబీ' (ఉబుసుపోక ఇష్ట పూర్వకంగా చేసే నిరుపయోగమయిన పని అనే భావనలో) అదా?' ఇది పులుపుల వారి ప్రశ్న రూపంలో వున్న వ్యాఖ్య. ఆయన ఆదేశం మేరకు నేను కమ్యూనిస్టు కొరియరుగా పనిచేసినప్పుడు నేను, వారి దృష్టిలో నిజాయితీ గల రాజకీయ కార్యకర్తను. ఇపుడు కాలక్షేపంగా రాజకీయాలలో పనిచేసేవాడిని. శ్రీ పులుపుల శివయ్యగారిని నిందించి ప్రయోజనం లేదు. ఆయన నిసలయిన అసలయిన కమ్యూనిస్టు కదా!

ఆనాడు 30 జనవరి 1948. ఆకాశవాణి నుండి విషాదనాదం వెలువడసాగింది. దాన్ని విని దేశానికి ఏదో విపత్తు సంభవించిందని శ్రోతలు భయపడసాగారు. కొలది క్షణాలలో ఒక వార్త వెలువడింది. 'ప్రార్థనా సమావేశానికి వెళ్తున్న మహాత్మాగాంధీ ఒక హంతకుని చేతిలో అసువులు బాశాడు.' నిర్వీణ్ణులయి పోయారు శ్రోతలు. తెప్పరిల్లిన వారి అందరి నోట ఒకే మాట. 'గాంధీని చంపాడు' అనేవే ఆ పలుకులు. ప్రతి ఒక్కరి తలపై ఏదో పిడుగు పడ్డట్లు భావం కలిగింది. 'ఇక తమకే దారి' అని నిస్సహాయంగా ఒకరిని మరొకరు పల్కరించు కుంటున్నారు. భారతజాతి యావత్తు దిగ్భ్రాంతిలో మునిగిపోయింది. 'ఏమిటీ అన్యాయం?' అని ఒక్కరంటే 'ధర్మానికి యిక తావులేదా' అని యింకొకరు ప్రశ్నిస్తున్నారు. 'దేశానికి స్వరాజ్యం తెచ్చి పెట్టేసిన మహానుభావుడు' అని ఒకతను అంటే 'దేశానికి క్రమశిక్షణ అలవర్చిన బోధకుడు' అని యింకొకతని ప్రతి వ్యాఖ్య.

ఆకాశవాణిలో మామూలు కార్యక్రమాలను నిలిపి వేశారు. విషాద సంగీతం. మధ్య మధ్య మన మధ్య యికలేని జాతిపితకు నివాళులు. దేశం విషయం మహాత్ముని కి వదలి నిశ్చింతగా నిద్రాణమయిన జాతికి పెను ప్రమాదం. నిర్భీకతను తన సందేశంగా ప్రజలకు అందించిన మహా నాయకుడు మరి యిక లేడు. ప్రజలలో భీతావహము ప్రవేశించింది. 'ఈ జాతికిక మనుగడ గలదా?' అనే సందేహం ప్రజానీకం మనస్సులలో పొడసూపింది. పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు తండ్రిని కోల్పోయిన చిన్నారి తనయుల వలె అదే పనిగా వాపోవసాగారు. ఆ వ్యధ తీరిపోయేది కాదు. ఆ బాధ తీసివేయ వీలులేనిది. తలుచుకున్నప్పుడల్లా తొలుస్తూనే వుంది. ధీరచిత్తులు సహితం వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. అందరి ముఖాల మీద కన్నీటిచారలు. వారివి శోకతప్త హృదయాలు. ఇన్నాళ్ళుగా తమ మధ్య తిరుగాడే గాంధీజీ గొప్పతనాన్ని గుర్తించలేని తమ తెలివి తక్కువతనానికి కుమిలి కుమిలి యేడుస్తున్నది దేశ ప్రజ. నాయకుల శ్రద్ధాంజలులు ఆకాశవాణి ద్వారా వింటూంటే 'ఇలాంటి వ్యక్తిని ఎలా విస్మరించాం' అనే భావంతో పశ్చాత్తాప మనస్కులయినారు జనావళి. 'గాంధీతాత యిక మనకు కన్పించడా' అని మనుమరాలు తాతను ప్రశ్నిస్తుంటే, 'మనను విడిచి చాలా దూరం వెళ్ళిపోయాడు. లేడమ్మా' అని తాత జవాబు. 'ఎక్కడికి వెళ్ళాడు తాతయ్యా?' అని బదులు ప్రశ్నవేసే అమాయక బాలికకు సరైన జవాబు చెప్పలేని తన నిస్సహాయతను నిందించుకుంటూ మహా లోకానికి చేరుకున్నాడమ్మా' అని దీనంగా తాత ప్రత్యుత్తరం. 'మనమూ ఆ లోకానికి వెళ్ళి ఆయనను చూచి వద్దాము తాతయ్యా' అంటున్న బాలికను అక్కున చేర్చుకుని 'మనబోటివాళ్ళం అక్కడకు వెళ్ళలేము' అని భోరున బావురుమన్నాడు ఆ తాత.

'ఇన్నాళ్లు దేశ నాయకులను అదుపులో పెట్టేవాడు మహాత్ముడు. ఇక ముందు వీరిని ఎవరు కంట్రోలు చేస్తారండీ' అని సందేహాన్ని వెలిబుచ్చిన గృహిణికి 'ఇక మనమే పూనుకోవాలి' అంటూ పొంగి పొరలి వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక నోట గుడ్డ కుక్కుకొని వీధిలోకి పరుగులెట్టాడు భర్త. 'ఈ ఘోరకలి చూడడానికా మనం యింకా బ్రతికి వున్నాం' అని కాటికి కాలు జాచుకున్న ముదుసళ్ల మనస్సులలో తొణికిసలాడాయి భావాలు. 'రాజకీయాలలో కూడ నీతిగా వ్యవహరించాలని

ప్రబోధించాడు ఆ మహాత్ముడు' అని నీతి శాస్త్రజ్ఞులు, పండితులు మహాత్ముని ప్రస్తుతించారు.

మామూలుగా ఆకాశవాణి కార్యక్రమాలను వినని సామాన్య జనం రేడియోల చుట్టూ గుమిగూడారు. అందరూ విషణ్ణవదనులే. సర్వులూ దుఃఖ సముద్రంలో యీదులాడేవారే. తమ జీవితాలకు చుక్కాని పోయిందని విలపించేవారే. ప్రతి ఒక్కరూ తమ ఆత్మీయుని పోగొట్టుకున్నట్లు తలపోసేవారే. ఆశలు అడియాసలయ్యాయని ఆక్రోశించేవారే. ఈ జీవిత మహా ప్రవాహంలో ఒక గడ్డిపోచ అయినా దొరకక పోతుందా యని ఆశపడేవారే. ఎక్కడ చూచినా నిరాశ, నిస్పృహ, భయం ఆవరించింది. బిక్కు బిక్కుమంటూ ఒకరి వదనాలను మరొకరు చూస్తున్నారు. ఎవరిలోనయినా ఒక గంభీర మనస్కుడు కనిపిస్తాడా అని వెతుకులాడుతున్నాడు. స్వచ్ఛంద సేవకులు నాయకులను గమనిస్తున్నారు. నాయకులు పరిసరాలను, తమ చుట్టూ వున్నవారిని చూడలేకున్నారు. కంటికి మింటికి ఒకటే ధార. బావురుమని బయటపడేవారు ఒక వైపు. నోటమాటరాని వారు మరోవైపు. ప్రక్కనున్న వ్యక్తిని కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చేవారు ఒక ప్రక్కన. తెరలు తెరలుగా వచ్చే శోకాన్ని తట్టుకోలేక కుప్పకూలేవారు ఒక చెంప వీధులు, కూడళ్లు, కార్యాలయాలు, పార్కులు, క్లబ్బులు జన సముద్రంలో నిండిపోయాయి. ఏ పరిస్థితిల్లోను ధైర్యాన్ని కోల్పోరాదన్నారు మహాత్ముడు' అని ఒక గొంతు వినిపించింది. అందరూ ఆత్రుతతో 'ఎవరా వ్యక్తి అని' వెదికారు. ఆ మాటలు రేడియోలో సర్దార్ వల్లభాయి పటేల్‌వి. మహాత్ముని అనుచరులు, సహచరులూ అయిన ఆ మహా నాయకులందరిలో ముస్ముందుగా తేరుకున్నవాడు ఆయన. ఆయన ఉక్కు మనిషి అని పేరు పడ్డవాడు. ఆయన పల్కులు ప్రజానీకాన్ని మేలుకొల్పాయి. 'మహాత్ముని అంతిమ యాత్ర విశేషాలు వినడానికి సిద్ధపడ్డారు ప్రజలు.

అది గుంటూరులో పురుషుల క్లబ్. దానిపేరు ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్. పేరునుబట్టి దీనిని వ్యాపార సంస్థ అని భావిస్తే పొరపడతాం. దీనికి బహుశః 1918లో అనుకుంటాను శ్రీ లింగమల్లు వీరరాఘవయ్య అనే గుంటూరు పౌరుడు క్లబ్‌కు శాశ్వతంగా తన గృహాన్ని దానం చేసి దాన పత్రం రాసి ఇచ్చాడు. దానికి తన పేరు మీద ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్ (లింగమల్లు వీర రాఘవయ్య అండ్ కుమారుల క్లబ్) అని పేరు పెట్టాలనే నిబంధన పెట్టాడు. అలాగే ఈనాటికీ కొనసాగుతున్నది ఆ క్లబ్. దాంట్లో క్రీడలకు, వినోదాలకు, కళలకు, చర్చలకు చోటుండేది. కాలక్రమేణ చీట్లపేక ఆటవల్ల వచ్చిన పైకంతో అది ఎంతో అభివృద్ధి చెందింది. ఈ సంస్థను విమర్శించేవారు ఆ క్లబ్‌ను 'లోఫర్స్, వాగబాండ్స్, రోగ్స్ అండ్ సన్స్' అని పిలిచేవారు. (వ్యర్థ జీవితం గడిపేవారు, పనిలేక తిరిగేవారు, కుటిల స్వభావులు అని అర్థం). పెద్దపెద్ద భవనాలు ఏర్పడినాయి. ఈ గోడ నా త్యాగ ఫలితం అని ఒక సభ్యుడంటే, ఈ గది నా పైకంతో కట్టినదేనని మరొకడు అనేవాడు. చీట్లపేకలో వారు పోగొట్టుకున్నది త్యాగ ధనమని వారి భావం.

ఒకనాటి క్లబ్‌లోని పరిస్థితులు విచిత్రంగా వున్న సమయమది. ఆంజనేయులు వెంకట్రావులు టెన్నీసు సింగిల్స్ ఆడుతున్నారు. పట్టుగా సాగుతున్నది పోటీ. అప్పటికే ఒక పాయింటు వస్తే ఆంజనేయులు గెలుస్తాడు. ఇద్దరూ సమఉజ్జీగా ఆడుతున్నారు. బిలియర్డ్స్ ఆటలో ఆచారి 400 పాయింట్లు 'బ్రేక్'లో వున్నాడు. ఈ సుగ్రవెట్టులో సీరాబ్బు 'తా' అంటున్నాడు వెంకటేశ్వర రావు. అలా పందెం పెట్టి చీట్లపేక ఆడేవాళ్ళ గోల అంతాఇంతా కాదు. పత్రికలు చదువుతూ వ్యాఖ్యానాలు చేస్తూ వాదించుకుంటున్నారు రాజకీయ పండితులు. హాలులో 4 బల్లల చుట్టూ 20 రూ.లు పెట్టే పూలు గేము ఆడేవాళ్ళు సీరియస్‌గా ముక్కల వంక చూస్తున్నారు. రూ.1000 పందెం పెట్టి ప్రత్యేక గదిలో చీట్లపేక ఆడేవాళ్ళు ఏకదీక్షతో ఆడుతున్నారు. అందరికీ 99 పాయింట్లే వున్నాయి. ఎవరు షో చేస్తే వారికి బల్లమీద పలక క్రింద వున్న నాలుగువేల రూపాయలు వస్తాయి. ధ్యాన ముద్రలో వున్న తపస్సంపన్నుల వలె వున్నారు ఆటగాళ్ళు. రేడియో రూములో కూర్చుని రేడియో వింటున్న సుబ్బారావు ఒక్కసారి కేకపెట్టాడు. 'గాంధీ గారిని చంపారండోయ్' అనే పొలికేక అది. వెంటనే విషాద సంగీతం వెలువడింది. సభ్యులంతా ఎక్కడివారు అక్కడ లేచి రేడియో దగ్గరకు పరుగెత్తారు. పలకల క్రింద వందలు వేల పైకాలను ఎవరూ పట్టించుకోలేదు. ఏం జరిగింది, ఎలా జరిగింది? అంటూ రేడియోను సమీపించారు. రేడియోను గదిలో నుండి వరండాలోకి తెచ్చారు సభ్యులు. అందరికీ అసలు విషయం తెలుసు కోవాలన్న తహతహ. మామూలుగా రాత్రంతా చీట్లపేక కోసం తెరచివుండే క్లబ్ ఆరోజు గంట తర్వాత మూత పడింది. క్లబ్ తెరచిన నాటి నుండి ముప్పది ఏళ్ళలో మూత పడింది ఆ ఒక్క రోజునే.

చదరంగం ఆడేవారి దీక్షను గురించి కథలు చెప్తారు. మీ నాయన చనిపోయాడురా అంటే ఇదేగా తీసుకొని వెళ్ళేద్దాం నేను ఆ వేళకు కలుస్తాన్లే అంటూ పావును ముందుకు కదుపుతాడుట చదరంగపు ఆటగాడు. ఇక రమ్మీ ఫ్లాలు ఆటగాళ్ళ.

సంగతి సరేసరి. పల్లెటూళ్ళ నుండి వచ్చి క్లబ్ నాన్ రెసిడెన్షియల్ మెంబరుగా చేరి క్లబ్బులోనే కాపురం పెట్టారు వాళ్ళు. పెళ్ళాం బిడ్డల వూసే వుండదు ఇంటినుండి తెచ్చిన పదివేలు అయిపోయిందాకా. ఇలాంటి వ్యసన పరులు కూడా స్పందించారు గాడ్సే గాంధీని తుపాకితో కాల్చిన గాథ విని.

అధికారులు అనధికారులు, ఉన్నతులు, హీనులు, పండితులు పామరులు, ధనికులూ, నిరుపేదలు, కవులు, గాయకులు, పరిపాలకులు పరిపాలితులు, నాయకులు, అనుచరులు, యజమానులు సేవకులు, ఉద్యోగులు నిరుద్యోగులు, అక్షరాస్యులు, నిరక్షరాస్యులు ఇలా అన్ని తరగతుల వారు, అన్ని అంతస్థుల వారు అన్ని అర్హతల వారు ఈ ఒక్క సమయంలో ఒకే రకంగా శోకసాగరంలో మునిగి పోయారు. తమ హోదాలను, అంతస్తులను, స్థాయిలను మరచి ఒకరితో ఒకరు తమ బాధను వ్యక్తం చేయడం అపూర్వమైన విషయం. 'హంతకుణ్ణి నరకాలి, చంపాలి అనే ద్వేషభావం కూడా వారిలో ఉదయించలేదు. ఆ అహింసా మూర్తి గాంధీజీ ప్రభావమేమో! ఇందిరా గాంధీ హత్య జరిగితే వేలకువేలు సిక్కులను చంపిన సంఘటనకు, రాజీవ్ గాంధీ హత్యను సాకుగా తీసుకొని ప్రత్యర్థుల ఆస్తులను ధ్వంసం చేసిన సన్నివేశానికి ఇది ఎంత వ్యత్యాసమో! మహాత్ములు చనిపోయి కూడా ప్రజలను ప్రభావితులను చేస్తారు కదా!

# రాడికల్ డెమోక్రటిక్ పార్టీ రద్దు

తను పెంచిన మొక్కను త్రుంచడం కష్టము. తను కట్టించిన యింటిని తనకు కాకుండా చేసుకొని అమ్మివేయడం మనస్తాపానికి కారణభూతమవుతుంది. బహుశః అందుకనే కాబోలు తామెరిగిన కాంగ్రెసు యీనాడు లేకున్నా, 'మేము కాంగ్రెసులో పుట్టాం, కాంగ్రెసులోనే చనిపోతాం' అంటూ యిప్పటికీ కొందరు కాంగ్రెసును బలపరుస్తున్నారు. గాంధీ కాలపు కాంగ్రెసు యీనాడు లేదు. అయినా గాంధీవాదులు కాంగ్రెసుకు మద్దతు యిస్తున్నారు. జవహర్‌లాల్ నెహ్రూ సోషలిజం పట్ల విశ్వాసం వున్నవారు సోషలిజానికి తిలోదకాలిచ్చి పెట్టుబడిదారీ విధానాన్ని పెంచే కాంగ్రెసు పార్టీకి వత్తాసు పలుకుతున్నారు. అలవాటుకు బానిసలవడం వల్ల క్రొత్త ఆలోచనను స్వీకరించే సత్తాలేక చాలమంది యిలా ప్రవర్తిస్తున్నారు. ఆలోచనల విషయంగా నిత్య యవ్వనులు యీ సంప్రదాయానికి వ్యతిరేకులు. అలాంటి వారిలో ముఖ్యుడు ఎం.ఎన్. రాయ్.

**1918** నుండి తను నమ్మిన మార్క్సిజాన్ని కాదని హ్యూమనిజాన్ని తన జీవిత తత్వంగా స్వీకరించగల్గాడు. తను **1940**లో నిర్మించిన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీని **1948**లో రద్దు చేయించాడు. ఈ సందర్భంగా **1948**వ అఖిల భారత రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ మహాసభ సన్నివేశాలు ఆసక్తికరాలు. రాజకీయ పార్టీ ప్రజలకు రాజ్యానికి మధ్య ఉండే సంస్థగా రూపొంది ప్రజల ప్రతినిధిగా మొదలయి చివరకు ప్రజల సార్వభౌమాధికారాన్ని వమ్ము చేస్తున్నదని రాయ్ భావించాడు. రాజకీయ పార్టీ అధికారం ప్రజల అధికారం కావటం లేదని గుర్తించాడు. రాజకీయ పార్టీ ఉనికి ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టు అనే నిర్ణయానికి వచ్చాడు. తమ కోసం తప్పుడు పని చేయజాలని వ్యక్తిని పార్టీ కొరకు అకృత్యాలను పార్టీ చేయిస్తుందని తెలుసుకున్నారు. క్రమశిక్షణ పేర సభ్యుని స్వాతంత్ర్యాన్ని పార్టీ హరిస్తుందని గమనించాడు. పార్టీ అనే చట్రంలో సభ్యుడు ఒక కొరముట్టుగా తయారవుతాడని రాయ్ గ్రహించాడు. అందుకనే పార్టీ రద్దు ప్రతిపాదనను మహాసభ ముందు పెట్టాడట. పార్టీ కొనసాగాలనేవారు వివిధ వాదనలను మహాసభకు నివేదించారట. 'ఈ పార్టీ కోసం నేను తల్లిదండ్రులను వదులుకున్నాను; చుట్ట పక్కాలను విడనాడాను; ఆస్తులను త్యాగం చేశాను. పదవులను విసర్జించాను. దీనిని తీసివేస్తే నేనెట్లా జీవించేది' అని రాయ్‌ను ప్రశ్నించాడట ఒక సభ్యుడు. 'అందుకే పార్టీని రద్దు చేయమంటున్నాను' అని రాయ్ సమాధానం యిచ్చాడట. 'పార్టీ నీ ఆలోచనను అరికడుతున్నది. సర్వ స్వతంత్రుడవు కావలసిన నిన్ను కట్టిపడవేస్తున్నది. నిన్ను అస్వతంత్రుణ్ణిగా చేస్తున్నది. దాని ఊతి లేకుండా నీవు జీవించలేకున్నావు. ఇది శోచనీయం' అన్నాడట రాయ్. కొంతమంది ఏమయినా సరే పార్టీని రద్దు చేయటానికి వీలులేదన్నారట. 'అలాగే చెయ్యండి. మీకు ఆ హక్కు ఉంది. అయితే ఆ పార్టీలో నేనుండను. ఇలా అనడానికి నాకు హక్కుంది' అన్నాడట రాయ్. చివరకు పార్టీ ఉనికి కోల్పోయింది.

నేను **1948**లోని అఖిల భారత మహాసభకు హాజరు కాలేదు. మహాసభ అనంతరం

ఉద్యమం కొనసాగుతుందన్నారు. రద్దుకు పూర్వం వున్న రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ఆంధ్ర రాష్ట్ర కార్యవర్గం గుంటూరులో మా యింట్లో సమావేశమయింది. 'అసమర్థుని జీవయాత్ర' రాసిన సుప్రసిద్ధ రచయిత గోపీచంద్ రద్దు నాటికి ఆంధ్ర రాష్ట్ర ప్రధాన కార్యదర్శి. ఆయన కూడా సమావేశానికి హాజరు అయ్యాడు. కలకత్తా మహాసభ విశేషాలను, చర్చలను, తీర్మానాలను మాకు ఎరుక పర్చారు మహాసభకు వెళ్ళివచ్చిన ప్రతినిధులు. ఈ నిర్ణయం మింగుడు పడలేదు కొందరికి. అనేక అభ్యంతరాలు లేవనెత్తారు. పార్టీల ఉనికి లేకుండా ప్రజాస్వామ్యం ఎలా సాధ్యమని ప్రశ్నించారు. మామూలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి నిర్మాణ ప్రజాస్వామ్యానికి వున్న తేడాను, నూతన రాజ్య విశిష్ట లక్షణాలను వివరించడం జరిగింది. చిట్ట చివరకు మెజారిటీ సభ్యులు మహాసభ నిర్ణయాలకు సమ్మతి తెలిపారు. ఒక విషయం చర్చల్లో బయటకి వచ్చింది. పార్టీలో బాధ్యతగల స్థానంలో వున్న వ్యక్తి అవినీతికర చర్యకు పాల్పడినాడనుకోండి. అతని చర్యకు మీరు జవాబుదారీ వహించాల్సి వుంటుంది. అతడు పార్టీలో ఉన్నంత వరకు ఇప్పుడు, పార్టీలేని స్థితిలో, ఉద్యమం సాగే రోజుల్లో 'అతడు అలా చేశాడతని నాకు నమ్మకం లేదు. ఒకవేళ అతడు అలా చేస్తే అది తప్పే. తప్పక ఖండించ వలసిందే' అని ఆత్మవిశ్వాసంతో, నిజాయితీగా పలకగల సత్తా వుంటుంది ఉద్యమంలో. పార్టీలో ఇరువురూ వుంటే అలా మాట్లాడటం కష్టం అవుతుంది. అంతేకాదు కమ్యూనిస్టు పార్టీ వంటి క్రియాశీలక పార్టీలో స్థితిగతులు యింకా అధ్వాన్నంగా వుంటాయి. ఉదాహరణకు ఒక విషయం తీసుకుందాం. **1941** చివరలో రష్యాపై దండయాత్ర జరిగిన నాటినుంచీ ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని ప్రజా యుద్ధంగా అభివర్ణించారు కమ్యూనిస్టులు. ఈ నినాదం చాలామంది కమ్యూనిస్టులకు నచ్చలేదు. కాని వారు నిబంధనల మేరకు సభ్యులుగా కావాలంటే తమకు నచ్చని నినాదాన్ని యివ్వాలి; ప్రచారం చేయాలి. ఇది కష్టసాధ్యం. కొంతమంది సభ్యులకు **2, 3** నెలల గడువు యిచ్చి ఆత్మ పరిశీలన చేసుకోమంది పార్టీ. అలా సెలవు తీసుకున్నవారు పార్టీ నిర్ణయాన్ని శిరసావహిస్తే పార్టీలో వుండనిస్తారు. లేకపోతే బహిష్కరిస్తారు. రాజీనామా చేస్తే చేయనిచ్చే పద్ధతి కమ్యూనిస్టు పార్టీలో లేదు. అలా పార్టీ కార్యకలాపాల నుండి సెలవు తీసుకొని, మనస్సును సమాధాన పరుచుకొని తిరిగి పార్టీలో చురుకుగా పనిచేసిన కమ్యూనిస్టు నాయకులున్నారు. ఇది కమ్యూనిస్టు పార్టీ క్రమశిక్షణ తీరు.

ఉద్యమంలో వున్న వ్యక్తి నిజాయితీగా వ్యవహరించగలడు. నచ్చని విషయాన్ని 'నచ్చనిది' అని చెప్పగలడు. పార్టీ క్రమశిక్షణకు భయపడిగాని, పార్టీ నుండి దూరం కావటం యిష్టం లేక కాని తన అంతరంగాన్ని చంపుకుని ఆత్మవంచన చేసుకోవలసిన పరిస్థితి లేదు. అంతేకాదు మరో పార్టీ కాని, మరో పార్టీలోని వ్యక్తిగాని మంచి పని చేస్తే మెచ్చుకోగలడు; ప్రశంసించగలడు. అలాచేస్తే మరో పార్టీ పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయని భయపడనవసరం లేదు. మానసిక స్వేచ్ఛకు, స్వతంత్ర కార్యాచరణకు ఉద్యమం దోహదం చేస్తుంది; పార్టీ అడ్డంకులు కల్పిస్తుంది. **1948** నుండి ఈ భావాల ప్రాబల్యంతోనే జీవయాత్ర సాగిస్తున్నాను. ఎంతవరకు కృతకృత్యుడిని అయ్యానో పరులు తేల్చవలసిన అంశం.

బలపరచలేదు.

ఆ ఎన్నికలలోనే మరొక సంఘటనను గురించి చెప్పవలసి వుంది. అశేష త్యాగాలు చేసి, తన ధన వస్తు వాహనాలను కాంగ్రెసుకు వినియోగించి, కారాగార శిక్షననుభవించిన శ్రీ మంతెన వెంకటరాజు ప్రకాశం పంతులుగారిని మద్రాను ప్రెసిడెన్సీ ముఖ్యమంత్రి పదవి నుండి తొలగించే ప్రయత్నంలో ముఖ్య పాత్ర వహించి మధ్య తరగతి ప్రజానీకంలో అప్రతిష్ట పాలయినాడు. అంతటితో ఆగక అక్రమంగా ఆస్తుల సంపాదనకు పూనుకున్నాడు. కాంగ్రెసు మంత్రులంతా తన చెప్పుచేతల్లో వున్నారని రుజువు చేసే నిమిత్తం ఒక్కసారిగా 10 మంది రాష్ట్ర మంత్రులకు తన గ్రామంలో సభలు, ప్రారంభోత్సవాలు ఏర్పాటు చేసి బల ప్రదర్శన చేశాడు. ఆయనపై ప్రజలకు ఆగ్రహం కలిగింది.

ఆనాడు బాపట్ల పట్టణంలో సుమారు వందమంది న్యాయవాదు లుండేవారు. అక్కడే బాపట్ల, ఒంగోలు రెండు తాలూకాలపై అధికారం కల సబ్‌కోర్టు వుండేది. ఆ కోర్టులో ఎన్ని కోట్ల రూపాయిలకయినా దావా వేయవచ్చును. 'మా దృష్టిలో శ్రీ మంతెన వెంకటరాజు అసెంబ్లీలో అభ్యర్థిగా అనర్హుడు' అనే వాక్యం రాసి దాని క్రింద న్యాయవాదుల సంతకం చేయించాం. 46 మంది న్యాయవాదులు అలా దస్కతు పెట్టారు. దస్కతు చేసినవారిలో యించుమించుగా ప్రముఖ న్యాయవాదులందరూ వున్నారు. ఈ కాగితాన్ని అచ్చువేసి పంచాము. ఇది సామాన్య వోటర్లలో చర్చనీయాంశమయింది. ఈ కరపత్రాన్ని కమ్యూనిస్టులు తిరిగి అచ్చువేసి పంచారని వినికిడి.

కాంగ్రెసు వ్యతిరేకత వెల్లువలా పొంగింది. కాంగ్రెసేతరులు, కమ్యూనిస్టేతరులు ఇద్దరు అభ్యర్థులు ఉండటం శ్రేయస్కరం కాదనే అభిప్రాయం బలపడసాగింది. ఆ వాతావరణంలో సోషలిస్టు అభ్యర్థి శ్రీ బెండపూడి నారాయణ రావు పోటీనుండి విరమించాడు. అనేక శక్తుల, వ్యక్తుల, సంస్థల, పార్టీల కృషి ఫలితంగా శ్రీ మంతెన వెంకట రాజు సుమారు 2వేల వోట్ల తేడాతో ఓడిపోయాడు. శ్రీ వేములపల్లి శ్రీకృష్ణకు బాపట్ల అసెంబ్లీ సీటు దక్కింది. ప్రజాభిప్రాయానికి విలువ వుందని, సత్తా వుందని రుజువయింది.

**1948**లో తెలంగాణా పోరాటానికి కమ్యూనిస్టులు పిలుపు యిచ్చారు. అంతకు క్రితం రజాకార్లతో కొట్లాడుతున్న కమ్యూనిస్టులు నైజాం సైన్యంతో తలపడాల్సి వచ్చింది. వరంగల్, ఖమ్మం, కరీంనగర్, నల్లగొండ జిల్లాల్లో పేద ప్రజానీకం కమ్యూనిస్టుల నాయకత్వాన వీరోచితంగా పోరాడారు. ఇంతలో కేంద్ర అంతరంగిక శాఖ మంత్రి శ్రీ సర్దార్ వల్లభాయి పటేలు ఆదేశాన్ననుసరించి కేంద్ర సైన్యాలు నైజాం సంస్థానంలో ప్రవేశించాయి. స్వతంత్ర రాజ్యంగా నైజాం సంస్థానం ఉంటుందని ఊగిసలాడిన నైజాం లొంగిపోయి ఇండియన్ యూనియనులో చేరక తప్పలేదు. కమ్యూనిస్టు నాయకత్వంలో అభిప్రాయభేదాలు వచ్చాయి. పోరాటాన్ని ఆపుదామని శ్రీ రావి నారాయణ రెడ్డి అంటే సర్వశ్రీ సుందరయ్య, బసవ పున్నయ్యలు 'ససేమిరా వీల్లేదు' పోరాటాన్ని కొనసాగించ వలసిందే అన్నారు. అది **1951** చివరిదాకా సాగింది. **1952**లో అసెంబ్లీలకు ఎన్నికలు జరిగాయి. పోరాటాన్ని నిలిపి వేసిన కమ్యూనిస్టులు ఎన్నికల రంగంలోకి దిగారు.

**1946** నుండి మదరాసు ప్రెసిడెన్సీలో అధికారం చలాయించిన కాంగ్రెసు మంత్రివర్గం అప్రతిష్ట పాలయింది. ఈ అవకాశాన్ని వాడుకోతలచుకున్నారు ఆంధ్ర, తెలంగాణా ప్రాంత కమ్యూనిస్టులు. ప్రభుత్వం రాష్ట్రం మొత్తం మీద ఒక్క రోజునే ఎన్నికలు జరుపకుండా నాలుగు అంచెల మీద నాలుగు రోజులు ఎన్నికలు జరిపించారు. **2, 3** వేల మంది కార్యకర్తలను మాత్రమే సమీకరించగల్గిన ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీకి యీ విధానం ఉపకరించింది. చేతులలో జెండాలతో, దుస్తుల సంచీలతో వారు కార్యరంగంలోకి దూకారు. ఒక నియోజక వర్గానికి కేటాయించబడిన కమ్యూనిస్టు వలంటీర్లు రెండవ అంచలోని మరో నియోజక వర్గానికి తరలివచ్చారు. 'ఓడించాము, ఓడించాము, కాంగ్రెసు మంత్రిని ఓడించాము' అని రైలు దిగంగానే ఊరేగింపులో వచ్చిన కమ్యూనిస్టు వలంటీర్లు నినాదాలు యిస్తుంటే ఎన్నికల వాతావరణమే మారిపోయేది.

ఒక్క మంత్రి తప్ప తతిమ్మా కాంగ్రెసు మంత్రులంతా ఓటమి చవిచూచారు. కమ్యూనిస్టు అభ్యర్థులు గణనీయమైన సంఖ్యలో గెలుపొందారు. తెలంగాణాలో సరేసరి. వారు తెలంగాణా పోరాట వీరులుగా 'పీపుల్సు డెమోక్రాటిక్ ఫ్రంటు' పేరున వారు నిర్మించిన సంఘటన పక్షాన విజయం పొందారు.

**1950** ఆగస్టు నుండి నేను బాపట్లలో ప్లీడరుగా స్థిరపడ్డాను. **1952**లో బాపట్ల అసెంబ్లీ నియోజక వర్గంలో కాంగ్రెసు పార్టీ అభ్యర్థి శ్రీ మంతెన వెంకటరాజు, కమ్యూనిస్టు అభ్యర్థి శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ, 'చేయెత్తి జైకొట్టు తెలుగోడా' గేయ రచయిత. దరిమిలా ఆంధ్రప్రదేశ్ శాంతి సంఘ సారథిగా పేరెన్నికగన్న వ్యక్తి. బాపట్లలో న్యాయవాదులలో నల్గురు మిత్రులు సోషలిస్టులుగా చలామణీ అయ్యేవారు. వారు సర్వశ్రీ మంతెన సుబ్బరాజు, పిల్లుట్ల హనుమంతరావు, బెండపూడి నారాయణ రావు, కర్లపూడి వెంకటేశ్వర్లు చౌదరి. వారిలో శ్రీ మంతెన సుబ్బరాజును సోషలిస్టు అభ్యర్థిగా పోటీ చేయించాలనే ఆలోచన వచ్చింది. రాడికల్ హ్యూమనిస్టులము సోషలిస్టు పార్టీ విధానం సన్నిహితం కనుక శ్రీ మంతెన సుబ్బరాజును బలపరచ నిశ్చయించాము. కాని సోషలిస్టులు మనసు మార్చుకొని శ్రీ బెండపూడి నారాయణ రావును అభ్యర్థిగా రంగం మీదికి తెచ్చారు. ఈ హఠాత్పరిణామానికి నేను దిగ్భ్రాంతి చెందాను. 'బెండపూడి నారాయణ రావుగారికి సూటి ప్రశ్నలు' అని కరపత్రం వేశాను. కరపత్రాల ద్వారా నా అభిప్రాయ ప్రకటన చేయటం, బహిరంగంగా సభలను ఏర్పాటుచేసి ప్రసంగించడం నేను ఎంచుకున్న విధానం. (అలా **1972** వరకు బాపట్ల, చీరాల పట్నాలలో వ్యవహరించాను) నేను సోషలిస్టు అభ్యర్థిని

# ప్రథమ మునిసిపలు ఎన్నికలు

బాపట్ల పట్టణం ప్రప్రథమంగా మ్యునిసిపాలిటి అయింది. అసలు ఊరికి చుట్టు ప్రక్కల పల్లెలను కలిపి మేజరు పంచాయితికి మ్యునిసిపాలిటీ హోదా యిచ్చింది ప్రభుత్వం. 20 మంది మ్యునిసిపలు సభ్యులు. నా మేనమామ కుమారులు పురుషోత్తం, సూర్యనారాయణ యిరువురు చెరో వార్డు నుంచి అభ్యర్థులు. చిన్నవాడు సూర్యానారాయణ కాంగ్రెసు కార్యకర్త. అతనికి నేను మద్దతు యిచ్చే ప్రసక్తి లేదు. పెద్దవానికి రాజకీయ రంగు లేదు. అతడు నా సహాయాన్ని కోరాడు. ఒక్క షరతు మీద అంగీకరించాను. అతడు వోట్లు కొనరాదు; వోటర్లకు సారా పోయించ రాదు. ఆ షరతు మీద ఎన్నికల బాధ్యత నాకు అప్పచెప్పాడు. అవతల ప్రత్యర్థి ప్రఖ్యాత న్యాయవాది మాధవ పెద్ది కాళిదాసుగారు. ఆయన కాంగ్రెసువాది; వదాన్యుడు. ఇంకొక విచిత్ర విషయం ఆ ఊళ్ళో బయటపడి నిందించు కోవటం, కొట్టుకోవడం లేకపోయినా బ్రాహ్మణులు రెండు వర్గాలుగా ఉండేవారు. వైదీకులు, నియోగులు అని రెండు వర్గాలు అవి. తమాషా ఏమంటే మా మేనమామ పెద్ద కుమారుడు పోటీచేసే వార్డులో పోటీచేసే అభ్యర్థులిద్దరూ వైదికులే. కాని యీ వైదిక నియోగి వైషమ్యం ఉదయించడానికి ఆస్కారం లేదు. పోలింగు రోజు సాయంత్రం 4 గంటల ప్రాంతంలో ఒక వోట్ల బ్రోకరు నా వద్దకు వచ్చి 11 ఎరుకల వారి వోట్లు (నేటి సుగాలీలు) రూ. 20లకు యిస్తారన్నారు. 'నేను వోట్లు కొనను; నాకు లక్కర లేదు' అని తిరస్కరించాను. అంత వారు కాళిదాసుగారి ఎన్నికల ఏజంటుగా వున్న ఒక న్యాయవాది వద్దకు వెళ్ళారు. అతడు 20 రూపాయలు యిచ్చి ఆ వోట్లను కాళిదాసుగారికి వోటు చేయించాడు.

ఎన్నికల ఫలితాలను మరునాడు ప్రకటించారు. నా అభ్యర్థి పురుషోత్తంను కాళిదాసుగారు 5 వోట్లలో ఓడించారు. ఫలితం తెలియగానే నేను న్యాయవాది సంఘంలో వున్న కాళిదాసు గారిని అభినందించాను. 'నాది నైతిక అపజయం' అని వారన్నారు. దాంతో ఆయనపై నా గౌరవం ఇనుమడించింది. శ్రీ బొలిశెట్టి సీతారామయ్య 12వ వార్డు నుంచి పోటీ చేస్తానని ప్రకటించాడు. ఆ సీతారామయ్య వద్ద మూడు వేల రూపాయల అప్పు తీసుకొని నా మేనమామ రెండవ కుమారుడు సూర్యనారాయణ అదే వార్డు నుంచి పోటీకి దిగాడు. వోట్లు కొన్నాడు. సారా పోయించాడు. కాఫీ హోటళ్ళలో ఫలహారాలు పది రోజులు తినిపించాడు. చివరి నిమిషం వరకు 2 వందల మంది వోటర్లు నిషాలో వున్నారు. ఆఖరి క్షణంలో సూర్యనారాయణ గారికి వోటు ఇమ్మని ఆ త్రాగిన వోటరు తండ్రి, మామ భార్యల చేత చెప్పించి వాళ్ళ వోట్లను పొందగలిగాడు. రూ. 800 సారాకు, రూ. 800 వోట్ల కొనుగోలుకు, రూ. 800 కాఫీ హోటలుకు, స్టేషనరు రు. 600 వెరశి 3వేల రూపాయలు హారతి కర్పూరంలా ఖర్చు అయినది. అయితేనేం శ్రీ బొలిశెట్టి సీతారామయ్యపై గెలిచాననే కీర్తి మిగిలింది శ్రీ సూర్యనారాయణకు.

ఇక ఛైర్మను ఎన్నిక, తన వార్డు నుండి ఎన్నికయిన శ్రీ వెలగపూడి సుబ్బారావు గారు తను ఛైర్మను కాండిడేటును అన్నాడు. ఆయన, కాళిదాసుగారు సమఉజ్జీలు న్యాయవాద వృత్తిలో. ఆయన తన భార్య పేర 'సరస్వతీ మెమోరియల్ బాలికల

హైస్కూలు' నెలకొల్పి నడుపుతున్నారు. ఆయన సచ్ఛీలుడు. ఉదారవాదియైన జాతీయవాది. శ్రీ వెలగపూడి సుబ్బారావు గారికి తన ఒక్క వోటు తప్ప మరో వోటు లేదు. నా మేనమామ కుమారుడు సూర్యనారాయణ ఛైర్మన్ పదవిని ఆశించబూనాడు. అతడు బి.ఎ. చదివిన వ్యక్తి. తన తండ్రిగారికి పరిచయస్తుడయిన శ్రీ కాకుమాను రామస్వామిని వోటు అడిగాడు. ఆయన యిస్తానన్నాడు. అప్పటికి అతనికి తన వోటుతో సహా రెండు వోట్లు. లబ్ధి చూపి ఒక క్రైస్తవ మ్యునిసిపలు కౌన్సిలరు, ఒక ముసల్మాను కౌన్సిలరు వీరిరువురి వోట్లను తమవిగా చేసుకున్నాడు. అప్పటికి నాలుగు వోట్లు అయినయి. ఎంత ప్రయత్నించినా మరొక వోటును సంపాదించలేక పోయాడు. ఈ పరిస్థితులలో శ్రీ బొలిశెట్టి సీతారామయ్య నా దగ్గరకు వచ్చి శ్రీ సూర్య నారాయణ తన వద్ద తీసుకున్న 3వేల రూపాయల అప్పును రద్దు చేస్తానని సూర్య నారాయణ చేత అతని వోటుతో సహా నాల్గు వోట్లు తన సీనియరు న్యాయవాది కాళిదాసు గారికి యిప్పించమని కోరాడు. నేను కలుగజేసు కోటానికి నిరాకరించాను. 'ఏం చేయమంటావు' అని సూర్యనారాయణ నన్ను సలహా అడిగాడు. 'ఎలాగూ నీకు అవకాశం లేదు. మీ తండ్రి తాతల నుండి మన కుటుంబానికి సన్నిహితులయిన వెలగపూడి వారి కుటుంబంలో పెద్ద సుబ్బారావు గారిని ఛైర్మను పదవికి బలపరచమన్నాను. సూర్యనారాయణ అంగీకరించాడు. వెంటనే వెళ్ళి మా నాలుగు వోట్లు మీవన్నాడు సుబ్బారావుగారితో. అప్పటికి సుబ్బారావుగారికి 5 వోట్లు. ఆయన, తతిమ్మా సభ్యులు కదలి కాళిదాసుగారి యింటికి వెళ్ళారు. వారి వోటును అభ్యర్థించారు. 'ఇందులో ఏదో తిరకాసువుంది' అన్నారు కాళిదాసుగారు. 'తిరకాసు లేదు; మేము మనస్ఫూర్తిగా సుబ్బారావుగారిని బలపరుస్తున్నాము' అని సూర్యనారాయణ చెప్పారు. తతిమ్మా కౌన్సిలర్లను కలిశారు సుబ్బారావు గారు. మరునాడు ఉదయం 8 గంటలకు ఛైర్మను ఎన్నిక. పోటీ కమ్యూనిస్టు పార్టీ నుండి. ఉదయం 7 గంటలకు 'మీ పేరు ప్రతిపాదిస్తాను' అని కాళిదాసుగారు సుబ్బారావుగారికి కబురంపారు. ఎన్నిక జరిగింది. సుబ్బారావు గారు ఎన్నికయ్యారు. నా మేనమామ కుమారుడు శ్రీ యడవల్లి సూర్యనారాయణ వైదీకి శాఖకు చెందినవాడయి వెలగపూడి సుబ్బారావుగారు నియోగి శాఖకు చెందిన వారయినందు వల్ల యిరు శాఖలవారి మధ్య సయోధ్య పెరిగింది. శాఖాభేద భావం నాకు లేదని విజ్ఞులు తెల్పారు.

మామూలుగా పుట్టుకను పట్టే మనుష్యులను అంచనా వేస్తారు. నేనెంత రాడికల్ హ్యూమనిస్టునని చెప్పుకున్నా రామమూర్తికి శాఖా భేదం లేకుండా వుంటుందా అని సందేహించిన వారికి కనువిప్పు అయింది.

# ఆంధ్రోద్యమం

1913లో బాపట్లలో జరిగిన మహాసభలో ఆంధ్ర తీర్మానం ఆమోదించబడింది. ఆనాటికి నేను పుట్టలేదు. కాంగ్రెస్‌లోని ఆంధ్ర నాయకుల అభ్యర్థన మీద ఆంధ్ర కాంగ్రెసు కమిటిని వేరుగా నిర్మాణం చేసింది కాంగ్రెసు సంస్థ. అందువల్ల మద్రాసులో ఆంధ్ర కాంగ్రెసు సంఘం, తమిళ కాంగ్రెసు సంఘం రెండూ పనిచేయసాగాయి. మద్రాసు నగరంలో మాకూ భాగస్వామ్యం ఉందని ఆంధ్ర కాంగ్రెసు వాదులు తలపోయడంలో రెండు సంఘాలు తమ తమ శాఖల కార్యాలయాలను అచ్చట నెలకొల్పాయి.

ఆంధ్ర కాంగ్రెసు వారు ఆంధ్రరాష్ట్ర ఆందోళనను కొనసాగించడం కొంచెం ఇబ్బంది కరమయింది. కాంగ్రెసు క్రమశిక్షణ ముందు ముందు అడ్డువస్తుందని అనుకున్నారేమో కాంగ్రెసు వాదులు బాహిరంగంగా ఈ నినాదాన్ని చేపట్టలేకపోయారు. ఆంధ్ర మహాసభ ఆ పనిని చేపట్టింది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్ర మహాసభ అధ్యక్షులు. ఆయన ప్రసిద్ధ జాతీయవాది. దేశభక్తులు, కాంగ్రెస్ వాది, గ్రంథాలయోద్యమం, వయోజన విద్యారంగం, ఆంధ్రోద్యమం ఆయన కార్యక్షేత్రాలు. ఏనాడో 1905 ప్రాంతంలో ఎం.ఏ.పట్టా పొందిన వ్యక్తి. ప్రభుత్వ నౌకరీ యిష్టం లేక ఉద్యోగాన్ని తిరస్కరించాడు. బాలగంగాధర తిలక్‌పై వ్యాసం రాసినందుకు దేశద్రోహ నేరం క్రింద 3 సంవత్సరాలు జైలు శిక్షకు పాత్రుడయినాడు. ఆయన రాయలసీమ వాసి. రాయలసీమ ప్రజలను ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖులను చేసిన మహానాయకుడు. మాయలు, మర్మాలు తెలియని మంచి మనిషి. వారి జీవిత కథను శ్రీ మాదల వీరభద్రరావు దక్షతతో రాసి ఆంధ్ర ప్రజలకు అందించారు. ఉయ్యూరు కుమార రాజా శ్రీ ఎం.ఆర్.అప్పారావు ఆ సంస్థకు అధ్యక్షులుగా వ్యవహరించారు. తరువాత ఆంధ్ర నాటక కళా పరిషత్తుకు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా వున్నారు.

శ్రీ జి.వి. పున్నయ్య శాస్త్రి ప్రధాన కార్యదర్శి. అతడు తన 12వ ఏటనే కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొన్న వ్యక్తి. రాయలసీమ ప్రాంతంలో కాంగ్రెసు ఉద్యమం పటిష్టం కావటానికి పాటుపడిన యువనాయకుడు. నేను గుంటూరులో వున్న చివరి రోజుల్లో ఆంధ్రమహాసభ వ్యవహారాల్లో ఆయనకు సాయపడేవాణ్ణి. ఆంధ్రుల ఆందోళన ఫలితంగా కాంగ్రెసు వర్కింగు కమిటీ జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయిపటేలు, పట్టాభి సీతారామయ్యలతో ఒక కమిటీని వేసింది. దానిని తీవ్రంగా వ్యతిరేకించారు ప్రకాశం పంతులుగారు. పత్రికా ప్రకటన రాయమన్నారు పున్నయ్య శాస్త్రిగారు. అందులో ప్రకాశం పంతులుగారి వైఖరిని కొంతగా విమర్శించాను. పున్నయ్య శాస్త్రిగారు నామీద నమ్మకంతో దస్కతుపెట్టి పత్రికలకు పంపారు. అది అచ్చయింది. దరిమిలా ఢిల్లీలో కలిసినపుడు ''ఏరా పున్నయ్యశాస్త్రీ! నన్ను విమర్శిస్తూ పత్రికా ప్రకటన చేశావే'' అని ప్రకాశం పంతులుగారు దబాయించారు. శాస్త్రికి వెంటనే ఆ పత్రికా ప్రకటన స్ఫురణకు రాలేదు. వెంటనే తెప్పరిల్లి ''అవును పంతులుగారూ! మరి మీ వైఖరి నచ్చలేదు'' అన్నాడు. ''సరేలేరా'' అన్నారు పంతులుగారు. ఎంతవాడినయినా ఒక్క మహాత్మా గాంధీని తప్ప ఏకవచన ప్రయోగంతో పల్కడం, చిన్నవాళ్లను

'రా' కొట్టి మాట్లాడటం ఆయన తీరు. గాంధీ గారిని మాత్రం 'గాంధి వున్నాడే ఆయన' అనేవారు.

రాష్ట్ర వాంఛ ఆంధ్రులలో పెల్లుబికింది. జవహర్ లాల్ నెహ్రూ మద్రాసు ప్రెసిడెన్సీ విభజనకు సూత్రప్రాయంగా అంగీకరించాడు. భాగపంపిణీకి మంత్రివర్గ కమిటీ వేశారు. అప్పటికి రాష్ట్రానికి 100 కోట్ల రూపాయల మిగులు నిధులు వున్నాయి. దానిలో ఆంధ్ర ప్రాంత వాటా 30 కోట్లుగా తేల్చారు. బళ్లారి పట్టణం, బళ్లారి తాలూకాతో సహా బళ్లారి జిల్లాలోని మూడు తాలూకాలు ఆంధ్ర ప్రాంతంలో కలుపడానికి నిశ్చయింపబడింది. అయితే మదరాసు పట్టణాన్ని రెండుగా చీల్చాలని అందులో కొంత ఆంధ్ర రాష్ట్రంలో కలపాలని శ్రీ ప్రకాశం పంతులుగారు కోరారు. తమిళ నాయకులు అంగీకరించలేదు. విభజన ప్రయత్నం విఫలమయింది.

రాష్ట్ర నిర్మాణం విషయంలో ఆంధ్ర నాయకులలో బేధాభిప్రాయాలు పొడచూపాయి. మద్రాసు నగరం లేకుండా ఆంధ్ర రాష్ట్రాన్ని స్వీకరించడానికి సర్వశ్రీ కళా వెంకట రావు, సంజీవ రెడ్డి, గోపాల రెడ్డి ప్రభృతులు సిద్ధపడ్డారు. ఆంధ్ర కమ్యూనిస్టులు బలపరిచారు. రాడికల్ హ్యూమనిస్టులం మేమూ దాన్ని అంగీకరించాం. మద్రాసు నగరంలో ఉత్తర ప్రాంతం ఆంధ్ర రాష్ట్రంలో భాగంగా వుండ వలసిందేనని ప్రకాశం పంతులుగారు పట్టుపట్టారు. మద్రాసు నగరంలో వాటా కావాలనే హక్కును వదులుకోము కాని ప్రస్తుతానికి మద్రాసు నగరం లేని ఆంధ్ర రాష్ట్రాన్ని అంగీకరిద్దామని ఆచార్య రంగా గారు ప్రతిపాదించారు. 'మీ మధ్య ఐక్యత ఏర్పడితేనే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయం ఆలోచిస్తానని నెహ్రూ పండితుడు చెప్పాడు. పొట్టి శ్రీరాములుగారు గాంధీజీ సిద్ధాంతాలను త్రికరణ శుద్ధిగా నమ్మి ఆచరణలో పెట్టే నిజాయితీపరుడు. గాంధీగారి అంతే వాసి. మదరాసు విషయమై ఆంధ్ర నాయకుల మధ్య ఐక్యత సాధించేటందుకు ఆయన ఆమరణ నిరాహార దీక్ష పూనారు. మహర్షి బులుసు సాంబమూర్తి గారు ఆయన నిశ్చయాన్ని బలపరిచారు. సాంబమూర్తి గారు సుప్రసిద్ధ కాంగ్రెస్ నాయకులు. మదరాసు రాష్ట్ర శాసన సభాధ్యక్షులుగా పేరెన్నిక గన్నవారు. నిరాహార దీక్షను విరమించమని - నెహ్రూతో సహా - ఎందరు కోరినా - శ్రీరాములుగారు సమ్మతించలేదు. చివరకు ఆయన అసువులు బాశారు.

ఆంధ్ర ప్రాంతం అట్టుడికి పోయింది. అనేక పట్టణాలలో అల్లర్లు జరిగాయి. విజయవాడలో వేలాది శ్రమ జీవులు రైల్వే వాగన్లను పగలగొట్టి సామాగ్రిని దోచుకున్నారు. పట్టపగలు వారు వస్తువులను బహిరంగంగా మోసుకుని వెళ్ళారు. నగరాలలో ప్రజా జీవితం స్తంభించి పోయింది. మదరాసు పట్టణం లేని ఆంధ్ర రాష్ట్రాన్ని, బళ్లారి, బళ్లారి జిల్లాలోని మూడు తాలూకాలు లేని ఆంధ్ర రాష్ట్రాన్ని నెహ్రూ మంజూరు చేశారు. మదరాసు ప్రెసిడెన్సీలోని తెలుగు ప్రాంతాల శాసన సభ్యులతో ఆంధ్ర రాష్ట్ర శాసన సభ నిర్మాణం చేస్తామన్నారు. 1954లో ఆంధ్ర రాష్ట్రం అలా ఉద్భవించింది. పూర్వం మదరాసు రాష్ట్రానికి వున్న వందకోట్ల మిగులు నిధులు హారతి కర్పూరంగా ఆవిరి అయిపోయినాయి. హెచ్చు భాగం ఆంధ్రేతర ప్రాంతాలలో వెచ్చించారని ఆంధ్రుల కినుక. అలా ముక్కలు చెక్కలు అయిన ఆంధ్ర ప్రాంతం, ఖజానా ఖాళీ అయిన వరుసలో ఆంధ్రులకు దక్కింది.

అనాడు రాయలసీమకు చెందిన శ్రీ నీలం సంజీవ రెడ్డి కాంగ్రెస్‌కు సారధ్యం

వహించేవాడు. ప్రకాశం పంతులుగారు, ఆచార్య రంగా గారు, కృపలానీ స్థాపించిన కిసాన్ మజ్దూర్ పార్టీనాయకులు దరిమిలా వారిద్దరి మధ్య అభిప్రాయ భేదాలు రాగా ప్రకాశం పంతులుగారు ప్రజా సోషలిస్టు నాయకుడుగా ఆచార్య రంగా గారు కృషికార్ లోక్ పార్టీ నాయకుడుగా రూపొందారు. సంజీవ రెడ్డిగారు ఒక ఆలోచన చేశారు. ప్రకాశం గారిని ప్రథమ ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిని చేయదలిచారు. శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులుగారిని కాంగ్రెస్ పార్టీకి అసోసియేటు సభ్యులుగా చేసి ముఖ్యమంత్రిని చేశారు. తను ఉప ముఖ్యమంత్రి అయినారు. ముక్కలు చెక్కలయిన ఆంధ్ర రాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రి అయిన గౌరవం ప్రకాశం పంతులుగారికి దక్కింది.

మన దేశంలో త్యాగానికి, నిజాయితీకి గౌరవం ఎక్కువ. అందువల్ల త్యాగనిరతి, చిత్తశుద్ధి ఉన్న నాయకులు ఎంత పొరపాటు చేసినా దానివల్ల దేశానికి ఎంత నష్టం వాటిల్లినా వారినే నాయకులుగా కొనసాగ నిస్తారు ప్రజలు. ఆనాడు ప్రకాశం గారు మద్రాసు నగరం మీద పట్టుపట్టడం వల్ల ఆంధ్రులు బళ్ళారి పట్టణాన్ని, బళ్ళారి జిల్లాలోని మూడు తాలూకాలను నిలువ నిధులలో పాటూ 30 కోట్ల రూపాయలను పోగొట్టుకున్నారు. అయినా ప్రజలు ఆయనను బ్రహ్మరథం పట్టారు. కమ్యూనిస్టు నాయకుడు సుందరయ్యగారి విషయంలోనూ అదే జరిగింది. కమ్యూనిస్టు పార్టీ తను పొరపాట్లు చేశానని ఎప్పటికప్పుడు ప్రకటించినా సుందరయ్యగారే నాయకులుగా కొనసాగారు. ఇవి భారత జాతి మనస్తత్వానికి నిదర్శనాలు. ఈ వైఖరి ఇప్పట్లో మారేటట్లు లేదు.

# 1955 అసెంబ్లీ ఎన్నికలు

ఆంధ్ర రాష్ట్ర శాసనసభలో ప్రకాశం గారి మంత్రివర్గం ఒక్క వోటు తేడాతో వోడిపోయింది. 25 సంవత్సరాలుగా ప్రకాశం పంతులుగారి ముఖ్య అనుచరుడుగా కుడిభుజంగా వున్న శ్రీ నడింపల్లి నరసింహారావు గారి వోటు వారికి వ్యతిరేకంగా పడటంతో ప్రభుత్వం పతనమయింది. నూతన ఎన్నికలకు పిలుపు యివ్వడం జరిగింది.

1952 ఎన్నికలలో తమ విజయం వల్ల ఆత్మవిశ్వాసం పెంచుకున్న ఆంధ్ర కమ్యూనిస్టులు రాష్ట్రంలో ప్రభుత్వాధికారాన్ని చేపట్ట సంకల్పించారు. జీపులో నుంచోని ప్రజల అభివాదాలను స్వీకరించటం జవహర్ లాల్ నెహ్రూకు ఆనవాయితీ. అదే ప్రకారం నెల్లూరులో సుందరయ్య గారు ప్రజలకు జయజయ ధ్వానాలకు ప్రతిస్పందించి సెల్యూట్ చేశారు. ఈ వార్త తత్సంబంధమయిన చిత్రాలు ప్రకటితమవంగానే కాంగ్రెసు వర్గాలలో కలకలం పుట్టింది. అంతటితో ఆగక 175లో 174 నియోజక వర్గాల అభ్యర్థుల పేర్లను ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఒక్కసారిగా ప్రకటించింది. వేల సంఖ్యలో వలంటీర్లను సమకూర్చి వారికి శిక్షణ యివ్వ ప్రారంభించారు కమ్యూనిస్టులు. ఇదంతా చూచి కాంగ్రెసు నాయకులు భయపడ్డారు. కమ్యూనిస్టుల ఎన్నికల నిధికి విదేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు సహితం భారీగా విరాళాలివ్వసాగాయి. సోదర కమ్యూనిస్టు పార్టీకి అధికారం చేపట్టే అవకాశం వచ్చిందని ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలు చేతనయిన సాయం చేయబూనాయి. ఎన్నికల నిధిగా భారీగా విరాళాలివ్వాలని సభ్యులకు, సానుభూతి పరులకు కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి చేసింది. సభ్యులు, సానుభూతిపరులు అప్పులు చేసి విరాళాలిచ్చారు. 'యశోవా మృత్యోవా' అనే ధోరణిలో కమ్యూనిస్టులు తమ సర్వస్వం ఒడ్డి ఎన్నికల రంగంలోకి దూకారు. కాంగ్రెసువారి గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. తీవ్రంగా ఆలోచించారు. అఖిలభారత కాంగ్రెసు నాయకత్వం కదిలింది. ప్రకాశం గారికి ఆచార్య రంగా గారికి ప్రత్యక్షంగా రాయబార వర్గాలను పంపారు. దేశ భవిష్యత్తు కోసం అందరు ప్రజాస్వామ్య వాదులూ ఏకంగా ఒక్క త్రాటిపై నిలిచి ఎన్నికలలో కమ్యూనిస్టులను ఎదిరించాలన్నారు. కాంగ్రెసువాదులు, మాజీ కాంగ్రెసువాదులు సమాలోచనలు చేశారు. చివరకు [illegible] కాంగ్రెసు సంఘటన పేరుతో ప్రజల ముందుకు వచ్చారు. 175 నియోజక వర్గాలలో అభ్యర్థులను ఎంపిక చేశారు. చిల్లరమల్లర పార్టీలు రంగంలోకి రాకుండా జాగ్రత్త పడ్డారు.

జాతీయ పత్రికలు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ ప్రచార బాధ్యత స్వీకరించాయి. 'ప్రజాస్వామ్యమా లేక నియంతృత్వమా' అనేది ఎన్నికల సమస్యయని తేల్చారు. దినపత్రికలు కమ్యూనిస్టుల అరాచకాలను ఏకరువు పెట్టాయి. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని తూర్పారపట్టాయి.

ఎన్నికల సందర్భంగా ఆంధ్రప్రభ సంపాదకులు నార్ల వెంకటేశ్వర రావుగారి పాత్ర గమనార్హం. అంతకుముందు రష్యాను గురించి గ్రంథం రాసినవారు ఆనాడు కమ్యూనిస్టు వ్యతిరేక దృక్పథాన్ని చేపట్టారు. ప్రతిభగల పత్రికా సంపాదకులేమో కమ్యూనిస్టులను సమర్థవంతంగా ఎండగట్టారు. ఒక సంఘటన ప్రాముఖ్యత వహించింది.

రేపల్లె నియోజక వర్గం నుండి శ్రీ మాకినేని బసవపున్నయ్య (మిత్రులకు ఎం.బి.గా ఆయన పరిచయం) కమ్యూనిస్టు అభ్యర్థిగా పోటీ చేస్తున్నారు. ఆ నియోజక వర్గంలో 'ఉడవుల దీవి' అనే గ్రామం వుంది. దానికి కరణంగారు పలుకుబడిగల వ్యక్తి. చుట్టుప్రక్కల పల్లెలలో సుమారు 30వేల వోటుంది. అప్పటిదాకా ఆ పల్లె ప్రజలకు ఆయన మాట శిరోధార్యం. సుగ్రీవాజ్ఞ. ఆయన కాంగ్రెసువాది. ఆయన పలుకుబడిని ఎలా బ్రద్దలు కొట్టాలా అని కమ్యూనిస్టులు తలపట్టు కుంటున్నారు. కమ్యూనిస్టు అభ్యర్థి గొప్ప వక్త. ఆయన సభలకు ఆయన అనుకూలురకన్నా ప్రతికూలురే ఎక్కువగా హాజరవుతారు. ప్రత్యర్థులను వ్యంగ్యంగా హేళన చేయటంలో, పరుష పదజాలంతో విమర్శించటంలో ఆయనకాయనే సాటి. ఒక సభలో ఆయన ఉడవులదీవి కరణంగారిని ఘాటుగా విమర్శించాడు. మరునాడు ఆంధ్రప్రభలో ప్రకటితమయిన సభా విశేషాలను గురించిన వార్త పెద్ద కల్లోలం లేపింది. ఇంతకూ ఆయన అన్నాడన్నదేమిటి? 'ఎందరూ కష్టజీవులం, శ్రమజీవులం. శ్రమ చేయనివారికి తిండి వుండదు మా కమ్యూనిస్టు రాజ్యంలో. ఉడవులదీవి కరణంగారి కోడలు మెడ ఆభరణాలు విరివిగా ధరించటం వలన లావెక్కింది. మేము ఎన్నికలలో గెలిస్తే ఆమె మెడమీద కాడివేసి అరక లాగిస్తాను.' దీనిని పతాక శీర్షిక యిచ్చి ప్రకటించింది 'ఆంధ్రప్రభ'. మరునాడు నుండి పాఠకుల ప్రతిస్పందనను ప్రచురించసాగింది. బసవ పున్నయ్యను ఖండిస్తూ, కమ్యూనిస్టు పార్టీని నిందిస్తూ లేఖలు పుంఖాను పుంఖంగా వచ్చాయి. దినపత్రికలో ప్రతి దినం వీటికి ఒక పెద్ద పుట కేటాయించారు. ఈ హఠాత్సంఘటనకు బిత్తరపోయారు కమ్యూనిస్టులు. శ్రీ బసవ పున్నయ్యగారు అలా అనలేదని ప్రకటన యిచ్చారు. 'ఆ సభకు నేను హాజరు అయినాను. బసవ పున్నయ్యగారు అలా అనలేదు' అని పలువురు లేఖలు వ్రాస్తే వాటిని వారి దినపత్రిక 'విశాలాంధ్ర' అచ్చువేసింది. అయితే జాతీయ పత్రికల హోరులో వారి నిరసనలు, ఖండనలు వినిపించ లేదు. అదే పనిగా కమ్యూనిస్టులను ఘోరంగా చిత్రిస్తూ కార్టూనులు వెలువడినయి. ఈ సందర్భంగా ఆ ఎన్నికలో బాపట్ల నియోజక వర్గంలో ఒక స్వతంత్ర అభ్యర్థి ఎన్నికల ప్రచార బాధ్యత నెత్తిన వేసుకున్న నేను శ్రీ బసవ పున్నయ్య అన్నాడనే మాటలకు భాష్యం చెప్పాను. నియోజక వర్గమంతా పర్యటించిన నేను యీ భాష్యాన్ని అందరికీ చెవిన వేశాను. అది యిలా వుంది. 'శ్రీ బసవ పున్నయ్య అలా అని ఉంటాడని నేను భావించను. ఒకవేళ ఆయన అలా అన్నాడనుకోండి. ఎందుకు అని వుంటాడో మనం సానుభూతితో ఆలోచించాలి. కమ్యూనిస్టులకు కమ్యూనిస్టు చైనాపై అభిమానం (1949లో చైనాలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు.) చైనాలో పశు సంపద తక్కువ. మనుష్యులే కాడి భుజాలమీద వేసుకొని అరక లాగుతారు. స్త్రీ పురుషులిద్దరూ అలా చేస్తారు. ఆ దృష్టిలో ఆయన ఉడవుల దీవి కరణంగారి కోడలును గురించి అలా వ్యాఖ్యానించి వుంటారు. అంతేగాని స్త్రీ జాతిని అవమానించాలని ఆయన ఉద్దేశ్యం కాదు.' ఈ భాష్యం విన్నవారు శ్రీ బసవ పున్నయ్య అన్నాడనే వాక్యాలకన్న నీ భాష్యం దుర్మార్గంగా వుందని అభిప్రాయం వెలిబుచ్చారు.

ఆంధ్ర ప్రాంతంలో వర్గ విభజన కొట్టవచ్చినట్లు కనపడింది. కాంగ్రెసు, కమ్యూనిస్టు

వర్గాలు బ్రహ్మాండమైన ఊరేగింపులు జరిపాయి. ఒకరు 10వేల మందిని సమీకరిస్తే మరొకరు 20వేల మందిని పోగుచేశారు. ఒకరి సభ నాలుగు గంటలు సాగితే మరొకరి సభ ఆరుగంటలు సాగేది. ప్రజలు వేల సంఖ్యలో హాజరయి ఓపికగా ఉపన్యాసాలు విన్నారు. తెల్ల చొక్కాలవారు – మధ్య తరగతి – విరివిగా కాంగ్రెసును బలపరిచారు. పేదలు, నిరుపేదలు, చిన్న రైతులు, చిన్న దుకాణదారులు కమ్యూనిస్టులను బలపరిచారు. పులిజూదం ఆడేవాళ్లు, దొంగలు, రౌడీలు వీరంతా రంగంలోకి దిగారు. వారి వర్గ స్వభావాన్ని వారు గుర్తుంచుకొని కమ్యూనిస్టు పార్టీ ఊరేగింపుల్లో ముందు నడిచారు. కాంగ్రెసు సభల్లో ఉపన్యాసకులు పుట్టుకొచ్చారు. వాళ్లు అవాకులు చవాకులు వాగేవారు. వారినోట పచ్చి అబద్దాలు వచ్చేవి; అసంబద్ధ ద్వేషం, అసహనం విలయతాండవం చేశాయి. ఇరుపక్షాలు ఉద్రేకంతో ఊగిపోయాయి. ఈ ఎన్నికలో కమ్యూనిస్టులు ఘోరంగా పరాజయం పాలయినారు.

# స్వతంత్ర అభ్యర్థిని బలపరచడం

**1955** అసెంబ్లీ ఎన్నికల విషయం ప్రస్తావనకు వచ్చింది కదా! ఆ ఎన్నికలలో నా పాత్రను గురించి తెలియజేయడం నా విధి. 1952లో బాపట్ల నియోజక వర్గంలో సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా ప్రజల ముందుకు వచ్చిన వ్యక్తి ఎన్నికల తేదీలోగా కాంగ్రెసేతర ఉదారవాద పార్టీ అభ్యర్థికి అనుకూలంగా పోటీనుంచి విరమించడం జరిగింది కదా! ఈ ఎన్నికలలో కాంగ్రెస్‌వారు కమ్యూనిస్టులు తలపడుతున్నారు. ఇరు పక్షాలవారు నాకు అంగీకారయోగ్యం కానివారు. నేను ఏం చేయాలి అనేది నా వ్యక్తిగత సమస్య; రాడికల్ హ్యూమనిస్టుగా నా సమస్య. 1952లో అభ్యర్థిగా పోటీ చేయాలనుకున్న శ్రీ మంతెన సుబ్బరాజుకు ఆ అవకాశం రాలేదు. ఈసారి అతడు అభ్యర్థిగా ముందుకు వచ్చాడు. గెలుపుతో నిమిత్తం లేకుండా పోటీ చేస్తానన్నాడు. కాంగ్రెసేతర, కమ్యూనిస్టేతర శక్తులు వ్యక్తులు తనకు పనిచేస్తారని అతని ఆశ. నాకు అభ్యర్థి కావాలి. శ్రీ సుబ్బరాజుకు చిత్తశుద్ధిలో పనిచేసే కార్యకర్త కావాలి. అతడు నామినేషను వేశాడు. ప్రచారబాధ్యత నేను తీసుకున్నాను.

కాంగ్రెసు నాయకుడు శ్రీ మంతెన వెంకట రాజుకు శ్రీ మంతెన సుబ్బరాజు జ్ఞాతి; అన్నదమ్ముల మనుమలు వీరు. ఇరువురి స్వగ్రామం ఒకటే. నామినేషను దాఖలు చేసిన తరువాత మేమిరువురము బాపట్ల నుండి చందోలు గ్రామానికి కారులో వెళ్తున్నాం. చందోలుకు వెళ్లటానికి రాజుల గ్రామాల మీదుగా వెళ్లాలి. ఒకచోట ఒకతను సైకిలు మీద వస్తూ కారాపి సుబ్బరాజు నుద్దేశించి 'బాబాయి! నీవు విరమించుకొని వెంకటరాజును బలపరుచు' అని నిన్ను కోరడానికి 8 గ్రామాల మన బంధువులు రాబోతున్నారన్నాడు. మరో రోడ్డున చందోలు పొమ్మన్నాడు డ్రైవరును శ్రీ సుబ్బరాజు. నాకు నవ్వు వచ్చింది. అతి కష్టంమీద ఆపుకున్నాను. 'మాధవా! మరలనిమ్ము రథమ్ము; బ్రతికియుండిన బలుసాకు తినవచ్చు' నన్న అర్జునుని మాటలు జ్ఞాపకం వచ్చాయి. చందోలు వెళ్లి రాత్రికి తిరిగి వచ్చాం. ఆ రాత్రికి సుబ్బరాజు బంధువులు – వయస్సులో అనుభవంలో పెద్దలు, గ్రామాలలో నాయకులు – సుబ్బరాజును ముట్టడించారు. 'మనలో వెంకయ్య పేరెన్నిక గన్నవాడు. (రాజులు వారిలో వారు మాట్లాడు కునేటప్పుడు రాజు అనే చివరి పదం వదిలివేస్తారు). అతడిప్పుడు తీవ్రమయిన పోటీని ఎదుర్కొన పోతున్నాడు. నీవు 2, 3 వేల వోట్లు చీల్చినా అతడు ఓడిపోతాడు. మన కులంలో వానికి యిక గెలిచే అవకాశ ముండదు' అన్నారు. సుబ్బయ్యా! మా మాట వినరా' అని ప్రాధేయ పడ్డారు. 'నేను ఏం చేయలేను. మీ కోరికను అంగీకరించలేని నిస్సహాయుణ్ణి' అన్నాడు. 'అదేమిట్రా ఆ మాట' అన్నారు వారు. నామినేషను వేసే ముందు శ్రీ రామమూర్తి (నేను) సమ్మతి లేకుండా అభ్యర్థిత్వాన్ని ఉపసంహ రించుకోను' అని మాట యిచ్చాను అన్నాడు. 'అంతగా నేను విరమించాలను కుంటే ఆయనతో సంప్రతించండి' అని చెప్పి వారి బాధ నుండి విముక్తు డయ్యాడు. మరునాడు ఉదయం వారు

మా యింటికి వచ్చారు. అప్పటికి బాపట్లలో నా ప్లీడరీ జీవితం నాలుగేళ్లు మాత్రమే. వచ్చిన వారికి నేను క్రొత్త. నాకు వారు క్రొత్త. ఆహ్వానించి గౌరవించాను. వచ్చిన పని విశదీకరించారు. వారి మాటలు ఓపికగా విన్నాను. 'మీ కోరిక ప్రకారం జరగదు. క్షమించండి' అన్నాను. వారు విస్తుపోయి ఒకరి ముఖాలు ఒకరు చూచు కుంటూ నిష్క్రమించారు.

ఈ సంఘటన జరిగాక శ్రీ మంతెన సుబ్బరాజు నియోజక వర్గంలోకి రాలేదు. ఒక గుర్రపు బండి మాట్లాడుకొని దానిని మైకు ఏర్పాటు చేయించుకొని దాంట్లో నేను, పనికి కుదుర్చుకున్న కుర్రవాడు నియోజక వర్గం అంతా తిరిగాము. ఆ కుర్రవాడు చాల ధైర్యస్తుడు. అవతల రెండు పార్టీల యువకులు ప్రతి గ్రామంలో **20, 30** మంది కలిసి గోడలమీద కాగితాలు అంటిస్తుంటే, నా నొక్కడే వారి హేళనను సరకు చేయక అన్ని గ్రామాలలో కాగితాలు అంటించాడు. తమాషా ఏమంటే అభ్యర్థి యిల్లు కదలలేదు. నేను ప్రతి గ్రామ కూడలిలో బండి ఆపి ఉపన్యసించాను. వెదుళ్లపల్లిలో మాట్లాడుతుండగా కాంగ్రెసు యువకులు దాడిచేసే పరిస్థితులు కనిపించినాయి. గాంధీ గారి ఉద్యమంలో సత్యాగ్రహిగా జైలుకెళ్లిన బొద్దుపల్లి సుబ్బయ్యగారి ఊళ్ళోనా యీ హింసా పద్ధతి అని గొంతు పెద్దది చేసి యించు మించుగా అరిచాను. తన పేరు మైకులో విని ఆయన బండి వద్దకు వచ్చాడు. యువకులు శాంతించారు. ఆయనను పలకరించి ఆ ఊరు వదిలాను. రోజు రోజుకు వాతావరణం వేడెక్కుతున్నది. గ్రామాలు పల్లెలు రెండుగా చీలి పోతున్నాయి. మూడో గొంతును వినే పరిస్థితులు లేకుండా పోయినాయి. ఇంతగా ఆంధ్ర రాష్ట్రం చీలి పోతుందని నేను ముమ్మందుగా ఊహించ లేదు. ఒకటి రెండు తడికెలు పెట్టించాను. లాంఛన పోటీగా మారింది నా అభ్యర్థి విషయం.

పరిస్థితులు అట్లా ఉండగా, ఎన్నిక తేదీ నాలుగు రోజులుండనగా నేను భోజనం చేసేవేళ **20** మంది బాపట్ల కాంగ్రెసు వారిలో శ్రీ మంతెన వెంకట రాజు మా యింటికి వచ్చారు. నా వద్ద చనువు వున్న కాంగ్రెస్ నాయకుడు యింట్లోకి వచ్చి మంతెన వెంకట రాజుగారి రాక నాకు ఎరిగించాడు. 'నమస్కారం చెప్పండి ' అని బదులు పల్కాను. ఆయన నీతో మాట్లాడుతారట వాకిట్లో కూర్చున్నారు అన్నాడు. నేను భోజనం చేయడం ఆలస్యం అవుతుంది. ఫరవాలేదు. వారికి వెళ్ళమను అని చెప్పాను. ఆ మాటలలో అంతరార్థం గ్రహించి ఆయన తన అనుచరులతో, సహచరులతో నిష్క్రమించాడు. ఎన్నికల ఫలితాలు వచ్చాయి. ఆయన అఖండ విజయం సాధించలేదు గాని గెలిచారు. **1955** శాసన సభ ఎన్నికలు నాకు ఎంతో నూతనానుభవాన్ని సమకూర్చాయి. **1946**లో కాంగ్రెస్ ప్రభంజనం **1955**లో కాంగ్రెస్ కమ్యూనిస్టు పార్టీలు సమఉజ్జీలు. మూడో వారికి తావులేదు.

**1955** ఎన్నికలలో ఓడిపోయిన కమ్యూనిస్టులు మరల ఇప్పటి వరకు కోలుకోలేదు. సానుభూతి పరులు పదేళ్ళ తమ సంపాదనను లెక్క కట్టుకుని ఆ మేరకు అప్పులు తెచ్చి ఎన్నికలలో ఖర్చు చేశారు. వారు ఆర్థికంగా నిలబడడానికి పదిహేనేండ్లు పట్టింది. అప్పటికి వారు రెండు పార్టీలుగా చీలిపోయారు. పైగా ఇందిరాగాంధీ యుగ ప్రారంభం **1971**లో. దాంతో వారి పాత్ర తృతీయ శ్రేణికి దిగజారింది.

ఒకవేళ కమ్యూనిస్టు పార్టీ ప్రయోజనాలను ఆశించి వారు ఆ నినాదాన్ని యిచ్చారని భావిస్తే 294 మంది సభ్యులున్న శాసన సభలో యీనాడు 16 మంది కమ్యూనిస్టు సభ్యులు - కమ్యూనిస్టు పార్టీ మార్క్సిస్టు పార్టీ మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ కమ్యూనిస్టు పార్టీ (ఎం.ఎల్) అన్నికలిపి - వున్నారు. కాబట్టే విశాలాంధ్రలో కమ్యూనిస్టుల బలం తరిగింది కాని పెరగలేదని తేలుతుంది. కమ్యూనిస్టుల బలం పెరుగుతుందని ఎవరయినా ఆశిస్తే వారు కలలు కనే ప్రపంచంలో వున్నారన్నమాట. ఆ సీట్లు అయినా తెలుగుదేశం వారి వెంట వుంటే వచ్చినవి. స్వంత బలం మీద రాలేదు.

ఇక భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతపు కొనసాగింపే విశాలాంధ్ర నిర్మాణానికి పిలుపు లని భావిస్తే అది తర్కానికి నిలవదు; అనుభవానికి అంతకన్నా నిలువదు. అత్యధిక సంఖ్యాకుల భాషలో పరిపాలన సాగాలని, తగినంత సంఖ్య గల అల్ప సంఖ్యాక వర్గం వుంటే వారి భాషలో కూడా పరిపాలన సాగాలనేది ప్రజాస్వామ్య సూత్రం. ప్రజల భాషలో పరిపాలన సాగితే పరిపాలన ఎలా సాగుతున్నది ప్రజలకు అర్థం అవుతుంది. అర్థం అయితే ప్రజా ప్రతినిధులను వారు అదుపులో పెట్టగలరు. తమ కోర్కెలను డిమాండ్లను పరిపాలకులకు అర్థవంతంగా అందజేయగలరు. ఈ సూత్రాన్ని పాటిస్తే ఒకే భాష మాట్లాడేవారు రెండు మూడు రాష్ట్రాలలో వుండవచ్చును. రెండు తెలుగు రాష్ట్రాలు వునికిలోకి రావచ్చును. తెలంగాణా రాష్ట్రం, ఆంధ్ర రాష్ట్రం యిలా రెండు రాష్ట్రాలు వుండవచ్చును. ఈనాడు హిందీ మాట్లాడే ప్రజలు 6 రాష్ట్రాలలో వున్నారు. రాజస్థాన్, హర్యానా, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహారు అలాంటివి. ఆ ప్రాంతాలన్నింటినీ కలిపి మహా హిందీ రాష్ట్రం కావాలని కమ్యూనిస్టు పార్టీ నినాదం యివ్వలేదే! ఇవ్వటం లేదే. మరి ఆంధ్రులకు యీ ప్రత్యేక సూత్రం ఎందుకు? సరియైన సమాధానం లేదు.

నదులు, ఖనిజాలు, గనులు వీటి వనరులు ఒకే భాషా ప్రాంతం వారికి చెందితే మంచిదని, సౌకర్యమని వాదించ పూనితే దేశ పటం చూస్తే అది అసాధ్యమని తెలుస్తుంది. కృష్ణానది మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో ప్రవహిస్తున్నది. గోదావరి కూడా అలాగే బహు రాష్ట్రాలలో పరీవాహక మార్గం కల్గివుంది. కావేరి నదీ జలాల విషయమై తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలు ఏదో ఒక ఒప్పందానికి రావలసియున్నది. తుంగభద్రా నది నీటిని గురించి కర్నాటక ఆంధ్రప్రదేశ్‌లు ఒక తీర్మానానికి వచ్చాయి. కాబట్టే నదీజలాల పంపకంలో సౌకర్యం అనేది ఒట్టి మాట. ఇప్పుడు యీ రాష్ట్రాలు ఎలా పరస్పర సంప్రతింపుల ద్వారా నదీజలాల సమస్యను పరిష్కరించుకున్నాయో అలాగే రెండు తెలుగు రాష్ట్రాలు యితర రాష్ట్రాలతో కలిసి అలా సర్దుబాటు చేసుకోగలవు.

'విశాలాంధ్ర' అనే కేక సామ్రాజ్యవాదులు, జాతీయ వాదులు యివ్వాల్సిన పాలికేక. అలాంటి సందర్భంలో కమ్యూనిస్టులు జాతీయవాద ప్రభావానికి లోనయి యీ నినాదం యివ్వడం పెద్ద పొరపాటు. అందుకనే విశాలాంధ్ర సమస్య 1956లో చర్చకు వచ్చినపుడు రాడికల్ హ్యూమనిస్టులం రెండు తెలుగు రాష్ట్రాలు కావాలని చెప్పాం. ఆనాడు మా గొంతు చిన్నది కనుక, కమ్యూనిస్టుల నినాదం జాతీయ

వాదాలకు భూస్వామ్య పరిపాలకులకు లాభకరం కనుక, ఆంధ్ర పెట్టుబడిదారుల ఆశలను ప్రతిఫలించేది కనుక విశాలాంధ్ర ఏర్పడింది. తెలుగు ప్రజల ఉద్వేగాలను వాడుకొని, తెలంగాణా ప్రజల సందేహాలను, సంశయాలను, అభ్యంతరాలను వెనుకకు నెట్టి విశాలాంధ్రను ఏర్పరచారు.

విశాలాంధ్ర ఏర్పడి ఇప్పటికి 38 ఏళ్లు గడిచింది. ప్రతి సంవత్సరం నవంబరు 1వ తేదీన ఉత్సవం జరుపుకుంటున్నాం. ఇప్పటికి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు మాత్రమే వర్తించే శాసనాలు అమలులో వున్నాయి. రెండు ప్రాంతాల శాసనాల ఏకీకరణ పూర్తిగా యింతవరకు జరుగలేదు. పూర్వం తెలంగాణా, ఆంధ్ర ,కొన్ని ఉద్యోగావసరాలకు రెండు ప్రాంతాలుగా వుండేవి ఈనాడు ఇందిరాగాంధి ధర్మమాయని ఏదు ప్రాంతాలుగా నెలకొని వున్నాయి. ఇదీ ఆరుకోట్ల ఆంధ్రుల ఐక్యత. విశాలాంధ్రను చీల్చాలని వచ్చిన 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, 1972–73 ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమాల గురించి ముస్ముందు పరిశీలిద్దాం.

# నాటకసంఘం: కళావని

బాపట్ల నాటకాలకు పెట్టింది పేరు. ముఖాన రంగు పూయని యువకుడు లేడని ప్రతీతి. పౌరాణిక నాటకాలకు, సాంఘిక నాటకాలకు రెంటికీ అది ఆలవాలం. సర్వశ్రీ సింగరాజు నాగభూషణ రావు, చెరువు శివరామ శాస్త్రి, ఎన్నవరపు రామనాథ శాస్త్రి, కోన ప్రభాకర్ రావు పేరున్న వారు. సాంఘిక నాటక ప్రదర్శనలిచ్చే సంఘాలు మూడుండేవి. శ్రీ వడ్లమూడి సీతారామారావు (ప్లీడరు) ఆంధ్రనాటక కళాపరిషత్తు కార్యవర్గ సభ్యుడు. ఆయనకు ఒక సమాజం వుండేది. శ్రీ మాదిరాజు బాలగంగాధర శర్మది(అందరూ శర్మ అని పిలిచేవారు) మరియొక సమాజం. మూడవదానికి స్థాపకుడు, దర్శకుడు శ్రీ కొర్రపాటి గంగాధర రావు నాటక రచయిత కూడాను. మూడు సమాజాలు పోటీగా నాటక ప్రదర్శనలు చేసేవి. నాటక కళా పరిషత్తులో వారి నాటకాలు ఎంపిక చేయబడేవి.

మొదట్లో శ్రీ పి.ఎల్. నారాయణ (ఆనాటి ప్రఖ్యాత సినిమా నటుడు 'పంజరా' సంభాషణా రచయిత) శర్మ సమాజంలో వుండేవాడు. తరువాత ఒకటి రెండు నాటకాలలో, కొర్రపాటి గంగాధర రావుగారి 'కళావని'లో నటించాడు. కొర్రపాటి శతాధిక నాటక రచయిత. ఆయన వృత్తిరీత్యా వైద్యుడు. రోగి రాగానే నాటకం రాస్తున్న ఆ కలం ప్రక్కనపెట్టి పరీక్షచేసి మందిచ్చి పంపేవాడు. మరల నాటక రచనకు ఉపక్రమించేవాడు. రచన మధ్యలో ఆపివేయడం జరిగినా రచనలో కుదుపు కన్పడేది కాదు. అది ఆయన ప్రత్యేకత, విశిష్టత.

ఒకరోజు నేను శ్రీ పి.ఎల్. నారాయణ వెళ్ళేటప్పటికి ఆయన నాటకం రాస్తున్నారు. కూర్చున్నాం. ఏకైక దీక్షతో కలం సాగిపోతున్నది. 'ఏమిటండీ అదే పనిగా రాస్తున్నారు' అని పలకరించాం. 'నాటకం రాస్తున్నాను' అన్నాడు. 'ఎప్పుడూ వుండేదే కదా!' అని ఎగతాళిగా అన్నాం. 'మీరు రాయండి చేతనయితే' అని సవాలు చేశారు. 'రాస్తాం. మీకు చూపిస్తాం. నాటక లక్షణాలుంటే మీరు అంగీకరించాలి' అని పి.ఎల్. నారాయణ కోరాడు. 'సరే. రాయండి' అన్నాడు. మరునాడు మేమిరువురము చేతిలో కాగితాల కట్టలతో ఆయన ఎదుటికి వెళ్ళాం. తీసుకొని రెండు ప్రతులను ఆసాంతం చదివారు. నాటక లక్షణాలు ఉన్నాయని అంగీకరించారు. ఆయన నిజాయితీకి ముగ్ధులమయ్యాం. 'ఆర్నెళ్ళు సావాసం చేస్తే వారు వీరవుతారని' సామెత ఉంది కదా! మీతో 6 సంవత్సరాల (1952 -58) స్నేహం చేస్తే నాటకం రాయలేకపోతామా) అన్నాను. ఆయన హృదయ పూర్వకంగా నవ్వారు.

ఆ రోజుల్లో స్త్రీ పాత్రలు వేయటానికి కుటుంబ స్త్రీలు ముందుకు వచ్చేవారు కాదు. (ఈనాటికీ ఆ విషయంలో పరిస్థితి కొంచెం గడ్డుగానే వున్నదనుకోండి) వృత్తి చేసుకునే స్త్రీలు నటించటానికి అంగీకరించే వారు. వారిలో కళాభిజ్ఞత ఉంది. నటనా చాతుర్యం ఉంది. పేరు ప్రఖ్యాతులు సంపాదించు కోవాలనే తపన వుండేది. ఒక నాటకానికి కేవలం రూ. 50, 80లు మాత్రమే భృతి తీసుకొని 3 నెలలు రిహార్సల్సుకు వచ్చేవారు. డైలాగులు వప్పచెప్పటంలో శ్రద్ధ చూపేవారు. సాత్వికాభినయం వారికి వెన్నతో పెట్టిన విద్య. కాకపోతే వాచికం ఘోరంగా వుండేది. ఒత్తులు పలికేవి కావు. వారికి ఒత్తులు పలకడం నేర్పడానికి శ్రీ సింగరాజు

నాగభూషణం గారు విశేషంగా శ్రమించే వారు. 'అనవమ్మా! విష్వక్సేనుడు' అని అనిపించేవారు. నాటకాల యెడ ఆయనకున్న శ్రద్ధ అనన్యం. చిన్నపిల్లలు నాటకం వేసి పిలిచినా వెళ్ళి కూర్చొని చూచి సలహాలనిచ్చి వచ్చేవాడు. సహృదయుడు. వారిది స్పష్టమయిన ఉచ్చారణ.

గంభీర స్వరం. నిండు పాత్రలను నటించడంలో దిట్ట.

గంగాధర రావు గారు వస్తుతః నటుడు. రచయిత అయిన శ్రీ వడ్లమూడి సీతారామారావు బద్ధకిస్తే గత్యంతరం లేక రచయిత అయ్యాడు. అలా అలా శతాధిక నాటక రచయిత అయ్యాడు. ఆయనవి సుమారు పది నాటకాలు నాటక కళా పరిషత్తులో ప్రవేశం పొందగల్గాయి. సర్వశ్రీ రాజారావు. కె. వెంకటేశ్వరరావుల సమకాలికుడు. ఆయన నాటకాలను చాలా వాటిని కొండపల్లి వీర వెంకయ్య సన్సు వారు అచ్చువేసేవారు.

మొదట్లో గంగాధరరావుగారి నాటకానికి తుది మెరుగులు దిద్దటానికి 3 నెలలు పట్టేది. రిహార్సులలో కూడా మార్పులు, కూర్పులు, చేర్పులు జరిగేవి. ఆయనకు ముఖ్యంగా ముగ్గురు వ్యవసాయ కళాశాల అధ్యాపకులు స్నేహితులు. వారు సర్వశ్రీ టి.రాఘవరావు, బ్రహ్మాండం నరసింహం, భాగవతుల అప్పాజీ. ముగ్గురిదీ శాస్త్ర విద్య. కాని కళమీద అభిమానం. ఏరోజు రాసింది ఆ రాత్రి అందరికీ చదివి వినిపించేవారు. నేనూ హాజరు అవుతుండేవాడిని. ఏదో మార్చమనేవారు ఆయనను. 'సరే' తర్వాత మారుస్తాను అనేవారు. ఏదీ, ఒక్కసారి చూడనీయండి అంటూ చేతిలోకి తీసుకొని ఆ పంక్తిని కొట్టివేసేవారు. గంగాధరరావుగారు అయిష్టంగా ఊరుకునేవారు. కాని ఆ కొట్టివేతలవల్లనే, ఆ మార్పులవల్లనే వారి నాటకాలకు ప్రాశస్త్యం లభించింది.

మొదట్లో గంగాధరరావుగారు హాస్యనాటికలు రాసేవారు. తరువాత జీవితపు గంభీర సమస్యలను వారు స్పృశించేవారు. బాపట్ల న్యాయవాది సంఘం వారు ఒక న్యాయాధీశుని న్యాయ స్థానపు పనితీరును ఎగతాళి చేయుటానికి శ్రీ వడ్లమూడి సీతారామారావు రాసిన నాటకంలో న్యాయమూర్తి పాత్రను ధరించాడు. బహుశః శ్రీ గంగాధరరావు పరిచయభాగ్యం వల్ల అంత సాహసానికి దిగానేమో! 1951-57లో దానికి కొన్నాళ్లు కార్యదర్శిగా, మరికొంతకాలం అధ్యక్షుడినిగా వ్యవహరించాను. ఆ కార్యభారం వహించడంవల్ల ఎంతో అనుభవం గడించాను. అది నాకు ఎన్నో విధాల ఉపకరించింది.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ

కమ్యూనిస్టు నాయకుడు సుందరయ్యగారు 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే గ్రంథం రాశారు. ఆయన భాషా ప్రయుక్త రాష్ట్ర వాదాన్ని బలపరుస్తున్నారు. దాని తార్కిక ఫలితంగా విశాలంధ్ర అంటే ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు కలిసిన ప్రదేశ్‌ను కోరారు. ఆ నినాదాన్ని తార్కిక దృష్టితో యిచ్చారో, లేక పార్టీ పలుకుబడి, ప్రాబల్యం, పెరుగుదల వేటిని ఆశించి యిచ్చారో తెలియదు అయితే పైకి చెప్పబడిన విషయాలను లెక్కకు తీసుకుంటే తార్కికంగా చెప్పారని తోస్తుంది పార్టీ శ్రేయస్సు కొరకు చెప్పారని అనలేము ఎందుకంటే వారు అలా అనడం లేదు కనుక

ఒకవేళ కమ్యూనిస్టు పార్టీ ప్రయోజనాలను ఆశించి వారు ఆ నినాదాన్ని యిచ్చారని భావిస్తే 294 మంది సభ్యులున్న శాసన సభలో యీనాడు 16 మంది కమ్యూనిస్టు సభ్యులు - కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ (ఎం.ఎల్) అన్ని కలిసి - వున్నారు. కాబట్టి విశాలాంధ్రలో కమ్యూనిస్టు బలం తరిగింది. కాని పెరగలేదని తేలుతుంది. కమ్యూనిస్టుల బలం పెరుగుతుందని ఎవరయినా ఆశిస్తే వారు కలలు కనే ప్రపంచంలో వున్నారన్నమాట ఆ సీట్లు అయినా తెలుగుదేశం వారి వెంట వుంటే వచ్చినవి. స్వంత బలం మీద రాలేదు

ఇక భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతపు కొనసాగింపే విశాలాంధ్ర నిర్మాణానికి పిలుపు అని భావిస్తే అది తర్కానికి నిలువదు, అనుభవానికి అంతకన్నా నిలువదు అత్యధిక సంఖ్యాకుల భాషలో పరిపాలన సాగాలని, తగినంత సంఖ్య గల అల్ప సంఖ్యాక వర్గం వుంటే వారి భాషలో కూడా పరిపాలన సాగాలని ప్రజాస్వామ్య సూత్రం. ప్రజల భాషలో పరిపాలన సాగితే పరిపాలన ఎలా సాగుతున్నది ప్రజలకు అర్థం అవుతుంది. అర్థం అయితే ప్రజా ప్రతి నిధులను వారు అదుపులో పెట్టగలరు తమ కోర్కెలను డిమాండ్లను పరిపాలకులకు అర్థవంతంగా అందజేయగలరు. ఈ సూత్రాన్ని పాటిస్తే ఒకే భాష మాట్లాడే వారు రెండు మూడు రాష్ట్రాలలో వుండవచ్చును. రెండు తెలుగు రాష్ట్రాలు వునికిలోకి రావచ్చును. తెలంగాణ రాష్ట్రం, ఆంధ్ర రాష్ట్రం యిలా రెండు రాష్ట్రాలు వుండవచ్చును ఈనాడు హిందీ మాట్లాడే ప్రజలు 6 రాష్ట్రాలలో వున్నారు రాజస్థాన్, హర్యానా, ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, బీహారు అలాంటివి ఆ ప్రాంతాలన్నింటినీ కలిపి మహా హిందీ రాష్ట్రం కావాలని కమ్యూనిస్టు పార్టీ నినాదం యివ్వలేదే ? ఇవ్వటం లేదే? మరి ఆంధ్రులకు యీ ప్రత్యేక సూత్రం ఎందుకు? సరియైన సమాధానం లేదు.

నదులు, ఖనిజాలు, గనులు వీటి వనరులు ఒకే భాషా ప్రాంతం వారికి చెందితే

మంచిదని, సౌకర్యమని వాదించ పూనితే దేశ పటం చూస్తే అది అసాధ్యమని తెలుస్తుంది. కృష్ణానది మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్ర ప్రదేశ్‌లలో ప్రవహిస్తుంది. గోదావరి కూడా అలాగే బహు రాష్ట్రాలలో పరివాహక మార్గం కలిగి వుంది. కావేరి నదీ జలాల విషయమై తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలు ఏదో ఒక ఒప్పందాన్ని రావలసియున్నది. తుంగభద్రా నది నీటిని గురించి కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లు ఒక తీర్మానానికి వచ్చాయి. కాబట్టి నదీజలాల పంపకంలో సౌకర్యం అనేది ఒట్టి మాట. ఇప్పుడు యీ రాష్ట్రాలు ఎలా పరస్పర సంప్రతింపుల ద్వారా నదీ జలాల సమస్యలను పరిష్కరించుకున్నాయో అలాగే రెండు తెలుగు రాష్ట్రాలు యితర రాష్ట్రాలతో కలిసి అలా సర్దుబాటు చేసుకోగలవు

'విశాలాంధ్ర' అనే కేక సామ్రాజ్య వాదులు, జాతీయవాదులు, యివ్వాల్సిన పొలికేక. అలాంటి సందర్భంలో కమ్యూనిస్టులు జాతీయవాద ప్రభావానికి లోనయి యీ నినాదం యివ్వడం పెద్ద పొరపాటు. అందుకనే విశాలంధ్ర సమస్య 1956లో చర్యకు వచ్చినపుడు రాడికల్ హ్యూమనిస్టులు రెండు తెలుగు రాష్ట్రాలు కావాలని చెప్పాం. ఆనాడు మా గొంతు చిన్నది కనుక, కమ్యూనిస్టుల నినాదం జాతీయ వాదులకు భూస్వామ్య పరిపాలకులకు లాభకరం కనుక, ఆంధ్ర పెట్టుబడిదారుల ఆశలను ప్రతిఫలించేది కనుక విశాలాంధ్ర ఏర్పడింది తెలుగు ప్రజల ఉద్వేగాలను వాడుకొని, తెలంగాణా ప్రజల సందేహాలను, సంశయాలను, అభ్యంతరాలను వెనుకకు నెట్టి విశాలాంధ్రను ఏర్పరచారు.

విశాలాంధ్ర ఏర్పడి ఇప్పటికి 38 ఏళ్ళు గడిచింది ప్రతి సంవత్సరం నవంబరు 1వతేదీన ఉత్సవం జరుపుకుంటున్నాం ఇప్పటికి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు మాత్రమే వర్తించే శాసనాలు అమలులో వున్నాయి. రెండు ప్రాంతాల శాసనాల ఏకీకరణ పూర్తిగా యింతవరకు జరుగలేదు. పూర్వ తెలంగాణా, ఆంధ్ర కొన్ని ఉద్యోగావసరాలకు రెండు ప్రాంతాలుగా వుంటే ఈనాడు ఇందిరాగాంధి ధర్మమాయని ఏడు ప్రాంతాలుగా నెలకొని వున్నాయి. ఇదీ అచుకోట్ల ఆంధ్రుల ఐక్యత. విశాలంధ్రను చీల్చాలని వచ్చిన 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, 1972-73 ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమాల గురించి మున్ముందు పరిశీలిద్దాం

# వెనుకబడినజాతుల ఉద్యమం

ఈనాడు వెనుకబడిన జాతుల ఉద్యమం ఉధృతంగా సాగుతున్నది. కులాలు ప్రాతిపదికగా నిర్దేశించబడే వెనుకబడిన జాతులకు రిజర్వేషను కావాలన్న నినాదాన్ని వ్యతిరేకించి కేవలం ఆర్థిక పరిస్థితి ప్రాతిపదికపైననే రిజర్వేషనులు ఉండాలని పూర్వం వాదించినవారు – కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు, విప్లవ కమ్యూనిస్టులు వగయిరాలు – కులాల ప్రాతిపదికపై గల రిజర్వేషనులను సమర్థిస్తున్నారు. 'అగ్ర' వర్ణాలలోని వారు కొందరు వ్యతిరేకిస్తే వారిని ప్రగతి నిరోధకులని దుయ్యబత్తున్నారు. కుల ప్రాతిపదికపై యివ్వబడిన రిజర్వేషన్ల కోటాలను పెంచటానికి రాష్ట్ర ప్రభుత్వాలు పోటీ పడుతున్నాయి.

అసలు ఈ రిజర్వేషను సమస్యకు సుమారు నలుబది ఏండ్ల చరిత్ర ఉంది. ఈ సమస్య తీవ్ర రూపం దాల్చడమే కాక రోజు రోజుకూ క్లిష్టమవుతున్నది. ఈ నేపథ్యంలో ఈ సమస్య ఆవిర్భావం, దానియెడ మిత్రుల వైఖరి, నా దృష్టి స్ఫురణకు వస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం నియమించిన కాకా కాలేల్కరు కమిషను కులాల ప్రాతిపదికపైన వెనుకబడినతనాన్ని గుర్తించింది. ఆ కమిషను నివేదిక వెనుకబడిన కులాలవారిలో ఆశలను రేకెత్తించింది. వారు వెనుకబడిన జాతుల సంఘాన్ని నిర్మించుకున్నారు. కులాల ప్రాతిపదిక పైన వెనుకబడిన కులాలవారికి ప్రత్యేక సౌకర్యాలు, సదుపాయాలు, అవకాశాలు యివి కావాలని ఆందోళనకు దిగింది సంఘం. సహజంగా రాజకీయాలలో ఆసక్తి ఉన్నవారంతా ప్రతిస్పందించారు. ఆ చరిత్రను ఉటంకిస్తాను.

ముందుగా రాజ్యాంగంలో యీ వెనుకబడినతనానికి సంబంధించిన అధికరణాలను తడవటం అవసరం. 26 జనవరి 1950న భారత రాజ్యాంగం అమలులోకి వచ్చింది. 14వ అధికరణంలో అందరు పౌరులు శాసనం దృష్టిలో సమానులని, శాసనం యొక్క రక్షణను సమానంగా పొందగలరని ఉద్ఘాటించబడింది. మతం, జాతి, కులం, లింగభేదం, జన్మస్థానం వీటిపై మాత్రమే ఆధారపడి రాజ్యం వివక్ష చూపరాదని 15వ అధికరణం 1వ భాగంలో చెప్పబడింది. అలాగే పై చెప్పబడిన వాటిని మాత్రమే కారణంగా చెప్పి దుకాణాలు, ఫలహారశాలలు, హోటళ్ళు పదిమంది వచ్చే వినోద ప్రదేశాలు వీటిలోకి పౌరులకు రానీయకుండా నిరోధించరాదని 15వ అధికరణం 2 (ఎ) భాగంలో పేర్కొనబడింది. ప్రజోపయోగానికి కేటాయించబడిన లేక పూర్తిగా కాని కొంతగా కాని ప్రభుత్వ నిధులను వాడి స్థాపించి నడిపే బావులు, చెరువులు, స్నానాల రేవులు, రోడ్లు ప్రజలు వచ్చే ప్రదేశాలు వీటి వాడకాన్ని గురించి ప్రతిబంధకాలు ఉండరాదు. (అధికరణం 15 (2)) అయితే యీ అధికరణంలో ఏమని చెప్పినా స్త్రీలకు, బాలబాలికలకు రాజ్యం ప్రత్యేక ఏర్పాట్లు చేయవచ్చును (అధికరణం 15(3)). పైన ఉటంకించినవి మౌలిక హక్కులు. అంటే న్యాయ స్థానాలలో పౌరులు వ్యాఖ్యగ్రంధం జరిపి రాజ్యం వీటిని అమలు జరిగేలాగు, పాటించేలాగు ప్రయత్నించ వచ్చు

ఈ దేశంలో కాని, దేశంలోని ఏ ప్రాంతంలో కాని ప్రత్యేక భాష లేక లిపి,

లేక సంస్కృతి కల పౌరులు వాటిని పదిలపరుచు కోడానికి హక్కు కలవారు (అధికరణం 29 (1)). ప్రభుత్వం లేక నిర్వహింపబడే లేక ప్రభుత్వ నిధుల నుండి సహాయాన్ని పొందే విద్యాలయాలలో మతం, జాతి, కులం, భాష వీటిపైన మాత్రమే ఆధారపడి వివక్ష చూపి ప్రవేశం నిరాకరించ రాదు (అధికరణం 29 2). సామాజికంగా విద్యా విషయకంగా వెనుకబడిన తరగతుల పౌరులకు, షెడ్యూలు కులాలవారికి, షెడ్యూలు తెగలకు అభ్యుదయాన్ని సాధించే నిమిత్తం, భారత రాజ్యాంగం 9వ అధికరణంలో ఏమి చెప్పబడి వున్నా ప్రత్యేక సౌకర్యాలు, సదుపాయాలు అవకాశాలు వీటిని యిచ్చే నిబంధనలను రాజ్యం రూపొందించ వచ్చును. (అధికరణం 15 (4)). ఈ అధికరణాలు వెనుకబడిన తరగతుల వారికే విద్యా విషయకంగా రక్షణలను యిచ్చాయి. ఇక ఉద్యోగాల సంగతి గమనిస్తే నివాసాన్ని బట్టి ఒక రాష్ట్రంలో భాగమయిన ప్రాంతవాసులకు సౌకర్యాలను కలిగించేటట్లు ఆ ప్రాంతంలో నివాసార్హతను ఉద్యోగాల విషయంగా ప్రవేశ పెట్టవచ్చును (అధికరణం 16 (3). ప్రభుత్వ సర్వీసులలో తగిన ప్రాతినిధ్యం లేని వెనుకబడిన తరగతుల పౌరులకు ఉద్యోగాలలో పదవులలో ప్రభుత్వం వాటికి కొన్ని స్థానాలను రిజర్వేషను ద్వారా కేటాయింప వచ్చును (అధికరణం 16 (4)). ఈ రెండు అధికరణాలలోను వెనుకబడిన తరగతుల పౌరులు' అనే పదజాలం వాడబడడాన్ని గమనించ వలసి వుంటుంది.

కాకా కలేల్కరు కమిషను నివేదిక ప్రచురింపబడిన కాలంలో - 1958 అని గుర్తు - ఆంధ్ర ప్రాంతంలో రాడికల్ హ్యూమనిష్టు ఉద్యమానికి ఆవుల గోపాల కృష్ణమూర్తి సారధ్యం వహించేవాడు. అతడు న్యాయవాది. అతని కార్యక్షేత్రం తెనాలి. అతనికి సర్వశ్రీ టి. నాగేశ్వర రావు, వేమవరపు వెంకటేశ్వర్లు అనేవారు మిత్రులు. వారిని ఉత్సాహపరిచి, ప్రోద్బలం చేసి వారిలో మొదటివారు అధ్యక్షులుగా రెండవవారు కార్యదర్శిగా వెనుకబడిన జాతుల సంఘ నిర్మాణాన్ని చేయించాడు గోపాల కృష్ణమూర్తి. సంఘ నియమావళి రచనకు సాయం చేశాడు. వారు 'యుగవాణి' అనే మాస పత్రికను నెలకొల్పారు. వెనుకబడిన జాతుల ఉద్యమాన్ని గోపాల కృష్ణమూర్తి సమర్థించాడు. నేను అతని సహచరునిగా అతనితో యీ విషయం చర్చించాను. మనం కోరేది కులరహిత సమాజం కనుక 56 వెనుకబడిన కులాలను ముందు కలిపి ఒక త్రాటిపైకి తెచ్చి తద్వారా కులరహిత సమాజానికి బాటలు వేద్దామన్నాడు. నేను ఆయనతో ఏకీభవించ లేదు. వెనుకబడినతనం కులంపై ఆధార పడరాదని నేను వాదించాను.

కాకా కలేల్కరు కమిషను నివేదిక చివరి భాగం వెనుకబడిన కులాలవారికి అనుకూలంగా వుంది. ఆ కమిషనువారు కూలంకషంగా [illegible] చేశారు. వెనుకబడినతనాన్ని గుర్తింపటంలో కులాన్ని ఆధారం చేసుకోవడం [illegible] లేదు. అందులో కుల ప్రమాదాన్ని వారు గుర్తించారు. వెనుకబడిన [illegible] స్వప్రయోజనాలపరుల చేతిలో ఒక హక్కుగా విలసిల్లవచ్చని భావించారు. [illegible] వెనుకబడినతనాన్ని అనేక అంశాలపై నిర్ణయించినా అనేక కులాలు వెనుకబడి వున్నాయి [illegible] గా వెనుకబడిన తరగతుల పౌరులను గుర్తింపటం తేలికయని భావించి

చివరకు గత్యంతరం లేక అలాగే సిఫారసు చేసింది కమిషను. ఈ కమిషను నిర్ణయాన్ని వెనుకబడిన కులాలవారు, వెనుకబడిన జాతుల సంఘం వారు ఆసరాగా తీసుకున్నారు. కమిషను నిర్ణయం నాకు మింగుడు పడలేదు. నా అసమ్మతిని మిత్రుడు గోపాల కృష్ణమూర్తికి తెలియజేసి కుల వ్యవస్థ యీ పద్ధతి ద్వారా గట్టిపడుతుందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చాను. అయితే 'యుగవాణి'లో వ్యాసం రాయుమని గోపాల కృష్ణమూర్తి నన్ను కోరాడు. దానికి నేను అంగీకరించి వ్యాసం రాసి పంపాను. శ్రీ వేమవరపు వెంకటేశ్వర్లు ప్రకటించారు. ఆ రోజుల్లో శ్రీ ఎయినప్పూడి పత్రిధర్ సోషలిస్టు పార్టీ తరఫున పార్లమెంటు సభ్యులు. లోహియా సహచరులు. (ఈనాటికి ఆంధ్రప్రదేశ్‌లో సోషలిస్టు ఉద్యమానికి కురువృద్ధులు). అయిన లోహియా సిద్ధాంతాన్ని అనుసరించి వెనుకబడిన జాతులు, అల్పసంఖ్యాకులు, షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగలు స్త్రీలు వీరంతా ఒక కూటమిగా ఉండాలని భావించేవారు. ఆనాటికి అంబేద్కరు స్థాపించిన రిపబ్లికను పార్టీకి సోషలిస్టు పార్టీకి ఎన్నికల పొత్తు ఉండేది. యుగవాణిలో వెనుకబడిన జాతుల ఉద్యమాన్ని సమర్థిస్తూ వారి వ్యాసం, విమర్శిస్తూ నా వ్యాసం ప్రకటితమయినవి. నేను వెనుకబడిన తరగతుల వారికి వ్యతిరేకిని కాదు; వారికి రిజర్వేషనుల ద్వారా ప్రత్యేక సదుపాయాలు, సౌకర్యాలు, అవకాశాలు కల్పించటానికి నాకు అభ్యంతరం లేదు; ఆమోదయోగ్యం కూడాను. వచ్చిన చిక్కల్లా వెనుకబడిన తనానికి 'ఏది గీటురాయి' అనే అంశం పైననే. కులాన్ని గీటురాయిగా పెట్టి వెనుకబడిన తనాన్ని నిర్ణయించరాదని నా వాదన– అలాచేస్తే కుల వ్యవస్థ నశించే అవకాశం లేకపోగా గట్టిపడగలదని నా వాదన. అగ్ర వర్ణాల కులతత్వం నిస్సందేహంగా ప్రత్యాఘాతకమే; హానికరమే. ఆ విషయంలో సందేహం లేదు. కాగా వెనుకబడిన కులాల కులతత్వాన్ని మనం అర్థం చేసుకోగలం. అది ఉత్పన్నమయ్యే నేపథ్యాన్ని అవగాహన చేసుకోగలం. అది అగ్రవర్ణాల కులతత్వానికి ప్రతిస్పందనయని, ప్రతిచర్య యని మనం గ్రహించగలం. కాని దానిని సమర్థించ లేము. సమర్థించ రాదు. మా కులం వెనుకబడినదంటే మా కులం వెనుకబడింది అని వెనుకబడిన కులాలవారు, పోటీకి దిగవచ్చునని, ఎవరి కులం వారికే గొప్పగా అనిపిస్తున్నదని, అందుచేత వెనుకబడిన కులాలవారు అందరూ కలిసి ఒకే కులంగా ఏర్పడే అవకాశం లేదని, వెనుకబడిన జాతుల ఉద్యమం కుల భావనను పెంపొందిస్తుందని, చివరకు కుల వ్యవస్థ స్థిరపడుతుందని నేను గట్టిగా వాదించాను. రాజ్యాంగంలో 'వెనుకబడిన తరగతుల వారు' అనే పదజాలం వాడబడిందని, సామాజిక విద్యా విషయక వెనుకబడినతనం ప్రస్తావించబడిందని, కుల ప్రసక్తి లేకుండా సామాజిక విద్యా విషయక వెనుకబడినతనాన్ని నిర్ధారించటం అసాధ్యం కాదని నా వాదన. నా అభిప్రాయాన్ని వెనుకబడిన జాతుల సంఘం వారు మన్నించలేదు. గోపాల కృష్ణమూర్తి ఆమోదించ లేదు. ఆ ఉద్యమం కొన్ని సంవత్సరాలు ఉధృతంగా సాగింది. తర్వాత చేనేత పారిశ్రామికుల నాయకుడు శ్రీ ప్రగడ కోటయ్య, అప్పటికి బహుజన నాయకుడు శ్రీ గౌతు లచ్చన్న దానికి నాయకత్వం వహించారు. కాలక్రమేణ ఆ ఉద్యమం అప్పటికి సన్నగిల్లింది.

# ఆంధ్రరాడికల్ హ్యూమనిస్టు సమన్వయ కమిటి

**1948**లో రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రద్దయిందని మునుపే తెలుసుకున్నాం. 1946లో మానవవాద తత్వసూత్రాలు రూపొందించబడినయి. అయితే పార్టీని ఆనాడు రద్దు చేయలేదు. ఆ సూత్రాల తార్కిక పరిణామ ఫలితంగా 1948లో రద్దయింది. ఆ నిర్ణయ ఫలితాలు, తర్వాతి పరిణామాలు గమనార్హాలు. ఇతర ఉద్యమాలలో పాల్గొనే అనేకులకు ఆసక్తిదాయకం కాగలవని తెలియజేస్తున్నాను.

అప్పటివరకు 1937 నుండి వీరావేశంతో అనేక రంగాలలో – కార్మికోద్యమంలో; విద్యార్థి ఉద్యమంలో, భావవికాస ఉద్యమంలో, రాజకీయోద్యమంలో – ప్రముఖంగా, చురుకుగా పనిచేసిన రాడికల్ డెమొక్రట్‌లు ఒక్క సారిగా కార్యక్రమాల జోరు తగ్గించారు. తాత్విక చర్చల్లో మునిగి తేలుతూ, కార్యాచరణను విస్మరించారు. కాకపోతే ఉద్యమానికి అవసరమైన సంస్థల్లో పనిచేయడం మానలేదు. 1937లో బొంబాయిలో స్థాపించబడి 'ఇండిపెండెంటు ఇండియా' అనే పేరుతో ఎం.ఎన్.రాయ్ సంపాదకత్వాన వెలువడే ఇంగ్లీషు వార పత్రిక 'రాడికల్ హ్యూమనిస్టు' అనే పేరుతో రాయ్ సంపాదకత్వంతో కలకత్తా నుండి వెలువడ సాగింది. 'రాడికల్' గ్రంథాలను కలకత్తా నుండి ప్రచురించే 'రినైజాన్సు పబ్లిషర్సు (ప్రై) లిమిటెడ్ కొనసాగుతూనే ఉంది. డెహ్రాడూనులో స్థాపించబడిన భారత జ్ఞాన వికాస సంస్థ' ప్రాచీన తత్వాలలో మంచిని అర్వాచీన తత్వాల శ్రేష్టతను వెలికి తీస్తున్నది. అయితే కార్మికోద్యమంలో చొరవతో కూడిన కృషి, విద్యార్థి లోకంలో సంఘాల స్థాపన యించుమించుగా నిలిచిపోయింది. పార్టీకోసం సర్వస్వం ఒడ్డి పోరాడిన కార్యకర్తలు వచ్చిన మార్పులు చూచి విభ్రాంతికి లోనయి మ్రాన్పడి పోయారు. ఉదాహరణకు ఒకనాడు గుంటూరు జిల్లాలో మూడు వందల మంది గట్టి కార్యకర్తలున్న పార్టీ మూలపడింది. నామరూపాలు లేకుండా పోయింది. ఆంధ్ర మొత్తంలో ఒకరిద్దరు తప్ప ఎవరూ యితర రాజకీయ పార్టీలలో చేరలేదు. అలా చేరిన వారిలో ప్రముఖుడు శ్రీ పెమ్మరాజు వెంకట్రావు. నెల్లిమర్ల జూట్ మిల్లు కార్మికుల నాయకుడు. కమ్యూనిజాన్ని ఎదిరించాలంటే కాంగ్రెస్ ద్వారా మాత్రమే పోరాడగలమని తలచి, దానిలో చేరాలని సంకల్పించి కాంగ్రెసు సభ్యుడయినాడు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి ప్రధాన కార్యదర్శి అయి శాసన మండలి సభ్యుడయి, నాయకులకు సన్నిహితుడయి తర్వాత పార్టీ రాజకీయాలకు స్వస్తి చెప్పాడు.

దేశం యావత్తులో పరిణామాలు ఆంధ్రలోలాంటివే. పూర్వం తమ తమ ఉద్యోగాలను విడనాడి పార్టీకి పూర్తికాలం వినియోగించిన ప్రముఖ కార్యకర్తలు – జాతీయ, రాష్ట్ర, జిల్లా, తాలూకా కార్యదర్శులు – తమ ఉద్యోగాలలోకి వృత్తులలోకి వెళ్లిపోయారు. భావ పునర్వికాసం మున్ముందుగా జరగాలని ప్రజోద్యమాలలో కార్యాచరణ తత్ఫలితమని సూత్రీకరించటంలో, క్రొత్త ఆలోచనారీతి అనుపానులు సరిగా వెంటనే గ్రహించలేక పోవటంలో, ఉద్యమ విశిష్టత సంపూర్ణంగా అవగాహన కాకపోవడంతో, స్వతంత్రంగా వ్యవహరించే అలవాటు లేకపోవడంలో, పార్టీ వుంటే బాగుండేది కదా అనే భావం

యింకా చాలమంది మనస్సులలో మెదులుతూ వుండటంతో ఉద్యమకారులలో స్తబ్దత వచ్చింది. నిజానికి స్వతంత్ర ఆలోచన కష్టదాయకం. సైన్యంలో, ఆశ్రమాలలో, ఏకశిలారాజకీయ పార్టీలలో సంస్థలలో (కమ్యూనిస్టు, ఫాసిస్టు) సభ్యులకు పెద్దగా స్వతంత్ర ఆలోచనకు అవకాశం లేకపోవడం వలన ప్రశాంతత ఏర్పడుతుందనే అభిప్రాయం చెలామణీలో వుండేది. నిజానికి ఆయా సంస్థల, పార్టీల సభ్యులు ఆలోచించడం లేదని భావం కాదు. ఒకే పరిధిలో, గిరిలో వారి ఆలోచనలు సాగుతాయని, సేనా నాయకుడు, ఆశ్రమంలోని మాతాజీ, ఏకశిల రాజకీయ పార్టీలలో పై కమిటీలు ఉత్తరువులు యిస్తే పాటించటం తేలికని తలచటం సర్వసామాన్యం. రాజకీయ పార్టీ లక్షణంతో రాడికల్ డెమోక్రటులు 'అనాథలు' అయినారు. వారికి వారే నాయకులు కావాలని రాయ్ చెప్పాడు. సరిగ్గా యిలాంటి ఆలోచనతోనే సభ్యులు స్వయం పాలితులు కావాలని, తమపై తాము ఆధారపడాలని తలచి పార్టీ రద్దును సూచించాడు రాయ్.

సిద్ధాంతాలు చర్చలు 1956 వరకు అంటే 8 సంవత్సరాలు సాగాయి. 1952 పార్లమెంటు ఎన్నికల్లో, అసెంబ్లీ ఎన్నికల్లో వారి పాత్ర ఏమీ లేదు. కాకపోతే సమావేశాలలో గుమిగూడి జాతీయ అంతర్జాతీయ సంఘటనలను, ఉద్యమాలను విశ్లేషించడం, భావి వికాసానికి శిబిరాలు నిర్వహించడం, పత్రికలు ప్రకటించడం, స్థానిక కార్యక్రమాల్లో పాల్గొనడం మాత్రమే జరిగింది. మిత్రులు ఆవుల గోపాల కృష్ణమూర్తి, రావిపూడి వెంకటాద్రి, ఎన్.వి. బ్రహ్మం, ఆవుల సాంబశివరావు ప్రభృతులు హేతువాద ఉద్యమంలో పాల్గొనేవారు.

వేయితిరగ రాజకీయాలలో పనిచేసేవారేమో రాడికల్ హ్యూమనిస్టులూ రాజకీయాలలో పనిచేయకుండా వుండలేకపోయారు. కొందరు 1955 ఎన్నికల్లో వచ్చిన కమ్యూనిస్టు వ్యతిరేక వాహినికి తోడ్పడ్డారు. 1955 ఎన్నికల్లో నా పాత్ర ముందే వివరించాను. వారు కేవలం భావ వ్యాప్తిలో సంతృప్తి పడలేదు. 1956లో డెహ్రాడూనులో జరిగిన శిబిరం మరల రాడికల్ హ్యూమనిస్టులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. కార్యాచరణకు దారితీయని సిద్ధాంత చర్చ అనవసరమని ఊహించారు. సంస్థా నిర్మాణం తప్పని, సంస్థ తప్పనిసరిగా పార్టీ ఆవిర్భావానికి దారితీస్తుందని తలచే అరాచక (అనార్కిస్టు) ధోరణిని త్రోసిరాజనగల్గారు ఆంధ్ర రాడికల్ హ్యూమనిస్టులు. తత్ఫలితమే 1958లో ఏర్పడిన 'ఆంధ్ర రాడికల్ హ్యూమనిస్టు సమన్వయ కమిటీ'. సర్వశ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి, కొల్లా సుబ్బారావు, విలుకుర్తి రాజారెడ్డి, రావిపూడి వెంకటాద్రి, ఎన్.వి. బ్రహ్మం, పి. కృష్ణ చౌదరి సభ్యులు. నేను సమావేశకర్తను. ఈ సమన్వయ కమిటీ తరుచుగా 1962 ఎన్నికల సమయంలో యింకా యితరత్రా సమావేశమయింది కాని కార్యాచరణకు దారితీసే నిర్ణయాలు చేయలేదు. ఈ వైఫల్యానికి కారణం ఉద్యమ స్వభావంలోనే వుంది. ఉద్యమంలో చేయబడే నిర్ణయాలు వాటిని ఆమోదించిన వారినే బలపరుస్తాయి. అందరూ వాటి కనుగుణంగా ప్రవర్తించనవసరం లేదు. రాజకీయ పార్టీల తీర్మానాలు అందరు సభ్యులకు శిరోధార్యాలు. కమ్యూనిస్టు పార్టీలలో ఆ తీర్మానాలను ప్రతి సభ్యుడు విధిగా అమలు చేయవలసిందే. కమ్యూనిస్టేతర రాజకీయ పార్టీల సభ్యులు పార్టీ తీర్మానాన్ని ఆమోదించకపోతే మిన్నకుండ వలసిందే కాని

వ్యతిరేకించరాదు. అయితే ఆ తీర్మానాలకు అనుకూలంగా కార్యాచరణకు దిగడం, వాటిని ప్రచారం చేయడం చేపట్టనక్కర లేదు. పార్టీకి, ఉద్యమానికి ఉన్న తేడా విశిష్టమయినది; ప్రధానమయినది. ఉద్యమ నడకరీతియే ఉద్యమానికి బలం. బలహీనత కూడాను. గౌరవకు, ప్రామాణికతకు, స్వతంత్రతకు, స్వావలంబానికి ఉద్యమం వీలు, అవకాశం కల్గిస్తుంది. ఇతర సభ్యుల అవినీతికర చర్యలకు, దుష్ట కార్యక్రమాలకు ఏ సభ్యుడు బాధ్యుడు కానందున సంజాయిషీలు చెప్పే అవస్థ తప్పిపోయింది. అయితే పార్టీవల్ల కలిగే వీరావేశం ఉద్యమం ద్వారా రాదు. అదీగాక రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం ప్రబోధంపై నొక్కి పెట్టినందువల్ల సమాజ పరివర్తనం దీర్ఘకాల ప్రాతిపదికపై సాగుతుందనే భావం కలిగి కార్యాచరణలో వేగం, వడి సహజంగా తగ్గాయి. ఇలా రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం మందకొడిగా సాగింది. పాఠ్య గ్రంథాల ప్రభుత్వ స్థాయి జాతీయకరణను వ్యతిరేకించే ఉద్యమంలో మిత్రుడు ఆవుల గోపాలకృష్ణమూర్తి కృషిచేశాడు. విధిగా యించుమించుగా ప్రతి వారం సభలలో ప్రసంగిస్తూ భావ ప్రసారానికి, ప్రబోధానికి పాటుపడ్డాడు. కొందరు మిత్రులు స్థానికంగా అలాంటి కృషిని చేపట్టేవారు.

# 1962 అసెంబ్లీ ఎన్నికలు: పోటాపోటీలు

రామమూర్తి జ్ఞాపకాలలో ఎన్నికలు వాటి సంబంధంగా అతని వైఖరి, చర్యలు చోటుచేసు కుంటున్నాయి. అతని జీవితమంతా ఎన్నికల సమయాల్లో అతని పడకతోనే నిండిపోతున్నదా అనే సందేహం చదువరులకు రావడం సహజం. ఈ అనుమానానికి వాస్తవికత లేదు. నేను చైతన్యం కల మనిషినే. కనుక నిరంతరం ఆలోచనాపరుణ్ణి, కార్యశీలిని కూడాను. కాకపోతే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఎన్నికలు ప్రజల దృష్టిని ఆకట్టుకుంటాయి కనుక ఎన్నికల కాలంలోని సంఘటనలు సామాన్య ప్రజలకు ఆసక్తిదాయకంగా వుంటాయి. కనుక ఎన్నికలను గురించి అంత వివరంగా రాయడం సంభవిస్తున్నది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో 5 సంవత్సరాలకు ఒకసారి పౌరుడు తన వోటును 'బ్యాలట్ బాక్సు'లో వెయ్యటం తప్ప మరేమీ లేదని, మరేమీ కాదని సమూల ప్రజాస్వామ్యం (రాడికల్ డెమోక్రసీ)లో నమ్మకం వున్నవాళ్ళు వ్యాఖ్యానించడం కద్దు. ప్రజా ప్రతినిధులు ఎన్నికయిన తరువాత వారి చర్యలను - దుశ్చర్యలు అని అన్నా తప్పు లేదు- కళ్లు అప్పగించి అసమర్థంగా చూస్తూ వుండటం తప్ప 'వోటరు మహాశయుడు' ఏమి చేయగల్గుతున్నాడు? ఒక మిత్రుడు వ్యంగ్యంగా అన్నట్లు 5 సంవత్సరాలకు ఒకసారి పౌరుడు తన వోటును కోల్పోతాడు. ఈ మాట విడ్డూరంగా కన్పించవచ్చు. తరచి చూస్తే దానిలో కొంత సత్యం గోచరిస్తుంది. వోటువేసి పోలింగు బూతు బయటికి రాగానే వోటరు స్వతంత్రత, నిర్ణయాధికారం అన్నీ ఒక్క పెట్టున 'హుష్‌కాక్' అవుతాయి. అతడు నిష్క్రియాపరుడవుతాడు. ప్రజా ప్రతినిధులను, వారు ఎన్నుకునే మంత్రులను, మంత్రివర్గాన్ని వోటరు మహాశయులు అదుపులో ఉంచలేరు. మంత్రులు అసమర్థులైనా, అవినీతి పరులయినా, ప్రజా ప్రతినిధులు తమ విధి నిర్వహణలో అలసత్వం ప్రదర్శించినా, లేక వీరందరు అదే పనిగా దేశపు, రాష్ట్ర బొక్కసాలను కొల్లగొట్టుతున్నా 'సర్వ సత్తాకత' ఉన్న పౌరుడు, 'సార్వభౌముడు' అయిన పౌరుడు వారిని పదవుల నుండి 'లా' ప్రకారం తొలగించలేడు. స్త్రీ వోటర్లు కూడా వారిని ఏమీ చేయలేరు. ఇది పచ్చి నిజం.

సరే! 1962 అసెంబ్లీల విషయానికి వద్దాం. నేను 1950 నుండి బాపట్లలో స్థిర నివాసం ఏర్పరచుకొని ప్లీడర్ (న్యాయవాది) వృత్తిని చేస్తున్నట్లు చదువరులు యీపాటికి ఊహించి వుంటారు. నా జ్ఞాపకాలలో పెద్దగా వ్యక్తిగత విషయాలు, కుటుంబపు సంగతులు ముచ్చటించడం లేదు కనుక అలా స్పష్టంగా నేను యింతకు క్రితం చెప్పలేదేమో! బాపట్ల నా మేనమామ వూరు. నేను హైస్కూలు చదువులో 3, 4, 5 ఫారంలు విద్యార్థిగా వున్న పట్టణం. పట్నం అంటే జ్ఞాపకం వచ్చింది సముద్రపు వొడ్డు వూరు కదా! నా తండ్రిగారు కొన్నాళ్లు ప్రభుత్వోద్యోగం చేసిన ప్రదేశం. తరువాత నా భార్య (కొండూరి వెంకట సుబ్బమ్మ తరువాత మల్లాది వెంకట సుబ్బమ్మ, (యీనాడు మల్లాది సుబ్బమ్మ) పుట్టినిల్లు వున్న వూరు. ఇదివరకు నేను 1950లో అప్పటికి తరలివచ్చి సుమారు 20 సంవత్సరాలు అడ్వకేటుగా

వ్యాప్తిచేసిన వూరు. ఆ పట్నం విశిష్టతను గురించి మరో సందర్భంలో ప్రస్తావిస్తాను.

కాంగ్రెసు నాయకుడు శ్రీ మంతెన వెంకటరాజు 1946 అసెంబ్లీ ఎన్నికలలో గెలవడం, తరువాత 1952 ఎన్నికలలో పరాజయం పాలు కావడం, ఆ తదుపరి 1955 ఎన్నికల్లో తిరిగి విజయం సాధించడం చదువరులకు ఎరుక. 1962 ఎన్నికల్లో తను అభ్యర్థిగా ముందుకు వస్తే తనపై నున్న వ్యతిరేకత, కాంగ్రెసు యెడ అసంతృప్తి, కోపం, ద్వేషం యివన్నీ కలిసి తనను ఓడిస్తాయని ఆయన గ్రహించారు. తెలివికల నాయకుడుగా మరో ఎత్తుకు దిగాడు. కోడలు శ్రీమతి మంతెన సత్యవతిని బరిలోకి దించ తలిచాడు. ఆమె పుట్టింటివారు కాంగ్రెసు ఉద్యమాలలో త్యాగాలు చేసినవారు. ఆమె పుట్టిన కుటుంబం పేరెన్నిక కన్నది. పైగా ఆమెగా రాజకీయాలలో అంతకు క్రితం ప్రవేశం కలిగిన వ్యక్తి కాదు. ఆమె చెడు ఏనాడు చేసింది లేదు. స్త్రీగా మహిళల సానుభూతిని, మద్దతును ఆమె పొందవచ్చు. ఏదయినా ఆ నియోజక వర్గంలో క్షత్రియుల ప్రాబల్యం వుంది కదా. ఆమె క్షత్రియ వనిత. ఇక తన అండదండలు ఆమెకు తప్పనిసరిగా వుంటాయి. ఇన్ని రకాల ఊహాపోహలలో, అంచనాలలో కోడలును శాసనసభకు అభ్యర్థిగా ప్రజల ఎదుట నిలబెట్టాడు మంతెన వెంకట్రాజు గారు. ఆయన ఆలోచనా క్రమం సరి అయినదే. కాని ప్రజలు ఆయన భావించినంత అజ్ఞానులు కాదు. వారు ఆయన ఉద్దేశ్యాలను, పన్నాగాలను పసికట్టారు.

బాపట్ల అసెంబ్లీ నియోజక వర్గంలో సర్వశ్రీ కోన ప్రభాకర్ రావు, యిడవల్లి సూర్యనారాయణ, గేబ్రియలు మంతెన వెంటరాజుగారి సహచరులు. వారిలో మొదటి యిద్దరిని అనుచరులన్నా తప్పులేదు. కోన ప్రభాకర్ రావు (తరువాత ఆం.ప్ర. రాష్ట్ర ఆర్థికమంత్రి, సిక్కిం, బొంబాయి రాష్ట్రాల గవర్నరు పదవులను చేపట్టాడు) బాటప్లవాసి. యిడవల్లి సూర్య నారాయణ (తరువాత బాపట్ల పురపాలక అధ్యక్షుడయినాడు) బాపట్ల కాపురస్థుడే. బాపట్ల పట్టణం అసెంబ్లీ నియోజక వర్గంలో వుంది. అప్పట వోటర్ల సంఖ్య సుమారు 15 వేలు. ఇక గేబ్రియలు బాపట్లకు 5 మైళ్ళ (యీనాటి లెక్కన 8 కిలో మీటర్లు) దూరాన వున్న ఒమ్మెలపాలెం గ్రామ పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు. వీరు అందరూ కాంగ్రెసువారే. వెంకట రాజుగారి తదనంతరం తాను శాసన సభ్యుడుగా రూపొందాలని ఎవరికి వారు ఆశిస్తున్నవారే. వెంకటరాజు గారి నిర్ణయం ముందుగా గట్టిగా తెలియక పోయినా ఆయన ఏదో ఎత్తు ఎత్తుతాడని తమ ఆశలు అడియాసలు అవుతాయని మున్ముందుగా గ్రహించినవారే కనుక వీరు ముగ్గురూ కలిసి మంతెన వెంకట రాజు వ్యతిరేక ఫ్రంటును ఏర్పరచారు. తమ ముగ్గురిలో ఒకరిని శాసనసభ ఎన్నికలలో అభ్యర్థిగా వెలికి తేవాలని నిర్ణయించుకున్నారు. ముగ్గురూ (సుగాలీల భాషలో) కాళ్ళకు తాడు కట్టుకున్నారు. ముగ్గురిదీ ఒకే బాటగా, ఒకే మాటగా వుండాలని తీర్మానం చేసుకున్నారు. ఈ నేపథ్యంలో ఒక సంఘటన జరిగింది. అది విచిత్రంగా పరిణమించింది.

పై చెప్పిన కోన ప్రభాకర్ రావు, యిడవల్లి సూర్యనారాయణ, గేబ్రియలు వీరు ముగ్గురూ ఎవరికి వారు శాసనసభ సభ్యత్వం తమకే చెందాలని కోరుకుంటున్నారు కదా! అందుకు విడివిడిగా సన్నాహాలు చేయసాగారు. మద్దతుదార్లను సమకూర్చు

కొనడం, సానుభూతి పరులను సమకూర్చు కొనడం సాగుతున్నది. నేను కాంగ్రెసు వ్యతిరేకినని, యడవల్లి సూర్యనారాయణకు మేనత్త కుమారుడినని నియోజక వర్గంలో రాజకీయ వాసన కలవారందరికీ తెలుసు. నాకు అనుచర వర్గం, సహచర వర్గం చెప్పుకోగల సంఖ్యలో లేకపోయినా గట్టిగా విశ్వాసాలు కల మనిషినని, మాట అంటే నిలబడే వాడినని అందరికీ తెలుసు. ఒకరోజు సాయంత్రం క్లబ్బులో వుండగా గేబ్రియలు అన్న (అతడు క్రైస్తవుడు. అతనిని అలా పిలుస్తారు) నా వద్దకు వచ్చి 'మీ బావమరిది యడవల్లి సూర్యనారాయణతో చిక్కు వచ్చిందండి' అని అన్నాడు. 'ఏమిటా చిక్కు' అని ప్రశ్నించాను.'తను అభ్యర్థిని అని ప్రకటించుకోడు; అలాకాక నా అభ్యర్థిత్వాన్ని బలపరచడు ఇదే విషయం' అని జవాబు చెప్పాడు. 'మీరు అభ్యర్థిగా ఉండటానికి సిద్ధమేనా' అని అడిగాను. 'సిద్ధమే' అన్నాడు. 'అయితే నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను. వీలయితే, యిష్టమయితే బదులు పలకండి' అన్నాను. 'సరే, అడగండి' అని ప్రత్యుత్తరం యిచ్చాడు. మా సంభాషణ యిలా సాగింది. రా. 'మీరు ముఖ్యంగా ఆశించేది ఏమిటి?' గే. మంతెన వెంకట్రాజు లేక అతని మనిషి ఓడటం ప్రప్రథమం. నా గెలుపు రెండవ శ్రేణి అంశం. రా. 'మీరు ఎన్నికలకు ఎన్ని రూపాయలు ఖర్చు చేయగలరు?' గే. '3, 4 వేల రూపాయలు స్వంతంగా పెట్టుకోగలను.' రా. 'ఒక్కసారి అభ్యర్థిగా ముందుకు వచ్చిన తరువాత చివరివరకు పోటీచేస్తారా?' గే. 'చేస్తాను. మధ్యలో విరమించుకోను.' రా. 'అయితే పదండి, సూర్యనారాయణతో మాట్లాడుకుందాం.' ఇద్దరం క్లబ్‌లోనే వున్న సూర్యనారాయణను కలిశాం. 'సూరయ్యా, ఇలా రారా' అని అతనిని పిలిచాను. (సూర్యనారాయణ నేనూ కలిసి పెరిగినందున అతడు నా కన్న 4 సంవత్సరాలు చిన్నవాడయినందున అతనిని అలా పిలిచే అలవాటు) 'ఏమిటిరా విషయం' అంటూ అతను మా వద్దకు వచ్చాడు. 'నీవు యీ శాసనసభ ఎన్నికలలో అభ్యర్థిగా నిలుచోడానికి నిశ్చయించావా?' అని ప్రశ్నించాను. 'లేదు; అభ్యర్థిగా ఉండతలచలేదు' అని అన్నాడు ఒక్క క్షణం గేబ్రియలు వైపు తిరిగి 'అన్నా నీవు పోటీచేయి. నేను మద్దతు యిస్తాను' అని హామీ ఇచ్చాడు. వెంటనే నేను 'అన్నా! నీకు ఎన్నికలలో నేను బాసటగా నిలబడతాను. నీ ఎన్నికల ప్రచారానికి తోడ్పడతాను.' అని గేబ్రియలు అన్నకు సహాయం చేయటానికి సిద్ధపడ్డాను. దాంతో యీ విషయం క్లబ్బులో అందరి సభ్యులకు తెలిసింది. అన్న అభిమానులు అతనిని చుట్టుముట్టి అతని నిర్ణయానికి హర్షం వెలిబుచ్చారు. వార్త నిముషాల మీద వ్యాపించింది. శ్రీ మంతెన వెంకట్రాజు తన కోడలును అభ్యర్థిగా ప్రకటించడం, వెనువెంటనే శ్రీ కోన ప్రభాకర్ రావు ఆమెను క్యాంపులోకి వెళ్ళి ఆమె అభ్యర్థిత్వాన్ని బలపరచడం నిముషాల మీద జరిగిపోయింది. అసలు ఎన్నికలు జరిగిన తీరును గురించి తర్వాత ముచ్చటిస్తాను.

బాపట్ల నియోజక వర్గంలో కాంగ్రెసు అభ్యర్థి శ్రీమతి మంతెన సత్యవతి, కమ్యూనిస్టు అభ్యర్థి శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ స్వతంత్ర్య అభ్యర్థి గేబ్రియలు పోటీకి దిగారు. కాంగ్రెసు, కమ్యూనిస్టుల మధ్య పోటీ తీవ్రంగా వుంది.

సర్వ సాధారణంగా ఆ రోజుల్లో దళితులు (ఆనాటికి ఆ పేరు పుట్టలేదు వారికి గాంధీగారు పెట్టిన పేరు 'హరిజనులు' అనేది చలామణిలో ఉండేది) కాంగ్రెసును బలపరిచేవారు. అయినా తమ కులస్తుడు కనుక గేబ్రియలు అన్న మీద సానుభూతి ఉన్నట్లు కన్పించేది. ఆ సానుభూతి వోట్లలోకి మారుతుందా లేదా అనేది మాత్రం అనుమానాస్పదం.

గేబ్రియలు అన్న ఎన్నికల ప్రచారంలో అభ్యర్థి, యడవల్లి సూర్యనారాయణ, సోమయ్య అనే మాజీ కమ్యూనిస్టు నేను పాల్గొనేవారం. ఏ గ్రామం వెళ్ళినా సభ ముఖ్యంగా పల్లెలోనే జరిగేది. అది ఆంధ్రుల పల్లెల పైననే దృష్టిని కేంద్రీకరించాం. ఒక రోజు రాత్రి ఒక గ్రామపు అది ఆంధ్రుల పల్లెలో ఎన్నికల సభ పెట్టాం. ముస్మందుగా యడవల్లి సూర్యనారాయణ ప్రసంగించాడు. ఆ తరువాత వంతు సోమయ్యది. అతని ఉపన్యాసం ఉద్వేగపూరితంగా సాగింది. వర్గ పోరాటాన్ని గురించి అతను వివరించాడు. భారతదేశంలో వర్గ పోరాటం వర్ణ పోరాటంగా రూపొందింది అని సూత్రీకరించాడు. తమ వర్ణానికి చెందిన గేబ్రియలు అన్నను గెలిపించాల్సిన చారిత్రక అవసరాన్ని నొక్కి చెప్పాడు. ఈ కుల పోరాటంలో గేబ్రియలు అన్న పేద ప్రజల ప్రతినిధి అన్నాడు. తతిమ్మా అభ్యర్థులందరూ అగ్ర కులాల, అగ్ర వర్ణాల మనుషులని అభివర్ణించాడు. వారిని ఓడించమని, తమ కులపువాడయిన గేబ్రియలు అన్నకు వోటిచ్చి గెలిపించమని విజ్ఞప్తి చేశాడు. ఆ సభలో ఆరు ఏడు వందల మంది జనం ఉన్నారు. వినేవారి ముఖాలు జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి. అంత శక్తివంతమయిన ఉపన్యాసం అది. తరువాత ఉపన్యాసం నాది. నేను లేచి మందస్వరంతో ప్రారంభించాను. తాపీగా పరిస్థితిని విశ్లేషణ చేశాను. గేబ్రియల్ అన్న పేద ప్రజల అభ్యర్థి అని ఘంటాపథంగా నొక్కి చెప్పాను. కాని కులపోరాటం, వర్ణ పోరాటం రెండూ ఒకటనేది పొరబాటు మాట అని చెప్పాను. కుల ప్రాతిపదిక మీద పోరాటం సాగించటం మంచిది కాదని హితవు చెప్పాను. అప్పుడు నా మనస్సులో తమిళనాడులో రామనాథ్, మధుర జిల్లాల్లో దళితుల తేవరుల మధ్య ఘోరంగా జరిగిన కులపోరాటం మెదులుతున్నది. తేవరులు శూద్రులు. దళితులు అట్టడుగు వర్గం వారు. రెండు జిల్లాల్లో మూడు రోజులు ప్రభుత్వం అనేది లేకుండా పోయింది. పది గ్రామాల తేవరులు పదివేల మంది పోగయి దళితుల పల్లెలపై దాడి చేసేవారు. దళితులు చర్చీలలో తలదాచుకునేవారు. దళితులు వందల సంఖ్యలో నేలకూలారు. మరునాడు దళితులు పదివేల మంది తేవరుల గ్రామాలపై ఉప్పెనలాగా పడేవారు. తేవర్లూ వందల సంఖ్యలో బలి అయిపోయారు. నేను ఉపన్యసించేటప్పుడు ఈ దృశ్యం నా కళ్లముందు తొంగిచూసలాడింది. సోమయ్య ఉపన్యాసం రేకెత్తించిన కుల ద్వేషాన్ని కుల చైతన్యాన్ని ఎందుకు తెచ్చాం ఎన్నికల పోరాటానికి. పెళ్ళికి వెళ్తూ పిల్లిని వెంటబెట్టుకొని వచ్చినట్లయింది. కనీసం నాలుగు వందల వోట్లు

మనకు వచ్చే అవకాశాన్ని ధ్వంసం చేశాడు పాపిష్టి వాడు' అని నన్ను ఉద్దేశించి నా మేనమామ కుమారుడు యడవల్లి సూర్యనారాయణ విసుక్కున్నాడు. పోమయ్య దిగ్భ్రాంతికి లోనయ్యాడు. గేల్రియలు అన్న నన్ను ఒక్క మాట అనలేదు. అప్పటికి అతడు పెబది ఏళ్ళవాడు. నా కన్న ఆరేళ్లు వయస్సులో పెద్ద. గంభీర మనస్కుడు అతడు. ఆలోచనాపరుడు కూడాను. కనుకనే కమ్మవారి ప్రాబల్యం వున్న జమ్ములపాలెంలో పంచాయితీ అధ్యక్షుడు పంచాయితీ అధ్యక్షుడు కాగలిగాడు.

ఈనాటి పరిస్థితులకూ ఆనాటి ఎన్నికల సభ రోజులకు సామ్యం కనిపిస్తున్నది. వర్గ పోరాటాన్ని వర్ణ పోరాటాన్ని కలగా పులగం చేయటం ఈనాడు జరుగుతున్నది. ఈ సూత్రీకరణపై ఆధారపడే రాజకీయ పార్టీ ఆవిర్భవించింది. బహుళ ప్రచారం చేస్తున్నది. బహుజనులకు తదితరులకూ మధ్య ద్వేషాన్ని పెంచుతున్నది. 'అగ్ర' వర్ణాలలో బీదలు ఉంటారనే పచ్చి నిజాన్ని విస్మరిస్తున్నది. బీహారు, ఉత్తరప్రదేశాలలో వలె 'శూద్ర' కులాల్లోని బీదలకూ దళితులకూ మధ్య వైషమ్యాలు, తగాదాలు, కొట్లాటలు, దొమ్మీలు, పోరాటాలు ఆంధ్రప్రదేశ్‌లో కూడ పెరిగే సూచనలు కన్పిస్తున్నాయి. ఇది రాష్ట్రాన్ని ప్రమాదకర పరిస్థితుల్లో పడవేయటం ఖాయం.

సమాజంలో శ్రామికుల శ్రమ శక్తిని ఇతర వర్గాలు 'దోపిడీ' చేస్తున్న మాట వాస్తవం. ఇంగ్లీషులో 'ఎక్స్‌ప్లాయిట్' అనే పదానికి కమ్యూనిస్టులు చేసిన తర్జుమా 'దోపిడీ'. శ్రమ జీవుల శ్రమ ఫలితాన్ని ఇతరులు కాజేస్తున్నారనే భావాన్ని యిలా వెలిబుచ్చారు కమ్యూనిస్టులు. ఈ రకపు అనువాదం తప్పు. అయినా ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టుల ప్రాబల్యం హెచ్చు కనుక ఆ పదం రూఢీగా నిలిచిపోయింది. ఆ పదాన్ని వాడటం పట్ల కలిగే కసిని, ద్వేషాన్ని వారు ఆహ్వానించేవారు కనుక అలా తర్జుమ చేశారా లేక భాష పరిజ్ఞానం లేక అలా చేశారా అనేది తర్కనీయాంశం. ఏదయినా వర్గాల మధ్య అంతరాన్ని ఆ పదాన్ని విరివిగా వాడటం పెంచింది.

సమాజంలో వర్గాలున్నాయి. వర్గ పోరాటాలు జరుగుతున్నాయి. అలాగే కులాలున్నయనేది నిజం. కులాల మధ్య వైషమ్యాలు ఉన్నాయన్న మాట వాస్తవం. కుల పోరాటాలు తరుచు జరగటం చూస్తున్నాం. కాని రెండు రకాల పోరాటాలు ఒకటే అనటం అసత్యం. అట్టడుగు కులాల వారున్నారు. అట్టడుగు వర్గాల వారున్నారు. అణగారిన కులాలవారూ, తమ శ్రమశక్తి తమకు లభించని వర్గాలవారు ఒకరే అని చెప్పనటం పొరపాటు. ఈ తప్పిదం భాషా పాండిత్యం లేనందు వల్ల వచ్చింది కాదు. కావాలని తెచ్చిపెట్టినది. తద్వారా ఉనికి కల్గింది. నేటికి మనుష్యులలో మెదులుతూ వున్నది.

వర్గపోరాటాన్ని అంగీకరించినంత మాత్రాన వర్ణ పోరాటాన్ని తీవ్రతరం చేసి వర్గ చైతన్యపు సాయంతో సమాజాన్ని అభ్యుదయ పథం వైపు పంపించాలనే కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఆమోదించినట్లు కాదు. కుల పోరాటపు అస్తిత్వాన్ని ఒప్పుకున్నంత మాత్రాన కుల చైతన్యపు అభ్యుదయ పాత్రను పొగిడినట్లు కాదు. ఈ సునిశిత విశ్లేషణ అత్యవసరం. సరిగ్గా ఆలోచించడం అవశ్య కర్తవ్యం. మన దేశంలో కనుమరుగయ్యేది 'సూటిగా' ఆలోచించడమే. ఆలోచనలను, భావాలను, పదాలను, కలగా పులగం చేసి గందరగోళంగా మాట్లాడటం మన దేశ ప్రజల విశిష్టత.

ఈ ఆలోచనా ధోరణిని వ్యాప్తి చేయటం అమాయకంగా సిద్ధాంతాలను నమ్మి ప్రచారం చేసేవారి ప్రత్యేకత. తెలిసి వుండి, తెలిసి బుద్ధిపూర్వకంగా స్వప్రయోజనాల కొరకు, లబ్ధికోసం- అధికారం కొరకు, పదవికోసం, ధనాన్ని సేకరించే నిమిత్తం, పేరు ప్రఖ్యాతులను ఆశించి - యీ రకపు కలగా పులగపు ఆలోచనా ధోరణిని బహుళంగా ప్రచారం చేయటం, బలపరచటం గట్టి చేయటం మన సమాజంలోని 'నాయకుల' పద్ధతి. అయితే, యిలాంటిది తాత్కాలికంగానే మనగల్గుతుంది. కాలం గడిచిన కొలదీ మృగ్యమవుతుంది; నశిస్తుంది. సామాన్య ప్రజలు బుద్ధిహీనులు కారు. వారికి మెదళ్లు వున్నాయి. మనస్సులు వున్నాయి. ఆలోచనాశక్తి వారి సొమ్ము. విచక్షణా జ్ఞానం వారి సహజ లక్షణం. వివేకం వారి ఆస్తి. అచిర కాలంలో వారు పొరపాటు ఆలోచనా రీతిని వక్ర ఆలోచనను, వక్రపు పద్ధతిని, విడనాడటం తథ్యం. కాకపోతే యీ ప్రక్రియకు కాలం పట్టుంది. అంతే.

ఈనాటి స్థితికి ముప్ఫది ఏళ్ళనాడే బీజ ప్రాప్తి జరిగిందని చెప్పటానికే 1962 ఎన్నికల గురించి ఇంత వివరంగా వ్రాయవలసి వచ్చింది.

## వర్గపోరాటం:
## వర్ణపోరాటం

సమాజంలో వర్గాలున్నాయి. వర్గ పోరాటాలు జరుగుతున్నాయి. అలాగే కులాలున్నాయనేది నిజం. కులాల మధ్య వైషమ్యాలు ఉన్నాయన్న మాట వాస్తవం. కుల పోరాటాలు తరచు జరగటం చూస్తున్నాం. కాని రెండు రకాల పోరాటాలు ఒకటే అనటం అసత్యం. అట్టడుగు కులాల వారున్నారు. అట్టడుగు వర్గాల వారున్నారు. అణగారిన కులాలవారూ, తమ శ్రమశక్తి తమకు లభించని వర్గాలవారు ఒకరే అనీ పేర్కొనటం పొరపాటు. ఈ తప్పిదం భాషా పాండిత్యం లేనందువల్ల వచ్చింది కాదు. కావాలని తెచ్చిపెట్టినది. తద్వారా ఉనికి కల్గింది. నేటికి మనస్సులలో మెదులుతూ వున్నది.

వర్గ పోరాటాన్ని అంగీకరించినంత మాత్రాన వర్గ పోరాటాన్ని తీవ్రతరం చేసి వర్గ చైతన్యపు సాయంతో సమాజాన్ని అభ్యుదయ పథం వైపు నడిపించాలనే కమ్యూనిష్టు సిద్ధాంతాన్ని ఆమోదించినట్లు కాదు. కుల పోరాటపు అస్తిత్వాన్ని ఒప్పుకున్నంత మాత్రాన కుల చైతన్యపు అభ్యుదయ పాత్రను పొగిడినట్లు కాదు. ఈ సునిశిత విశ్లేషణ అత్యవసరం. సరిగ్గా ఆలోచించడం అ[illegible]కర్తవ్యం. మన దేశంలో కనుమరుగయ్యేది 'సూటిగా' ఆలోచించడమే. ఆలోచనలను, భావాలను, పదాలను, కలగా పులగం చేసి గందరగోళంగా మాట్లాడటం మన దేశ ప్రజల విశిష్టత. ఈ 'అరాజక' ధోరణిని వ్యాప్తిచేయటం అమాయకంగా సిద్ధాంతాలను నమ్మి ప్రచారం చేసేవారి ప్రత్యేకత. తెలివి వుండి, తెలిసి బుద్ధి పూర్వకంగా స్వప్రయోజనం కొరకు లబ్ధికోసం- అధికారం కొరకు, పదవి కోసం, ధనాన్ని సేకరించే నిమిత్తం పేరు ప్రఖ్యాతులను ఆశించి - యీ రకపు కలగా పులగపు ఆలోచనా ధోరణిని బహుళంగా ప్రచారం చేయటం, బలపరచటం గట్టి చేయటం మన సమాజంలోని 'నాయకుల' పద్ధతి. అయితే, యిలాంటి గందరగోళం తాత్కాలికంగానే మనగల్గుతుంది. కాలం గడిచిన కొలది మృగ్యమవుతుంది; నశిస్తుంది. సామాన్య ప్రజలు బుద్ధిహీనులు కాదు. వారికి మెదళ్ళు వున్నాయి. మనస్సులు వున్నాయి. ఆలోచనా శక్తి వారి సొమ్ము. విచక్షణా జ్ఞానం వారి సహజ లక్షణం. వివేకం వారి ఆస్తి. అచిర కాలంలో వారు పొరపాటు ఆలోచనా రీతిని వక్ర ఆలోచనను, వక్రపు పద్ధతిని విడనాడటం కష్టం. కాకపోతే యీ ప్రక్రియకు కాలం పట్టుంది. అంతే.

**ఈనాటి స్థితికి ముప్పది ఏళ్ళనాడే బీజ ప్రాప్తి జరిగిందని చెప్పటానికే 1962 ఎన్నికల గురించి ఇంత వివరంగా వ్రాయవలసి వచ్చింది.**

బాపట్లలో 1950 నుండి 1970 వరకు 20 ఏళ్ళు ప్లీడరీ చేశాను. పూర్తికాలాన్ని యించుమించుగా 6 సంవత్సరాలు రాడికల్ పార్టీ కార్యకర్తగా గడిపానేమో కేవలం వృత్తి చేసుకుంటూ ఉండటం నాకు యిష్టంగా వుండేది కాదు. కనుకనే చిన్న పట్టణంలో వుంటూనే చురుకుగా ప్రజా సంఘ వ్యవహారాల్లో పాల్గొనేవాణ్ణి. ఈ 20 సంవత్సరాలలో నేను పనిచేసిన ప్రజా సంఘాలను గురించి ముచ్చటించటం తప్పనిసరి. కాకపోతే యీ జ్ఞాపకాలు తేదీలవారీగా వుండవు ఇది చరిత్ర కాదు కనుక.

బాపట్లలో 'అర్బన్ కోపరేటివ్ బ్యాంకు' వుండేది. దానికి ఆనాడు మూలస్తంభాలు వెలగపూడి సుబ్బారావు, గ్రామ కరణంగారయిన శిఖరం చలపతి రావుగారలు. 12వ వార్డులోని మత్స్యకార్మికులు బెస్త కులస్తులు (ఈనాటి భాషలో అగ్ని కుల క్షత్రియులు) ఆ బ్యాంకు సభ్యులు. అప్పులు తీసుకొని, సక్రమంగా చెల్లిస్తూ, తమ వోట్లను సద్వినియోగం చేసుకుంటూ సభ్యులుగా వుండేవారు. తొమ్మిది మంది డైరెక్టర్లు వుండేవారు. కాని అప్పు కోసం వచ్చే దరఖాస్తులను అన్నిటిని శ్రీ శిఖరం చలపతిరావు గారే పరిశీలించే వారు. ఎన్నో సంవత్సరాల నుండి కరణంగారుగా వుండటం వల్ల నిశ్చింతగా, హాయిగా వుండేవారు తతిమ్మా డైరెక్టర్లు. నేను ఎన్నికయిన తరువాత నూతన ప్రతిపాదన చేశాను. పట్టణాన్ని తొమ్మిది ప్రాంతాల క్రింద విభజించి ఒక్కొక్క ప్రాంతపు 'లోను' దరఖాస్తులను ఒక డైరెక్టరుకు పరిశీలనకు పంపాలనేది నా సూచన. దీనికి డైరక్టర్ల బోర్డు సమ్మతించింది. నా యీ ఆలోచనా ధోరణిని వెన్వెంటనే అంగీకరించిన ఘనత శిఖరం చలపతిరావు గారిది. ఆయన కాలంలో వస్తున్న మార్పులను గ్రహించి వివేకంతో సంచరించగల వ్యక్తి ఉదార పురుషుడు. క్రొత్త పద్ధతి వల్ల డైరెక్టర్లకు పనికల్గింది. అప్పు దరఖాస్తు చేసిన వారిని గురించి తెలిసికోవటం, వారి ఆస్తితాలూకు దస్తావేజులను పరిశీలించటం, ఆస్తులను చూచి రావటం, వాటి విలువను మదింపు చేయటం, వారు కోరిన అప్పు వారు హామీగా వుంచే ఆస్తిపై యివ్వతగునా లేదా అని నిర్ణయించడం, అలాగని అప్పు దరఖాస్తు అంగీకరించ తగినదో కాదో బోర్డుకు సూచించడం డైరెక్టర్ల కర్తవ్యమయింది. డైరెక్టర్లు క్రియాశీలురయ్యారు. కేవలం ఉత్సవ విగ్రహాలుగా వుండే స్తితి పోయింది. హోదాలో తృప్తిపడే స్థితి తప్పింది. హోదాతో పాటు, అధికారం, బాధ్యత ప్రాప్తించాయి.

మా డైరక్టర్ల బోర్డుకు ప్రత్యేకంగా న్యాయ సలహాదారుడుగా ప్లీడరు ఉండేవాడు కాదు. బోర్డు డైరెక్టర్లలో సగం మంది ప్లీడర్లు ఉండటం వల్ల ఆ అవసరం ఉండేది కాదు. కోపరేటివు సెంట్రలు బ్యాంకు వారు దానిని గురించి పట్టించుకునే వారు కాదు. సభ్యులు కూడా పేచీ పెట్టేవారు కాదు. అప్పు తీసుకునువారు బ్యాంకిలో విధిగా సభ్యులుగా వుండాలి. తదితరులు కూడా సభ్యులుగా చేరేవారు. సాధారణంగా బ్యాంకులో 'డిపాజిట్లు' ద్వారా సొమ్ము దాచుకునే వారు సభ్యులుగా ఉండటానికి యిష్టపడేవారు. న్యాయ సలహాదారునకు ఫీజు చెల్లించ వలసిన పనిలేకుండా, పరిశీలనకు రుసుం లేకుండా బ్యాంకు వ్యవహరిస్తున్నందు వల్ల బ్యాంకు ప్రజల అభిమానాన్ని చూరగొన్నది. అలా బ్యాంకు పట్టణ ప్రజల సహకారాన్ని పొందింది.

బ్యాంకులోని డిపాజిట్లు పెరిగాయి. అప్పు తీసుకొనే వారి సంఖ్య వృద్ధి అయింది. పట్టణ ప్రజలు విరివిగా అభిమానించి సభ్యులయ్యే వారు. బ్యాంకు ప్రజల అభిమానాన్ని చూరగొంది. బ్యాంకును గురించి ప్రజలు ఆలోచించసాగారు. అర్బన్ బ్యాంకులలో జిల్లాలో ప్రథమ శ్రేణి బ్యాంకుగా పరిగణింపబడింది.

బ్యాంకులో డిపాజిట్లు, అప్పులు మూడు రకాలుగా వుండేవి. స్వల్ప కాలికం, మధ్య కాలికం, దీర్ఘకాలికంగా అది వర్గీకరణకు లోనయ్యేవి. 1 సంవత్సరం మించని డిపాజిట్లు అప్పులు స్వల్ప కాలికం. 2, 3 సంవత్సరాలని మధ్యకాలికంగా, 4, 5 సంవత్సరాలని దీర్ఘకాలికంగా పేర్కొనబడేవి. ఒకనాడు అకస్మాత్తుగా కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు నుండి ఒక తాఖీదు వచ్చింది. స్వల్పకాలిక డిపాజిట్లను మించి స్వల్పకాలిక రుణాలు ఉండరాదు. అలాగ మధ్యకాలిక డిపాజిట్లను మించి మధ్యకాలిక రుణాలు వుండరాదు. దీర్ఘకాలిక డిపాజిట్లు మొత్తాన్ని మించి దీర్ఘకాలిక రుణాల మొత్తం ఉండరాదు. ఇదే ఆ ఉత్తరువు సారాంశం. దీనిని బోర్డు ముందుంచారు అధ్యక్షుడు. చర్చ సాగింది. కొన్ని అంశాలు స్పష్టమయినయి. ఇటీవల చాలా కాలం నుండి కేంద్ర బ్యాంకు నుండి అర్బన్ బ్యాంకు అప్పు తెచ్చి సభ్యులకు రుణాలు యివ్వటం లేదు. బ్యాంకులోని డిపాజిట్ల మొత్తాలే అప్పులు యివ్వటానికి సరిపోతున్నాయి. అంటే బ్యాంకు స్వయం పోషకం అన్న మాట. కనుక కేంద్ర బ్యాంకు వారి ఉత్తరువును మనం పాటించనక్కర లేదన్న మాట. అలా నిశ్చయానికి వచ్చి కేంద్ర బ్యాంకు సూచనను మర్యాద పూర్వకంగా తిరస్కరించింది బోర్డు. ఈ విధమయిన చర్చలో నేను చురుకుగా పాల్గొన్నాను. ప్రజా సంఘాలు సరిగా పనిచేయడమే గాక తమ స్వతంత్రతను కాపాడు కోవాలనేదే ఈ ముఖ్యాంశం. ఈ ప్రజాస్వామిక సూత్రాన్ని పాటించాలనేది నా విశ్వాసం.

అచిర కాలంలో కేంద్ర బ్యాంకువారు, ప్రభుత్వ శాఖలు పట్టుపట్టడంతో బ్యాంకుకు ప్రత్యేకంగా న్యాయ సలహాదారుగా పారితోషికం మీద ప్లీడరును నియమించారు. ఈ పరిణామం జరిగే నాటికి రెండు పర్యాయాలు డైరెక్టరుగా పనిచేసిన నేను పదవీ విరమణ చేశాను.

బాపట్ల చిన్న ఊరు. పట్టణ జనాభా 15వేలు మాత్రమే. చుట్టుప్రక్కల అన్ని గ్రామాలు కలిపి 30వేల జనాభా కల మునిసిపాలిటీగా రూపొందింది. ఆ పట్టణంలో రోటరీ ప్రవేశించింది. రోటరీ ప్రపంచ వ్యాప్త ఉద్యమం. దాంట్లో నేను పదకొండు సంవత్సరాలు సభ్యుడుగా వున్నాను. అనేక పదవులు నిర్వహించాను. సహాయకార్యదర్శి, కార్యదర్శి, కోశాధికారి, అధ్యక్షుడు, ప్రాంతీయంగా గవర్నరు ప్రతినిధి యివి నేను పనిచేసిన పదవులు.

ఏ పదవిలో ఉన్నా, ఏ పదవిలో లేకున్నా రోటరీ అంటే సర్వశ్రీ కత్తి సత్యనారాయణ గారు, వెలగపూడి దక్షిణామూర్తి గారు స్ఫురణకు వస్తారు. కత్తి సత్యనారాయణ గారు వృత్తిరీత్యా ఆలోపతీ వైద్యులు. వారి ఓపిక, పట్టుదల అసామాన్యం. వెలగపూడి దక్షిణా మూర్తి సుప్రసిద్ధ న్యాయవాది ప్రథమ మునిసిపల్ ఛైర్మన్ వెలగపూడి సుబ్బారావుగారి జ్యేష్ఠ పుత్రుడు. సుబ్బారావుగారు తన ధర్మపత్ని పేర 'సరస్వతీ మెమోరియల్ హైస్కూలు' స్థాపించారు కదా! దానికి కావలసిన ధనాన్ని ఆయన తన స్వంత సంపాదన నుండి సమకూర్చేవారు. సుప్రసిద్ధ విద్యాభిమాని మహిళా సంఘ స్థాపకురాలు 1916కు ముందే బాలికల పాఠశాల స్థాపించిన శ్రీమతి చోరగుడి సీతమ్మ ఆయన సోదరి. ఆ వంశ సాంప్రదాయన్ని అనుసరించి వెలగపూడి దక్షిణామూర్తిలో సేవాభావం అంకురించింది. అప్పటికీ ఇప్పటికీ నిర్లిప్తంగా, నిరాడంబరంగా, దృఢ విశ్వాసంతో, శాంతంగా సేవ చేయటం అతని సహజ లక్షణం; అతని ప్రత్యేకత.

ఆ రోజుల్లో వైద్యులు రోగుల యిళ్ళకు వెళ్ళి చూసి వచ్చేవారు. అందుకుగాను కేవలం రవాణాకు ఖర్చు అయ్యే పైకం తీసుకునేవారు. దాంతో వైద్యుని పట్ల వ్యాధి గ్రస్తులకు గౌరవ భావం, విశ్వాసం పెరిగేది. అలా వైద్యం చేసేవారిలో ప్రముఖులు కత్తి సత్యనారాయణగారు. మొదట్లో గవర్నమెంటు ఆస్పత్రిలో నిస్వార్థంగా పనిచేసి పేరు ప్రఖ్యాతులు పొందారు. సర్వీసులో వయస్సు నిండిన తరువాత 'ప్రయివేటు'గా ఆస్పత్రి పెట్టారు. అలాంటి సత్యనారాయణ గారు ఆ రోజుల్లో మా యింట్లో వైద్యాన్ని ఆశించేవారున్నా లేక పోయినా మా యింటికి యించుమించుగా ప్రతిదినం వచ్చి వెళ్ళేవారు. రోటరీ పని నాకు ఒప్పగించి వెళ్ళేవారు. ఆ పనిని నేను ఆయనకు తృప్తికరంగా చేసేవాడిని.

ఒక ప్రాంతాన్ని రోటరీ జిల్లా అని, ఆ ప్రాంతానికి రోటరీ ఉద్యమ అధికారిని గవర్నరు అనే పిలవడం రోటరీ సంప్రదాయం. ఆనాడు రోటరీ జిల్లా 317లో కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లకు చెందిన క్లబ్‌లు ఉండేవి. ఒకప్పుడు ఆ జిల్లాలో 90 క్లబ్‌లు వున్నాయి. గవర్నరు తన పదవీ కాలం సంవత్సరంలో విధిగా అన్ని క్లబ్‌లను దర్శించ వలసిందే. క్లబ్‌ల సేవా కార్యక్రమాలను పర్యవేక్షణ చేయవలసిందే. మా రోటరీ క్లబ్‌లో సభ్యుల సంఖ్య చాలా తక్కువగా వుండేది. కర్నాటకలోని మణిపాల్ కాలేజీలను (యీనాడు అది విశ్వ విద్యాలయంగా ఎంచబడుతున్నది) స్థాపించిన వాడు సిండికేటు బ్యాంకు స్థాపకుల్లో ప్రముఖుడు శ్రీ ఎం.ఆర్. పాయ్ మా గవర్నరు. (తరువాత ఆయన పార్లమెంటు మెంబరు కూడా అయినాడు).

శ్రీ ఎం.ఆర్. పాయ్ మా క్లబ్‌కు విచ్చేశారు. మా కార్యక్రమాల నివేదికను పరిశీలించారు. సంతృప్తి వెలిబుచ్చారు. కాని ఒక విమర్శ చేశారు. మీ సంఖ్యను పెంచుకుంటే మీరు ఎక్కువగా సమాజానికి సేవ చేయకల్గుతారని సలహా చెప్పారు. రాశికన్నవాసి ముఖ్యమన్నాను నేను. 'కాదనను; కాని రాశి కూడా అవసరం' అన్నారు ఆయన. అప్పుడు అలా అని నాకు తోచలేదు కాని యీనాడు సమాలోచన చేసుకుంటే వారి వ్యాఖ్య సమంజసం అని నాకు అనిపిస్తున్నది.

గవర్నరు ఎం.ఆర్. పాయ్ చెప్పిన వాస్తవ గాథను ఉటంకించటం యుక్తి యుక్తం. 'ఏమీ పెద్ద పని వెంటనే చేయలేక పోయినా దానిని గురించి అదే పనిగా ఆలోచించండి. అదే ముమ్ముందుగా మహత్కార్యానికి నాంది అవుతుంది' అని చెప్పారు. ఈ సందర్భంలో కర్నాటకలోని కుందపూరు పట్టణ రోటరీ క్లబ్‌ను గురించి చెప్పారు. క్లబ్ సభ్యులు కొద్దిమంది మాత్రమే. అయితే, అందరూ సహృదయులు, సేవాతత్పరులు. ఊరికి ఉపకరించే మంచి పని చేయాలని ప్రతివారం ఆలోచించేవారు. 'స్వార్థాన్ని మించిన సేవ' అన్న రోటరీ ధ్యేయం వారి మనస్సులలో ధృఢ ముద్ర వేసింది. అలా ఒక సంవత్సరం ఆలోచించారు. చివరకు ఊరిలో కాలేజీని స్థాపించాలని నిర్ణయించారు. తమ వద్ద దానికి కావలసిన ధనం లేదు. చివరకు ఆ ఊరిలో హైస్కూలులో చదువుకున్న పూర్వ విద్యార్థుల జాబితా తయారు చేశారు. అందరికీ కాలేజీ స్థాపనకు విరాళాలిచ్చి తోడ్పడమని విజ్ఞప్తులు పంపారు. ఒక పూర్వ విద్యార్థి జవాబు రాస్తూ తన వ్యాపారంలో బాగా ధనవంతుడనయినానని, తను ఆ క్లబ్‌వారు పంపిన విజ్ఞప్తికి చలించానని కాలేజీ స్థాపనకు అవసరమయిన ద్రవ్యాన్ని తను యిస్తానని ముమ్ముందుగా 5 లక్షల రూపాయల చెక్కు (ఇదంతా 1960 కాలపు మాట) పంపుతున్నానని, ఇంకా అదనంగా పడితే పంపగలనని తెలియజేశాడు. అతని వదాన్యతతో కుందుపూరులో కాలేజీ ఏర్పడిందట. ఈ కథ మా క్లబ్ మెంబర్లను ఉత్తేజపరిచింది.

చిన్న క్లబ్ అవటంతో, క్లబ్ సభ్యులు విద్యాధికులయినా ధనవంతులు కాకపోవటంతో సేవా కార్యక్రమాలు భారీగా జరిగేవి కావు. కొద్ది ధనంతో ఎక్కువ శ్రమతో చేయగల్గిన సేవా కార్యక్రమాలను సాగించేవారు. శిశువుల ఆరోగ్యం విషయం పట్టణ ప్రజలలో ఆసక్తిని పెంచాలని శిశు ప్రదర్శన (బేబీ షో) ఏర్పాటు చేశాం. చంకన పిల్లలను వేసుకొని 2 వందల మంది తల్లులు వచ్చారు. శిశువుల ఎత్తు, బరువు, కళ్లు, చెవులు, నోరు, యితర శరీరం పరీక్ష చేయటంలో ఆరోజు క్లబ్బు సభ్యులే కాక పదిమంది అదనంగా స్వచ్ఛంద సేవ చేశారు. ఆరోగ్యవంతులయిన శిశువులకు ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణి బహుమతులిచ్చాం. ప్రదర్శనకు వచ్చిన పిల్లలందరికీ తలా ఒక సబ్బు. ఇలా ఎన్నో చిన్న చిన్న పనులు చేశాం. పాఠశాలల్లో ప్రథమ, ద్వితీయ శ్రేణి విద్యార్థులకు బహుమతులిచ్చాం. తక్కువ ఖర్చుతో ఎక్కువ సంఖ్యలో మంచి పనులు చేయగల క్లబ్‌గా మాకు పేరు ప్రఖ్యాతులున్నాయి. గవర్నరు ప్రతినిధిగా నేను ఎంపిక కావడానికి అదే దారి తీసింది. ఆ పదవిలో నా పర్యవేక్షక ప్రాంతం బాపట్ల నుండి గూడూరు వరకు వుండేది. అరు క్లబ్‌లతో కూడినది అది.

రోటరీ ఉద్యమంలో రెండు సంగతులు చెప్పుకోతగినవి. ఒకసారి విద్యార్థులను

విద్యార్థినులను క్లబ్‌కు పిలిచి విద్యా విషయకంగా తమ అనుభవాలను చెప్పమన్నాం. ఉపాధ్యాయులను మాత్రం ఆహ్వానించలేదు. వారు తమ విద్యను సమీక్షించారు. ఉపాధ్యాయులను విమర్శించారు. వారి మాటలు మమ్మల్ని విస్తుబ్ధులను చేశాయి. 'పాఠ్య గ్రంధాల ప్రమాణాలు పెరుగుతున్నాయి కాని విద్యా ప్రమాణాలు పెరగడం లేదు' అని ఒక విద్యార్థి అన్నాడు. అది ముత్యం లాంటి మాట. ఈనాటికీ అది వాస్తవమే. మరో విద్యార్థి ప్రసంగిస్తూ, 'ఆడపిల్లలు రంగు రంగుల దుస్తులు ధరించి అలంకరించుకొని తరగతులకు వస్తుంటే మా చదువులపై మా దృష్టి తప్పిపోతున్నది' అని విద్యార్థినులను విమర్శించాడు. వెంటనే ఒక విద్యార్థిని లేచి 'వివిధ రకాలుగా మీరు జీన్సు వగైరాలు వేసుకుంటూ అనేక కేశాలంకరణ రీతులలో దర్శనం యిస్తుంటే చదువుపై మా దృష్టి మళ్ళడం లేదే' అని జవాబు యిచ్చింది. ముగ్ధుడిని అయ్యాను. 1962 నుండి నెలకొకసారి విజయవాడ లో 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' అనే ఇంగ్లీషు దినపత్రికకు లేఖ రాయడం, స్థానిక సంపాదకుడు రంగస్వామి గారు దానిని ప్రథమ లేఖగా శీర్షికలో అచ్చువేయడం సాగుతుండేది. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని యీ క్లబ్ సమావేశ సంగతులను 'విద్యార్థులు మాట్లాడుతున్నారు' (స్టూడెంట్సు స్పీక్ అవుట్) అనే శీర్షికలో 'ఎక్స్‌ప్రెస్'కు లేఖ రాశాను. ఆశించినట్లు అది ప్రముఖంగా ప్రచురితమయింది. ఒక సందర్భంగా ఆంధ్ర విశ్వ విద్యాలయ రిజిష్ట్రారు, నాటక కళోద్ధారకుడు, శ్రీ కూర్మా వేణుగోపాల స్వామిని కలిశాను. ఆయన వెంటనే జేబులోంచి 'ఎక్స్‌ప్రెస్' దినపత్రిక ముక్క తీసి నా లేఖ ప్రతిని నాకు చూపించి 'మా బాగా రాశావు. ఎంచక్కా మాట్లాడారు విద్యార్థులు' అన్నాడు. ఆ మెచ్చుకోలు యిప్పటికీ నా స్మృతి పథంలో మెలుగుతున్నది.

మరపురాని మరో సంఘటన. ఆ రోజుల్లో రోటరీ ఉద్యమంలో స్త్రీలు సభ్యులుగా వుండే అవకాశం లేదు. అప్పటికి ఇజ్రేలులో గోల్డా మియర్, శ్రీలంకలో బండారు నాయకే, భారతదేశంలో ఇందిరాగాంధీ ప్రధానమంత్రులుగా చేసి వున్నారు. రోటరీ క్లబ్‌లో సభ్యత్వం పొందాలంటే తమ వృత్తిలో విశిష్ట స్థానాన్ని పొంది వుండాలి. అలా తమ తమ వృత్తులలో విశిష్టతను, ప్రత్యేకతను, ఔన్నత్యాన్ని సాధించిన స్త్రీలు అనేకమంది వున్నారు. కాని వారు సభ్యులు కారాదు. ఇది నన్ను కలవర పరిచింది. తిరుపతి జిల్లా రోటరీ మహాసభలో స్త్రీలను సభ్యులుగా చేర్చుకునే తీర్మానాన్ని ప్రతిపాదించారు. తీర్మానాన్ని రాష్ట్ర మహాసభ ఆమోదిస్తే వచ్చే సంవత్సరానికి గవర్నరు అయ్యే వ్యక్తి ప్రపంచ రోటరీ మహాసభలో యీ తీర్మానాన్ని ప్రవేశ పెట్టాలి. రోటరీ ఉద్యమంలో అగ్ర శ్రేణిలో వున్న అమెరికా సంయుక్త రాష్ట్రాల వంటి దేశాలు స్త్రీల ప్రవేశానికి వ్యతిరేకం. ఈ పరిస్థితి తెలిసిన కాబోయే గవర్నరు తీర్మానాన్ని ఎదిరించి ప్రపంచ మహాసభలో తను ఏకాకి అయ్యే పరిస్థితి వుందని, తన నగుబాటు పాలవుతానని చెప్పి నన్ను తీర్మానాన్ని ఉపసంహరించు కోమన్నాడు. నా మనస్సుకు కష్టం వేసింది. తీర్మానాన్ని ఉపసంహరించుకున్నాను. తర్వాత రోటరీ ఉద్యమం నుండి వైదొలిగాను. ఈనాడు స్త్రీలు రోటరీ, లయన్సు క్లబ్‌లలో సభ్యులు. ఇది హర్షదాయకమయిన పరిణామం.

# బాపట్ల కళాశాల స్థాపన

ఆనాడు బాపట్ల 'ఆర్ట్సు అండ్ సైన్స్ కాలేజీ'ని బాపట్ల విద్యాసంస్థ నెలకొల్పింది. దీనికి మూల పురుషుడుగా శ్రీ కోన ప్రభాకర రావును పేర్కొనవచ్చు. అతనికి విద్యార్థి దశనుండి సేవా దృక్పథం అబ్బింది. ప్రముఖ న్యాయవాది శ్రీ కోన వెంకట రావుగారి కుమారుడు; ప్లీడరు. కాంగ్రెస్ వాది. మంచి పనులకు ఎప్పుడూ సంప్రదించేవాడు. కాలేజీని పట్టణంలో పెట్టించాలని సంకల్పించాడు. కాలేజీ స్థాపనకు పూనుకోమని డా. యార్లగడ్డ కృష్ణమూర్తి గారిని కోరతానన్నాడు. సరే అన్నాను. తర్వాత డాక్టరుగారి అధ్యక్షతన బాపట్ల విద్యా సంఘం స్థాపించబడింది. మొదట్లో పదహారు మంది సభ్యులు. సమావేశాల్లో అదే పనిగా ఆలోచించాం. తూర్పు సత్రం ధర్మ నిధి నుండి ఏబది వేలు తీసుకునేటట్లు అప్పవరపు పుండరీకాక్షయ్య ధర్మనిధి నుండి ఏబది వేలు సంపాదించేటట్లు నిశ్చయం జరిగింది. ముఖ్య సభ్యులు ప్లీడర్లవడంలో అవసరమయిన దావాలు రెండు వేసి ఆ నిధులను కాలేజీ స్థాపనకు మళ్ళించగలిగారు. తూర్పు సత్రపు ట్రస్టు బోర్డు ఛైర్మన్‌గా శ్రీ యడవల్లి సూర్యనారాయణకు, అప్పవరపు పుండరీకాక్షయ్య ధర్మనిధి అధ్యక్షునికి విద్యా సంస్థలో కార్యనిర్వాహక వర్గ సభ్యత్వం ఇవ్వడం జరిగింది. విద్యాసంస్థకు సర్వశ్రీ పిల్లుట్ల హనుమంత రావు, కోన ప్రభాకర రావు కార్యదర్శులు. విరాళాలు వసూలు చేద్దామని కమిటీ సంకల్పించింది. ముందు సభ్యులం మనం వేసుకుని తర్వాత ఇతరులను అభ్యర్థిద్దామన్నాను. అందరూ సరే అన్నారు. అధ్యక్షులు అయిదు వేలు ఇచ్చారు. ఒక వైశ్య ప్రముఖుడు బొమ్మిశెట్టి సుబ్రహ్మణ్యం పదివేలు ఇచ్చాడు. అలా 16 మందిలో ఉన్న కమిటీలో 13 మంది కలిసి ముప్పది ఒక్కవేలు ఇచ్చారు. ధర్మ నిధుల పైకం రావడానికి ముగ్గురు సభ్యులు తోడ్పడ్డారు. ఇలా మొత్తం లక్షా ముప్పది ఒక్క వేలతో ఊరిలో విరాళాల వసూలుకు బయలుదేరింది కమిటీ. ఒక విచిత్ర సన్నివేశం. పైకాన్ని పొదుపుగా వాడే వ్యక్తి. నట ప్రముఖుడిగా సన్మానాలు చేస్తే వచ్చిన శాలువలను వస్త్రంగా ధరించే మనీషి, హైస్కూలు టీచరుగా పని చేసి పదవీ విరమణ చేసిన పేరెన్నికగన్న ఉపాధ్యాయుడు సింగరాజు నాగభూషణ రావుగారు పదివేల విరాళం ప్రకటించి ఇచ్చాడు. ఇలా ఇసుక తప్ప మరేమీ లేని బాపట్ల పట్టణంలోని విరాళాలతో రెండు లక్షల పైకం వచ్చింది.

కళాశాల భవనాల నిర్మాణ బాధ్యతను మొదట్లో కరణం శిఖరం చలపతి రావుగారి కుమారుడు శ్రీ శిఖరం రామకృష్ణా రావు చేపట్టాడు. కళాశాల రూపుదాల్చింది. తర్వాత కార్యదర్శిగా వచ్చిన మిత్రుడు ఆచంట రంగనాయకులు భవన నిర్మాణాన్ని వృద్ధి చేశాడు. ఇపుడు సర్వశ్రీ ముప్పలనేని శేషగిరి రావు, పి.ఎస్.ఆర్. శర్మలు విద్యా సంస్థకు అధ్యక్ష కార్యదర్శులు. ఇంజనీరింగ్ కాలేజీ స్థాపన, దాని భవన నిర్మాణం జరిగాయి.

మొదట్లో వెయ్యి రూపాయలు విరాళం ఇచ్చిన వ్యక్తి సభ్యుడు కాగల్గేవాడు. తర్వాత నిబంధనావళిని మార్చడం జరిగింది. సంస్థకు జనరల్ బాడీని కార్యనిర్వాహక వర్గాన్ని ఏర్పరచి జనరల్ బాడీ నుండి ఎన్నిక ద్వారా కార్యనిర్వాహక వర్గ సభ్యులు అయ్యే వారితో పాటు అయిదు వేల రూపాయల విరాళం ఇచ్చిన వ్యక్తి

సరాసరి జీవిత కాలం కార్యనిర్వాహక వర్గ సభ్యుడయ్యే అవకాశం వచ్చింది. నిబంధనావళిని తిరిగి రాసే కమిటీలో నన్ను సభ్యుడిగా వేశారు. నా కృషి కొంత మంది చేసినా కొన్ని నష్టాలకు కారణభూతమయింది. ఈ కథ చెప్పే ముందు దీని నేపథ్యాన్ని వివరించాలి.

కోస ప్రభాకరం కాలేజీ స్థాపనకు - అధ్యక్ష కార్యదర్శులతోపాటు - ప్రముఖంగా పని చేశాడు కదా. ఒక సందర్భంగా యడవల్లి సూర్య నారాయణ విద్యా సంస్థలో పదవీ నిర్వహణ చేసేవారితో తగాదా పడ్డాడు. అది కోస ప్రభాకర రావు కుమారుడు శ్రీ గోవిందును కాలేజీ ఫిజికల్ డైరెక్టర్‌గా నియమించే విషయం అని గుర్తు. ఏదయిన శ్రీ గోవిందును ఫిజికల్ డైరెక్టరుగా వేశారు. నిబంధనావళిని మార్చే కమిటీ బాధ్యుడనయిన నేను కొత్త నిబంధనావళిని జనరల్ బాడీకి సమర్పించాను. అందులో ఒక సూత్రం చోటు చేసుకున్నది. అది సహకార రంగంలో అమలు అవుతున్న సూత్రం. డైరెక్టరుకు సమీప బంధువు ఎవరూ సహకార సంఘ ఉద్యోగి కారాదు. అంటే అలా ఉద్యోగి అవాల్సి వస్తుందని భావిస్తే ఉద్యోగి కానున్న వాని సమీప బంధువు అయిన డైరెక్టరు ముందుగా రాజీనామా చేయాలన్న మాట. నేను ప్రవేశ పెట్టిన నియమావళి విద్యాసంస్థ సర్వసభ్య సమావేశంలో (జనరల్ బాడీ) చర్చకు వచ్చింది. నేను ప్రసంగించాను. స్పష్టం చేశాను. ఈ సూత్రం కోస ప్రభాకర రావుకు వర్తిస్తుంది. అతడు మన కాలేజీ స్థాపనకు ఎనలేని సేవ చేశాడు. అతనికి నష్టం మనకు యిష్టం లేకపోతే ఈ సూత్రం కోస ప్రభాకర రావు విషయంలో వర్తించదు అని రాద్దాం. ఇవీ నా మాటలు. నేను మాట్లాడుతున్నప్పుడు ప్రభాకర రావు అక్కడే వున్నాడు. నాది బహిరంగ చర్య. నేను సూచించిన మినహాయింపు లేకుండానే నేను తయారు చేసిన నిబంధనావళిని సర్వసభ్య సమావేశం ఆమోదించింది. సభ్యులలో ప్రభాకర రావుమీద అంత అసంతృప్తి వుందని నేను ఊహించలేదు; గమనించలేదు. అసలు ఈ మాటకు వస్తే ఏదో ఒకటి రెండు పర్యాయాలు తప్ప నా సూత్ర బద్ధ ప్రతిపాదనలను ఇతరులు ఏనాడూ ఆమోదించలేదు. ఈసారి వాటిని అంగీకరించడం నాకు ఆశ్చర్యం కలిగించింది. తద్వారా కోస ప్రభాకర రావు సేవలను విద్యాసంస్థ కోల్పోయింది. అతని కుమారుడు ఉద్యోగంలో కొనసాగాడు. నాకు ప్రభాకర రావుపై ద్వేషం లేకపోయినా నా చర్య ఫలితంగా అతనికి జరిగింది హాని. అయితే ఆనాడు నాకు ప్రవర్తనా నియమావళిపై వున్న పట్టుదల దానికి పరోక్షంగా దారితీసింది.

తరువాతి చరిత్రను ఉటంకించడం యుక్తం. నిబంధనావళి మార్చాలంటే సర్వసభ్య సమావేశంలో జనరల్ బాడీ సభ్యులలో మూడింట రెండు వంతుల మంది (హాజరయిన వారు కాదు. సభ్యులుగా నమోదు అయినవారు) అంగీకరించాలని ఆమోదించబడిన నిబంధనావళిలో వుంది. డైరెక్టర్ల సమీప బంధువు ఉద్యోగ విషయమైన నిబంధనను మార్పించాలని కోస ప్రభాకర రావు మద్దతుదారులు ప్రయత్నించారు. అయితే వారు ఇద్దరు సభ్యులను కొత్తగా చేర్పిస్తే పదవులలో ఉన్నవారు ఒక సభ్యుని వెంటనే చేర్పించేవారు. ఇలా ఇరుపక్షాలు పోటీ పడ్డాయి. కొత్తగా వందమంది దాకా కొత్త సభ్యులు చేరినట్లు జ్ఞాపకం.

# అన్నవరపువారి బడి

బాపట్లలో రైలు స్టేషనుకు దగ్గరగా శివాలయం వీధిలో అన్నవరపు పుండరీకాక్షయ్య విద్యాభివర్ధనీ స్కూలు వుండేది. అది బాలికల హయ్యరు ఎలిమెంటరీ స్కూలు. దానిని అన్నవరపు పుండరీ కాక్షయ్యగారు స్థాపించారు. ఆయన ప్లీడరు. ఆయన యింట అనేక మంది విద్యార్థులు ఉచితంగా బసచేసి చదువుకునేవారు. ఆయన బాలికల బడిని ప్రారంభించి దాని పోషణకుగాను పది ఎకరాల సుక్షేత్రమయిన మాగాణి భూమిని దానం యిచ్చారు. సరస్వతీ మెమోరియల్ స్కూలు నెలకొల్పబడే వరకు ఆ బడిలోనే బాపట్లలోని స్త్రీలు చదివేవారు. 1900లో జన్మించిన నా తల్లి కామేశ్వరమ్మగారు ఆ బడిలోనే చదువుకున్నారట. తర్వాత నా భార్య కొండూరి వెంకట సుబ్బమ్మ 1937 వరకు అక్కడనే విద్య గడించారు. ఇప్పుడు అది హైస్కూలుగా భాసిల్లుతున్నది.

అన్నవరపువారి బడిలో సుమారు 150 మంది బాలికలు చదివేవారు. పరిపాలక వర్గంలో బ్రాహ్మణులలో వైదికి శాఖకు చెందినవారు వుండేవారు. ఒక సందర్భంలో ఆ బడికి సంఘానికి నేను సెక్రటరీగా ఎన్నుకోబడ్డాను. దానిలోకి అన్ని కులాల వారిని, అన్ని శాఖల వారిని సంఘంలో సభ్యులుగా చేర్పించాలని ప్రయత్నించాను. విద్యార్థినులు అన్ని కులాలవారు వుండేవారు. బ్రాహ్మణులలో నియోగి కుటుంబాల వారూ ఉండేవారు. బడికి చుట్టు ప్రక్కల ప్రాంతపు బాలికలంతా కులాల తేడా లేకుండా ఆ బడికి వచ్చేవారు. వార్షికోత్సవాలు బాగా జరిగేవి. తల్లిదండ్రులు వచ్చేవారు. తమ పిల్లలు బహుమతులు స్వీకరించడం చూచి సంతోషించేవారు. రెండు వార్షికోత్సవాలలో "ఈ బడి మీది, ఇది ఏ ఒక్క ప్రత్యేక వర్గానిది, శాఖది కాదు. మీరంతా సభ్యులుగా చేరి యీ పాఠశాల అభివృద్ధికి సక్రమ నిర్వహణకు తోడ్పడండి" అని విజ్ఞప్తులు చేశాను. నా విజ్ఞప్తులు నిష్ఫలమయినాయి. ఎవరూ క్రొత్తవారు చేరలేదు. అప్పటికే నేను హేతువాదినని, హిందూ మతంలో నమ్మకం లేని వాడినని తెలిసినా ఎవరూ చేరక పోవటంతో విఫలుడనై ఆ పదవి నుండి తప్పుకున్నాను.

ఇప్పుడు ఆ స్కూలు పరిపాలక సంఘానికి సర్వశ్రీ వెలగపూడి దక్షిణామూర్తి, కొమరవోలు బాలకృష్ణ శర్మ అధ్యక్ష కార్యదర్శులు. వారు పదవులను చేపట్టిన తరువాతనే అది హైస్కూలుగా మారింది. ముదావహం.

నేను పదవిలో వుండగా జరిగిన కొన్ని సంఘటనలను తెలియజేయడం అవసరం. ఏడు క్లాసులున్న బడిలో ప్రధానోపాధ్యాయునితో పాటు సుమారు పదిమంది ఉపాధ్యాయులు వుండేవారు. వారు కూర్చోవటానికి పేము కుర్చీలు వేయించాను. ఒకసారి సంఘ కోశాధికారి బడి వేళల్లో ఆ గదికి వెళ్లాడట. అప్పుట కూర్చున్న ఉపాధ్యాయులు లేచి నిలబడి ఆయనను ఆహ్వానించలేదట. ఆయన వచ్చి నాతో ఫిర్యాదు చేశాడు. "వాళ్లకు సదుపాయాలు చేసి వాళ్లను నెత్తికి ఎక్కించు కుంటూన్నావు" అని నన్ను నిందించాడు. "మీరు ఆ గదిలోకి పోవలసింది కాదు. మీకు ఏదయినా పని ఉంటే ప్రధానోపాధ్యాయునితో మాట్లాడండి" అని కొంచెం తీవ్రంగానే అన్నాను. ఆయనకు కోపం వచ్చింది.

మరో సంఘటన ఉపాధ్యాయులకు సంబంధించినది. ఒక ఉపాధ్యాయిని పాఠాలు ఏమీ చెప్పలేక పోతున్నదని నాకు కర్ణా కర్ణిగా తెలిసింది. ప్రధానోపాధ్యాయుని గదికి వెళ్లి ఆయనను వెంట పెట్టుకొని ఆమె తీసుకునే తరగతికి వెళ్లాను. నేను వెళ్లేటప్పటికి ఆమె కూర్చుని వున్నది. పిల్లలు కేకలు పెట్టున్నారు. గెంతుతున్నారు. చెవులు హోరెత్తి పోతున్నాయి. ఆమె అయోమయంగా దిక్కులు చూస్తున్నది. అది 2వ తరగతి. వెంటనే ఆమెను సంజాయిషీ అడగమని చెప్పి వెళ్లిపోయాను. ఆమె జబ్బుపడి లేచిందని అందువల్ల అలా వుందని నివేదిక అందజేశాడు. ఒక నెల తరువాత అదే పరిస్థితి కొనసాగుతున్నదని విన్నాను. పరిశీలించి నివేదిక పంపమని ప్రధానోపాధ్యాయుని కోరాను. ఆమెకు జబ్బయితే సెలవు యిస్తానని, వైద్యపు ఖర్చులు కమిటీ భరిస్తుందని చెప్పాను. ఆమె మీద జాలి వల్లనో లేక ఆమె అతనిని ఆశ్రయించి నందువలననో అతడు కాలయాపన చేశాడు. మరల రెండు నెలలకు ఒకసారి ప్రధానోపాధ్యాయుని వెంటపెట్టుకొని ఆమె తరగతికి వెళ్లాను. అదే పరిస్థితి. మార్పులేదు. రెండు రోజులలో నివేదిక పంపమన్నాను. పంపాడు. తెలిసిన విషయమేమంటే ఆమె తన 15 సంవత్సరాల వయస్సు కల కుమారుని కోల్పోయిందట. వాకబుచేస్తే నిజమేనని తేలింది. ఇంకొంత కాలం వేచి ఉందామని భావించాను. ఈలోగా నేను పదవీ విరమణ చేయడం జరిగింది.

మరో విషయం. బడిలో పనిచేసే ఉపాధ్యాయిని భర్త పరిపాలక వర్గ సభ్యుడు. అలా వుండరాదనే నియమం సంఘ నిబంధనావళిలో లేదు. నిబంధనావళిని మార్చగల బలం నాకు పరిపాలక వర్గంలో లేదు. అందుచేత ఆ పరిపాలకు వర్గ సభ్యుని నైతికతకు విజ్ఞప్తి చేశాను. ఇదిగో అదిగో అని కాలయాపన చేశాడు. ఇంతలో నేను పదవి నుండి తప్పుకున్నాను.

ఈ చివరి సంఘటన మరీ విచిత్రమయింది. విద్యార్థినుల సంఖ్య తగ్గడం గమనించాను. దీని విషయమయి శ్రద్ధ వహించ దలచాను. ఉపాధ్యాయుల ్ పరిపాలక వర్గ సంయుక్త సమావేశానికి పిలిచాను. అందరూ తప్పక హాజరు కావాలనే ఆదుర్దాతో తేనీటి విందు ఏర్పాటు చేశాను. అందరూ వచ్చారు. టీ త్రాగిన తరువాత సంఘాధ్యక్షుని అనుమతితో ప్రసంగం ప్రారంభించాను. బడిలో విద్యార్థినుల సంఖ్య తగ్గుతున్న విషయం ప్రస్తావించాను. నిస్సంకోచంగా, బెరుకు లేకుండా సమస్యను గురించి చర్చించే నిమిత్తం అందరూ మాట్లాడాలని అభ్యర్థించాను. ఒక టీచరు లేచి ''పరిస్థితి బాగా లేదు. మేమూ బాధపడుతున్నాం. కారణం అర్థం కావటం లేదు. మేము శాయశక్తులా పాఠాలు చెప్తూనే వున్నాం. కాని సంఘాధ్యక్షులే తమ పిల్లలను మహో పాఠశాలకు పంపుతుంటే మా మీద యితరులకు ఏమి గౌరవం వుంటుంది? మేము సరిగా విధి నిర్వహణ చేయకపోతే మమ్మల్ని దండించండి. కాని యిలా అగౌరపరచకండి'' అని అన్నాడు. అధ్యక్షుని ముఖం జేవురించింది. ఆలోచిద్దామని నేను చెప్పాను. అధ్యక్షుడు లేచి వెళ్తూ త్రోవలో ''ఏరా! (ఆయన నా కన్న ఇరువది సంవత్సరాలు పెద్ద) వాడిచేత, ఆ నియోగి పంతులు చేత కావాలని నన్ను తిట్టిస్తావా?'' అని నిలదీశాడు. అసలు ఆ ఉపాధ్యాయుడు ఏమి మాట్లాడతాడో నాకు ముస్మందు:గా తెలియదని, నా మాటలు నమ్మమని ఆయనను ప్రార్థించాను. ఆయనకు నా మాటల

మీద విశ్వాసం కలుగలేదు. ఇదంతా నా కుట్ర అని ఆయన భావం.

శాఖాభేదం, కులభేదం పాటించే సంస్థలలో చేరి ఎంత నీతిమంతుడయినా, కుల తత్వాలకు, శాఖాతత్వాలకు అతీతుడయినా ఒక్కడుగా ఏమీ చేయలేడని, దుష్ట సంప్రదాయాలు కల సంస్థలను త్వరగా తేలికగా బాగుచేయలేమని గుణపాఠాలు నేర్చుకున్నాను. నిజాయితీ, సమర్థత ఒక్కనికుంటే చాలదని అలాంటి వారి సంఖ్య పరిపాలక వర్గంలో అత్యధికంగా వుంటేనే సంస్కరణ సాధ్యమని తేలింది.

# నా అడ్వకేటు మామగారు

**1950** ఆగస్టులో బాపట్లలో ప్లీడరు వృత్తిని చేపట్టానని రాశాను. నాకు పిల్ల నిచ్చిన మామగారు కొండూరి సత్యనారాయణగారు. ఆయన ప్రతిభకల ప్లీడరు. కాకపోతే సంపాదనలో ద్వితీయ శ్రేణికి చెందిన వల్లురిలో ఒకరు. బీదరికం నుండి ప్లీడరుగా రూపొందాడేమో పెద్దగా ఫీజులు అడిగేవాడు కాదు. బహుశ ఎక్కువ మొత్తంలో ఫీజులడిగితే క్లయింట్లు మరో చోటికి తమ కేసులను తీసుకొని వెళ్తే తను నష్టపడతానని భయం ఉందేమో! వెలగపూడి సుబ్బారావు గారి మాటల్లో "పనిలో, తెలివితేటల్లో ప్రథమశ్రేణి లాయర్లతో సమదీటయిన అడ్వకేటు". ఆయన ఆగస్టు 1950లో చనిపోతే నేను ఆయన స్థానంలో ప్లీడరీ ప్రారంభించాను.

నా మామగారిని గురించి రెండు కథలు చెప్పి నా గాథ ప్రారంభిస్తాను. సత్యనారాయణగారు ఒకరిని తూలనాడరు. ఎవరయినా తననికాని, తన క్లయింట్లును కాని నిందిస్తే సహించరు. ఒకసారి నా మామగారి సాక్షి ఎదురు ప్లీడరు అడిగిన ప్రశ్నకు సరి అయిన జవాబు చెప్పకపోతే జిల్లా మునసబు "సరిగా సాక్ష్యం చెప్పరా గాడిదా!" అని సాక్షిని గదిమాడు. అప్పుడు నా మామగారు కోర్టులో లేరు. ఆయన తరఫున ఆయన కేసును మరొక లాయరు నడుపుతున్నాడు. ఈ విషయం తెలిసి ప్రక్క కోర్టు నుండి సత్యనారాయణగారు హుటా హుటిన వచ్చారట. రాగానే "యువర్ ఆనర్, యీ కోర్టులో అధ్యక్ష స్థానంలో వున్నవారూ, నేనూ, సాక్షి ఒకే జాతికి చెందిన వారం" అని అన్నారట. దాంతో మునసబుగారు తన ఉన్నతాసనం నుండి లేచి తన గదిలోకిపోయి సత్యనారాయణగారిని పిలిపించుకొని క్షమాపణ చెప్పారట.

మరొక సంఘటన. నా మామగారి క్లయింటు సాక్ష్యం చెప్పటంలో అయోమయంగా మాట్లాడుతుంటే కోపం వచ్చిన జిల్లా మునసబు తన బల్ల మీద వున్న కాగితాల మీద పెట్టే బరువును (పేపరు వెయిట్) సాక్షి కూడకు విసిరివేశాడట. అప్పుడు నా మామగారు ఆ కోర్టులోనే వున్నారు. వెంటనే ఆయన లేచి "నేను ఏమిటి చూస్తున్నాను? ఒక జిల్లా మునసబు ఒక క్లయింటుపై బరువును విసిరి వేశాడు! అదృష్టవశాత్తు అతనికి దెబ్బ తగలలేదు. క్లయింటు కేసు పెడ్తే నేను ఏమని సాక్ష్యం చెప్పాలి? జిల్లా మునసబుపై కేసు లేకుండా చేయాలంటే నేను అసత్యం పలకాలికదా! అది ఎలా సాధ్యం? నా కెందుకు యీ విషమ పరిస్థితి" అని అన్నారట. వెంటనే మునసబుగారు సీటుదిగి తన గదిలోకి వెళ్లి సత్యనారాయణగారిని పిలిపించుకొని వారి రెండు చేతులు పట్టుకొని క్షమాపణ చెప్పారట. 'నాకు కాదండీ క్షమాపణ చెప్పాల్సింది; అవమానితుడయిన నా క్లయింటుకు' అని స్పష్టంగా చెప్పారట. క్లయింటును పిలిపించి "పొరపాటు చేశాను. ఏమీ అనుకోకు" అని అన్యాపదేశంగా మునసబుగారు క్షమాపణ కోరారట.

నా మామగారి సంభాషణా చాతుర్యాన్ని గురించి అనేక కథలున్నాయి. అన్నీ వాస్తవ గాథలే. బాపట్ల సముద్ర తీరపు వూరు. సముద్రం 4 మైళ్ళ దూరాన (6 కి.మీ.) వుంది. కార్తీక పౌర్ణమినాడు హిందువులంతా సముద్ర స్నానానికి వెళ్తారు. ఆ రోజు కోర్టుకు సెలవు లేదు. జడ్జీగారు 'బెంచి' మీదికి వచ్చారు.

కోర్టు హాలులో సత్యనారాయణగారు తప్ప మరెవ్వరూ లేరట. ఆరువది మంది ప్లీడర్లు, నలుబది మంది ప్లీడరు గుమస్తాలు, మామూలు పని రోజుల్లో వుండే వందమంది క్లయింట్లూ ఎవ్వరూ లేరు. జడ్జీగారు, కోర్టు గుమాస్తా, జవాను, సత్యనారాయణగారు నల్గురే అంత కోర్టు హాలులో. కేసులను గుమస్తా పిలవడం ఆ కేసులలోకి ప్లీడర్లు, పార్టీలు ఎవరూ హాజరు లేనందున జడ్జి కేసులను కొట్టివేయడం జరిగింది. అలా పది కేసులు కొట్టివేసిన తరువాత సత్యనారాయణగారి వైపు తిరిగి ''వీళ్ళంతా ఎక్కడ చచ్చారు'' అని జడ్జి దురుసుగా అన్నాడట. ఆజానుబాహువయిన నా మామగారు లేచి నిలబడి తన పొట్టను తడుముకుంటూ తాపీగా, శాంతంగా, నిబ్బరంగా ''వారంతా సముద్రం యొక్క బ్రహ్మాండమయిన వైశాల్యాన్ని, గంభీరతను మనుష్యుల అల్పత్వాన్ని గ్రహించటానికి వెళ్లారు'' అని జవాబు యిచ్చారట. తనను ''నీవు అల్పుడివి'' అన్నట్లు ఆయనకు తోచింది. తమాయించుకొని ''ఈ కేసుల వాళ్లను పిటీషన్లను పెట్టమనండి. వాటిని తిరిగి ఫైలులోకి తీసుకుంటాను'' అని 'బెంచి' దిగి వెళ్లిపోయారట. సత్యనారాయణగారి లాగా స్వతంత్రతను ప్రకటించగల ప్లీడర్లు, జడ్జీలను సైతం చీవాట్లు పెట్టగల లాయర్లు ఈనాడు ఎంతమంది ఉన్నారు?

నా మామగారి స్థానంలోకి వచ్చిన నాకు తోటి ప్లీడర్లు యీ కథలు చెప్పారు. అలా పేరు ప్రతిష్టలున్న ప్లీడరు ఆఫీసులోకి వచ్చాను 'వారసుడిని'గా. కొన్ని సంవత్సరాలు తర్వాత నేను ఒక సంఘటనలో ఇరుక్కున్నాను.

# క్రోధంపై విజయం

అది నాకు నా మామగారి నుండి సంక్రమించిన కేసు. దాని విచారణ జడ్జి కోర్టులో జరుగుతున్నది. శంకర్ పరిషత్ అనే ఆయన జడ్జి. ఆయన తెలంగాణా నుండి సబ్ జడ్జిగా వచ్చాడు. ఆయనకు తెలుగు సరిగా రాదు. సాక్షులు తెలుగులో సాక్ష్యం చెప్తుంటే మేము ప్లీడర్లం ఇంగ్లీషులోకి తర్జుమా చేసేవారం. నా ఎదుటి ప్లీడరు మునిపల్లె వెంకటేశ్వర్లు గారు. సమర్థుడయిన లాయరు. నా మామగారితో సరితూగేవాడు. నా సాక్షిని ఆయన ఎదురు ప్రశ్నలు వేస్తున్నాడు. అతడు జవాబులు చెప్తున్నాడు. వెంకటేశ్వర్లు గారు ఇంగ్లీషులోకి తర్జుమా చేస్తున్నారు. ఒక వాక్యపు తర్జుమా సరిగా వున్నట్లు నాకు తోచలేదు. నేను అభ్యంతర పెట్టాను. ఆయన సహృదయుడే కాని కోపిష్టి. ఆయనకు కోపం వచ్చింది. 'నీవు అడ్డుపడకు' అని ఆజ్ఞాపించే ధోరణిలో పలికాడు. 'మీ తర్జుమా తప్పు' అని కొంచెం బిగ్గరగా అన్నాను. 'ఎందుకు అలా అరుస్తావు' అని నన్ను ఆయన గదమాయించాడు. 'మీరే అరుస్తున్నారు' అన్నాను. 'మంత్రాలు చదివేవారు అలా అరుస్తారు' అన్నాడు. 'అర్థరహితంగా మాట్లాడకండి' అన్నాను. 'నోరుమూయి' అన్నారు ఆయన. 'దమ్ముంటే ఈ మాట కోర్టు బయట అనండి' అని సవాలు చేశాను. మా సంభాషణ అంతా ఇంగ్లీషులో సాగింది. అంతా వింటూ అసహసంతో సీటులో కదులుతున్న జడ్జీగారు లేచి తన గదిలోకి వెళ్ళిపోయారు. మేమిరువురు ప్లీడర్లం నిశ్శబ్దంగా వూరుకున్నాం. ఈ సంభాషణలో అంతరార్థం చదువరులకు అంతుపట్టి వుండదు. మునిపల్లె వెంకటేశ్వర్లు గారు నియోగి బ్రాహ్మణులు. వారి దృష్టిలో నేను వైదీకి బ్రాహ్మణుడను. వైదీకులు మంత్రాలు చదువుతారు. ఈ అంశాన్ని ఆయన స్ఫురింప చేశారు. ఆయనకు నియోగి వైదీకి భేదభావం ఉంది. వెంకటేశ్వర్లు గారికి నాకు పెద్ద పరిచయం లేదు. అందుకని నన్ను గురించి పెద్దగా ఎక్కువగా తెలియదు. సత్యనారాయణ గారు వైదీకి కనుక అతని అల్లుడూ వైదీకి అనే వారు భావించారు. ఆ భావ ఫలితమే వారి వ్యాఖ్య.

నిజానికి నేను విప్రబ్రువుడనయ్యాను. కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేసి వచ్చానేమో 'షాక్' తిన్నాను. ఇంతలో జడ్జీగారి దగ్గర నుండి పిలుపు వచ్చింది. ఆయన గదిలోకి వెళ్ళాను. ఆయన ఆసనం మీద నుండి లేచి (తెలంగాణా ప్రాంత ప్రభుత్వోద్యోగులు యీ మర్యాదను పాటించేవారు) సాదరంగా ఆహ్వానించి అసీనుణ్ణి చేసి సంభాషణ ప్రారంభించారు. 'నా కోర్టులో నీకు అవమానం జరిగింది. నేను నిన్ను క్షమాపణ కోరుతున్నాను' అన్నారు ఆయన. ఇది మరో 'షాక్'. ఆయన సౌజన్యానికి ఆయనను అభినందించి బయటికి నడిచాను. జరిగిన కథంతా బాగా జ్ఞాపకం చేసుకొని వరుసగా దానినంతా 'మెమో'గా రాసి జడ్జీగారి గదిలోకి వెళ్ళి యిచ్చాను. ఆయన తీసుకొని 'సరే చర్య తీసుకుంటాను' అన్నారు. అలాగే ఆయన యీ 'మెమో'పై వెంకటేశ్వర్లు గారికి నోటీసు యిచ్చి సంజాయిషీ అడిగారు. వెంకటేశ్వర్లు గారు నా 'మెమో'కు ప్రతిగా మరో మెమో దాఖలు చేశారు. దానిని నేను చూచాను. 'మెమో'పై సంజాయిషీ ఏ న్యాయ సూత్రం ప్రకారం అడిగారో తెలియదన్నారు. అంటే ఇలా సంజాయిషీ అడగటానికి జడ్జికి అధికారం

లేదని చెప్పటం అన్నమాట. జరిగిన వాస్తవాన్ని ఆయన కాదనలేదు. 'ఏదో భావావేశంతో అనుకున్నాం. అతడూ అన్నాడు నేనూ అన్నాను అని అందులో రాసారు. అది చదివిన నాకు ఆయనపై గౌరవం హెచ్చింది.

వైదీకి ప్లీడర్లకూ వైదీకి నియోగి శాఖాభేద భావం వుంది కనుక వారిలో ఒక ప్రముఖుడు వచ్చి నన్ను వెంకటేశ్వర్లు గారిపై హైకోర్టులో పిటీషను పెట్టమన్నాడు. దీని విషయమయి చాలా లోతుగా ఆలోచించాను. పర్యవసానం ఎలా ఉంటుందో ఊహించాను. శతావధాన సార్వభౌములు తిరుపతి వేంకటేశ్వర కవులు ఆశుకవి చక్రవర్తులు కొప్పరపు కవీంద్రులు వీరికి కవిత్వ పథలో జరుగవలసిన గౌరవాలను గురించి 1912 ప్రాంతంలో ఉద్భ్రమించిన వైరం, నీ ద్వేషం వైదీకి నియోగి శత్రుత్వంగా ఎలా పరిణమించిందో ఎలా 1950 దశకంలో కూడ అది చల్లారలేదో తెలిసిన వాడిని కనుక హైకోర్టుకు వెళ్లే ప్రసక్తి మానుకున్నాను. నా కారణం వల్ల ఆ ద్వేషాగ్ని మళ్లీ ప్రజ్వరిల్లడం నన్ను నేనే అవమానించు కొనడంగా తలిచాను.

అప్పటేళ్లలో పెద్దలకు నాపై వాత్సల్యం వుంది. ఆదరభావం వుంది. ఈ సంఘటనకు వారూ వ్యథ చెందారు. ఆనాటి 'బార్ అసోసియేషను'కు పాటూరి లక్ష్మీ నారాయణగారు అధ్యక్షులు. వయోవృద్ధులయినా పేరు ప్రఖ్యాతులలో ప్రతిభావంతంగా 'ప్రాక్టీసు' చేస్తున్న కోన వెంకట రావుగారిని వెంటబెట్టుకొని ఆయన నా యింటికి వచ్చారు. 'జరిగిన దానికి మేము చింతిస్తున్నాం. మేము ఒక మాట చెప్తాం. నీవు వినాలి' అన్నారు. చెప్పమన్నాను. 'వెంకటేశ్వర్లూ నీవు ఒకే మెమోపై దస్కతు చేసి ఈ వ్యవహారం యింతటితో ముగించమని జడ్జీని కోరాలి. దీనికి ముందుగా వెంకటేశ్వర్లును ఒప్పించి నీ దగ్గరకు వచ్చాం' అన్నారు. 'అలా జరగదు' అని ముక్తసరిగా జవాబు చెప్పాను. ఈసారి 'షాక్' తినడం వారి వంతయింది. 'రామమూర్తి తమ మాట వింటాడు, వెంకటేశ్వర్లు రాజీకి అంగీకరించడంతో ఉబ్బితబ్బిబ్బయి సంతోషాంతరంగంలో నా వద్దకు వచ్చిన ఆ పెద్దలకు విభ్రాంతి కాక మరేమి మిగులుతుంది. పాటూరి లక్ష్మి నారాయణ గారు 'అయితే ఏమి చేస్తావు' అని కొంచెం చిరాగ్గా ప్రశ్నించారు. 'ఏమీ చేయను' అన్నాడు. వారి ఆనందానికి అంతులేదు. 'గెలిచావు' అన్నారు కోన వెంకట్రావు గారు. నన్ను అభినందించి వారు వెళ్ళిపోయారు. నిజంగా నా క్రోధాన్ని నేను జయించ గల్గినందుకు నన్ను నేను మనస్సులో మెచ్చుకున్నాను. తరువాత కొన్ని సంవత్సరాలకు మునిపల్లె వెంకటేశ్వర్లు యింటికి దగ్గరలో యిల్లు కట్టుకొని గృహ ప్రవేశ విందుకు వారిని యింటికి వెళ్ళి ఆహ్వానించాను. వారు నన్ను ఆదరించి తన అనారోగ్యం వల్ల విందులకు పోవటం లేదని చెప్పి కుమారుని వెళ్ళి రమ్మన్నారు. నాపై ఎవరయినా నిందా వాక్యాలు పలికితే 'అతని పద్ధతే వేరు' అని వ్యాఖ్యానించేవారట. ద్వేషం ద్వేషాన్ని పెంచుతుంది, కసి కసిని ప్రకోపింపచేస్తుంది అనే పచ్చి నిజాన్ని గ్రహించాను.

ప్లీడరీ వృత్తిని పట్టుదలగా సాగించే ముందు న్యాయవాదులు, న్యాయమూర్తులు వీరి హక్కులూ, బాధ్యతలు క్షుణ్ణంగా చదివాను. ముఖ్యంగా కోర్టు ధిక్కార కేసులు. ఆ కేసుల లసుపాసులు అధ్యయనం చేశాను. మాట తూలడం, మాట పడటం నా నైజానికి దూరం. అలాంటి మనస్తత్వం వున్న నేను న్యాయమూర్తులతో ఘర్షణ పడటం, న్యాయమూర్తులపై ఫిర్యాదులు చేయాల్సి రావడం తప్పనిసరి.

భాస్కర రాజుగారు బాపట్ల సబ్ జడ్జీగా వచ్చారు. ఆయన జిల్లా మునసబుగా గురజాలలో వున్న రోజుల్లో (1942లో) నేను నా పినతండ్రిగారి వెంట కోర్టుకు వెళుతుండేవాడిని. అప్పుడు నా తండ్రిగారు పలనాడు తహశీలుదారు. ఆ ఊరిలో వున్న ఒకే ఒక క్లబ్‌లో అందరం కలిసేవారం. 'నీవు నా కోర్టుకురా' నీకు 'కమిషన్లు వేస్తాను' అన్నారు రాజుగారు. నాకు ప్లీడర్ వృత్తిపై ఆనాడు ఆసక్తి లేక నేను వారి సలహాను పాటించలేదు. భాస్కర రాజుగారు వ్యక్తిగా బహు దొడ్డ మనిషి. లంచం అనేది ఆయనకు ఆమడ దూరం. అయితే వారిది రాజదర్పం. అందరూ తమను ఆశ్రయించాలని, ఆశ్రితులకు మేలు చేయాలని-అది అవినీతికరమయినా సరే - వారి కోరిక. ఆశ్రయించని వారిపై తిరస్కార భావం ఉండేది. కోపం కల్గేది.

రాజుగారు నాకు తెలిసినవారయినా వారిని వెళ్ళి ఇంటి దగ్గర కాని, కోర్టు భవనంలో వారి ప్రయివేటు గదిలో కాని వారిని కలవలేదు. అది వారికి నాపై కినుకను కలుగజేసింది. ఒకసారి పిలిపించి మాట్లాడారు. మర్యాదగా మాట్లాడి వచ్చాను. అదే మొదటిసారి. అదే చివరిసారి. పాములపాటి వెంకట కృష్ణయ్యగారు రెండవ ప్రపంచ యుద్ధపు రోజుల్లో యుద్ధానికి చేతి వృత్తులవారికి శిక్షణయిచ్చి పంపినవారు. గుంటూరు జిల్లా బోర్డుకు ప్రభుత్వంచే నియమింపబడిన అధ్యక్షునిగా ఆ జిల్లాలో హైస్కూళ్ళ స్థాపనకు ఎంతో కృషి చేసినవాడు. ఆంధ్ర విశ్వ విద్యాలయ సెనేటు సభ్యుడు. ఆయన కేసులో ప్రతివాదికి నేను ప్లీడరును. ఆయన ఒక యింటిని అద్దెకు తీసుకున్నాడు. గడువు కాలం అయిపోయింది. అయినా ఆయన అద్దెయింటిని ఖాళీ చేయడు. క్రింది కోర్టు ఖాళీ చేయమన్నది. దానిపై అప్పీలుకు కాలవ్యవధి అయిపోయిన తరువాత సబ్ జడ్జి కోర్టులో అప్పీలు దాఖలు చేశాడు. క్రింది కోర్టు ఉత్తర్వును నిలుపుదల చేయించుకున్నాడు. ఇంటి యజమాని నా క్లయింటు. కౌంటరు దాఖలు చేసి అప్పీలు చెల్లదన్నాను. కేసు ఎప్పుడూ పిలవడం, వాయిదా వేయడం, వినమని నేను జడ్జిగారిని ఒత్తిడి చేయడం సాగుతున్నది. అలా ఇప్పటికి నాలుగు పర్యాయాలు అయింది. చివరగా వాయిదా వేయరాదని గట్టిగా వాదించాను. 'పాములపాటి వెంకట కృష్ణయ్య నా యింటికి వచ్చి వాయిదా అడిగాడు. ఇచ్చేతలిచాను అన్నాడు న్యాయమూర్తి రాజుగారు. విషయాన్ని వినవలసిందే' అని పట్టుపట్టాను. కాని వాయిదా వేశాడు. వెంటనే 'నీవు నాతో పోట్లాడుతున్నావు' అంటూ నా మరో దావాను విచారిస్తానన్నాడు. వాదించమన్నాడు. తన చేతిపై

రెండవ చేతి వేలును రాస్తూ (మంగలి కత్తిని రాయిపై నూరినట్లుగా) ఈ కేసును యిలా చేస్తానన్నాడు. ఆయన ఎక్కువగా తెలుగులో మాట్లాడుతాడు. ఇదంతా తెలుగులోనే చెప్పాడు. 'ఆ పని చేయటానికి వేరే వృత్తి పనివాళ్లు ఉన్నారు. మీరు చేయనక్కర లేదు' అన్నాను. ముఖం చిట్లించుకొని వాదన చెయ్యమన్నాడు. ఆ కేసు బలీయమయింది. ధైర్యంగా వాదించాను. నాకు ఆ రోజు ఉదయం కొత్తగా వకాలతు యిచ్చిన క్లయింటు సాయంత్రం 'నా కేసు కాగితాలు నాకు యివ్వండి. మీకు, జడ్జిగారికి విరోధం. నేను కోర్టులో అంతా విన్నాను అన్నాడు. 'పది రోజులు ఆగు. ఆయన బదిలీ అవుతాడు. కాకపోతే నీవు కోరినట్లు వకాలతు వదులుకుంటాను' అన్నాను. ఇది ఊరికే అన్నమాట. నేను వాదించిన కేసును నాకు వ్యతిరేకం చేశాడు. ఇక ఆయన కోర్టులో కేసులు నేను చేయదలచ లేదు. తెనాలిలోని ప్లీడరు మిత్రుడు ఆవుల గోపాల కృష్ణ మూర్తిని నా కేసులను వాదించమని కోరాను. ఈలోగా రాజుగారిని బదిలీ చేశారు. ఓడిపోయిన కేసుకు నా క్లయింటు ఒక ధనిక క్లయింటు చేత పెట్టుబడి పెట్టించి ఫీజులేకుండా చేయమని ఒక హైకోర్టు అడ్వకేటును అభ్యర్థించి దానిని హైకోర్టులో నెగ్గించేటప్పటికి నా తల ప్రాణం తోకకు వచ్చింది.

భాస్కర రాజుగారు ఆశ్రయించిన వారికి - క్లయింటుకు, ప్లీడరుకు - అడ్డుదారి తొక్కి అయినా సరే సహాయం చేస్తాడు. తన శరణుజొచ్చిన ప్లీడరు కేసు గెలిపిస్తాడు. గెలిపించే ముందు 'నీకు క్లయింటు పూర్తిగా ఫీజు యిచ్చాడా? వీళ్లు తర్వాత యివ్వరు. ముట్టిందని నీవు ప్రమాణం చేస్తేనే నిన్ను గెలిపిస్తాను' అని అడిగి ఆ ప్లీడరు చేత అలా ప్రమాణం చేయించుకొని తీర్పు అతని క్లయింటుకు అనుకూలం చేస్తాడు. తను మాత్రం 'పార్టీ'ల వద్ద కాని ప్లీడరు వద్ద కాని చిల్లి పైసా ఆశించడు, తీసుకోడు. రోజూ గంటకన్నా పని చేయడు. కోర్టులో బెంచి మీద వున్నప్పుడు వాకులూ చవాకులూ మాట్లాడతాడు. మళ్లీ కోర్టు బయట, తన ప్రయివేటు రూములో నికార్సయిన పెద్ద మనిషిగా ప్రవర్తించేవాడు. కోర్టు కుర్చీ మీద కూర్చుంటే అదేదో విక్రమార్క సింహాసనంలా వుంటుందని ఆయన అనేవాడు. ఇలాంటి వారు - న్యాయం చెయ్యాలనే నియమం లేనివారు - న్యాయమూర్తులుగా ఉంటే న్యాయం ఎలా జరుగుతుంది?

మరో జడ్జీ విషయం. ఆయనా రాజుగారే. కేసులో ముగ్గురు పార్టీలు. మూ. వాదనలు వుండే న్యాయమూర్తి, ఆయన భార్య, కుమారుడు ముగ్గురూ ఒకరికి తెలియకుండా ఒకరు పార్టీల వద్ద కేసు గెలిపిస్తామని చెప్పి లంచాలు తీసుకునేవారు. నాకు డబ్బిచ్చిన మనిషిని గెలిపించాలంటే నా మనిషిని గెలిపించాలని ఇంట్లో పెద్దగా అరుచుకుంటుంటే విషయం బయటపడింది. పచ్చి లంచగొండి అని పేరు పడ్డది. ఒకసారి నా కేసులోనే ఒక విచిత్ర సంఘటన జరిగింది. నా ఎదిరి ప్లీడరు కేసు విచారణ జరగాలన్నాడు. అతని పార్టీ న్యాయమూర్తికి లంచం యిచ్చాడేమోనని నాకు అనుమానం కలిగింది. వాయిదా అడిగాను. న్యాయమూర్తి 'వాయిదా యివ్వను మధ్యాహ్నం వాదించండి' అన్నాడు. నా అనుమానం గట్టిపడింది. విరామం అనంతరం కేసు పిలిచారు. నేను వాదించటానికి సిద్ధమని చెప్పాను. ఇది గత్యంతరం లేక

చెప్పిన మాట. నా క్లయింటు జడ్జీని లోబరుచుకున్నాడని ఎదిరి ప్లీడరుకు అనుమానం కల్గింది. అతడు వాయిదా కోరాడు. నిజానికి యీ కేసులో ఇరు పార్టీలలో ఎవరూ జడ్జీకి లంచం యివ్వలేదు. ఈ ప్రహసనం న్యాయమూర్తి ఖ్యాతిని వెలికి తీస్తున్నది. న్యాయమూర్తిపై చర్య తీసుకోవాలని భావించాం. నా కేసు రాగానే వాయిదా వెయ్యండి అని ధృడంగా పలికేవాడిని. భయపడి వాయిదా వేసేవాడు. నాకు ఏ నష్టమూ జరుగలేదు. కాని అతడి లంచగొండితనం వల్ల నష్టపోయిన పార్టీలు గోలపెట్టారు. అతడు న్యాయమూర్తిగా బాపట్లలో పనిచేయతగడని అర్థం వచ్చేటట్లు ప్లీడర్ల సంఘంలో తీర్మానం రాశాం. పరిపాలనా వ్యవహారాలు చూచే హైకోర్టు జడ్జీని కలవటానికి న్యాయవాది సంఘ ప్రతినిధి వర్గానికి అవకాశం యిమ్మని కోరాం. కోర్టు ప్రధాన న్యాయమూర్తి యింటి చిరునామాకు మరో టెలిగ్రాం యిచ్చాం. హైదరాబాదు రమ్మన్నారు. నలుగురు న్యాయవాదులం ప్రధాన న్యాయమూర్తిని కలిశాం. 'ఏమిటి విషయం' అని ఆయన ప్రశ్నించారు. 'అతడు అవినీతిపరుడు' అనేది మా ప్రత్యుత్తరం. 'అతన్ని బదిలీ చేస్తాను. అతనిపై విచారణ జరిపిస్తాను. అతనిపై ద్వేషంతో అసత్య మాడవద్దు. అతనిని రక్షించాలని అబద్ధాలాడవద్దు. నిజం చెప్పండి' అన్నాడు. ఆ న్యాయమూర్తిని బదిలీ చేసింది హైకోర్టు. జిల్లా జడ్జీని విచారణ చేయమన్నారు. ప్లీడర్లందరికీ టీపార్టీ యిచ్చి విచారణలో నిజం చెప్పాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాను. అలాగే విచారణ సాగింది. అందరం ఎవరికి తెలిసింది వారు చెప్పారు. ఈ విషయంలో నా పాత్ర గణనీయమయిందే. అయితే స్వయంగా నాకు అతని లంచగొండితనం సంగతి తెలియదు. విచారణ అప్పుడు 'మీరు గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పండి. నేను తప్పుడు పని చెయ్యలేదని' అన్నాను. అంతే 'నా దురదృష్టం' అన్నాడు. అతనిని పదవి నుండి కొంత కాలం తొలగించారు. చివరకు దయతలచి పదవి యిచ్చి 'రిటైరు' చేయించారు.

ఇలాగే మరో న్యాయమూర్తి విషయం. ఆయన బాపట్లలోనే జిల్లా మునసబు చేసి, బదిలీ అయి తరువాత కొంత కాలానికే బాపట్లకు సబ్ జడ్జీగా వచ్చాడు. జిల్లా మునసబుగా తెలివి కలవాడని, సమర్థుడని, న్యాయం చేసేవాడని, నిష్పక్షపాతియని, సహృదయుడని పేరు పొందాడు. సబ్ కోర్టు జడ్జీగా వచ్చేటప్పటికి మనిషి మారాడు. ఆశ్రితుల కేసులు గెలిపించటం ఆరంభించాడు. అతడికి నాటకాలపై వ్యామోహం. రాయబారంలో కృష్ణ పాత్ర వేయాలని యిష్టం. బాపట్లలో సహకరించే నటులకు కొదవ లేదు. నాటకం వేయించాడు. ఆ ఉత్సాహంలో కోర్టులో జడ్జీ కూర్చునే కుర్చీని నాటకంలో ధృతరాష్ట్రుడు కూర్చోడానికి యిచ్చాడు. న్యాయమూర్తిగా అతడి పక్షపాత దృష్టికి బలి అయిన పార్టీ పిటీషను పెట్టాడు. జిల్లా జడ్జీ విచారణకు వచ్చాడు. పదిమంది దాకా న్యాయవాదులు సాక్ష్యం చెప్పారు. కొందరు నిజం పలికారు. మరి కొందరు సంగతి తెలియదన్నారు. ఇంకా కొందరు న్యాయమూర్తి పక్షాన మాట్లాడారు. ఏదయినా జిల్లా మునసబుగా అంత పేరు సంపాదించుకున్న ఆ న్యాయమూర్తి అభాసుపాలయినాడు. ఇటీవల ఒక సందర్భంలో ఆయన నన్ను కలిశాడు. ఆప్యాయంగా మాట్లాడాడు.

నా చర్యల వల్ల నష్టపడ్డ న్యాయమూర్తులు కూడా నన్ను నిందించలేదు.

# నా ప్రచార సరళి

ప్రజా జీవితానికి చెందిన ప్రతి ముఖ్య సమస్య మీద నేను నా అభిప్రాయాలను వ్యక్తం చేసేవాడిని. నా అభిప్రాయాలను కరపత్రంలో పొందుపరిచి అచ్చువేయించి పంచేవాడిని. కరపత్రం ఒక్కొక్కటికి పది పైసలకు అమ్మేవాడిని. అలా అచ్చువేయటానికి పదిరూపాయలు ఖర్చు అయితే అందులో కరపత్రాల అమ్మకం వల్ల అయిదు రూపాయలు సంపాదించ కల్గేవాడిని. కొందరు మిత్రులు నన్ను 'కరపత్ర స్వామిజీ' అని ఛలోక్తిగా పిలిచేవారు. మ్యునిసిపలు ఎన్నికలలో నా మేనమామ కొడుకులిద్దరూ నిలుచుంటే కొన్ని కుటుంబాలవారు దొంతర్లు దొంతర్లుగా అభ్యర్థులవుతున్నారని, మ్యునిసిపలు కౌన్సిలర్లు మీటింగుకు ఇరువది రూపాయలు సమావేశపు భృతి క్రింద తీసుకుంటే అది తప్పని యిలా ఎన్నో కరపత్రాలు వేశాను. ఇంచుమించుగా రెండు నెలలకు ఒకసారి పార్కులో బహిరంగ సభ ఏర్పాటు చేసి మాట్లాడేవాడిని. నా మీదగల సానుభూతితో గాని, నా మీది గౌరవంతో కాని, కుతూహలంతో కాని, మరో కారణం వల్ల గాని సభకు నూట ఏబది మంది హాజరయ్యే వారు. నా ప్రసంగం ఏబది నిమిషాలు సాగేది.

ఈ అలవాటు ఒక పర్యాయం నన్ను చిక్కుల్లో పడవేసింది. అన్ని పట్టణాల్లో 'రేటు పేయర్సు సంఘం' వెలిసినట్లుగానే మ్యునిసిపాలిటీకి పన్నులు చెల్లించేవారు బాపట్లలో సంఘాన్ని స్థాపించారు. దానికి సోషలిస్టు ప్లీడరు శ్రీ బెండపూడి నారాయణరావు అధ్యక్షుడు. స్వతంత్ర పార్టీ ప్లీడరు శ్రీ ఎ.ఆర్. కోటేశ్వర రావు కార్యదర్శి. మరో ప్లీడరు కమ్యూనిస్టు సానుభూతిపరుడు శ్రీ వడ్లమూడి సీతారామారావు సంఘానికి న్యాయసలహాదారు, కమ్యూనిస్టు ప్లీడరు పి.ఎస్.ఆర్. శర్మ కోశాధికారి. అందరం స్నేహితులమే. పన్నులు పెంచారని, పెరుగుదల పన్నును వసూలు ఆపాలని మునసబు కోర్టులో దావా వేశారు. దావాలో అలాగే పెరుగుదల పన్ను వసూలు ఆపమని ప్రమాణ పత్రం రాసి తాత్కాలిక పిటీషను పెట్టారు. ప్రమాణ పత్రాన్ని చదివి వినిపిస్తే మునసబుగారు పిటీషనుపై తాత్కాలికపు ఉత్తరువును యిచ్చారు. పిటీషనులో పెరిగిన పన్ను వసూలు నిలుపుదల చేయమని రాసి వుంది. 'పెరిగిన పన్ను= పాత పన్ను + పెరుగుదల' అని గ్రహిస్తే జరిగిన తంతు అర్థమవుతుంది. పెరిగిన పన్నుల వసూలు ఆగిపోయింది. ఉద్యోగులకు జీతాలు యివ్వలేని పరిస్థితి కల్గింది. పాత పన్ను వసూలు చేసుకోటానికి అవకాశం యిమ్మని మ్యునిసిపాలిటీ తరఫు ప్లీడరు కోరాడు. ఆ కోరికను రేటు పేయర్సు సంఘం వారు వ్యతిరేకించారు. కోర్టు మ్యునిసిపాలిటీ కోరికను మన్నించ లేదు. పట్టణ పౌరునిగా నేను కరపత్రం వేశాను. కోర్టులో 'రేటు పేయర్ల సంఘం' పేరు మీదుగా జరిగే చర్యలు ఆ సంఘ సభ్యులకు, పౌరులకు తెలిస్తే వారు సహించరని రాజకీయ ప్లీడర్ల సంఘపు హాలులో పిచ్చాపాటీ మాట్లాడుతూ కొంతమంది రేటు పేయర్లు సంఘంలోకి చొచ్చుకొని వచ్చి సంఘం ద్వారా మ్యునిసిపాలిటీని

స్తంభించ పూనుకున్నారు అనిఅన్నారు. ఈ మాటలు ఎ.ఆర్. రామకోటేశ్వర రావు విని వడ్లమూడి సీతారామారావుతో చెప్పాడు. అతడికి కోపం వచ్చింది. రేటు పేయర్ల సంఘం తరపున అతడే ప్లీడరుగా కోర్టులో పనిచేశాడు. తన పరువుకు నష్టం కల్గిందని నాపై మునసబు కోర్టులో అయిదు వందల రూపాయలు పరిహారం కోరుతూ దావా వేశాడు. అంతటితో ఆగక క్షమాపణ చెప్పమని, లేకపోతే వ్యాజ్య గ్రంథం జరుపగలమని రేటు పేయర్సు సంఘం అధ్యక్షుడు బెండపూడి నారాయణ రావుచేత నాకు రిజిస్టర్డు నోటీసు యిప్పించాడు. అప్పటికీ అతని కోపం చల్లారలేదు. న్యాయవాద సంఘ సర్వసభ్య సమావేశంలో తను రాసిన లేఖను వుంచి రామమూర్తిని సంఘం నుండి తొలగించమని సంఘ కార్యదర్శికి లేఖ రాసాడు. రామమూర్తికి వైదీకి నియోగి శాఖా ద్వేషం వుందని, అందువల్ల అతను తన పరువు తీయ ప్రయత్నించాడని, అతని ప్రవర్తన న్యాయవాది హోదాకు తగదని దాని సారాంశం. ఈ కథను కొనసాగించే ముందు కొన్ని వాస్తవాలు చెప్పాలి. వడ్లమూడి సీతారామారావు తండ్రి నరసింహా రావుగారూ నా మామ సత్యనారాయణ గారూ ■ ప్రాణస్నేహితులు. సీతారామారావు నా బావమరిది వెంకటేశ్వర్లు 'క్లాసుమేటు'. స్నేహితుడు. సీతారామారావు సోదరి, నా భార్య వెంకట సుబ్బమ్మ కలిసి ఒకే తరగతిలో చదువుకున్నారు. ఇలా గట్టి సంబంధాలున్న కుటుంబాలు మావి. రేటు పేయర్సు సంఘం వారు దావా వేసేవరకు నేనూ సీతారామారావూ సన్నిహితులం. కొంతమంది న్యాయువాదులు నాతో పైకి మంచిగా మాట్లాడుతూ వున్నా యిదంతా ఎట్లా పరిణమిస్తుందో ■ద్యం చూడాలని ఉబలాట పడ్డారు. ఈ సంగతిని గ్రహించాను నేను. శ్రీ వడ్లమూడి సీతారామారావు వ్రాసిన లేఖను న్యాయువాద సంఘ కార్యదర్శి పి.ఎస్.ఆర్. శర్మ కార్య నిర్వాహక వర్గం ముందు పెట్టి నిర్ణయించి [illegible] రాసి సభ్యులకు చూపించమని 'టెండరు'కు ఉత్తరువు ఇచ్చాడు. అతడు వారందరికి చూపించాడు. న్యాయువాద సంఘ సర్వసభ్య సమావేశంలో పెట్టాలని లేఖ రాసిన సీతారామారావు అభ్యర్థన ఉనుక దీనిపై చర్య తీసుకోటానికి కార్య నిర్వాహక వర్గానికి అధికారం లేదని మ్యునిసిపాలిటీ ప్లీడరు కొమరవోలు బాలకృష్ణ అభ్యంతరం చెప్పాడు. దానితో సంఘ సభ్యులందరికి చూపించనున్నాడు కార్యదర్శి. ఆ క్రమంలో నేనూ ఆ లేఖను చదివాను. 'సీతా రామారావు పరువు అయిదు వందల రూపాయిలయితే నా పరువు అయిదు వేల రూపాయిలు. ఆ మొత్తానికి దావా వేస్తాను' అని బహిరంగంగా సంఘ ఆవరణలో ప్రకటించి లేఖ నకలు యిమ్మని, చార్జీ క్రింద రెండు రూపాయిలు చెల్లిస్తున్నానని నకలు దరఖాస్తు చేసాను. మిత్రుడు పి.ఎస్.ఆర్. శర్మ సమస్య ముదురుతుందని గ్రహించి కాలయాపన చేశాడు. నేను యింటికి పోయి 'లా పాయింటు' చూశాను. నేను అన్నమాట లా ప్రకారం తప్పు. కేసు వేసే న్యాయువాదిని ఏమీ అనకూడదని ఒక తీర్పులో వుంది. ప్రమాదం పసిగట్టాను. సమస్య తీవ్ర స్థితిని గుర్తించాను. అప్పంగా నా తెలివి తేటలపై ఆధారపడ తలచలేదు.

స్నేహితుల సలహాలు తీసుకొని వారు చెప్పినట్లు సంచరించాలనుకున్నాను. వారిలో ముగ్గురిని ఎంపిక చేసుకున్నాను. వారు సర్వశ్రీ కె.ఎస్.వి. సుబ్బారావు, కరవోలు నాగేశ్వర రావు నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి. వీరికిబాధ్యత అప్పగించాను. వెలగపూడి సుబ్బారావుగారి మ్యునిసిపలు అధ్యక్ష ఎన్నిక దరిమిలా వియోగులంతా నాపై నానుభూతిలో వున్నారు. ఆ శాఖలోని పెద్దలంతా నా పక్షమే. రామమూర్తిని ఇలా అక్రమంగా నిందించటం తప్పని వారి భావం. నాపైన సీతారామారావు త్రివిధంగా దాడిచేశాడు కనుక నేను త్రివిధంగా దానిని ఎదుర్కోతలిచాను. రేటు పేయర్లు సంఘ అధ్యక్షుని లేఖకు నేను జవాబివ్వలేదు. నాపై హైకోర్టులో పిటీషను పెట్టాలని సంఘ సర్వసభ్య సమావేశంలో తీర్మానం పెట్టారు. దానిని వమ్ము చేసే బాధ్యతను మిత్రుడు కొమరవోలు నాగేశ్వర రావు చేపట్టాడు. సర్వసభ్య సమావేశానికి వెళ్ళి అతడు యిలా మాట్లాడాడు. 'రామమూర్తి మొండివాడు. అతనిపై హైకోర్టులో పిటీషను పెట్టాం. రేపటి నుంచి పదిమంది చేత అదే మాట అనిపిస్తాడు. అందరి మీద కేసులు పెట్టగలమా? అలా చేయటానికి మనకు తీరిక, ఓపిక, పైకం వుందా? అసలు మన సంఘం ఎందుకు పుట్టింది? పన్నులు తగ్గించుకోడానికా లేక యితరుల మీద కేసులు పెట్టడానికా?' ఈ ఉపన్యాసం విని సభ్యులయిన పుర వైశ్య ప్రముఖులు తీర్మానాన్ని వ్యతిరేకించారు. తీర్మానం వీగిపోయింది. ఇక దావా. దావాను కొరవ స్టాంపుపై వేసి క్లయింటును తిరిగి తీసుకున్నాడు సీతారామారావు. కనుక దాని విషయం పట్టించుకోనక్కర లేదు. న్యాయవాద సంఘంలోని వ్యవహారపు బాధ్యత కె.ఎస్.వి. సుబ్బారావు ఎత్తుకున్నాడు. వోట్ల కోసం తీవ్రంగా యిరుపక్షాలు కృషి చేశాయి. చాలమంది తాటస్థ్యం వహించారు. సర్వసభ్య సమావేశం ఒక గంటలో కూడనున్నది. అలా అనలేదని రామమూర్తిని అనమని నేను అన్ని చర్యలను మానుకుంటాను అని అన్నాడు సీతారామారావు. సభ్యులతో బహిరంగంగా అన్న మాటలను నేను విన్నాను కాని బదులు పలకలేదు. అనలేదని అబద్ధ మాడలేను. అంగీకరించి నిందిత్కుణ్ణి కాలేను. సర్వసభ్య సమావేశం ఏర్పాటయింది. ముందుగా లెక్కవేస్తే అతనికి 26వోట్లు. నాకు 24 వోట్లు వున్నట్లు తేలింది. సుబ్బారావు ఆలోచించాడు. సంఘాధ్యక్షుడు నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి చేత సమావేశం మొదట్లోనే రూలింగు యిప్పించాడు. సీతారామారావు రామమూర్తిపై దావా వేశాడు కనుక కోర్టులో వ్యాజ్య గ్రంథం జరుగుతుండగా సంఘం యీ తీర్మానాన్ని చర్చించరాదని దాని సారాంశం. అలా సర్వసభ్య సమావేశం ముగిసింది. సీతారామారావు వర్గం 'ఇది ఎదురు దెబ్బ'యని భావించింది. సంఘాధ్యక్షుని రూలింగును గురించి కార్య నిర్వాహక వర్గం చర్చించి చర్య తీసుకోవాలని కార్యదర్శి 'మీటింగు నోటీసు' యిచ్చాడు. సర్వసభ్య సమావేశంలో అధ్యక్షుడు యిచ్చిన రూలింగును కార్య నిర్వాహక వర్గం చర్చించే వీలు లేదని నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి అభ్యంతరం పెట్టాడు. సర్వసభ్య సమావేశంలో అధ్యక్షుని చర్యను పరిశీలించే విషయం చర్చకు వస్తే సంఘ గౌరవానికి భంగం కలుగుతుందని, ఒకవేళ పట్టుదల పట్టి చర్చిస్తే సంఘం

చీలుతుందని సంఘంలోని పెద్దలు గ్రహించారు. రాజీ చేశారు. సీతారామారావు దావాను ఉపసంహరించుకునే లాగు, సంఘాధ్యక్షుని రూలింగును చర్చకు పెట్టడాన్ని కార్యదర్శి శర్మ [illegible]సుకునేలాగు, సీతారామారావు రాసిన లేఖ సంఘాధ్యక్షుని వద్ద ఉండేటట్లు, నకలు కావాలని రామమూర్తి పట్టుపట్టకుండా వుండేటట్లు రాజీ ఏర్పాటు తర్వాత ఇరు పక్షాలవారం అందరం పూర్వంలాగానే స్నేహితులము అయినాం. న్యాయసూత్ర సంబంధమయిన చిక్కులను మున్ముందుగా ఆలోచించకుండా ప్రజా వ్యవహారాల్లో ప్రవర్తించడం చాలా పెద్ద పొరపాటని, చిన్న తప్పుకు పెద్ద బాధ వస్తుందని గ్రహించాను.

# విద్యావంతుల నియోజక వర్గాల్లో వోటర్లు

విద్యావంతులకు సంబంధించిన రెండు నియోజక వర్గాల్లో పోటీ చేశాను. ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నాను.

మొదటిది 1944లోని ఆంధ్ర విశ్వ విద్యాలయ సెనేటుకు పట్టభద్రుల నియోజక వర్గం నుండి పోటీ. సెనేటులో సుమారు 105 మంది సభ్యులుంటే 15 మంది సభ్యులు పట్టభద్రుల నియోజక వర్గం నుండి ఎన్నుకోబడతారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ ప్రాంతంలో నివసిస్తూ పట్టభద్రుడయిన ప్రతి వ్యక్తి 5 రూపాయల రుసుము చెల్లించి తన పేరును 'రిజిస్టరు' చేయించుకుంటే వోటరు అవుతాడు. ఎన్నికల పద్ధతిపై అచంచల విశ్వాసమున్న నేను ఎన్నికల ప్రణాళికను తయారు చేశాను. ఇంతకు ముందున్న సెనేటు సభ్యులందరూ అధికారంలో వున్నవారి ఆజ్ఞలను పాటించేవారు లేక కేవలం ప్రేక్షకులని విమర్శించాను. ఇప్పుడు దానిని తలచుకుంటే 'ఎంత దారుణమయిన సాహసానికి ఒడికట్టాను' అని తోస్తుంది. ఆనాడు నా వయస్సు 26 సంవత్సరాలు. సంఘాన్ని మరమ్మత్తు చేయాలనే తహ తహ మిక్కుటంగా వున్న రోజులు. భావావేశం జాస్తి. సంఘంలోని దురాచారాల, దురలవాట్ల మీద కసి. అపుడు నేను మార్క్సిజంలో విశ్వాసం వున్న రాడికల్ డెమోక్రట్‌ను. ఎన్నికల ప్రణాళిక చేత పట్టుకొని వోటర్లను సమీపించాను. ఒక పట్టభద్రుడు 'ఫలానివారు నా పేరు రిజిస్టరు చేయించారు. నేను కట్టవలసిన 5 రూపాయల రుసుము ఆయన చెల్లించారు. కనుక ప్రథమంగా యీ ఎన్నికల్లో ఆయనకే నా వోటు' అని చెప్పాడు. దాంతో నాకు 'షాకు' తగిలింది. దిగ్భ్రాంతికి లోనయ్యాను. తార్కికంగా ఆలోచిస్తే యీ పట్టభద్రుడు తన వోటును కేవలం 5 రూపాయలకు అమ్ముకున్నట్లు భావించాను. మరో వోటరును సమీపించాను ఈ ఎన్నికల ప్రణాళికతో. 'ఫలానివారు నన్ను మున్ముందుగా వోటు అడిగారు. ఆయనకే నా వోటు అన్నాను. కనుక ఆయనకే నేను వోటు వేస్తాను' అన్నాడు. ఇలా సూత్రబద్ధంగా ఎన్నికల ప్రచారం చేసిన నాకు కేవలం 19 ప్రథమ వోట్లు వచ్చాయి. ఎన్నికల విధానం 'సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ వోటు విధానం' అని నేను వేరే చెప్పనక్కర లేదు. అంటే ప్రతి వోటరు అందరు అభ్యర్థులకు వోటు వేయవచ్చును. ఆ వోట్లు అన్ని సమానం కాదు. మొదట దానికి విలువ ఎక్కువ. తరువాత రెండవ దానికి తరువాత మూడవ దానికి అలా అలా పోలయిన వోట్లను లెక్కకట్టి 15 చేత భాగహారం చేసి వచ్చిన మొత్తానికి ఒకటి కలిపితే వచ్చే సంఖ్యను తేలుస్తారు. అలా ఆ సంఖ్య వోట్లు వచ్చిన అభ్యర్థులను ముందుగా ఎంపిక చేస్తారు. ఓడిన అభ్యర్థులకు వచ్చిన ద్వితీయ వోట్లు ప్రథమంగా వోట్లుగా ఎంచుతారు. ఆ మొత్తాన్ని దాటి ఎక్కువగా వచ్చిన అభ్యర్థుల ప్రథమ వోట్లను దామాషా పద్ధతిన ద్వితీయ వోట్లు వచ్చిన వారికి పంచుతారు. ఇలా ఉయ్యాల జంపాల పద్ధతిన వోట్లను మదింపు వేస్తారు. ఇది చాలా చిక్కులతో కూడిన విధానం. అయినా అందరికీ న్యాయం చేకూరేది. నేను యీ ఎన్నికలో ఎలా గెలిచింది ముందే తెలియజేసాను కదా!

ఇక రెండవది. 'ఆంధ్రప్రదేశ్ బార్ కౌన్సిలుకు జరిగిన ఎన్నిక'. రాష్ట్రంలోని ప్లీడర్లందరూ వోటర్లే. ఆ ఎన్నిక 1962లోనని గుర్తు. ఆనాడు రాష్ట్రం మొత్తం మీద 9వేల మంది ప్లీడర్లుండేవారు. హైకోర్టు వున్న నగరం నుండి ఎక్కువమంది అభ్యర్థులుండేవారు. చాల ఎక్కువ ప్రాక్టీసు వున్న పెద్ద పీడర్లు అభ్యర్థులుగా విధిగా వుండేవారు. వారితో పాటు క్రొత్తగా హైకోర్టులో ప్లీడరీ చేస్తూ తమ పేరు రాష్ట్రంలోని అన్ని ప్లీడర్లకు తెలియాలని, తద్వారా వృత్తిలో తమకు లాభిస్తుందనే ఆశతో 'కుర్ర' ప్లీడర్లు అదే పనిగా అభ్యర్థులుగా ముందుకు వచ్చేవారు. అలాంటివారు సుమారు 6, 7 మంది వుండేవారు. జిల్లాలలో నున్న పెద్ద ప్లీడర్లు యీ ఎన్నికలపై మోజు చూపేవారు కాదు. ఈ ఎన్నిక విధానం కూడ సెనేటు ఎన్నికలలో అమలులో వున్నదే. రాజధానిలో వున్న ప్లీడర్లందరికి జిల్లాలలో పలుకుబడి వుండేది. బంధువులు వుండేవారు. కనుక వారి ఎన్నిక చాల తేలికగా సునాయాసంగా జరిగేది. 1955లో గుంటూరులో హైకోర్టు వున్న కాలంలో జరిగిన ఎన్నికల తంతు చెపితే విషయం సుబోధకం అవుతుంది. సుమారు 25 మంది ఎన్నికకు నిలబడ్డారు. అందరూ ఎవరికి వారు కేవలం '1' అని మార్కు చేసిన వోట్ల కాగితాలను వసూలు చేసుకున్నారు. అందరూ ఒకచోట చేరి ఎవరు ఎన్ని తమకు ద్వితీయ వోట్లు యిస్తారో అంత సంఖ్యలో తమ వోట్లలో ద్వితీయ సంఖ్యను వేశారు. అంటే వోటరు మహాశయుని సమ్మతితో నిమిత్తం లేకుండా వోట్లు బదిలీ యైపోయినవన్నమాట. ఈ విషయం గుప్పుమంది. అలజడి పెరిగింది. ప్రకాశం పంతులుగారికి కుడి భుజంగా వున్న శ్రీ నేతి సుబ్రహ్మణ్యం గారు పోటీ నుండి విరమించుకున్నారు. గుంటూరులోని ప్లీడరు శ్రీ వింజమూరి పార్థసారథి హైకోర్టులో వేసిన 'రిట్' పిటీషనుతో ఆ ఎన్నిక రద్దయింది. ఇది బార్ కౌన్సిలు ఎన్నిక భాగోతం.

ఇక నా ఎన్నిక విషయానికి వద్దాం. నా మామూలు పద్ధతిలో ఎన్నికల ప్రణాళిక వ్రాసి అచ్చువేశాను. అది చేతబట్టుకొని వోటర్ల వద్దకు వెళ్ళాను. దానిని వోటరుకు చేతికిచ్చి ఆలోచించండి అని అభ్యర్థించాను 'సరే చూస్తాం' అనేవారు వోటర్లయిన ప్లీడర్లు. ఆ రోజుల్లో బాపట్లలో సుమారు 100 మంది ప్లీడర్లు వుండేవారు. వారిని కూడా అలాగే కోరాను. భుజం మీద చెయ్యి వేసి 'బ్రదర్! నీవు తప్పక నాకు వోటువేసి నన్ను గెలిపించాలి' అని ప్రాధేయ పడలేదు. తర్వాత తెలిసింది నా అనేకమంది మిత్రులకు కోపం వచ్చిందని. 'వీడికింత పొగరా! ఆప్యాయంగా వోటు అడగలేడా!?' అని వ్యాఖ్యానాలు చేశారట. ఏతావాత బాపట్లలో వున్న న్యాయవాదులు 24 మంది మాత్రమే నాకు ప్రథమ వోటిచ్చారు.

ఈ ఎన్నికలలో జరిగిన ఒక సంఘటన నా స్మృతి పథంలో మెదులుతున్నది. విజయవాడలో వున్న న్యాయవాది మిత్రుడు వెంపటి విశ్వేశ్వర రావు సాయంతో వోటర్ల దగ్గరకు వెళ్ళసాగాను. మిత్రుడు ఒక యింటి ముందు ఆగాడు. 'ఈ వోటు నీదేనోయి' అన్నాడు. ఆశ్చర్యంతో ఎందుకు అన్నాను. గోడమీద పేరు బోర్డు చూడు అన్నాడు. చదివాను. మల్లాది చంద్రశేఖర శాస్త్రి అని వుంది. అప్పటికి నాకు జ్ఞానోదయమయింది. లోపలికి వెళ్ళాం. 'ఈయనా మీ మల్లాదివాడే' అని

నా మిత్రుడు నన్ను పరిచయం చేశాడు. అప్పటి నా పేరు 'మల్లాది వేంకట రామమూర్తి'. తరువాత దానిని 'ఎం.వి. రామమూర్తి' అని మార్చుకున్నాను. అది వేరే కథ. 'కూర్చోండి' అని శాస్త్రిగారు మమ్మల్ని సగౌరవంగా ఆహ్వానించాడు. 'మీ గోత్రం ఏమిటండీ' అని అడిగాడు. 'మల్లాది' యింటి పేరుగల బ్రాహ్మణులలో రెండు గోత్రాల వారున్నారు. నాకు మా కుటుంబ గోత్రం తెలుసు. నా ఉపనయనాన్ని నా తండ్రిగారు ఆర్భాటంగా చేశారు నా 13వ ఏట. పట్టుగా 3 నెలలు త్రికాల సంధ్య చేసేవాడిని. కనుక గోత్రనామం నాకు చిరపరిచితమే. అయినా ఆయన ప్రశ్న నాకు చిరాకెత్తించింది. బ్రాహ్మణుడిని కనుక, తన యింటి పేరు వాడిని కనుక తన వోటు నాకు యివ్వాలనుకున్నాడు. అయితే యింకా తరచి ఏ గోత్రపు వాడో తెలుసుకోదలిచినాడు. ఆనాటికి నేను హైందవాన్ని వదిలేశాను. జంధ్యం లేదు. సంధ్య వార్చన చేయడం లేదు. కులం పేరు చెప్పడం మానివేశాను. 'మీ కులం ఏమిటండీ?' అని అడిగిన వారికి 'నాకు కులం లేదు' అని జవాబు చెప్పేవాడిని. ప్రశ్నించేవారు అతి తెలివిగా 'మీ నాన్నగారి కులమేది?' అని అడిగేవారు. అసత్యం చెప్పటం యిష్టం లేక, జవాబు చెప్పక పోవడం అమర్యాద అవుతుంది కనుక 'ఆయన బ్రాహ్మణులు' అనేవాడిని. అలా వారికి కావలసిన సమాచారాన్ని వారు సేకరించ కల్గేవారు. ఈ ప్రశ్నలూ, జవాబులూ నాలో అశాంతిని ప్రకోపింప చేసేవి. ఇక ఆ ప్లీడరు గారి ప్రశ్నకు 'నాకు తెలియదండీ' అని సమాధానం చెప్పాను. ఆయన 'అలాగా' అని తలపంకించాడు. వాకిట్లోకి నడిచాను. 'ఒక వోటు పోగొట్టుకున్నావు' అని మందలించే ధోరణిలో పలికాడు మిత్రుడు. 'పోతే పోయిందిలే. అప్రతిష్ఠ లేకుండా బయటపడ్డాం' అన్నాను.

ముందుగా అడిగినవాడని, బంధువని, తన కులం వాడని, తనకు యితర కారణాల వల్ల మొగమాటస్తుడిని యిలా వోట్లిచ్చే విద్యావంతులు, పట్టభద్రులు సామాన్య వోటర్లకన్నా మెరుగయిన వారు కాదని గ్రహించాను.

# ఎన్నికలలో అభ్యర్థులు

చాలామంది పంచాయితీలలో, మునిసిపాలిటీలలో జరిగే ఎన్నికలలో పోటీ చేస్తుంటారు. ఈ ఎన్నికలలో పోటీచేసేవారు - కమ్యూనిస్టు పార్టీల వారు తప్ప పార్టీలపరంగా నిలుచోరు. వారంతా కాంగ్రెసు, యితర పార్టీలకు చెందినా స్వతంత్ర అభ్యర్థుల క్రిందనే లెక్క. వారు నిజమైన స్వతంత్రులు కారు. వారిలో చాలామంది అభ్యర్థులుగా రూపొందటానికి అనేక అంశాలు దోహదం చేస్తవి. వారిలో చాలామందికి స్థానిక సంస్థల శాసనాలు, వాటి కార్యకలాపాల తీరు, పంచాయితీ మునిసిపాలటీల అధికారాలు, బాధ్యతలు, సభ్యుల హక్కులు ఏమీ తెలియవు. మరి వారు ఎందుకు అభ్యర్థులుగా ముందుకు వస్తున్నారు? ప్రతి వ్యక్తి తోటివారి గుర్తింపును ఆశించటం సహజం. ఎన్నికలలో అభ్యర్థి కాస్త నాయకుడయితే, కాస్త ధనవంతుడయితే, కొంచెం శబ్దం చేయగలిగిన వాడయితే గుర్తింపు తప్పక వస్తుంది. అందుకే వారికి అంత తహతహ. ఇకపోతే యితర కారణాలను గురించి కూడా పోటీ చేసేవారు లేకపోలేదు. నాకు తెలిసిన ఒక సంఘటన వివరిస్తే ఈ అంశం సుస్పష్టమవుతుంది.

బాపట్లలో ఇంటర్మీడియటు, బి.ఎ. దాకా చదివి ఉద్యోగాలు చేయకుండా పెద్దలు సంపాదించిన ఆస్తులపై వచ్చే ఆదాయంతో జీవించేవారు కనీసం 30, 40 మంది ఉంటారు. ఉబుసుపోక వారు రాత్రి వీధి అరుగుల మీద కూర్చొని బాతాఖానీ సాగించడం పరిపాటి. ఒకనాడు అలా పదిమంది ఒకచోట చేరి పిచ్చాపాటి మాట్లాడుతున్నారు. ఒకడు రాబోయే మునిసిపలు ఎన్నికలలో నేను నా 9వ వార్డు నుండి పోటీ చేస్తానన్నాడు. మరొకడు నా 6వ వార్డు నుండి అభ్యర్థిగా వుంటానని చెప్పాడు. వారి మాటలు వింటూ వుంటే వారంతా తల్లి గర్భంలో నుండి వచ్చేటప్పుడు ఆయా వార్డులలో మునిసిపలు కౌన్సిలరుగా ఉద్భవించారా అని తోస్తుంది. ఈ మాటలు విన్న యువకుడు గుర్రాజారావు తను నివసిస్తున్న 12వ వార్డు నుండి పోటీ చేస్తానన్నాడు. అతడు అలా అనంగానే అక్కడ చేరినవారంత ఒక్కసారిగా నవ్వారు. అతనికి అంతకు క్రితం ఏ ఎన్నికలతో సంబంధం లేకపోవటమే వారి అపహాస్యానికి కారణం. గుర్రాజారావుకు ఉక్రోషం వచ్చింది. 'పోటీ చేసి తీరుతాను' అన్నాడు. అక్కడ ఉన్నవారంతా కలిసి చదువుకున్న వారు కావటం చేత 'ఏడ్చేవులేరా! నీకు మునిసిపలు కౌన్సిలు సభ్యత్వమా' అని ఎద్దేవా చేశారు. అతనికి అరికాలి మంట నెత్తికొచ్చింది. 'చూడండి నా అభ్యర్థిత్వం తప్పదు' అని వారిని సవాలు చేశాడు.

ఎన్నికల తేదీ ప్రకటించారు. నామినేషన్లను వేయమన్నారు అధికారులు. ఒక సడివయస్సు స్త్రీ గుర్రాజారావును తన భర్తకు దత్తు చేసుకున్నది. ఆ కుటుంబానికి ఆస్తికి కొదవలేదు. గుర్రాజారావు 12వ వార్డుకు నామినేషను వేశాడు. ఒక ఎకరం మాగాణి అమ్మాడు. విక్రయ ధనం నాల్గువేలు - ఆనాడు అది పెద్ద మొత్తం క్రింద లెక్క- చేత బట్టుకున్నాడు. ఇంకా అనేకులు అభ్యర్థులుగా తయారయ్యారు. చివరకు ముగ్గురు మిగిలారు. వారు బ్రాహ్మణ, వైశ్య, తెలగ కులాలకు చెందినవారు. గుర్రాజారావు బ్రాహ్మణ కులస్థుడు. ఎవరి కులపు అభ్యర్థిని ఆ కులపువారు బలపరిచారు. ఆ కులాల పెద్దలు పోలింగు బూతుల వద్ద తిష్టవేసి తమ తమ అభ్యర్థులకు

వోట్లు వేయించారు. గు[రాజారావు గెలుపొందాడు.

మునిసిపలు కౌన్సిలులో కమ్యూనిస్టు, కమ్యూనిస్టేతర వర్గాలు ఏర్పడినయి. ఇరువురు సమఉజ్జీలుగా వున్నారు. ఒక్క గు[రాజారావే ఏ వర్గానికి చెందని మనిషి. అంత కమ్యూనిస్టులు అతనిని ఉపాధ్యక్ష పదవికి అభ్యర్థిగా ఎంపికచేసి గెలిపించుకున్నారు. అతడు మునిసిపలు కౌన్సిలు ఉపాధ్యక్షుడయ్యాడు. మునిసిపలు కౌన్సిలు సమావేశం ఉన్న ఒక రోజున గు[రాజారావు నాకు వీధిలో తటస్థపడ్డాడు. కౌన్సిలు సమావేశానికి పోలేదేమని అడిగాను. 'నా యిష్టం. నేను పోతే పోతాను లేకపోతే లేదు. నన్ను ఎవరూ శాసించటానికి వీలులేదు' అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను. 'అదేమిటి' అన్నాను. నేను నా సైకం పెట్టి వోట్లను కొనుక్కున్నాను. నేను ఎవరికీ రుణపడి వుండనక్కర లేదు అని జవాబు చెప్పాడు. ఈ సమాధానం నన్ను దిగ్భ్రాంతికి లోను చేసింది. 'ఎన్నిక తేదీన బ్రాహ్మణ ప్రముఖులు అందరూ - ప్లీడర్లు, ఉపాధ్యాయులు, భూస్వాములు, ఉద్యోగస్తులు - నిన్ను బలపరచి గౌరవించారు కదా?' అని ప్రశ్నించాను. వారెవరూ నాకు ఉచితంగా సహాయం చెయ్యలేదు. వారికి ఆదరణీయమయిన సత్యనారాయణ స్వామి దేవాలయానికి 5 వందల రూపాయల విరాళం యిచ్చాను. దానికి ప్రతిఫలంగా వారు నాకు మద్దతు యిచ్చారు' అని విశదీకరించాడు. ఈ ప్రత్యుత్తరానికి నేను విస్రబ్ధుడనయినాను. తీరికగా ఆలోచిస్తే అతని మాటలలో ఎంతో సత్యం వున్నదని భావించాను. ఎన్నికలలో కులం పనిచేస్తుంది. శాఖ ఉపకరిస్తుంది. అన్నింటికన్నా మిన్న వోటరుకు కల్గించే లబ్ధి ప్రధాన పాత్ర వహిస్తుంది. దేవాలయాలకు, చర్చిలకు, మసీదులకు, ఎన్నికల సమయాల్లో అభ్యర్థుల నుండి అయాచితంగా విరాళాలు అదేపనిగా వచ్చిపడతాయి. వీటిని గుర్తు పెట్టుకుంటారు వోటరు 'మహాశయులు' ఈ తంతును గమనిస్తే దేవాలయాలు, మసీదులు, చర్చిలు వీటిమీద గౌరవ ప్రపత్తులున్న పౌరులు అలా విరాళాలిచ్చిన అభ్యర్థులకు తమ వోట్లను యిచ్చిన సందర్భంగా మరో రకంగా లంచానికి లొంగి పోయినట్లు భావించవలసి వస్తున్నది.

గు[రాజారావు కథ మూడు అంశాలను వెలికి తీస్తున్నది. తోటివారు లేక ఎదురు మతాలవారు, లేక ప్రతిపక్ష గ్రామ పార్టీల వారు వద్దంటే పట్టుదలగా అభ్యర్థులుగా నుంచోవడం జరుగుతుందనేది ప్రథమ అంశం. కులాన్ని బట్టి తమ అభిమాన సంస్థకు విరాళాలను యివ్వడాన్ని గమనించి అభ్యర్థులను వోటరు 'మహాశయులు' బలపరచడం జరుగుతుందనేది ద్వితీయ అంశం. గుణగణాలతో, గత చరిత్రతో, అర్హతతో నిమిత్తం లేకుండా రాజకీయవాదులు వ్యక్తులను పదవులలోకి ఎన్నుకోవటం సంభవిస్తుందనేది మూడవ అంశం. ఈ అంశాన్ని వోటరు, పౌరులు, రాజకీయవాదులు గ్రహించవలసిన గుణపాఠాలు.

# పదవులను వదిలివేయటం

## ఒక కళ

పదవులను ఆశించటం ఎంత సహజమో వాటిని సకాలంలో వదలివేయటం కళ క్రింద లెక్క. ఈ పచ్చి నిజం చాలామందికి తెలియదు. పదవి వచ్చిన తరువాత అదే పనిగా దానిని అంటిపెట్టుకున్న వ్యక్తులు ఎదగలేరు. దానిని సరి అయిన సమయంలో వదలివేసిన వ్యక్తులు అంచెలంచెలుగా ఉన్నత పదవులను చేపట్టగలరు. నీలం సంజీవరెడ్డి గారి జీవిత గాథయే దీనికి దృష్టాంతరం.

ఈ సర్వ సాధారణ సత్యాన్ని శ్రద్ధగా పాటించని వారు కష్టనష్టాల పాలవుతారు. అలాంటి సంఘటనలను నా ఎరుకలోని వాటిని – ఉటంకిస్తాను. నా మేనమామ రెండవ కుమారుడు శ్రీ యడవల్లి సూర్యనారాయణ గురించి యింతకు క్రితం ప్రస్తావించాను కదా? అతడు కార్యశీలి. చేపట్టిన కార్యాన్ని సానుకూలం చేయగల దిట్ట. బాపట్లలో పురాతనమయిన పుర మందిరం వుంది. ఇండియాకు సార్వభౌముడయిన ఏడవ ఎడ్వర్డుకు పట్టాభిషేకం చేసిన కాలపుది. అంటే ఈనాటి బ్రిటిషు రాణి ఎలిజిబెత్ తండ్రి తండ్రి అతడు. దానికి యడవల్లి సూర్యనారాయణ కార్యదర్శి అయినాడు. దానికి వున్న రెండెకరాల స్థలం చుట్టూ ప్రహరీ గోడ కట్టించాడు. బహిరంగ నాటక ప్రదర్శన శాలను నిర్మించాడు. ఈ పనుల వల్ల అతనికి మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. రెండుసార్లు ఆ పదవికి ఎన్నికయ్యాడు. అందరూ అతడే కావాలని ఎంపిక చేసుకున్నారు. ఒకనాడు పుర మందిరం తాలూకు ఎన్నికల తేదీలను ప్రకటించారు. అతని మిత్రుడు ఒకతను కార్యదర్శి పదవికి పోటీ చేయతలచుకొని తమ అందరికీ ఆ విషయం తెలియజేశాడు. అయితే, శ్రీ సూర్యనారాయణకు మాత్రం చెప్పలేదు. సూర్యనారాయణకు కోపం వచ్చింది. 'వాడు నన్ను కాదనే వాడా?' అని నా ఎదుట వెఱ్ఱపడ్డాడు. 'రెండు పర్యాయాలు ఆ పదవిని అలంకరించి మంచివాడని పేరు తెచ్చుకున్నావు. ఇప్పుడే పదవీ విరమణ చేయడం మంచిది. నీవు పోటీలోకి దిగటం యుక్తం కాదు' అని హితవు చెప్పాను. నా సలహా అతగాడికి రుచించలేదు. 'వాడు నన్ను కాదంటే నేను ఊరుకుంటానా' అంటూ పోటీకి దిగాడు. అంతకు ముందు తను చేసిన మంచి పనుల ఫలితంగా తను గెలిచాడు. గెలిచిన తర్వాత ఆ పదవిపై శ్రద్ధ పోయింది. కార్యభారాన్ని మరొక వ్యక్తికి అప్పగించాడు. ఆ వ్యక్తి చర్యల వల్ల సూర్యనారాయణ అప్రతిష్ట పాలయినాడు. చివరకు సభ్యులు అతనిని రాజీనామా చేయమనేదాకా వచ్చారు. నా వద్దకు వచ్చి అతని చేత మీరు రాజీనామా చేయిస్తే వ్యవహారం సాఫీగా జరిగి పోతుందన్నారు. నేను 'అతనికి యిక సలహా చెప్పను' అని కలుగు చేసుకొనటానికి నిరాకరించాను. చివరకు సర్వసభ్య సమావేశం జరిపి సూర్యనారాయణను పదవి నుండి తొలగించారు. మొదట్లో నా సలహా పాటించి సూర్యనారాయణ తిరిగి పోటీ చేయకుండా వుంటే ఎంత బాగుండేది.

పైన చెప్పిన కథ లాంటిదే 'తూర్పు సత్రం' వ్యవహారంలో జరిగింది. సూర్యనారాయణ ఆ ధర్మ సంస్థకు మేనేజింగు ట్రస్టీగా ఎన్నుకోబడినాడు. శిథిలమయిన

భవనాన్ని మరమ్మతు చేయించాడు. అదనపు సౌకర్యాలు కలుగజేయటానికి భవనాన్ని పెంచాడు. కర్మకాండలు చేసుకొనటానికి అవకాశాలు ఎక్కువ చేశాడు. పుర ప్రజలలో మంచి ఖ్యాతి వచ్చింది. అతనిని పౌరులు మెచ్చుకున్నారు. పదవీ పరిమితి అయిపోయింది. తిరిగి ఆ పదవిని ఆశించవద్దని సలహా చెప్పాను. 'వాడు పదవులను ఆశించడు. అందరినీ పదవులను వదులుకోమంటాడు' అని యితరుల ఎదుట ఎద్దేవా చేశాడు. నా కెందుకని మిన్నకున్నాను. మరల పోటీకి దిగాడు. ఎన్నికలు టక్కుటమార గోకర్ణ విద్యలకు అలవాలం కదా! ఓడిపోయాడు. నిజానికి సూర్యనారాయణ ప్రజ్ఞాశాలి. మంచి పనులు చేయగల వ్యక్తి కాని ఏ కారణం వల్లనైతేనేమి పదవిని వదలలేని బలహీనత అతనిది. ఈ విషాదాంత సంఘటనలను విశదీకరించటం అతనిని చెడ్డవాడని చిత్రీకరించటానికి కాదు. అతని లోపాన్ని వివరించటానికే. ఆ లోపం సర్వ సామాన్యమని తెలియజెప్పటానికే. అలాంటి లోపభూయిష్ట ప్రవర్తనను తదితరులు చేపట్టరాదని హెచ్చరించటానికి ఈ ఉదంతాలను ఏకరువు పెట్టటం సంభవించింది.

మంచి పేరు వున్నపుడే పదవీ విరమణ చేయాలన్న సూత్రాన్ని నేను అనేక ప్రజా సంఘాలలో పనిచేసినపుడు నా వ్యక్తిగత జీవితంలో అమలుపరిచాను. ఒకనాడు నేను ఏక కాలంలో సుమారు పది పదవులలో వున్నానని చెప్తే అందరూ ఆశ్చర్య పోతారు. ఆనాడు నాకు వున్న శక్తి, కార్యదీక్ష, ఓపిక, ఓర్పు నాకు అండగా నిలిచిన లక్షణాలు. న్యాయవాది సంఘ కార్యదర్శి. పట్టణ సహకార బ్యాంకు డైరెక్టరు, హైస్కూలు పూర్వ విద్యార్థి సంఘ కార్యదర్శి, పౌర సంక్షేమ సంఘ ఉపాధ్యక్షుడు, సూర్యలంక రేవు అభివృద్ధి సంఘాధ్యక్షుడు, అన్నవరపు వారి బడి మేనేజరు – కార్యదర్శి, పురమందిరంలోని గ్రంథాలయ పర్యవేక్షకుడు, 'కళావని' నాటక సంఘ కార్యదర్శి, పుర మందిరంలోని 'టెన్నిసు కోర్టు' నిర్వాహకుడు. 'కాలేజి కమిటీ' సభ్యుడు యిలాంటివి. ఈ పదవులను ఒక గడువుకు నిర్వహించి 'వ్యథ' లేకుండా తప్పుకోగల్గాను. అంటే నేను చేసిందే యితరులకు సలహా చెప్పాను కాని ఇతరులకు యిచ్చిన సలహాకు నా ప్రవర్తనకు ఏనాడూ వైరుధ్యం రానివ్వలేదని 'సగర్వంగా' చెప్పుకోగలుగుతున్నాను.

# రాజకీయ కార్యకర్తలలో నా బంధువులు

రాజకీయాలలో వున్న నా బంధువుల కథలు ఆసక్తిదాయకాలు. నా వేలు విడిచిన మేనమామ కప్పగంతు వెంకట సుబ్బయ్యగారని యింతకు పూర్వం తెలియజేశాను. ఆయన కాంగ్రెసు అభిమాని. ఆయన రెండవ కుమారుడు కప్పగంతు శ్రీరామమూర్తి. యువకుడుగా హడావుడి మనిషి. నిరుద్యోగి. చిన్నతనంలో తండ్రికి వ్యథకల్గించిన వ్యక్తి. 1930 కాంగ్రెసు ఉద్యమం వచ్చింది. వెనుక ముందు ఆలోచించకుండా ఉద్యమంలోకి దూకాడు. అరెస్టు అయినాడు. ఒకటిన్నర సంవత్సరం జైలులో వున్నాడు. అతని శిక్ష తాలూకు కథ తమాషాగా వుంటుంది. శ్రీరామమూర్తిని అరెస్టుచేసి విచారణకు సబ్ కలెక్టరు కోర్టుకు హాజరు పరిచారు. ఆనాడు సబ్ కలెక్టరు 'డివిజనల్' మేజస్ట్రేటుగా వ్యవహరించేవాడు. అతడు మొదటి తరగతి మేజస్ట్రేటు. అంటే నేరానికి 2 సంవత్సరాలు శిక్ష వరకు వేయు అర్హత, అధికారం కలవాడు. శ్రీరామమూర్తిని మేజస్ట్రేటు సానుభూతిగా చూచాడు. తప్పదు కనుక అతనికి 6 నెలలు జైలుశిక్ష వేద్దామని తలచాడు. 'నీవు ఏమయినా చెప్పుకుంటావా?' అని ఆదరంగా అడిగాడు. 'నీవు బ్రిటిషువారి తొత్తుగా తయారవడానికి ఐ.సి.ఎస్. పరీక్షకు చదువుతున్న రోజుల్లో నేను మహాత్మాగాంధీ అనుచరుణ్ణి. కాంగ్రెసు కార్యకర్తను' అన్నాడు. దానితో కోపగించుకున్న ఆ మేజస్ట్రేటు అతనికి 18 నెలల కారాగారవాస శిక్ష విధించాడు.

కప్పగంతు శ్రీరామమూర్తి అతివాది కనుక తను ఫార్వర్డు బ్లాకులో చేరాడు. తరువాత ఫార్వర్డు బ్లాకు 7 రోజులు సత్యాగ్రహం చేసింది. దానిలో శ్రీరామమూర్తి పాల్గొన్నాడు. మొదటి బ్రిటిషు సామ్రాజ్య వాదాన్ని దుయ్యబట్టాడు. అతనిని అరెస్టు చేయలేదు. రెండవ రోజున గాంధీజీ శిష్యులయిన దక్షిణపక్ష కాంగ్రెసు నాయకుల రాజీ విధానాలను ఖండించాడు. మూడవ రోజున రాష్ట్ర గవర్నరును, జిల్లా కలెక్టరును తీవ్ర పదజాలంతో నిందించాడు. అప్పటికీ పోలీసులు ఉలకలేదు; పలకలేదు. నాలుగవ రోజున 'ఈ ఊరిలో సర్కిల్ ఇన్‌స్పెక్టరు వున్నాడా? వాడికి సిగ్గూ ఎగ్గూ వుందా? మా తీవ్రమైన దూషణను ఎలా భరిస్తున్నాడు? ఛీ ఛీ! చీమూ నెత్తురు వున్న మనిషేనా! బ్రిటిషు ప్రభుత్వ తాబేదారులకు మానాభిమానాలు వుండవు.' అని అన్నాడు. అప్పుడు పోలీసు- సబ్ ఇన్‌స్పెక్టర్ వచ్చి అరెస్టు చేశాడు. శ్రీరామమూర్తి ఆశయం సిద్ధించింది. అరెస్టు కాగలిగాడు. మరల 6 నెలల కారాగారవాసం అతనికి లభించింది.

నా బంధువులలో మరో రాజకీయవాది చివుకుల శేషశాస్త్రి. అతడు మా మేనమామ భార్య చెల్లెలు కుమారుడు. అతడు కమ్యూనిష్టు. అతని ప్రథమ సభా పరిచయాన్ని గురించి ఒక గాథ ప్రచారంలో వుంది. కప్పగంతు శ్రీరామమూర్తి మాట్లాడిన ఒక రాజకీయ సభలో ప్రసంగించ లేచాడట శేషశాస్త్రి. 'సోదరులారా!' అని సంబోధించాడట, కాళ్ళు వణికాయట. మేనంతా చెమట పట్టిందట. చివరకు ధైర్యం చిక్కబట్టుకొని 'సోదరులారా!' మా అన్నయ్య చెప్పేదే నేను చెప్పేది'

అని ఉపన్యాసం ముగించాడట. అలాంటి శేషశాస్త్రి స్వయంకృషితో, పట్టుదలతో కమ్యూనిష్టు పార్టీ తాలూకా ఆర్గనైజరు అయ్యాడు. చక్కని వక్తగా రూపొందాడు. ప్రజలకు తలలో నాలుకలా మెలిగేవాడు. పాటకపు జనానికి చాల ఆప్తుడయినాడు. అవి 1940 సంవత్సరం చివరి రోజులు. ఎం.ఎన్. రాయ్ అనుచరులు ద్వితీయ ప్రపంచ యుద్ధ ప్రయత్నాలకు పాయించేసే రోజులు. కమ్యూనిష్టులు బ్రిటిషువారు చేసే యుద్ధాన్ని వ్యతిరేకించే కాలం. ఒకరోజు శేషశాస్త్రి నా వద్దకు వచ్చాడు. 'రామమూర్తీ! మన బంధువులం రాజకీయాలలో పనిచేస్తున్నాం. కప్పగంతు శ్రీరామమూర్తి ఫార్వర్డు బ్లాకులో వున్నాడు. యడవల్లి సూర్యనారాయణ జాతీయ విద్యార్థి. నేను పరేసరి కమ్యూనిష్టును. నీవు బ్రిటిషు ప్రభుత్వ యుద్ధానికి అనుకూలంగా వుండటం ఏమీ బాగాలేదు' అన్నాడు. శాంతంగా కూర్చోమని కొంత నా రాజకీయ వైఖరి వివరించి నా పార్టీ మౌలిక రచన 'భారతదేశం యుద్ధం' అనే పేరుగల వ్యాసాన్ని చదివి నాతో చర్చించమన్నాను. పుస్తకం యిచ్చాను. మరల 6 నెలలకు కనిపించాడు. 'చదివావా వ్యాసం?' అని అడిగాను. 'చదవలేదు ఆ పుస్తకం పోయింది' అని జవాబు చెప్పాడు. ఫరవాలేదని చెప్పి అదే పుస్తకం మరో దానిని యిచ్చాను. తరువాత మరల కలిశాం. అప్పటికి కమ్యూనిష్టులు యుద్ధానికి అనుకూలురు కాలేదు. యుద్ధ ప్రయత్నాలను నిరసిస్తూనే వున్నారు. 'శేషశాస్త్రి చదివావా నేను యిచ్చిన పుస్తకాన్ని?' అని ప్రశ్నించాను. పార్టీలో పని ఎక్కువయినందు వల్ల తీరిక దొరకలేదు' అని సమాధానం చెప్పాడు. విస్తుపోయాను. ఈ విషయాన్ని మరొక మిత్రునితో నేను ప్రస్తావిస్తే అతడు మరో సాహిత్యాన్ని, సిద్ధాంతాలను అధ్యయనం చేయనీయకుండా పార్టీ వారికి మిక్కుటమయిన పని యిస్తుంది. పార్టీ సభ్యులు యిటూ అటూ తొణకకుండా పార్టీ పంథాను అనుసరింప చేయటానికి యిదే మార్గం. ఆనాడు అతని మాటలలో సత్యం నాకు గోచరించింది. పని, ఊపిరిసలపని కార్యక్రమాలు యివి తాలూకా పార్టీ ఆర్గనైజరు 'డ్యూటీలు'. ఈ విధి నిర్వహణలో ఆనాడు మేధస్సుకు సంబంధించిన కృషి చెయ్యడానికి వారికి అవకాశాలు లేవు.

శేషశాస్త్రి మరణం ఒక విషాద సంఘటన. శేషశాస్త్రి కార్యదీక్ష, చిత్తశుద్ధి, నిజాయితీ అందరినీ ఆకర్షితులను చేసేవి. కాంగ్రెసు నాయకుడు మంతెన వెంకట రాజుగారికి అతడంటే అభిమానం. కమ్యూనిష్టులు రణదివే పంథాను అనుసరించి ఆనాటి ప్రభుత్వానికి (1949) ఎదురు తిరిగిన కాలం అది. క్యాంపులో పెట్టి బాధిస్తున్నారట. ఈ విషయం తెలిసి వెంకట రాజుగారు శేషశాస్త్రి వద్దకు వెళ్లి 'నీవు రాజకీయాల నుండి విరమిస్తే నిన్ను నేను రక్షిస్తాను' అని అన్నారట. శేషశాస్త్రి వెంకట రాజుగారిని తీవ్ర పదజాలంతో తిట్టి ఆ ప్రతిపాదనను తిరస్కరించాడట. తరువాత రెండు రోజులకే అతనిని కాంగ్రెసు ప్రభుత్వ పోలీసులు కాల్చివేశారు. ఈ వార్త విన్న రాజకీయాలతో సంబంధం వున్నవారు, శ్రామికులూ అందరూ శోకతప్తులయినారు. శేషశాస్త్రి రాజకీయ కథ యిలా పరిసమాప్తమయింది.

# పార్టీరహిత ప్రజాస్వామ్య మహాసభ (1966)

ఒకరోజు గోరాగారు బాపట్ల వచ్చారు. గోరాగారి పేరు ప్రఖ్యాతులు వినడం, వారి చరిత్ర, వారి కార్యకలాపాలు తెలిసి వుండడం వలన వారిని సగౌరవంగా ఆహ్వానించాను. 'విజయవాడలో రాష్ట్ర పార్టీ రహిత మహాసభను ఏర్పాటు చేస్తున్నాను. మీరు అధ్యక్షులుగా వుండాలి అన్నారు గోరాగారు'. నేను అర్హుడను కాను, మరొకరి పేరు సూచిస్తాను' అన్నాను. నేను ఆవుల గోపాల కృష్ణమూర్తి పేరు సూచించ పోతున్నానని ఆయన గ్రహించారు. 'మీరు వుంటే వుండండి మరొకరి పేరును చెప్పవద్దు' అన్నారు గోరాగారు. క్షణం ఆలోచించాను. 'పూర్వం 5 సంవత్సరాలు రాడికల్ డెమొక్రాటిక్ పార్టీలో పూర్తి కాలాన్ని వినియోగించే కార్యకర్తగా వున్నాను. ఇపుడు ప్లీడర్ వృత్తి చేసుకుంటూ కొంత కాలమే ఉద్యమానికి పనిచేస్తున్నాను. 3, 4 సంవత్సరాలలో ప్లీడరీని వదిలివేసి పూర్తికాలాన్ని సంఘసేవకు వాడాలని అభిలాష పడుతున్నాను' అని విశదపరిచాను. ఆయన వెంటనే 'ఆ సదుద్దేశం మీకు వుంటే చాలు. అందరూ వెన్వెంటనే పూర్తికాలాన్ని ఉద్యమాలకు వినియోగించడం కుదరక పోవచ్చును. ఎప్పటికయినా పూర్తి సమయాన్ని ఉద్యమాలకే అంకితం చేద్దామని మీకు కోరిక వుంది కదా. చాలు, మీకు మహాసభకు అధ్యక్షత వహించటానికి అర్హత అదే' అన్నారు గోరాగారు. వారి ప్రోత్సాహ వాక్యాల వల్ల నాకు ఉత్తేజం కల్గింది. అధ్యక్షుడుగా వుండటానికి అంగీకరించాను.

ఇక్కడ పార్టీ రహిత ఉద్యమాన్ని గురించి, దాని విషయమయి ఎం.ఎన్. రాయ్, గోరా వైఖరుల గురించి కొంత ప్రస్తావించవలసి యున్నది. ఇరువురూ పార్టీల వునికి వున్న ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాన్ని నిరసించే వారే. పార్టీలు ప్రజలకూ, ప్రభుత్వాలకు మధ్య దళారులని అభిప్రాయపడేవారు. ఆర్థికరంగంలో వ్యక్తిగత వ్యాపారం చేసేవారు దళారులని, వారి ఉనికి నిరుపయోగమని తలచినట్లుగా రాజకీయ రంగంలో పార్టీల ఉనికిని దళారుల అస్తిత్వంతో పోల్చి కాదనేవారే. అయితే తాత్విక రీత్యా కొన్ని విభేదాలు వున్నాయి. గోరాగారు అందరిని 'నిల్చోండి! పార్టీ రహిత దృష్టితో నిల్చోండి. నియోజక వర్గంలో ఎంతమందయినా అభ్యర్థులుగా వుండవచ్చు' అనేవారు. ఎం.ఎన్. రాయ్ దృష్టిలో యీనాటి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం లోపభూయిష్టం. దానిని మెరుగుపరిచేది నిర్మాణ ప్రజాస్వామ్యం లేక సంఘటిత ప్రజాస్వామ్యం (ఆర్గనైజ్‌డు డెమోక్రసీ) మాత్రమేనని ఆయన భావం. అభ్యర్థులని నిలబెట్టేది ప్రజా సంఘాలని లేక గ్రామ పంచాయితీలని రాయ్ ఆలోచన. గోరాగారి ఆలోచన తద్భిన్నం అని చెప్పనవసరం లేదు.

1948 నుండి పార్టీ రహిత ప్రజాస్వామ్యం లక్షణంగా ప్రజల సంఘటిత ప్రజాస్వామ్యాన్ని గురించి రాడికల్ హ్యూమనిష్టులు ప్రచారం చేస్తున్నారు. కాని వారు అలాంటి ప్రజా సంఘాలను నిర్మించ లేకపోయారు. అది వారి బలహీనత. అయితే, పార్టీ రహిత ఉద్యమంతో సన్నిహిత సంబంధం కలిగి కొంత కాలం భాగస్వామ్యం కలిగిన గోరాగారు పార్టీ రహిత ఉద్యమాన్ని ఎత్తుకోవటంలో ఆశ్చర్యం

లేదు. పార్టీ రహిత స్వరూపాన్ని ప్రజలకు సుబోధకంగా ఎరుకపరిచే నిమిత్తం ఆయన క్రొత్త విధానాన్ని చేపట్టారు. అన్ని పార్టీల జెండాలు తీసుకొని వాటితో జెండా లేని కర్రను ఒకదానిని కలిపి విజయవాడ నుండి ఢిల్లీ వరకు పాదయాత్ర చేశారు. జెండాకర్ర జెండాకు ఆధారమయినట్లు ప్రజలు పార్టీలకు ఆధారంగా వున్నారని, ప్రజలు సర్వ సత్తాకతను, సార్వభౌమత్వాన్ని పార్టీలు సమ్మకచేసేవిగా తయారయ్యారని ఆయన బహుళంగా ప్రచారం చేశారు. 1952 పార్లమెంటు ఎన్నికలలో స్వతంత్ర అభ్యర్థిగా విజయవాడ నియోజక వర్గంలో పోటీచేశారు. డప్పుకొడుతూ పార్టీ రహిత ప్రజాస్వామ్య అవసరాన్ని ప్రజలకు తెలియజెప్పారు. ఇన్ని కార్యకలాపాలు, ఇంత చరిత్ర ఉన్న గోరాగారు పార్టీ రహిత ప్రజాస్వామ్య మహాసభను జరిపించ పూనుకోవడం సమంజసంయుక్త కూడాను.

పార్టీ రహిత మహాసభలో గోరాగారి అభ్యర్థనపై శ్రీ ఆవుల గోపాల కృష్ణమూర్తి ప్రారంభోపన్యాసం చేశాడు. చక్కని విశ్లేషణతో కూడిన ఉపన్యాసం అది. నా అధ్యక్షోపన్యాసాన్ని ఇంగ్లీషులో అచ్చువేసి తీసుకొని వెళ్ళాను. సభికులు ఆసక్తికరంగా విన్నారు. ఈ మహాసభ వార్తలను అన్ని పత్రికలూ అచ్చువేశాయి. విజయవాడ పత్రికల కేంద్రం అవటంతో నా పేరు పత్రికా చదువరులకు బాగా పరిచయం అయింది. అంతకు క్రితం ఇండియన్ ఎక్స్ప్రెస్ దినపత్రిక లేఖలను చదివేవారికి, రాజకీయాలతో పరిచయం ఉన్నవారికి మాత్రమే తెలిసిన నా పేరు పత్రికలలో వార్తలు చదివేవారికి బాగా తెలిసింది. రాష్ట్రస్థాయికి వచ్చాను.

1967లో పార్లమెంటుకు అసెంబ్లీకి ఎన్నికలు వచ్చాయి. పార్టీ రహిత అభ్యర్థులుగా నేను పార్లమెంటుకు, తను విజయవాడ తూర్పు అసెంబ్లీ నియోజక వర్గానికి పోటీ చేయాలని గోరాగారు ప్రతిపాదించారు. అభ్యర్థులను నిలుచోబెట్టి, మనం బలపరుద్దామని అన్నాను. నీవు చేయతలచిన పనికి యితరులను ఎలా పురిగొల్పగలవు అని గోరాగారు ప్రశ్నించారు. ఆ ప్రశ్న సమంజసంగా నాకు తోచింది. వెంటనే పార్టీ రహితం, ఎన్నికలు, గోరా ఎం.ఎన్. రాయ్ అనే పేరుతో సమీక్ష అనే రాడికల్ హ్యూమనిస్టు పత్రికలో వ్యాసం రాశాను. నేను ఒంగోలు పార్లమెంటరీ నియోజక వర్గంలో పోటీకి దిగాను. గోరాగారు విజయవాడ తూర్పు అసెంబ్లీ నియోజక వర్గంలో అభ్యర్థిగా నిలబడ్డారు. ఇరువురము పార్టీ రహిత ఉద్యమాన్ని బలపరిచే స్వతంత్ర అభ్యర్థులమే.

ఇరువురం గట్టిగా కృషి చేశాము. నియోజక వర్గం ఎంత చిన్నదయితే అంతగా వోటర్లపై ఒత్తిడి ఎక్కువ అవుతుంది. ప్రతి అభ్యర్థి ప్రతి ఓటుకోసం ఎంతో పట్టుదలగా పాటుపడతాడు. గోరాగారు ఎంతోగా వోటర్ల గౌరవాభిమానాలకు పాత్రుడయినా, ఎలాగూ గెలిచే అభ్యర్థి కాదు కనుక ఆయనకు వోటు వేసి తమ వోటును వ్యర్థపరుచు కోడానికి పలువురు ఇష్టపడలేదు. ఆ సందర్భంలో ఆయనకు సుమారు 600 వోట్లు వచ్చాయి. కేవలం సమన్యను ఆలోచించి వారికిచ్చిన వోట్లుకావు. అలాగయితే వారికి ఇంకా ఎక్కువ రావలసి వుండెను. గెలిచేవాడికి తమ వోటును యిచ్చి ఆ అభ్యర్థి విజయానికి తనే బాధ్యుడయినట్లు గర్వంగా భావించే పరిస్థితి వోటర్లది. ఇక నా విషయం. నేను పోటీ చేసిన పార్లమెంటరీ నియోజక వర్గంలో

పలుగురు అభ్యర్థులు, కాంగ్రెస్, కమ్యూనిస్టు మార్క్సిస్టు పార్టీలకు చెందిన వారు ముగ్గురు. నేను రాడికల్ హ్యూమనిస్టుగా పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించే స్వతంత్ర అభ్యర్థిని. అచ్చంగా పలుగురు అభ్యర్థులమే. ఆంధ్ర ప్రదేశ్‌లో యీ కాలంలోలాగా పార్లమెంటరీ నియోజక వర్గానికి 28, 32 మంది అభ్యర్థులు లేరు. అభ్యర్థిత్వాన్ని ఆటకాయ మనస్తత్వంతో ఆశించే వారు కాదు. పార్టీల ప్రతినిధులకు లక్షల సంఖ్యలో వోట్లు వస్తే నాకు 9990వోట్లు వచ్చాయి. ఆ ఎన్నికల తీరుతెన్నుల గురించి వేరేగా రాస్తాను.

# పార్లమెంటు అభ్యర్థి

ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో ఒంగోలు, బాపట్ల తాలూకాలు చేరి వున్నాయి. ఒకనాడు తెనాలి, బాపట్ల, రేపల్లె, ఒంగోలు తాలూకాలు బాపట్ల సబ్‌కోర్టు పరిధిలోనే తరువాత తెనాలి, రేపల్లె తాలూకాలకు తెనాలిలో సబ్ కోర్టు పెట్టారు. నేను ప్లీడర్ చేయటానికి బాపట్ల వచ్చే నాటికి బాపట్ల, ఒంగోలు తాలూకాలు రెండూ బాపట్ల సబ్ కోర్టు ప్రాంతంలోనే వుండేవి. సర్కారు జిల్లాలోని సబ్ కోర్టులో రూ. 3000 నుండి (ఈనాడు రు. 10వేల నుండి) ఎంత మొత్తపు విలువగల [illegible]నుదావా దాఖలు చేయవచ్చును. ఈ విషయం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే నా పేరు ప్లీడరుగా ఒంగోలు తాలూకాలో కూడా తెలిసినదే.

ముమ్మరంగా జరిగేది 'నామినేషనుల' ఘట్టం కదా! 'నామినేషను' వేయాలంటే అభ్యర్థి పేరు వోటర్ల జాబితాలో వుండాలి. నేనూ, శ్రీ కోన ప్రభాకర్ రావు వరుసగా పార్లమెంటు, అసెంబ్లీలకు 'నామినేషను' వేద్దామని అనుకుంటే తీరాచూస్తే మా పేర్లు వోటర్ల జాబితాలో లేవు. మా ప్రత్యర్థి రాజకీయ వర్గానికి చెందిన ఉపాధ్యాయుడు వోట్లను నమోదు చేసుకొనడానికి వచ్చిన ఫలితమది. చెరో అర్థ రూపాయి చెల్లించి మరల వోటు తెచ్చుకొన్నాం. నామినేషన్లను దాఖలు చేశాం.

గుర్రం గ్రుడ్డిదయినా దాణాకు లోపం లేదన్నట్లు నాకు నియోజక వర్గంలో బలం లేకపోయినా అభ్యర్థి చేయవలసిన పనులు లాంఛనప్రాయంగా చేశాను. పుస్తకం సైజు కరపత్రాలు 2 పుటలవి 30వేలు అచ్చు ఒత్తించాను. ఆ కాగితంలో నా ఎన్నికల ప్రణాళిక, నా సంక్షిప్త జీవిత విశేషాలు, నా ఫోటో ముద్రించాను. అదే సైజులో 10 పుటల కరపత్రం 10వేలు వేశాను. మిత్రుడు సి.హెచ్. రాజారెడ్డి నాకు కుడిభుజంగా కృషిచేశాడు. ఒక్కసారి 2 తాలూకాలలోని ఫిర్కా పట్టణాల్లో, గ్రామాల్లో మొత్తం సుమారు 21 రోజులు పర్యటన కార్యక్రమం వేశాడు. ఆయా గ్రామాల కూడలుల సభలు ప్రకటించాడు. ఉదయం 11 గంటలకు ఆ గ్రామం చేరేవాళ్ళం. సాయంత్రం 4 గంటల దాకా కరపత్రాలు పంచేవారం. ముఖ్యులను కలిసి వోట్లను అభ్యర్థించేవారం. సాయంత్రం సభ పెట్టేవారం. మా సభా కార్యక్రమం తమాషాగా వుండేది. ముందుగా నేను 1 గంట మాట్లాడేవాడిని. దేశ స్థితిగతులను వివరించేవాడిని. రాజకీయ పార్టీల వైఫల్యాలను విశ్లేషణాయుతంగా ఏకరువు పెట్టేవాడిని. శ్రీ సి.హెచ్. రాజారెడ్డి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ స్థాపకుడు, రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ ప్రారంభకుడు అయిన ఎం.ఎన్. రాయ్ జీవితాన్ని గురించి ప్రసంగించేవాడు. నేను రాడికల్ హ్యూమనిస్టు రాజకీయ ఆర్థిక ప్రణాళికలను గురించి మాట్లాడేవాడిని. ఒక్కొక్క ఊరిలో యీ క్రమం మారుతూ ఉండేది. ఏదయినా ఇద్దరి ఉపన్యాసాలు మొత్తం మూడు గంటలు పట్టేవి. అది ఒక రాజకీయ పాఠశాలగా సాగేది. విచిత్రం ఏమంటే సభకు వచ్చినవారు చివరవరకు ఉండి విని మరీ వెళ్ళేవారు. అందువల్ల మా యిరువురికి సంతృప్తి కల్గేది.

ఈ ప్రచారంలో మాకు ముఖ్యంగా తోడ్పడింది రాడికల్ హ్యూమనిస్టు మిత్రుడు ఎన్.వి. బ్రహ్మం. అతడు ఈనాటి హేతువాద ఉద్యమ నాయకుడు శ్రీ రావిపూడి

వెంకటాద్రి సహచరుడు. అతనితో కలిసి ఈనాటి చీరాల తాలూకాలోని నాగండ్ల గ్రామంలో కవిరాజు ఆశ్రమాన్ని నెలకొల్పినవాడు. భావుకుడు. జిజ్ఞాసాపరుడు. చినగంజాం, కడవకుదురు వగయిరా గ్రామాలలో నాకు సభలు ఏర్పాటుచేసి ఉపన్యాసాలు యిచ్చి బలపరచినవాడు. ఇతర మిత్రులు స్థానిక కారణాల వల్ల అతడు చేసిన కృషి, సాహసం చేయలేకపోయారు. ఉదాహరణకు మిత్రుడు శ్రీ కొల్లా సుబ్బారావు ఎం.ఎ. (మరో కొల్లా సుబ్బారావుకు, యితనికి గుర్తింపులో తేడా నిమిత్తం ప్రజలు అలా పిలిచేవారు) తన గ్రామమయిన పరుచూరులో సభను ఏర్పాటు చేశాడు. కాని తను అధ్యక్షుడుగా కూర్చోలేదు. నిజానికి మేము పెట్టిన 30 సభలలో రెండు, మూడిటికి తప్ప సభాధ్యక్షుడు లేడు. రెండు కుర్చీలు మాత్రం వేసేవారం. మిత్రుడు శ్రీ కొల్లా సుబ్బారావు తాత్వికంగా ఉద్యమపరంగా స్పష్టమయిన అవగాహన, చిత్తశుద్ధి, కార్యదీక్ష కలవాడు. ఉద్యమానికి ఎనలేని సేవచేసిన వ్యక్తి. (అతడు ఈనాడు జీవించి లేడు). పరుచూరి సభకు అతడు అధ్యక్షత వహించలేదని రాజారెడ్డి, నేను పెద్దగా బాధపడలేదు. నాకు బాగా వోట్లురావు కనుక స్థానికంగా తను అవహాస్యం పాలవుతానేమోననే సంకోచంతో అలా ప్రవర్తించాడు. అలాంటివారు మన సమాజంలో అనేకులు వున్నారని తెలియజెప్పటానికే యీ విషయాన్ని ఉటంకించానే గాని మిత్రుణ్ణి కించపరచాలనే ఉద్దేశ్యంతో కాదు.

నా ఎన్నికల సభలకు వచ్చే జనం యొక్క సంఖ్య 50 నుండి రెండు వేల మంది వరకు ఉండేది. సంతనూతల పాడులో ఏబది మందే వచ్చారు. పర్చూరులో 500, ఒంగోలులో 600, పొన్నూరులో 1000, చీరాలలో 2000 మంది సభలకు హాజరయినారు. నేను నివసిస్తున్న బాపట్ల పట్టణంలో బహిరంగ సభ పెట్టలేదు. ఊరు మొత్తానికి 9 వీధి మూలల సభలు పెట్టాను. విద్యావంతులు సైతం రోడ్డు ప్రక్కన నిలబడి వినేవారు.

నా ఎన్నికల ప్రణాళిక మీద నా ఫోటో వేసినందు వల్ల అది కనపడేటట్లు కాగితాన్ని యిచ్చి వోటును అభ్యర్థించడం వల్ల వోటర్లు నన్ను వెంటనే గుర్తు పట్టగలిగేవారు. 10 పుటల పెద్ద కరపత్రంలో పార్టీ రహిత ఉద్యమం యొక్క అవసరం, దాని తాత్విక భూమిక, రాజకీయ విశ్లేషణ, అది పనిచేసే తీరు సమగ్రంగా వివరించబడింది. ఈ కరపత్రాల పంపిణీయే మా అస్తిత్వానికి ఎంతో ఉపకరించింది. రాజకీయ ప్రబోధం ఎలా సాగాలో విశదీకరించిన ఘనత మాదియని చెప్తే చదువరులు మన్నిస్తారని మా ఆశ.

చివరగా ఒక సంఘటనను వివరిస్తాను. గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు వద్ద పాలపర్రు గ్రామం ఉంది. 1943 నుండి ఆ గ్రామంతో నాకు పరిచయం. రాడికల్ పార్టీ కార్యకర్తగా, రాడికల్ హ్యూమనిస్టుగా అనేకసార్లు నేను వెళ్ళిన వూరు. పార్టీ వున్న రోజుల్లో ఆ గ్రామంలో మాకు బలమయిన పార్టీ యూనిటు ఉండేది. ఆ గ్రామంలో సభ ఏర్పాటయింది. ఆ గ్రామ కాపురస్థుడు కొత్తగా ప్లీడరుగా వచ్చిన మిత్రుడు నన్ను సభకు పరిచయం చేస్తానన్నాడు. 'అక్కర లేదు. నాకు యీ గ్రామం క్రొత్త కాదు' అన్నాను. కాదు కూడదని పరిచయం చేశాడు. 'రామూర్తిగారు మీ వోట్లు అడగరు. మీరు యిచ్చినా తీసుకోరు' అనేదే అతని

పరిచయ వాక్యాల సారాంశం. నేను లేచి ఉపన్యాసం మొదట్లోనే ఇలా అన్నాను. 'నేను మీ వోట్లను నాకే వేయమని ప్రాధేయపడను. అయితే, నా ఉపన్యాసం విన్న తరువాత, నా అభిప్రాయాలు మీకు నచ్చితే అప్పుడు మీరు నాకు వోటు వేయకుండా మరొకరికి వోటు వేస్తే మీరు ఆత్మవంచన చేసుకున్నట్లు.' తరువాత విచారిస్తే నాకు ఒక్క విషయం తెలిసింది. గ్రామానికి విద్యుచ్ఛక్తిని తెప్పించి పెట్టేటట్లు, గ్రామ ప్రజల వోట్లు అన్నీ కాంగ్రెసుకు ధారాదత్తం చేసేటట్లు గ్రామ పెద్దలు శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారి సోదరుడు వెంగళరెడ్డి గారితో ఒప్పందం చేసుకున్నారని, నన్ను పరిచయం చేసిన ప్లీడరు మిత్రుడు ఆ గ్రామ పెద్దల తాలూకు మనిషని తెలిసింది. విద్దూరంగా కన్పించే విషయమేమంటే నాకు ఆ గ్రామంలో సుమారు 3, 4 వందల వోట్లు పడ్డాయి. గ్రామస్థుల వోట్లను తాత్కాలిక అవసరాల నిమిత్తం గ్రామ పెద్దలు కాంగ్రెసు నాయకులకు అనాడే 1967లోనే ఎలా తాకట్టు పెట్టేవారో మనకు తెలుస్తుంది.

# మిత్రుడు ఎ.జి.కె.

మిత్రుడు ఆవుల గోపాల కృష్ణమూర్తిని సంక్షిప్తంగా ఎజికె అని పిలిచేవారం. తెనాలి తాలూకా మూల్పూరు గ్రామ కాపురస్తుడు. లక్నోలో ఎం.ఏ., ఎల్ ఎల్ బి. డిగ్రీలు సంపాదించుకొని తెనాలిలో ప్లీడరీలో స్థిరపడిన వ్యక్తి. విద్యార్థి దశలో కవిరాజు త్రిపురనేని భావాలను ఆమోదించి, ఎం.ఎన్. రాయ్ తాత్విక దృక్పధాన్ని, రాజకీయ కార్యాచరణను అభిమానించి రాడికల్ డెమోక్రటిక్ పార్టీలో కార్యదర్శిగా, రాడికల్ హ్యూమనిస్టు పత్రికలకు సంపాదకవర్గ సభ్యుడుగా, ముఖ్య ఆలంబనంగా, రాడికల్ సారస్వత స్రష్టగా రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ వ్యాప్తికి ఎనలేని సేవచేసిన వ్యక్తిగా భాసిల్లాడు ఎ.జి.కె.

అతడు అనేక ఉద్యమాలను అభిమానించేవాడు. అతని రాజకీయాలను అంగీకరించని వారు సహితం అతనిని గౌరవించేవారు. వర్ణాంతర వివాహాలు చేయించాడు. సమిష్టి భోజనాల ఏర్పాటులో ప్రత్యేక పద్ధతి అవలంబించేవాడు. 'అగ్రవర్ణాల' భోజన పంక్తిలో కొన్ని చోట్లు ప్రత్యేకంగా ఖాళీ వుంచి అక్కడ వెనుకబడిన జాతులవారిని, దళితులను కూర్చోపెట్టేవాడు. ఆ పని యిష్టం లేకపోయినా విసర్జించి లేచిపోయే ధైర్యం లేక 'అగ్ర' వర్ణాలవారు, ఆస్తి, అంతస్తులున్న కమ్మవారు, రెడ్లు కిమ్మనకుండా భోజనం చేసి వెళ్లేవారు. చేతి వృత్తులలో నిపుణులకు సన్మానాలు చేసి బిరుదులు ప్రసాదించేవాడు. వారంలో ప్రతి శని, ఆదివారాలు పరాయి గ్రామాలు, పట్టణాలు వెళ్లి ఉపన్యాసాలు యిచ్చేవాడు. అతని సాహిత్య పిపాస అతనిని కవి పండితులకు దగ్గర చేసింది. అతని పెద్దకుమార్తె వివాహం నాడు అనేక మంది కవులు, విద్వాంసులు విచ్చేసి పద్యాలు చదివారు. సుప్రసిద్ధ ఉపన్యాసకులు, పండితులు జమ్మలమడక మాధవరాయ శర్మగారు కూడా ఆ సభకు విచ్చేసిన వారిలో ఉన్నారు. తన వివాహ రజతోత్సవం నాడే తన కుమార్తె వివాహం చేయించాడు. హేతువాది కనుక ముహూర్తాలతో నిమిత్తం లేకుండా పెళ్లి జరిపించాడు.

సోమవారం నుండి శుక్రవారం వరకు ప్రతి సాయంత్రం అతని యింటిలో గోష్టులు సాగేవి. అందులో అనేక అభిప్రాయాలు కలవారు, విభిన్న దృక్పధాలవారు, భిన్న ప్రవృత్తులు గలవారు, కవులు, పండితులు, విమర్శకులు, సాహిత్యాభిమానులు, స్థానిక రాజకీయ వాదులు యిలా ఎందరో పాల్గొనేవారు. అది ఒక దర్బారులా సాగేది.

స్థానిక కార్యకలాపాలను నిర్లక్ష్యంచేసే వాడుకాదు. పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా, లయన్సు క్లబ్ అధ్యక్షుడుగా వ్యవహరించాడు. ఆస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోడానికి వీలుకల్పించే 17వ రాజ్యాంగ సవరణను నెహ్రూ తలపెట్టినపుడు దానికి వ్యతిరేకంగా రాజగోపాలా చారిగారి సభలో ఎంతో విద్వత్తుతో ప్రసంగిస్తే రాజాజీ మెప్పుదలను పొందగలిగాడు. (నేను 17వ రాజ్యాంగ సవరణను ఆయనలా వ్యతిరేకించలేదు.) పత్రికా రచయితగా అడిగిన పత్రికల వారందరికీ వ్యాసాలు రాసి పంపేవాడు. రైలులో, బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడు కూడా వ్యాస రచన చేసేవాడు. అతనిని ఒక కమ్యూనిస్టు సానుభూతిపరుడు వర్ణిస్తూ 'వ్యాసోపన్యాస' అనే పేరు పెట్టాడు. దినపత్రికలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు ఒకటేమిటి అన్నింటా తనే వ్యాసకర్తగా ప్రత్యక్షమయ్యేవాడు. ఇలాంటి 23 సంవత్సరాల

కృషిని గుర్తించి అమెరికా ప్రభుత్వం తన అతిథిగా ఒక నెల రోజులపాటు అమెరికాలో పర్యటించమని కోరింది. అచ్చట పత్రికా కార్యాలయాలను విశ్వ విద్యాలయాలను, పౌర సంఘాలను, బాలల సంఘాలను యిలా ఎన్నో వైవిధ్యంకల సంస్థలను సందర్శించాడు. కవిరాజు పద్యాలను అచటి తెలుగువారికి చదివి వినిపించాడు. ఎం.ఎన్. రాయ్ సిద్ధాంతాన్ని ఎరుకపరిచాడు. విశేషానుభవంతో తిరిగి వచ్చాడు. అతని పర్యటనల విశేషాలను, అతని ప్రసంగాలను, అతని ఊహలను అన్నింటినీ 'నా అమెరికా యాత్ర'లో పొందుపరిచాడు. ఎజికె అమెరికా యాత్ర అనగానే అతని పర్యటనను తెనాలిలో జరిగిన సభా విశేషాలను పేర్కొనటం సముచితం. అతని మిత్రుడు సీనియరు లాయరు చింతమనేని శివరామయ్యగారు ప్రసంగిస్తూ 'అమెరికాలో నీవు వివేకానందుని ప్రస్తుతిస్తూ ఉపన్యాసాలు యిచ్చి, వివేకానందుని భావవ్యాప్తి చెయ్యి' అని హితోపదేశం చేశాడు. ఎ.జి.కె. నిష్కర్ష మనిషి. అతని హృదయం మార్దవం; అతని మాట పరుషం. లేచి 'వివేకానందుని లోపాలను, ఆయన భావాల అసమగ్రతను వెలికితీయకుండా అమెరికాలో ప్రసంగించలేను' అని అన్నాడు. ఈ పదాలు అతనివి కాకపోవచ్చును కాని భావం అదే. ఈ సభావిశేషాలు పత్రికలలో వచ్చాయి. దాంతో గాలి దుమారం రేగింది. ఒక నెలా పదిహేను రోజులు 'ఆంధ్ర పత్రిక' దినపత్రికలో ఒక పూర్తి పుటను ఎ.జి.కె.ను విమర్శించటానికి సంపాదకులు కేటాయించారు. ఎజికె పేరు వార్తా పత్రికలు చదివేవారందరికి బాగా పరిచయమయింది. అతనికి 'పేరు ప్రఖ్యాతులు' వచ్చాయి. ఒక వ్యక్తిని ఆరాధించడమో, తిట్టిపోయడమో చేసే పత్రికలు, అలాంటి దృక్పథాన్ని అభిమానించే పత్రికలు సహేతుక విమర్శను, విశ్లేషణను ఆహ్వానించలేవు కదా! చదువరుల మనస్తత్వాలు అందుకు భిన్నం కాదు. తన పేరును వేలమందికి, లక్షల మందికి తెలియజేసిన పత్రికకు ఎజికె రుణపడ్డాడు.

ఎజికెకు మహిళోద్యమం మీద సానుభూతివున్నా దాన్ని అంతగా పట్టించుకునేవాడు కాదు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మహిళలు విద్యారంగంలో, పౌర రంగంలో, వోటర్ల ఉద్యమాలలో ప్రముఖ పాత్ర వహించడం కళ్లారా చూచినవాడు కనుక మహిళోద్యమ మద్దతుదారుగా అమెరికా నుండి తిరిగివచ్చాడు. మహిళా విముక్తికి కుటుంబ నియంత్రణోద్యమం సాధనమని ఆ ఉద్యమంలో పనిచేస్తున్న నా సతి శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మకు (అనాడు ఆమె పేరు అదే; ఈనాడు ఆమె మల్లాది సుబ్బమ్మ) ఆరుగురి బిడ్డల తండ్రి ఎజికె సంపూర్ణ సహకారం అందించాడు. ఆమె ఏర్పాటుచేసిన శిబిరాలలో ప్రసంగిస్తూ "మేం పొరపాటు చేశాం. అధిక సంతానం కన్నాం. మీరు అలా చేయకుండా జాగ్రత్తపడండి" అని నిస్సంకోచంగా, స్పష్టంగా చెప్పేవాడు. అది అతని నిజాయితీకి నిదర్శనం.

ఇంతా 'నీకు ఎ.జి.కె. ఎప్పటి నుంచి పరిచయం' అని చదువరులు ప్రశ్నించవచ్చు 1942 ఆగస్టులో నేను రాడికల్ డెమొక్రాటిక్ పార్టీలో చేరాను కదా! 'రాడికల్' పార్టీ వారపత్రికలో ఎ.జి.కె. ఒక వ్యాసం రాశాడు. అందులో గాంధీజీపైన నునిశిత విమర్శ వుంది. భాష చాల పరుషంగా వుంది. అయితే భావం నిర్దుష్టంగా వుంది. కర్కశతర్కం అందులో చోటుచేసుకుంది. సాహిత్యంలో లబ్ధ ప్రతిష్టులు, ఎం.ఎన్. రాయ్ సహచరులు, అభిమానులు ఇద్దరు ఉండేవారు అబ్బూరి రామకృష్ణారావు గారు

నన్ను పిలిచి యీ వ్యాసాన్ని నిరసిస్తూ 'రాడికల్' పత్రికకు లేఖ రాయమన్నారు. ఎం.ఎన్. రాయ్‌కు కూడా లేఖ ప్రతిని పంపమన్నారు. అపుడు ఆ వ్యాస కర్తతో పరిచయం చేసుకోదలిచాను, కలిశాం. తరువాత స్నేహితులమయ్యాం. **1943** నుండి అతని మరణం తేదీ **6-9-1966** దాకా ఆ స్నేహం కొనసాగింది. దిన దిన ప్రవర్థమానమయింది.

# ఎ.జి.కె. మరణం

అది 1966 సెప్టెంబర్ 6వ తేదీ అర్ధరాత్రి. నా ఆఫీసులో ఫ్రస్ఫోసు అదే పనిగా మోగుతున్నది. లేచి 'రిసీవరు' ఎత్తాను. 'ఎ.జి.కె. ఇక లేడు. రాత్రి పదకొండున్నర గంటల ప్రాంతంలో మరణించాడు' అని తెనాలినుండి వార్త. ఇలా అకస్మాత్తుగా వచ్చిన వార్తకు దిగ్భ్రాంతి చెందాను. నోట మాట రాలేదు. ఆఫీసు కుర్చీలో అలా ఒక గంట పైకాలం స్థాణువులా ఉండిపోయాను. నా సహచరి సుబ్బమ్మ వచ్చి తట్టి లేపింది. ఉలిక్కిపడి లేచి ఆమెకు యీ వార్త చెప్పాను. తెల్లవారే వరకు రైలు లేదు. అప్పుడే ప్రయాణం. ఈలోగా 'ఆంధ్రపత్రిక' వారికి, 'ఆంధ్రజ్యోతి' వారికి యీ వార్త అందచేశాను. రూఢి కాకపోతే యీ వార్త వేయజాలమని ఉప సంపాదకులు చెప్పారు. నా పేరు, వృత్తి, చిరునామా చెప్పాను. వార్త ప్రచురించటానికి వారు అంగీకరించారు. ప్రొద్దున రైలుకు, నేను, చీరాల మిత్రులు తెనాలిలో దిగాము. ఎ.జి.కె. యింటికి చేరాం. 500 మంది జనం శవం చుట్టూ కన్పించారు. అందరూ శోకతప్త హృదయులే; కన్నీరు కార్చేవారే. నాకు దుఃఖం పొంగుకొచ్చింది. తట్టుకోలేక పోయాను. వెంటనే అచ్చటి నుండి దూరంగా ఒక ఫర్లాంగు దూరం వెళ్ళిపోయాను. బావురుమన్నాను. దుఃఖం దిగమ్రింగుకొని, ధైర్యం తెచ్చుకొని నిబ్బరంగా శవం వద్దకు చేరాను. అందరూ శోకంతో తల్లడిల్లి పోతున్నారు. నేను ఒక్కడినే అశ్రుధారలు కార్చకుండా నిశ్చలంగా కనపడ్డాను కాబోలు తరువాతి కార్యక్రమాల విషయం పలువురు హెచ్చరించారు.

ఎ.జి.కె. సోదరులు నా వద్దకు వచ్చి 'బ్రాహ్మణుని పిలిపించి దహన సంస్కారం చేయిద్దాం' అన్నారు. 'నాకు యిష్టం లేదు. ఎ.జి.కె. హేతువాది. ఏదయినా అతని దేహంతో కాపురం చేసిన సతీమణి యిష్ట ప్రకారం చెయ్యండి' అన్నాను. వారు ఆమె వద్దకు వెళ్ళారు. ఆమె కంటికి మింటికి ఏకధారగా ఏడుస్తున్నది. ఆమె ఆస్తికురాలు; దైవభక్తురాలు. ఎ.జి.కె. జీవించి వుండగానే అతని యింట హాలులో ఆమె తాలూకు దైవ చిత్రాలు వుండేవి. వాటికి ఆమె పూజలు చేసేది. ఎ.జి.కె. ప్రజాస్వామ్యవాది కనుక ఆమెను వారించలేదు. ఆమెతో ఎలా ప్రవర్తించాలో తెలియక ఆమె భర్త సోదరులు తికమక పడ్డారు. గత్యంతరం లేక 'అమ్మా! దహన సంస్కారం ఎలా చెయ్యమంటావు' అని అడిగారు. ఆమె పెద్దగా చదువు కోలేదు. ఆమె ఒక్క క్షణం ఆలోచించి 'ఆయన బ్రతికినన్నాళ్లు నాస్తికుడుగా జీవించాడు. నా పూజా పునస్కారాలకు ఏనాడూ అడ్డురాలేదు. ఇపుడు ఆయనను మరో రకంగా సాగనంపుట నాకు యిష్టం లేదు. ఆయన స్నేహితులు ఎలా చెప్తే అలా కానివ్వండి' అన్నారట. ఎ.జి.కె. సోదరులు నా వద్దకు వచ్చి యీ విషయం తెలియజేసి 'మీరు మా మాటను మన్నించండి' అని ప్రాధేయపడ్డారు. 'క్షమించండి. మీ కోరికను అంగీకరించలేను' అని చెప్పి తదుపరి కార్యక్రమానికి పూనుకున్నాను. లారీపై శవాన్ని అందరికీ కన్పడేలా వుంచి పుర వీధులగుండా ఊరేగిస్తూ స్మశానానికి చేరుకున్నాం. 'సంఘ సేవకుడు' 'కుల నిర్మూలనను ఆశించినవాడు, ప్రజా న్యాయవాది' అని యింకా అతనిని ప్రస్తుతిస్తూ మిత్రుడు రామినేని అన్నపూర్ణయ్య మైకులో నినాదాలిస్తుంటే వేయిమంది జనం వెంటరాగా శవయాత్ర జరిగింది. పుర ప్రజలు

యీ దృశ్యాన్ని చూచి కంటతడి పెట్టారు.

రాడికల్ హ్యూమనిష్టు మిత్రుడు ఆవుల సాంబశివరావు గారిని (తరువాత ఆ.ప్ర. హైకోర్టు న్యాయమూర్తి, లోకాయక్తు, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు) కోరాను. వారు ఎ.జి.కె.ను గురించి చక్కగా ముక్తసరిగా ప్రశంసా వాక్యాలు పలికారు. తదుపరి పుర ప్రముఖులు మాట్లాడారు. ఎ.జి.కె. జ్యేష్ఠ కుమారుడు చితికి నిప్పు అంటించాడు. ఎ.జి.కె. దేహానికి అంత్యక్రియలు చేసి యింటికి చేరాం. కవిరాజు అనుయాయులు కొందరు నా వద్దకు వచ్చి 'నీవు సంప్రదాయవాదివి. అందుకనే పెద్ద కుమారుని చేత చితికి నిప్పు పెట్టించావు' అని నిందా వాక్యాలు పలికారు. 'చితి దానంతట అది మండదు. ఎవరో ఒకరు అగ్ని దానికి తాకించాలి. అతని కడుపున పుట్టినవాడు చివరి సంస్కారం చేస్తే హేతువాదిగా నేను అభ్యంతరం చెప్పవలసిన అవసరం కన్పించడం లేదు' అని జవాబు చెప్పాను. వారు నిరుత్తరులయ్యారు. కాని వారి మనస్సులో నా చర్యపై అసహనం సశించ లేదు. 'మనం తెనాలిలో యింతమంది ఉంటే ఎక్కడో బాపట్ల నుండి వచ్చి యితగాడు పెత్తనం చేయటమేంటి?' అని కొందరు తెనాలి పౌరులు అన్నారని తెలిసింది. తీరా ఆలోచిస్తే అసలు విషయం తెలిసింది. నేను జందెమును తీసివేసినా, దేవుని నమ్మకపోయినా, బ్రాహ్మణ్యాన్ని వదులుకున్నా, నేను బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాననే అంశాన్ని వారు మరచి పోలేకున్నారు. పాపం వారి స్థితికి జాలివేసింది.

తెనాలిలో మునిసిపలు మార్కెటు వద్ద ఎ.జి.కె. సంస్మరణ సభ జరిగింది. స్థానిక మిత్రులను సభాధ్యక్షత వహించమని కోరాను. ఏవో కారణాలు చెప్పి కాదని నన్నే అధ్యక్షత వహించమన్నారు. నేను అధ్యక్షునిగా సభను జరిపించాను. 26 మంది వక్తలు ఎ.జి.కె. గుణగణాలను పేరు పేరునా చెప్పి పొగిడి అతని స్మృతికి జోహారు అర్పించారు.

'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రజ్యోతి' 'ఆంధ్రప్రభ' దినపత్రికలలో ఎ.జి.కె.ను గురించి ప్రత్యేక వ్యాసాలు ప్రచురిత మయినవి. నేను 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో వ్రాశాను. పలువురు ప్రముఖులు సంతాప సందేశాలు యిచ్చారు. ఆచార్య రంగా, గౌతు లచ్చన్న, ప్రగడ కోటయ్య ప్రభృతులు ఎ.జి.కె. యింటికి వచ్చి కుటుంబ సభ్యులను పరామర్శ చేశారు.

కొలది రోజుల తర్వాత 'ఆవుల గోపాల కృష్ణమూర్తి సంస్మరణ సమితి' ఏర్పడింది. నార్లవారు దానికి అధ్యక్షులు. నేను ప్రధాన కార్యదర్శిని. సుప్రసిద్ధ వైద్యులు సాహిత్యాభిరుచి కల గుంటూరు వాస్తవ్యులు డా. సదాశివ రావుగారు కోశాధికారి. సంస్మరణ సంచిక వెలువరించ నిశ్చయించాం. రాడికల్ హ్యూమనిష్టు మిత్రుడు డా. భట్టిప్రోలు హనుమంతరావు (చరిత్రకారుడు, గ్రంధకర్త) సంపాదకుడుగా 'స్వేచ్ఛాన్వేషణ' అనే పేరుతో ఇంగ్లీషు, తెలుగు వ్యాసాల సంపుటిని ప్రచురించాం. భారతదేశంలోని మేధావుల అనేక విషయాలపై వ్యాసాలతో అది ముద్రితమయింది. ఎ.జి.కె.ను కొనియాడుతూ ఇందులో ఒకటి, రెండు వ్యాసాలు మాత్రమే వున్నాయి. ఇది కొరతగా తోచింది కొంతమంది మిత్రులకు. గురిజాల సీతారామయ్య, పి. లచ్యుతరామ్ గారల పూనికతో 'మహామనిషి' అనే పేరుగల గ్రంధం ప్రచురితమైంది. ఎ.జి.కె.ను గురించి 120 మంది రాశారు. అందులోనూ నేను ఎ.జి.కె.ను గురించి

వ్యాసం రాశాను. రాడికల్ హ్యూమనిస్టు పత్రిక సమీక్ష ప్రత్యేక సంచికను అచ్చువేసింది. సంతాప సభలు విరివిగా ఆంధ్రదేశ మంతటా జరిగాయి. అవి 167 దాకా వున్నాయి.

ఆనాడు 'ఆంధ్రభూమి' సంపాదకుడుగా వున్న గోరా శాస్త్రిగారు 'ఒక వర్గంవారు ఎ.జి.కె. స్మృతిని స్వంతం చేసుకో చూసుకున్నారు' అని రాస్తే నేను సంస్మరణ సమితి కార్యదర్శిగా నా అసమ్మతిని తెలియజేశాను.' అతడు ఆ వర్గంలో చేరడే అతనికి ఎందుకు బాధ' అని వారు అన్నారని తెలిసింది. గోరాశాస్త్రి గారి దృష్టిలో 'ఒక వర్గం అంటే కమ్మవారని' అర్థమని తరువాత తెలిసింది. పొట్టి శ్రీరాములు వర్ధంతిని వైశ్యులు, అంబేద్కరు జయంతిని ప్రధానంగా దళితులు చేయడం చూస్తున్నాం. ఇది మన దేశ దౌర్భాగ్యం. మహాత్మాగాంధీ గారిని గురించి కౌల్లాయి కట్టితే నేమి కోమటయి పుట్టితే నేమి' అని బసవరాజు అప్పారావుగారు రాసినా ఇంకను వైశ్యులు తమవాడు మాత్రమేనని ప్రకటించడం లేదు. అంతవరకు అది సుగుణం.

తెనాలి రాడికల్ హ్యూమనిస్టు మిత్రులు సుమారు 10 సంవత్సరాలు ఎ.జి.కె. వర్ధంతి సభలు భారీ ఎత్తున చేశారు. ఎ.జి.కె. ఉత్తమ మానవుడు. అతనిలో మనందరిలో లాగానే చిన్న చిన్న బలహీనతలు వున్నాయి. అయితే, వాటిని త్రోసిరాజన గల దొడ్డ గుణాలు అత్యధికంగా, విశేషంగా వున్నాయి. అందుకే అతని స్మృతి సహృదయుల మనస్సులలో పదిలం.

# నా తండ్రిగారి మరణం

నా తండ్రిగారు 1890లో జన్మించారు. 1946లో పదవీ విరమణ చేశారు. ఇరువది ఏండ్లు పింఛను పుచ్చుకున్నారు. మా కుమారులలో చిన్నవాడు వాళ్ళ తాతయ్యను ఆటలు పట్టించేవాడు. "తాతయ్యా! ఇంక ఎన్నాళ్ళు ప్రభుత్వం పైకం పుచ్చుకుంటావయ్యా" అనేవాడు. ఆయన మందహాసం చేసి వూరుకునేవారు. తాతయ్యకు మనుమని మీద వుండే ప్రేమ అలాంటిది.

నా తండ్రిగారిని గురించి ప్రత్యేకంగా గ్రంథం రాయతలచాను గనుక ఆయన దొడ్డ గుణాలను యిచ్చట ప్రస్తావించను. కాకపోతే కొన్ని సంఘటనలను మటుకు ముచ్చటించక తప్పదు. నాన్నగారికి జ్యోతిష్యాన్ని అధ్యయనం చేస్తున్న మిత్రుడు ఒకాయన వుండేవారు. ఆయన నాన్నగారి జాతకాన్ని పరిశీలించి లెక్కలు వేసి గుణకారం వేసి " యీ సంవత్సరం (1946)లో మీకు మారకం(మరణం) వుంది" అని అన్నాడు. మా నాన్నగారు ఆందోళన చెందారు కాబోలు వారికి జ్వరం వచ్చింది. వెంటనే నన్ను పిలిచి "నన్ను కాశీ తీసుకొని వెళ్ళు. నాకు అక్కడ చనిపోవాలని ఉంది" అన్నారు. నేను సమ్మతించాను తన కోడలును కూడా పుట్టింటినుండి టెలిగ్రాం యిచ్చి పిలిపించమన్నారు ఆయనకు జ్వరం ఎక్కువయింది. ఆమె వచ్చేలోగా కాశీకి నేనూ, నా తల్లిదండ్రులు, నా పెద్ద కుమారుడు, నా తల్లిగారి ఆధ్యాత్మిక స్నేహితురాలు కాశీకి బయలుదేరాం. కాశీ చేరాం. అక్కడ ఇంగ్లీషు వైద్యునిచేత వైద్యం చేయించాను. జ్వరం తగ్గింది. కాశీ, ప్రయాగ, కలకత్తా, భువనేశ్వర్, పూరి, సింహాచలం, ద్రాక్షారామం వీటిని దర్శించి యింటికి చేరాం. నాన్నగారు 1966 దాకా జీవించారు.

అలహాబాదులో రామలీల చూడడానికి లక్షమంది జనం గుమికూడారు. "పొడుస్తున్నారు పారిపోండి" అని కేకలు. ఎలాగో అలాగు ఆ జనాన్ని తప్పించుకుంటూ యిల్లు చేరాము నాలుగు రోజులు యిల్లు కదలలేదు. అవి కర్ఫ్యూ రోజులు. నడిరోడ్డు మీద 20 గజాలకొక తుపాకి చేత ధరించిన సైనికుడు వుండేవాడు. అది బ్రిటిషువారి కర్ఫ్యూ. మూడు రోజులు తిండి గింజలు, కిరసనాయిలు కొనుగోలు చేయటానికి పోవటానికి కూడా వీలులేని కర్ఫ్యూ.

జిన్నాగారి ప్రత్యక్ష చర్య(డైరెక్టు అక్షను) సమయంలో నెత్తురు ఏరులై పారిన కలకత్తాలోని హౌరా వంతెనను చూచాము. మేము కలకత్తా చేరేటప్పటికి కలకత్తా తేరుకొని మామూలు స్థితికి చేరుకుంది. ఆరు రోజులు ఘోరకలి జరిగిందని చెప్పారు మొదటి మూడు రోజుల్లో ముసల్మానుల విజృంభణ. చివరి మూడు రోజులు హిందువుల ఎదురుదాడి. రెండూ తీవ్రస్థాయిలోనే జరిగాయి.

ఈ సందర్భంలో ఒక అంశాన్ని గురించి చెప్పాలి. కాశీలో విశ్వేశ్వరుని లింగం మీద చేయి

వుంచి ఒక గంట కూర్చుంటే ప్రశాంతత వస్తుందని నా ఆస్తిక మిత్రులు సూచించారు. నాకు దైవం యొక్క ఉనికిలో విశ్వాసం లేకపోయినా ప్రశాంతతకోసం ప్రయత్నించి చూద్దామనే అభిప్రాయం కల్గింది ఈశ్వర లింగం మీద అలాగే చేయి వుంచి స్థిరచిత్తంతో కూర్చున్నాను ప్రశాంతత లభించలేదు. కలకత్తా బెంగుళూరు మఠ్‌లో కొంత ప్రశాంతత ఉదయించినది. కాని సంపూర్ణ ప్రశాంతత కాదు ద్రాక్షారామం భీమేశ్వరాలయాన్ని నేను దర్శించినపుడు ఒకరిద్దరు భక్తులు తప్ప వేరెవ్వరూ లేరు నా తల్లిదండ్రులు దేవాలయానికి ప్రదక్షిణం చేస్తున్నపుడు నేను ఆలయప్రాంగణంలో కూర్చున్నాను నా మనస్సు ప్రశాంతతతో నిండిపోయింది. ఈ సంగతి కొంతమంది ఆస్తికులతో ముచ్చటించాను. కొంతమందికి అరవిందాశ్రమంలో, మరి కొంతమందికి రమణాశ్రమంలో ప్రశాంత చిత్తము ప్రాప్తించిందట. ఆ మనిషి యొక్క మనఃస్థితిని బట్టి యిలాంటి అనుభవాలు సంభవిస్తాయి ఆ ప్రదేశం యొక్క వాతావరణం కూడ కొంత దోహదపడుతుందనేది సత్యం. అంతేకాదు ఆ వ్యక్తి ఒక సంఘటనను ఆశిస్తూ వుంటే ఆ సంఘటన ఎక్కడో ఒకచోట జరుగపోదు.

ఒక రోజు నా నాన్నగారు నన్ను పిలిచి "నేను చనిపోతే నీవు శ్రాద్ధ కర్మలు చేస్తావా?" అని ప్రశ్నించారు ఆయన నాకు నేర్పింది నిజాయితీ. కనుక నేను "క్షమించండి, చేస్తానని అబద్ధం చెప్పలేను" అన్నాను. అంతటితో ఆగక, "మీ శాస్త్రాలలో యిలాంటి పరిస్థితులలో ఏదో మార్గాంతరం వుండకపోదు" అన్నాను. అంత వారు "ఉన్నదిలే నేను జీవించి వుండగానే బదరీనాథ్‌లో ఘట శ్రాద్ధం చేసుకోవాలి. నేను బదరీ వెళ్తాను" అని జవాబు చెప్పారు కావాలంటే నేను వెంట వస్తానన్నాను అక్కరలేదన్నారు. బదరీకి ప్రయాణం కట్టారు ఈ రోజుల్లోలాగా విమానం దేవాలయ సమీపంలో దిగేది కాదు. బస్సు ఆలయం వద్దరకు వెళ్లేది కాదు. 1940 ప్రాంతంలో 200 మైల్లు నడవాల్సి వుండేది. 1950 ప్రాంతానికి నడక 70 మైళ్ళే. మిగతాది బస్సు ప్రయాణం. మా నాన్నగారు, అమ్మగారు తదితరులు బదరీ వెళ్ళి త్రోవలో మరికొన్ని పుణ్యక్షేత్రాలు దర్శించి వచ్చారు అలా నేను నా తండ్రిగారికి శ్రాద్ధ కర్మలు చేయాల్సిన స్థితి తప్పిపోయినది

1965లో మా పెద్ద అబ్బాయి కామేశ్వరరావు వివాహం జరిగింది. అప్పటికి నాన్నగారికి కాస్త అస్వస్థత ఏర్పడింది. తన మనుమని వివాహం చూడాలని ఆయన ఆపేక్షిస్తున్నారు ఆ వేళా విశేషమేమిటో కామేశ్వరరావు బారసాలకు, తరువాత జరిగిన అశేష సత్యనారాయణ వ్రతాలకు పీటలమీద కూర్చోనని నేను, తండ్రికి శ్రాద్ధం పెట్టనని ఆయనతో గట్టిగా చెప్పిన నేను, వరపూజ సందర్భంగా మంత్రాలు చదువుతుంటే పీటలమీద కూర్చున్నాను. పూజలో పాల్గొనలేదు కాని శాస్త్ర ప్రకారం పాల్గొన్నట్లే లెక్కకదా! హ్యూమనిస్టు మిత్రులు ఎవరూ నన్ను ఆక్షేపించలేదు కాని నాకే ఎందుకో మనస్సులో దోష భావం ఉదయించింది. రాడికల్ హ్యూమనిస్టు పత్రిక 'సమీక్ష' సంపాదక వర్గ సభ్యత్వానికి రాజీనామా చేశాను.

నా తండ్రిగారు 1966 చివరలో చనిపోయారు. అప్పటికి నా తల్లిగారు జీవించి వున్నారు. నా తల్లితండ్రులిద్దరు హిందూ శాస్త్రం నిర్దేశించే కర్మకాండలో పూర్తి నమ్మకం ఉన్నవారు. నాతల్లి ఆ సమయంలో దుఃఖంతో మునిగి వుండడం వల్లనో, నా వైఖరి ముమ్మందే తెలిసినందువల్లనో నన్ను పిలిచి శ్రాద్ధకర్మలు చేయమని ఆదేశించలేదు. నేను స్మశానానికి వెళ్ళి చితికి నిప్పు పెట్టాను. తతిమ్మా కర్మలో నేను పాల్గొనలేదు. నా పేరుమీద బ్రాహ్మణుడు తంతులో పాల్గొన్నారు. 'లా' ప్రకారం అతడు నా ప్రతినిధియే. నేను శ్రాద్ధకర్మలు చేసినట్లే ఎందుకోవలసి వస్తుంది.

పైన చెప్పన సంఘటనలు నా మనోదౌర్బల్యానికి నిదర్శనలు. నా మిత్రుడు సి.హెచ్. రాజారెడ్డి అలాంటి బలహీనతను ప్రదర్శించలేదు. నా చర్యలు క్షంతవ్యం కావని భావిస్తున్నాను. సన్యాసం స్వీకరించి ఆదిశంకరులు తన తల్లి అంత్యక్రియలను శాస్త్రోక్తంగా జరపడాన్ని ఆనాడు బ్రాహ్మణ్యం దుయ్యబట్టింది. వారి ఉదాహరణ చెప్పి తప్పును ఒప్పు చేయపూనడం సరియైన పద్ధతి కాదు. తాత్త్వికాంశాన్ని వివరించటం అవసరమేమో ! హేతువాదం, మానవవాదం, వ్యక్తి వాదం - యీ మూడింటిపై రాడికల్ హ్యూమనిజం ఆధారపడి వున్నది.

కనుక హ్యూమనిస్టులు విధిగా హేతువాదులుగా వుండవలసిందే. కాకపోతే మొత్తం మీద చూస్తే మత పద్ధతులపై హేతువాదులు ప్రదర్శించే వ్యతిరేకతకన్నా, హ్యూమనిస్టుల వ్యతిరేకత తక్కువ పాలు ఇది ఆచరణకు సంబంధించిన విషయం మాత్రమే. అనుష్టాన బ్రహ్మసమాజం వారిలాగా 'అనుష్టాన హ్యూమనిస్టులు' ఉన్నారు. అయితే అలాంటి శాఖ సంఘ నిర్మాణంలో చోటు చేసుకోలేదు హేతువాదులలో కూడా 'వీర హేతువాదులు' ఉన్నారు 'రామలీల'కు ప్రత్యామ్నాయంగా అలాంటివారు 'రావణ లీల'ను ప్రతిపాదిస్తారు; జరుపుతారు ఈ చర్చ నేను ప్రదర్శించిన బలహీనతను సమర్థించుకోవటానికి కాదని నా మనవి. నా తల్లిగారు 1975 ఏప్రిలులో మరణించారు అప్పటికి నేను భారత హేతువాద సంఘంలో ఉపాధ్యక్షుణ్ణి మత తంతు ప్రకారం ఆమెకు శ్రాద్ధ కర్మలు నేనుగాని నా శ్రీమతి గాని చేయలేదు

# ప్రజాసేవకులు ఆరోగ్యాన్ని కాపాడుకోవటం అవశ్య కర్తవ్యం

చాలామంది ప్రజా సేవకులు తమ ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ వహించరు. ప్రజాసేవా కార్యక్రమాలలో మునిగి తేలుతూ వుంటారు. వ్యాధిగ్రస్తులయినా వైద్యం చేయించుకోరు. మందు తినరు. కార్యక్రమాల వత్తిడి వల్ల అలా ప్రవర్తిస్తున్నామంటారు. ఒక్కొక్కసారి వారు చేసే కార్యక్రమాలకు అర్థం ఉండదు. అవి అర్థవంతమయినవయినా వాటిని వెన్వెంటనే నెరవేర్చ వలసిన తొందర వుండదు. అయినా వాటికి ప్రాధాన్యత యిస్తుంటారు. హేతువాద ప్రచారం చేసే వారిలో కూడా యీ బలహీనత ద్యోతకమవుతున్నది.

శరీరం ఉంటేనే మనస్సు పనిచేస్తుంది. కర్మేంద్రియాలు తమ విధ్యుక్త ధర్మాలను నెరవేరుస్తాయి. మంచిపని చేయాలంటే కాళ్ళూ చేతులూ ఆడాలి. తీవ్రంగా ఆలోచన చేయగల్గాలి. ఈ అంశాలు అందరికి తెలిసినవే. కాని అధిక సంఖ్యాకులు విస్మరిస్తారు. కేవలం బ్రతకడమే పరమావధియా అని కొందరు విమర్శించ వచ్చును. బ్రతకడం ముఖ్యమే. కాని ఆత్మ గౌరవానికి భంగం కలిగినప్పుడు, స్వేచ్ఛాయుతంగా జీవ యాత్ర సాగించడానికి వీలులేనప్పుడు, ఘోర దాస్యంలో బ్రతక వలసినప్పుడు ప్రాణం నిలుపుకోడం కన్న ప్రాణాలు విడవడమే ఉత్తమం కావచ్చును. కాని పరిస్థితి మరీ విషమించినప్పుడే అలాంటి ఆలోచన, కార్యాచరణ తప్పనిసరి అవుతాయి. మామూలు పరిస్థితుల్లో శరీర ఆరోగ్యాన్ని రక్షించుకొనడం ప్రతి వ్యక్తి విధి.

ఇలా నీతి వాక్యాలు ఎందుకు పలకవలసి వస్తున్నదని కొందరు విస్మయం చెందవచ్చును. ఎజికె మరణం గురించి ప్రస్తావించాను కదా! చనిపోయే నాటికి అతని వయస్సు 49 సంవత్సరాలు. ఇందిరాగాంధీ పుట్టిన సంవత్సరంలోనే పుట్టాడు. కాని ఆమెలాగా తన ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ వహించాడా! ఆమెను హత్య చేయకపోతే ఆమె కనీసం 80 సంవత్సరాలు జీవించేది. గాంధీజీ 125 సంవత్సరాలు బ్రతుకుదామనుకున్నాడు. బెర్నార్డుషా 99 సంవత్సరాలు జీవించాడు.

ఎజికె కార్యకర్త. మంచి కార్యకర్తకు వుండవలసిన లక్షణాలు అతనికి ఉన్నాయి. ఆలోచనాపరుడు. ఇతరులకు సరి అయిన సలహాలు చెప్పగల శక్తి కలవాడే. కాని స్వంత విషయంలో సరిగా ఆలోచించ లేకపోయాడు. ఒకనాడు నా క్లయింటు ఒకాయన వచ్చి 'ఆవుల గోపాల కృష్ణమూర్తిగారికి గుండె జబ్బు వచ్చిందట. బస్సులో తెనాలి నుండి వచ్చేవారు మాట్లాడుకుంటుంటే విన్నాను' అన్నాడు. నేను ఎజికె స్నేహితుడి క్రింద లెక్క. నాకు అతనికి అనారోగ్యంగా వుందని కూడా తెలియదు. మరునాడు తెనాలి వెళ్ళాను. ఒక కవిగారు తను యిటీవల రాసిన పద్య కావ్యం ఆయనకు చదివి వినిపిస్తున్నాడు. ఆయన శ్రద్ధగా వింటున్నాడు. నేను వెళ్ళి 'ఎలా వుందని' అడిగాను. 'ఏమీలేదు కొద్దిగా అస్వస్థత' అన్నాడు. అతనితో మట్లాడి లాభం లేదని తలచాను. అతని మేనల్లుళ్ళను అడిగి విషయం తెలుసుకున్నాను.

గుండె జబ్బు వచ్చినమాట ఖాయమే. కాని భార్యతో కొద్దిపాటి జ్వరమని చెప్పాడట. గుమస్తాతో మాట్లాడాను. 'అతనికి కేసులు, దావాల విషయమయి పని పెట్టవద్దు. వాయిదాలడగండి. అంతగా వాయిదా యివ్వని దావాలంటే నేను వచ్చి చేస్తాను' అని అతనికి చెప్పాను. అతని పెద్ద కుమారుని పిలిచి 'ఎవరయినా వచ్చి మీ తండ్రిని అతిగా మాట్లాడిస్తే 'అయ్యా! మా నాన్నగారికి బాగా జబ్బుగా వుంది. ఆయన బ్రతికితేనే మాకు రక్షణ వుంటుంది. దయచేసి మీరు వెళ్ళిపోండి' అని ఆయనకు చెప్పండి. వెళ్ళకపోతే కర్ర తీసుకొని ఆ వచ్చినాయన కాళ్లు విరగకొట్టండి' అని హితవు చెప్పాను. ఇన్ని సంవత్సరాలుగా గోపాల కృష్ణమూర్తి యింటికి వెళ్తున్నా, అచ్చట భోజనం చేస్తున్నా ఆయన శ్రీమతితో నేను మాట్లాడి ఎరుగను. వారి యింట్లో ఘోషా లేదు కాని పరాయి మగవారి ఎదుటికి వచ్చి మాట్లాడే అలవాటు ఆమెకు లేదు. పైగా ఆమె ఉద్యమంలో లేదు. ఆమెతో మాట్లాడడానికి కాస్త తటపటాయించి చివరకు నిర్ణయించుకొని ఆమెతో యిలాగన్నాను. 'అమ్మా! గోపాల కృష్ణమూర్తికి వచ్చిన జబ్బు చాలా పెద్దది. ఆయన అతిగా మాట్లాడరాదు. ఎక్కువగా ఆలోచించ రాదు. మెదడుతో, శరీరంతో చేసే కష్టమయిన పనులు చేయరాదు. మీరు గనుక ఆయన ప్రక్కన కూర్చుంటే మిమ్మల్ని చూసి ఎవరూ ఆయన వద్దకు రారు. ఆయనకు కావలసింది విశ్రాంతి. ఈ బాధ్యత మీరు తీసుకోండి. 'ఆమె తల ఊపారు. ఆయనను ఆస్పత్రిలో చేర్పించండి. ఇంటి దగ్గర వైద్యం సకాలంలో అందదు' అని చెప్పాను. విశాఖ పట్టణంలోని పెద్ద ఆస్పత్రిలో సీటు కోసం ఉత్తరం రాసిన తరువాత నేను బాపట్ల తిరిగి వెళ్ళాను. ఆయన ఆస్పత్రిలో చేరలేదని, ఆయనకు చివరిసారిగా గుండె నొప్పి వచ్చే గంట ముందు ఆయన గుమస్తా ఆయన చేత దావా ప్లయింటు రాయించాడని ఆయన మరణానంతరం నాకు తెలిసింది. పూర్ణ జీవితం గడుపవలసిన వ్యక్తి అకాల మరణం పాలపడ్డాడు.

ఈ సందర్భంలో మరొక విషయం స్మృతిపథంలో మెదలుతున్నది. తన వివాహ రజతోత్సవం నాడు తన కుమార్తె వివాహం జరిపించాడని రాశాను కదా! ఆనాటి సభలో కవులు ప్రశంసా పద్యాలు చదువుతున్నారు. వధూవరుల మీద రాసిన గోపాల కృష్ణమూర్తి ప్రసక్తి ఎక్కువగా వచ్చింది. ప్రసంశించే వారి జాబితాలో నా పేరు వున్నట్లు నాకు తోచలేదు. 'రామ్మూర్తిగారు మాట్లాడాలి' అని మిత్రులను బిగ్గరగా అరవమని అభ్యర్థించాను. వారు నా కోరికను మన్నించారు. 'అతడు గోల చేయిస్తున్నాడు. అతనిని పిలవండి' అన్నాడు. నా పేరు పిలిచారు వేదిక ఎక్కాను. 'నీ తండ్రి ఎంత గొప్పవాడయినా నీవు నీ భర్తను గొప్పగా చూడాలి' అని ఆతని కుమార్తెకు హితవు చెప్పాను. బల్లమీద ఒక అలారం గడియారం పెట్టి యిలా ప్రసంగించాను. 'ఈ రోజున మా వదినగారు వేదికను అలంకరించారు. సంతోషం. కాని వారిపై పెద్ద బాధ్యత వుంది. గోపాల కృష్ణమూర్తి వారికే కాక, మాకందరికీ, ప్రజలకూ కావలసిన వ్యక్తి. అతని కార్యక్రమాలు విధి విసగట లేకుండా జరుగుతాయి. రాత్రి రెండు గంటల వరకు చదువుతాడు, రాస్తాడు. అది అతని ఆరోగ్యానికి భంగం. కనుక యీ గడియారాన్ని మీరు వాడి రాత్రి 10 గంటల

కాగానే అతడు నిద్రపోయేటట్లు చేయడం వారి కర్తవ్యం' కొందరు గొల్లున నవ్వారు. నా మాటలను వారు హాస్యోక్తులుగా మాత్రమే పరిగణించారనుకుంటాను. కాని నా మనస్సులో అతని ఆరోగ్యం పట్ల వుండే ఆందోళనయే నన్ను అలా పలికించింది.

కొలది సంవత్సరాలలో రాబోయే విపత్తు నాకు తెలియకుండానే నాచేత అలా మాట్లాడించిందా! ఏమో! నాకు తెలియదు. అలాంటి శక్తులుంటాయని నాకు నమ్మకం లేదు. ఏదయినా నా హెచ్చరికలను ఎవరూ ఖాతరు చేయలేదు. గోపాల కృష్ణమూర్తి అసలు పట్టించుకోలేదు.

ఈ గాథలు చదివిన వారయినా నా భావాలను, నా ఆందోళనను సరిగా స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

# ప్రజా సంఘాలలో కృషి

బాపట్లలో వుండగా ఒకేసారి సుమారు 10 సంఘాలకు కార్యదర్శిగానో, అధ్యక్షుడిగానో, సంచాలకుడుగానో పనిచేశాను. ఎలా పనిచేసేనో ఏమో యిపుడు తలచుకుంటే ఆశ్చర్యము కలుగుతుంది. ఒక్కొక్క సంఘంలో ఒక్కొక్క సంఘటన ఎదురయ్యింది. గుణపాఠాలు నేర్చుకున్నాను. టూకీగా వాటిని పేర్కొనటం ఉచితమని తోస్తున్నది.

బాపట్ల న్యాయవాది సంఘానికి ఒక గడువు కాలం కార్యదర్శిగాను, మరొకసారి అధ్యక్షుడిగాను ఉన్నాను. న్యాయవాది సంఘపు కార్యదర్శిగా వున్న రోజుల్లో కేంద్రంలో విద్యామంత్రిగా వున్న మౌలానా అజాద్ పదవిలో పనిచేస్తూనే చనిపోయాడు. ఆ రోజు కోర్టులు పనిచేసే రోజు. న్యాయవాది సంఘాధ్యక్షుడు ఆ దినం కోర్టుకు రాలేదు. అంత న్యాయవాది శ్రీ నాళం రామచంద్ర రావు వచ్చి అజాద్ మరణం విషయం కోర్టువారికి తెలియపరిచి ఆనాడు కోర్టు పనిచేయకుండా వాయిదా కోరమని అడిగాడు. 'మౌలానా అజాద్ న్యాయవాది కాదు. న్యాయశాఖకు బాధ్యులు కాదు. కనుక మనం 'రిఫరెన్సు' చేయడం ఉచితం కాదు' అని అన్నాను. 'పైగా ఆయన జీవించినంత కాలం పనిచేశారు. చివరి నిమిషం వరకు శ్రమించారు. కనుక మనం కోర్టు పనిచేయ రాదనడం న్యాయం కాదు' అని నచ్చచెప్ప ప్రయత్నించాను. శ్రీ నాళం రామచంద్ర రావుకు కోపం వచ్చింది. అతడు 1942 కాంగ్రెసు ఉద్యమ యోధుడు. జడ్జిని దిగిపొమ్మని ఆదేశించిన వరుడు. ఒకటిన్నర సంవత్సర కాలం అజ్ఞాతవాసంలో నుండి తరువాత కారాగారంలో వున్న స్వాతంత్ర్యోద్యమ కార్యకర్త. 'నీవు కాంగ్రెసు వ్యతిరేకివి కనుకనే కుంటిసాకులు చెప్తున్నావు' అన్నాడు. ఇతర మిత్రులను కొందరిని సంప్రతించాను. వారూ 'రిఫరెన్సు' చేయమన్నారు. వారి అభిప్రాయానుసారంగా అలా చేశాను. జడ్జిగారు ఆ పూటకు దావాల విచారణ వాయిదా వేశారు. నేను పెద్దగా పరుషంగా మాట్లాడక పోయినా తోటి న్యాయవాది మిత్రుని మనస్సు కష్టపెట్టానేమోనని భావించాను. 'నీ మనస్సుకు కష్టం అయితే నన్ను క్షమించు. నీకు వ్యథ కలిగించాలని నా ఉద్దేశ్యం కాదు.' అని చీటిరాసి అతని యింటి వద్ద యిచ్చి వచ్చాను. తరువాత నాకు శ్రీ సీతారామా రావుకు 'రేటు పేయర్ల' వ్యవహారంలో తగాదా వచ్చినపుడు శ్రీ రామచంద్ర రావు యీ కాగితాన్ని వెలికితీసి 'రామమూర్తి ఎప్పుడూ యింతే; త్వరపడి తూలనాడ్తాడు' అని నిరూపించడానికి వాడాడు. ఇది శోచనీయం.

బాపట్ల హైస్కూలు చాల పురాతనమయినది. దానికి ఒకేసారి 'ఫుట్ బాల్' 'హాకీ' మొదలయిన ఆటలను మూటిని నిర్వహించటానికి వీలయిన ఆట స్థలము. ఒకేసారి 5 బ్యాడ్మింటెన్ కోర్టులు పట్టే చోటు, వసతి గృహం వున్నాయి. తరువాత వీటినన్నింటినీ వ్యవసాయ కళాశాలకు యిచ్చారు. ఈ హైస్కూలులో చదివినవారు ఎంతో పేరు ప్రఖ్యాతులు పొందారు. నేను పూర్వ విద్యార్థి సంఘ కార్యదర్శిగా వున్న సంవత్సరంలో సంఘ వార్షికోత్సవ సభకు ప్రముఖ కవి రాయప్రోలు సుబ్బారావు గారిని ఆహ్వానించాను. సాహితీ వేత్తను గౌరవించిన ఘనత పూర్వ విద్యార్థి సంఘానికి దక్కింది. కవరులో పైకం పెట్టి వారి ప్రయాణపు ఖర్చులకని

వారికి అందజేశాను. వారు దానివి మరల నాకే యిచ్చి సంఘ వ్యయానికి వాడమన్నారు.

బాపట్లలో 'టౌను హాలు' ఎడ్వర్డు 7 పట్టాభిషేక కాలపుది. దానికి గ్రంథాలయం వుంది. అమూల్యమయిన పుస్తకాలు దానిలో వున్నాయి. కొంతకాలం దాని పర్యవేక్షణ బాధ్యతను స్వీకరించాను. టెన్నిసు కోర్టు వుండేది. 1930 ప్రాంతంలో మేటి ఆటగాడైన శ్రీ దేశరాజు సార్వభౌమ రావుగారు అచట టెన్నిసు ఆడినవారే. టెన్నిసు కోర్టు నిర్వహణాధికారాన్ని ఎత్తుకున్నాను. ప్రతిరోజూ పన్నెందు మందికి తక్కువ లేకుండా ఆడేవారు. ఒకసారి రెండు నెలలు నేను వేరే పనిమీద వెళ్ళవలసి వచ్చి దానిని నడుపుకోమని, 'మార్కరు' చేత పనులు చేయించుకోమని కోరాను. రోజుకు 3 సెట్లు ఆడేవారు కూడా బాధ్యత తీసుకోవటానికి ముందుకు రాలేదు. నాకు కోపం వచ్చింది. కోర్టును మూసివేశాను. తడికలను అమ్మి తలా రూపాయి పదణాలు పంచిపెట్టాను. తరువాత 6 సంవత్సరాల వరకు కోర్టు మూతపడింది. ఇపుడు ఆలోచిస్తే తొందరపడ్డానేమోనని అనిపిస్తుంది. ఏదయినా సమాజంలో బాధ్యత తీసుకునేవారు చాల తక్కువగా వున్నారని తేలింది.

బాపట్ల రోటరీ క్లబ్‌లో సెక్రటరీగా పనిచేస్తున్నాను. రోటరీ గవర్నరు క్లబ్‌ను సందర్శించటానికి వస్తున్నారు. కమిటీలు వేసి అందరికీ బాధ్యతలను పంచాను. రోటరీ క్లబ్ తరపున సంచికను వెలువరించే పనిని ఒక రోటరీ సభ్యునికి వప్పచెప్పాను. రెండు రోజులకు గవర్నరు వస్తారనగా ఆ మిత్రుని 'సంచిక పని ఎంతవరకు పూర్తి అయింది' అని అడిగాను. 'మొదలు కాలేదు' అన్నాడు. రాత్రింపగల్లు శ్రమించి సంచికను వెలువరించాను. అది చూచి ఆ మిత్రుడు 'పేరు కోసం నీవు దానిని వెలువరించావు' అని వ్యాఖ్యానించాడు. నా మనస్సుకు కష్టం వేసింది. కొంతమంది తాము చేయరు, పనిచేసిన వానిని అభినందించకపోగా నిందిస్తారు. ఆ మానసిక వైఖరి నన్ను దిగ్భ్రాంతికి లోనుచేసింది.

మిత్రుడు కోన ప్రభాకర్ రావు బాపట్లలో రేవును ఏర్పాటు చేయిద్దామని తలచాడు. విమాన శాఖ 'రికార్డు'లలో 'సూర్యలంక' అనే పేరుతో బాపట్ల వద్ద రేవు వున్నట్లు నమోదు అయింది. 'సూర్యలంక' అభివృద్ధి సంఘాన్ని నెలకొల్పాడు. నా మీదవున్న అభిమానంతో నన్ను అధ్యక్షుడిని చేసి తాను కార్యదర్శిగా కార్యక్రమాలు నిర్వహించాడు. పుర ప్రజలకు ఈ విషయంగా ఆశక్తి కలుగ చేద్దామని తలచి 100 మందిని రెండు లారీలపై ఆ రేవు స్థలానికి తీసుకొని వెళ్ళాం. విజ్ఞాపనలు చేశాం. కాని సూర్యలంకలో విమాన శాఖవారి స్థావరం ఉండటంతో అచ్చట రేవును ఏర్పాటు చేస్తే రక్షణ బాధ్యత కష్టమని వారు అభ్యంతరం పెట్టడంతో ఆ ప్రయత్నం ఫలించ లేదు. దరిమిలా సూర్యలంకకు బస్సు పడింది. అచ్చట శ్రీ కోన ప్రభాకర రావు గవర్నరు పదవి వదిలిన తరువాత కాంగ్రెసు రాజకీయ పాఠశాలను నిర్వహించాడు.

బాపట్ల తాలూకా కుటుంబ నియంత్రణ సంఘం ద్వారా కుటుంబ నియంత్రణ ప్రచారం చేశాము. గుంటూరు జిల్లా సంఘాన్ని చీరాల సభలో నిర్మించాం.

బాపట్లలో నేనుండగానే గుంటూరు జిల్లాలో కొంత ప్రాంతం, నెల్లూరు జిల్లాలోని కొన్ని తాలూకాలు కలిపి ఒంగోలు కేంద్రంగా ప్రకాశం జిల్లాను ఏర్పాటుచేయ

నిశ్చయించింది రాష్ట్ర ప్రభుత్వం. తత్ఫలితంగా బాపట్ల పరిధిలోని బాపట్ల తాలూకా ప్రాంతాన్ని, ఒంగోలు తాలూకా ప్రాంతాన్ని ఒంగోలు సబ్ కోర్టు పరిధిలో వుంచారు. అప్పుడు బాపట్ల న్యాయవాదులు చేయవలసిన పనులు మూడు రకాలుగా వున్నాయి. బాపట్ల సబ్ కోర్టు తాలూకాలోనే ఇది సాధ్యం కాదు. ఒంగోలు సబ్ కోర్టు పరిధిలో బాపట్ల తాలూకా సొంత ప్రాంతాన్ని ఒంగోలు తాలూకాను వుంచడం రెండవది. ఇది బాపట్ల న్యాయవాదులకు నష్టదాయకం. చీరాలలో సబ్ కోర్టు పెట్టాలనడం మూడవది. ఇది బాపట్ల న్యాయవాదులకు లాభకరం. బాపట్లకు చీరాల పది మైళ్ళ దూరం. కనుక బాపట్లలో చేస్తూ చీరాల వెళ్ళి దావాలు చేసి రావటానికి వీలుంటుంది. చీరాలలో సబ్ కోర్టు కావాలనే వారితోపాటు నేనూ వంతపలికాను. కృషి చేశాను. శ్రమ ఫలించింది. చీరాలలో సబ్ కోర్టు నెలకొన్నది. నాకు కేసులు ఎక్కువగా వచ్చే ప్రాంతం చీరాల సబ్ కోర్టు జ్యూరిస్‌డిక్షనులో వుండటంతో 1970 డిసెంబరులో నేను చీరాలలో నివాసం ఏర్పరుచుకున్నాను.

# చేనేత ఉద్యమం

నాకు చేనేత ఉద్యమంతో 1943 నుండి పరోక్షంగా సంబంధం ఉండేది. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రోజుల్లో పశ్చిమ గోదావరి జిల్లాలో చేనేత పారిశ్రామికుల రంగంలో పనిచేస్తున్న కామ్రేడ్ అల్లం మాణిక్యాలరావు నా పార్టీవాడు; సహచరుడు. ఒకరోజు అతడు హఠాత్తుగా నా వద్దకు వచ్చాడు. చేనేత మహాసభలో తను చేయవలసిన సంఘాను గురించి సలహా అడిగాడు. కమ్యూ. స్యనిస్టులు ఎప్పటికయినా భారీ బట్టల మిల్లులే శరణ్యం అంటున్నారట. రాడికల్ డెమోక్రాటులం మనం ఏమని చెప్పాలి అనేదే సమస్య. రాత్రికి రాత్రి తేలాలట. మరునాడు మహాసభయట. రాష్ట్ర పార్టీ ఆఫీసులో నేను తప్ప మరో కార్యదర్శి లేరు. ఇతరులను సంప్రతించే అవకాశం లేదు. పది నిముషాలు ఆలోచించాను. చేనేత పారిశ్రామికులు సహకార సంఘాలుగా ఏర్పడి నడిపే మరమగ్గాలే మన నినాదం కావాలి అన్నారు. కామ్రేడ్ మాణిక్యాలరావు తృప్తిపడి వెళ్ళిపోయాడు. నిజానికి నేను సమస్యను క్షుణ్ణంగా అధ్యయనం చేసి అలా సలహా చెప్పలేదు. ఇరువర్గాలు తల ఒక పద్ధతిని సూచిస్తున్నారు. కనుక మనం మరొక ప్రత్యేకమయిన పద్ధతిని చెప్పాలి అనేదే నా తాపత్రయం. తరువాత ఒక నెల రోజులకు దాన్ని గురించి పూర్తిగా పరిశీలన చేశాను. నేను పేర్కొన్న నినాదం సక్రమమైనదనే సంతృప్తి నాకు కలిగింది.

మరో సందర్భంలో చేనేత రంగ వ్యవహారాల్లో నేను తలదూర్చిన సంఘటన విచిత్ర సన్నివేశాలతో కూడినది. నాకు కంతేటి లక్ష్మీనారాయణ అనే వ్యక్తి పరిచయమయినాడు. అతడు మరో ప్లీడరుగారి క్లయింటు. అతడు నన్ను సలహాలడిగే వాడు. అవి తన దావాలకే సంబంధించినవి కావు. అతడు ఆంధ్ర రాష్ట్ర చేనేత సహకార సంఘంలో ఉద్యోగి. అచట లేబరు యూనియను స్థాపించాడు. దానిలో నాకు ఆఫీసరు ఉద్యోగం యిప్పించాడు. ఆ సోదాలో 1958లో హైదరాబాదులో మంత్రి సర్వోత్తమ రెడ్డి అధ్యక్షతన జరిగిన లేబరు సెమినారులో నేను పాల్గొన్నాను. యూనియను లీడరుగా అతనికి రాష్ట్ర చేనేత సంఘంలో పదవి లేకుండా మకుటం లేని మహారాజుగా నున్న శ్రీ ప్రగడ కోటయ్యగారికి మధ్య వైరం ప్రబలింది. ప్రగడ కోటయ్యగారు ఈనాడు కాంగ్రెసువాదిగా పార్లమెంటు సభ్యులు. నలుబది సంవత్సరాలుగా చేనేత పారిశ్రామికుల నాయకుడు. ఆయన నా మిత్రుడు ఆవుల గోపాల కృష్ణమూర్తికి వెనుకబడిన జాతుల ఉద్యమ సందర్భంగా సన్నిహితుడు. నేను తెనాలి వెళ్ళి యిద్దరి మధ్య తగాదాలను సర్దమని గోపాల కృష్ణమూర్తిని కోరాను. లక్ష్మి నారాయణ తన ఉద్యోగానికి రాజీనామా చేస్తే చేనేత సహకార సంఘం చేత కొంత పెద్ద మొత్తం నష్ట పరిహారంగా యిప్పిస్తానని ప్రగడ కోటయ్యగారు జవాబు చెప్పారు. ఆ ప్రతిపాదన లక్ష్మీనారాయణకు రుచించలేదు. యుద్ధానికి సిద్ధపడ్డాడు. నన్ను రంగంలోకి దింపదలిచాడు. నేను డైరెక్టరుగా వున్న బాపట్ల అర్బన్ కోపరేటివు బ్యాంకుకు చేనేత సహకార సంఘంలో సభ్యత్వం యిప్పించాను. బ్యాంకు ప్రతినిధిగా నన్ను పేర్కొన్నది బ్యాంకు. 5 వందల పై చిలుకు డిపోలున్న ఆంధ్ర రాష్ట్ర చేనేత సహకార సంఘ సర్వసభ్య సమావేశానికి హాజరయ్యాను. ప్రగడ కోటయ్యగారు, 128 శాఖలు గల ఎమ్మిగనూరు చేనేత సహకార సంఘ వ్యవస్థాపకులు శ్రీ

మాచాని సోమప్పగారు చేనేత రంగంలో ప్రత్యర్థులు. శ్రీ మాచాని సోమప్పగారిని సమర్థించేవారు నా ప్రతిపాదనలను బలపరిచే ఏర్పాటు లక్ష్మీనారాయణ చేశాడు. సభలో రెండవ వరుసలో కూర్చున్నాను. ప్రగడ కోటయ్యగారూ నేనూ గుంటూరు జిల్లా వాసులం. ఇద్దరం రాజకీయాలలో పనిచేసేవారం. పై పెచ్చు ఇరువురం గోపాల కృష్ణమూర్తి స్నేహితులం కావడం వల్ల బాగా పరిచయస్తులం. సభలోకి వెళ్ళగానే ప్రగడ కోటయ్యగారు నన్ను ఆహ్వానించి 'మన్మిద్దరం 13 మైళ్ళ దూరంలో వున్నాం (నేను బాపట్లలో, వారు నిడుబ్రోలులో) తీరికగా యింటివద్ద కలిసి మాట్లాడుకోవచ్చు కదా' అని అన్నారు. 'వచ్చాను కదా! సభా ముఖంగానే మాట్లాడుకుందాం' అన్నాను. 'సరే. మీ యిష్టం' అన్నారు. ఆంధ్ర రాష్ట్ర సహకార సంఘానికి 9 మంది డైరెక్టర్లు వున్నారు. ఏదయినా జటిలమయిన సమస్య వస్తే ప్రగడ కోటయ్యగారు మాట్లాడవలసిందే తప్ప డైరెక్టర్లు నోరు ఎత్తరు. అది అప్పటి సంప్రదాయం. మామూలుగా సర్వసభ్య సమావేశానికి 125,150 మంది రావటం, టీ పార్టీ జరగటం, చర్చ లేకుండా తీర్మానాలు ఆమోదింప బడడం ఆనవాయితీ. ఈసారి సభకు సుమారు నాలుగు వందల పైన వచ్చారు. ఇరువైపుల బల సమీకరణ జరిగిందన్న మాట.

సర్వసభ్య సమావేశంలో చర్చనీయాంశాలలో మొదటిది గత సంవత్సరపు ఆదాయ వ్యయ అంచనాలను ఆమోదించటం. నేను లేచి జరిగిపోయిన సంవత్సరపు బడ్జటును ప్రవేశ పెట్టడం చోద్యమని విమర్శించాను. ప్రగడ కోటయ్యగారి వంటి పార్లమెంటరీ సంప్రదాయాలు తెలిసిన వ్యక్తి సలహాదారుగా ఉన్న డైరెక్టర్ల బోర్డు యిలాంటి అనుచిత కార్యం చేయ తలపెట్టడం శోచనీయమన్నాను. కోటయ్యగారు లేచారు. 'రామ్మూర్తిగారు యీ జిల్లాలో విశిష్టమైన రాజకీయ కోవకు చెందినవారు. వారు చెప్పిన అభ్యంతరం సబబే' అంటూ డైరెక్టర్ల బోర్డును తీవ్రంగా దుయ్యబట్టారు. రెండవ అంశం చర్చకు వచ్చింది. సుమారు 30వేల రూపాయల చేనేత వస్త్రాలను సహకార శాఖ అధికారులకు బహూకరించిన విషయంపై నేను బోర్డును తప్పుపట్టాను. మరల కోటయ్యగారు లేచి 'రామ్మూర్తిగారికి చేనేత రంగం క్రొత్త. మన సంప్రదాయాలు వారికి తెలియవు. మనది అన్నపూర్ణ పుట్టిన దేశం. అతిథి అభ్యాగతులను ఆదరించే దేశం. సహకార శాఖ అధిపతులు మన అతిథులు. వారిని సత్కరించటం మన విధి' అన్నారు. డైరెక్టర్ల తీర్మానానికి అనుకూలంతో సుమారు 300 వోట్లు, వ్యతిరేకంగా 125 వోట్లు వచ్చినట్లు గుర్తు. మూడవ అయిటంను సభ ముందు పెట్టాడు అధ్యక్షుడు. నేను మరల లేచాను. బజారులో సున్న నూలు ధరకన్న తక్కువ ధరకు నూలును ప్రాథమిక చేనేత సహకార సంఘాలకు, సరఫరా చేయక పోవటాన్ని ఖండించాను. అంత కోటయ్యగారు దిగ్గున లేచారు. 'రామ్మూర్తిగారికి ఎవరో తప్పుడు సమాచారం అందించారు. కనుకనే వారు అడ్డుతగులుతున్నారు' అని వ్యాఖ్యానించారు. డైరెక్టర్ల ప్రతిపాదన నెగ్గింది. నాలుగవ అయిటమును చదివాడు అధ్యక్షుడు. నేను డైరెక్టర్ల బోర్డు అసమర్థతను వ్రేలెత్తి చూపాను. ప్రగడ కోటయ్యగారు ఈసారి కూడా నాకు వ్యతిరేకంగా ప్రసంగించక తప్పలేదు. 'రామ్మూర్తి పంతులుగారు దురుద్దేశంతో ఈ సమావేశానికి విచ్చేశారు' అన్నారు. దిగ్భ్రాంతి చెందాను.

కోటయ్యగారు యిలా మట్లాడతారని నేను కలలో కూడా అనుకోలేదు. 'పంతులుగారు' అని నన్ను పేర్కొనడంలోని అంతరార్థం తెలిసిపోయింది. 'రామ్మూర్తిగారు బ్రాహ్మణులు. మనం పాలెవారం. మనం ఐక్యంగా కృషి చేయటాన్ని నిరోధించటానికి ఆయన యీ సమావేశానికి వచ్చారు' ఇదీ ఆరోపణ. కులాన్ని సాధనంగా వాడారు కోటయ్యగారు. ఇలాంటి పని రాజకీయ నాయకులకు క్రొత్త కాదు. వారికి స్వతహాగా కులతత్వం లేకపోయినా దాన్ని వాడుకోవటానికి వారు ఏనాడూ వెనుదీయరు.

తరువాత లక్ష్మీ నారాయణను ఉద్యోగం నుండి తీసివేయటం, అతనికి కొంత మొత్తం 'బాధా ఉపశమనార్థం' యివ్వటం వెంట వెంట జరిగిపోయాయి. నేను మరల చేనేత రంగంతో ప్రమేయం పెట్టుకోలేదు.

# మునిసిపలు ఎన్నికలలో అసాధారణ సంఘటన

**బాపట్లలో** మునిసిపలు కౌన్సిలు ఎన్నికలు జరిగాయి. అధ్యక్ష పదవికి శ్రీ యడవల్లి సూర్యనారాయణ, శ్రీ కాకుమాను భావనారాయణ పోటీదార్లు. ఇద్దరూ పట్టభద్రులే. ఇద్దరూ సమ ఉజ్జీలే. ప్రథమ ఎన్నికలలో యడవల్లి సూర్యనారాయణను ప్రథమంలో బలపర్చిన కాకుమాను రామస్వామి గారి కుమారుడే భావనారాయణ. పదవుల వేటలో తన మన లేవు కదా!

తనను బలపరిచే 10మంది సభ్యులను తీసుకొని అజ్ఞాతవాసానికి పోయాడు సూర్యనారాయణ. అలాగే తనను సమర్థించే సభ్యులను తీసుకొని వెళ్ళాడు భావనారాయణ. 'నీవా నేనా' అన్నట్లుంది పోటీ. నాకు యీ ఎన్నికతో సంబంధం లేకపోయినా, సూర్యనారాయణ కుటుంబానికి రక్షణ యివ్వడం బంధువుగా నా కర్తవ్యంగా భావించి రాత్రివేళ అక్కడే తిష్టవేసేవాడిని. ఒక సభ్యుడు భావనారాయణ 'క్యాంపు' నుండి సూర్యనారాయణకు వోటుయిస్తే అతనికి విజయం లభిస్తుంది. బాపట్ల పట్టణం చుట్టూ వున్న పాలెంలు బాపట్ల మునిసిపాలిటీ పరిధిలో ఉన్నాయి. ఒక పాలెం నుండి ఒక వ్యక్తి కౌన్సిలరు అయ్యాడు. ఆ వార్డు నుంచి గెలవడానికి అతడు పదివేలు ఖర్చుపెట్టాడు. దానికిగాను ఒక ఎకరం పొలం అమ్మాడు. అతనికి ముగ్గురు పిల్లలు. అతని మేనమామ తన మేనల్లుని చర్యకు బాధపడ్డాడు. తనకు పదివేలిస్తే ఆ పైకం వున్న సంచిని ఎన్నికనాడు మునిసిపలు ఆఫీసు మెట్లు ఎక్కేటప్పుడు తన మేనల్లుడికి చూపించి అతని వోటు సూర్యనారాయణకు వేయిస్తానని

సూర్యనారాయణ కుటుంబానికి, స్నేహితులకు కబురు పెట్టాడు. సూర్యనారాయణకు అధ్యక్ష పదవిపై వున్న ఆసక్తిని గమనించిన అతని భార్య కౌన్సిలరు మేనమామకు సంచిలో పదివేల రూపాయలు పెట్టి యిచ్చింది విశాలాంగులయిన తన సంతానాన్ని చూపి 'వీరికి మీరు అన్యాయం చెయ్యవద్దని' ప్రాధేయపడింది. కౌన్సిలరు మేనమామ పెద్ద రైతు; పెద్ద మనిషి. అతడు అల పంపించాడు. మరునాడు ఉదయం అధ్యక్షుని ఎన్నిక. ఆ కౌన్సిలరును త్రాగించి మైకంలో వుంచి, ఇరువైపుల తనకు బాగా నమ్మకస్తులయిన కౌన్సిలర్లను పెట్టి మేడ మెట్లెక్కించి హాలులోకి తీసుకొని వెళ్ళాడు శ్రీ భావనారాయణ. అధ్యక్షుని ఎన్నిక జరిగింది. శ్రీ భావనారాయణ గెలిచాడు.

ఆ రాత్రి పది గంటలకు కౌన్సిలరు మేనమామ సూర్యనారాయణ యింటికి వచ్చాడు. అతని భార్య వద్దకు వచ్చి 'అమ్మా! నేను ఎంత ప్రయత్నించినా మావాడి దృష్టిని ఆకర్షించ లేకపోయాను. మా వాడి వోటు సూర్యనారాయణకు పడలేదు. మీరిచ్చిన సంచి. అందులో మీ పైకం' అని పైకం తిరిగి యిచ్చాడు. ఈ సంఘటన చూచి మేము ఆశ్చర్య పోయాము. ఇంతవరకూ ఏ ఎన్నికలలో వోటుకని తీసుకున్న పైకం తిరిగి రాలేదు. 'మావాడు సూర్యనారాయణకే వోటు వేశాడు' అని ఆ కౌన్సిలరు మేనమామ అబద్ధమాడితే చేయగల్గింది లేదు. కాని, అతడు సత్యవాది; నిజాయితీపరుడు. అతడు అలాంటి దుశ్చర్యకు గడంగ తలచలేదు.

# తుపానుబాధిత దక్షిణ
# కోస్తాప్రాంత మహాసభ

**1969** సంవత్సరంలో తుపాను వచ్చింది. దక్షిణ కోస్తా ప్రాంతం అతలాకుతలమయింది. కుండపోత వర్షానికి నాగార్జున ఆయకట్టు నీరును సముద్రానికి చేర్చే కాలువలు పొంగాయి. మాగాణి పైరులు విపరీతంగా నష్టమయ్యాయి. ఇళ్ళ సంగతి చెప్పనక్కర లేదు. బాపట్ల ప్రాంతం మరీ దెబ్బతిన్నది.

నాకు ఒక గుణం వుంది. సమస్యకు వెన్వెంటనే స్పందించడమే అది. దానిని 'అదృష్టంగా' భావిస్తాను. దీనివల్ల కొన్ని సందర్భాలలో రాజకీయ పార్టీల వారికన్నా ముమ్ముందుగా నేను స్పందించటం జరుగుతున్నది. వారు సమిష్టి నిర్ణయాలు చేయాలి కనుక విధిగా ఆలస్యం అవుతుంది కదా! నేను పార్టీరహిత దృక్పథం కల వ్యక్తిని కనుక నాకు పనిలో, నిర్ణయంలో సులువు. (ఈ చొరవ నా సతీమణి మల్లాది సుబ్బమ్మకు అబ్బింది. కనుకనే పార్టీల వారికన్నా ముమ్ముందుగా ఉద్యమాలు ప్రారంభించ కలుగుతున్నది).

తుపాను కలిగించిన భీభత్సానికి, తెచ్చిన నష్టానికి నేను దిగ్భ్రాంతి చెందాను. తీవ్రంగా ఆలోచించాను. ప్రకృతి శక్తులను కొన్ని సమయాల్లో, సందర్భాల్లో ఎలాగూ ఆపలేక పోతున్నాం. కనీసం మనుజులు వేసే పథకాల వల్ల కష్టనష్టాలు సంభవించ రాదుకదా! నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మించాం. లక్షల ఎకరాల పొలాలకు నీరు అందించాం. అయితే, ఆ పొలాలలోకి వచ్చే నీటి మొత్తాన్ని సముద్రంలోకి పంపే ఏర్పాటు సక్రమంగా చేయలేకపోయాం. ఆ నీటి పరిణామాన్ని అంచనావేసి అది సముద్రంలోకి పోవటానికి వేరే ప్రత్యేక కాల్వలను నిర్మించ లేకపోయాం. బాపట్ల, రేపల్లె తాలూకాలు సముద్రానికి ఆనుకొని వున్న లోతట్టు ప్రాంతాలు. క్రొత్తగా మాగాణి అయిన నరసరావు పేట, సత్తెనపల్లి తాలూకాల పొలాల నీరు బాపట్ల, రేపల్లె ప్రాంతాల పొలాలను ముంచివేసింది. ఈ లోపం 1969 తుపానుతో బయటపడింది.

బాపట్లలో 'తుపాను బాధిత దక్షిణ కోస్తా ప్రాంత మహాసభను' ఏర్పాటు చేశాను. పలువురు రైతులు ఆసక్తిగా పాల్గొన్నారు. ఒక రైతు- జమ్ములపాలెం గ్రామ మునసబుగా వున్న పి. అంకమ్మ వరద నీటి సమస్యపై ఒక చిన్న పుస్తకాన్ని ప్రచురించాడు. రాజకీయ పార్టీలవారు కూడా శ్రద్ధగా, ఆసక్తిగా పాల్గొన్నారు. చర్చలు అర్థవంతంగా సాగాయి. పొలాల మురుగు నీరును సముద్రంలోకి చేర్చే 'డ్రెయినులు' కాక అలాయిదాగా, అదనంగా 'స్ట్రెయిట్ కట్'లను (సరాసరి సూటిగా సముద్రంలోకి ప్రవహించే కాలువలను) నిర్మించాలని కోరాం. అలా తీర్మానాలను చేశాం. మహాసభకు పత్రికలు ప్రచారం యిచ్చాయి. వరదనీటి సమస్య, పథకాలు వేసేవారికి ముందుచూపు లేకపోవడం, అదనపు కాల్వల నిర్మాణం, యివన్నీ ప్రజల దృష్టికి వచ్చాయి. తరువాత ప్రభుత్వం అదనంగా 'స్ట్రెయిట్ కట్'లను త్రవ్వింది. వరద బెడద చాలా వరకు తగ్గింది. నేను సమావేశ పరచిన మహాసభ వలననే అలా జరిగిందని నేను అనటం లేదు కాని నేనూ 'ఈ యజ్ఞానికి ఒక సమిధను' చేకూర్చాను.

# రాడికల్ హ్యూమనిస్టు పత్రికలు

రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం చావకుండా వున్నదంటే దానికి ముఖ్య కారణం రాడికల్సు నడిపిన పత్రికలు. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ పుట్టక ముందు కూడా రాడికల్ వాదులుగా ప్రసిద్ధిపొందిన ఎం.ఎన్. రాయ్ అనుచరులు తెలుగులో పత్రికలు నడిపారు. తెనాలి నుండి వెలువడిన మాస పత్రిక 'విహారి' మొదటిది. దానిని నిర్వహించినవారు కోగంటి రాధాకృష్ణమూర్తి. పి.వి. సుబ్బారావు, జి.వి. కృష్ణారావు గారలు. వీరందరూ మొదట్లో త్రిపురనేని కవిరాజు భావ ప్రభావితులే. దరిమిలా ఎం.ఎన్. రాయ్ తాత్విక దృష్టిని ఆమోదించారు. మిత్రులు రాధాకృష్ణ మూర్తి, జి.వి. కృష్ణారావు తెనాలికి నాలుగు మైళ్ళలో వున్న కూచిపూడి వాస్తవ్యులు. ముగ్గురూ విద్యావంతులే; పట్టభద్రులే. జి.వి. కృష్ణారావు సాహిత్య పిపాస కలవాడు. కవిత్వం రాసేవాడు. ఆనాడు అతడు రాసిన 'వరూధిని' అతనికి పేరు తెచ్చింది. తరువాత అతడు డా. జి.వి. కృష్ణారావుగా భాసిల్లాడు. ''కీలుబొమ్మలు'' నవల అతడికి విశేష కీర్తిని ఆర్జించి పెట్టింది. నాగార్జునుని మాధ్యమిక సిద్ధాంతాన్ని, ప్లేటో తాత్విక చింతనలను వివరిస్తూ గ్రంధాలు రాశాడు. నవలలు, కథలు విరివిగా రచించాడు. తరువాత విజయవాడ ఆకాశవాణిలో ప్రయోక్తగా పనిచేశాడు. పి.వి. సుబ్బారావు తెనాలిలో ప్లీడరు చేశాడు. చిన్న కథ అతని చేతిలో మలుపులు తిరిగింది. ఖ్యాతి తెచ్చింది. రాధాకృష్ణ మూర్తి సరళమైన భాషలో భావ వ్యక్తీకరణ చేయగల దిట్ట. తరువాత ఎం.ఎన్. రాయ్ వ్యాసాల పేరుతో ఎం.ఎన్. రాయ్ రచనలను అనువదించాడు. ఆ పుస్తకం అందరికి సుబోధకమయి, స్పష్టమయి ఉద్యమ వ్యాప్తికి ఎంతో తోడ్పడింది. అతడి స్వంత రచనలు ''ఇండియాలో విప్లవం'', ''గాంధీ మార్గం'' పేరెన్నికగన్నవి. ''ఇండియాలో విప్లవం'' అనే గ్రంథంలో వర్ణ వ్యవస్థకూ, వర్గ వ్యవస్థకూ సంబంధము కలిపాడు; సామ్యాలు చూపాడు. వీరు ముగ్గురూ కలసి ప్రతిభతో చేసిన రచనలు 'విహారి'లో ప్రత్యక్షమయ్యేవి. వీరు ముగ్గురికి ప్రఖ్యాత కథా రచయిత, నవలా రచయిత టి. గోపిచంద్ (త్రిపురనేని గోపీచంద్) స్నేహితుడు, సహచరుడు. త్రిపురనేని కవిరాజు కుమారుడు. తండ్రి ఆలోచనా సరళిని ఆనాడు అవగతం చేసుకున్న భావుకుడు. ఆయన తరువాత చేసిన రచనలలో ''అసమర్థుని జీవయాత్ర''. ''మెరుపు మరకలు'' ప్రసిద్ధి చెందినవి. ఆయన కథలు సుప్రసిద్ధాలు. తన తండ్రిగారు ఆస్తికులని గోపిచంద్ తరువాతి కాలంలో వ్యాఖ్యానిస్తే, త్రిపురనేని శిష్యుడు ఆవుల గోపాల కృష్ణమూర్తి కవిరాజును నాస్తికునిగా చిత్రీకరించాడు.

తరువాత ''రాడికల్'' అనే పేరుతో పత్రిక వెలువడేది. దానికి బాధ్యత వహించింది ఆవుల గోపాల కృష్ణమూర్తి. ఎన్నికలయిన తరువాత కొన్నాళ్ళకు ఆ పత్రిక ఆగిపోయింది. రాడికల్ వాదుల పత్రికలు రెండేళ్ళు నడవడం తరువాత ఒక సంవత్సరం లేక సంవత్సరంన్నర ఆగిపోవటం, మరల మరో పేరుతో ప్రారంభం కావడం -అది అలా మరల రెండేళ్ళు నడవడం యిలా 1942-43 నుండి యీనాటి వరకు

సాగుతున్న చరిత్ర అది.

రాడికల్ పార్టీ 1946లో ఎన్నికలలో పోటీ చేసింది కదా. అంతకుముందే 'రాడికల్' పేరుతో తెనాలి నుండి పక్షపత్రిక నడిచింది. ఆగిపోయింది. తరువాత మరల కామ్రేడ్ షేక్ ఖాజామియా మేనేజింగ్ ఎడిటరుగా, పార్టీ కార్యదర్శులు సంపాదకవర్గ సభ్యులుగా 'రాడికల్' పత్రిక తెనాలి నుండి కొనసాగింది. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రద్దయిన తరువాత కోగంటి సుబ్రహ్మణ్యం మేనేజింగు ఎడిటరుగా, ఆవుల గోపాల కృష్ణమూర్తి, మల్లాది వెంకట రామమూర్తి, కొల్ల శివరామిరెడ్డి, పాపులూరి కృష్ణ చౌదరి, కోగంటి రాధాకృష్ణ మూర్తి సంపాదక వర్గ సభ్యులుగా తెనాలి నుండి కొన్ని సంవత్సరాలు ప్రకటించబడింది. తరువాత చీరాల నుండి సి.హెచ్. రాజారెడ్డి మేనేజింగు ఎడిటరుగా 'సమీక్ష' మాసపత్రిక ఆవుల గోపాల కృష్ణమూర్తి, రావిపూడి వెంకటాద్రి, ఎన్.వి. బ్రహ్మం, మల్లాది వెంకట రామమూర్తి సంపాదక వర్గ సభ్యులుగా వెలువడింది. సుమారు 7 సంవత్సరాలు నడిచింది. తరువాత ఎన్.వి. బ్రహ్మం సంపాదకుడుగా రాడికల్ హ్యూమనిస్టు కొంత కాలం చీరాల నుండి వచ్చింది. 1987 నుండి రాజారెడ్డి పబ్లిషరుగా అంచా బాపారావు సంపాదకుడుగా చీరాల నుండి 1994 సెప్టెంబర్ వరకు 'న్యూ హ్యూమనిస్టు' పేరుతో మాస పత్రికగా ప్రచురితమయింది. ప్రస్తుతం 'బులిటన్'గా ప్రచురణ చేస్తున్నారు. ఇలా ఏ రూపంలోనయినా వారపత్రిక, పక్షపత్రిక, మాస పత్రికల రూపంలో - 1940 ప్రాంతం నుండి ఇప్పటి వరకు పత్రిక ఏదో ఒకటి వుంటూ వుంది. సి.హెచ్. రాజారెడ్డి 'సమీక్ష' పేరులో ఎవరి సహాయం లేకుండా అవిచ్ఛిన్నంగా 7 సంవత్సరాలు ఒక్క చేతి మీదుగా నడపగలిగాడు. అది ప్రశంసనీయమయిన కృషి.

తెనాలి నుండి గోపాల కృష్ణమూర్తి బాధ్యుడుగా పత్రిక వెలువడినంత కాలం సంచికకు 1000 కాపీలు అచ్చువేసేవారు. చందాలు చెల్లించేవారు ఏనాడూ 300కు మించలేదు. కాని పత్రికలు బట్వాడా అయ్యేవి. విరాళాలు యిచ్చేవారు సుమారు 30 మంది వుండేవారు. పత్రిక చందాగాని, విరాళం గాని తీసుకోకుండా పంచి పెట్టడం యుక్తంకాదని నేను గోపాల కృష్ణమూర్తితో పేచీ పెట్టేవాడిని. ఒకసారి కారు వేసుకొని 20 ఊళ్ళు తిరిగి వస్తే 10, 15 వేలు వసూలు చేయగలను అని అనేవాడు. అయితే, ఆ పని చేయటానికి అతనికి తీరిక సమయం దొరికేది కాదు. అచ్చు ఆఫీసు వారికి తన పైకం సర్దేవాడు. ఈ పద్ధతి నాకు అయిష్టమయింది. నాబోటి వాళ్ళం సంవత్సరానికింత అని విరాళం ఇచ్చి ఊరుకునేవాళ్ళం. అతను భారీగా పెట్టుబడి పెట్టడం జరిగేది. గోపాల కృష్ణమూర్తి ఆశావాదతత్వాన్ని, అతని త్యాగాన్ని వివరించటానికి యీ విషయం రాస్తున్నాను. ఏదయినా చందా చెల్లించని వారి అందరికి (కొందరికి యివ్వక తప్పదు) ఉచితంగా పత్రిక యివ్వటం అనుచితమని యిప్పటికీ నా ధృఢ విశ్వాసం.

పైన రాసినదంతా తెలుగులో రాడికల్ పత్రికల సంగతి. ఎం.ఎన్. రాయ్‌చేత 1937 ఏప్రిల్ నుండి ప్రచురితమయిన 'ఇండిపెండెంటు ఇండియా' అనే ఇంగ్లీషు వారపత్రిక 1946 వరకు బొంబాయిలో ప్రసిద్ధ కార్మిక నాయకుడు వి.బి. కర్లిక్

మేనేజింగు ఎడిటరుగా, ఎం.ఎన్. రాయ్ సంపాదకుడిగా ఎగతెగకుండా ప్రచురితమయింది. తరువాత దానిని కలకత్తాకు మార్చారు. పత్రిక పేరు 'రాడికల్ హ్యూమనిస్టు'గా మారింది. ప్రఖ్యాత మేధావి శిబ్ నారాయణరే కార్య నిర్వాహక సంపాదకుడుగా సమర్థతలో అతడు ఆస్ట్రేలియా వెళ్ళేవరకూ నడిపాడు. తరువాత రజనీ ముఖర్జీ, అనిలెడే, శితాంశు ముఖర్జీ బాధ్యత వహించి కొనసాగించారు. తే. 25-1-1954న ఎం.ఎన్. రాయ్ మరణించాడు. తదనంతరం అతని భార్య సహచరి ఎలెన్ రాయ్ సంపాదకులయ్యారు. ఎలెన్‌రాయ్‌ని దుర్మార్గులు తే. 13-12-1960న డెహ్రాడూన్‌లో హత్య చేశారు. తర్వాత శిబ్ నారాయణరే సంపాదకులయ్యారు. కలకత్తా నుండి రాడికల్ హ్యూమనిస్టు పేరుతో 1946 నుండి 1969 వరకు వారపత్రిక వెలువడే కాలంలో అందరు కామ్రేడ్స్ ఉచితంగా తమ శ్రమను, కాలాన్ని వినియోగించేవారు. 23 సంవత్సరాల విశ్రాంతి, విరామం లేకుండా ప్రతిదినం రెండు గంటలు పత్రిక మేనేజరుగా కృషిచేసిన శ్రీ అనాథ మిత్రా అభినందనీయుడు. 1969 డిసెంబరు నుండి వి.ఎం. తార్కుండే (రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రోజుల్లో ప్రధాన కార్యదర్శి, ఇండియన్ రినైజాన్సు ఇన్‌స్టిట్యూట్ ట్రస్ట్ - చాలా కాలం ఛైర్మన్ జయప్రకాష్‌తో కలిసి పౌర హక్కుల ప్రజా సంఘం - పి.యు.సి.ఎల్ - వ్యవస్థాపకుడు) సంపాదకుడిగా ఢిల్లీ నుండి మాసపత్రికగా అవిచ్ఛిన్నంగా ప్రకటింపబడుతున్నది. పత్రిక ఎడతెగకుండా ప్రచురింపబడడానికి మూల ధనాన్ని సమకూరుస్తూ 'నిధి'ని ఏర్పాటు చేయడం జరిగింది.

బెంగాల్‌లో 'పురోగామి' అనే పేరుతో పత్రిక వస్తున్నది. ఇతర భాషలలో పత్రికలు అప్పుడప్పుడు వెలువడుతూ, ఆగిపోతూ మరల ముద్రించబడటం జరుగుతున్నది.

ఇంగ్లీషు అనుసంధాన భాష కనుక ఇంగ్లీషులో 1937 నుండి యీనాటి వరకు పత్రిక ముద్రింపబడుతుండటం వల్ల భారతదేశ రాజకీయ చిత్రపటంలో 1948 నుండి పార్టీగా లేకున్నా రాడికల్ హ్యూమనిస్టులకు స్థానం ఏర్పడింది.

# బాపట్ల విశిష్టత

నా కార్యక్రమాల సందర్భంగా అనేక పట్టణాలు సందర్శించడం తటస్థించింది. ఇంచుమించుగా అన్ని వూళ్ళలోనూ ఒకే పరిస్థితి. ప్రజా సంఘాల కార్యకర్తల మధ్య మాటలు వుండవు; సంభాషణలు సాగవు. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా వుంటారు. ఒకరి పొడ మరొకరికి గిట్టదు. బాపట్లలో మాత్రం ఈ చిహ్నాలు, లక్షణాలు కన్పించవు. కేవలం చిన్న వూరు గనుక అలా వుందని అనుకోవడానికి వీలు లేదు. ఇంతకన్నా చిన్న ప్రదేశాల్లో కార్యకర్తల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

ఒక్కొక్క పట్టణంలో ఒక్కొక్క విభేదం. ఈ జాడ్యం 1912 ప్రాంతం నుండి వుంది. ఉదాహరణకు బ్రాహ్మణులలో వైదీకి నియోగి తగాదాల మూలంగా పట్టణ ప్రజానీకాన్ని రెండు భాగాలుగా చీల్చారట. ఒక్క పరసారావు పేట జమీందారును మాత్రం మినహాయించారుట. ఇక తర్వాత సంగతి అదే విధానంలో సాగింది. ఒకచోట పార్టీ పరంగా, మరియొక చోట కమ్మ కమ్మేతర, యింకొక చోట తెలగ తెలగేతర, ఇంకా మరియొక చోట రెడ్డి రెడ్డేతర ఇలా స్పర్థలు కొనసాగాయి.

బాపట్లలో నాయకత్వం వహించేది మధ్య తరగతివారు. ఒక సమస్యపై తీవ్రమయిన బేధాభిప్రాయాలు మరో సమస్యపై కలసి పనిచేయడం జరుగుతుండేది. ఉదాహరణకు కాంగ్రెస్, కాంగ్రెసేతర రాజకీయాల విషయంగా నేనూ, కోన ప్రభాకర రావు విబేధించే వాళ్ళం. బహిరంగ వేదికలపై ఒకరి నొకరు విమర్శించుకునే వాళ్ళం. కాని సూర్యలంక రేవు సందర్భంగా, ఆర్ట్స్ కాలేజీ వ్యవహారాల్లో కలసి పని చేసేవాళ్ళం. అంతేకాదు ఒకే సంస్థలో పదవీ బాధ్యతలను స్వీకరించేవాళ్ళం. సూర్యలంక రేవు అభివృద్ధి సంఘాన్ని ఇందుకు మచ్చుగా తీసుకొనవచ్చును.

అంతే కాదు కార్యక్రమాల నిర్వహణలో పోటీ పడేవాళ్ళం. పలు ప్రజా సంఘాలలో పదవులు మా అభిప్రాయాలు ఉన్నవారికే దక్కాలని పోటీ పడేవాళ్ళం. అలాంటి కార్యకర్తలం – అన్ని పార్టీలలో, అన్ని గ్రూపులలో – 30 మంది దాకా వుండేవారం. నేను ఒకసారి మిత్రుడు కోన ప్రభాకర రావుకు ఒక సూచన చేశాను. ఒక్కొక్కరం ఒక్కొక్క ప్రజా సేవారంగాన్ని ప్రజా సంఘాన్ని ఎంచుకుందాం. దానిలో కనీసం మూడు సంవత్సరాల గడువు వరకు పదవులు స్వీకరించి పనిచేద్దాం. తర్వాత ఆ పదవులను ఒక గ్రూపు వదిలివేస్తే మరొక గ్రూపు లేక ఒక వ్యక్తి మానుకుంటే మరో వ్యక్తి చేపట్టాం. అలాంటి పద్ధతి వల్ల స్పర్థ, తద్వారా సంభవించే మానసిక శ్రమ, చికాకు తగ్గిపోతాయి. కానీ యీ ప్రతిపాదన అతనికి నచ్చలేదు. కొంచెం మనస్తాపం కల్గింది. పూర్తిగా కులతత్వం, ముఠాతత్వం పోయి సమస్యను వస్తు నిష్ఠతో అర్థం చేసుకున్నప్పుడే ఇది సాధ్యమని అచిరకాలంలో గ్రహించాను. దీనిని గురించి విజ్ఞులు తప్పక ఆలోచించాలని నా అభిమతం.

బాపట్ల ప్రత్యేకతను తెలియజేసే సంఘటన ఒకటి వివరిస్తాను. బాపట్ల చురుకయిన కార్యకర్తలకు చాలదని, వారు ఇంకా పెద్ద పట్టణాన్ని కార్యక్షేత్రంగా ఎంచుకోవాలని నేను అభిలషిస్తుండే వాడిని. ప్రతిభ చిన్న ఊరిలో వికసించినా దానికి తగిన ప్రాచుర్యం రాదు. అలాగని కొత్రపాటి గంగాధర రావుగారికి సూచించేవాడిని. ఆ మాట

మంచిదే. కాని కాలం అనుకూలం కావాలి కదా అని అనేవారు. ఆయన దీని విషయం తీవ్రంగా ఆలోచించే సమయం రాకముందే ఆయన చనిపోయారు. కోన ప్రభాకర రావు నాలాగానే ఆలోచించాడు. కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ.గా . పి.వి. వర్గంలో చేరాడు. ఆం.ప్ర. రాష్ట్ర అధ్యక్షుడయ్యాడు. ముఖ్యమంత్రి పదవి కొద్దిలో తప్పిపోయింది. రాష్ట్ర ఆర్థిక మంత్రి అయ్యాడు. తర్వాత సిక్కిం గవర్నర్‌రుగా నియమింప బడినాడు. ఆ పైన మహారాష్ట్రకు గవర్నరుగా ఎంపిక చేయబడ్డాడు. కొలది కాలంలో మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించ గలిగాడు. అతడు ఈనాడు లేడు.

నేను అనేక కారణాల వల్ల తేదీ 31.12.76న హైదరాబాద్‌కు మకాం మార్చాను. ఆ కథ తర్వాత వినిపిస్తాను. కోన ప్రభాకర రావు రాష్ట్ర మంత్రిగా వున్న రోజుల్లో 1982లో నాకు విస్ప దెబ్బ తగిలి ఎడమ కంటి దృష్టి పోయింది. ఒక రోజు ఉదయం గవర్నమెంట్ 'పైను బోర్డు' వున్న కారు నా యింటి ముందు ఆగింది. నేను మనస్తత్వ రీత్యా ప్రభుత్వ వ్యతిరేకిని (చివరకు రాడికల్ హ్యూమనిస్టుగా వున్న వ్యక్తి ముఖ్యమంత్రి అయినా నేను అలాగే వుంటానని నా అంచనా) ఎవరా అని వాకిట్లో నిలబడి ఆలోచిస్తూ వుండేలోగా 'ఏమోయ్ రామ్మూర్తీ! కంటికి దెబ్బ తగిలిందటగా' అంటూ లోపలికి నడిచాడు.

శ్రీ వి.ఎల్. సుందర రావు బాపట్ల నివాసి. 1942-45 ప్రాంతంలో విద్యార్థి నాయకుడు, విద్యార్థులచేత సమ్మెలు చేయించాడు. ఆనాడు నా మేనమామ కుమారుడు యడవల్లి సూర్య నారాయణ అతని అనుచరుడు. శ్రీ సుందర రావు ఫార్వర్డు బ్లాకులో చేరాడు. అఖిల భారత కార్యనిర్వాహక వర్గ సభ్యుడయ్యాడు. ఆ పార్టీనేత శ్రీ శీలభద్ర యాజీకి సన్నిహితుడయ్యాడు. కార్యక్షేత్రం హైదరాబాద్‌కు మార్చాడు. క్రమంగా ఆం.ప్ర. స్వాతంత్ర్య సమరయోధుల సంఘ నేతగా, అఖిల భారత స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కార్యదర్శిగా రూపొందాడు. తర్వాత నివాసం ఢిల్లీకి మార్చాడు. అతడు యిపుడు కీర్తిశేషుడు. హైదరాబాద్‌లో వున్నప్పుడు తరచుగా కలుస్తుండే వాళ్ళం. ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడు. ఎన్నో విషయాలు చర్చించే వాళ్ళం. ఇదీ బాపట్ల ప్రజా సేవా కార్యకర్తలు అనుసరించే జీవిత రీతి.

★★★

# కీర్తిశేషులు రాయ్ దంపతులు

ఎం.ఎన్.రాయ్ ఆరోగ్య కారణాలవల్ల డెహ్రాడూన్‌లో (ఈనాటి ఉత్తర ప్రదేశ్‌లోని) నివాసం ఏర్పరచుకున్నాడు. కాగా సంవత్సరానికి రెండుసార్లు భారత దేశ పర్యటనకు ఉపక్రమించేవాడు. అక్కడే 'భారత జ్ఞాన పునర్వికాస సంస్థ'ను నెలకొల్పి అధ్యయన శిబిరాలు నిర్వహించేవాడు. ముస్సోరిలో కొండరాతిపై నుండి కాలుజారి పడిపోయాడు. పక్షవాతం వచ్చింది. భార్య ఎలెన్ రాయ్, అతని సహచరుడు ఆర్.ఎం.పాలు, వైద్యుడు దుర్గా ప్రసాద్‌ల సేవవల్ల ఆరోగ్యాన్ని తిరిగి పొందగల్గాడని సంతోషించే సమయంలో మరణించాడు. ఎం.ఎన్. రాయ్ మేధావి అని, సిద్ధాంత కర్తయని మేము గుర్తించినా ఎందువల్లనో అతని మరణం (1954 జనవరి) అంత బాధ అన్పించలేదు. బహుశః రెండు సంవత్సరాలు ఆయన జబ్బుతో బాధ పడినందు వలన అది హఠాత్మరణం కానందువలననేమో!

ఎలెన్ రాయ్ ఎం.ఎన్. రాయ్‌తో 1930లో పరిచయమయిన స్త్రీ. అతని ప్రేయసిగా అతడు జైలులో వున్న 5 సంవత్సరాలు ఆగి 1935లో భారత దేశం వచ్చి అతనిని వివాహమాడిన విదేశీ వనిత. ఆమె విశ్వమానవి. తల్లి జర్మను దేశస్తురాలు. తండ్రి అమెరికను. చదివింది ఫ్రాన్సులో ఉద్యోగం చేసింది. రష్యా సంబంధిత సంస్థలో. ప్రేమించి పెళ్ళాడింది భారతీయుని, ఒకసారి 'నేనెవరిని' అని ఆమె వ్రాసిన వ్యాసంలో ఈ విషయాలు ఆమె వ్రాసింది. జైలు నుండి ఎం.ఎన్. రాయ్ రాసిన లేఖలు ఆమెకే. వాటిని తరువాత ఆయన 'జైలు ఉత్తరాలు' (లెటర్సు ఫ్రం జైలు) అనే పేరుతో ముద్రించాడు. ఆమె ప్రతిభావంతురాలు. మొదట్లో కమ్యూనిస్టు. అనేక శాఖలలో ఆమెకు వైదుష్యం వుంది. అయినా ఎం.ఎన్. రాయ్‌కి సహచరిగా, ప్రేయసిగా ఆయనకు సహాయం చేసింది. నిజానికి ఎం.ఎన్. రాయ్ ఆస్తి అతని మేధస్సే. కాకపోతే ఆయనకు సతీమణులు ఎవిలిన్, ఎలెన్. సహచరులు ఎంతో సహాయం చేశారు. ప్రథమ భార్య ఎవిలెన్ అమెరికను వనిత. ఆమె యిటీవలే చనిపోయారు. ఆమె ఆయన కలిసివుండగా ఆమె 'శాంతిదేవి' అనే కలం పేరుతో కమ్యూనిస్టు పత్రికలలో వ్యాసాలు రాసేవారు. రాయ్ రష్యాలో స్థాపించిన భారత కమ్యూనిస్టు కమిటీలో సభ్యురాలు. ఆమెను గురించి ప్రస్తావన భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర మొదటి సంపుటంలో వివరంగా ఉటంకించబడింది. ఆమె ఎం.ఎన్. రాయ్ విడాకులు తీసుకున్నారు. ఇరువురూ సంస్కారులు కనుక ఆ విషయాన్ని ఇరువురూ ఎత్తేవారు కాదు. ఇతరులతో ముచ్చటించే వారు కాదు. రాయ్ రాసిన తన జ్ఞాపకాలలో (మెమ్వార్స్) ఆమెను గురించి రాయలేదు. ఆమె పేరు ఎత్తలేదు. కొంతమంది అది రాయ్ తప్పిదంగా భావించేవారు. నేనూ అలాగే అభిప్రాయపడ్డాను. ఎం.ఎన్. రాయ్ యొక్క ద్వితీయ భార్య ఎలెన్.

ఎలెన్ రాయ్ తన భర్త వ్యాసాలను సంక్షిప్త లిపిలో రాసుకుని టైపు చేసేది. అతని వ్యాసాలకు పుస్తకాలకు అవసరమయిన సమాచారాన్ని అందించేది. అతని తరఫున ప్రత్యుత్తరాలు చేసేది. పార్టీ కార్యకర్తలతో, ఉద్యమ కార్యకర్తలతో సన్నిహిత

సంబంధం ఏర్పరచుకునేది. వారిలో వారికి అభిప్రాయ బేధాలు వస్తే వాటిని పోగొట్టడానికి శ్రమ చేసేది. అతిథులను ఆదరించేది. ఆమెను మాతాజీ అని కార్యకర్తలు పిలవక పోయినా ఆమె యెడ వారికి మాతృభావం, సోదరీ భావం ఉండేది. రాయ్ మరణానంతరం ఆమె ప్రతిభా వ్యుత్పత్తులు బయట పడ్డాయి. అతడు చనిపోయిన మూడవ రోజుననే రాడికల్ హ్యూమనిస్టు వారపత్రికకు అతడు ఇకలేడు అని వ్యాసం రాసింది. తరువాత ఉద్యమ బాధ్యతను ఎత్తుకుంది. రాయ్ మరణానంతరం 5 వేల నుండి 15వందలకు తగ్గిపోయిన ఇంగ్లీషు వారపత్రిక రాడికల్ హ్యూమనిస్టు ప్రచురణ కాపీల సంఖ్యను 3వేలకుపెంచింది. సంపాదకీయాలు రాసేది. హ్యూమనిస్టు ఉద్యమ కార్యకర్తలు చెదిరిపోకుండా జాగ్రత్త పడ్డది. ముఖ్య కార్యకర్తలతో స్నేహితురాలివలె అరమరికలు లేకుండా ప్రవర్తించేది. ఆమెను తే: 13.12.60న హత్య చేశారు. ఆమె హంతకులతో పోరాడింది. ఆమె దేహంపై 32 గాయాలు అయినవి. హత్యకు పూర్వం డెహ్రాడూన్‌లోని భూగర్భ పరిశోధక సంస్థ (జియలాజికల్ సర్వే) వారి హిమాలయ ప్రాంత పటాలు (మ్యాపులు) దొంగిలించబడితే ఆమె ఆ విషయాన్ని వెలికి తీసింది. అది చైనా కమ్యూనిస్టులకు కోప కారణం అయి వారు తమ గూఢచారులచే ఆమెను హత్య చేయించారని నా విశ్వాసం. ఆమె చిత్తు కాగితాలను 125 రూపాయలకు అమ్మితే ఆ పైకం కోసం ఆమె కారు డ్రయివరు కుమారుడు, మరొక వ్యక్తి దొంగతనం కోసం వచ్చి కొట్లాటలో ఆమెను చంపారని ప్రభుత్వ కథనం. వారికి సెషన్సు కోర్టులో శిక్షపడితే హైకోర్టులో కేసు ఋజువు కాలేదని కొట్టివేశారు. నేను నిర్దోషులు విడుదల అయినందుకు సంతోషించాను.

ఎం.ఎన్.రాయ్ మరణానికి అంతగా బాధ పడని నేను ఎలెన్‌రాయ్ హత్య వార్తవిని తల్లడిల్లాను. తల్లిని కోల్పోయిన పసిబాలుని వలె దుఃఖించాను. ప్రతి ఆశ్రమానికి ఒక మాతాజీ వుండడం గమనిస్తున్నాం. దైనందిన వ్యవహారాలను, ఆధ్యాత్మిక విషయాలను, కార్యకర్తలకు ఆదేశాలు ఇచ్చి పని చేయించడం వీటిని వారు చూస్తుంటారు. స్త్రీత్వ సహజమయిన మార్దవంతో ఎవరి మనస్సుకూ బాధ కలగకుండా చూడడం కూడా వారి బాధ్యతే. ఆశ్రమాలలోని మాతాజీతో ఎలెనును పోల్చడం లేదు కాని అలాంటి స్థానమే ఆమె రాడికల్ డెమోక్రాటిక్ పార్టీలోనూ రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమంలోనూ అలంకరించారు. శ్రీ శిబ్ నారాయణతో కలసి 'మానవుని ప్రతి రూపంలో (ఇన్‌మాన్స్ ఇమేజి) అనే మానవ వాద సిద్ధాంత వివరణ గ్రంధాన్ని ఆమె రాసింది. ఆమె స్మృత్యర్థం ఈ ప్రపంచమే ఆమె గ్రామం (ది వరల్డ్ హర్ విలేజ్) అనే సంకలన గ్రంధాన్ని శిబ్ నారాయణరే వెలువరించారు.

ఇంకొక్క ఆసక్తికర విషయాన్ని తెలియజెప్పాలి. రాయ్ అస్తికలను ఆమె తన నివాస గృహస్థలంలో భూస్థాపితం చేసి గుర్తుగా ఒక సమాధి నిర్మించి ప్రతి రోజూ కొంతకాలం అక్కడ గడిపేదట. అం.ప్ర.కుల నిర్మూలన సంఘ సంచాలకుడు మాజీ ప్రధాన కార్యదర్శి డి.జి. రామారావు తండ్రి ఫ్రాంకిలిన్ రామ్ మహమ్మద్‌గారు మరణించినపుడు ఆయన మృత దేహాన్ని ఆయన కోరికను అనుసరించి వైద్య కళాశాల ఆసుపత్రికి దానం చేశారు. అపుడు జరిగిన మాటలలో రాయ్ మృత శరీరాన్ని దహనం చేయించి, అస్తికలకు భార్య సమాధి కట్టించిందని, గోరాగారి

మృత దేహాన్ని దహనం చేశారని అనడం జరిగింది. ఇవి వాస్తవాలే. ప్రాచ్య దేశ వాసులయినా పాశ్చాత్యులయినా అందరు మానవులకూ ఒకే రకమయిన భావోద్రేకాలు (సెంటిమెంట్) ఉంటాయి. అది వారి వారి మనస్తత్వంపైన, వారు పుట్టి పెరిగిన వాతావరణంపైన ఆధారపడి వుంటాయి. ఎలెన్‌లోని హేతువాదం ఆమె సెంటిమెంట్‌ను అధిగమించలేక పోయింది. ఆమె భర్తతో 1 సంవత్సరాలే కాపురం చేసినా వారిది అపూర్వ దాంపత్యం కావడమే కారణమేమో!

# ఆంధ్రప్రదేశ్
# లౌకికరాజ్యవాదుల మహాసభ

లౌకికతత్వం (సెక్యులరిజం) వేరు, లౌకిక రాజ్యవాదుల తత్వం వేరు. లౌకికం అంటే ప్రపంచంలో తెలివి తేటలుగా బ్రతకడం అని వాడుక అర్థం. అసలు ఉత్పత్తి అర్థంలో యీ లోకానికి సంబంధించినది. నాకు తెలిసినది ఇహ లోకమేనని నమ్మి పరలోకంలో విశ్వాసం లేకుండుట అది. సర్వ సాధారణంగా హేతువాదులు, ఆది భౌతికవాదులూ, నాస్తికులూ లౌకిక వాదులుగా వుంటారు. మతస్థులకు దేవునిలో, పరలోకపు ఉనికిలో నమ్మకం ఉంటుంది కనుక వారిని లౌకికవాదులని పిలవజాలం. లౌకిక రాజ్య వాదులలో మతస్థులూ, తదితరులూ ఉండవచ్చును. 'ఈ రాజ్యం అందిరిదీను. ఇది హిందువుల రాజ్యం మాత్రమే, ముసల్మానుల రాజ్యం మాత్రమే, క్రైస్తవుల రాజ్యం మాత్రమే అని ఎవరన్నా అంటే నేను వ్యతిరేకిస్తాను. నా ప్రాణాలు ఒడ్డి ఎదిరిస్తాను' అని ప్రకటించిన గాంధీజీ లౌకిక రాజ్యవాదియే.

1968 అక్టోబరులో ఆం.ప్ర. సెక్యులరిష్టు మహాసభను విజయవాడలో సమావేశపరచ నిశ్చయించాము. గోరాగారితో సంప్రతించాను. సర్వశ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, పల్లపోలు సాంబయ్య, లవణం, ఎం.వి. రామమూర్తి సారథ్య సంఘ సభ్యులు. శ్రీ ఎం.వి. రామమూర్తి దాని సమావేశ కర్త. శ్రీ వి.యం. తార్కుండేను మహాసభ ప్రారంభానికి ఆహ్వానించాము. ఆయన వచ్చి ప్రారంభ ఉపన్యాసం చేశారు. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అధ్యక్షత వహించారు. సర్వశ్రీ నార్ల వెంకటేశ్వర రావు (వి.ఆర్. నార్ల ఆనాడు 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక సంపాదకులు), కాట్రగడ్డ రాజగోపాల రావు (ఆనాడు కమ్యూనిష్టు దినపత్రిక 'విశాలాంధ్ర' సంపాదకులు), గోరాగారు ముఖ్యోపన్యాసకులు. గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. 110 మంది ప్రతినిధులు సమావేశమయ్యారు. గోరాగారి అనుయాయులు, రాడికల్ హ్యూమనిష్టులు, హేతువాదులు, సోషలిష్టులు, కమ్యూనిష్టులు, జాతీయవాదులు పాల్గొన్నారు. ఉపన్యాసాలు చేశారు. చర్చలు కూలంకషంగా సాగాయి. తీర్మానాలను రూపొందించాం. మొదటి తీర్మానంలో లౌకికరాజ్యం యొక్క స్వభావాన్ని విశదపరిచాం. అన్ని మతాలను రాజ్యం సమదృష్టితో చూడాలనేది మొదటి రకం దృక్పథం. దీనిని రిపబ్లికు అధ్యక్షుడుగా వున్న రాధాకృష్ణ పండితుడు ప్రచారంలోకి తెచ్చారు. రాజ్యం మత వ్యతిరేక ప్రచారానికి పూనుకోవాలని రెండవ ఆలోచన. దీనిని కమ్యూనిష్టు రష్యా పోషించింది. రాజ్యానికి, మతానికి సంబంధం వుండరాదని, మతం వ్యక్తిగత విషయమని, రాజ్యం మతస్థులు, మతేతరుల మధ్య తాటస్థ్యం వహించాలని ఆ ప్రయత్నంలో అది మత ప్రసక్తిలేని రాజ్యంగా రూపొందాలని మూడవ రకపు భావం. ఈ మూడవ దానిని మహాసభ అంగీకరించింది. ప్రభుత్వ వ్యవహారాల్లో మతం చోటు చేసుకోరాదని, ప్రభుత్వ లేక ప్రభుత్వ సంస్థల కార్యాలయాల్లో దేవుళ్ళ విగ్రహాలు, ప్రతిమలు, చిత్రపటాలు వుండరాదని, ప్రభుత్వం లేక ప్రభుత్వ సంస్థలు శంకు స్థాపనలు వగయిరాలు జరిపేటప్పుడు మత జోక్యం

వుండరాదని, యిలా ఎన్నో తత్సంబంధిత విషయాలపై తీర్మానాలు చేశాం. మత స్వేచ్ఛ ప్రతిపాదించబడిన రాజ్యాంగపు 25వ అధికరణంలో నీతి, ప్రజా భద్రత, ఆరోగ్యాలకు మత స్వేచ్ఛ లోబడి వుండాలని స్పష్టంగా చెప్పబడింది. కనుక మతపరమయిన అభ్యంతరాలను త్రోసిరాజని ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించాలని మూడవ తీర్మానంలో కోరబడింది. ఒకే ఒక వ్యవహార సంహితను (కామన్ సివిలు కోడ్) దేశం మొత్తానికి వర్తించేలా రూపొందించాలని, అమలుపరచాలని 4వ తీర్మానం చెప్పింది. పాడి పశువులను, వ్యవసాయానికి పనికి వచ్చే పశువులను వధించకుండా కట్టుదిట్టం చేయాలని, గోవధ మిషతో అల్ప సంఖ్యాకుల మనోభావాలకు కష్టం కల్గించరాదని 5వ తీర్మానం పేర్కొన్నది. మత ప్రచారం చేస్తున్న అఖిల భారత రేడియో వ్యవహార సరళిని 6వ తీర్మానంలో విమర్శించింది మహాసభ. లౌకికతత్వాన్ని లౌకిక దృక్పథాన్ని పెంపొందించటానికి కుల వ్యవస్థ నశించాలని 7వ తీర్మానంలో అభిప్రాయ ప్రకటన జరిగింది. అంతర్వర్ణ వివాహాలను ప్రోత్సహించ వలసిన అగత్యాన్ని నొక్కి చెప్పింది. ఉద్యోగాల దరఖాస్తు ఫారాలలో విద్యాలయాల ప్రవేశ పత్రాలలో కుల మతాలకు సంబంధించిన విభాగాలను తొలగించమని 8వ తీర్మానంలో మహాసభ అభ్యర్థించింది. పాఠ్య గ్రంథాలలో మత దృక్పథాన్ని పోషించే పాఠ్య విషయాలు ఉండడం అభ్యంతర కరమని మహాసభ 9వ తీర్మానంలో తెలియజెప్పింది. మహాసభ కార్యకలాపాలను, తీర్మానాలను చిన్న పొత్తం రూపంలో 1971 లో వెలువరించాను. నిజానికి యిది దేశంలో జరిగిన ప్రప్రథమ లౌకిక రాజ్యవాదుల మహాసభ. పత్రికలు ఉపన్యాసాలను బాగా ప్రకటించాయి. లౌకికరాజ్య భావనకు మంచి ప్రచారం వచ్చింది.

మహాసభ యింత బాగా జరిగినా ఒక లోపం జరిగింది. ఆం.ప్ర. లౌకిక రాజ్యవాదుల సంఘ నిర్మాణం జరుగలేదు. దూర దృష్టితో వ్యవహరించక పోవటం దానికి కారణం. ఆ లోపానికి నేనే బాధ్యత వహించవలసి వున్నది.

తెనుగువారికి యీ సెక్యులర్ భావనను పరిచయం చేసిన ఘనత యీ మహాసభదే.

# అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు మహాసభ (1969)

భారత రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా వున్న శ్రీ వి ఎం. తర్కుండే పార్టీ రద్దు అయిన తరువాత బొంబాయి హైకోర్టులో ప్లీడరీ చేశాడు హైకోర్టు జడ్జి అయినాడు. కారణాలు చెప్పకుండా పాస్ పోర్ట్ (విదేశాలకు వెళ్ళటానికి అనుమతి యిచ్చే పత్రం) ప్రభుత్వ శాఖ కార్యాలయం నిరాకరించరాదని తీర్పు ఇచ్చాడు. బ్లిట్జ్ సంపాదకుడు కరంజియా కేసులో నోటిమాట ఉత్తరువును యిస్తే అది చెల్లదరని కరంజియా సుప్రీం కోర్టుకు వెళ్లాడు. సుప్రీం కోర్టు తార్కుండే తీర్పును ధృవపరిచింది న్యాయమూర్తిగా ప్రసిద్ధుడయ్యాడు. న్యాయమూర్తిగా వుంటూకూడా రాడికల్ హ్యూమనిస్టు అధ్యన శిబిరాలకు హాజరయ్యేవాడు. తాత్విక చర్చలలో పాల్గొనేవాడు. రాజకీయ అంశాలపై చర్చలకు వచ్చేవాడు కాదు హైకోర్టు న్యాయమూర్తి పదవి తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అరికట్టున్నదని గ్రహించి పదవీ కాలం పూర్తికాకుండానే రాజీనామా చేసి ఢిల్లీవచ్చి సుప్రీం కోర్టులో ప్రాక్టీసు పెట్టాడు. సహజంగానే రాడికల్ హ్యూమనిస్ట్ ఉద్యమ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనతలచాడు. రాడికల్ హ్యూమనిస్ట్ ఉద్యమ కార్యక్రమాల నిర్వహణకు రాడికల్ హ్యూమనిస్ట్ సంఘం అవసరమని భావించి మిత్రులతో సమాలోచనలుచేసి ఢిల్లీలో మహాసభను 1969 చివరలో సమావేశపరిచాడు. ఢిల్లీ సభకు నేను హాజరయ్యాను.

ఎ.జి.కె. మరణానంతరం రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ వ్యవహారాల బాద్యత తీసుకోతలచాను. మిత్రులు సమ్మతించారు నన్ను ఎం.వి.ఆర్. అని కొంతమంది మిత్రులు పిలువసాగారు. నిజానికి నాకన్న ముందుగా పార్టీలో చేరిన ఎ.ఎల్.నరసింహారావు, ఎం వి. శాస్త్రి, పెమ్మరాజు వెంకట్రావు, అబ్బూరి రామకృష్ణారావు, కోగంటి రాధాకృష్ణమూర్తి, జి.వి. కృష్ణారావు ప్రభృతులున్నారు. పార్టీ రద్దయిన తర్వాత ఎ.ఎల్. నరసింహారావు కార్యక్రమాలలో జోక్యం తగ్గించాడు పెమ్మరాజు వెంకట్రావు కాంగ్రెసులో చేరాడు అబ్బూరి రామకృష్ణారావు సాహిత్య రంగంలోకి వెళ్ళిపోయారు. కోగంటి రాధాకృష్ణ మూర్తి, ఎం.వి. శాస్త్రి, జి.వి కృష్ణారావు రాడికల్ హ్యూమనిస్టులుగా మిగిలిపోయారు. ఎం జి.కె. మరణం నాటికి వారు రాష్ట్ర వ్యాప్తంగా ఉద్యమ బాద్యతతలను స్వీకరించే స్థితిలో లేరు. స్వయం కృషి వల్ల విశేష జ్ఞానాన్ని సంపాదించిన సర్వశ్రీ రావిపూడి వెంకటాద్రి, ఎన్.వి బ్రహ్మంలకు ఆర్థిక స్థోమత తక్కువగా వున్నందున వారు అందుకు పూనుకోలేదు. పరిశేష న్యాయంగా నాకు ఉద్యమానికి బాద్యతాయుతంగా సేవచేసే అవకాశం లభించింది. మరొక విషయాన్ని యీ సందర్భంగా చెప్పక తప్పదు. మనది అసమ సమాజం. ఆర్థిక ప్రతిపత్తి, విద్యావిషయంగా డిగ్రీలు, సమాజంలో గౌరవం యివన్నీ నిర్ణాయక అంశాలుగా వుంటున్నయి. ఇవికూడా నాకు ఉపకరించాయని తలుస్తాను. 1969లో ఢిల్లీ మహాసభలో నేను

పాల్గొనే నాటికి ఆంధ్రప్రాంత ఉద్యమ కార్యకర్తలకు నేను ప్రాతినిధ్యం వహించే స్థితి వచ్చింది.

ఢిల్లీ మహాసభలో రాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని నెలకొల్పటానికి నిర్ణయం జరిగింది. 1946లో నిర్వచింపబడి 1948లో సవరింపబడిన రాడికల్ హ్యూమనిస్టు సూత్రాలను దరహంమీద అంగీకరించినవారిని (అంటే అన్ని సూత్రాలను ఒప్పుకోనక్కరలేదని అర్థం) సభ్యులుగా చేర్చుకొనుటకు, పార్టీలలో సభ్యులుగా వున్నవారు సభ్యత్వానికి అనర్హులు కారని నిశ్చియింపబడింది. 'రాడికల్ హ్యూమనిస్టు' అనే ఇంగ్లీషు వార పత్రికను కలకత్తా నుండి ఢిల్లీ మార్చుటకు దానిని వి.ఎం. తార్కుండే సంపాదకత్వాన మాస పత్రికగా ప్రచురించుటకు నిశ్చయింపబడింది బెంగాలులో అప్పటి వరకు పత్రికను నిర్వహిస్తున్న మిత్రులు యీ ప్రతిపాదనలను వ్యతిరేకించారు పార్టీ రహిత ఉద్యమంగా వుండే రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమాన్ని నీరు కారుస్తున్నారని విమర్శించారు. ఇకనుండి పార్టీ రహిత నిర్మాణ ప్రజాస్వామ్యంపై ఉద్యమం నొక్కి పెట్టలేదనే అనుమానం వ్యక్తం చేశారు. పత్రికను కలకత్తా నుండి తరలించటాన్ని గట్టిగా ఎదుర్కొన్నారు "పోనీ, వారపత్రికను వారి బాధ్యత మీద కలకత్తా నుండి ప్రచురించనీయండి" అని నేను రాజీగా ప్రతిపాదించాను. దానిని తార్కుండే త్రోసిపుచ్చాడు. ఏదయినా పార్టీ రహిత నిర్మాణ ప్రజాస్వామ్యం మీద దరిమిలా నొక్కు తగ్గింది. అది సుదూర లక్ష్యమని, ఈనాడు వెనువెంటనే ఆచరణ సాధ్యం కాదనే తార్కుండే భావానికి బలం చేకూరింది. విద్యావేత్త, మేధావి శ్రీ ఎ బి.షా దరిమిలా 'ది సెక్యులరిస్టు', 'క్వెస్టు' , 'న్యూ క్వెస్టు' పత్రికల వ్యవస్థాపకుడు, 'ఇండియన్ సెక్యులర్ సొసైటీ' అధ్యక్షుడు తార్కుండేను బలపరిచాడు. అత్యధిక రాడికల్ హ్యూమనిస్టులు తార్కుండే అభిప్రాయాలను సమర్థించారు. తార్కుండే రాడికల్ హ్యూమనిస్టు సంఘాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు అతడు 1980 వరకు ఆ పదవిలో ఉండి ఉద్యమానికి స్థాయిని బలాన్ని సమకూర్చాడు సంఘ కార్యనిర్వాహక వర్గంలో నన్ను సభ్యుడుగా వేశారు.

ఆంధ్రలో మిత్రుడు ఎన్.వి. బ్రహ్మం రాడికల్ హ్యూమనిస్టు సంఘంలో చేర నిరాకరించాడు. 'రాడికల్ హ్యూమనిజం' అనే సిద్ధాంతానికి అస్తిత్వం వున్నది కాని 'రాడికల్ హ్యూమనిస్టు' అనేవారు ఉండరాదని వాదించాడు 'రాడికల్ హ్యూమనిజాన్ని' ఆమోదించేవారిని, ఆ తాత్విక సిద్ధాంతాన్ని బలపరిచే వారికి వ్యవహార రీత్యా 'రాడికల్ హ్యూమనిస్టులు' అని పిలవటంలో అనౌచిత్యం లేదని నేను జవాబిచ్చాను. అతను చాలాకాలం సంఘానికి దూరంగా వున్నాడు కాని హ్యూమనిస్టు భావ ప్రచారంలో పాలుపంచుకునేవాడు. ఆంధ్రదేశంలో తతిమ్మా హ్యూమనిస్టులు సంఘ నిర్మాణాన్ని ఆమోదించారు, హర్షించారు

# గోరా బోస్టన్ ప్రయాణం

1970 ప్రపంచ హ్యూమనిస్టు మహాసభ అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని బోస్టన్ నగరంలో జరుగుతుందని, దానికి గోరాగారు వెళ్లతలచారని, ప్రయాణానికి సహాయార్థంగా 'పర్యటన నిధి' ని ఏర్పరచ నిశ్చయించామని శ్రీ లవణం నాతో చెప్పి నన్ను ఆ 'నిధి కమిటీ'కి సమావేశ కర్తగా వుండమని కోరాడు అందుకు సంతోషంగా అంగీకరించాను. గోరాగారి పెద్ద కుమారుడు లవణం. అతడు వినోబా భావే ఉపన్యాసాలను హిందీలో అనువదించిన దిట్ట. గోరాగారి కార్యక్రమాలలో తల్లితండ్రులతో పాలుపంచుకున్న కార్యకర్త. గోరాగారికి అతడు కుడిభుజం ఆలోచనాపరుడు; కార్యదక్షుడు

గోరాగారిపై నాకు బాగా అభిమానం ఉండేది. ఆయన కార్యశీలి కావడమే దానికి కారణం అయితే హ్యూమనిస్టుగా వున్న నాకు గోరాగారి వ్యక్తిత్వంలో వున్న కొన్ని అంశాలు మ్రింగుడు పడేవి కావు అయితే ఆయన విదేశ పర్యటన చేస్తే అచ్చటి హ్యూమనిస్టు నాయకులను కలిసి మాట్లాడితే ఆయనలొ నాకు నచ్చని లక్షణాలు వాటంతట అవే సమసిపోతాయని ఆశించాను. అందుకే 'పర్యటన నిధి' సమావేశకర్త పదవిని స్వీకరించాను. సుమారు 10 వేల రూపాయలు వసూలు అయ్యాయి. అందులో 3వేలపై చిలుకు మొత్తం రాడికల్ హ్యూమనిస్టులు యిచ్చినవని గుర్తు.

లిబరలిజానికి, సోషలిజానికి ప్రత్యామ్నాయంగా హ్యూమనిజం రూపొందింది. అనేక దేశాలలో హ్యూమనిస్టు ఉద్యమాలు, సంఘాలు విలసిల్లాయి. అన్ని దేశాల ఉద్యమాలను కలిపి ప్రపంచ హ్యూమనిస్టు ఉద్యమంగా ఉద్భవించింది. 1952లో లండనులో ప్రథమ హ్యూమనిస్టు మహాసభ ఏర్పడింది. ప్రపంచ హ్యూమనిస్టు నైతిక సంఘం పుట్టింది అందులో ఎం.ఎన్ రాయ్ వ్యవస్థాపకుడుగా రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమానికి (అప్పటికి రాడికల్ హ్యూమనిస్టు సంఘం ఏర్పడలేదు. అది 1969 ఢిల్లీలో పుట్టింది) పూర్తి సభ్యత్వం ఉంది అయితే ఎం.ఎన్.రాయ్ విదేశీ పర్యటనను ఏర్పాటుచేసేలోగా ఆయన మరణించాడు. ఆ సంఘం మహాసభ 4 సంవత్సరాలకు ఒకసారిగా జరుగుతుంది ఇటీవల రెండు సంవత్సరాలకు ఒక పర్యాయం ప్రపంచ హ్యూమనిస్టులు కలుస్తున్నారు. ప్రపంచ హ్యూమనిస్టు మహాసభకు హ్యూమనిస్టు సంఘాలలో సభ్యులు కానివారుకూడా, తమను మానవ వాదులుగా ఎంచుకుంటే రావచ్చును గోరాగారు అలానే వెళ్లారు అప్పటికి గోరాగారి నాస్తికకేంద్రం ప్రపంచ హ్యూమనిస్టు నైతిక సంఘానికి అనుబంధం చేయబడలేదు.

గోరాగారు ఒకనాడు నాస్తిక సంఘాన్ని స్థాపించారు. సంఘాలలో విశ్వాసం పోయినందువల్లనో, మరే కారణం వల్లనో దానిని కొనసాగించలేదు. కేవలం నాస్తిక కేంద్రాన్ని

మాత్రం తమ కార్యక్షేత్రంగా ఎంచుకున్నారు. నాస్తికోద్యమం, ఆర్థిక సమతా ఉద్యమం, గాంధీజీ సిద్ధాంతంవల్ల ప్రభావితమయి వినోబాభావే వల్ల నెలకొల్పబడిన ఉద్యమంలో గోరాగారు కృషిచేశారు. ఆడంబర రహిత ఉద్యమానికి కేంద్రం ఆలంబనం.

గోరాగారు ప్రపంచ హ్యూమనిస్టు మహాసభకు వెళ్లారు. తిరిగి వచ్చారు. వారిని కేంద్రంలో కలిశాను. 'ప్రపంచ మేధావులు' హ్యూమనిస్టులు భారత హ్యూమనిస్టులవలె తీరికగా కబుర్లు చెప్పే అరమ్ ఛైర్ ఇంటలెక్చువల్స్ అని గోరాగారు తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. మామూలుగా గోరాగారు సరళ స్వభావులు. ఎవరీ మనస్సును వారు నొప్పించరు. అదే వారిలోని దొడ్డగుణం. నిజానికి సిద్ధాంత విషయంగా కార్యక్రమాల చర్చ సందర్భంగా మొగమాటం పనికిరాదు. నిష్కర్షగా మాట్లాడటం మంచిపద్ధతి. అయినా ఒక్కొక్కప్పుడు ఆ విమర్శవల్ల యితరులు వ్యధ చెందడం సంభవిస్తుంది. అదీ సహజమే. గోరాగారి ఈ వ్యాఖ్య నాకు బాధకలిగించిన మాట వాస్తవమే. నేను వారితో వాదనకు దిగలేదు. ఆ అంశంపై మౌనం వహించాను. బదులు పలకలేదు. ఇతర విషయాలు మాట్లాడి తిరిగివచ్చాను. ఒక విషయం నాకు స్పష్టంగా బోధపడింది. గోరాగారిపై ప్రపంచ మహాసభ ఏ ప్రభావం చూపలేకపోయింది. వారి భావాలలో ఏ రకమయిన మార్పురాలేదు. అది గమనించిన నేను కొంత ఆశాభంగానికి లోనయ్యాను.

తరువాత రాడికల్ హ్యూమనిస్టు మిత్రులు ఏదో సందర్భంలో, గోరాగారి నాస్తిక కేంద్రానికి రాడికల్ హ్యూమనిస్టు సంఘానికి సామ్యాసామ్యాలు చర్చించవలసిన పరిస్థితి కల్పించారు. నా సమాధానాన్ని ఇచట పొందుపరుస్తున్నాను. గోరాగారు నాస్తికులు. హ్యూమనిస్టులు తాము చేపట్టిన హేతువాదం ద్వారా నాస్తికత్వానికి వచ్చారు. ఆయన కులమత రహితంగా వ్యవహరిస్తున్నారు. మానవవాదులూ అలాగే ప్రవర్తిస్తున్నారు. ఆయన వర్ణాంతర వివాహాలు చేయిస్తున్నారు. హ్యూమనిస్టు అయిన ఆవుల గోపాలకృష్ణమూర్తి, అతని సహచరులు కులాంతర, మతాంతర వివాహాలు చేయించారు. గోరాగారు తన కుటుంబంలో వర్ణాంత వివాహాలు చేశారు. రాడికల్ హ్యూమనిస్టు మిత్రులు వర్ణాంతర వివాహాలు చేసుకున్నారు. మతాంతర వివాహం కూడా వారికి జరిగింది. ఆయన నిరాడంబర ఉద్యమాన్ని నడుపుతున్నారు. అలాంటి ఉద్యమాన్ని నడపలేదుకాని రాడికల్ హ్యూమనిస్టులు నిరాడంబర జీవితాలనే గడుపుతున్నారు. ఇక పార్టీ రహిత ఉద్యమానికి గోరాగారు ఆంధ్రలో నాంది పలికారు. మానవవాదులు 1948లోనే భారతదేశం యావత్తులో ప్రచారం చేశారు. గోరాగారు పార్టీరహిత అభ్యర్థిగా 1967లో అసెంబ్లీ ఎన్నికలలో పోటీ చేశారు. ఎం.వి. రామమూర్తికూడా అదే సంవత్సరం పార్లమెంటుకు అభ్యర్థిగా ఉన్నాడు. గోరాగారి నాస్తికోద్యమానికి హ్యూమనిస్టు ఉద్యమానికి తేడాలున్నాయి. రెండు ఉద్యమాల తాత్విక భూమికలు వేరు. గోరాగారి భావ పరంపరపై గాంధీజీ ప్రభావం వుంది. హ్యూమనిస్టులపై గాంధీజీ

భావాలు అపుడు ముద్రవేయలేదు గోరాగారు కూరగాయల దండలను వాడేవారు మానవవాదులు అలాచేయలేదు. నిరాడంబరానికి గోరాగారు ఇచ్చే అర్థంవేరుః హ్యూమనిస్టుల అవగాహన వేరు. గోరాగారికి సంఘ నిర్మాణంలో నమ్మకంలేదు మానవవాదుల్లో భారతరాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని నిర్మించుకున్నారు పార్టీరహిత విషయంలోనూ అభిప్రాయ భేదాలున్నాయి. గోరాగారిది 'అరాజక' తత్వమా అని తోస్తుంది. హ్యూమనిస్టులు నిర్మాణయుత ప్రజాస్వామ్యాన్ని ఆశిస్తారు ఇలా ఎన్నో అంశాలపై ఇరువురు విభిన్న దృక్పథాలను ప్రదర్శించేవారు

ఒకసారి నాతో మాటల సందర్భంలో 'మీ మిత్రులకూ నా మిత్రులకూ అభిప్రాయ భేదాలు వున్నాయని అంటున్నారు నామటుకు నాకు ఏరకమయిన విభేదాలు లేవు' అన్నారు. అది వారి ఔదార్యానికి నిదర్శనం నేను సవినయంగా "మీకు మాకు సుమారు తొమ్మిది అంశాలపై ఏకాభిప్రాయం ఉంది అన్నింటా ఆ తీరుగా ఉందని నేను అనలేను మీకూ మాకు ఏడు అంశాలపై తేడాలున్నాయి" అని అన్నాను వారు విని ఊరుకున్నారు. వాదనను ప్రారంభించలేదు. ఈ సంభాషణ వాస్తవ పరిస్థితిక్ అద్దంపట్టున్నది

# ప్రజాకమిటీ నిర్మాణ ప్రయత్నం-
# పార్లమెంట్ ఎన్నికలు(1971)

ఎం.ఎన్. రాయ్ రూపొందించిన ముసాయిదా భారత రాజ్యాంగంలో ప్రజా కమిటీలకు ముఖ్యమయిన, అర్థవంతమయిన స్థానం వుంది. ప్రజా ప్రతినిధులను ఎంపిక చేయడం, వారిని అదుపులో వుంచడం, రాజకీయ విద్యా సంస్థలుగా పనిచేయడం ప్రజా కమిటీల విధులు. ప్రజా కమిటీలు రాజ్యాంగం మారిన తర్వాత నెలకొల్పబడాలా లేక పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నుండి నిర్మాణ ప్రజాస్వామ్యంలోకి మారే సంధి కాలంలో ఏర్పరచబడాలా అనేది మీమాంస. ఏదయినా వాటిని ఏర్పరచాలనే ప్రయత్నం చీరాలలో చేశాను. మిత్రులు సిహెచ్. రాజారెడ్డి, బచ్చు వెంకటేశ్వర్లు సహకరించి ఆ ప్రయోగంలో పాల్గొన్నారు. రాజారెడ్డి 1944 వరకు జాతీయ వాది. తర్వాత రాడికల్ డెమొక్రాటిక్‌గా మారి రాడికల్ హ్యూమనిస్టు అయ్యాడు. అప్పటినుండి యిప్పటి వరకు శుద్ధి, కార్యదక్షత, పట్టుదల కల కార్యకర్త. త్యాగగుణం అతనికి అలంకారం. సాహసం అతని లక్షణం. నిర్మొహమాటంగా మాట్లాడడం అతని నైజం. బచ్చు వెంకటేశ్వర్లు (ఈనాడు లక్ష్మీ హెయిరాయిలు, మజిల్ ఆయిలను తయారు చేసే కంపెనీ ప్రొప్రయిటరుగా, వదాన్యుడుగా, సాహిత్య పిపాసువుగా హైదరాబాదులో వుంటూ పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న శ్రీ బచ్చు సుబ్బారావు సోదరుడు) చీరాల పట్టణ వాసి. పట్టుభద్రుడు. మిల్లు వస్త్రాల టోకు వ్యాపారి. దుకాణానికి తన బాబాయిగారికి వప్పజెప్పి విశాఖపట్టణంలో ఎం.ఎ. చదివి పరీక్షలో ఉత్తీర్ణుడయి వచ్చిన విద్యాసక్తుడు. యువకుడుగా రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమంలో చేరినవాడు. చీరాలలోని జ్ఞానప్రసన్న కాస్త యువజన సంఘ సభ్యుడు. రెండు నెలలకొకసారి మేము చీరాల పార్కులో జరిపే బహిరంగ సభలలో ఉపన్యసిస్తూ వక్త అయినవాడు. ముగ్గురం కలసి చీరాల పట్టణంలో ఒక ప్రాంతాన్ని ఎంపికచేశాం. వరుసగా పదిహేను రోజులు రాత్రిళ్ళు వెళ్ళి సమావేశాలు నిర్వహించాము. నిర్మాణ ప్రజాస్వామ్య సూత్రాలను ఎరుక పరచి, వివరించి విశదీకరించాం. ఇంతలో పట్టణంలో అగ్నిప్రమాదాలు జరగడంతో ఆ ప్రయోగం ఆగిపోయింది. తర్వాత కొంతది కాలానికి బచ్చు వెంకటేశ్వర్లు స్కూటరు ప్రమాదంలో అసువులు విడిచాడు. నిజాయితీ, స్థిర చిత్తం, ఉద్యమానికి ఎనలేని సేవచేసే లక్షణం కల సుశిక్షిత కార్యకర్తను కోల్పోయాం. అతనికి ఇవ్వబడిన ఆరు సంవత్సరాల శిక్షణ అతని మరణంతో ఉద్యమానికి ఉపయోగం లేకుండా పోయింది.

1971లో పార్లమెంట్ ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెస్‌లో ఇన్నాళ్ళనుండి అధికారం చెలాయిస్తున్న మొరార్జీ ప్రభృతులకూ దేశ ప్రధానిగా నున్న ఇందిరాగాంధీకి అభిప్రాయ బేధాలు వచ్చాయి. పాతవారిని 'సిండికేటు' అని పిలవడం జరిగింది. కాంగ్రెస్ పార్టీని ఇందిరమ్మ చీల్చింది. కాంగ్రెస్ (ఐ) అనే పేరుతో ఆమె వర్గం వ్యవహరించసాగింది. పార్లమెంట్ ఎన్నికలు వచ్చేలా చేసింది ఆమె. సర్దార్ వల్లభాయ్ పటేల్ కేంద్రంలో ఆంతరంగిక శాఖ మంత్రిగా స్వదేశ సంస్థానాధీశులకు ఇచ్చిన భరణాలను రద్దు చేయడం, 14 పెద్ద బ్యాంకులను జాతీయాకరణ చేయడం

ఆమె ప్రతిపాదనలు వాటిని ఎదిరించతలచారు. మొరార్జీ దేశాయ్ మొదలగు కాంగ్రెస్ నాయకులు, స్వతంత్ర పార్టీవారు. ఆమె వారిపై ధ్వజం ఎత్తింది. భారీ ఎత్తున ప్రచారం చేసింది. నేనూ రాజారెడ్డి ఆ ఎన్నికల్లో వోటర్ల ప్రబోధ కార్యక్రమాన్ని చేపట్టాము. **1967** పార్లమెంట్ ఎన్నికల్లో ఏయే కేంద్రాల్లో, ఏయే ప్రదేశాలలో సభలు పెట్టామో ఆ చోట్ల బహిరంగ సభలను నిర్వహించాము. ఇందిరమ్మ మోసపు ఎత్తులను ఖండించాము. స్వదేశ సంస్థానాధీశుల భరణాల రద్దును సమర్థించాం. బ్యాంకుల జాతీయకరణను బలపరిచాం. పార్టీలలో అంతర్గత ప్రజాస్వామ్యం యొక్క అవసరాన్ని తెలియజెప్పాం.

**1972** అసెంబ్లీ ఎన్నికలు వచ్చాయి. గోరాగారు చీరాలలో మాయింటికి వచ్చారు. నేనూ, మల్లాది సుబ్బమ్మ, రాజారెడ్డి సమావేశమయ్యాం. సుబ్బమ్మ బాపట్లనుంచి, రాజారెడ్డి చీరాల నుండి పార్టీ రహిత అభ్యర్థులుగా ప్రజల ముందుకు రావాలని గోరాగారు ప్రతిపాదించారు. కొంత చర్చ జరిగింది. వారిరువురు అభ్యర్థులుగా వుండడానికి విముఖత చూపారు. దానితో ఆ ప్రతిపాదనను మేము ముగ్గురం అంగీకరించలేదు.

# ప్రత్యేక తెలంగాణా ఉద్యమం (1969)

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. సర్వశ్రీ సంజీవ రెడ్డి, సంజీవయ్య, బ్రహ్మానంద రెడ్డి ముఖ్యమంత్రులయ్యారు. మొదటివారు రాయలసీమ వాసి శ్రీ బ్రహ్మానంద రెడ్డి కోస్తా జిల్లాలకు చెందినవాడు. సంజీవయ్యగారు రాయలసీమ ప్రాంతపువాడు. ఇలా 13 ఏళ్లు తెలంగాణా వారికి ముఖ్యమంత్రి పదవి దక్కలేదు. అది తెలంగాణా వారి అసంతృప్తికి కారణమయింది. ఇంకా అనేక కారణాలు దోహదం చేశాయి. వాటిని గురించి విపులంగా రాయటానికి అవకాశం లేదు. అవి అనేకం. మానసిక వైఖరులకు మనోభావాలకు సంబంధినవి ఎక్కువగా వున్నాయి. వాటిని పేర్కొనడం ఉచితం. (1) భారత సైన్యం నైజాములోకి అడుగు పెట్టిన తరువాత ఏర్పడ్డ పరిపాలనతో కోస్తా జిల్లాల నుండి అనేకమంది అధికారులకు చోటు దొరికింది. అలా వచ్చినవారిలో ఎక్కువమంది అవినీతి పరులవటంతో తెలంగాణా ప్రజలకు వారిపై ఏహ్యభావం ప్రబలింది. ఇది 1948-49 నాటి విషయం. ఆనాడే 'బెజవాడ వాడా పో' (అప్పటికి బెజవాడ విజయవాడగా మారలేదు). 'కృష్ణ అవతలవాడా పో' అనే నినాదాలు హైదరాబాదు నగర గోడల మీద వెలసినయి. (2) ఆంధ్ర ప్రాంతం నుండి వచ్చిన ఉద్యోగులు తెలంగాణా ఉద్యోగులను అసమర్థులని, తెలివి తక్కువవారని హేళనగా, చులకనగా మాట్లాడటం వల్ల తెలంగాణా ఉద్యోగులకు మానసిక వ్యథ కలిగింది. ఆంధ్ర ఉద్యోగులపై ద్వేషభావం ఉదయించింది. (3) నైజాంలో నీటి వసర్లు తగినన్ని లేక పొలాలు సరిగా పండటం లేదు. వారికి కోస్తా రైతులకు వున్న వ్యవసాయానుభవం కూడా కొరవడింది. ఆ పరిస్థితుల్లో కోస్తాకు చెందిన చిన్న రైతులు తమకు వున్న 3, 4 ఎకరాలు అమ్మకొని చేతికి వచ్చిన 39, 40 వేలతో ఎకరం 200, 300 రూపాయిలకు నైజాం ప్రాంతంలో భూములు కొన్నారు. వారు అలా ధనిక రైతులు అయ్యారు. కోస్తా వారికి భూములిచ్చిన నైజాం రైతులు తమ పొలాలలోనే తాము కూలీలుగా పనిచేయాల్సి వచ్చింది. సహజంగా ఇది వారికి మనోవ్యథ కల్గించింది. ఇవన్నీ బలవత్తర కారణాలుగా పనిచేశాయి. ఇతర కారణాలు యిలా వున్నాయి.

(1) నైజాం ప్రాంతంలో విద్యావకాశాలు తక్కువ. తాలూకాకు ఒక్క ప్రభుత్వ హైస్కూలు కూడా లేని స్థితి. అందువల్ల తెలంగాణా ప్రాంత విద్యార్థులు హైస్కూలు చదువు పూర్తి చేసేటప్పటికీ వారికి 18, 19 సంవత్సరాల వయస్సు వచ్చేది. ఉద్యోగాలలో ఆంధ్ర ప్రాంతాలవారి పోటీఎక్కువగా వుండేది. తెలంగాణా వారికి ఎక్కువగా ఉద్యోగాలు అందుబాటులో లేకుండా పోయినయి. అది బాధాకర పరిస్థితిని కల్గించింది. (2) తెలంగాణాలో వ్యాపారస్తులు ఎక్కువగా మార్వాడీలు, గుజరాతీలు, ఇతర భాషా ప్రాంతాలవారు. అయితే వారు సుమారు ఒక వంద సంవత్సరాల నుండి ఇక్కడే నివసిస్తూ సామాన్య ప్రజానీకపు శ్రమ శక్తిని దోచుకునేవారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కోస్తా ఆంధ్రులు ముఖ్యంగా కృష్ణా, గోదావరి తీర వాసులు విరివిగా హైదరాబాదు చేరారు. హోటళ్లు తెరిచారు. పెద్ద ఎత్తున వ్యాపారాలు

ప్రారంభించారు. ఇది స్థానికంగా వున్న తెలంగాణా వాసులయిన ఇతర భాషలవారికి ఈర్ష్యాహేతువయింది. (3) ఒకనాడు మదరాసు రాష్ట్రంలో వున్న ఆంధ్రప్రాంతంలో (కోస్తా జిల్లాలు + రాయలసీమ= ఆంధ్ర ప్రాంతం) మద్య నిషేధం 1956 నాటికి అమలులో వుంది. నైజాంలో మద్య నిషేధం లేదు. సారా లైసెన్సుల వల్ల కల్లు దుకాణాల వల్ల అత్యధిక రాబడి నైజాం ప్రభుత్వానికి వచ్చేది. 1956 నుండి కూడా తెలంగాణా జిల్లాలో మద్య నిషేధాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు ప్రవేశ పెట్టలేదు. తమ ప్రాంతపు ఎక్సైజ్ రాబడిని ఆంధ్రప్రాంత వాసుల సంక్షేమానికి ఖర్చు పెడుతున్నారని తెలంగాణా వాసులు తలంచనారంభించారు. ఆదాయ వ్యయ లెక్కలు ప్రాంతాల వారీగా తేల్చాలని అడగడం మొదలయింది. 4. తే. 20-2-56న ఆంధ్ర, తెలంగాణా నాయకుల మధ్య జరిగిన పెద్ద మనుష్యుల ఒప్పందాన్ని అమలు చేయలేదు. తెలంగాణా ప్రాంత వాసులకు ప్రత్యేక రక్షణలు కావాలనే వాదం ఉదయించింది. అది హైదరాబాదు విద్యార్థుల అభిమానాన్ని చూరగొన్నది. రాజకీయ కారణాలను పురస్కరించుకొని ఆనాటి ముఖ్యమంత్రి బ్రహ్మానంద రెడ్డి పరోక్షంగా బలపరిచాడు.

1957లో ఆమోదింపబడిన కేంద్ర శాసనం 'ప్రభుత్వోద్యోగాల చట్టం' 3వ సెక్షనులో తెలంగాణాలో 15 సంవత్సరాల నివాసం వున్న వారికి తహసీలు హోదా వరకు అన్ని ఉద్యోగాలు యివ్వాలి. ఈ సెక్షను చెల్లదని 1969లో సుప్రీంకోర్టు తీర్పు యిచ్చింది. ఈ తీర్పుతో ముల్కీ నిబంధనలకు మరల జీవం వచ్చినదనే వాదన మొదలయింది. అంతేగాక 'రాష్ట్రంలో ఒక భాగానికి' నివాసార్హత విధించ రాదనడంతో తెలంగాణాకు ప్రత్యేక రాష్ట్రం కావాలనే నినాదం వెలికి వచ్చింది. తెలంగాణా రాజకీయ నాయకులలో ఒక వర్గం 'ప్రత్యేక రక్షణలను' కోరితే, వారిని అధిగమించే ఉద్దేశంతో మరొక వర్గం 'ప్రత్యేక తెలంగాణా' నినాదాన్ని యిచ్చింది. ఇంతలో మరో సంఘటన జరిగింది. అవినీతికర పద్ధతులను అవలంభించాడని సుప్రీంకోర్టు శ్రీ చెన్నారెడ్డి ఎన్నికను రద్దు చేసింది. ఆయనకు పదవి పోయింది. ఆంధ్రప్రదేశ్‌లో ఒక నానుడి ప్రచారంలో వుండేది. 'శ్రీ చెన్నారెడ్డిని మంత్రి వర్గానికి వెలుపల వుంచినా, శ్రీ వల్లూరి బసవరాజును మంత్రి వర్గంలో వుంచినా ప్రమాదమే' అనేది దాని తాత్పర్యం. చెన్నారెడ్డిగారు తెలంగాణా ఉద్యమంలోకి దూకారు. ఉద్యమ స్వభావం మారిపోయింది. ఆంధ్రులపై పగ, కసి పెరిగాయి. రాజధాని నగరంలోని, వరంగలు పట్టణంలోని ఆంధ్రులపై దాడులు జరిగాయి. ఆంధ్రులు నివసించే కాలనీలకు భద్రత కరువయ్యింది. ఆంధ్రులు తమ వ్యాపార స్థలాలను రక్షించుకోటానికి ఆంధ్ర ప్రాంతం నుండి గూండాలను తెచ్చుకున్నారు. దానితో పరిస్థితి మరీ విషమించింది. పరిస్థితిని చక్కదిద్దాలనే ఉద్దేశ్యంతో ప్రధాని ఇందిరాగాంధీ తన విదేశీ పర్యటనకు ముందు రాత్రికి రాత్రి హైదరాబాదు వచ్చి తెలంగాణా నాయకులను కలవాలని ప్రయత్నం చేశారు. కాని, విఫలులయినారు. 1971 పార్లమెంటు ఎన్నికలలో తెలంగాణా ప్రజా సమితి తరఫున చెన్నారెడ్డిగారు 14 స్థానాలలో పదింటిని గెలుచుకున్నారు. ఇందిరాగాంధీ చెన్నారెడ్డిగారిని పిలిచి రాజీపడింది. తెలంగాణా నుండి ఎన్నికయిన సభ్యులు కాంగ్రెసులో చేరారు.

తెలంగాణా ఉద్యమం నుం॰ చెన్నారెడ్డిగారు, ఆయన అనుచరులు వైతొలగారు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఉధృతాన్ని కోల్పోయింది. ముల్కీ వివాదం సుప్రీంకోర్టులో నిల్వవుండి పోయింది. గోరాగారు నాస్తికులు. నేను హ్యూమనిస్టును. మేము విశ్వ మానవులం. మాకు కుల మతాలపై విశ్వాసం లేదు. ప్రాంతీయ అభిమాన దురభిమానాలు మమ్మల్ని అంటవు. అందుకని 'మైత్రీ యాత్రను' గోరాగారు సంకల్పించారు. వారి ఆహ్వానం మీద నేను సూర్యాపేటలో బహిరంగ సభలో ప్రసంగించాను. ప్రాంతీయ అసమానతలే యీ కలతలకు, వివాదాలకు కారణమని చెప్పి వాటిని తొలగించ వలసిన ఆగత్యాన్ని గురించి మాట్లాడాము. ఈ ఒక్క సభయే ప్రత్యేక తెలంగాణా ఉద్యమంతో నాకుగల సంబంధం.

# ప్రత్యేక ఆంధ్రోద్యమ ఆవిర్భావం—1

ఆంధ్ర ప్రాంతీయులను భయభ్రాంతులను చేసిన ముల్కీ నిబంధనలను గురించిన ప్రస్తావన లేకపోతే ప్రత్యేక ఆంధ్రోద్యమం ఎందుకు ఆవిర్భవించిందో అర్థం కాదు. ముల్కీలు నాలుగు రకాలవారు. 1. ముల్కీ పురుషునికి కలిగిన సంతానం. 2. ఇతర ప్రాంతాల నుండి వలసవచ్చి 15 సంవత్సరాలు నైజాం సంస్థానంలో స్థిర నివాసముండి మరల తన ప్రాంతానికి వెళ్ళనని ప్రమాణ పత్రంపై సంతకం చేయువారు. 3. ముల్కీ పురుషుని భార్య. 4. నైజాం సంస్థానంలో 15 సంవత్సరాలు ఉద్యోగం పూర్తి చేసినవాని సంతానం. ముల్కీ స్త్రీ ముల్కీ కాని పురుషుని వివాహమాడి మరో ప్రాంతానికి ఆమె తన భర్తతో కాపురానికి వెళ్తే ఆమె ముల్కీతనం నశిస్తుంది. భర్త చనిపోయినా ఆమె విడాకులు పొందినా ముల్కీతనం ఆమెకు మరల లభిస్తుంది. కాని యితరత్రా ముల్కీ-అయితే తప్ప ఆమె సంతానం ముల్కీలు కారు. తే. 20-2-56న ఆంధ్ర నాయకులు, తెలంగాణా నాయకులు చేసుకున్న పెద్ద మనుష్యుల ఒప్పంద ఫలితంగా 1957లో శాసనం వచ్చింది. 1957లో ప్రభుత్వ ఉద్యోగాల కేంద్ర శాసనం వచ్చే వరకు ఈ నిబంధనలు అమలులో వున్నాయి. ఆ శాసనం ప్రకారం 15 సంవత్సరాల నివాసార్హత - తహశీలుదారు హోదా వరకు - తెలంగాణాలో ఉద్యోగాల విషయమయి నిర్ణయించారు. అది 1969 సుప్రీంకోర్టు తీర్పుతో రద్దయిన విషయం తెలియజెప్పాను కదా!

తే. 9-12-70న ఆం.ప్ర. హైకోర్టు ముగ్గురు న్యాయమూర్తుల ధర్మాసనం 1957 శాసనపు నివాసార్హతను సుప్రీంకోర్టు రద్దు చేసింది కనుక ముల్కీ నిబంధనలు తిరిగి పునరుద్ధరింప బడతాయని కనుక చెల్లుతాయని ప్రకటించింది. ఆ తీర్పును 5గురు న్యాయి మూర్తులతో కూడిన ఆం.ప్ర. హైకోర్టు ధర్మాసనం (తే. 14-2-72) రద్దు చేసింది. దానిని సుప్రీంకోర్టు తే. 3-10-72న రద్దు చేసింది. సుప్రీం కోర్టుకు ఆధారభూతమయిన వాదన ఇలా వుంది. 1957 ప్రభుత్వోద్యోగాల సెక్షను 2 ప్రకారం ముల్కీ నిబంధనలు రద్దుచేయ బడినయి. రాష్ట్ర భాగమయిన తెలంగాణాలో నివాసార్హత విధించిన 1957 చట్టపు 3వ సెక్షను రద్దయింది. 2వ సెక్షనులో ముల్కీ రద్దు, 3వ సెక్షనులో నివాసార్హత విధింపు ఏక వ్యవహారం కనుక 3వ సెక్షనుతో పాటు 2వ సెక్షను కూడా రద్దవుతుంది. అంటే ముల్కీ నిబంధనలు రంగంలోకి వచ్చి చెల్లుతయ్యి అన్నమాట. అయితే, ఆ తీర్పులో ముల్కీ నిబంధనలలో ఏవి చెల్లుతాయి అనే చర్చ లేదు. ఆం.ప్ర. హైకోర్టు 5గురు న్యాయమూర్తుల ధర్మాసనం పుట్టుక, వివాహములకు సంబంధించిన ముల్కీ నిబంధనలు రాజ్యాంగం 35 (బి) అధికరణం ప్రకారం చెల్లవని ప్రకటించింది. ఈ అంశాన్ని గురించి సుప్రీంకోర్టు పట్టించుకోలేదు. అది దరిమిలా న్యాయస్థానాలలో వివాదాంశమయింది. దాని పర్యవసానం మనకు యిప్పుడు అప్రస్తుతం.

తే. 3-10-72 సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం నైజాం సంస్థానంలోని తెలంగాణా ప్రాంతంలో వున్న ముల్కీ నిబంధనలకు ప్రాణం వచ్చింది కదా! తెలంగాణాలో

నివాసార్హత తిరిగి పునరుద్ధరింప బడినది కనుక తమకు తే. 1-11-56 దరిమిలా తెలంగాణాలో నివాసం ఏర్పరచుకున్న ఆంధ్రులకు, తెలంగాణాలో ఉద్యోగాలను ఆశించే వారికి - ఉద్యోగావకాశాలు పోతాయని ఆంధ్ర ప్రజలు భావించారు. ఇది ఆంధ్రుల ఉద్వేగ తీవ్రతను పెంచింది. ఇది మాత్రమే కాక మరో మూడు అంశాలు పరిస్థితిని ఉద్రిక్త పరిచాయి. 5గురి ఆం.ప్ర. ధర్మాసనం తీర్పుపై ఆనాడు ముఖ్యమంత్రిగా వున్న శ్రీ పి.వి. నరసింహారావు /- బ్రహ్మానంద రెడ్డిని రాజీనామా చేయించి పి.వి.ని ఇందిరాగాంధీ ముఖ్యమంత్రిని చేశారు. (ఈనాటి భారత ప్రధాని) తన మంత్రి మండలిని సంప్రతించకుండా సుప్రీంకోర్టుకు అప్పీలు చేశారు. (శ్రీ నరసింహా రావుగారి కాంగ్రెసు (ఐ) నాయకులు శ్రీమతి ఇందిరాగాంధీ తన మంత్రి మండలిని సంప్రతించకుండానే అత్యాయిక పరిస్థితిని విధించమని. 1975లో ఆనాటి భారత రిపబ్లికు అధ్యక్షుని కోరారు. అది ఆయన మంత్రి మండలిలోని ఆంధ్ర ప్రాంతపు మంత్రులకు కోప కారణమయింది.

ముల్కీ నిబంధనలను తే 1.11.56 నుండి అమలు చేయాలని తెలంగాణా వారు వాదించసాగారు. తే 30.10.72న తెలంగాణా ప్రాంతీయ కమిటీ సలహా సంఘం చేసిన సిఫారసులు ఆంధ్రుల అనుమానాలను పెంచింది. తెలంగాణా ఆంధ్ర ప్రాంతాల ఆదాయ వ్యయాలు అంచనావేసిన తీరు ఆంధ్రులలో అలజడికి కారణమయింది. ముఖ్యమంత్రిగా వున్న శ్రీ పి.వి. నరసింహారావు ఆంధ్రమంత్రులను, తెలంగాణా మంత్రులను వేర్వేరుగా సంప్రతించసాగారు. హైదరాబాద్ కళాశాలల ప్రవేశాలలో ఆంధ్ర విద్యార్థులకు అన్యాయం జరిగింది. విజయవాడ విద్యార్థులు తే 22.10.72న, ఆ నెల 24న ఏలూరులో, 1972 నవంబర్ 6, 7 తేదీల్లో ఆంధ్ర విద్యార్థులు సమావేశమయ్యారు. తే 9.11.72న ఆంధ్ర మంత్రులు రాజీ ప్రతిపాదనలను చేశారు. తే. 20.11.72నుండి ఆంధ్ర ఎన్‌జిఒ నాయకులు సమ్మె చేయతలపెట్టారు. తెలంగాణా మిగులు నిధుల బండారం అనే కరపత్రం వేశారు. ఇది ఆంధ్ర ప్రజలకు కనువిప్పయింది. తే. 12.11.72 తేదీన శాసనసభ్యుడు విశ్వంకర రావు వెంకట రత్నం అధ్యక్షతన ఆంధ్ర ప్రదేశ్ మహాసభ జరిగింది. శాసన సభ్యుడు శ్రీ సి.వి.కె. రావు, ఎన్‌జిఒ నాయకుడు శ్రీ ఎ. శ్రీరాములు, సోషలిస్టు గ్రూపు నాయకుడు శ్రీ ఎన్. శ్రీనివాసులు రెడ్డి పాల్గొన్నారు. నిర్నిబంధమయిన ఆంధ్రప్రదేశ్ కావాలన్నారు. నవంబర్ 18, 19 తేదీలలో గుంటూరులో మహాసభలు జరిగాయి. స్వతంత్ర పార్టీవారు, పాత కాంగ్రెస్ వారు, సోషలిస్టులు, జన సంఘ నాయకులు పాల్గొన్నారు. 6 వేల మంది ప్రతినిధులు వచ్చారు. బహిరంగ సభకు లక్షమంది వచ్చారు. ఆంధ్ర ప్రజా పరిషత్తు నెలకొల్పబడింది. గౌతు లచ్చన్న తన పూర్తి కాలాన్ని ఆంధ్రోద్యమానికి వినియోగించ తలచి స్వతంత్ర పార్టీకి రాజీనామా ఇచ్చారు. ఆయన అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. శ్రీ నడింపల్లి నరసింహారావు ఉపాధ్యక్షులుగా శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి కోశాధికారిగా, శ్రీ తుమ్మల చౌదరి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. సర్వశ్రీ జి.సి. కొండయ్య రత్నసభాపతి, యలమంచిలి శివాజీ తదితరులు కార్యవర్గ సభ్యులు. నవంబర్ నెలాఖరులోగా నిర్నిబంధమయిన ఆంధ్ర ప్రదేశ్‌ను ఏర్పరచకపోతే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి పూనుకుంటామని

ఆంధ్ర ప్రజా పరిషత్తు నిర్ణయించింది.

నవంబర్ 21న బంద్‌కు ఎన్‌జిఓలు పిలుపు ఇచ్చారు. ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయాల విద్యార్థులు, ఆంధ్ర ప్రజా పరిషత్తు నాయకత్వం బంద్ పిలుపును బలపరిచాయి. నవంబర్ 21వ తేదీన ఆదోని, ఒంగోలు, తెనాలిలలో కాల్పులు జరిపారు రిజర్వు పోలీసులు. ఆయా పట్టణాలలో వరుసగా 1,3,23 గురు చనిపోయారని తేలింది. ఆంధ్ర ప్రజలు ఉద్రిక్తులయ్యారు. తేదీ 23.11.72 దిన రాష్ట్ర విభజన ప్రసక్తి లేదని ఆనాటి భారత ప్రధాని ఇందిరాగాంధీ ప్రకటించిన పంచ సూత్ర పథకాన్ని వెలువరించింది. నాటి సారాంశం స్థూలంగా ఇది. (1) ముల్కీ నిబంధనల నివాసార్హత తెలంగాణా ఉద్యోగాలకు – ఎన్‌జిఓలకు 4వ తరగతి ఉద్యోగులకు తహశీలుదారు, సివిల్ అసిస్టెంట్ సర్వీసులు, జూనియర్ ఇంజనీర్ ఉద్యోగాలలో వర్తిస్తుంది. (2) పై చెప్పబడిన రక్షణలు తెలంగాణా ప్రాంతంలో 1980 వరకు జంట నగరాలలో 1977 వరకు అమలులో వుంటాయి. (3) మొదటి లేక రెండవ గెజిటెడ్ గ్రేడ్ వరకు ప్రమోషన్‌లకు సంబంధించి, సర్వీసులను ప్రాంతీయం చేస్తారు. (4) తెలంగాణా వారికున్న సాంకేతిక విద్యావకాశాలు పెంచబడతాయి. వాటిలో ప్రవేశానికి నివాసార్హత నియమంగా వుండదు. (5) జంట నగరాలలో ఉమ్మడి పోలీసు దళం ఏర్పాటు చేయబడుతుంది. పంచ సూత్ర పథకాన్ని ఆంధ్ర ప్రజలు తిరస్కరించారు. ముల్కీని (ములికి)గా పంచసూత్ర పథకాన్ని పంచశూల పథకంగా చిత్రించారు ఒక మహిళా నాయకురాలు.

తే.22.11.72 నుండి ప్లీడర్లు ఎవరి పిలుపు లేకుండానే ఎక్కడి వారక్కడ ఊరేగింపులు చేశారు. 30వ తేదీన రాజమండ్రిలో 600 మంది మహాసభలో సమావేశమయినారు. తేదీ: 7.12.72 వరకు కోర్టులను బహిష్కరించుటకు, మరల విజయవాడలో మహాసభ జరుపుటకు తీర్మానించారు. ఆరోజుననే శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ప్రధాని ప్రతిపాదనను సమర్థించారు (తర్వాత శాసనసభా పక్షంలో ముఖ్యమంత్రిని తాను కోరిన వివరణకు లోబడి సమర్థించానని చెప్పారు)

**తే.28.11.72**దిన గుంటూరులో విశ్వవిద్యాలయాల విద్యార్థి సంఘాల నాయకులు సమావేశమయ్యారు. డిసెంబర్ 5వ తేదీలోగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరుగకపోతే ఆరోజున బంద్ జరపడానికి నిర్ణయించారు. సంయుక్త కార్యాచరణ సమితిని నిర్మించుకున్నారు. శ్రీ బి.జె. అగస్టీన్ అధ్యక్షులు. శ్రీ కె.శ్రీధర రావు సమావేశకర్త. సర్వశ్రీ ఐ.శశిధర్ రెడ్డి, వెంకయ్య నాయుడు (ఈనాటి అఖిల భారత జనతాపార్టీ కార్యదర్శి) యలమంచిలి శివాజీ (తర్వాత తెలుగుదేశం పార్టీ రాజ్యసభ సభ్యుడు) ప్రభృతులు సభ్యులు.

తే. 30.11.72 వరకు జరిగిన చరిత్రను వివరించాను. ఇందులో నా పాత్రను గురించి తర్వాత ముచ్చటిస్తాను.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమ
## ఆవిర్భావం - 2

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమ సందర్భంగా తే. 12-11-72న చీరాలలో బహిరంగ సమావేశం జరిగింది. దానికి సర్వశ్రీ వేమవరపు వెంకటేశ్వర్లు, పల్లపోలు సాంబయ్య సమావేశ కర్తలు, నిర్వాహకులు. శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మ సభకు అధ్యక్షత వహించారు. రాజకీయ పార్టీల నాయకులు మాట్లాడారు. ఏ పార్టీకి చెందనివాడిగా నన్ను ప్రసంగించమన్నారు. త్వరపడి రాష్ట్ర విభజనను కోరరాదని, అంతగా కుదరకపోతే హైదరాబాదు జంట నగరాలు దాని చుట్టు ప్రక్క నలుబది మైళ్ళ పరిధి కల ప్రాంతం కేంద్ర పాలిత ప్రాంతంగా ఏర్పాటు చేయాలని మిగతా ఆంధ్రప్రదేశ్‌ను ఆంధ్ర రాష్ట్రంగా, తెలంగాణా రాష్ట్రంగా ఏర్పరచాలని ప్రతిపాదించాను. కొంతమంది ఉపన్యాసకులు నా పథకాన్ని వ్యతిరేకించారు. చివరకు సభాధ్యక్షులుగా వున్న మల్లాది సుబ్బమ్మ రాష్ట్ర విభజన తప్పనిసరి అని ప్రకటించారు. వేమవరపు వెంకటేశ్వర్లు, పల్లపోలు సాంబయ్యల అభ్యర్థనపై ఆమె నవంబరు 17వ తేదీన స్థానికంగా వున్న యార్లగడ్డ రంగనాయకులు ప్రభుత్వ మహిళా కళాశాల భవనంపై ఆంధ్ర పతాకను ఎగురవేసి అరెస్టు అయ్యారు. తన అభిప్రాయ ప్రకటన చేసేటప్పుడుగాని, సత్యాగ్రహం చేసేటప్పుడుగాని ఆమె నన్ను సంప్రతించ లేదు. నేను బాధపడలేదు. ఆమెను అరెస్టు చేసి పోలీసు స్టేషనులో వుంచినపుడు, ఆమెను కోర్టుకు తీసుకొని వెళ్ళినప్పుడు, ఆమెకు 5 రోజులు శిక్ష విధించగా ఆమెను మరల పోలీసు స్టేషన్‌కు తీసుకొని వచ్చినప్పుడు, ఆమెను ఒంగోలుకు బస్సులో తరలించే సమయంలో 'మీరు వెళ్ళి చూచి వస్తారా?' అని మిత్రుడు రాజారెడ్డి హెచ్చరించాడు. నేను వెళ్ళనని చెప్పాను. అతడే మా యింటికి వెళ్ళి ఆమె కట్టి పెట్టుకున్న 'హోల్డాలు'ను తీసుకొని వచ్చి ఆమెకు యిచ్చాడు. శిక్షాకాలం పూర్తి అయిన తరువాత రైలు దిగి ఆమె యింటికి వచ్చారు. ఆమె ఈ విషయాన్ని గురించి తరువాత కూడా నాతో ప్రస్తావించలేదు. నేను ఆమెను ప్రశ్నించలేదు. ఆమె నాకు చెప్పకుండా అలా చేసినందుకు శిక్షగా నేను ఆమెతో అలా ప్రవర్తించలేదు. ప్రజాస్వామ్య భావనలో నమ్మకం వున్న నాకు నా నడత సహజమయినదిగా మంచిదిగా తోచింది.

నవంబరు 22వ తేదీన చీరాల వీధులలో న్యాయవాదులం మా నల్లకోట్లతో ఊరేగాము. అప్పుడు నేను చీరాల ప్లీడర్ల సంఘానికి అధ్యక్షుడనని నాకు గుర్తు. ఊరేగింపు ప్రతిపాదన చేసింది న్యాయవాది శ్రీ ఎన్. రాజగోపాలరావు. రాజమండ్రిలో జరిగిన తే 30-11-72ది సమావేశానికి నేను వెళ్లలేదు. ఒంగోలు, రాయలసీమ జిల్లాల ప్లీడర్లు రవాణా సౌకర్యాలు లేక వెళ్లలేదు. 1972 డిసెంబరు 1 తేదీనుండి సంఘటనలు త్వరత్వరగా జరిగాయి. కాంగ్రెసు శాసనసభా పార్టీలో ముగ్గురు శాసనసభ్యులు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండానే ప్రధాని ప్రతిపాదనను శాసన సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించారని శ్రీ పి.వి. నరసింహా రావు ప్రకటించాడు. డిసెంబరు 1, 2 తేదీలలో ఆంధ్ర ప్రజాపరిషత్తు తిరుపతిలో జరిగింది. పన్నుల నిరాకరణ, సత్యాగ్రహాలు కార్యక్రమాలుగా నిర్ణయించారు. డిసెంబరు 5వ తేదీన

బందుకు పిలుపిచ్చారు. డిసెంబరు 2న విద్యార్థి నాయకులు జరుగవలసిన కార్యక్రమానికి తుది మెరుగులు దిద్దారు. డిసెంబర్ 4వ తేదీన వేమవరపు వెంకటేశ్వర్లు, సుంకర సత్యనారాయణ, న్యాయవాదులు నల్లమోతు రాజగోపాలరావు, వై.ఆర్.ఎ. రెడ్డిగారలను డెటెన్యూలుగా అరెస్టు చేశారు. విశాఖపట్టణంలోని న్యాయవాదులు 144వ సెక్షను క్రింద ఇవ్వబడిన నిషేధపు ఉత్తరువులను ధిక్కరించి అరెస్టు అయ్యారు. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు కూడా అరెస్టు అయిన వారిలో ఉన్నారు.

డిసెంబరు 7వ తేదీన ఆంధ్ర ప్రాంత న్యాయవాదుల మహాసభ విజయవాడలో జరిగింది. చీరాల కోర్టులలో ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేస్తున్న నేను నవంబరు 21వ తేదీ కాల్పులకు నిరసనగా రాజీనామా చేసియుంటిని. ఆ వార్త పత్రికలలో వచ్చింది. నేనూ విజయవాడ మహాసభలో పాల్గొనడానికి వెళ్తిని. నన్ను అచట చేరిన అనేకమంది న్యాయవాదులు అభినందించారు. ఆంధ్ర ప్రాంతంలోని 4వేల మంది న్యాయవాదులలో నాలుగవ వంతుమంది మహాసభకు హాజరయినారు. సర్వశ్రీ తెన్నేటి విశ్వనాథం, గౌతు లచ్చన్నలు ప్రత్యేక ఆహ్వానితులుగా మహాసభలో ఉపన్యసించారు. నవంబరు 30వ తేదీన ఆమోదించబడిన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తీర్మానాన్ని ఆంధ్ర ప్రాంత శాసనసభ్యుల రాజీనామా డిమాండు తీర్మానాన్ని పునరుద్ఘాటన చేశారు. జంట నగరాలను కేంద్ర పాలిత ప్రాంతం చేస్తూ రాష్ట్ర విభజన ఆంధ, తెలంగాణా రాష్ట్రాల నిర్మాణం జరగాలనే సవరణ నెగ్గింది. కోర్టుల బహిష్కరణకు పిలుపునిచ్చింది. పన్నెండు జిల్లాలకు ముగ్గురి చొప్పున 36 మందితో కార్యాచరణ సమితి, 5 గురితో సెక్రటేరియటు నిర్మాణం జరిగింది. ఆ రోజు రాత్రి కార్యాచరణ సంఘంలో నన్ను అధ్యక్షునిగా విజయవాడ న్యాయవాది సంఘ కార్యదర్శి శ్రీ గొట్టిపాటి మురళీ మోహనును కార్యదర్శిగా ఎన్నుకున్నారు. సర్వశ్రీ ఎస్.సి. గంగిరెడ్డి (కడప), ఎమ్.వి. శాస్త్రి (కాకినాడ) ఉపాధ్యక్షులు. నారాయణ రెడ్డి (గిద్దలూరు) సహాయ కార్యదర్శి. వీరు 5గురు సెక్రటేరియట్ సభ్యులు. విజయవాడ న్యాయవాది మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ వి.ఎస్. రామారావు పూనిక వల్లనే నేను ఆంధ్ర న్యాయవాది కార్యాచరణ సంఘానికి అధ్యక్షుణ్ణి అయినాను.

శ్రీ లచ్చన్న నాయకత్వాన ఆంధ్ర ప్రజాపరిషత్ బలపడసాగింది. ఆ పరిణామం ఇష్టం లేకనో లేక ఉద్యమానికి బలం చేకూర్చే నిమిత్తమో ఎన్.జి.ఒ. సంఘ మాజీ అధ్యక్షుడు శ్రీ ఎ. శ్రీరాములు, ఎన్. శ్రీనివాసులు రెడ్డి డిసెంబర్ మొదటివారంలో శ్రీ తెన్నేటిని కలసి 10,11 తేదీల్లో తాము జరుపనున్న మహాసభకు ఆహ్వానించారు. ఆయన అంగీకరించారు. వారి రాకకు శ్రీ గౌతు లచ్చన్న హర్షం వెలిబుచ్చారు. సమిష్టి కార్యాచరణకు తమ సంసిద్ధత తెలిపారు. ఈలోగా జనసంఘం వారు పార్టీపరంగా ఉద్యమంలో పాల్గొనడానికి తమ కేంద్ర కార్యనిర్వాహక సంఘం నుండి అనుమతి తెచ్చుకున్నారు. డిసెంబర్ 10వ తేదీన ఆంధ్ర మహాసభ సమావేశం అయింది. 1600 మంది దాకా ప్రతినిధులు వచ్చారు. విద్యార్థులు, యువకులు, న్యాయవాదులు, రైతులు, డాక్టర్లు, టీచర్లు, ఎన్‌జిఒలు, గ్రామాధికారులు ఇలా అనేక వర్గాలవారు హాజరయినారు. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షత వహించారు.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం తమ ధ్యేయమని నొక్కి వక్కాణించారు. ఆ తేదీ రాత్రి సంఘ నిర్మాణానికి పూనుకోవడం జరిగింది. తెన్నేటి గౌరవాధ్యక్షులుగాను, లచ్చన్న కార్యనిర్వాహక అధ్యక్షులుగాను ఇంకా 9 మంది కార్య నిర్వాహక సంఘ సభ్యులుగాను వుండాలని నేను ప్రతిపాదిస్తే అది అందరి అంగీకారాన్ని పొందలేకపోయింది. చివరకు 36 మందితో కార్యవర్గ సభ్యత్వాన్ని రూపొందించారు 11వ తేదీ ఉదయం. తెన్నేటి, లచ్చన్న, జూపూడి యజ్ఞనారాయణ గారలు, ఎన్. శ్రీనివాసులు రెడ్డి గారలు అధ్యక్ష వర్గ సభ్యులు. ఆంధ్ర న్యాయవాది సంఘాధ్యక్షుడనైన నన్ను కార్యవర్గంలో వేశారు. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి (ఎకెకెఎస్) రూపొందింది. తే. 1.1.73 నుండి పన్నుల నిరాకరణ, రైళ్ళను, ఆర్టీసి బస్సులను ఉదయం 10 నుండి 11 వరకు ఆపుట, డిసెంబర్ 15 పొట్టి శ్రీరాములు దినోత్సవం ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి మద్దతుగా సంతకాల సేకరణ కార్యక్రమాలుగా డిసెంబర్ తే. 12వ తేదీ కార్యవర్గం నిర్ణయించింది. ప్రభుత్వోద్యోగుల సంఘాధ్యక్షుడు శ్రీ ఐ.బి. రామకృష్ణారావు చొరవతో డిసెంబర్ 7 నుండి ప్రభుత్వోద్యోగుల సమ్మె 10 రోజుల వరకు ప్రారంభమయింది తెలంగాణా ప్రాంతీయ కమిటీ పోవాలని, వేర్పాటు బడ్జెట్‌ను పద్ధతిని తీసివేయాలని, ఉద్యోగుల మధ్య వివక్ష మానాలని వారి డిమాండ్లు. డిసెంబర్ 9న ఆంధ్ర ప్రాంత మంత్రులు కాంగ్రెస్ అధ్యక్షునికి తమ రాజీనామా లేఖను పంపారు. మంత్రులు తమ వైఖరిని నిర్ణయించుకోవడానికి డిసెంబర్ 17న విజయవాడలో సమావేశం కావడానికి సంకల్పించారు. రిలే నిరాహార దీక్షలు, స్థానిక బంద్‌లు, అరెస్టులు సాగుతున్నాయి. అన్ని వర్గాల ప్రజలు పోరాటానికి సమాయత్తమయినారు.

# ప్రత్యేక ఆంధ్ర
# రాష్ట్రోద్యమ పోకడ-1

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని గురించి కూలంకషంగా నేను ఈ జ్ఞాపకాలలో రాయదలచడం లేదు. ఉద్యమంలో నా సతీమణి శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మ పాత్రను ప్రత్యేకంగా పేర్కొనదలచలేదు. అవి చాలావరకు నేను రాసిన 'ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం' (స్టేట్ బుక్‌లెట్ ప్రచురణ సెప్టెంబర్ 1973) గ్రంథంలోనూ, మల్లాది సుబ్బమ్మ రాసిన 'పాతివ్రత్యం నుండి ఫెమినిజం దాకా' అనే ఆమె ఆత్మకథలోనూ (ఆగస్టు 1991) వివరించబడినాయి. కాకపోతే నాకు సంబంధించిన, నేను ముఖ్య పాత్ర వహించిన సంఘటనలను సన్నివేశాలను మాత్రం స్పృశిస్తాను. ఉద్యమంలో ప్రజల పాత్రను దరిమిలా విశదీకరిస్తాను.

**1972 డిసెంబర్ 17:** ఆంధ్ర వెంకటేశ్వర విశ్వ విద్యాలయ అనుబంధ కళాశాలల అధ్యాపక సంఘ కార్యదర్శి శ్రీ యార్లగడ్డ రాజ గోపాల రావు, యితర వృత్తి సంఘాలవారు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమే తమ ధ్యేయమని ప్రకటించమని మంత్రులను కోరారు. అలాగే కాంగ్రెస్ వారి సభలో ప్రసంగించడానికి న్యాయవాది కార్యావరణ సమితి కోరింది. అలా కాదని ఉప ముఖ్యమంత్రి శ్రీ బి.వి. సుబ్బా రెడ్డిగారు విజయవాడ న్యాయవాది సంఘానికి వచ్చి మాట్లాడారు.

కాంగ్రెస్ వారి సభకు ఆంధ్ర ప్రాంత మంత్రులు, శాసన సభ్యులు పురపాలక, జిల్లా పరిషత్, పంచాయితీ సమితుల అధ్యక్షులు ఆహ్వానితులు. అది విజయవాడలోని కాంగ్రెస్ భవనం 'ఆంధ్ర రత్న' భవనంలో జరిగింది. వేలాది ప్రజలు అన్ని ప్రాంతాలనుండి సభా ప్రదేశాన్ని చుట్టుముట్టి ప్రత్యేక రాష్ట్ర నినాదాలు చేశారు. విద్యార్థులు, యువకులు, రైతులు ఎక్కువగా వచ్చారు. 'ప్రత్యేక రాష్ట్ర నిర్మాణానికి అనుకూలంగా తీర్మానించకపోతే కాంగ్రెస్ వారు చరిత్ర హీనులు మాత్రమే కాదు చర్మహీనులు అవుతారు అని విద్యార్థుల పత్రిక హెచ్చరించింది. కాంగ్రెస్‌వారి సభకు 12 జిల్లాలకు గాను 11 మంది జిల్లా పరిషత్ అధ్యక్షులు 170 మంది పంచాయితీ సమితుల అధ్యక్షులు, 64 మంది శాసనసభ్యులు వచ్చారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి అనుకూలంగా కాంగ్రెస్ వారు తీర్మానించారు. దీనితో ఉద్యమానికి బలం చేకూరింది. అయితే దీనిలోనే ఉద్యమ బలహీనతకు కూడా బీజాలు పడ్డాయి. అది తర్వాత వివరిస్తాను. రాష్ట్ర నిర్మాణం లక్ష్యంగా ప్రభుత్వ ఉద్యోగులు సమ్మె కొనసాగించారు. ఢిల్లీలో 23 గురు పార్లమెంట్ సభ్యులు తెలంగాణా ప్రాంతీయ సంఘాన్ని రద్దు చేయమన్నారు. డిసెంబర్ 20వ తేదీన ముల్కీ బిల్లు ప్రకటించబడింది. ఇది ప్రధాని పంచసూత్ర పథకాన్ని మించి వుంది. ఇది మండుతున్న అగ్నిలో ఆజ్యం పోసినట్లు అయింది. 1972 నవంబర్ 28న విద్యార్థులు యిచ్చిన ప్రత్యేక రాష్ట్రం కావాలనే పిలుపును అన్ని వర్గాలు సమర్థించాయి. ఈ వాహినిలో 4 ఉపనదులు చేరాయి (1) విద్యార్థులు (2) ప్రభుత్వోద్యోగులు 3) ఎకెకెఎస్ నాయకత్వాన్ని అంగీకరించిన కాంగ్రెసేతరులు, కాంగ్రెస్ వారు (4) ఆంధ్ర మంత్రుల నాయకత్వాన చేరిన అధికార కాంగ్రెస్ వారు. నిరాహార దీక్షలు, సత్యాగ్రహాలు, ఊరేగింపులు రైళ్ళను, ప్రభుత్వ బస్సుల

నిలుపుదలలు, శేషంగా సభలు అధికమయినాయి. డిసెంబర్ 21న శ్రీ కొత్త రఘురామయ్య మర్రిని విమర్శించారు. 22న గుంటూరులో రెండున్నర లక్షలు ప్రజలు ప్రదర్శనలు చేశారు.

డిసెంబర్ 24: కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వ మంత్రులు, ఇందిరా కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులు ఉద్యమాన్ని విమర్శించారు. హేళన చేశారు. అవి ఆంధ్ర ప్రజలను రెచ్చగొట్టినాయి. కమ్యూనిస్టు పార్టీ ఉద్యమాన్ని వ్యతిరేకించపూనుకుంది. మార్క్సిస్టు పార్టీ ఉద్యమాన్ని విమర్శించినా కార్యాచరణలో తాటస్థ్యాన్ని చేపట్టింది. డిసెంబర్ 24న కమ్యూనిస్టులు శ్రీ పి.వి. నరసింహా రావు వర్గీయులయిన కాంగ్రెస్ వారు సమైక్యతను కోరుతూ విజయవాడలో ఊరేగింపును తలపెట్టారు. మంత్రులు శ్రీ మండలి కృష్ణా రావు ప్రభృతులు వస్తారని వదంతి పుట్టింది. వారిని విమానాశ్రయంలో దిగనీయమని 600 మంది స్త్రీ పురుషులు గుమికూడారు విమానం దిగలేదు. కమ్యూనిస్టుల ఊరేగింపును ఉద్యమకారులు నిరోధిస్తామన్నారు. మేజిస్ట్రేట్ వారిని శాంతపరచి వారిని రోడ్డుపై కూర్చోపెట్టారు. ఇంతలో హెచ్చరిక లేకుండా బాష్పవాయు ప్రయోగం, కాల్పులు జరిపారు సెంట్రల్ రిజర్వు పోలీసులు. 8 మంది చనిపోయారు. ఆ వార్త తెలిసినమంత్రి కాకాని వెంకటరత్నం (కృష్ణా జిల్లా వాసి, కాంగ్రెస్ వారిచే డిసెంబర్ 24న ఉద్యమానికి అనుకూలంగా తీర్మానం చేయించిన వ్యక్తి) నా పిల్లలను చంపుతున్నారా అంటూ అసువులు బాశాడట. కాకాని వీరకాకాని అయ్యాడు. డిసెంబర్ 25న విజయవాడలో జరిగిన బహిరంగ సభకు 5 లక్షలమంది జనం హాజరయినారు. సర్వశ్రీ తెన్నేటి లచ్చన్నలు శ్రీ బి.వి. సుబ్బారెడ్డిని ఎకెకెఎస్‌లోకి ఆహ్వానించారు. ఆయన యింకా సమయం రాలేదని, తన సంపూర్ణ సహకారం వుంటుందని చెప్పాడు. జనవరి 2న ఆంధ్ర ప్రాంతంలో బంద్ జరపాలని ఎకెకెఎస్ ఉపాధ్యక్షుడు శ్రీ జి.సి.కొండయ్య (మొదట్లో కమ్యూనిస్టు తర్వాత సోషలిస్టు. ఆపైన కాంగ్రెస్ వాది, దరిమిలా స్వతంత్రుడు, ఆలోచనా పరుడు, అనుభవజ్ఞుడు) ప్రతిపాదన చేస్తే కార్యాచరణ సంఘం డిసెంబర్ 26న ఆమోదించింది.

ఎకెకెఎస్‌కు సారథ్య సంఘాన్ని వేశారు. దాంట్లో నల్గురు అధ్యక్షులు, విద్యార్థి నాయకులు ముగ్గురు, ప్రభుత్వోద్యోగుల నాయకుడు ఒకరు ఉండాలని తీర్మానించారు. విజయవాడలో వుంటూ కార్యదర్శిగా వున్న ప్రకాశ చంద్రశతపథికి, కార్యాలయ బాధ్యులుగా వున్న శ్రీ త్రిపురనేని శివప్రసాద్ (డిఎంకె)కు అభిప్రాయాలు రావడంతో అప్పటికే న్యాయవాది కార్యాచరణ సంఘ కేంద్రమయిన విజయవాడలో ఎక్కువగా వుంటున్న నన్ను కార్యాలయ బాధ్యత స్వీకరించమని తెన్నేటి, లచ్చన్నగారలు నన్ను కోరారు. నేను అంగీకరించాను. తమ సహజమయిన చాతుర్యంతో తెన్నేటి వారు, నన్ను కార్యాలయ పర్యవేక్షక కార్యదర్శిగా పేర్కొన్నారు. ఇతర కార్యదర్శుల కార్యక్రమాలను సమన్వయ పరిచే బాధ్యత నాకు అప్పగించారు. తత్ఫలితంగా సారథ్య సంఘంలో నాకు సభ్యత్వం లభించింది. అప్పటినుండి రెండు హోదాలతో పని చేశాను. రైళ్ళు, బస్సులు అన్నింటినీ నిలిపివేయాలని, ఆకాశవాణి కార్యాలయాలను పికెటింగ్ చేయాలని తీర్మానాలు ఆమోదించబడినాయి. గౌతు లచ్చన్నను, జూపూడిని ప్రభుత్వం అరెస్టు చేసింది. తెన్నేటి తనను కూడా అరెస్టు చేస్తారని ఊహించి

నన్ను కలవమని కబురు పెట్టారు. నేను వారిని గూడూరులో కలవలేక సూళ్ళూరు పేటలో కలిశాను. మేము ఎలాగూ అరెస్టు అవుతున్నాం. మీరూ కొండయ్యా, తుమ్మల చౌదరి మరికొందరు అజ్ఞాతవాసంలోకి వెళ్ళి ఉద్యమాన్ని నడిపించండి అనేదే వారి సందేశం. లారీలపై ప్రయాణం చేసి విజయవాడ చేరుకున్నాను. రహస్య స్థావరాలలో వుండి పని చేయపూనాను. నాకు సహచరుడుగా, మిత్రుడుగా, అండగా శ్రీ వంగమూడి నటరాజ్ (పట్టభద్రుడు, మోటారు వాహనాల స్పేరుపార్టుల వ్యాపారి. అతని కుటుంబం యావత్తు తండ్రి, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు, అందరూ ఉద్యమానికి అంకితమయి కృషి చేశారు) పని చేశాడు. నన్ను రహస్య ప్రదేశాలలో వుంచింది అతడే. ఆ కృషిలో నాకు సహాయం చేసినవారు ఆశ్రయం యిచ్చిన వారు వీరిలో ముఖ్యులు న్యాయవాది దివ్వెల పిచ్చయ్య, వ్యాపారి బొగ్గవరపు రోశయ్యగారలు.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమ
## పోకడ - 2

అనంతపురంలో డిసెంబరు 27న ప్రజలపై అక్రమంగా, అమానుషంగా కాల్పులు జరిగాయి. 8 మంది నేలకొరిగారు. డిసెంబర్ 31న తిరుపతిలో ఆంధ్ర కాంగ్రెసు వేర్పాటు నాయకులు సమావేశమయినారు. వేలాది ప్రజలు తిరుపతి వెళ్ళారు. 11మంది పార్లమెంటు సభ్యులు, 131 మంది శాసనసభ్యులు హాజరయినారు. ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి నిర్మాణం జరిగింది. మరల జనవరి 12న గుంటూరులో సమావేశం అవుతామని ప్రకటించారు.

జనవరి 1వ తేదీ రాత్రి పెక్కలిలో పోలీసు కాల్పులు జరిగితే ఒక మనిషి చనిపోయాడు. జనవరి 2న నెల్లూరులో కాల్పులు. 13 మంది మరణించారు. అనంతపురంలో కాల్పులు. జరిగితే ముగ్గురు ప్రాణాలు కోల్పోయారు. అప్పటికి కాల్పులలో మృతుల సంఖ్య 60.

జనవరి 4వ తేదీ తెనాలి తాలూకా రేవేంద్రపాడులో విస్తృత సారథ్య సంఘ సమావేశం జరిగింది. అరెస్టు కాగా మిగిలిన ఉపాధ్యక్షులు, కార్యదర్శులు హాజరయినారు. ఆంధ్రకు రానున్న కేంద్ర మంత్రి మండలి సభ్యులు ఫక్రుద్దీన్ అలీ అహమ్మదు, జగజీవన్ రాం, స్వర్ణసింగ్‌లతో సంభాషణలకు ఉపక్రమించ రాదన్నారు. జనవరి 10వ తేదీని మృతవీరుల దినోత్సవంగా జరపాలని, ప్రభుత్వ ఆస్తులను, ప్రజల ఆస్తులను ధ్వంసం చేసుకోవద్దని తీర్మానించింది. 5 రోజులు సాగిన విద్యుచ్ఛక్తి కార్మికుల సమ్మె వల్ల ఈ సమావేశపు తీర్మానాలు ప్రజలకు అందలేదు. విద్యుచ్ఛక్తి కార్మికుల సమ్మె వల్ల రైతులు నష్టపోతున్నారని, సమ్మె ఉపసంహారణకు ఆదేశమిమ్మని అజ్ఞాతవాసంలో వున్న నాపై వత్తిడి వచ్చింది. ఎన్‌జీవోలు, ప్రభుత్వోద్యోగులు, విద్యార్థులు, ఎకెకెఎస్ నాయకులు కలిసికట్టుగా పనిచేయాలనే నిర్ణయం ప్రకారం నేను అలా చేయనన్నాను. సమ్మె విరమింప బడకపోయినా సమ్మెను విరమించినట్లు 'ఆల్ ఇండియా రేడియో' అసత్య వార్త చెప్పింది. తత్ఫలితంగా 'ఆల్ ఇండియా రేడియో', 'అసత్య వాణి', 'అబద్ధాల బాకా' అనే బిరుదులను అది సంపాదించుకుంది.

, అరెస్టులు, లాఠీ చార్జీలు, కాల్పులు సాగిపోతున్నాయి. జనవరి 7, 9 తేదీలలో విశాఖ పట్టణంలో కాల్పులు - 12 మంది చనిపోయారు. జనవరి 8న ముగ్గురు గెజిటెడ్ ఆఫీసర్లను (మేజస్ట్రేటులు, పోలీసులు, జైళ్ళ అధికారులు తప్ప ఆంధ్ర ప్రాంతంలోని ప్రభుత్వోద్యోగులందరు - గెజిటెడ్ ఆఫీసర్లు, గ్రామాధికారులతో సహా - సమ్మెలు చేస్తున్నారు) ప్రభుత్వం 'సస్పెండు' చేసింది.

వేర్పాటు కాంగ్రెసు వాదులతో కలిసి పనిచేయమని హైదరాబాదులోని లచ్చన్న లాంటి డెటేన్యూల సలహా మాకు చేరింది. జనవరి 11న శ్రీ పి.వి. కొత్త మంత్రులను వేశాడు. జనవరి 21లోగా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ప్రకటన జరుగకపోతే కాంగ్రెసుకు రాజీనామా లివ్వాలని జనవరి 12న గుంటూరులో సమావేశమయిన ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి తీర్మానించింది. 6గురితో ఎకెకెఎస్, ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితులతో చెందిన సంప్రతింపుల సంఘం నియమితమయింది.

జనవరి 17న ఆకాశవాణి అసత్య ప్రచారానికి నిరసనగా బంద్ జరిగింది. కాంగ్రెసు ఉన్నతాధికార సంఘ సలహాను అనుసరించి ప్రధాని ఇందిరాగాంధీ ఆదేశిస్తే శ్రీ పి.వి. తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. తే. 18-1-1972న ఆంధ్రప్రదేశ్‌లో అధ్యక్ష పరిపాలన ప్రవేశ పెట్టబడింది. అప్పటికి కాల్పులలో చనిపోయినవారి సంఖ్య 72, లాఠీ చార్జీలకు, 'బెయినట్ చార్జీలకు' గురయినవారి సంఖ్య సుమారు 600. 1973 జనవరి 18న ప్రభుత్వోద్యోగుల నాయకుడు శ్రీ ఎ.బి. రామకృష్ణారావును ప్రభుత్వం అరెస్టు చేసింది.

జనవరి 18 నుండి వరుసగా మణిపురం, అమరావతి, మాచర్ల, పిడుగురాళ్ళ, గుంటూరు, విజయవాడ, పాలకొల్లు, నరసాపురం, ఏలూరు, కాకినాడ, రాజమండ్రి, పొందూరు, బారువలలో ప్రభుత్వం రిజర్వు పోలీసుల చేత కాల్పులు చేయించింది. గుంటూరులో జనవరి 19, 20 రెండు తేదీలలో కాల్పులు, విజయవాడలో కాల్పులు సాగించి ఉద్యమాన్ని అణచివేయుమని గవర్నరు సలహాదారు శరీన్ కృష్ణా జిల్లా కలెక్టరుతో జరిపిన టెలిఫోను సంభాషణను నేను – టెలిఫోను ఉద్యోగుల ధర్మమా యని – స్వయంగా విన్నాను. విజయవాడలో 21, 22 తేదీలలో కాల్పులు. ప్రజలు బారికేడ్లు నిర్మించి చేతనయినంత వరకు పోరాడారు. నిండుగా సోడా వున్న సోడా సీసాలో గ్రామఫోను పిన్నులను దట్టించి దానిని గాలిలోకి విసిరి మరో సోడా సీసాతో కొట్టి పేల్చేవారు ప్రజలు. కేంద్ర రిజర్వు పోలీసు దానికి నీటిబాంబు (వాటర్ బాంబు) అని పేరు పెట్టారు. వారు భయభ్రాంతులయినారు. అయినా వారి చేతుల్లో తుపాకులున్నాయి కదా! అప్పటికి కాల్పులలో చనిపోయిన వారు 238, గాయపడిన వారు 2800.

జనవరి 19న ఎబెఎస్ సారథ్య సంఘం విజయవాడ సమీపంలో సమావేశమయింది, విద్యార్థి నాయకులు పాల్గొన్నారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని సూత్రప్రాయంగా అంగీకరించడం, డెటెన్యూల విడుదల, కేసులు బర్తరఫ్‌లు, 'సస్పెన్షన్స్' ఉపసంహరణ, ఆంధ్ర ప్రాంతం నుండి కేంద్ర రిజర్వు పోలీసులను తరలించటం, పోలీసుల అమానుష చర్యపై న్యాయ విచారణ జరిగితేనే సంభాషణలు జరగాలి కావి యితరత్రా జరుపరాదని తీర్మానించింది. జనవరి 21న కాకినాడలో జరిగే ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సంఘంతో సంప్రతింపుల సంఘం కలవాలని నిశ్చయించింది. ఆంధ్ర కాంగ్రెసు నాయకుల చర్యలు అనుమానానికి దారితీసినాయి. కాంగ్రెసేతర నాయకులను అరెస్టు చేస్తే, వారు ఆంధ్ర ప్రాంతంలో స్వేచ్ఛగా తిరుగుతూ ఉపన్యాసాలు యిస్తూ కార్యాచరణను వాయిదా వేస్తుంటే ప్రజలు వారి చిత్తశుద్ధిని శంకించే పరిస్థితి వచ్చింది. కాంగ్రెస్ నాయకులపై వత్తిడి తెచ్చే నిమిత్తం ప్రజలు లక్షల సంఖ్యలో కాకినాడకు తరలి వెళ్ళారు. కాంగ్రెసుకు రాజీనామాలు పెట్టటానికి నిర్ణయించారు కాంగ్రెసువారు. ఫిబ్రవరి 5వ తేదీని రాజీనామాలకు గడువు తేదీగా శ్రీ బి.వి. (బి.వి. సుబ్బారెడ్డిగారు) నిర్ణయించారు. అప్పటికి ప్రత్యేక రాష్ట్ర నిర్మాణ ప్రకటన రాకపోతే 'మహా విప్లవం' తెస్తామన్నారు.

శ్రీ లచ్చన్న రిట్‌పై జనవరి 23న విడుదల అయినారు. చుట్టు తిరిగి విజయవాడలోని కర్ఫ్యూను తప్పించుకొని నేను ఆయనను కలవటానికి గుంటూరు

వెన్నాను. 85గురి కాంగ్రెసు శాసన సభ్యుల రాజీనామాలను ఢిల్లీ పంపే ఏర్పాటు అప్పన్న చేశారు. జనవరి 26వ తేదీన విషాద దినంగా పరిగణించి విజయవాడలో బహిరంగసభ. లక్షమంది ప్రజలు గుమికూడారు. సర్వశ్రీ అప్పన్న, తెన్నేటి, వి.టి.యం. ప్రసాద్ (విజయవాడ విద్యార్థి నాయకుడు), ఆచార్య రంగా (అప్పటికి ఆయన స్వతంత్ర పార్టీ అధ్యక్ష పదవి వదిలి కాంగ్రెసులో చేరారు) కొమ్మారెడ్డి సూర్యనారాయణ ప్రసంగించారు. ఈ సభ వేర్పాటువాదుల్లో నూతనోత్సాహాన్ని రేకెత్తించింది.

జనవరి 27న నెల్లూరు మహాసభలో విద్యార్థులు సాయుధ పోరాటానికి పిలుపు యిచ్చారు. శాసనసభ్యుల రాజీనామాను డిమాండ్ చేశారు. జనవరి 29 ఆంధ్ర న్యాయవాది కార్యాచరణ సంఘం అలాగే కోరింది. నరసరావుపేటలో రాజాగారి కోటలో ఫిబ్రవరి 4వ తేదీన ఎకెకెఎస్ నాయకులు, ఆంధ్ర కాంగ్రెసు నాయకులు సమావేశమయ్యారు.

# ప్రత్యేక ఆంధ్రోద్యమ విజృంభణ

నరసరావు పేటలో ఫిబ్రవరి 4న జరిగిన సంయుక్త సమావేశానికి ముందుగా రెండు సంఘటనలు జరిగాయి. ముగ్గురు ఆంధ్ర మంత్రులు ఢిల్లీ వెళ్ళి సంప్రతింపులు జరుపతలిచారు. వారి తరఫున శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు శ్రీ బి.వి. అనుమతి నిమిత్తమయి నర్సరావుపేట సభకు వచ్చారు. కాకాని అనుచరుడయిన శ్రీ పిన్నమనేని కోటేశ్వర రావును, బ్రహ్మానంద రెడ్డి అనుచరుడయిన శ్రీ చేబ్రోలు హనుమయ్యను విద్యార్థి నాయకుడు శ్రీ బి.జె. అగస్టిన్‌ను ప్రభుత్వం అరెస్టు చేసింది. వీరిని కాంగ్రెస్‌లో అతివాదులుగా ప్రభుత్వం భావించిందేమో. దాంతో ముగ్గురు మంత్రులు ఢిల్లీ పర్యటనకు బి.వి. అనుమతిని నిరాకరించారు. శాసన సభ్యులు రాజీనామా చేయాలని న్యాయవాదుల నాయకుడు శ్రీ ఎం.వి. రామమూర్తి విద్యార్థి నాయకుడు శశిధర్ రెడ్డి ప్రతిపాదించారు. తెన్నేటి బలపరిచారు. కాంగ్రెస్ నాయకులు వ్యతిరేకించారు. సంయుక్త నాయకత్వ నిర్మాణానికి ఆ ప్రతిపాదనను ఎ.కె.కె.ఎస్.వారు పణంగా పెట్టి ఆ ప్రతిపాదనపై పట్టు పట్టలేదు. ఆచార్య రంగా గారు సంయుక్త కార్యాచరణ కమిటీకి 'ప్రత్యేక రాష్ట్ర సాధన కమిటీ' అని పేరు పెట్టారు. 14 తీర్మానాలను ఆమోదించారు. కార్మికులకు విజ్ఞప్తి చేసి రైళ్ళను, బస్సులను ఆపివేయాలి. ప్రభుత్వ కార్యాలయాలు బంద్. ఫిబ్రవరి 10 సామూహిక నిరాహార దినం. ఆ సమావేశపు లోపాలు నాలుగు. (1) సంయుక్త కార్యాచరణ సమితికి అధ్యక్షుని ఎన్నుకోలేదు. (2) సభ్యుల జాబితా తయారు కాలేదు (3) కార్యక్రమాన్ని విప్లవ తరం చేసే ఉపసంఘం నియమించబడలేదు. (4) కేంద్రం ప్రభుత్వం నుండి ఎవరికి ఆహ్వానం వచ్చినా అందరినీ సంప్రదించకుండా స్వీకరించరాదనే ఒప్పందాన్ని రాసుకోలేదు. నోటి మాటగానే ఉంచారు.

ఫిబ్రవరి 6 నుండి ఫిబ్రవరి 21 వరకు బెజవాడలో రైళ్ళు కదలలేదు. రాజమండ్రి గుంతకల్లు, నంద్యాలలకు ఈ ఉద్యమం వ్యాపించింది. ఫిబ్రవరి 7న అందరితో సంభాషణలకు సిద్ధమని శ్రీమతి ఇందిరా గాంధీ ప్రకటించారు. శ్రీ బి.వి.కి ప్రధాన మంత్రి ఆహ్వానం పంపారు. ఈ వార్త తెలిసిన లచ్చన్న సంయుక్త కార్యాచరణ సమితి సమావేశాన్ని శ్రీ బి.వి. తో సంప్రతించి నన్ను ఏర్పాటు చేయమన్నారు. నేను శ్రీ బి.వి.ని ఫోనులో కలవమని టెలిఫోన్ వారిని కోరాను. వారంతా ఉద్యమ సానుభూతి పరులే. వారు వెదికి వెదికి శ్రీ బి.వి. కర్నూలు ఆసుపత్రిలో వున్నట్లు తెల్పి ఫోను అక్కడికి ఇచ్చారు. ఫిబ్రవరి 9న ఆయన కార్యదర్శి పలికాడు. ఆయనకు రాజకీయ జ్వరమని, ఎకెకెఎస్ నాయకులతో సంప్రతించకుండా ఢిల్లీ పోవడం ఇష్టం లేక ఆసుపత్రిలో చేరారని నాతో చెప్పాడు. ఫిబ్రవరి 15న సంయుక్త కార్యాచరణ సమితి సమావేశం జరుపమన్నాడు. ఫిబ్రవరి 9 రాత్రి కాంగ్రెస్ మంత్రులు తమ స్వంత బాధ్యతపై ఢిల్లీ వెళ్ళారు. వారు ఆంధ్ర కాంగ్రెస్ కార్యాచరణ సమితి ఉపాధ్యక్షులు శ్రీ బి.సి.రెడ్డి, కార్యదర్శి శ్రీ కృష్ణమూర్తి నాయుడు, కోశాధికారి శ్రీ మూర్తి రాజు ఫిబ్రవరి 13న ఎకెకెఎస్ సారధ్య సంఘం వారిని విమర్శించింది.

కారంచేడు సంయుక్త సమావేశం: సర్వశ్రీ బి.వి. గొట్టిపాటి బ్రహ్మయ్య, ఆచార్య

రంగా రాలేదు. తెన్నేటి సమయానికి రాకపోతే పడింపల్ల పరసంపా రావుగారిని అధ్యక్షులుగా నిర్ణయించుకున్నారు సభికులు. కాంగ్రెస్ వారికి కాంగ్రెస్ తరవుప వచ్చిన వారికి మధ్య వాదప్రతివాదాలు జరిగాయి. 'మేము యింకా కాంగ్రెస్ వారమే మా నాయకులతో మేము మాట్లాడుకుంటాం' అన్నారు శ్రీ చల్లా సుబ్బారాయుడు. పోరాటం దీర్ఘకాలికమా స్వల్పకాలికమా అనే ప్రశ్నను నేను లేవనెత్తితే దానిపై నిర్ణయం జరుగలేదు. ఫిబ్రవరి 19 నుండి 23 వరకు ఉద్యమాన్ని ఉధృతం చేయమని నేను ప్రతిపాదిస్తే దానికి బలం రాలేదు. ఫిబ్రవరి 19వ తేదీన 24 గంటల బంద్ జరుపాలంటే ఉదయం 6 గంటల నుండి 12 గంటల వరకని కాంగ్రెస్ వారన్నారు. విద్యార్థి నాయకుడు ఆగస్టీన్ కాంగ్రెస్ ప్రతిపాదనను బలపరిచాడు. పార్లమెంట్ సమావేశం కానున్న ఫిబ్రవరి 19న బంద్. నిర్ణీత వ్యవధిలో 5గురి చొప్పున జట్లుగా శాసనోల్లంఘనం చేయాలని నిర్ణయం. బస్సులను తిరగనీయ వద్దని తీర్మానం, ఉద్యమపు చరిత్ర వ్రాయటానికి ఉప సంఘం. అందులో సర్వశ్రీ ఎ. శ్రీరాములు, ఐ.బి. రామకృష్ణారావు, కె. రాజారావు, ఎం.పి. రామమూర్తి సభ్యులు. కారంచేడు సమావేశానికి అనారోగ్య కారణాల వల్ల రాలేక పోయామనీ, తీర్మానాలకు కట్టుబడి వుంటామని శ్రీ బి.పి. కబురు పంపాడు. తేదీ 16/2/73 దిన గుంటూరులో ఎ.కె.కె.ఎస్. సారధ్య సంఘం సమావేశమయి శ్రీ బి.వి.తో సంప్రతించుటకు సర్వశ్రీ తెన్నేటి, లచ్చన్నలను మదరాసు పంప నిశ్చయించింది.

బస్సులలో తిరిగే జనాన్ని బస్సులను ఆపి లారీలలో పంపేవారు. లారీలను స్వాధీనం చేసుకుంటామని ప్రభుత్వ బెదిరింపు. లారీలు ఆగిపోయాయి. ప్రజల ప్రయాణం, రైతులు ఉత్పత్తి చేసే వస్తువుల రవాణా దెబ్బతిన్నాయి. ఈ పరిస్థితులలో బస్సులను వదలడం యుక్తమని నా అభిప్రాయం. ఈ నిర్ణయం విజయవాడ న్యాయవాదులకు, వైద్యులకు, మహిళలకు నచ్చలేదు. వారు తే.18 నుండి బస్సులను ఆపటానికి ప్రయత్నించారు. వారిపై లాఠీ ఛార్జి జరిగింది.

16న మదరాసు వెళ్ళిన తెన్నేటి, లచ్చన్నలు తిరిగి వచ్చారు. సంయుక్త ప్రకటనపై సంతకం చేయుడానికి బి.వి. నిరాకరించారు. తే 22-2-72న తంగేదులో జరిగే కాంగ్రెస్ కార్యాచరణ సమితి సమావేశంలో అన్ని విషయాలు చర్చకు తెస్తామన్నారు. తెన్నేటి, లచ్చన్నలు 20వ తేదీ తిరిగి వచ్చారు. రాష్ట్ర నిర్మాణం జరిగే వరకు ఉద్యమం సాగించటానికి, ఈ దృక్పధంతో అంగీకరించే వారితో సహకరించటానికి, ఆంధ్ర మంత్రుల ఢిల్లీ పర్యటనకు ఖండించడానికి, విజయవాడ పరిస్థితులలో బస్సులను నడవనీయక పోవడం సరియైనది కావచ్చు కానీ, సంయుక్త కార్యాచరణ తీర్మానం కనుక కాంగ్రెస్ వారు ఎంతగా సహకరిస్తారో తెలుసుకొని విధానం నిర్ణయించుటకు లచ్చన్నకు అధికారం యివ్వడానికి 21వ తేదీ సారధ్య సంఘంలో తీర్మానాలు ఆమోదింప బడినాయి.

ఫిబ్రవరి 19వ తేదీన ఆంధ్ర ప్రాంతము మొత్తంమీద 35 వేల మంది అరెస్టు అయ్యారు. ఒక్క మచిలీపట్నంలోనే 11 వేల మంది శాసనోల్లంఘనం చేసి అరెస్టు అయ్యారు. వేర్పాటు కాంగ్రెస్ వాదులు ఊగిసలాట సమైక్య వాదులకు బలాన్ని చేకూర్చింది. ఫిబ్రవరి 18, 21 తేదీలలో రాజమండ్రిలో కమ్యూనిస్టులు వేర్పాటు

వాదులపై దాడి చేశారు. ఫిబ్రవరి 22న తెనాలిలోనూ అలాంటి దాడి. ఫిబ్రవరి 21న రైల్వే కార్మికులు పనిలో చేరడానికి నిశ్చయించారు. ఫిబ్రవరి 22న టంగేదులో కాంగ్రెస్ శాసనసభ్యులు పి.వి.ని విమర్శించారు. మరల తే 27/2/73 దిన విజయపురిలో సమావేశ మవటానికి నిర్ణయం ఈలోగా పి.వి.కి ఢిల్లీ నుండి ఆహ్వానం వస్తుందని వారి ఆశ. ఫిబ్రవరి 23న న్యాయవాదుల సెక్రటేరియట్ కార్యక్రమం కోసం ఐక్యతగానీ, ఐక్యత కోసం కార్యక్రమం కాదని తీర్మానించి, ఎ.కె.కె.ఎస్. నాయకులను హెచ్చరించింది. ఢిల్లీ వెళ్ళడానికి పి.వి. షరతులు పెట్టారు. అందులో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ప్రసక్తి లేదు. ఫిబ్రవరి 26న గుంటూరులో జరిగిన ఎకెకెఎస్ సమావేశంలో వంద మంది దాకా వచ్చారు. అందరూ తమ తమ అభిప్రాయాలను చెప్పారు. రాష్ట్ర నిర్మాణ ప్రకటన జరిగే వరకు సంభాషణలకు పోరాదని తీర్మానం చేశారు. ఫిబ్రవరి 27న ప్రధాని ప్రకటన. పి.వి.కి ఆహ్వానం. ఎకెకెఎస్ శాసన సభ్యుల రాజీనామాను డిమాండ్ చేసింది. వెన్నెంటనే అప్పన్న శాసన మండలి సభ్యత్వానికి రాజీనామా చేశారు. రాజీనామాలు కోరడం ఉద్యమానికి నష్టదాయకమని ఆంధ్ర మహా సభ వారు తీర్మానించారు. ఫిబ్రవరి 28న 'దేనికీ అంగీకరించలేదు, దేనినీ త్రోసివేయలేదు' అని ఇందిరాగాంధీ ప్రకటన. కాంగ్రెస్ వాదులలో ఆశ చిగురెత్తింది. లాంఛన ప్రాయంగా అప్పన్నకు ఫోన్ చేసి పి.వి. ఢిల్లీ వెళ్ళారు.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమప్పు తిరోగమనం

శ్రీ బి.వి. ఢిల్లీ వెళ్ళడాన్ని లచ్చన్న విమర్శించారు. బి.వి. 10 రోజులు ఢిల్లీలో వుండి ఆశాభంగమయి తిరిగివచ్చారు. విశ్రాంతి తీసుకోడానికి స్వగ్రామం కోయిలకుంట్ల వెళ్ళారు. మార్చి 15న తిరుపతిలో కాంగ్రెసు వారు సమావేశమవుతారని వార్త వచ్చింది. 1973 మార్చి 14న అసిస్టెంటు సర్జనులు, జూనియరు ఇంజనీర్లు సమ్మె విరమించడానికి నిశ్చయించారు. మార్చి 11న నర్సులు పనిలో చేరడానికి తీర్మానించారు. శ్రీ ఐ.బి. రామకృష్ణారావు యింకా 6గురు సంయుక్త కార్యాచరణ సభ్యులు ఢిల్లీలో ఆంతరంగిక శాఖామంత్రిని మార్చి 15న కలుసుకున్నారు. పలువురు న్యాయవాదులు యింకా ఎక్కువ కాలం తాము సమ్మెలో పాల్గొనలేమని నాకు చెప్పడంతో నేను ఆంధ్ర ప్రాంతం పర్యటించి అందరి అభిప్రాయాలను స్వయంగా తెలుసుకొని త్వరలో న్యాయవాదుల ప్రతినిధుల సభను సమావేశ పరుస్తానని నేను చెప్పాను. మార్చి 16న ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి సమావేశం జరిగింది. ప్రభుత్వోద్యోగులు సమ్మె విరమిస్తే వచ్చే పరిణామాలను చర్చించాలని నేను కోరాను. అది యిపుడు చర్చించవద్దని తెన్నేటి అన్నారు. సమైక్యవాదుల దాడులు గుంటూరు, తెనాలి, చీరాల, బాపట్ల, అవనిగడ్డ, ఉరవ కొండలలో ఎక్కువయినాయి. వేర్పాటు వాదులను ఆత్మ రక్షణ చేసుకోమని పిలుపు యిచ్చింది సమితి. సమితిని జై ఆంధ్ర ఫ్రంటుగా మార్చింది. తే. 17-3-73న తెన్నేటి వారి పత్రికా ప్రకటన యిది దీర్ఘకాలిక పోరాటమని సూచించింది. మార్చి 15న చిత్తూరులో సమావేశమయిన కాంగ్రెసు వాదులు ప్రత్యేక పార్టీ పెడతామన్నారు. మరల సమావేశం 27న జరుగుతుందన్నారు. మార్చి 16న ఉపాధ్యాయులు పాఠశాలలకు హాజరవటానికి నిర్ణయించారు. మార్చి 19న కళాశాల అధ్యాపకులు సమ్మె విరమించారు. అఖిల భారత ప్రభుత్వోద్యోగుల సంఘ కార్యదర్శి శ్రీ ఎ.శ్రీరాములు సలహా శ్రీ ఐ.బి. రామకృష్ణా రావుగారికి లభించిందని వార్త వచ్చింది. ప్రభుత్వోద్యోగుల సంయుక్త కార్యాచరణ సమితి సమావేశం హైదరాబాద్‌లో తే. 22-3-73న జరగవలసి వుంది. ఈలోగా కడపలో తే. 19-3-73న జరిగిన ఎన్జీవోల సభపై కాల్పులు జరిపి లాఠీచార్జీ చేశారు. శ్రీ బి.వి.ని ప్రజలు కాపాడారు. వెంటనే గవర్నరు సలహాదారు న్యాయ విచారణకు ఆదేశమిచ్చి మృతుల కుటుంబాలకు పరిహారం ప్రకటించారు. మార్చి 22న జరుగవలసిన ప్రభుత్వోద్యోగుల సంయుక్త కార్యాచరణ సంఘపు సమావేశం మార్చి 24న జరిగింది. 108 రోజుల సమ్మె ముగిసింది. ఉద్యోగులకు సదుపాయాలను కల్పించారు. కేసులు ఎత్తివేశారు. వేతనాల కొరకు గాక వివక్ష నిర్మూలన కోసం, ఆత్మగౌరవం కోసం జరిపిన పోరాటమిది.

మార్చి 20న విజయవాడలో సారథ్య సంఘ విస్తృత సమావేశం జరిగింది. అప్పటికి కడప కాల్పుల వివరాలు రాలేదు. 'సత్తా ఉన్నదనుకుంటే అలా కార్యక్రమం యిద్దాం. లేదనుకుంటే సర్వ సైన్యాధ్యక్ష హోదాలో ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితియే ప్రత్యక్ష చర్యలను విరమించమని సలహా యివ్వాలి' అని నేను సూచించాను.

ఆ సూచన పెద్దలకు నచ్చలేదు. నేను రాజీనామా యిచ్చాను. దాని ఊసు ఎత్తకుండానే తెన్నేటి, అప్పన్నలు సమావేశాన్ని ముగించారు. మార్చి 27న సమావేశమయ్యే కాంగ్రెసువాదులు రాజీనామా యిస్తారనే విశ్వాసాన్ని వెలిబుచ్చారు. మార్చి 28వ తేదీన గుంటూరులో జరిగిన న్యాయవాదుల ప్రతినిధుల మహాసభలో ఏప్రిల్ 6వ తేదీనుండి కోర్టుల బహిష్కారం అంతం కావాలనే నిర్ణయం జరిగింది. అలా నవంబరు 21 నుండి అంచెలవారీగా నిరవధికంగా సాగిన లాయర్ల కోర్టుల బహిష్కారం 136 రోజుల తదనంతరం ముగిసింది. ఏప్రియల్ 5వ తేదీన విద్యార్థులు ఏప్రిల్ 9వ తేదీన సమ్మె విరమించటానికి నిశ్చయించారు. ఇలా 167 రోజులు సాగిన విద్యార్థుల సమ్మె ముగిసింది.

ఏప్రిల్ 6వ తేదీన రాజమండ్రిలో జై ఆంధ్ర ఫ్రంటు మహాసభ జరిగింది. రత్నసభాపతిగారు పతాకావిష్కరణ, శ్రీ నడింపల్లి నరసింహా రావు ప్రారంభోపన్యాసం. తెన్నేటి అధ్యక్షులు. 600 మంది స్త్రీ, పురుషులు ప్రతినిధులుగా వచ్చారు. జై ఆంధ్ర ఫ్రంటు నిర్మాణంలో ముఖ్యంగా రాజకీయ పార్టీలవారు మిగిలారు. స్వతంత్ర, జనసంఘ్, సోషలిస్టు, రిపబ్లికను, పాత కాంగ్రెసువారు ముఖ్య కార్యకర్తలు. ఏప్రిల్ 27న ఏలూరులో ఉమన నిరోధక మహాసభ జరిగింది. నేను అధ్యక్షత వహించాను. మే 4న బంద్ విద్యార్థుల పూనికతో విజయవంతం అయింది. జూన్ 17న నిరసన దినోత్సవం చేశారు. ఆగస్టు 15న అధిక ధరలకు నిరసనగా నిరాహారదీక్షలు నిర్వహించారు. సభలు జరిగాయి.

వేర్పాటు కాంగ్రెసువాదుల కమిటీ 12 జిల్లాలు పర్యటించి తే. 16-4-73 దినమున సమర్పించాల్సిన నివేదిక తే. 28-4-73న సమర్పించింది. అక్టోబరు 2న బి.వి. సత్యాగ్రహం చేస్తామన్నారు. వారి మాటలపై ప్రజలకు విశ్వాసం పోయింది. చివరకు ఇందిరాగాంధీ ప్రకటించిన ఆరు సూత్రాల పథకంలో ఆంధ్రప్రదేశ్ స్థిరపడింది.

# ప్రత్యేకఆంధ్రోద్యమం: వివిధ వర్గాలు

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఉద్యమంలో రాష్ట్ర స్థాయిలో కృషి చేసిన స్వతంత్ర పార్టీ నాయకులు సర్వశ్రీ గౌతు లచ్చన్న సుంకర సత్యనారాయణ (తరువాత కృష్ణా జిల్లా పరిషత్ అధ్యక్షులు) బి. రత్నసభాపతి (ఎంఎల్ఎ), జాగర్లమూడి చంద్రమౌళి (మొదట్లో ఎంఎల్ఎ రాజ్యసభ సభ్యులు), యలమంచిలి శివాజీ (అప్పుడు వైద్య విద్యార్థి తరువాత డా. శివాజీ రాజ్యసభ సభ్యులు అయినారు), ఎన్: వీరాచారి, ప్రభృతులు వీరందరూ డెటెన్యూలుగా జైలులో వున్నారు. వీరి అఖిల భారత నాయకులు శ్రీ పీలుమోడి ఉద్యమ సమయంలో ఆంధ్రలో పర్యటన చేశారు; ఉద్యమాన్ని పార్లమెంటులో బలపరిచారు. 1972 నవంబర్ నాటికి జనసంఘం వారికి ఉద్యమంలో పార్టీగా పాల్గొనడానికి కేంద్ర పార్టీ అనుమతి రాకపోయినా ఉద్యమంలోకి దూకింది శ్రీ జూపూడి యజ్ఞనారాయణ. గుంటూరులో ప్రముఖ లాయరు. వారిని అందరూ 'జూపూడి' అని పిలుస్తారు. శ్రీ కొమరగిరి కృష్ణ మోహన రావు, శ్రీమతి జూపూడి హైమవతి గారు జనసంఘ్‌కు చెందినవారు. హైమవతిగారు రాజమండ్రి జై ఆంధ్ర మహిళా సభకు అధ్యక్షులు. కోస్తా అంతా పర్యటించారు. వీరి అఖిల భారత నాయకుడు శ్రీ వాజ్‌పేయ్ 73లో విజయవాడ, గుంటూరులను దర్శించి సభలలో ఉపన్యసించి పార్లమెంటులో ఉద్యమాన్ని సమర్థించారు.

సోషలిస్టులు ఆంధ్ర ప్రజాపరిషత్‌లోనూ, ఆంధ్ర మహాసభలోనూ, ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితిలోనూ, జై ఆంధ్ర ఫ్రంటులోనూ కృషి చేశారు. శ్రీ తుమ్మల చౌదరి ప్రజా పరిషత్‌కూ, జై ఆంధ్ర ఫ్రంటుకూ ప్రధాన కార్యదర్శి. ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితికి కార్యదర్శులలో ఒకరు. వారిలో మచిలీపట్నంలోని తూమాటి బాలకోటేశ్వర రావు, ఏటూరులోని గారపాటి కృష్ణమూర్తి, పల్లపోలు సాంబయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య గారలు ముఖ్యులు. వారి నాయకుడు జార్జి ఫెర్నాండెజ్ ఆంధ్రలో పర్యటించారు. ఆయన విజయవాడ సభలో నేను ఆయన ఉపన్యాసాన్ని అనువాదం చేశాను. ప్రజా పార్టీ పేరుకు అది పార్టీ దాని ప్రముఖులు సర్వశ్రీ తెన్నేటి డా. ఎ.బి. నాగేశ్వర రావు క్రొవ్విడి లింగరాజు గారు ప్రసిద్ధులు. వీరందరూ ఉద్యమంలో గట్టిగా పాల్గొన్నారు. తెన్నేటి విశుద్ధవర్తనుడు. ఆయన వల్ల ఉద్యమానికి మంచి పేరు వచ్చింది. కేంద్ర కార్యాచరణ సమితిలో చేరిన కాంగ్రెస్ వారు 3 తెరగులు. (1) పివిని ఎదిరించిన ఎంఎల్ఎలు. సర్వశ్రీ వసంత నాగేశ్వర రావు, కుడిపూడి ప్రభాకర రావులు వీరిని డెటెన్యూలు చేసింది ప్రభుత్వం (2) సర్వశ్రీ ప్రగడ కోటయ్య, ఎం.వి. సుబ్బరాజు (కొత్తపేట), రెండవవారు ఆనాడు శాసనమండలి సభ్యులు. వీరిని డెటెన్యూలుగా ప్రభుత్వం సత్కరించింది (3) రంగా అనుచరులయిన కాంగ్రెస్‌వారు. బాపట్ల న్యాయవాది శ్రీ పసుపులేటి కోటేశ్వర రావు ఎకెకెఎస్ కార్యదర్శులలో ఒకరు. సర్వశ్రీ ఎం.వి. రామమూర్తి, సి.హెచ్. రాజారెడ్డి, మల్లాది వెంకట సుబ్బమ్మ ఉద్యమంలో పాల్గొన్న రాడికల్ హ్యూమనిస్టులు.

రాజారెడ్డి, సుబ్బమ్మలు చీరాల తాలూకా కార్యాచరణ సమితికి వరుసగా కోశాధికారిగా, ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ సందర్భంగా ఒంగోలు సబ్ జైల్‌లో 5 రోజులు వున్నారు. విజయవాడలో పికెటింగులు చేశారు. ఫిబ్రవరి 19న పోలీసు స్టేషనులపై జెండాలు ఎగురవేశారు. పలుసార్లు అరెస్టు అయ్యారు. విజయవాడలో జరిగిన 2వ ఆంధ్ర మహిళా సభకు సారధ్య సంఘ సభ్యులు. ఏప్రిలు 8 రాజమండ్రి జై ఆంధ్ర మహిళా విభాగ సభకు ప్రారంభకులు. నాతో కలిసి ఆంధ్ర ప్రాంత మంతా పర్యటించారు. జై ఆంధ్ర ఫ్రంటు కార్యక్రమాల్లో ఆంధ్రులు, తెలంగాణా వారు ఒకే రాష్ట్రంలో వుండి కీచులాడుకునే దానికన్నా వేరు పడడం మంచిదని భావించి ఈ ఉద్యమంలో చేరారు. వారికి తెలంగాణా వారిపై ద్వేషభావం ఏనాడూ లేదు. గోరాగారు చిన్న రాష్ట్రాలు ఎంఎల్ఎలను ప్రజలు అదుపులో పెట్టడానికి అనువయినవని భావించారు.

వ్యక్తి హుందాకు సాంఘిక న్యాయానికి ప్రమాదం జరుగని రీతిలో సమస్య పరిష్కారం కావలెనన్నారు. అఖిల భారత సభలలో. ఆంధ్ర పరిస్థితిని వివరించి అనధికార రాయబారిగా కృషి చేశారు. శ్రీ జి.సి. కొండయ్య (నెల్లూరు) సమస్యను అన్ని కోణాలనుండి పరిశీలించగల రాజకీయ వేత్త. సహచరులయెడ విశ్వాసం ఉంచగల మిత్రుడు. కార్యక్రమ రచన, సంప్రదింపుల నిర్వహణ, ఆలోచన ఆయన అవలీలగా చేసే పనులు. డెటెన్యూ. 'ఆంధ్రలో అగ్నిజ్వాలలు' అనే పుస్తక రచయిత. నడికపల్లి నరసింహారావుగారిని అందరూ పంతులుగారంటారు. ప్రకాశం పంతులుగారి అంతే వాసి. న్యాయవాది. సైమను కమిషన్ వస్తే మున్సిపలు ఛైర్మనుగా మున్సిపల్ ఆఫీసును మూసివేయించిన ధీరుడు. 1956 నుండి ప్రత్యేక రాష్ట్ర వాది. 1969లో ప్రత్యే రాష్ట్రం కొరకు మహా సభ జరిపించినవారు. ఆంధ్ర ప్రజాపరిషత్‌కు ఉపాధ్యక్షులు. గుంటూరులో జరిగే కేంద్ర కార్యాచరణ సమితి సమావేశాలు వారి యింటిలోనే జరిగేవి. మార్చిలో నేను జరిపించిన న్యాయవాదుల ప్రతినిధుల సభకు వారే నాకు అండగా నిలబడ్డారు. వారికి దూరాలోచన చేయగల సత్తావుంది.

ఇందిరా కాంగ్రెస్ పార్టీలో వేర్పాటువాదులు 4 రకాల వారు (1) శ్రీ బి.వి. వర్గం. బివిని పాముభూతిగా చూచేవారు. ఆయన చిత్తశుద్ధిని శంకించరు. ఆయనపై నమ్మకం లేనివారు ఆయనకు అసలు ఆంధ్రోద్యమంలో నమ్మకం లేదంటారు. ఆయనకు వస్తుతరే 6 గురు శాసన సభ్యులే అనుచరులు. మాజీ ఉప ముఖ్యమంత్రి అవడం వల్ల రాయలసీమ వాసి అవడం వల్ల ఆయనకు ఆంధ్ర ప్రాంత శాసనసభ్యుల నాయకత్వం దక్కింది. మెజారిటీలేని నాయకత్వం, తన పార్టీని వదులుకోలేని అశక్తత, ఈ రెండూ ఆయనను బాధలు పెట్టాయి (2) సర్వశ్రీ బ్రహ్మానంద రెడ్డి కాకాని గ్రూపు. దీనిలో 22 మంది శాసనసభ్యులుండే వారు. శ్రీ బ్రహ్మానంద రెడ్డి లక్ష్యాలు రెండు. పి.పి.ని గద్దె దించడం, ఇందిరమ్మ తన సహాయాన్ని కోరవలసి రావడం. గుంటూరులో సంప్రతింపుల సంఘాన్ని వేయించింది కాకినాడలో కార్యక్రమం వేయించిందీ, నర్సారావు పేటలో సంయుక్త కార్యాచరణ' సమితిని నెలకొల్పింది కారంచేడులో ఆ సమితిని కొనసాగించాలని ప్రయత్నించింది ఈ గ్రూపే. (3) శ్రీ బసిరెడ్డి వర్గం వీరికి 57 మంది శాసన సభ్యుల బలముంది. వీరికి ఆంధ్రోద్యమం యెడ అభిమానం లేదు. విధి లేక ఉద్యమంలోకి వచ్చారు.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమం: ప్రజల పాత్ర

రైళ్ళు సరిగ్గా నడపడం లేదు. న్యాయస్థానాలు మూతపడ్డాయి. ఎన్జీవోలు, ప్రభుత్వ ఉద్యోగులు పూర్తిగా సమ్మెలో మునిగి తేలుతున్నారు. గెజిటెడ్ ఆఫీసర్లు సమ్మెలో చేరారు. పాఠశాలలు, కళాశాలలు పని చేయడం లేదు. ఆర్టీసి బస్సులు తిరగడం లేదు. కేంద్ర ప్రభుత్వ ఆఫీసులు పని చేయడం లేదు. బ్యాంకులు, జీవిత భీమా సంస్థల కార్యాలయాలు ఉద్యమ కార్యకర్తలు అనుమతించిన రోజుల్లోనే పని చేస్తున్నాయి. భూమి శిస్తు, ఇంటిపన్ను, వాణిజ్య పన్ను, ఆదాయపు పన్ను, వినోదపు పన్ను ఇదీ అదీ ఏమిటి అన్ని పన్నుల వసూళ్ళు స్తంభించి పోయింది. మెజిస్ట్రేట్‌లు, పోలీసులు మాత్రం ప్రభుత్వం కోసం పని చేస్తున్నారు. పోలీసులను నమ్మక, కేంద్ర రిజర్వు పోలీసులను దిగుమతి చేసింది. ప్రభుత్వం. వారైనా దక్షిణ రాష్ట్రాల వారు కాదు. హిందీ రాష్ట్రాలైన మధ్య ప్రదేశ్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్, పంజాబ్‌కు చెందిన వారు. సైన్యాన్ని దింపింది కానీ, వారు ప్రత్యక్షంగా రంగంలోనికి దూకలేదు. ప్రతిరోజు ప్రతి పట్టణంలో ఒక వృత్తి సంఘం వారు ఊరేగారు. 144 సెక్షన్ ధిక్కరించారు. ఒకొక్క రోజు 150 మందిదాకా అరెస్టు చేయబడిన సందర్భాలున్నాయి. మహిళలు అధిక సంఖ్యలో ఊరేగింపులలో పాల్గొంటున్నారు. ముఖ్యంగా విద్యార్థినులు విశేషంగా శ్రమ చేశారు. ఇక స్థానిక బంద్‌లు, రాష్ట్ర వ్యాప్త బంద్‌ల విషయం చెప్పనక్కర్లేదు. ఉదాహరణకు బంద్ తరువాత జరిగే ఊరేగింపుల్లో విజయవాడలో 126, గుంటూరులో 100 వృత్తి సంఘాల వారు తమ తమ పతకాలతో, బ్యానర్లతో పాల్గొన్నారు. జిల్లాలలో పర్యటనలు, బుద్ధుని రోజులను జ్ఞాపకం చేశాయి. జనవరి 2న స్త్రీ-పురుషులతో క్రిక్కిరిసిన రెండువేల మోటారు వాహనాలలో కృష్ణా జిల్లాలో 140 మైళ్ళ ఊరేగింపు జరిగింది. జనవరి 18న గుంటూరు జిల్లాలో 170 మైళ్ళ ఊరేగింపు, 2 వేల మోటారు వాహనాలతో జరిగింది. ఫిబ్రవరి 1వ తేదీన ప్రకాశం జిల్లాలో 150 వాహనాలపై ప్రజలు 130 మైళ్ళు పర్యటన చేశారు. గుంటూరు జిల్లా ఊరేగింపు పొడవు 21 మైళ్ళు. ఒకొక్క బస్సుకు లోపల యాభై మంది స్త్రీలు, కప్పుపైన యాభై మంది పురుషులు. ఇలా లక్షల జనసందోహం కదలడం ఎన్నడూ చూడని విషయం. వారికి త్రోవపొడవునా గ్రామీణులు మంచినీరు, మజ్జిగ, పండ్లు, ఫలహారాలు ఉచితంగా అందించారు. అదంతా ఒక జైత్రయాత్ర. ఎవరి బస్సుకు, ఎవరి లారీకి వారు పెట్రోలు ఖర్చు చందాలు వేసుకొని భరించారు. కాగా లారీ, బస్సు యజమానులు వాహనాలను ఉచితంగా యిచ్చారు.

తే 1-2-1973 దిన జనసంఘ నాయకులు వాజపాయ్ వచ్చారు. ఆ రోజున నగరంపైగా స్త్రీలు పురుషులు లక్షన్నర జనం ఊరేగారు. డి.ఎం.కె. నాయకులు శ్రీ జి. విశ్వనాథన్ వస్తే 20 వేల జనం విజయవాడలో సభకు వచ్చారు. ఫెర్నాండెజ్ సభకు ఏబది వేలు వచ్చారు. చిన్న మీటింగు అయినా 20వేల జనానికి తక్కువ లేదు. ఉపన్యాసకులు పుట్టుకొచ్చారు. అనంతపురంలాంటి పట్టణాలలో సభలు ప్రతిరోజా

జరిగేవి. వేల సంఖ్యలో ప్రజలు హాజరయ్యేవారు.

విజయువాడలోని ఉరేగింపులలో వృత్తి సంఘాలవారు పూటకొకరు ఉరేగేవారు, మేళాలు వాయించేవారు/ తమ వాద్య సరంజామాతో ఉరేగితే, క్షురకర్మ చేసేవారు తమ కత్తులను చేతులపై నూరుతూ వీధులలో తిరిగారు. చివరకు పురోహిత బ్రాహ్మణులు జంధ్యాలు సవరించుకుంటూ వీధులలో తిరిగారు.

ప్రతి పట్టణంలో ఏ వార్డు కావార్డు, ఏ వీధికావీధి సేనలు వెలిశాయి. నాలుగు బజార్ల సెంటర్లలో ఉక్కు స్తంభాలునాటి జై ఆంధ్ర పతాకాలు ఎగురవేశారు. ఒక్క విజయవాడలోనే 110 జెండా స్తంభాలు, 110 సేనలు. ఉదాహరణకు కొన్నింటి సేనల పేర్లు ఈవిధంగా ఉన్నాయి.

ఆంధ్రసేన, అమరసేన, ప్రజాసంఘం, ప్రజా వాహిని, కాకాని బ్రిగేడ్, అటోసేన, ఆంధ్రపటాలం, ఆంధ్రాబ్రిగేడ్, ఝాన్సీ బ్రిగేడ్ అవి. అన్నింటికన్నా ఆంధ్ర సేనకు రాష్ట్రవ్యాప్తంగా శాఖలు ఏర్పడ్డాయి. వీరి నినాదాలు (1) రాష్ట్రం సాధిస్తాం: రక్తం చిందిస్తాం (2) ఎత్తిన జెండా దించేది లేదు. (3) ఇందిర రాజ్యం గందరగోళం ఇత్యాదులు. దీని వ్యవస్థాపకుడు శ్రీ మాదాల జానకిరాం. ఈ సేన నాయకులలో ఎక్కువ మందిని డిటెన్యూలుగా బంధించింది ప్రభుత్వం. వీరి పిలుపులు సమన్వయ గందరగోళ పరిచేవి. ఈ సేనకు సిద్ధాంతం లేదు. రాష్ట్ర నాయకత్వం కాంగ్రెస్‌కు అనుకూలం. మాదాల జానకిరాం 'జైలులో వున్నపుడు ఆయన తరువాత నాయకత్వం' చేపట్టిన వారు అప్రతిష్ట తెచ్చారు. సంయుక్త నాయకత్వం టెలిగ్రాఫు టెలిఫోను ఆఫీసులను మూయించవద్దంటే ఘెరావుంచ తలపెట్టింది సేన. ఫలాని రోజుల్లో బ్యాంకులు పోస్టాఫీసులు పనిచేయాలంటే ఆ రోజులలో వాటిని మూయించ సమాయత్తం అయ్యేది. హైదరాబాదుకు పాలు సరఫరా కారాదని ఉత్తరువును సేన జారీ చేస్తే తెన్నేటి, లచ్చన్న గారలు జోక్యం చేసుకొని ఆపించవలసి వచ్చింది.

లాయర్లు:- న్యాయవాది కార్యచరణ సమితి కొంచెం ముందుచూపుతో వ్యవహరించేది. (1) 1972 డిసెంబరు 9,10 తేదీలలో జరిగే తెలంగాణా లాయర్ల మహా సభకు 'స్నేహపూర్వకంగా విడిపోదామని న్యాయవాది కార్యాచరణ సమితి అధ్యక్షుని తంతి. ఆయనను కలిసి తే.30-12-72న ఆంధ్ర ప్రదేశ్ అంతటా లాయర్లచే రాష్ట్ర విభజనకై ఐక్యతా దినోత్సవం. దరిమిలా జై ఆంధ్రా ఫ్రంట్ ఏర్పడి తెలంగాణా, ఆంధ్రా ఉద్యమాలకు సమన్వయం కుదిరింది. (2) ఆస్తికీ, ప్రాణాలకు నష్టం లేకుండా శాంతియుత న్యాయ పద్ధతులలో పోరాటం (కడప ప్రాంత సభ) అలాంటి తీర్మానమే ఎ.కె.కె.ఎస్. డిసెంబరు 4న చేసింది. (3) ఆంధ్ర శాసన సభ్యులు రాజీనామా యివ్వాలి (నవంబరు 30 డిసెంబరు 7 ఫిబ్రవరి 23 లాయర్ల తీర్మానాలు. అలాంటిదే ఫిబ్రవరి 27న ఎ.కె.కె.ఎస్. తీర్మానం. (4) ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సూత్రం అంగీకరించ బడగానే ప్రస్తుత శాసన సభ రద్దుకావాలి. (లాయర్ల కార్యచరణ సమితి ఫబ్రవరి 13). శాసన సభ రద్దుకావాలి (ఫిబ్రవరి 18 తెన్నేటి) ఎ.కె.కె.ఎస్. ఫిబ్రవరి 27) (5) ప్రతిజ్ఞ (కార్యాచరణ సమితి ఫిబ్రవరి 13). ఎ.కె.కె.ఎస్ ప్రతిజ్ఞ మార్చి 3. (6) సేనలు క్రమశిక్షణతో వ్యవహరించేటట్లు కృషి (కార్యాచరణ సమితి ఫబ్రవరి 13) అలాంటివే ఫిబ్రవరి 16, మార్చి

20ంలో ఎ.కె.కె.ఎస్. తీర్మానాలు. (7) పార్టీని ప్రభుత్వాన్ని కలగలుపు చేయటం ఉదా. కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు శంకర్‌దయాళ్ శర్మ కేంద్ర ప్రభుత్వ మంత్రి మండలికి హాజరవటం ప్రజాస్వామ్యానికి ముప్పు. (లాయర్లు మహాసభ తే 28-3-1973) అటువంటిదే తె 8-4-1973న జై ఆంధ్ర మహాసభలో తీర్మానం. (8) ఫిబ్రవరి 23 తీర్మానంలో లాయర్ల సమితి ఐక్యత పేరుతో కాంగ్రెస్ వారి చుట్టూ తిరగవద్దని హెచ్చరించింది. ఫిబ్రవరి 27న ఎ.కె.కె.ఎస్. వేర్పాటు కాంగ్రెస్ వాదులపట్ల దృఢ వైఖరి అవలంబించింది.

ప్రజల నుండి వసూలు చేసే నిధులకు లెక్కచెప్పాలని (లాయర్ల సెక్రటేరియటు ఫిబ్రవరి 23) సంస్థలకు, సంఘాలకు వ్యక్తులను హెచ్చరించింది. న్యాయ సహాయ కమిటీల, పౌర హక్కుల కమిటీల నిర్మాణాన్ని లాయర్ల సమితి ఆశించింది. 1972 (డిసెంబర్ 28). ధరల పెరుగు దలను అరికట్టమని లాయర్ల సెక్రటేరియేటు ఫిబ్రవరి 23న కోరింది. మొదట్లో పది రోజులు గడువు పెడుతూ, కోర్టుల బహిష్కారానికి సాగించి చివరకు 1973 ఫిబ్రవరి 23న నిరవధికంగా బహిష్కరించ మన్నది. న్యాయవాద కార్యాచరణ సమితి అధ్యక్షుడు ఎ.కె.కె.ఎస్. కార్యాలయ పర్యవేక్షక కార్యదర్శి పదవిని చేపట్టకుంటే ఇంకా సమర్థవంతంగా పని చేయచేయ గలిగే వాడినే విమర్శ కొంతగా కొంత సరైనదే.

## మహిళలు

రాజకీయ చైతన్యం గల మహిళలు 1972 నవంబర్ మధ్య కాలం నుండి, విద్యార్థినులు 1972 అక్టోబర్ చివరి నుండి, నవంబర్ 21 కాల్పుల తరువాత, ఏకెకెఎస్ ఆవిర్భవించి నప్పటి నుండి, చివరగా వేర్పాటు కాంగ్రెస్ వాదులు ఉద్యమంలోకి వచ్చిన 1972 డిసెంబర్ 17 నుండి స్త్రీలు ఉద్యమంలోకి దూకారు. కాంగ్రెస్ స్త్రీలు రేబాల దమయంతీ దేవీ (నెల్లూరు), స్వరాజ్య లక్ష్మి (ఒంగోలు) ఆ కోవకు చెందిన వారు. డాక్టర్ల సమ్మెలో డాక్టరమ్మలు ఉద్యమంలోకి వచ్చారు. డాక్టర్ లిల్లీ సుందరం (ఒంగోలు), డాక్టర్ సహోజినీ రామారావు (విజయవాడ) అలాంటి వారు. ఎన్జీవోల భార్యలు ఉద్యమాన్ని తమదిగా చేసుకున్నారు. ఒంగోలులో జరిగిన ఆంధ్ర మహిళా మహా సభ, తిరుపతిలో 1973 జనవరి 22న జరిగింది. ఆరు జిల్లాల వారు మాత్రమే వచ్చారు. డా. లిల్లీ సుందరం అధ్యక్షులు. సీతాదేవి (అనంతపురం), స్వరాజ్య లక్ష్మి (ఒంగోలు) గార్లు ఉపాధ్యక్షులు. కార్యదర్శిగా శ్రీమతి ఇంద్రాణీ (తిరుపతి), సహాయ కార్యదర్శిగా శ్రీమతి లక్ష్మిదేవమ్మ (అనంతపురం) ఎన్నికయ్యారు. ప్రతీ గ్రామంలో, పట్టణంలో, నగరంలో మహిళలు ముందంజ వేశారు. 1973 ఏప్రిల్ 1న మహిళల ద్వితీయ మహాసభ జరిగింది. 12 జిల్లాల నుండి వెయ్యిమంది స్త్రీలు ప్రతినిధులుగా వచ్చారు. హైదరాబాద్ నుండి ఎన్జీవో నాయకుడు శ్రీ ఐ.బి. రామకృష్ణారావు భార్య ఇందిరా రామకృష్ణారావు, నెల్లూరు నుండి రేబాల దమయంతీ దేవి ప్రతినిధులుగా వచ్చారు. సెక్షన్ 144ను ధిక్కరించి ఊరేగింపు చేస్తే మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షురాలిని అరెస్టు చేశారు. చెటేసూలుగా స్త్రీలు లేరుకాని, అనేక మంది జైళ్ళ పాలయినారు. అలాంటి వారిలో శ్రీమతి

అద్దేపల్లి వివేకానంద దేవిగారు ప్రముఖులు.

గ్రామాధికారులు, భూ స్వాములు, వ్యాపారస్తులు, మధ్య తరగతి, చేతి వృత్తుల వారు ఉద్యమంలోకి వచ్చారు. కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల ప్రభావంలో ఉన్న పారిశ్రామిక కార్మికులు, వ్యవసాయ కార్మికులు తప్ప మిగతా కార్మికులు తటస్థంగా ఊరుకున్నారు. వ్యతిరేక భావాన్ని ప్రదర్శించ లేదు. కార్మికులలో ఉన్న ఆర్థిక కారణాల పైన మాత్రమే స్పందించే మనస్తత్వం మన దేశంలో ఉంటున్నది కనుక వారు ఈ ఉద్యమంలోకి రాకపోవడం సహజ పరిణామమే.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమం

## విశేషాలు: వింతలు- 1

**1973** ఫిబ్రవరి 5న 'మహా విప్లవం' వస్తుందని శ్రీ బి.వి. ఉపన్యాసాలు దంచారు. ఒక వంద మంది ఆత్మాహుతి దళాలు వుంటే ఒక్క రోజులో రాష్ట్రాన్ని సాధిస్తానన్నాడు. ప్రజలలో ఉద్విగ్నత హెచ్చింది. నరస రావుపేటలో మహా విప్లవం అంటే ఏమిటని ఆచార్య రంగాగారు శ్రీ బి.వి.ని అడిగారు. కృష్ణా, గోదావరి వంతెనలను బ్రిడ్జులు కొట్టడం అని ఆయన జవాబు చెప్పారు. 'అయితే నాకు ఆంధ్రరాష్ట్రం అక్కర లేదు' అన్నారు ఆచార్య రంగా. వెంటనే 'అవిలేని ఆంధ్రరాష్ట్రం మాకూ వద్దు' అన్నారు తెన్నేటి వారు. అంతటితో ఆ ప్రస్తావన ఆగిపోయింది. నరసరావుపేట సంయుక్త సమావేశానికి హాజరయినేను రాత్రికి రాత్రి విజయవాడ వచ్చాను. ఒక మిత్రుని ఇంటిలో ఆశ్రయం పొందాను. అతని కుటుంబీకులు కొందరు యువకులు వచ్చి 'మహావిప్లవం' ఎప్పుడు, ఎలా వస్తుందని అడిగారు. చెప్పినచో బి.వి. పరువు, ఆంధ్ర నాయకుల పేరు ప్రఖ్యాతలు మట్టి కలిసి పోతాయి. తెలుస్తుంది కదా అంటూ చిరునవ్వు నవ్వాను. ఆ రాత్రంతా చౌకులలో నిలబడే ఉన్నారు. మహా విప్లవం గురించిన వార్త తెలుస్తుందని. ఆరవ తేదీ ఉదయం మామూలుగానే ప్రశాంతంగా సూర్యోదయం అయింది.

ఫెర్నాండెజ్ ఉపన్యాసాన్ని సోషలిస్టు నాయకుడు శ్రీ జొన్నల గడ్డ రామలింగయ్య (మాజీ కమ్యూనిస్టు నాయకుడిగా 15 సంవత్సరాల అనుభవం ఆయనకు) అనువాదం చేస్తున్నారు. అనువాదంలో ఒక పొరపాటు దొర్లింది. యాభై వేల మంది ఉన్న సభలో వెయ్యి గొంతులు ఒక్క సారిగా 'దిగిపో' అని కేకలు పెట్టాయి. రామలింగయ్య గారు బాధపడి దిగి పోయారు. సభాధ్యక్షుడైన యార్లగడ్డ రాజగోపాల రావుకు చిక్కు పరిస్థితి ఎదురైంది. ఒక యువ అధ్యాపకుడు తాను అనువాదం చేస్తానని ముందుకు వచ్చారు. అతనిని చూసిన అధ్యక్షుడికి ధైర్యం చిక్క లేదు. వేదిక మీద కూర్చున్న నాతో 'ప్రజలకు మీ మీద అభిమానం వుంది, మీరు తర్జుమా చేయండి అన్నాడు. నాకు ధైర్యం లేక పోయింది. రాజగోపాల రావుగారి వత్తిడి వల్ల అంగీకరించాను. కొంత వరకు బాగానే సాగింది అనువాదం. నాకు, ఫెర్నాండెజ్‌కు వయస్సులో పది, పదిహేను సంవత్సరాల తేడా. అతడు త్వరత్వరగా మాట్లాడుతున్నాడు. అతనికి ఒక 'మైకు', నాకింకొక మైకు ఉన్నాయి. 'దట్ స్కౌండ్రల్ శరీవ్' అని గవర్నర్ సలహాదారుని తిట్టాడు. 'ఆ దుర్మార్గుడు శరీవ్' అన్నాను నేను. వెంటనే 'దట్ ట్రెయిటర్ డాంగే', అన్నాడు. ఇంకా వాక్యం పొడిగించ బడింది. తొందరలో ఆ పద జాలాన్ని నేను వదిలేశాను. విజయవాడ ప్రజలకు నాపేరు చిరపరిచిత మవడం వల్ల నాపట్ల అభిమానంతో 'ద్రోహి' అని అందించారు. నాలిక కొరుక్కొని 'ఆ దేశ ద్రోహిడాంగే' అన్నాను. ప్రజలు చప్పట్లు కొట్టారు. బ్రతుకుజీవుడా అని బయట పడ్డాను. నాకు డాంగేపట్ల (నేను మాజీ కమ్యూనిస్టును కదా!) ఉన్న అభిమానమే నా చేత అలా ఆ పద జాలాన్ని దాటవేసేటట్లు చేసిందా లేక నిజంగా నేను పొరపడ్డానా, నాకు ఇప్పటికీ తేలలేదు.

ఒకసారి చీరాల నుండి విజయవాడ వస్తున్నాను. బహుశః అది డిసెంబర్ 25వ తేదీన అనుకుంటాను. ఈ పురుష్ణపాలెం వద్ద ఉద్యమ వాలంటరీలు నా కారును ఆపారు. అప్పుడునేను కారుదిగి నన్నునేను ఎరుక పరుచుకున్నాను. యువకుల్లో ఒకతను గుర్తించి 'మన నాయకుడురా' పోనివ్వండి అన్నాడు. అప్పుడు నా కారుకు త్రోవ ఇచ్చారు.

ఒక పర్యాయం నేను, లచ్చన్న ఒక కారులో విజయవాడ నుండి గుంటూరు వెళ్తున్నాం. ఉండవల్లి వద్ద యువకులు మా కారు ఆపి చందా చెల్లించ మన్నారు. 'ఎందుకివ్వాలి' అని నేను అడిగాను. 'ఇవ్వాల్సిందే లేక పోతే కారును కదల నివ్వం' అన్నారు, వారు. 'ఎవరి ఆదేశాలను అనుసరించి ఇలా వసూలు చేస్తున్నారు? అని వారిని ప్రశ్నించారు. వెంటనే తడుముకోకుండా 'లచ్చన్న'గారు అనేవాడు వాళ్ళ 'లీడర్'. నాకు నవ్వు వచ్చింది, కోపమూ వచ్చింది. 'సరే' ఆయన్ను అడగండి అని లచ్చన్నగార్ని చూపించాను. వారిలో ఇరువురు కారులోకి తొంగిచూసి లచ్చన్నగార్ని గుర్తుపట్టి ఆశ్చర్య పోయారు. వారినోట మాట రాలేదు. లచ్చన్న గారు వారిని 'దబాయించి చందాలు వసూలు చేయవద్దు' అని హితవు చెప్పారు. మేము సాగిపోయాం.

లచ్చన్నగారు విడుదల అయి నన్ను ఇబ్రహీంపట్నంలో కలుసుకో మన్నారు. విజయవాడలో కర్ఫ్యూ కనుక చిన్న చిన్న రోడ్ల గుండా కారులో పడి విజయవాడ వెలుపలికి పోవాలని ప్రయత్నిస్తున్నాను. ప్రతి రెండవ వీధిలో 'బారికేడ్సు' ఉన్నాయి. నన్ను యువకులు గుర్తుపట్టి నా కారుకు సౌజ్ఞలు చేసి (ట్రాఫిక్ పోలీస్‌ల వలే) ఊరు దాటడానికి సాయపడ్డారు. నేను ఇబ్రహీంపట్నం చేరేటప్పటికి లచ్చన్న గారు గుంటూరు వెళ్ళారని తెలిసింది. గుంటూరులో ఎన్జీవోల భవనంలో సభ. లచ్చన్న గారు ప్రసంగించి కూర్చున్నారు. మాజీ మంత్రి వల్లా సుబ్బారాయుడు గారు ఉపన్యసిస్తున్నారు. నా పేరు రాసిన చీటిని అధ్యక్షుడికి ఇచ్చాను. అప్పటికి రాత్రి పది గంటలు అయ్యింది. సభ ముగింపుకు వచ్చింది. గత్యంతరం లేక 'శ్రీ యం.వి. రామమూర్తిగారు మాట్లాడతారు, ఆంధ్ర కేంద్ర కార్యాచరణ కార్యదర్శి' అని ప్రకటించారు నేను లేచేటప్పటికి జనం, కాలాతీత మైనందువల్ల, అసహనంతో కదులు తున్నారు. నేను గంభీర స్వరంలో మిత్రులారా అన్నాను. అందరూ కూర్చున్నారు. ఎన్జీవోలకు తాను ఏదో సాయం చేస్తున్నట్లు మాట్లాడిన వల్లా సుబ్బారాయుడు గారి ప్రసంగాన్ని దుయ్య బట్టాను. సభ ముగిసింది. లచ్చన్న గారు నాతో 'నీవు తొందర పడ్డావు' అన్నారు. 'ఆయన మాటలు నిజమేనా' అని అన్నాను. 'కాదనుకో' అన్నారు లచ్చన్నగారు.

ఒకసారి నేను గుంటూరు నుండి విజయవాడకు కారులో వస్తున్నాను. రాత్రి పదకొండు గంటలు అయింది. 20 వేల మంది ఉన్న సభ అది. 'మనలను ఎవరూ ఆదుకోవడం లేదు. మనం సమ్మె మానివేదాం' అని ఒక ప్రభుత్వ ఉద్యోగి మాట్లాడు తున్నాడు. నాకు అరికాలి మంట నెత్తికొచ్చింది. వేదిక మీదకు ఎక్కి కూర్చున్నాను. నేను మాట్లాడతానని సభాధ్యక్షునితో చెప్పాను. నన్ను గుర్తించి, నన్ను పరిచయం చేసి మాట్లాడమన్నారు. 'ఎన్జీఓ మిత్రులారా! క్లాస్‌ఫోర్

సోదరులారా! ఉద్యమాన్ని ప్రారంభించిన గౌరవం మీకు దక్కింది. మీరుకాస్త వెనకడుగు వేస్తే, లాయర్లము మేము ఆదుకున్నాం. తరువాత మీ బలాన్ని చేకూర్చుకుని మీరు రంగ ప్రవేశం చేశారు. సాగిస్తున్నారు. మీకు నా అభినందనలు కృతజ్ఞతలు. మీ కృషిని ఆంధ్ర ప్రజలు మరచి పోవడం లేదు. ఏవూరి కావూరి వాళ్ళు, ఏ తాలూకాకు ఆ తాలూకా ప్రభుత్వ ఉద్యోగులకు అండగా నిలబడు తున్నారు. అలా జరగడం లేదే అనుకుంద్దాం. మరి మీరు ఉద్యమంలో నుండి వెళ్ళిపోతారా? నేను న్యాయవాది కార్యాచరణ సమితి అధ్యక్షుడనని మీకు తెలుసు. మా న్యాయవాదులలో సగం మందికి మీలో అందరికన్నా తక్కువ జీతం ఉన్న గుమాస్తాకు వచ్చే ఆదాయం కూడా లభించదు. మా వాళ్ళు పళ్ళు బిగువలో, కష్టాలు భరిస్తూ, ఉద్యమంలో వుంటున్నారు. మేము ఉద్యమంలో నుండి వెళతామని అనడం లేదే! అసలు మమ్మల్ని, మిమ్మల్ని ఉద్యమంలోకి రమ్మనమని ఎవరు పిలిచారు. మేమే వచ్చాం. మీరూ వచ్చారు. అంతగా మీకు కష్టమైతే మీరు ఉద్యమంలో నుండి వెళ్ళి పొండి. అలా చేస్తే మీకే అప్రతిష్ట' అని నా ప్రసంగాన్ని ముగించాను. శ్రోతలు అంగీకార సూచకంగా చప్పట్లు కొట్టారు.

# ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమం

## శేషాలు–వింతలు–2

లాయర్ల కార్యాచరణ సమితిలో నేను తయారు చేసే తీర్మానాలు పైకి చాల మృదువుగా వుండేవి. ఒక సభ్యుడు నన్ను ఘాటుగా విమర్శించాడు. 'ఖండించాము' అనే పదానికి బదులు అంగీకరించటం లేదు' అని రాయటం బాగాలేదని అతని ఫిర్యాదు. మాటలో కరుకుతనం లేకున్నా కార్యాచరణలో గట్టితనం వుంటున్నదని బదులు పలికాను. అతనికి అసంతృప్తి పోలేదు. ఆ మిత్రుడిని జైలులో పెట్టింది ప్రభుత్వం. తనను ఎవరూ పట్టించుకోవటం లేదని వాపోయాడు ఆ మిత్రుడు. మాటలకన్న పని ముఖ్యమని తరువాత మిత్రులకు తెలిసింది.

నేను అజ్ఞాతవాసంలో విజయవాడ 1 టౌనులో ఒక ఇంటిలో వున్నాను. కొన్ని రోజులు నా గదికి బయట తాళం పెట్టేవాడు నా రక్షణ బాధ్యత స్వీకరించిన మిత్రుడు నటరాజు. ఒకసారి తాళం వేయలేదు. అపుడు నటరాజు అనుమతి లేకుండా జైలు నుండి విడుదల అయి వచ్చిన శ్రీ ప్రకాశ చంద్ర శతపథి నరాసరి నా రహస్య స్థావరానికి వచ్చాడు. ఆయనతో మాట్లాడి వెంటనే బస మర్చాను.

విజయవాడ సత్యనారాయణ పురంలో శ్రీ ఎన్. నారాయణ మూర్తి ఇంట్లో రహస్యంగా వున్నాను. నా కుమార్తె ఎం.బి. అండ్ బి.ఎస్. పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. పై చదువు ఎక్కడ చదివించాలా అనే ప్రశ్న వచ్చింది. నా పత్ని శ్రీమతి సుబ్బమ్మ కూతురును వెంట పెట్టుకొని దివ్వెల పిచ్చయ్యగారి యింటికి వెళ్ళింది. అక్కడ నుండి నన్ను సత్యనారాయణ గారి యింటికి తెచ్చిన యువకుడు వారిని నా వద్దకు తెచ్చాడు. నేను వారిని చూసి ఆశ్చర్యపోయాను. వారు ఎందుకు వచ్చినదీ చెప్పారు. "నాకేమీ ఇపుడు తోచదు. మీ యిష్టం వచ్చినట్లు చేయండి. మీరు ఏది చేసినా నాకు సమ్మతమేనని చెప్పి వెంటనే నా చేతిసంచి తీసుకొని – రెండు జతల బట్టలూ, ఒక టువాలూ, బేబీ టైపు పెట్టె, తెల్ల కాగితాలు, కార్బన్లు మాత్రం దానిలో వుండేవి. బసను మరో చోటికి మార్చాను. ఈ నా ప్రవర్తనను గురించి వారేమి అనుకున్నారో నాకు తెలియదు. వారు చెప్పలేదు. నేను అడగలేదు.

న్యాయవాద కార్యాచరణ సమితి కార్యదర్శి శ్రీ గొట్టిపాటి మురళీ మోహన్‌పై వారంటు వుంది. అతడు అజ్ఞాతవాసంలోకి వెళ్ళాడు. నాకు యీ విషయం తెలిసి అతనిని కలిసి 'నీవు యువకుడవు, నీకు ఉజ్వలమయిన రాజకీయ భవిష్యత్తు ఉంది. నీవు అరెస్టు అవడం నీకు మంచిది' అని నచ్చచెప్పి అతడు బయటికి వచ్చేటట్లు చేశాను. అతనిని డెటెన్యూగా తీసుకొని వెళ్ళారు. మరల ఎమర్జెన్సీలో డెటెన్యూ అయ్యాడు అతడు. 1977లో జనతా పార్టీ తరఫున విజయవాడ నియోజక వర్గం నుండి పోటీ చేశాడు.

రైళ్ళు ఆగిపోయ్యాయి విజయవాడ స్టేషనులో. ప్రతి ఉదయం రైల్వే కార్మిక నాయకుడు మీ వలంటీర్లను పంపండి. మేము వారు వచ్చి నినాదాలు చేసి అడ్డంగా నిలుచొనగానే మేము పనులు మానివేస్తాం, అని ఫోనులో చెప్పేవాడు.

ప్రతిదినం విజయవాడ సమీపంలోని ఎనికెపాడు మహిళలు సుమారు 150 మంది ఉదయానికల్లా విజయవాడ చేరేవారు. వివిధ కేంద్రాలకు వెళ్ళిపోయి పికెటింగ్ ప్రారంభించే వారు., ఇది వారి నిత్యకృత్యం. సాధారణంగా రైల్వే లోకో షెడ్డువద్ద పికెటింగు చేయడం వారి వంతు బాధ్యత. వారు వచ్చి నినాదాలు చేసి అడ్డంగా నిలవంగానే ఇంజను డ్రైవర్లు ఫైర్‌మెన్లు మేము పని చేయలేమని అనే వారు. వారు లేక పోతే ఇంజను కదలదు. ఇంజను లేకపోతే రైలు కదలలేదుకదా! ఒకరోజు ఉదయమే ఒక ఉద్యమ కార్యాలయంలో ఫోను మోగిందట. నేను ఫలాని ఆస్పత్రిలో నర్సును. నా భర్త మెయిలు బండి ఇంజను డ్రైవరు. నేను చెప్తున్నా అతడు వినక డ్యూటీకి పోతానంటున్నాడు. అతనిపేరు ఆల్బర్ట్. మీ వాళ్ళను పంపి నా భర్తను డ్యూటీ చేయకుండా ఎత్తుకొని పొండి అన్నదట ఆ మహిళ. ఆమె తమ ఇంటి చిరునామా ఇచ్చింది. వెంటనే ఇద్దరు స్త్రీలతో పలుగురు పురుషులతో ఒక జీపు ఆ ఇంజను డ్రయివరు ఇంటికి వెళ్ళింది. అతడిని పిలిచింది ఒక మహిళ. అతడు యింటి వెలుపలకు వచ్చాడు. వెన్వెంటనే రెండవ మహిళ (ఆమె కృష్ణా జిల్లాలోని ఒక గ్రామ వాసి) ప్రస్తుతం ఒక అధ్యాపకుని భార్య) అతని చేయి పట్టుకొని జీపులోకి గిరవాటేసింది. మొదటి మహిళ అతనిని జీపులోకి నెట్టింది. జీపు క్షణాలలో వెళ్ళిపోయింది. అతడు అజాను బాహుడు. విశాల వక్షస్కుడు. బలశాలి. అయినా అతడు ఇలా జరుగుతుందని భావించక పోవడంతో పని తేలికగా జరిగిపోయింది. అతనిని జీపులోకి గిరవాటేసిన మహిళ కూడా ఎత్తరి. దృఢకాయురాలే. ఆ మెయిలు డ్రైవర్ అలా వారి నిర్బంధంలో సుమారు 5 రోజులు ఉన్నాడు. అతనికి అన్ని సదుపాయాలను చేశారు. ఎంతో మర్యాదగా చూచారు. అతడు సంతోషించి, మీ ఉద్యమానికి నా సానుభూతి వుంటుంది అని పల్కిన తరువాత అతనిని విడుదల చేశారు. అతడు రైళ్ళు ఆగినంతకాలం పనిలోకి పోలేదు.

మరొక సంఘటన. శ్రీ పెనుపులేటి కోటేశ్వర రావు మా కేంద్ర కార్యాచరణ సమితి సహాయ కార్యదర్శియని ఇంతకు క్రితమే చెప్పాను కదా! ఒకరోజు ఉదయం మిత్రుడు కోటేశ్వర రావు నేను కూర్చుంటున్న కార్యాలయానికి వచ్చాడు. రామ్మూర్తిగారు సోదరుడిని ఉద్యమ కార్యకర్తలు బలవంతాన ఎత్తుకుని పోయారు. ఎక్కడ వున్నదీ తెలియదు. మా వదిన గారు తల్లడిల్లి పోతున్నారు. అతని క్షేమ సమాచారం కనుగొని నాకు చెప్తే చాలు అన్నాడు. నేను కనుక్కుంటాను అని హామీ ఇచ్చాను. మిత్రుడు పట్టాభి అటిడి అన్న వ్యవహారం చూడమని అభ్యర్థించారు. అతడు శ్రమించి విజయవాడలోని సేనలు, పటాలాలు, బ్రిగేడులు, దళాలు వీటిసన్నింటి నాయకులను వాకబుచేసి చివరకు శ్రీ భగవాన్ దాస్ దళంచేత కోటేశ్వర రావు అన్నగారు నిర్బంధింప బడినట్లు తెలుసుకొని అతనిని తాను స్వయంగా చూచివచ్చాడు. ఆయన సుఖంగా క్షేమంగా ఉన్నారని చెప్పాడు. ఆ సమాచారం విని మిత్రుడు కోటేశ్వర రావు సంతుష్టుడయి బాపట్లకు తిరిగి వెళ్ళాడు.

ఉద్యమం బాగా ఉచ్ఛదశలో ఉన్నప్పుడు ఒక బ్రిగేడ్ వారు - కాకాని బ్రిగేడ్ అని నాకు గుర్తు- విజయవాడలో ట్రాఫిక్ పోలీసుల పనిని చేపట్టారు. సర్వసాధారణంగా వాహనాలు రోడ్డుకు ఎడమవైపున పోవాలి. పోలీసుల నిబంధనలు అవి. ఇది ప్రజారాజ్యం

కనుక వాహనాలు రోడ్డులో కుడివైపున పోవాలని బ్రిగేడ్ వారు శాసించారు. వాళ్లు వీధుల కూడలిలో నిలుచొని, ‘ట్రాఫిక్ కానిస్టేబుల వలే రవాణా వాహనాలు పోకడను క్రమబద్ధం చేయసాగారు. తమాషా ఏమంటే మిలిటరీ వాహనాలు కూడా (సైన్యం నగరంలోకి వచ్చింది కదా!) ఆ బ్రిగేడ్ ఆ ఉత్తరువులను పాటించారు. అలా సాగింది ఉద్యమం.

**1969** డిసెంబరులో ఢిల్లీలో రాడికల్ హ్యూమనిస్టు మహాసభకు వెళ్ళి వచ్చినప్పటి నుండి హ్యూమనిస్టు ఉద్యమంలో నా పాత్రకు ఒక విశిష్టత సంతరించింది. ఆ ఉద్యమానికి ఆంధ్రప్రదేశ్‌లో స్థానం కల్పించడం నా బాధ్యతగా భావించాను. ఒకసారి విజయవాడలో పెద్ద బహిరంగ సభను ఏర్పాటు చేస్తున్నారు. ఆంధ్ర నాయకులందరికీ వారి పేర్లకు ఎదురుగా ప్రజా పార్టీ స్వతంత్ర పార్టీ సోషలిస్టు పార్టీ అని యిలా బ్రాకెట్లలో వేయితలవడం గమనించాను. మీ పేరకు ఎదురుగా 'ఏమి రాయమంటారు?' అన్న నన్ను అడిగితే 'రాడికల్ హ్యూమనిస్టు' అని అచ్చువేయమన్నాను. అలాగే అన్ని పోస్టర్లలోనూ చోటు చేసుకుంది. 'రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం నా ఉద్యమం అని భావించి అలా చేశానో లేక అలా పిలిపించు కోవటం నాకు గౌరవప్రదం అని ఎంచి ఇలా చెప్పానో' తెలియదు. ఆనాడు అంతగా తర్కించి, వితర్కించి నిర్ణయం చేయలేదని భావిస్తాను. కొన్ని భావాలు వ్యక్తి అంతః ప్రవృత్తిలోకి జొరబడి పోతాయి. అవి ఆ వ్యక్తిని విలక్షణంగా మారుస్తాయని అనుకుంటాను. అంతేకాదు అవి ఆ వ్యక్తికి విశిష్టతను చేకూరుస్తాయని నా విశ్వాసం.

హ్యూమనిస్టు ఉద్యమం ప్రజాస్వామ్య ఉద్యమం, పార్టీల అవలక్షణాలు లేని ఉద్యమం అని నా ఆలోచన కనుక ఏ సభకు నేను వెళ్లినా, ఏ మహాసభలో పాల్గొన్నా అలాంటి అవకాశం లభించని స్థానిక మిత్రులకు అక్కడి సంగతులు తెలియజేయటం నా విధియని అనుకునేవాడిని. అంతేకాదు. మరియొక విషయాన్ని గురించి కూడా ముచ్చటించవలసి యున్నది. హ్యూమనిస్టు ఉద్యమం బహిరంగ ఉద్యమం. దీనికి పార్టీల వారికున్నట్లు రహస్యాలు ఉండవని, ఉండరాదని నా తలంపు. అందువల్ల నేను వెళ్ళివచ్చిన సభల, మహాసభల విశేషాలు చీరాల, తెనాలి, విజయవాడ మిత్రులకు ఆయా ప్రాంతాలకు వెళ్లి స్థానిక మిత్రులకు తెలియజెప్పేవాడిని.

**1972** ఫిబ్రవరిలో హైదరాబాదులో అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు మహాసభను సమావేశ పరచాలని వారు సంతోషంగా నిర్ణయించారు. ఆ వార్తను నేను ఆంధ్రప్రదేశ్ రాడికల్ హ్యూమనిస్టు మిత్రులకు అందచేశాను. వారు సంతోషంగా కార్య భారం వహించటానికి అంగీకరించారు. అయితే, మిత్రులు ఎన్. ఇన్నయ్య, పోతీ సత్యనారాయణ తప్ప హైదరాబాదులో రాడికల్ హ్యూమనిస్టులు ప్రసిద్ధులుగా లేరు. ఇన్నయ్య సత్యనారాయణలు హైదరాబాద్‌లో 'ప్రసారిత' అనే త్రైమాసిక పత్రికను నడుపుతున్నారు. అనేక అధ్యయన తరగతులను నిర్వహిస్తున్నారు. హాలు మీటింగులను జరుపుకున్నారు. విద్యావంతులలో, జిజ్ఞాసాపరులలో వారి పేర్లు సుపరిచితంగా వుండేవి. బందరు నివాసి ఉపాధ్యాయ ప్రతినిధి శ్రీ కొల్లూరి కోటేశ్వర రావుకి (ఎంఎల్‌సి) కేటాయించబడిన న్యూ ఎంఎల్‌ఏ క్వార్టర్సులోని వాటాలో ఇన్నయ్య నివసిస్తుండే వాడు. తద్వారా అతనికి అనేక పరిచయాలు వుండేవి. హైదరాబాదు మహాసభను నిర్వహించే బాధ్యతను ప్రధానంగా అతనిపై వుంచాలని కోస్తా ప్రాంత మిత్రులం నిశ్చయించాం. అందరం చందాలు వేసుకొని సుమారు వెయ్యి రూపాయలు పోగుచేశాం. మిత్రులు గుడిపాటి సీతారామయ్య, గోరంట్ల రాఘవయ్య, కొల్లా సుబ్బారావు (ఎం.ఎ) భారీగా విరాళాలిచ్చారు. ఆ పైకం ఇన్నయ్యకు యిచ్చి మహాసభను జరపమని

అభ్యర్థిద్దామని హైదరాబాదు వచ్చాను.

అప్పటికి నార్లవారు (నార్ల వెంకటేశ్వర రావుగారు) హైదరాబాదులో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. వారు ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకులని, ఆవుల గోపాల కృష్ణమూర్తి యెడ అభిమానం కల వ్యక్తియని ఇంతకు ముందే చెప్పాను కదా! పైగా వారు ఆవుల గోపాల కృష్ణమూర్తి సంస్మరణ సమితికి అధ్యక్షులు. అలా వారితో నాకు పరిచయం ఏర్పడింది. వారిని కలిసి హ్యూమనిష్టు మహాసభకు ప్రారంభోపన్యాసం చేయమని కోరదామని ఇన్నయ్యతో ప్రతిపాదన చేశాను. ఇన్నయ్యకు నా సూచన మనస్కరించ లేదు. రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ రోజుల్లో నార్లవారు రాడికల్ డెమోక్రాట్ల పట్ల ప్రదర్శించిన వైఖరియే దానికి కారణం. ఎం.ఎన్. రాయ్ అనుచరులుగా, సహచరులుగా ఆనాటి రాడికల్ పార్టీవారు యుద్ధ యత్నాలకు సహాయం చేయాలని తీర్మానించాము కదా! నార్లవారు పక్కా జాతీయవాది; కాంగ్రెస్‌వాది. స్వార్థబుద్ధితో యుద్ధ యత్నాలను బలపరిచే వారికంటే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, పైగా మార్క్సిస్టు దృక్పథంతో సమర్థించే ఎం.ఎన్. రాయ్‌వారికి దుర్మార్గుడుగా తోచింది. 1940 నుండి 1943 వరకు 'రాడికల్ డెమోక్రట్' అనే పదం తన పత్రికలో కన్పడరాదని ఆయన కట్టడిచేశారు. పార్టీ కార్యక్రమాలు ఎన్ని జరిగినా, పార్టీవారు ఎన్ని సభలు నిర్వహించినా ఒక్క ముక్క కూడా నార్లవారు సంపాదకులుగా వున్న దిన పత్రికలో ప్రకటితమయ్యేది కాదు. ఈ సంగతులు ఇన్నయ్యకు బాగా తెలుసు. అతనికి ఆనాడు ఆవుల గోపాల కృష్ణమూర్తి గురుతుల్యుడు. నార్లవారి అసహన వైఖరిని అతడు మరిచిపోలేడు. 'నేను నార్లవారి దగ్గరకు రాను' అని భీష్మించుకొని కూర్చున్నాడు. నార్లవారు మారారని, ఆయన విశాల దృక్పథం అలవర్చుకున్నాడని ఇన్నయ్యకు నచ్చజెప్పి తీసుకొని వెళ్లి పరిచయం చేశాను. మహాసభలో ప్రారంభోపన్యాసం చెయ్యటానికి నార్లవారు అంగీకరించారు. సంతృప్తితో, సంతోషంతో తిరిగి వచ్చాం. అప్పటి నుండి వారి మధ్య రాకపోకలు, గోష్ఠులు, సంప్రతింపులు ఎక్కువ అయినాయి. వారానికి ఒకసారి అన్నా కలవకపోతే ఏదో వెలితిగా వుండే స్థితి వచ్చింది.

# అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు మహాసభ (1972)—

మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షునిగా డా. సి. లక్ష్మన్నను ఎంపిక చేశాడు ఇన్నయ్య. ఇప్పటికి ఉస్మానియా విశ్వ విద్యాలయంలో సామాజిక శాస్త్ర విభాగంలో ఆయన రీడరని జ్ఞాపకం (తరువాత ఆయన ప్రొఫెసరు అయ్యారు. ఆ పైన 'తెలుగుదేశం' సభ్యులుగా రాజ్యసభ సభ్యులుగా వుండి యిటీవల వరకు వెస్టిండీస్‌లో భారత రాయబారిగా వుండి హైదరాబాదువచ్చారు) నార్లవారు మహాసభ ప్రారంభకులు. ఎం.ఎన్. రాయ్ సహచరులలో ముఖ్యుడు, కార్మిక నాయకుడు బొంబాయి నగర వాసి శ్రీ వి.బి. కర్లిక్ మహాసభకు అధ్యక్షులు. న్యూ ఎంఎల్ఎ క్వార్టర్సు హాస్టలులోని మూడవ అంతస్తులోని హాలు సమావేశ స్థలం. ఎంఎల్ఎలకు మామూలుగా కేటాయించే గదులు ప్రతినిధులకు బసలు. ఇదంతా ఇన్నయ్య పలుకుబడి వల్ల జరిగిందే. హాస్టలులోని హోటలులో భోజనం. అన్ని వసతులు ఒక చోట ఉండటంతో ప్రతినిధులకు సౌకర్యాలు అమిరాయి.

మహాసభలోని ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం, నార్లవారి ప్రారంభోపన్యాసం, మహాసభ అధ్యక్షోపన్యాసం అన్ని దిన పత్రికలలో ప్రముఖంగా ప్రచురితమయినయి. ఆంగ్ల దినపత్రికలు వీటికి ఒక పుటలో సగం స్థానం కేటాయించాయి. నార్లవారి పేరు ప్రతిష్టలు, నూతనోద్యమం యెడల పత్రికలవారికుండే ఆసక్తి ఇన్నయ్యకు దిన పత్రికల వారితో వుండే సన్నిహిత సంబంధం వీటిలో ఏది ఎక్కువగా పనిచేసిందో నేను చెప్పలేను. అన్ని కాస్త కాస్త ఉపకరించి అన్నీ కలిసి ప్రాముఖ్యతను చేకూర్చాయని ఊహించటం పొరపాటు కాదేమో!

బొంబాయి, ఢిల్లీ, కలకత్తా లాంటి మహానగరాలలో మహాసభలు జరిపితే వాటిని గురించిన వార్త ప్రముఖ దిన పత్రికలలో కాస్త పడితే ఎంతిగానో గొప్పగా భావించే రోజుల్లో, భారతదేశ రాష్ట్ర ముఖ్య పట్టణాలలో అందులోనూ ఇటీవలనే ప్రాచుర్యంలోకి వచ్చిన హైదరాబాదులో యింత ప్రచారం రావడం సంతోషకరమయిన సంగతి. ఆం.ప్ర.లో పలు ప్రాంతాల నుండి సుమారు 70 మంది దాకా హ్యూమనిస్టులు మహాసభకు ప్రతినిధులుగా వచ్చారు. ఆం.ప్ర.కు ఆనుకొనియున్న మహారాష్ట్ర ప్రాంతం నుండి కూడా ప్రతినిధులు ఎక్కువ సంఖ్యలో వచ్చారు. చర్చలు ఆసక్తికరంగా ఫలప్రదంగా జరిగాయి.

మహాసభ విశేషాలను గురించి ప్రస్తావించేటప్పుడు రెండు ముఖ్య విషయాలను ఉటంకించటం అవసరం. ఒకటి, ఎం.ఎన్. రాయ్ నివాసమున్న డెహ్రాడూన్‌లోని 13, మోహిని రోడ్డు భవనాన్ని గురించినది. ఈ ఇంటిని ఎం.ఎన్. రాయ్ నివసించే నిమిత్తం కొనుగోలు చేశారని, దానిని 1946లో స్థాపించబడిన భారత జ్ఞాన పునర్వికాస సంస్థ (ఇండియన్ రినైజాన్సు ఇన్‌స్టిట్యూట్ పేర రిజిష్టరు చేయించారని తెలిసికొనడం యుక్తం. తన పేరే ఆస్తి వుండటానికి ఎం.ఎన్. రాయ్ అంగీకరించ లేదు. అతనికి వున్న ఒకే ఒక ఆస్తి అతని మేధస్సు. రాయ్ 1954లో చనిపోతే, అతని భార్య ఎలెన్ రాయ్ 1960లో హత్య చేయబడిందని పూర్వమే తెలుసుకున్నాం కదా!

ఆ భవనాన్ని ఆ సంస్థను ఎలా వినియోగించాలాయని హ్యూమనిస్టులు తర్జనభర్జన చేసి, దాన్ని మరమ్మత్తులు చేయించి, దానికి బాధ్యుడుగా రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ ఉత్తరప్రదేశ్ రాష్ట్ర కార్యదర్శులలో ఒకడయిన ఎం.ఎన్. పూరిని అంగీకరింప చేశారు. అతడు ఆ భవన వినియోగాన్ని గురించి క్రొత్త ప్రతిపాదనలు చేశాడు. దానికి 'హ్యూమనిష్టు భవనం' (హ్యూమనిష్టు హౌసు) అని నామకరణం చేయాలని, పేరుకు తగ్గట్లుగా దేశ, విదేశ హ్యూమనిష్టులు అక్కడ వుండి పరిశోధన చేయటానికి అనువుగా దానిని నిర్వహించాలని పూరీ ప్రతిపాదన. ఆనాడు పూరీ చిత్తశుద్ధి కల కామ్రేడ్. రాడికల్ పార్టీ కోసం విశేషంగా శ్రమించినవాడు. 'ఎం.ఎన్. రాయ్ యెడల భక్తి ప్రపత్తులు, ప్రేమాభిమానాలు కల కార్యకర్త. తదితరులు ఎవరూ వెళ్ళి డెహ్రాడూన్‌లో నివాసం ఏర్పరుచు కోవటానికి ఆ భవనంలో కాపురముండి దాన్ని కాపాడడానికి ఉద్యుక్తులు కాని తరుణంలో ఆ బాధ్యతను స్వీకరించటానికి ముందుకు వచ్చిన మిత్రుడు. సహజంగా అతని ప్రతిపాదనకు విలువ యిచ్చారు తదితర మిత్రులు. 1969 నుండి రాడికల్ హ్యూమనిష్టు ఉద్యమ బాధ్యతను పూర్తిగా నెత్తిన వేసుకున్న శ్రీ వి.ఎం. తార్కుండేకు పూరి ఆలోచన వెంటనే నచ్చింది. తతిమ్మా ప్రముఖ హ్యూమనిష్టులు బొంబాయి, కలకత్తాలలో వున్నారు. డెహ్రాడూన్‌ను ఢిల్లీకి దగ్గరగా వుండటం, తార్కుండే భారత రినైజాన్సు సంస్థకు శాశ్వత ధర్మకర్తలలో ఒకడు కావటం వల్ల ముఖ్య బాధ్యత తార్కుండేది అయింది. తార్కుండే ఆమోదం పొందిన పూరి తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది. దానిని గురించి లోతుగా, తీవ్రంగా ఆలోచించలేదేమో అని తోస్తుంది. ఉద్యమాలలో బాధ్యతను ఒకరు తీసుకుంటుంటే తతిమ్మావారు పట్టించుకోక పోవటం సహజమే! ఆనాటికి ఉద్యమంలోని తదితర మిత్రులలో సమాన స్థాయిలో చర్చించే స్థితి నాకు లేదు. అదీగాక మహాసభ ఆహ్వాన సంఘ ఏర్పాట్లలో మునిగి వుండేది. ఈ తీర్మానం యిప్పటికే ఆ సంస్థ వ్యవహారాలలో కీలక పాత్ర వహిస్తున్నది.

రెండవ అంశం సంఘ కార్య నిర్వాహక వర్గంలో శ్రీ ఇన్నయ్యకు సభ్యత్వం యివ్వటం. ఆహ్వాన సంఘ కార్యదర్శి అయిన ఇన్నయ్యకు ఆ స్థానం యివ్వాలని నేను సూచించాను. నా సూచనను మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. తెలుగువారు ఉద్యమంలో సంఘంలో సముచిత స్థానం పొందాలనేది నా ఆకాంక్ష. 1980 జయపూర్ మహాసభలో ఆరుగురు తెలుగువారికి కార్యనిర్వాహక వర్గంలో స్థానం కల్పించ గలగడం నన్ను నేను అభినందించు కొనబడిన సన్నివేశం.

# కుటుంబ జీవితం

**1973** మే నాటికి నా నివాసాన్ని చీరాల నుండి విజయవాడకు మార్చాను. 1942 ఏప్రిల్ నుండి 1947 ఆగష్టు వరకు పేరుకు మాత్రం ప్లీడరుగా వున్నానని, నిజానికి రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ పనులకు పూర్తిగా కాలాన్ని వినియోగించానని ఇంతకు ముందే చెప్పాను కదా! 1947 నుండి 1972 వరకు ఎక్కువ కాలాన్ని జీవనోపాధిని సంపాదించే నిమిత్తం ప్లీడరీ చేశానని యీ పాటికి చదువరులు గ్రహించే వుంటారు. ఇద్దరు పిల్లలతో కుటుంబాన్ని పరిమితం చేసుకుందామనుకున్న నేను 5గురు పిల్లల తండ్రినయినాను. పెద్ద పిల్లవాడు 1938లో పుట్టి 1940లో చనిపోయాడు. ఆ విషయాన్ని తలుచుకుంటే నా అజ్ఞానం, నా అసమర్థత అన్నీ స్ఫురణకు వస్తాయి. 20 సంవత్సరాల వయస్సులో తండ్రినవటం యీ కాలపువారికి ఆశ్చర్యం కల్గిస్తుంది. నిజానికి భారతదేశంలో జ్ఞానం, శిక్షణ లేనిది వైవాహిక జీవితానికే. నా ప్రథమ సంతానం మగపిల్లవాడు కావటంతో, నాకు నా తండ్రిపై ఉన్న గౌరవంతో ఆ పిల్లవాడికి పేరు పెట్టే హక్కు, బాధ్యతను నా తండ్రిగారికి యిచ్చాను. ఆయన తన తండ్రిగారిని స్మరించుకొని (నా తండ్రి తండ్రిగారి పేరు పున్నయ్య) తిరుపతి వేంకటేశ్వర స్వామిని గుర్తుంచుకొని పిల్లవాడికి 'వేంకట సత్యపూర్ణానందం' అని నామకరణం చేశారు. పిల్లవాడు ఆరోగ్యంగా పుట్టి ఏపుగా పెరిగాడు. అతనికి 'లివరు' వ్యాధివచ్చింది. ఆయుర్వేద వైద్యం చేయిస్తున్నారు నా తండ్రిగారు. జబ్బు చాలావరకు తగ్గుముఖం పట్టింది. ఇంటిల్లిపాది సంతోషించాము. ఇంతలో పిల్లవాడికి జ్వరం వచ్చింది. ఆయుర్వేద వైద్యుడు వచ్చి చూచి 'శ్లేష్మం' అన్నాడు. వ్యాధి తగ్గలేదు. అల్లోపతి వైద్యుని పిలిపించారు నాన్నగారు. ఆయన వచ్చి పరీక్షచేసి వ్యాధి తీవ్రమయినదని, దాని పేరు 'డిప్తీరియా' అని చెప్పి [illegible] ఇంటర్నేషనల్ యూనిట్లు మందు యివ్వాలని, లేకపోతే కంఠానికి శస్త్ర చికిత్స చేసి రంధ్రం చేసి గొట్టం పెట్టకపోతే శ్వాస ఆడదని, మామూలుగా శ్వాస వచ్చే గొట్టానికి పొర అడ్డు పడిందని చెప్పారు. అపుడు మేము ఉంటున్న తెనాలి పట్టణంలో ఆ మందు 17500 యూనిట్లు మాత్రమే దొరికింది. ఆ మందును ఇంజెక్షను ద్వారా పిల్లవాని దేహంలోకి యిచ్చిన డాక్టరుగారు రాత్రి 11 గంటలకు పిల్లవానిని గుంటూరు తరలించమన్నారు. వ్యాధి విషయం, తను చేసిన వైద్యం సంగతి వివరంగా రాసి ఉత్తరం యిచ్చారు. గుంటూరు పెద్ద ఆస్పత్రిలోని వైద్యునికి చూపమన్నారు. రాత్రికి రాత్రి గుంటూరు వెళ్ళి ఆస్పత్రిలో చేర్చాము. ఆ రాత్రికి ఏదో మందు యిచ్చారు. మరునాడు ఉదయం 10 గంటలయినా పెద్ద డాక్టరు రాలేదు. విచారిస్తే ఆ వార్డు డాక్టరుగారు ఆస్పత్రిలో రెండవ హోదాలో వున్నవారని (ఎడిఎంవో) అని తెలిసింది. ఆయన కొరకు మా నాన్నగారు వెళ్ళారు. ఆయన తన ఆఫీసు ముందు కారు బాగు చేసుకుంటున్నారు. మా నాన్నగారు పరిచయం చేసుకున్నారు. తన మనుమని స్థితి తెలియజేశారు. పిల్లవానిని రక్షించమని అభ్యర్థించారు. 'వస్తున్నాను కదా' అన్నారు ఆ డాక్టరు. అరగంట అయిన తరువాత మరల డాక్టరుగారిని పలుకరించారు మా నాన్నగారు. ఆయన ఛీదరించు కొంటారేమో అని సందేహించి తన మాటలలో కలిపి తను తెనాలిలో తాహశీలుదారునని చెప్పారు.

డాక్టరు చిరునవ్వు నవ్వి పది నిమిషాలలో వస్తానని చెప్పాడు. కాని కదలలేదు. కారు బాగు చేయించు కోవటంలో నిమగ్నమయ్యాడు. మా నాన్నగారికి డాక్టరుపై అనుమానం కల్గింది. అతడు డబ్బు మనిషేమోనని భావించి తన వెంబడి వచ్చిన గుమస్తా ద్వారా 'పిల్లవాని తాత మిమ్మల్ని ఘనంగా సత్కారించగలడు' అని చెప్పించారు. ఆ మాట విన్న తర్వాత కూడా డాక్టరు స్పందించలేదు. అరగంట తర్వాత తీరికగా బయలుదేరి ఆస్పత్రి వార్డుకు వచ్చాడు. పిల్లవానిని చూచాడు. తెనాలి డాక్టరు గారిచ్చిన ఉత్తరాన్ని చదివాడు. గుండెజబ్బని, డిఫ్తీరియా కాదని తేల్చాడు. 'ఎందుకయినా మంచిది 5వేల యూనిట్ల మందు ఇవ్వండి' అని చిన్న డాక్టరుని ఆదేశించాడు. అలాగే మందిచ్చారు. మధ్యాహ్నానికి పిల్లవానికి కళ వచ్చింది. నేను పిల్లవాడి దగ్గర వుంటానని నా తల్లిని, భార్యను, తండ్రిని మా నాన్నగారి స్నేహితుని ఇంటికి పంపాను. ఒక్కడిని రోగి వద్ద కనిపెట్టుకొని ఉన్నాను. సాయంత్రం నాలుగు గంటలయింది. నర్సు వచ్చి చూచి పిల్లవాని స్థితి క్షీణిస్తుందని చెప్పింది. పిచ్చిగా పెద్ద డాక్టరు కోసం పరుగెత్తాను. ఆయన దొరకలేదు. ఇతర వైద్యులు తమ బాధ్యత కాదని రాలేదు. ఆ వార్డులో వున్న చిన్న వైద్యునికి సరియైన వైద్యం చెయ్యగల శక్తి, సామర్థ్యం, తెలివితేటలు లేవు. పిల్లవాడు కన్నుమూశాడు. నేను మొదటిసారిగా జీవిత పోరాటంలో ఓడిపోయాను. పిల్లవాడిని రక్షించుకోలేక పోయాను. ఇప్పుడు యిదంతా తలుచుకుంటే నా అజ్ఞానం మీద, అశక్తత మీద నాకే అసహ్యం వేస్తుంది. వైద్యులు 'దేవుళ్ళు' కాకపోవచ్చు; నిపుణులు కాకపోవచ్చు. కాని మనుషులుగా ప్రవర్తించాలి కదా! వృత్తిలో నిర్లక్ష్యం, అలసత్వం పనికిరాదు కదా! ఈనాడయితే, కనీసం 1947 నాటికయితే అలాంటి డాక్టరును వీధిలో కాలరు పట్టుకొని నిలేసి నలుగురు ముందూ తన్నేవాడినని అనిపిస్తుంది. ఆనాడు 1940లో, అలా చేయలేకపోయాను. అదే నాకు యీనాటికీ బాధ, వ్యధ.

పోయిన పిల్లవాని తర్వాత ఇద్దరు మగపిల్లలు పుట్టారు. పెద్దవానికి పేరు పెట్టే హక్కును నేను స్వంతం చేసుకున్నాను. నా మేనమామ (నా తల్లికి తోడబుట్టిన వారు పన్నెండుగురు దాకా వున్నా నా తల్లి, ఆయన మాత్రమే బ్రతికారు) యడవల్లి కామేశ్వరరావు గారిని తలుచుకొని ఆ పేరు పిల్లవానికి పెట్టాను. ఏంతయినా పితృస్వామ్య సమాజం కదా! నా తల్లి పెద్దదయినా ఎంత గొప్పదయినా మంచిదయినా స్త్రీయే! నా భార్య సరేసరి. ఆమెకు రెండు అనర్హతలు. ఒకటి ఆమె స్త్రీ. రెండవది ఆమె అప్పటికి (1940 మార్చి) 16 సంవత్సరాలు నిండని వయస్సుది.

ఇక నా రెండవ పిల్లవాని ముచ్చట. వాడు గుంటూరులో 1943 మేలో జన్మించాడు. ఆరోగ్యవంతుడయిన శిశువు. ఈసారి పేరు పెట్టే వంతు మా అమ్మది. మా అమ్మ సనాతన భావాలు కల వ్యక్తి సంప్రదాయవాది. భగవద్భక్తి ఆమె లక్షణం.. పిల్లవాడు 'రోహిణి' నక్షత్రాన పుట్టాడు కనుక పిల్లవానికి 'గోపాల కృష్ణమూర్తి' అని పేరు పెట్టమంది. అలాగే నామకరణం చేశాను. పిల్లవాడు ఆరు నెలలు బాగా పెరిగాడు. 'లివరు వ్యాధి వచ్చింది. ఇంగ్లీషు వైద్యం చేయించాం. మందు పనిచేయటం లేదు. బాలల వైద్య నిపుణుడు డాక్టర్ ప్రభు విశాఖపట్టణంలో వున్నాడని, అతనికి పిల్లవానిని చూపించమని కుటుంబ స్నేహితులు సలహా చెప్పారు. భార్యాభర్తలం పిల్లవానిని తీసుకొని రైలెక్కాం. అప్పటికి నా వయస్సు 25 సంవత్సరములు. నా భార్యకు 19 సంవత్సరాలు. పిల్లవాని దేహం బాగా కృశించి వుంది. రైలు పెట్టెలో మమ్మల్ని, పిల్లవానిని చూసి అందరూ విస్తుపోయారు. జాలిపడ్డారు. 'త్రోవలో ఏమన్నా జరుగరానిది జరిగితే మీరేం చేయగలరు?' అని సానుభూతిగా మాట్లాడారు. మాకు వారి మాటలు వినిపించడం లేదు. ఒకటే ధ్యాస. 'ఎప్పుడు విశాఖపట్టణం వెళ్తాము, ఎప్పుడు పెద్ద డాక్టరుగారికి చూపిద్దాము' అనేదే ఆలోచన. విశాఖపట్నం చేరాము. పిల్లవానిని డాక్టరుగారికి చూపించాం. ఆయన 5 మందులు రాసిచ్చాడు. ఏ పరిస్థితిలో ఏ మందు ఎలా వాడాలో స్పష్టంగా చెప్పారు. చివరగా ఒక మాటన్నాడు. 'ఈ మందులు పెట్టెకు తాళం చెవి లాంటివి. తాళం చెవి పట్టకపోతే దానిని విసిరి పారవెయ్యండి. డా. ప్రభు యిచ్చాడు కదా అని ఆ మందులే వాడుతూ, ప్రయత్నిస్తూ భంగపడకండి.' ఈ సందేశంతో తిరిగి గుంటూరు వచ్చి, మా కుటుంబ వైద్యునికి మందుల చీటీ చూపించి, వైద్యుడు చెప్పిన మాటలు చెప్పాను. అలాగే చెయ్యమన్నాడు ఆయన. మందులు అలా 3 నెలలు వాడాం. పిల్లవాని ఆరోగ్యంలో అభివృద్ధి లేదు. కుటుంబ వైద్యుని సంప్రదించాను. అపుడు ద్వితీయ ప్రపంచ యుద్ధం సాగుతున్నది. చర్చిల్ బ్రిటిష్ ప్రధానిగా వున్నాడు. హిట్లరులో యుద్ధంలో ఆయనది ప్రధాన పాత్ర. ఉపన్యాసాలలో దిట్ట. ఆయన ప్రసంగం ఆరోజే పత్రికలలో వచ్చింది. హిట్లరును ఉద్దేశించి 'ఇది అంతానికి ప్రారంభం' (దిస్ ఈజ్ ది బిగినింగ్ ఆఫ్‌ది ఎండ్) అని అన్నాడు. హిట్లరు పతనానికి యిది ప్రారంభమని చర్చిల్ ఉద్దేశం. నా కుటుంబ వైద్యుడు ఆ రోజు పత్రికలో చర్చిల్ ఉపన్యాసాన్ని చదివాడేమో నా పిల్లవానిని పరీక్షించి

'ఇది అంతానికి ప్రారంభం' అన్న చర్చిల్ పద సముదాయాన్ని వాడాడు. నా మనస్సుకు కష్టం వేసింది. నా కుటుంబ వైద్యుడు సహృదయుడే! మంచివాడే! సానుభూతిపరుడే! మానవత్వం ఉన్న వ్యక్తే! అలాంటి వాని నోట యీ మాట! విభ్రాంతికి లోనయ్యాను. మంచివాళ్లు కూడా అనాలోచితంగా అసందర్భంగా మాట్లాడగలరని యిప్పుడు నాకు, అనుభవం మీద, తోస్తున్నది.

నేను అయిష్టంగా ప్లీడరీ చెయ్యటం, అలా చేయవలసి వచ్చినా వృత్తిలో నైతిక ప్రమాణాలను పాటించటం, పెద్దగా సంపాదించలేక పోయినా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనడం, వృత్తి నుండి విశ్రాంతిని కల్పించుకొని ప్రజా సంక్షేమ కార్యక్రమాలు చేయడానికి కృషిచేయడం శ్రద్ధగా 1958 నుండి గమనించిన నా పత్ని సుబ్బమ్మకు - 13 సంవత్సరాలు నిండక ముందే 1937లో కాపురానికి వచ్చిన ఆమె 1958వరకు భార్య మాత్రమే. తరువాత నా సహచరి, కామ్రేడ్ - నాపై జాలి వేసిందేమో నన్ను ప్లీడరీ మానివేయమన్నది. 'ఇంతకాలం మీ ఆకాంక్షలను, కోర్కెలను, ఆదర్శాలను తను పట్టించు కోలేదని - యిప్పుడు తను ప్రజా జీవితంలో ప్రవేశించిన తరువాత తెలిసి వచ్చిందని- యిక కుటుంబం కోసం మీరు త్యాగం చెయ్యనవసరం లేదని, మీ యిష్టవచ్చిన కార్యక్రమాలకు మీ పూర్తి కాలాన్ని తృప్తిగా వినియోగించు కోవచ్చునని' ఆమె చెప్పింది. ఆమె మానసికంగా ఎదిగింది. కాని అలవాటువల్లనో, భయంవల్లనో నేను ఆమె సలహాను స్వీకరించే స్థితిలో లేను. నా నాలుగో సంతానం అమ్మాయి విజయలక్ష్మి వృత్తిలో ఇంకా స్థిరపడలేదని, యింకొక 2 సంవత్సరాలు వ్యవధి యిమ్మని అభ్యర్థించాను. కాదు కూడదన్నది ఆమె. చేయదలచుకున్న మంచి పనిని వెంటనే చేయమని పెద్దలు హితవు చెప్పారని జ్ఞప్తిచేసింది. సరే 55 సంవత్సరములు నిండగానే మానివేస్తానని ఆమెకు మాట యిచ్చాను. (ఆ రోజుల్లో ప్రభుత్వోద్యోగులు 55 సంవత్సరాలు నిండగానే పదవీ విరమణ చేయవలసి వచ్చేది). విధిలేక 3 కేసులు మాత్రం అట్టిపెట్టుకొని ప్లీడరీ మానివేసాను తే. 12-8-1973దిన.

# సమీక్ష

ఈనాడు నా వయస్సు 76 సంవత్సరాలు. నా జీవిత కాలాన్ని, నా జీవిత చరిత్రను యిప్పటి వరకూ సమీక్షిస్తుంటే వాటిని కొన్ని దశలుగా – సౌకర్యం కోసం – విభజించి పరిశీలించవచ్చుని తోస్తుంది. 1942 ఆగస్టులో రాడికల్ డెమొక్రాటిక్ పార్టీలో చేరేవరకు ఒకటి, 1942–47 రెండవది, 1947 నుండి 1972 మూడవది, 1973–1976 నాల్గవది, 1977–1986 అయిదవది, 1986 – ఈనాటి వరకు ఆరవది. అలా 6 దశలు గోచరిస్తాయి. ఇవి కేవలం కాలమానాన్ని పట్టి చేయబడినవి కావు. నా జీవితంలోకి ప్రవేశించిన ఉద్యమాల దృష్ట్యా – కాకపోతే నేను పాల్గొన్న ఉద్యమాలను లెక్కలోకి తీసుకొని – చేయబడిన వర్గీకరణయని భావించినా తప్పులేదు. దేశంలో శ్రీమతి ఇందిరాగాంధీ భారత ప్రధానిగా 1975లో విధించిన అత్యయిక పరిస్థితి (ఎమర్జెన్సీ) నా జీవితాన్ని మరింతగా మార్చింది. ప్రత్యేక ఆంధ్రోద్యమం నా కార్యక్రమాల కేంద్రాన్ని నివాసాన్ని విజయవాడకు తరలింపజేస్తే ఎమర్జెన్సీ ఫలితంగా ఆవిర్భవించిన పౌరహక్కుల ఉద్యమం వాటిని హైదరాబాదుకు తెచ్చింది. నన్ను అఖిల భారత స్థాయిలో నిలబెట్టింది.

ఇంతవరకు నా జ్ఞాపకాలను, ఇంచుమించుగా కాలమాన ప్రకారమే వెలువరించాను. అదే పద్ధతిని ఎమర్జెన్సీ చివర వరకు కొనసాగించటం మంచిదని అభిప్రాయ పడుతున్నాను. ఆ తరువాతి నా జీవిత గాథను ఉద్యమాల పరంగా విశదీకరించటం, వివరించటం సమంజసమేనని తోస్తున్నది.

1973 ఏప్రిల్ తర్వాత ప్రత్యేక ఆంధ్రోద్యమం 'జై ఆంధ్ర' ఉద్యమంగా మారటంతో ఉద్యమ తీవ్రత తగ్గింది. మరో మాటలో చెప్పాలంటే తీవ్రత తగ్గినందు వలనే అది 'జై ఆంధ్ర' ఉద్యమంగా పరిణామం చెందింది. నా దృష్టిని యితర ఉద్యమాల వైపు మళ్ళించడానికి అవకాశం కల్గింది. సహజంగా నా ఆసక్తి మాతృ ఉద్యమమయిన రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం వైపు మళ్లింది.

1973లో విజయవాడలో దక్షిణప్రాంత రాడికల్ హ్యూమనిస్టు మహాసభను సమావేశపరిచాను. ఒక రకంగా చూస్తే అది విఫలమయింది. ఇతర రాష్ట్రాల హ్యూమనిస్టులు ప్రతినిధులుగా రాలేదు. మహాసభకు తగినంత వ్యవధిని యివ్వలేదేమో! పొరపాటు నాదే. ఇంకొక దృష్టితో చూస్తే మహాసభ జయప్రద మయినట్లే. 34 మంది మాత్రమే ప్రతినిధులు వచ్చినా, వారంతా తెలుగువారే అయినా దిన పత్రికలలో ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి – మహాసభ విశేషాలకు ప్రాచుర్యం లభించింది. పై చెప్పిన పత్రికలన్నీ రెండు కాలాల శీర్షికలలో వార్తలను ప్రచురించారు. హ్యూమనిస్టు ఉద్యమం ప్రజల దృష్టికి వచ్చింది. దాని ఆలోచనాధార చదువరులకు పరిచయం చేయబడింది. దీనికి కారణం ఉద్యమ పటిష్టత అనుకోను. నా వ్యక్తిగత ప్రతిష్ఠ అని నేను చెప్తే పొరపాటు అంచనా కాదు. ప్రత్యేక ఆంధ్రోద్యమంలో ఆంధ్ర న్యాయవాది కార్యాచరణ సమితి అధ్యక్షుడిగా, ఆంధ్ర కేంద్ర కార్యాచరణ

సమితి పర్యవేక్షక కార్యదర్శిగా, ఆ సమితి సారథ్య సంఘ సభ్యుడిగా పత్రికా ప్రకటన వల్లనయితేనేమి, ఉపన్యాసాల మూలంగా కాని, జార్జి ఫెర్నాండెజ్ ఉపన్యాసాన్ని తర్జుమా చేయడం చేతగాని ఆంధ్ర ప్రజలకు అందులో ముఖ్యంగా పత్రికా ప్రపంచానికి నా పేరు పరిచితం కావడం విశేషం. హ్యూమనిస్టు ఉద్యమాన్ని భారీ ఎత్తున వ్యాప్తి చేయలేక పోయినా, సుసంఘటితంగా, పటిష్ఠంగా వుండేటట్లు నిర్మించటం వీలుకాక పోయినా దానిని ఆంధ్ర ప్రజల దృష్టికి తేగల్గాను. వివేకానందుని విషయంగా ఆవుల గోపాల కృష్ణమూర్తి వ్యాఖ్యకు వచ్చినంత ప్రచారం రాని మాట వాస్తవమే. కాని, ఆ తరువాత అంటే 1965 దరిమిలా ఇంత మాత్రం హ్యూమనిస్టు ఉద్యమం ఆంధ్ర ప్రజల దృష్టిని ఆకట్టు కోవటం సంతృప్తి దాయకం.

ఇదే సందర్భంలో 1974లో విజయవాడలో నేను సమావేశపరిచిన ఆం.ప్ర. రాడికల్ హ్యూమనిస్టు మహాసభను గురించి వివరించటం సమంజసమవుతుంది. మహాసభ ప్రారంభకులు ప్రొఫెసర్ ఆలం ఖుంద్ మిరి. ఆయన హైదరాబాదులో కమ్యూనిస్టు ఉద్యమానికి బీజాలు నాటిన 'కామ్రేడ్స్ అసోసియేషను' స్థాపక సభ్యులు. ఉస్మానియా విశ్వ విద్యాలయ తత్వశాస్త్ర విభాగంలో అధ్యాపకులు. హైదరాబాదు నగరంలోని మేధావి వర్గంలో, రాజకీయాలంటే ఆసక్తి కల పౌరులలో, విద్యావంతులలో మంచి ఆలోచనా పరుడుగా, విశాల దృక్పథం కలవాడిగా, మత దురభిమానం లేని మహాత్ముడుగా, లౌకిక రాజ్యవాదిగా పేరెన్నికగన్న పెద్ద మనిషి. మహాసభకు అధ్యక్షుడుగా వచ్చిన ప్రొఫెసరు సి. లక్ష్మన్న కూడా ఉస్మానియా విశ్వవిద్యాలయ అధ్యాపకులే. కాకపోతే ఈయన అభిమాన విషయం సామాజిక శాస్త్రం. వీరిరువురూ విజయవాడ మహాసభకు రావటానికి మిత్రుడు ఎస్. ఇన్నయ్య (ఇపుడు డాక్టర్ ఇన్నయ్య) కారకుడు. ఆంధ్రప్రదేశ్ హ్యూమనిస్టు మహాసభ జయప్రద మయిందని నా అంచనా. ప్రారంభోత్సవానికి విజయవాడ పౌరులలో మేధావులు, విద్యావంతులు, జిజ్ఞాసువులు పలువురు హాజరయినారు. అనుకున్నట్లుగానే పత్రికలు వార్తలను బాగా ప్రకటించాయి. పత్రికా పాఠకులలో మహాసభ ఆసక్తిని రేకెత్తించింది. ఈ మహాసభలో జరిగిన ఒక ప్రత్యేక సంఘటనను గురించి రాయకపోతే కథ అసంపూర్ణం అవుతుంది. హ్యూమనిస్టులు (మానవవాదులు) విశ్వమానవులు, విశ్వ పౌరులు వారికి కుల, మత ప్రాంతీయ, జాతీయ సంకుచిత భావాలు దూరం. ప్రకృతిలో 'లయ' లేక 'ఋతం' లేక 'నియమం' ఉన్నదని అదే ప్రకృతిలో జనించి ప్రకృతిలో భాగమయిన మనిషిలో హేతుత్వంగా భావిస్తుందని, సామాన్య మానవునితో కూడా హేతుత్వం నెలకొని వుంటుందని మానవ వాద (హ్యూమనిస్టు) తాత్విక సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. మానవులందరిలో హేతుత్వం వుంటున్నది కనుక వారంతా వస్తుతః సమానులు అనే భావం హ్యూమనిస్టు భావజాలంలో ప్రధానం. కనుక తెగ, జాతి, రంగు భేదాలను మానవ వాదులు పట్టించుకోరు. దీనిని సిద్ధాంతంగా చెప్పడం ఒక ఎత్తు. ఆచరణలో చూపడం మరో ఎత్తు. మరోచోట మరో సందర్భంలో మనవి చేశాను మిత్రుడు ఆవుల గోపాలకృష్ణమూర్తి వర్ణాంతర వివాహాలు విశేషంగా చేయించాడని. ఒకసారి రేపల్లె తాలూకాకు చెందిన కమ్మవారి అమ్మాయికి హైదరాబాద్‌లోని ప్రముఖ

దళిత కుటుంబానికి చెందిన యువకునికి (ఆనాడు 'హరిజన' అదే పదం వాడుకలో వుంది. దానిని వాడటానికి ఎవరూ అభ్యంతరం పెట్టలేదు) వివాహం జరిగితే గోపాల కృష్ణమూర్తి ఆచార్యత్వం వహించాడు. సుమారు 3 నెలలు గుంటూరు - తెనాలి - రేపల్లె బ్రాంచి రైల్వే లైనులో (38 మైళ్ళు - 61కి.లోమీటర్లు) నడిచే రైళ్ళలో గోపాల కృష్ణమూర్తిని పేరుపెట్టి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టారుట. తెనాలి, రేపల్లె తాలూకాలు కమ్మవారి ప్రాబల్యంకల ప్రాంతాలు. గోపాలకృష్ణ మూర్తి కమ్మ కులంవాడయి వుండి (అతనికి కులతత్వ భావన అమడ దూరం, ఎం.ఎన్. రాయ్ అనుచరులకు అది అసలే పనిపడదు) ఇంత అఘాయిత్యానికి పూనుకుంటాడా అని కమ్మకుల భావన ఉన్న వారు ఉగ్రులయిపోయారు. ఊరుకుండలేక అతనిని దుమ్మెత్తి పోశారు. అలా తిట్టేది తిట్టి నోళ్ళు నొప్పి పెట్టే వరకు ఏహ్యం వహించారు. ఈ సంఘటన రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కాలపుది. రాడికల్ డెమోక్రటులే రాడికల్ హ్యూమనిస్టులయారని విదితమే కదా) వర్ణాంతర వివాహాలను, మతాంతర వివాహాలను ప్రోత్సహించడం, జరిపించడం, సమర్థించడం హ్యూమనిస్టులకు వచ్చిన వారసత్వం.

వర్ణాంతర వివాహాలు చేయించారని గోరా గారికి పేరు ప్రతిష్టలు వుండేవి. వారి కుటుంబంలో మూడు వర్ణాంతర వివాహాలు జరిగాయి. మొదటి దానిలో వరుడు హరిజనుడయితే, మూడవ దానిలో వధువు హరిజన యువతి. అంతకు క్రితపు రోజుల్లో దర్శి చెంచయ్యగారి లాంటి సంస్కర్తలు హరిజన స్త్రీలను ఉద్వాహ మాడారు. కానీ తన కుటుంబంలో పెద్దలుగా, ఆదర్శంగా హరిజన కుటుంబాలతో, శూద్ర కుటుంబాలతో (ఇక్కడ హరిజన, శూద్ర అనే పదాలను న్యూనతా దృష్టితో వాడడం లేదని కేవలం వివరణాత్మకంగానే చెప్తున్నానని గ్రహించమని నా అభ్యర్థన) వివాహ విషయంగా సంబంధాలను ఏర్పరచుకున్న ఘనత, ప్రత్యేకత, విశిష్టత గోరాగారిది. గోరాగారిది నాస్తికోద్యమం. నాది హ్యూమనిస్టు ఉద్యమం. కులాతీత, మతాతీత దృష్టితో ఆచరణలో హ్యూమనిస్టులు నాస్తికులకు తీసిపోరని బహిరంగంగా చాటాలని నాకు అంతర్గతంగా ఆలోచన ఉన్నదేమో హ్యూమనిస్టులలో కులాంతర వివాహం, మతాంతర వివాహం చేసుకున్న దంపతులను మహాసభలో సన్మానించ నిశ్చయించాను. సన్మానించాం, వెంకటస్వామి సూర్యకుమారిలు, ఎస్.ఎ. బక్ష్ విజయలక్ష్మిలు ఆ దంపతులు. ఈనాటి సన్మానాలవలె ధనంతో కొలమానం చేసేవి కావు అవి. వేదికపై వారిని ఆశీసులను చేసి అభినందించి గ్రంథాలను బహూకరించిన సన్నివేశాలు అవి. ఇలాంటి వివాహాలను అమెరికా సంయుక్త రాష్ట్రంలో 'మిశ్రమ వివాహాలు' అని పిలిచేవారు. ఎక్కువగా శ్వేత వర్ణపు వారు నల్లరంగు నీగ్రోలు చేసుకునే పెళ్ళిళ్లకు పేరు వచ్చింది. గోరాగారి కుమారుడు లవణం (యీనాడు ప్రపంచ నాస్తికోద్యమ నాయకులు) అమెరికాలో పర్యటన చేసి వచ్చి అక్కడి విశేషాలను విశదీకరిస్తే ఈ మిశ్రమ వివాహ పద్ధతి నా మనస్సుపై చెదరని ముద్రవేసింది. అందుచేత మహాసభ కార్యక్రమంలో 'మిశ్రమ వివాహ దంపతులకు సన్మానం' అని అచ్చొత్తించాను. ఈ సన్మాన కార్యక్రమం మహాసభకు విచ్చేసిన హ్యూమనిస్టులు కాని వారిని అలరించింది. హ్యూమనిస్టుల ప్రతిష్ఠ ఇనుమడించింది.

మహా సభానంతరం తీరిగ్గాలోచిస్తే, తెలుగు భాషలో 'మిశ్రమ వివాహం' అనే పదజాలం తగినది కాదేమో అనే సంశయం నా మదిలో పొడసూపింది. కుల, మత, జాతి, వర్ణ ప్రసక్తిలేని వివాహం (కాస్మపాలిటన్ మ్యారేజి) అంటే యుక్తి యుక్తంగా వుంటుందని స్ఫురించింది. 'అభ్యుదయ వివాహం' అని అంటే యింకా బాగుంటుందని తోచింది. ఏదయినా నా సతీమణి వేంకట సుబ్బమ్మ (యీనాడు మల్లాది సుబ్బమ్మ) **1983**లో హైదరాబాద్ 'అభ్యుదయ వివాహ వేదిక' అనే సంస్థను నెలకొల్పే వరకు అలాంటి వివాహాలకు 'అభ్యుదయ వివాహాలు' అనే పేరు ప్రచారంలోకి రాలేదు.

# హేతువాద ఉద్యమం

హేతువాదం, వ్యక్తివాదం, మానవవాదం ఈ మూడూ కలిసి పెనవేసుకున్నదే నవ్య మానవవాదం (న్యూ హ్యూమనిజం). దీనినే సమూల మానవవాదం (రాడికల్ హ్యూమనిజం) అని సమగ్ర మానవవాదం. (ఇంటెగ్రల్ హ్యూమనిజం) అని పిలవడం కద్దు. హేతువాదం అనగానే సర్వ సామాన్యంగా దానిని నాస్తికత్వానికి మారు పేరుగా పరిగణించడం కద్దు. నిజానికి హేతువాదం, నాస్తికత్వం వేరు వేరు. హేతువాదులందరూ నాస్తికులు కాక పోవచ్చును. అలాగే నాస్తికులందరూ హేతువాదులు కానవసరం లేదు. 'నాస్తికో వేదనిందకః' అనే అర్థం యీనాడు వాడుకలో లేదు. వేదాలను ప్రమాణంగా స్వీకరించని వారిని పూర్వం నాస్తికులనేవారు. బుద్ధుడిని నాస్తికులన్నారు. ఈనాడు నాస్తికుడంటే దేవుని అస్తిత్వంలో విశ్వాసం లేనివాడని అర్థం. నాస్తికులలో రెండు తెగలు –'నెగటివ్ ఎథియిష్టులు', 'పాజిటివ్ ఎథియిష్టులు'. ఈ పద జాలాలను మౌలిక భావనతో యిక్కడ వాడటం జరుగుతున్నది. అంతేకాని ఈనాడు ఈ పేర్లతో తమరిని అభివర్ణించుకునే వారి అర్థంతో కాదని గమనించాలి. దేవుడనే భావనకు వాస్తవ జగత్తులో అస్తిత్వం కనపడలేదనేవారు నెగటివ్ ఎథియిష్టులు. అంటే దైవ భావనకు వాస్తవికత లేదు కనుక దైవపు ఉనికిని అంగీకరించని వారని తాత్పర్యం. భారతదేశంలోని హేతువాదులు ఈ వర్గీకరణ క్రిందకు వస్తారు. దేవుడు లేడు, లేనే లేడు అనేవారు 'పాజిటివ్ ఎథియిష్టులు'. ఇ.వి. రామస్వామి నాయకర్, గోరా ఈ కోవకు చెందినవారు. హేతువాదులలో చాలామంది తమ హేతుత్వాన్ని వినియోగించి నాస్తికులవుతారు. కొంతమంది అజ్ఞేయవాదులుగా ('ఎగ్నాస్టిక్స్') మిగిలిపోతారు. మరి కొంతమంది మతస్థులుగా వుంటూనే హేతువాదులుగా తమను చిత్రించుకుంటారు. తమ హేతుత్వంలో తమ ఆలోచనా ధారను హేతువాదులు ప్రారంభిస్తారని, దేవుడు లేడనే భావంతో నాస్తికులు తమ సిద్ధాంత ప్రతిపాదనకు ఉపక్రమిస్తారని తేటతెల్లమవుతుంది.

పై కొద్ది పరిచయ వాక్యాలతో హేతువాద ఉద్యమంలో నా ప్రవేశాన్ని గురించి వివరిస్తాను. అయితే, హేతువాద సంఘ చరిత్రను కొంతదిగానన్నా చెప్పకపోతే పొరపాటవుతుంది. సుప్రసిద్ధ నాస్తికుడు ఇ.వి. రామస్వామి నాయకర్ సహచరుడుగా వున్న ఎస్. రామనాథన్ 1940లో భారత హేతువాద సంఘాన్ని నెలకొల్పాడు. పలువురు మేధావులతో తోడ్పాటును ఆయన సంపాదించగలిగాడు. ఎం.ఎన్. రాయ్, ఎలెన్ రాయ్, జాకబ్, జియావుద్దీన్, గోరా, ఆవుల గోపాల కృష్ణమూర్తి తదితరులు స్థాపక సభ్యులుగా ఆ సంఘం నెలకొల్పబడింది. బొంబాయిలో 1930లోనే ఏర్పాటయిన 'పురోహిత వ్యతిరేక సంఘం' హేతువాద సంఘ ఆవిర్భావానికి వలసిన ఆలోచనకు బీజాలు వేసిందని గ్రహించడం అవసరం. 'భారత హేతువాది' అనే మాస పత్రికను ఆంగ్ల భాషలో రామనాథన్ ప్రచురించ సాగారు. ఆంధ్రలో గోరా, ఆవుల గోపాల కృష్ణమూర్తి ప్రముఖంగా ఆయనకు అండగా నిలిచారు. గోపాల కృష్ణమూర్తి తెనాలిలో అఖిల భారత హేతువాద మహాసభను జయప్రదంగా నిర్వహించారు. ఆ మహాసభకు ద్రవిడ కజగం నాయకుడు అన్నాదొరై ప్రారంభకుడుగా వచ్చాడని విన్నాను. అనారోగ్య కారణాల వల్ల రామనాథన్ కార్యభారాన్ని వహించలేని స్థితిలో ఆ బాధ్యతను శ్రీ

ఆవుల సాంబశివ రావు (నేటి ఆం.ప్ర. హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి మాజీ లోకాయుక్త, ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షుడు, హ్యూమనిస్టు) స్వీకరించాడు. భారత హేతువాద సంఘానికి ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించాడు. 'భారత హేతువాది' పత్రికను హైదరాబాదు నుండి వెలువరించాడు. మిత్రుడు ఎన్.కె. ఆచార్య (అడ్వకేటు, యీనాడు 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలలో ఆదివారపు సంచికలో 'చట్టాలు' అనే శీర్షికను నిర్వహిస్తున్నవారు) ఆ పత్రికకు సంపాదకత్వం వహించాడు. శ్రీ ఎన్. ఇన్నయ్య భారత హేతువాద సంఘానికి కోశాధికారిగా వ్యవహరించినట్లు తెలుస్తున్నది. ఇలా హైదరాబాదు కేంద్ర స్థానంగా సంఘం 1972 వరకు - అంటే సాంబశివ రావుగారు న్యాయమూర్తి అయ్యేదాకా పనిచేసిందట. తరువాత కొంత కాలానికి మద్రాసు నుండి మిత్రులు ఎ. సూర్యనారాయణ, జ్యోతి శంకర్‌లు వచ్చి సంఘ బాధ్యతను ఎత్తుకున్నారు. మద్రాసు సంఘ కార్యక్రమాలకు కేంద్రం అయింది. భారత హేతువాద సంఘంలో ఎం.ఎన్. రాయ్ సహచరులు అనధికార మార్క్సిస్టులుగా (నాన్ కన్‌ఫారమిస్టు మార్క్సిస్టుగా) అంటే అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీతో సంబంధం లేని మార్క్సిస్టులుగా - రాడికల్ హ్యూమనిస్టులుగా వుంటూ కృషి చేశారు. సర్వశ్రీ ఎం.ఎన్. రాయ్, ఎలెన్ రాయ్, సి.ఆర్.ఎం. రావు, ఆర్.ఎస్. యాదవ్, ఆవుల గోపాల కృష్ణమూర్తి, ఆవుల సాంబశివ రావుగారలు మహాసభలకు ప్రారంభకులుగా, అధ్యక్షులుగా, సంఘ ఉపాధ్యక్షులుగా, ప్రధాన కార్యదర్శులుగా ఉద్యమానికి బలాన్ని చేకూర్చారు. అవిచ్ఛిన్నంగా సంఘంతో సన్నిహిత సంబంధాన్ని కల్గి వుండేవారు. ఈ చరిత్ర అంతా నాకు తెలుసు కాని - ఎందువల్లనో చెప్పలేను. ఆ ఉద్యమంతో నేను సరాసరిగా దగ్గర సంబంధాలు పెట్టుకోలేదు. చివరకు 1973 డిసెంబరులో మద్రాసులో జరిగే అఖిల భారత హేతువాద మహాసభకు హాజరు కాదలిచాను.

1958 నుండి నాతో సహకరిస్తున్న నా పత్ని సుబ్బమ్మతో కలసి మదరాసు హేతువాద మహాసభకు వెళ్ళాను. బొంబాయికి చెందిన ప్రసిద్ధ మేధావి (చాలా రోజులు ఆయన ఐరోపాలో నివసించి అంతర్జాతీయ హ్యూమనిస్టు సంఘంలో భారత హ్యూమనిస్టు ప్రతినిధిగా పనిచేసినవారు) శ్రీ అబ్రహాం సాలమను మహాసభను ప్రారంభించారు. ఆయన ఉపన్యాసం తార్కికంగా, సరళంగా, సుబోధకంగా సాగింది. హే . .వాద సిద్ధాంత మౌలిక సూత్రాలను ఆయన విశ్లేషణాత్మకంగా విశదీకరించాడు. ఉ . మాటలు యిప్పటికీ నా చెవులలో గింగురు మంటున్నాయి. దక్షిణాది రాష్ట్రా-వారు ఎక్కువగా ప్రతినిధులుగా వచ్చారు. ఆ మహాసభకు గోరాగారు అధ్యక్షత వహించారని గుర్తు. ప్రధాన కార్యదర్శిగా వున్న ఎం. సూర్య నారాయణ కార్యదీక్ష కోశాధికారిగా వున్న జ్యోతి శంకర్ వైదుష్యం నన్ను ముగ్ధుల్ని చేశాయి. ఆ మహాసభలోనే కేరళ హేతువాద సంఘ నాయకుడు పవనన్ (ఆనాడు అతడు సోవియట్ లాండ్ మళయాళ భాష పత్రిక సంపాదకుడు) జయగోపాల్ (ఈనాడు భారత నాస్తిక సమాజం అధ్యక్షుడు) తమిళ హేతువాద నాయకుడు నరసింహం గారలతో పరిచయమైంది. భారత హేతువాద సంఘానికి నలుగురిని ఉపాధ్యక్షులుగా ఎన్నుకున్నారు. వారిలో నేను ఒకడిని, ఇలా నేను హేతువాద సంఘంలో బాధ్యునిగా

# కోవూరు
# పర్యటనలు

భారత హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి సూర్యనారాయణ వృత్తిరీత్యా ఆడిటరు. 'ఇండియన్ ఆయిల్ కంపెనీ'లో పెద్ద ఆఫీసర్. అతనికి ప్రణాళికలు వెయ్యడం వెన్నతో పెట్టిన విద్య. సభ్యుల చందా సంవత్సరానికి 20 రూపాయలు చేశాడు. 'భారత హేతువాది' పత్రికను ప్రతి సభ్యునికి అందచేసేవాడు. పత్రిక చందా దాని సభ్యత్వ రుసుముతో కలిపివేశాడు. అందువల్ల పత్రిక ఉనికికి ప్రమాదం వుండేది కాదు. సంఘానికి అనేక శాఖలు వుండేవి. రాష్ట్రానికి ఒక శాఖ వుండేది. అలా ఒరిస్సా, మధ్య ప్రదేశ్, బరోడా, తమిళనాడు, కేరళ, ఆంధ్ర, కర్నాటక శాఖలు నెలకొన్నవి. అయితే అవి ఆ రాష్ట్రాలలోని అన్ని జిల్లాలలో బలంగా వుండేవి కావు. కానీ ప్రతి రాష్ట్ర శాఖలోనూ 30 మంది నుండి యాభై మంది హేతువాద సిద్ధాంతంలో సంపూర్ణ విశ్వాసం వున్న కార్యకర్తలు వుండేవారు.

సింహళ హేతువాద సంఘాధ్యక్షుడు ఎ.టి. కోవూరు కేరళ ప్రాంతీయుడు. సింహళ ద్వీపాన్ని తన స్థిర నివాస స్థానంగా ఎన్నుకుని అక్కడే వుండేవాడు. హేతువాద రాయబారి (రేషనలిస్టు ఎంబాసిడార్) అనే పేరుగల త్రైమాసిక పత్రికను నడిపేవాడు). ఆయనకు బాబాలంటే చికాకు. వారిలో ఎక్కువమంది మోసగాండ్రని ఆయన నిశ్చితాభిప్రాయం. వారు చేసే గమ్మత్తులు అంటే అతనికి అసహ్యం. తన యెదుట, యింకా శాస్త్రజ్ఞుల యెదుట వారు గమ్మత్తులు మహాత్మ్యాలు చేయగలిగితే లక్ష రూపాయలు వారికి యిస్తానని సవాల్ చేసిన ధీరుడు. అనేకమంది బాబాలు ఈ సవాలును స్వీకరించి తీరా పరీక్ష సమయానికి జారుకునేవారు. ఈ సంఘటనలు కోవూరు పేరు ప్రతిష్ఠలను ఇనుమడింప చేశాయి. ఆయనను ప్రజానీకమూ, పత్రికలు డా. కోవూరు అని పిలువసాగాయి. ఆయనకు ఆ డాక్టరు కోవూరు అనే గౌరవ నామధేయం ఎలా వచ్చిందో తరువాత విశదీకరిస్తాను.

తను కోవూరు పర్యటనను ఏర్పాటు చేస్తున్నానని, కోవూరు బృందంలో స్వామినాథన్ అనే ఇంద్రజాలికుడు, కె.బి. నారాయణన్ అనే సమ్మోహనిద్రా నిపుణుడు హిప్నటిస్ట్ డా. కోవూరు, తనువుంటామని అనేక పట్టణాలలో వారి కార్యక్రమాలు జరిపించాలని, ప్రతి ప్రదర్శనకు రూ.550లు భారత సంఘానికి ఇవ్వాలని బృందపు వసతి వగయిరా సౌకర్యాల బాధ్యత, తరువాతి మజిలీకి వారిని ఖర్చులు భరించుకుని చేర్చడం ఆయా ప్రదేశాల హేతువాద సంఘాలు లేక మిత్రులది అని మిత్రుడు సూర్యనారాయణ నిర్దేశించాడు. ఆంధ్రలో నన్ను ఆ ఏర్పాట్లు చేయమన్నాడు. నేను అంగీకరించాను. అప్పటికే ఆంధ్ర రాష్ట్ర హేతువాద సంఘం మనుగడలో వుంది. లవణం దాని అధ్యక్షులు. మిత్రుడు వేణుగోపాల్ దానికి కోశాధికారి. వేణుగోపాల్ భార్య ఉపాధ్యాయురాలు. ఆ సంఘం గుంటూరు హేతువాద మహాసభలో ఉదయించింది. మిత్రుడు గురిజాల సీతారామయ్య, ఎడిటర స్నేహితులు కార్యనిర్వాహక సభ్యులు. ఆంధ్ర హేతువాద సంఘ బాధ్యతను స్వీకరించమని నన్ను కోరాడు. అంత బాధ్యతను, బరువును నేను మోయలేనని వినయంగా మనవి చేశాను. చివరకు వేణుగోపాల్,

నేను నిర్వాహకులుగా డా. కోవూరు పర్యటనను ఆంధ్రప్రదేశ్‌లో జరిపించడానికి నిశ్చయించాము. ఆంధ్ర సంఘం పేరుమీద కాకుండా మా వ్యక్తిగత హోదాలలో ఆ కార్యభారం వహించడానికి మేము పూనుకున్నాం. వేణుగోపాలును ఆంధ్ర హేతువాద సంఘ ఉపాధ్యక్షునిగానూ అభివర్ణించుకున్నాం. అలాగే గోడలమీది ప్రకటన పత్రాలతో, కరపత్రాలలో అచ్చువేయించాం.

1974లోని డా. కోవూరు బృంద పర్యటనలో ప్రదర్శనలకు అనువయినవిగా నేను 3 సంవత్సరాలు ప్లీడరీ చేసిన చీరాల, అప్పుడు కాపురముంటున్న విజయవాడ, తెలంగాణాలోని వరంగల్, హైదరాబాద్ పట్టణాలను ఎంపిక చేశాం. చీరాలలోని కార్యక్రమ నిర్వహణ బాధ్యతను మిత్రుడు సి.హెచ్. రాజారెడ్డి తన మీద వేసుకున్నాడు. చీరాల ప్రదర్శనయే ఆంధ్రలో డా. కోవూరి తొలి ప్రదర్శన. అచ్చట స్థానిక హ్యూమనిస్టు మిత్రులు అతనికి అండదండలు అందించారు. ప్రదర్శన జయప్రదమయింది. 1500 రూపాయిలు ప్రవేశ పత్రాల అమ్మకం ద్వారా సమకూడింది. ఖర్చులు పోను సుమారు 8 వందల రూపాయలు స్థానిక హ్యూమనిస్టు సమితికి మిగిలింది. ఇది నిర్వాహకులను సైతం చేకూర్చింది. తరువాత మజిలీ విజయవాడ - విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్ హాల్‌లో ప్రదర్శనను ఏర్పాటు చేశాం. కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు, మత మౌఢ్యానికి వ్యతిరేకులు తమ సానుభూతిని సహాయాన్ని అందించారు. నాస్తికులలోని రెండు తెగలవారు – గోరా అనుయాయులు, భారత నాస్తిక సమాజపు నాస్తికులు – ప్రదర్శనను జయప్రదం చేసే కార్యభారాన్ని నెత్తిన వేసుకున్నారు. ప్రవేశ పత్రాలను విరివిగా విక్రయించారు. గుంటూరు, తెనాలి, విజయవాడ మూడు పట్టణాల ప్రజలు హాలులో ప్రవేశానికి రుసుము చెల్లించి మరీ హాజరయినారు. మిత్రుడు బి. రామకృష్ణ ('చార్వాకుడు') గ్రంథ రచయిత, నిడమర్రులో నాస్తిక విద్యాపీఠ స్థాపకుడు, తరువాత భారత నాస్తిక సమాజపు పత్రిక నాస్తికత్వం' అనే దానికి సంపాదకుడు. భారత నాస్తిక సమాజపు సిద్ధాంతకర్తలలో ఒకడు) విజయవాడ ప్రదర్శన విజయవంతం అవటానికి కారణభూతుడు. డా. కోవూరు ప్రసంగాన్ని తర్జుమా చేయడానికి శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరావును కోరాను. ఆయనను కంట్రాక్టరు కోటేశ్వర రావు అని సర్వసాధారణంగా పిలుస్తారు. ఆయన మాజీ కమ్యూనిస్టు. తెలుగులో వేదాలనుండి శంకరుని వరకు శంకరాద్వైతం అనే మంచి పుస్తకాలను రాసినవారు. ప్రఖ్యాత రచయిత డా. జి.వి. కృష్ణారావుకు స్నేహితుడుగా వుండేవారు. తద్వారా నాకు పరిచయం అయినారు. ఆయన అనువాదం చాలామందికి నచ్చలేదు. ఆయన భాష గ్రాంధికంగా కన్పించడం, నాతి కఠినం అవటమే కారణమనుకుంటాను. ఏదయినా ఆయనది సరళ భాష కాదు. విజయవాడ ప్రదర్శనను తిలకించడానికి 12 నుండి 15 వందలమంది ప్రజలు వచ్చారు. విజయవాడ పత్రికా ‧ ప్రపంచానికి కేంద్రమవటంతో డా. కోవూరు ప్రసంగానికి, భావాలకు విశేష ప్రచారం వచ్చింది.

వరంగల్ ప్రదర్శన హనుమకొండ ఆర్ట్స్ కాలేజీలో జరిగింది. 5, 6 వందలమంది కన్నా ప్రేక్షకులు, శ్రోతలు రాలేదు. కాని వచ్చిన వారిలో ఎక్కువమంది విద్యావంతులు, జిజ్ఞాసాపరులవటంతో మాకు నిరుత్సాహం కలుగలేదు. పైకం విషయంలోలోటు కలిగింది. హైదరాబాద్ ప్రదర్శనను గాంధీభవన్ హాల్‌లో ఏర్పాటు చేశాం. వెయ్యిమంది

కూర్చొనడానికి అవకాశం వున్న హాలు జనంతో క్రిక్కిరిసి పోయింది. ప్రేక్షకుల
ముఖాలలో ఆసక్తి ప్రస్ఫుటంగా కన్పించింది. సత్యసాయిబాబా, ఇతర బాబాల
జిమ్మిక్కులపై సందేహాలు సంశయాలు వున్నవారంతా సభకు విచ్చేశారు. ఇంద్రజాల
ప్రదర్శనను తిలకించారు. నారాయణ్ హిప్నాటిజాన్ని చూసి ఆనందించారు. డా.
కోవూరు ప్రసంగాన్ని విని ప్రబోధితులయ్యారు.

# కోవూరు సభల తీరు

డా. కోవూరు సభలు నిర్దుష్టమయిన ప్రణాళిక ప్రకారం సాగేవి. కార్యక్రమం మొత్తం రెండు రెండున్నర గంటలు పట్టేది. ముమ్మందుగా స్వామినాథన్ తన పనిని ఉపక్రమించే వాడు. 'దేవుడు లేడు, ఉన్నాడని ప్రచారం చేసేవాడు మోసగాడు, దేవుడున్నాడని నమ్మేవాడు బుద్ధిహీనుడు' అనే వాక్యాలను – అవి ఇ.వి. రామస్వామి నాయకర్ (నిజానికి ఆయనను రామస్వామి అనటం ఉచితం) వాక్యాలు – తమిళంలో ఉటంకించి తరువాత కార్యక్రమాన్ని ప్రారంభించే వాడు. అనేకమంది బాబాలను ఒక్కొక్కరినే పేర్కొని వారు మహాత్మ్యాల పేరుతో చేసే గారడీలను చేసి చూపించి వారి మోసాలను బట్టబయలు చేసేవాడు. చివరకు సత్యసాయి బాబా పూర్వం చేసే పూల గమ్మత్తును ప్రదర్శించే వాడు. దాని బండారం అందరికి తెలిసిపోవటంతో ఆయన దానిని మానివేశాడని ప్రకటించేవాడు. చిట్ట చివరిది నోట్లో నుండి శివలింగాన్ని వెలికి తీయడం తన ప్రదర్శన మధ్య ఎవరూ చూడకుండా పెద్ద రుద్రాక్ష అంత పరిమాణం కల శివలింగాన్ని మింగేవాడు. అతనితో పాటు వేదికమీద ఉన్న నన్ను అరగంట అయిన తరువాత తనను హెచ్చరించమనేవాడు. ఈలోగా పది నిముషాలకు ఒకసారి పెద్ద చెంబుతో ఎక్కువగా నీరు త్రాగేవాడు. అరగంట అయిందని నేను జ్ఞాపకం చేయగానే తన కడుపు చేతబట్టుకొని 'ఉళక్కి' అని శబ్దం చేసి నోటిలో నుండి శివలింగం తీసి తన అరచేతిలో పెట్టుకొని చూపేవాడు. ఇలా శివలింగాన్ని నోట్లోంచి తీయటం సత్యసాయి బాబా సంవత్సరానికి ఒకసారి చేస్తున్నాడని, తను రోజుకు నాలుగుసార్లు చేయవచ్చని, ఇలా చేయడం మహత్తు కాదని, కేవలం అభ్యాస వశాన లభించే నైపుణ్యమని స్వామినాథన్ తెలియజెప్పేవాడు.

శ్రీ కె.పి. నారాయణ ('హిప్నో' అనేది అతని బిరుద నామం) స్వామినాథన్ తరువాత వేదిక మీదికి వచ్చేవాడు. అతని ప్రదర్శన సమయంలో డా. కోవూరు కూడా వేదిక మీద వుండేవారు. డా. కోవూరు పరిచయ వాక్యాలు అయిపోయిన తరువాత నారాయణ్ హిప్నటిజం యొక్క మౌలిక సూత్రాలను స్థూలంగా వివరించేవాడు. సభలో నుండి సాహసం కల యువకులను వేదిక మీదికి పిలిచి – పది, పదిహేను మందిదాకా వచ్చేవారు. వారిచేత గట్టిగా శ్వాస పీల్చడం, వదలడం చేయించేవాడు. ఎక్కువ మందికి మైకం వచ్చేది. అలా రానివారిని తిరిగి సభలోకి పంపించి, బాగా మైకం వచ్చి పడబోయే వారిని కుర్చీలపై ఆసీనులను చేసేవాడు. వారిలో ఒకరిద్దరిని ఎంపిక చేసేది. వారిచేత ప్రదర్శన చేయించడం తరువాత పని. ఈ ప్రారంభ కార్యానికి కనీసం అరగంట పట్టేది. సభికులు ఉత్కంఠతో ఓపికగా మౌనం వహించి సహించేవారు. బాగా సమ్మోహ నిద్రకు లోనయినవారు తను చేయబొయ్యే సూచనలను విధిగా పాటిస్తారని ముమ్మందుగా చెప్పి వారికి సూచనలను అందజేయడానికి పూనుకునేవాడు. 'నీవు పసి పిల్లవాడివి పొరాడుతున్నావు' అని నారాయణ్ అంటే హిప్నటైజ్ చేయబడిన వ్యక్తి వేదిక మీద నేలమీద పొరాడేవాడు. 'నీవు క్యావు, క్యావు అని అరుస్తున్నావు' అంటే అలా అరిచేవాడు. 25, 30 సంవత్సరాల వయసు కల మనిషి చిన్న పిల్లవాడులాగా పొరాడుతుంటే, 'క్యావు, క్యావు'

అని అరుస్తుంటే హాలు హాలంతా - వెయ్యిమంది దాకా - విరగబడి నవ్వేవారు. సమ్మోహన నిద్రలోనున్న మనిషి నోట్లో పాలపీక పెట్టి 'నీవు పాలు తాగుతున్నావు' అని హిప్నో అంటే ఆ వ్యక్తి పాలపీకను చప్పరించేవాడు. వేదిక మీద మూడు 'స్టూల్సు' వేసి వాటిపై హిప్నటిజం ప్రభావంలో వున్న వ్యక్తిని పరుండబెట్టి 'నీ దేహం రాయిలా గట్టిపడింది, గట్టి పడింది, గట్టి పడింది' అని మూడు నాలుగుసార్లు అని అతని దేహం వున్న బల్లలలో మధ్య దానిని 'హిప్నో' తీసివేయించేవాడు. ఆ వ్యక్తి శరీరం కొయ్య దుంగలా, ఏ మాత్రం మధ్యలో వంగకుండా, అలా వుండిపోయేది. అలా కొలది నిమిషాలు వుంచి ఆ వ్యక్తిని మరల క్రిందికి దించి కుర్చీలో కూర్చోపెట్టేవారు. మనస్సుకు వున్న శక్తులు అసమానమని, మానసిక శక్తులు దేహాన్ని అదుపులో వుంచగలవని, బైరాగులు, యోగులు, బాబాలు ఈ మానసిక శక్తి ద్వారా యిలాంటి అద్భుతాలు చేసి వాటిని ప్రజలు మహాత్మ్యాలుగా నమ్మేటట్లు హిప్నో తెలియజెప్పేవాడు. చివరగా ఒక హెచ్చరిక చేసేవాడు. బుద్ధిమాంద్యం కలవారు, దృఢచిత్తులు హిప్నటిజానికి లొంగరని, బుద్ధి మాంద్యం కలవారికి 'హిప్నాటిస్టు' చేసే సూచనలు, చెప్పే మాటలు అర్థం కానందున వారి యెడల అది పనిచేయదని, దృఢ మనస్కులు ప్రారంభం నుండే హిప్నటిస్టు యెడల వ్యతిరేక భావం కలిగి వుంటున్నందున వారూ ప్రభావితులు కారని విశదపరిచేవాడు. ఒక ప్రక్రియను చేయడం, దానిని వివరించడం, దాని మూల సూత్రాలను అర్థమయ్యేలా చెప్పడం వల్ల 'హిప్నో' ప్రదర్శనలు సభికులను అలరించేవి. సంపాదించిన నూతన జ్ఞానంతో వారు సంతోష మనస్కులయ్యేవారు. చిట్టచివరన డా. కోవూరు ప్రసంగం వచ్చేది. సూది మొన క్రిందపడినా, చీమ చిటుక్కుమన్నా శబ్దం ప్రస్ఫుటంగా వినపడేటంత నిశ్శబ్దం సభాస్థలిని ఆవరించేది. డా. కోవూరుది కంచు కంఠం. అనేకమంది నాయకుల ఉపన్యాసాలను విన్నాను. మహా మహుల ప్రసంగాలు విన్నాను. ఎంతోమంది కంఠ స్వరాలు నాకు పరిచితమే. కాని ఈ వయస్సు వచ్చే వరకు అలాంటి గొంతుక ధ్వని నాకు తటస్థించ లేదు. మానవ వ్యక్తి భ్రాంతికి (ఇల్యూజన్) భ్రమకు (డెల్యూజన్) అవాస్తవిక ఊహకు లోనవటం 'హెల్యూసినేషన్' సహజమని డా. కోవూరు చెప్పేవారు. ఒక వస్తువు ఉనికి కల్గివుంటే మరొక వస్తువు వున్నట్లు తలపోయుటం భ్రాంతి. చీకట్లో త్రాడు వుంటే దానిని పామని అనుకోవటం భ్రాంతి. 'రజ్జు సర్పభ్రాంతి' అనే పదజాలాన్ని వేదాంత పరిభాషలో వాడతారు. అసలు ఉనికిలేని వస్తువును వున్నదని భావించడం భ్రమ. తన కళ్ళెదుట ఎవరూ లేకున్నా తన ప్రియురాలు తన ఎదురుగా కూర్చొని తనతో మృదు మధురోక్తులు పలుకుతున్నదని మురిసిపోవడం భ్రమ ఫలితమే. చిన్నప్పుడు అమ్మమ్మలు, నాయనమ్మలు చెప్పిన దయ్యాలు కథలు విన్నందున దయ్యాలున్నాయని విశ్వసించడం, అవి తననేదో రకంగా బాధలకు గురిచేస్తున్నవని నమ్మడం పైచెప్పిన మూడవ కోవకు చెందిన చిత్త విభ్రాంతి. భ్రాంతులకు, భ్రమలకు అవాస్తవిక విశ్వాసాలకు లోనయినవారికి తను చికిత్స చేశానని చెప్పి ఆ కథలను డా. కోవూరు వినిపించేవారు. ఎవరయినా 'నేను దేవుని చూచానని' చెప్తే వారు అబద్ధీకులని, అసత్యవాదులని తను అనని నిజంగా అలా చెప్పినవారికి దేవుని

రూపం - వారు స్మరించిన రూపం - కళ్లెదుట కనులకు కన్పించి యుండవచ్చని చిత్తశుద్ధితో అంగీకరించేవారు. అయితే, ఆ స్థితి ఎలా కల్గిందో, ఎలా కలుగుతుందో సోదాహరణంగా చాటేవారు. ఈ స్థితి నాలుగు రకాలుగా కలుగవచ్చని సూచించేవారు. శబ్దం, రసాయనిక ద్రవ్యాలు, హార్మోనులు, సూచనలు ప్రేరకాలని పేర్కొనేవారు. దేవాలయాలలో గంటల ధ్వని, ఎల్ ఎస్ డి, భంగు లాంటి ద్రవ్యాల వాడకం, హార్మోనులను దేహంలోకి చొప్పించటం, సమ్మోహ నిద్రా స్థితిలో సూచనలు యీ నాల్గింటిలో ఏ ఒకటయినా ఆ స్థితిని కలుగచేస్తుంది. ఒక అమ్మాయికి మబ్బులలో ఆమె నాయనమ్మ కనిపించేదట. హార్మోనులు యిస్తే నాయనమ్మ కన్పించటం మానివేసిందట. మనుషులను 'హిప్నటైజు' చేసి సూచనలు యిస్తే ఆ సమ్మోహ నిద్ర నుండి లేపిన తరువాత వారికి వుండే అవాస్తవిక విశ్వాసాలు పటాపంచలవుతాయట. ఇలా ఎన్నో విషయాలు ఆయన తన సహజ హాస్య ధోరణిలో, వ్యంగ్య సరళిలో చెప్తూంటే పధికులు ఆయన నోట వచ్చిన ప్రతి మాటను విశ్వసించ సాగారు.

తన ప్రసంగాలతో, తనతో వచ్చినవారి ప్రదర్శనలతో తరతరాలుగా మౌఢ్యంలో మునిగి తేలుతున్న భారత ప్రజలకు విజ్ఞానాన్ని, జ్ఞానోదయాన్ని ప్రసాదించిన డా. కోవూరు హేతువాద ఉద్యమానికి ఎనలేని సేవచేశాడు.

# డా॥ కోవూరు ప్రభావం

డా॥ కోవూరు ఆంధ్రప్రదేశ్‌ను మూడుసార్లు దర్శించాడు. మొదటిసారి 1974లో, రెండవసారి 1975లో, మూడవసారి 1976లో ఆయన తెలుగుదేశాన్ని పర్యటించారు. రెండవసారి 1975లో వచ్చినపుడు విజయవాడలో సభ పెట్టాము. ఇది ఎమర్జీన్సీ కాలం. నేను ఆనాటి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ అతిథిగా రాజమండ్రి జైలులో డెటెన్యూగా వున్నాను. విజయవాడ సభ జయప్రదం కావటానికి మల్లాది వెంకట సుబ్బమ్మ తన వంతు కార్య భారాన్ని మోసింది. సభలో అన్యాపదేశంగా నన్ను గురించి ప్రస్తావించాడట. లా ప్రకారం కోవూరు సింహళ దేశ పౌరుడు. విదేశీయుడు భారతదేశ రాజకీయాలపై వ్యాఖ్యానించటం తగదు; ప్రమాదకరం కూడాను. అదీగాక డా॥ కోవూరుకు రాజకీయాలు పెద్దగా ఆసక్తిదాయకాలు కావు. అందుకని తన ఉపన్యాసంలో 'ఈ సోజసభలో నా మిత్రులు లేరు. వారు లేని లోటు నన్ను బాధిస్తున్నది' అని మాత్రం చెప్పారట. అయితే శ్రోతలకు అది అర్థమయిందట.

డా॥ కోవూరు మరల 1976లో కోస్తా ప్రాంతానికి వచ్చారు. అప్పటికి నేను జైలు నుండి విడుదల అయ్యాను. ఈసారి విజయవాడ మైదానంలో బహిరంగ సభ జరిగింది. సభకు సుమారు 10వేలమంది ప్రజలు వచ్చారు. లవణం ఆయన ఉపన్యాసాన్ని ఆంగ్లం నుండి అనువాదం చేశారు. అంతకు క్రితం డా॥ కోవూరు పర్యటనల పట్ల శ్రద్ధ వహించిన భారత నాస్తిక సమాజ నాయకుడు జయగోపాల్ ఆయన సభను విశాఖ పట్టణంలో ఏర్పాటు చేశాడు. గుడివాడలో ఆయన ఉపన్యాసాన్ని నేను తర్జుమా చేయవలసి వుండెను. కాని కొంతమంది మిత్రుల 'పొరపాటు' వల్ల అది అలా జరుగలేదు. గుడివాడ, తెనాలి కార్యక్రమాలు బాగా జరిగాయి. నేను డా॥ కోవూరు వెంట కాకినాడ నుండి ఒంగోలు వరకు పర్యటించాను. ఆయన ఉపన్యాసాలను తెలుగు చేసే అవకాశం నాకు లభించింది. ఆయనను దగ్గర నుండి గమనించే వీలు నాకు కలిగింది. కొంతమంది భావించినట్లు ఆయన 'బూర్జువా' కాదు. కాకపోతే సందర్భం లేకుండా 'కార్మిక వర్గం', 'కార్మిక శక్తి', 'బీద ప్రజానీకం' అనే పదాలను వాడేవాడు కాదు. ఆయన పెద్దగా ధనికులు కోరే సౌకర్యాలను ఆశించేవారు కాదు. ఒకసారి 1974లో విజయవాడ నుండి వరంగల్ వెళ్లే సందర్భంలో, కావాలని, ఆయనకూ మా అందరిలాగానే - రెండవ క్లాసు రైలు టిక్కెట్లు కొన్నాను. కాకపోతే బల్లపై చిన్న పరుపువేసి, మెత్తని దిండ్లు పెట్టి సుఖంగా ప్రయాణం చేయటానికి ఆయనకు కల్పించాను. ఆయన నన్ను రెండవ క్లాసులో ఎందుకు ప్రయాణం చేయిస్తున్నావని అడగలేదు. ఆ ప్రస్తావన తీసుకొని రాలేదు. అప్పుడు ఆయన గొప్పదనాన్ని గ్రహించాను. ఆయనకు 'బూర్జువా' మనస్తత్వం లేదని, ఆయన సహృదయుడని తేలింది. ఆయనను (అప్పటికి ఆయన వయస్సు సుమారు 65 సంవత్సరాలు) పరీక్షించ సమకట్టినందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను.

ఒంగోలులో డా॥ కోవూరు సభను స్థానిక కమ్యూనిస్టులు నిర్వహించారు. విశాఖ పట్టణంలో నాస్తిక సమాజం వారికి, ఒంగోలులో కమ్యూనిస్టులకు ఖర్చులు పోగా వారికి అదనంగా నిధులు మిగిలాయి. 1974లో వరంగల్‌లో తప్ప ఏ వూరి సభలలోను ఎప్పుడూ ప్రవేశ రుసుము వల్ల వచ్చే పైకం ఖర్చులకు చాలక పోవటం జరుగలేదు. నిర్వాహకులు స్థానిక కార్యక్రమాలు సాగించటానికి అనువుగా వారికి అదనపు పైకం వారి చేతులలోకి వచ్చింది. 1976 నాటికి మత వాసన లేని వర్గాలన్నీ డా॥ కోవూరు పర్యటనలను ఆహ్వానించాయి. విజయవంతం చేశాయి. అలా చేయటం తమ కనీస ధర్మంగా వారందరూ భావించారు.

డా॥ కోవూరు కేవలం ఆంధ్రప్రదేశ్‌ను సందర్శించటంతో సరిపెట్టుకోలేదు. వారు ఇతర రాష్ట్రాలలో పర్యటించి హేతువాద దృష్టిని, వైఖరిని, ఆలోచనా రీతిని పెంపొందింప చేశారు. తమిళనాడు, కేరళ, కర్నాటక, గుజరాత్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో సభలలో మాట్లాడారు. తమ బృందం చేత ఇంద్రజాలిక, 'హిప్నటిస్టు' ప్రదర్శనలు చేయించారు. భారతదేశంలో హేతువాదానికి గౌరవ స్థానాన్ని, ప్రాచుర్యాన్ని కల్పించిన ఘనత ఆయనకు దక్కింది. భారతదేశంలో ఇతర ఉద్యమాల సరసన హేతువాద ఉద్యమాన్ని నిల్పిన గౌరవం ఆయనకు లభించింది.

డా॥ కోవూరు ప్రసంగాలను అన్ని రాష్ట్రాలలో దిన పత్రికలు ప్రముఖంగా ప్రకటించాయి. ఆయన పుస్తకాల పేర్లు ప్రజలకు బాగా పరిచయమయినాయి. ఇందులో 'బిగాన్ గాడ్స్' అనేది ముఖ్యమయినది. 'దేవుళ్ళా! మీరు వెళ్ళిపోండి' అనేది ఆ పుస్తక శీర్షిక. దేవుళ్ళకు, దయ్యాలకు అస్తిత్వం లేదని, అవి భ్రమజనిత రూపాలని ఆయన సోదాహరణంగా, అధికారికంగా రుజువు చేశాడు. కరుడుకట్టిన దైవ భక్తుల మనస్సుల్లో కూడా ఆయన సందేహ బీజాలను నాటగల్గాడు. అంతకు క్రితం వారికున్న విశ్వాసాల సౌధాలు బీటలు బారాయి. బాబాల మోసాలను బట్టబయలు చేయటంలో ఆయన ఒక వ్యూహం ప్రకారం కృషి చేశాడు. బాబాలలో పెద్ద ధనవంతుడు, పేరుగలవాడు, ప్రబలుడు అయిన పుట్టపర్తి సత్యసాయి బాబాను తన పోరాటానికి ప్రధాన లక్ష్యంగా ఎన్నుకున్నాడు. ఆయన హస్తలాఘవ విద్యచేత 'భక్తులకు' గడియారాలు యిస్తుంటే ''గడియారాలు కాదు గుమ్మడి కాయలు యివ్వండి'' అని సవాలు చేశాడు. 'నీరును సత్యసాయి బాబా పెట్రోలుగా మార్చాడనే' కథను ఉటంకించి ''బంగాళా ఖాతపు నీరును ఆయన పెట్రోలుగా మారిస్తే దేశానికి పెట్రోలు కరువు పోతుంది కదా! దేశ ఆర్థిక స్థితిగతులు మెరుగుపడతాయి కదా!'' అని ఎద్దేవా చేశాడు. డా॥ కోవూరు హాస్యం, వ్యంగ్యం వాటికవే సాటి. పైకి మార్దవంగా, సున్నితంగా వుంటాయి కాని వారి పోకడ, ప్రహరణాలు అనన్య సామాన్యం. వాటికి గురి అయినవారు సహితం బాధ పడకుండా నవ్వగలిగేవారు. హేతువాద ఉద్యమ ప్రారంభకులు, స్థాపకులు మేధావులుగా చలామణి అయితే డా॥ కోవూరు హేతువాద ఉద్యమాన్ని సామాన్య ప్రజానీకానికి చేరువ చేశారు.

ఆంధ్రలో డా॥ కోవూరు పర్యటన ఫలితంగా విజయ వాడనుండి 'చార్వాక' మాసపత్రిక వెలువడింది. దాని సంపాదకుడు, స్వంతదారు విజయవాడలోని బ్యాంకు ఉద్యోగి శ్రీ తోటకూర వెంకటేశ్వర్లు. డెమ్మీ సైజులో సుమారు 32 పుటలతో

అది వెలువడేది. అందులో డా॥ కోవూరు ప్రసంగాలు, పుస్తక భాగాల అనువాదాల ప్రచురితం అయ్యేవి. అనేకమంది మేధావులు వ్యాసాలు రాసేవారు. మిత్రుడు తోటకూర వెంకటేశ్వర్లు - అతడు హ్యూమనిష్టు - చిన్న చిన్న సంపాదకీయాలు రాసేవాడు. ఇన్ని సంవత్సరాలుగా 'గాఢ నిద్రలో' వున్న ఆలోచనాపరులు ఒక్కసారిగా జాగృతులయి పుంఖాను పుంఖాలుగా వ్యాసాలను రాయుచున్నారు. 'హేతువాది' తెలుగు మాసపత్రిక సంపాదకుడు, ఈనాడు భారత హేతువాద సంఘాధ్యక్షుడు, హేతువాద ఉద్యమ సంచాలకుడు, సిద్ధాంత ప్రచారకుడు అయిన శ్రీ రావిపూడి వెంకటాద్రి అలాంటి వారిలో ఒకడు. పత్రిక ప్రతులు పదివేల దాకా అచ్చు అయ్యేవి. ఆంధ్రదేశమంతటా ప్రతి కిల్లీ బడ్డీలోనూ దొరికేవి. పత్రిక కోసం పాఠకులు ఎదురు చూసేవారు. అలా సుమారు 4. 5 సంవత్సరాలు నడిచిన పత్రిక పడిపోయింది. దానికి కారణం మిత్రుడు తోటకూర వెంకటేశ్వర్లు యొక్క నిర్లక్ష్య ధోరణి. ప్రతులు అమ్మగా వచ్చిన పైకాన్ని తమ కమిషను పోను పత్రిక విక్రయదారులు 'చెక్కులు' పంపితే వాటిని బ్యాంకుకు పంపించే సమయం అతనికి దొరికేది కాదు. అవి అలాగే పడి వుండేవి. ఎప్పటికప్పుడు అప్పులు చేసియో, కుటుంబ ధనాన్ని వెలికి తీసియో, ఇంట్లో వారి సొమ్ములు తాకట్టు పెట్టియో అచ్చు ఆఫీసువారి బిల్లులు చెల్లించేవాడు. పత్రిక వెలుగు చూచేది. కాని బిల్లులు చెల్లించక అప్రతిష్ట పడలేదు. అతని ధనం, సొత్తు హారతి కర్పూరం అయిపోయినయి. హేతువాద ఉద్యమానికి వ్యాప్తి కలిగించటంలో అతని కృషి పేరెన్నిక కన్నది. ఉద్యమాలలో ఎంతమంది తమ జీవితాలను, సంపాదనను, ఆస్తులను హరింప చేసుకుంటే అవి వృద్ధి పొందుతున్నాయో! విజయవాడలో యిప్పటికీ నివసిస్తూ నిరంతర కార్యశీలిగా వుంటున్న తోటకూర వెంకటేశ్వర్లు ధన్యజీవి.

ఒక్క విషయాన్ని గురించి ముచ్చటించక తప్పదు. డా॥ కోవూరుకు ఎంతగా పేరు ప్రఖ్యాతులు వస్తే అంతగా శత్రువులు, విమర్శకులు ఉద్భవిల్లారు. అసలు ఆయనకు డాక్టరేటు డిగ్రీ రాలేదని వ్యాసాలు వెలువడినయి. 'ఏ విశ్వ విద్యాలయం ఆయనకు డాక్టరేటు డిగ్రీ యిచ్చిందని' ప్రశ్నించడం జరిగింది. తర్జన భర్జనలుచేసి, ఏ ప్రభుత్వం చేత గుర్తింపబడిన విశ్వ విద్యాలయం ఆయనకు పట్టా ప్రదానం చేయలేదని తేల్చారు. చివరకు విశేష దర్యాప్తు ఫలితంగా అమెరికాలోని 'మినిసోటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిలాసఫీ వారు' ఆయనకు ఆ డిగ్రీని గౌరవ పురస్కారంగా యిచ్చారని తేలింది. ఇంత గొడవ చేసి 'కొండను త్రవ్వి ఎలుకను పట్టిన' కేరళ రోమన్ కాథలిక్ మతస్థులు సంతోషంతో ఎగిరి గంతేశారు. ఒక విచిత్రం. డా॥ కోవూరు విద్వత్తును ఎవరూ శంకించలేదు. భౌతిక, రసాయనిక, వృక్ష, మానసిక, తాత్విక శాస్త్రాలలో ఆయన పాండిత్యాన్ని ఎవరూ కాదనలేరు. కాకపోతే వారు సర్వ సాధారణంగా ఆమోదించే డిగ్రీ ఆయనకు లేదని నిర్ణయించి వారు ఊరట చెందారు. జ్ఞాన సంచయాన్ని డిగ్రీలతో కొలిచే యీ ప్రపంచపు పోకడే అది! ప్రపంచంలోని ఆరుగురు జీవ శాస్త్రజ్ఞులలో ఒకడుగ వున్న జె.బి.ఎస్. హాల్డేన బి.ఎస్‌సిలో ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ప్రపంచ గణిత శాస్త్రజ్ఞులను తికమక పెట్టిన సమస్యలకు జవాబులను కనుగొన్న రామానుజం బి.ఎ. కోర్సులో చేరలేదు. నవ్య మానవ వాద సిద్ధాంత కర్తగా భాసిల్లిన ఎం.ఎన్. రాయ్ విశ్వ విద్యాలయంలో

అడుగిడ లేదు. దీనివలన వారికి నష్టం కలుగలేదు. కాకపోతే సామాన్య ప్రజానీకం తాము నిర్మించుకున్న పాలెగూళ్ళలో కాపురం చేస్తున్నది. ఈనాడు కుప్పలు తెప్పలుగా వస్తున్న డాక్టరేటు సిద్ధాంత వ్యాసాలు (థీసెస్‌లు) చూసి అయినా సమాజం వివేకాన్ని సంతరించుకుంటుందా?

# రైల్వే సమ్మె/కలకత్తా రాడికల్ హ్యూమనిస్టు మహాసభ(1974)

నేను విజయవాడలో కాపురం వుంటున్నప్పుడు అఖిల భారత రైల్వే సమ్మె జరిగింది. అంతకు క్రితం అప్పటికి సుమారు 10 సంవత్సరాల క్రిందట, అఖిల భారత పోస్టల్ ఉద్యోగుల సమ్మె జరిగింది. అప్పుడు నేను బాపట్లలో కాపురం వుండేవాడ్ని. ఉద్యోగులు సమ్మెకు అనుకూలంగా బ్యాలెట్టు ద్వారా నిర్ణయించారు. కాని ప్రభుత్వపు దమననీతిని తట్టుకోలేక పోయారు. ఆ సమ్మె విఫలమయింది.

1974లో వచ్చిన రైల్వే సమ్మె నూతన వాతావరణంలో సంభవించింది. మొదట్లో సమ్మె సంపూర్ణంగా విజయవంతం అయింది. భారత ప్రభుత్వం ఆందోళన చెందింది. సమ్మెను భగ్నం చేయాలని ప్రయత్నించసాగింది. అక్రమ అరెస్టులకు, బెదిరింపులకు దిగింది. చాలామంది రైల్వే ఉద్యోగులు ఇళ్ళు వదలి కనిపించకుండా దాగుకొన్నారు. వాళ్ళను వెదకి పట్టుకోవడం ప్రారంభించారు పోలీసులు. పోలీసు స్టేషనులలో నిర్బంధించసాగారు. పోలీసుల అక్రమ చర్యలు ప్రజలను కలవరపరచసాగాయి. పలు ప్రదేశాల్లో ప్రజా కమిటీలు అప్పటికప్పుడు ఉద్భవించాయి. పోలీసుల అక్రమ చర్యలను వెలికి తీయడానికి, రైల్వే ఉద్యోగుల ధృతిని కాపాడటానికి పూనుకున్నాయి. అలాగే విజయవాడలో ప్రజా కమిటీ పుట్టింది. అందులో ప్రజారోగ్యాల డాక్టర్లు, ఆంధ్ర మహిళా సంఘ నాయకులు శ్రీమతి మోటూరు ఉదయం, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ ముఖ్య కార్యకర్త ఆంధ్ర న్యాయవాద కార్యాచరణ సమితి మాజీ కార్యదర్శి, అడ్వకేటు శ్రీ గొట్టిపాటి మురళీ మోహన్, నేను తదితరులం సభ్యులం. ప్రతి దినం రైల్వే కాలనీలకు వెళ్ళడం, ఉద్యోగుల కుటుంబాలను పరామర్శ చేసి వారికి ధైర్యం చెప్పడం, ఎవరినయినా రైల్వే ఉద్యోగులను పోలీసులు పట్టుకుని వెళ్ళారని తెలిస్తే వారిని అట్టే పెట్టిన పోలీసు స్టేషనులకు వెళ్ళి వాకబు చేయడం మేము నిర్ణయించుకున్న విధులు. ఒకసారి రైల్వే క్వార్టర్సులో మా కమిటీ వారు తిరుగుతుంటేను ఒక రైల్వే ఉద్యోగిని పోలీసులు అక్రమంగా – అరెస్టు చేయకుండా – తీసుకుని వెళ్ళారని తెలిసింది. హుటాహుటిన ఆ పోలీసు స్టేషన్‌కు వెళ్ళాం. సబ్ ఇన్‌స్పెక్టర్ లేడు. ఉన్నతాధికారులు లేరు. హెడ్ కానిస్టేబుల్ మాత్రం వున్నాడు. ఎవరినయినా రైల్వే ఉద్యోగిని మీరు తీసుకొని వచ్చారా అని అతనిని మర్యాదగా అడిగాం. వెంటనే 'అలాంటిదేమీ జరగలేదు' అని జవాబిచ్చాడు. కాని అతని ముఖంలో కలవరం కన్పించింది. అతడు అసత్యం ఆడుతున్నాడని మాకు అనుమానం కలిగింది. అతనితో మాట్లాడుతూనే స్టేషనులో వున్న లాకప్ గదుల వైపుకు నడిచాం. బ్రాంచి యూనియను నాయకుడు రైల్వే ఉద్యోగి కంట్ల పడ్డాడు. అతనిని గుర్తించాం. మమ్మల్ని చూచి బంధితుడు చిరునవ్వు నవ్వాడు. అప్పుడు శ్రీమతి ఉదయం హెడ్ కానిస్టేబులును ముక్క చీవాట్లు పెట్టింది. ఇలాంటి అబద్ధపు జీవితం బ్రతికేటేనేం, చస్తేనేం అని అతనిని దుయ్యబట్టింది. మేము స్టేషను వదిలి వెళ్ళే వరకు అతడు తలెత్తి మమ్ములను చూడలేదు. వెంటనే కమిటీ తరఫున

పత్రికా ప్రకటనను ఇచ్చాం. పత్రికలు ప్రకటనను ప్రముఖంగా ప్రచురించాయి. దాంతో రైల్వే కార్మికులను అక్రమంగా నిర్బంధించటం, చీకాకు పరచటం, బెదరించటం విజయవాడలో ఆగిపోయింది.

రైల్వే సమ్మె జరుగుతున్నందున 1974 డిసెంబర్‌లో కలకత్తాలో జరిగే అఖిల భారత హ్యూమనిస్టు మహాసభకు నేను వెళ్లతలచలేదు. 'సమ్మె విరమణ జరిగింది. కలకత్తా మహాసభకు రావలసింది' అని ఢిల్లీ నుండి అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాధ్యక్షుడయిన వి.ఎం. తార్కుండే నుండి టెలిగ్రాం వచ్చింది. వెంటనే కలకత్తాకు ప్రయాణం కట్టాను. రిజర్వేషను సౌకర్యం లేకపోయినా కలకత్తా చేరాను. మహాసభలో అప్పుడే కేంద్ర శాసనసభలో ఆమోదించబడిన 'విదేశీ ధన సహాయ క్రమబద్ధీకరణ శాసనం' చర్చకు వచ్చింది. విదేశీ ప్రభుత్వాల నుండి, విదేశీ ధర్మ సంస్థల నుండి, విదేశాలలోని వ్యక్తులనుండి భారతదేశంలోని వ్యక్తులకు, సంస్థలకు వచ్చే నిధులను స్వీకరించేవారు భారత ప్రభుత్వానికి నిర్ణీత సమయాలలో తెలియజేయాలని ఆ శాసనం నిర్దేశిస్తున్నది. హ్యూమనిస్టు సంఘ కార్య నిర్వాహక వర్గ నిర్మాణం చర్చకు వచ్చింది. చీరాలకు చెందిన మిత్రుడు బచ్చు వెంకటేశ్వర్లు పేరును నేను ప్రతిపాదించాను. అతను 'యువకుడు కదా' అని తార్కుండే అన్నాడు. అంతకు క్రితమే ఢిల్లీకి చెందిన వినోద్ జైన అనే యువకుని కార్య నిర్వాహక వర్గ సభ్యునిగా ఎన్నుకోమని తార్కుండే సూచించాడు. అందరం అంగీకరించాము. ఇదంతా నా మనస్సులో వుంది. వెంటనే 'వినోద్ జైన వయస్సులో చిన్నవాడే కదా?' అని అన్నాను. నా మాటలోని అర్థాన్ని గ్రహించి తార్కుండే వెంకటేశ్వర్లు పేరును కార్య నిర్వాహక వర్గ సభ్యుల జాబితాలో చేర్చాడు. నేనుగాక అలా యడ్లరిని, మిత్రులు ఇన్నయ్య, బచ్చు వెంకటేశ్వర్లును హ్యూమనిస్టు సంఘ కార్య నిర్వాహక వర్గంలో చేర్పించగలందులకు సంతసించాను.

వినోద్ జైన తరువాత అఖిల భారత హ్యూమనిస్టు యువజన సంఘానికి అధ్యక్షునిగా వ్యవహరించి యిప్పుడు తార్కుండే సంపాదకత్వాన ఢిల్లీ నుండి ఆంగ్లంలో వెలువడే 'రాడికల్ హ్యూమనిస్టు' పత్రికను అచ్చువేస్తున్నాడు. అతని తండ్రి కీర్తిశేషుడు విమల్ జైన్ ఎం.ఎన్. రాయ్ సహచరుడు. ఆ కుటుంబం ఎం.ఎన్. రాయ్ ఉద్యమంలో సన్నిహిత సంబంధం కలిగి వున్నది. బచ్చు వెంకటేశ్వర్లు అకాల మరణం చెందకుండా వుంటే తెలుగుదేశంలో హ్యూమనిస్టు ఉద్యమానికి పట్టుకొమ్మగా వుండేవాడు. ఆ అవకాశం లేకుండా పోయింది.

హ్యూమనిస్టు ఉద్యమం తెలుగునాట బలపడాలని, చిత్తశుద్ధి, పట్టుదల, కార్యదీక్ష, సమర్థత వున్నవారికి బాధ్యతాయుతమైన పదవులిస్తే వారు తాము ఎదిగి ఉద్యమానికి ఎంతో సేవ చేయగలరని, దాని వ్యాప్తికి తోడ్పడగలరని నా అచంచల విశ్వాసం. అందుకు కృషి చేయటంలోనే నాకు సంతోషమూ తృప్తీ యిమిడి వుండేవి

# జనతంత్ర సమాజ్
# (పి.ఎఫ్.డి) ఆవిర్భావం

జయ ప్రకాష్ నారాయణ్ 1934లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వ్యవస్థాపకులలో ముఖ్యుడు. ఆనాడు మియా మసానీ (ఈనాడు లిబరల్ ఉద్యమ నాయకుడు. రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యులలో యిప్పటికీ జీవించివున్న కనిష్ఠుడు. లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ కార్యక్రమ వ్యవస్థాపకుడు) కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి. ఆ రోజుల్లో జయప్రకాష్ నారాయణ్, ఆచార్య నరేంద్ర దేవ్, లోహియా, అచ్యుత పట్వర్ధన్, అశోక్ మెహతా, మియా మసానీ సోషలిస్టు నాయకులుగా చలామణీ అయ్యేవారు. 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమపు రోజుల్లో జయప్రకాష్ అజ్ఞాతవాసంలో వుండి రహస్య జీవితం గడుపుతూ ప్రతిఘటనోద్యమాన్ని నడిపాడు. అతని పేరు ప్రఖ్యాతులు మిన్నుముట్టాయి. జయప్రకాష్ నారాయణ్ పట్ల ప్రథమ భారత ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ గౌరవ భావాన్ని ప్రదర్శించేవారు. స్వాతంత్ర్యానంతరం అశోక్ మెహతా 'సహకార సూత్రాన్ని' రూపొందించాడు. అంటే కొన్ని విషయాలలో సోషలిస్టులు కాంగ్రెసు ప్రభుత్వంలో సహకరించాలని దాని అర్థం. నెహ్రూతో సహకరించి జయప్రకాష్ నారయణ్ ఉప ప్రధాని కావాలని వాంఛిస్తున్నట్లు కనిపిస్తుందని లోహియా ప్రకటించాడని ఆనాడు అనుకున్నారు. జయప్రకాష్ మనస్సుకు కష్టం వేసింది. అతడు సోషలిస్టు పార్టీ నాయకత్వం నుండి వైదొలిగాడు. వినోబా భావే ప్రారంభించిన సర్వోదయోద్యమంలో చేరాడు. భూదానోద్యమంలో కృషిచేశాడు. అలా యించుమించు 1972 దాకా సర్వోదయ ఉద్యమ నాయకుడుగా వున్నాడు. దేశం అల్లకల్లోలంగా వుంది. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా అవినీతిపరులను రక్షిస్తుందని అతడు భావించాడు. అసహనంతో కుమిలిపోతున్న ఇతర సర్వోదయ నాయకులతో సంప్రదించాడు. ప్రజాజీవితంలోకి యింకా చొరవతో వచ్చి ప్రజా సమస్యలను చేపట్టదలచాడు. హ్యూమనిస్టు ఉద్యమ నాయకుడు తార్కుండే సహకారాన్ని కోరాడు. హ్యూమనిస్టుల తోడ్పాటును ఆయన ఆశించటానికి కారణాలు లేకపోలేదు. హ్యూమనిస్టులు, సర్వోదయవాదులు ఇరువురూ పార్టీరహిత వ్యవస్థను ఆశిస్తున్నారు. ఆదర్శం, మార్గం రెండూ మంచివిగా వుండాలని ఇరు వర్గాలు ఆకాంక్షిస్తున్నారు. అంతేకాక ఈ రెండు ఉద్యమాల వారు అధికారానికి దూరంగా వుంటున్నారు. నీతిగా జీవించడంపై నొక్కి పెడుతున్నారు. తార్కుండే జయప్రకాష్ ప్రతిపాదనను తన సహచరుల ఎదుట వుంచుతానని చెప్పాడు. అలా యీ విషయాన్ని హ్యూమనిస్టులు చర్చించాలని కోరాడు. సుమారు రెండు సంవత్సరాలు రెండు అధ్యయన శిబిరాలలో చర్చించారు. వీరిలో కొందరు జయప్రకాష్ నారాయణతో కలిసి పనిచేయడాన్ని వ్యతిరేకించారు. అతను సూటిగా ఆలోచించ లేడని, విషమ సమస్య ఎదురయినప్పుడు వక్రమార్గాన నడుస్తారని, గతంలో అలాంటి సన్నివేశాలు చాలా వున్నాయని, 1939 త్రిపుర కాంగ్రెస్ మహాసభలో బెంగాలు ప్రతినిధుల ఆకతాయి చేష్టలకు జడిసి అసలు విషయాన్ని విస్మరించి సోషలిస్టుల చేత తాటస్థ్యం వహింప

చేశారని, సహచరుల మీద అలిగి సోషలిస్టు ఉద్యమాన్ని విడనాడి పోయాడని, జాతీయవాద మనస్తత్వాన్ని ఆయన వీడలేదని, ఎంతో కాలం మితవాద సర్వోదయ శిబిరంలో కాలం వెళ్ళబుచ్చాడని వారు ఆరోపించారు. తతిమ్మా వారం యీ ఆరోపణలను కాదనలేదు. అయితే 'ఆయన మారారు. ఆయన పూర్వపు జయప్రకాష్ కాదు. ఈనాడు ప్రజానీకపు సమస్యలను ఆయన చేపట్టబోతున్నప్పుడు మనం ఆయనకు చేయి అందించక పోవటం అపచారం' అని మేము వాదించాము. తార్కుండే, దరు, దాణే, నేను అందరం జయప్రకాష్‌తో సహకరించటానికి సమ్మతించాము.

1974 ఏప్రిల్‌లో ఢిల్లీలో భావ సారూప్యం కలవారం మహాసభలో సమావేశమయినాం. ఆచార్య కృపలానీ మహాసభను ప్రారంభించారు. గాంధీ ప్రతిష్ఠాన్ హాలు క్రిక్కిరిసిపోయింది. చోటులేక చాలామంది హాలు బయట ఖాళీ స్థలంలో నిలబడ్డారు. పార్టీలతో నిమిత్తం లేకుండా ప్రజా సంక్షేమానికి పాటు పడడానికి ఒక సంఘాన్ని నిర్మించటానికి నిశ్చయమయింది. నిబంధనావళిని రూపొందించడానికి, కార్యక్రమాన్ని తయారు చేయటానికి ఉప సంఘాలను నిర్మించారు. నిబంధనావళి ఉప సంఘానికి దరు అధ్యక్షులుగా వ్యవహరించారు. దరు అహమ్మదాబాద్‌లో అడ్వకేటు. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రోజుల నుండి ఎం.ఎన్. రాయ్ సహచరుడు; అనుచరుడు. కార్మిక నాయకుడు. అదనంగా తార్కుండేకు అనుంగు స్నేహితుడు. కార్యక్రమ సంఘ ఉప సంఘంలో నేను నియమింపబడ్డాను. ఉప సంఘాల సమావేశాలు జరుగుతున్న సమయంలో జయప్రకాష్ తార్కుండేతో కలిసి హాలులోకి వచ్చారు. ''తార్కుండే! అన్ని కమిటీలను మీవాండ్లతోనే నింపివేయకు'' అని నవ్వుతూ అన్నారు. 'అలాగే' అన్నారు తార్కుండే. కార్యక్రమ తీర్మానాన్ని రూపొందించే అవకాశం నాకు కలిగింది. ఉప సంఘాల నివేదికలు మహాసభ బహిరంగ సమావేశం ముందుకు వచ్చాయి. వాటిని మహాసభ ఆమోదించింది. సంఘానికి రెండు పేర్లు పెట్టారు. ఆంగ్లంలో 'సిటిజన్సు ఫార్ డెమొక్రాట్' అని, హిందీలో 'జనతంత్ర సమాజ్' అని పిలవడానికి నిశ్చయించారు. బహుళ ప్రభావం కల ప్రజాస్వామ్యం (ప్లూరలిస్టు డెమొక్రసీ) ఆదర్శం కనుక సంఘం పేరు ఆదర్శానికి ప్రతీకగా వుండాలని 'ప్రజాస్వామ్యాన్ని ఆశించే పౌరుల సంఘం' (సిటిజన్సు ఫార్ డెమొక్రసీ) అని పేరు పెట్టడం జరిగింది.

జనతంత్ర సమాజ్‌కు ఒక జాతీయ సమితిని ఏర్పరచారు. ఆ సమితిలో నాకు స్థానం లభించింది. అనేకమంది హ్యూమనిస్టులు, మినూ మసానీ లాంటి ఉదారవాదులు (లిబరల్స్), సర్వోదయ వాదులలో సర్వశ్రీ సిద్ధరాజ్ దద్దా, ఠాకూర్ దాస్ భంగ్, గోవింద్ దేశపాండేలు ఇతర సభ్యులలో ప్రసిద్ధులు. జనతంత్ర సమాజ్‌కు దక్షిణ ప్రాంత 'ఆర్గనైజరు'గా నన్ను నియమించారు. క్రొత్తగా వచ్చిన బాధ్యత నన్ను ఉత్తేజితుడిని చేసింది. కార్యోన్ముఖుడిని చేసింది.

# లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ శిబిర కార్యక్రమం

1974 సెప్టెంబరులో అనుకుంటాను జనతంత్ర సమాజ జాతీయ సమితి సమావేశం బొంబాయిలో జరిగింది. ఆ సమావేశం అయిపోగానే దక్షిణాదిన లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ శిబిరాల నిర్వాహకుడుగా వున్న శ్రీ గాదె హనుమంతరావును శ్రీ మినూ మసానీ పిలిచి కేరళలో జరిగే శిబిరాలకు నన్ను ఉపన్యాసకుడుగా పిలవమని, అధ్యాపకునికి యిచ్చే గౌరవ భృతితో రామ్మూర్తి, కేరళ పర్యటించటానికి వీలు కల్పిస్తుందని చెప్పాడు. ఆయన అంగీకరించాడు. నేను కేరళలో 1974లోజరిగిన శిబిరంలో రెండు ఉపన్యాసాలు యిచ్చాను. నాకు చెల్లించబడిన గౌరవ భృతిని (ఆనరేరియం) వాడి కేరళ రాష్ట్రాన్ని పర్యటించి జనతంత్ర సమాజ్‌లో చేరి పనిచేయటానికి కావలసిన కార్యకర్తలను ఎంపిక చేసే ప్రయత్నం చేశాను.

లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ శిబిరం అనగానే నాకు ఆ ఉద్యమంతో వున్న అనుబంధం, సంబంధం జ్ఞాపకం వస్తున్నది. శ్రీ మినూ మసాని కాంగ్రెసు సోషలిస్టు నాయకుడిగా వుండేవాడని రాశాను కదా. ఆయన కమ్యూనిస్టు సిద్ధాంత వ్యతిరేకి. కమ్యూనిస్టు పార్టీ చరిత్ర రాశాడు. కమ్యూనిస్టుల సిద్ధాంతాన్ని, వ్యూహాలను, ఎత్తుగడలను కూలంకషంగా అధ్యయనం చేసి, అర్థం చేసుకున్న వ్యక్తి. కమ్యూనిజం ప్రజాస్వామ్య సిద్ధాంతానికి, వ్యవస్థకు చుక్కెదురని ఆయన విశ్వాసం. కమ్యూనిస్టుల పరిభాషలో ఆయన 'కమ్యూనిస్టు వ్యతిరేకి' (ఆంటి కమ్యూనిస్టు) కమ్యూనిస్టు వ్యతిరేకత 'మహాపాపమయినట్లు' ఆరోజుల్లో కమ్యూనిస్టులు ప్రచారం చేసేవారు. వారి దృష్టిలో 'కమ్యూనిస్టు వ్యతిరేకి' అంటే ప్రగతి నిరోధకుడు అన్నమాట. ఆ పదజాలాన్ని ఇంచుమించుగా, నిందావాచకంగా వాడేవారు.

మిత్రుడు గాదె హనుమంతరావు (ఆయన యిప్పుడు లేరు) కాంగ్రెసు సేవాదళ్‌లో పనిచేసిన వ్యక్తి. మొదట్లో ఆచార్యరంగా గారి అనుచరుడయి, కాంగ్రెసు సేవాదళ్‌కు ఆంధ్రలో 'కమాండరు' అయి స్వతంత్రపార్టీ అవతరించిన తరువాత ఆంధ్ర స్వతంత్ర పార్టీకి ప్రధాన కార్యదర్శి బాధ్యతలను చేపట్టిన వ్యక్తి. శ్రీమాన్ సి. రాజగోపాలాచారి, ఆచార్యరంగా, శ్రీ మినూ మసాని భారతదేశంలో స్వతంత్రపార్టీ వ్యవస్థాపకులని ప్రత్యేకంగా పేర్కొనవలసిన అగత్యం లేదనుకుంటాను. అలా శ్రీ మినూ మసానీతో మిత్రుడు గాదె హనుమంతరావుకు పరిచయం కలిగింది. దక్షిణాదిన లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ శిబిర నిర్వహణ బాధ్యతను ఆయన చేపట్టటానికి అదే దారి తీసింది. ఆనాడు ఆంధ్రలో కమ్యూనిస్టులు ప్రబలంగా వుండటంతో, ప్రజాస్వామ్య శిక్షణ శిబిరాల ఆవశ్యకత తతిమ్మా రాష్ట్రాలకంటె ఆంధ్రకు ఎక్కువ అవసరమని మసానీ గారు భావించటంతో గాదె హనుమంతరావు గారిని ఆపదవికి ఎంపిక చేయటం తప్పనిసరి అయింది. కాంగ్రెసు, సోషలిస్టు కమ్యూనిస్టు పార్టీలు శిబిరాలలో పరిచయం చేసి,

తెలియజెప్పి, వారిని తమ పార్టీలకు అండగా నిలబడకల కార్యకర్తలుగా మలుచుకోవడాన్ని తన సుదీర్ఘ రాజకీయ జీవితంలో గమనించిన మసానీ ప్రజాస్వామ్యానికి అలాంటి శిక్షణ తరగతులు అవసరమని గ్రహించాడు తన మిత్రుడు లెస్లీ సహాని చనిపోతే అతని భార్య, స్నేహితులు ఒనగూర్చిన ధనంతో 'లెస్లీ సహాని ప్రజాస్వామ్య శిక్షణ శిబిర' కార్యక్రమాన్ని రూపొందించాడు వాటిని నడిపే సంఘానికి మసానిగారే చోదక శక్తి అధ్యక్షుడిగా నానీ ఫల్కీవాలా యీనాటి ప్రఖ్యాత రాజ్యాంగ నిపుణుడయిన లాయరు వుండేవారు

ప్రతి శిబిరం 9 రోజులపాటు జరిగేది శిబిరానికి వచ్చేవారు శిబిరంలో అన్నిరోజులు వుండవలసి రావటం ఉదయం, మధ్యాహ్నం తరగతులు నిర్వహింపబడటం, మామూలుగా అన్ని శిబిరాలలో వున్నట్లుగానే సాగేది శిక్షణకు వచ్చేవారి వృత్తులను బట్టి, వ్యావృత్తులను బట్టి ఒక్కొక్క శిబిరం ఒక్కొక్క వృత్తి వారికి కేటాయించేవారు విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, కార్మికోద్యమంలో ఆసక్తి, ప్రవేశం కలవారికి, రైతులకు, ప్రజా ప్రతినిధులకు ఎం ఎల్. ఏ. లకు 'విడివిడిగా శిబిరాలను నిర్వహించేవారు శిబిరాలలో శిక్షణకు వచ్చేవారందరికి ప్రజాస్వామ్యాన్ని గురించిన విషయాల అధ్యయనం తప్పని సరి అంటే 9 రోజులలో అధ్యయనాంశాలు 26 వుంటే 13 ప్రజాస్వామ్యానికి సంబంధించినవి ప్రజాస్వామ్య పోకడలు, భారత రాజ్యాంగం, మౌలికహక్కులు రాజ్యాంగంలో పొందుపరచబడిన ప్రాధమిక హక్కులు, కేంద్ర రాష్ట్ర సంబంధాలు, ప్రజాస్వామ్యంలో పత్రికల స్థానం ఇలాంటివి విధిగా అధ్యయనం చేయవలసిన విషయాలు శిబిరానికి ఆహ్వానింపబడిన శిక్షితుల వర్గీకరణ స్వభావాన్ని బట్టి మిగతా విషయాలు వుండేవి అంటే విద్యార్థులు అధ్యాపకులు. కార్మికోద్యమ కార్యకర్తలు, రైతులు, వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు ఇలా వివిధ వృత్తులు, వ్యావృత్తులు కలవారికి ఆసక్తిదాయకమయిన వారి వారి సమస్యల, విషయాల అధ్యయనం వుండేది పౌరులందరికి ప్రజాస్వామ్య యెడ ఆసక్తి, అభినివేశం, గౌరవం, రాగం పెంపొందింప చేయాలని కార్యక్రమ నిర్వాహకుల ఆదర్శం ఫలాని పార్టీలో చేరమనే ఉద్బోధ వుండేది కాదు పార్లమెంటరీ ప్రజాస్వామ్య యెడ అనురక్తిని పెంచాలనే తాపత్రయం మాత్రం వుండేది కమ్యూనిస్టు, ఫాసిస్టు సిద్ధాంతాల యెడ, పార్టీల పట్ల, వారి కార్యక్రమాలను గురించి వైముఖ్యం పెంచడం నిర్వాహకుల లక్ష్యం శిబిరవాసులు తమలో తాము చర్చించుకోవడానికి అనువుగా శిక్షణ వ్యవధిలో కొంత సమయాన్ని కేటాయించేవారు కొన్ని తరగతులను చర్చలకని ప్రత్యేకంగా ఏర్పాటు చేసేవారు అదీగాక రాత్రివేళ శిబిరవాసులు, సర్వసాధారణంగా, ఆనాడు తాము విన్న ఉపన్యాసాలను గురించి మాట్లాడుకునేవారు, ఉపన్యాసకుల ప్రసంగరీతులను విశ్లేషణ చేసేవారు

మొదట్లో గుంటూరు పట్టణంలో, తరువాత గుంటూరు 7 మైళ్ల దూరాన వున్న పేరేచర్లలో, చివరకు విజయవాడలో శిబిరాలు నిర్వహింపబడినాయి 12 సార్లు శిబిరాలు జరిగితే

9 శిబిరాలకు నేను అధ్యయన సంచాలకుడిగా (డైరెక్టరు ఆఫ్ స్టడీస్‌గా) వ్యవహరించానని గుర్తు జిల్లా జడ్జీగా పనిచేసి పదవీ విరమణ చేసిన శ్రీ తేళ్ళ కృష్ణమ్మ ఆంధ్ర విశ్వవిద్యాలయ రిజిస్ట్రారుగా వున్న శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి బొంబాయి మ్యునిసిపలు కమిషనురుగా పనిచేసిన శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి (వారు ప్రఖ్యాత నాటక రచయిత కూడాను) అలా తలా ఒక శిబిరానికి డైరెక్టరుగా వున్నారు పలు విషయాలను తెలుసుకోవటానికి నిష్ణాతుల ఉపన్యాసాలను వినడానికి, అధ్యయనం చేయటానికి అవకాశం వస్తుందని నేను ఆ బాధ్యత స్వీకరించటానికి అంగీకరించాను బహుశః నేను ఏ పార్టీకి చెందని వాడి నవటం వలననో, కమ్యూనిస్టేతరుడిని కావటం వలననో, మద్రాసు నడిచే ప్రథమం ఫస్ట్ 'ముమ్ముందుగా స్వేచ్ఛ' అనే ఆంగ్ల మాసపత్రికకు సంపాదకుడుగా వున్న శ్రీ ఏ ఏ కర్ణిక్ నేను ఒకే ఉద్యమానికి (రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమానికి) చెందిన వారం కావడం వల్లనో, నేను హనుమంతరావుగారు ఇద్దరం గుంటూరు జిల్లాకు చెందినవారం కావటం వల్లనో, శిబిరకాలం 9 రోజులు నేను శిబిరంలో వుండటానికి యిష్టపడటం చేతనో నన్ను డైరెక్టరుగా తరుచుగా ఎంపిక చేసేవారు హనుమంతరావుగారు

లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ కార్యక్రమానికి నేను అందించిన సహాయంకన్నా నేను పొందిన లాభం మిన్న అనేకమంది వర్ధమాన నాయకులతో పరిచయం, ఎందరివో ఉపన్యాసాలు విన్నందువల్ల జ్ఞానాభివృద్ధి, ఉపన్యాసకులను సరిగా ప్రశ్నించటం శిబిరవాసులకు చేతకాకపోతే వీలుకాకపోతే డైరెక్టరుగా ప్రాసంగీకులకు వేయవలసిన ప్రశ్నలు రూపొందించే క్రమంలో విశ్లేషణాశక్తి పెరగడం, ఎందరి యెడలనో సుహృద్భావం, వారి మన్ననలను పొందగల్గడం నాకు లభించిన ప్రయోజనాలు

రాజ్యసభలో తెలుగుదేశం ప్రతినిధిగా రాణించిన డా॥ శివాజీ, చార్వాక సంపాదకుడుగా హేతువాద ఉద్యమానికి మహోత్కృష్టంగా సేవచేసిన తోటకూర వెంకటేశ్వర్లు ఈనాడు వాసోద్దు అనే పేరుగల స్వచ్ఛంద సంస్థ వ్యవస్థాపకుడు శ్రీ ప్రసాద్, ప్రస్తుతం మహిళోద్యమ నాయకురాండ్రలో ఒకరుగా నున్న మల్లాది సుబ్బమ్మ ఏదో ఒక లెస్లీ సహాని ప్రజాస్వామ్య శిబిరానికి హాజరయినవారే

# జె.పి. ఉద్యమం

జనతంత్ర సమాజ్ దక్షిణప్రాంత ఆర్గనైజరుగా 1974లో కేరళ రాష్ట్రాన్ని పర్యటించాను. 11 జిల్లాల ముఖ్య పట్టణాలను దర్శించాను అక్కడ రాజకీయాలంటే విసుగు చెంది రాజకీయాల నుండి వైతొలగిన స్వాతంత్రయోధులను కలిశాను వారితో మాట్లాడటానికి ముందుగా ఫోనులు చేసి సమయం తీసుకొని మాట్లాడాను కొంతమందితో గంటకు పై సంభాషించిన సన్నివేశాలు వున్నాయి. అనాసక్తత, రాజకీయ రంగం అంటే వైమనస్యం వారిలో కొట్టవచ్చినట్లు కన్పించింది ఓపికగా, జాగ్రత్తగా, పట్టుదలగా వ్యవహరించి జిల్లాకొక నిజాయితీపరుని, అకలంక దేశభక్తుని జనతంత్ర సమాజ్‌లో పనిచేయటానికి మరీ ఒప్పించి తిరిగి వచ్చాను సమగ్రమయిన నివేదికను రూపొందించి, వారి చిరునామాల జాబితాను జోడించి డిల్లీలోని కేంద్ర కార్యాలయానికి పంపాను నిజాయితీకల కార్యకర్తల సంఖ్య చాల తక్కువగా వుందని, ఏ పార్టీతోను సంబంధం లేకుండా వున్న వారి సంఖ్య మరీ తక్కువగా వుందని తెలిసింది మామూలుగా ఏ పార్టీకి చెందని వారు మూడు తెగలవారు వుంటారు తమకు నచ్చిన పార్టీ దొరకక ఏ పార్టీలోను చేరకుండా వున్నవారు మొదటిరకం కాగా, పార్టీలో సభ్యులయితే తమ వ్యక్తిత్వానికి భంగం కలుగుతుందని తమ గౌరవ మర్యాదలకు రక్షణ వుండదని భావించి ఏ పార్టీలోను చేరనివారు రెండవ కోవకు చెందినవారు అసలు పార్టీ వ్యవస్థయే పనికిరాదనేవారు మూడవ శ్రేణివారు వీరి సంఖ్య అత్యల్పం ఏదయినా, పై మూడు తరగతులవారు జనతంత్ర సమాజ్‌లో సభ్యులవటానికి అర్హులే పార్టీలలోని సభ్యులు జనతంత్ర సమాజ్‌లో సభ్యులు కావటానికి అభ్యంతరం లేదు కాని అలాంటి వారు జనతంత్ర సమాజ్‌లో, ఏ స్థాయిలో కూడ,అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి, సహాయ కార్యదర్శి, కోశాధికారి వంటి పదవులకు ఎన్నుకోబడటానికి అనర్హులు ఇన్ని పరిమితులతో, దొరకటం ఎంత కష్టమో నాకు కేరళ రాష్ట్ర పర్యటనలో తెలిసి వచ్చింది

జయప్రకాష్ నారాయణ్ గుజరాతు వెళ్లి విద్యార్థి ఉద్యమాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసికొని వచ్చారు బీహారు విద్యార్థి ఉద్యమానికి మద్దతు యివ్వాలని నిశ్చయించారు అవినీతిపైన పోరాటం చేయడానికి ఆయత్తమయ్యారు అవినీతిపరులకు ఆశ్రయం, రక్షణ యిస్తున్నందుకు ఇందిరాగాంధీని తీవ్రంగా విమర్శించారు ప్రజోద్యమం వృద్ధి కాసాగింది భారతదేశంలోని యింకా రాజకీయ స్పృహ కోల్పోని పౌరులు స్పందించటం మొదలయింది జె.పి. ఉద్యమ ప్రభావం వలన తెలుగువారు కూడా యీ ఉద్యమంలో పాలుపంచుకోదలిచారు జె.పి. ఉద్యమ సన్నాహక కమిటి ఏర్పడింది తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు ఆ కమిటి ఒక సమావేశం విజయవాడలో మా ఇంటిలో జరగడం నాకు గర్వకారణం

1975 ఏప్రిల్ నెలలో నేను తమిళనాడు పర్యటించాను అందుకుగాను ఖర్చుల క్రింద

తార్కుండే జనతంత్ర సమాజ్ కేంద్ర సంఘం నుండి నాకు వెయ్యిరూపాయలు పంపించారు. నేను చేపట్టే ప్రజాసేవా కార్యక్రమాలకు ఇతరులనుండి పైకం తీసుకోవటం అదే ప్రథమ పర్యాయం. సుఖంగా ప్రయాణం చేయమని తార్కుండే నాకు సలహా యిచ్చారు. కాని నా మనస్తత్వం వేరుగా ఉండేది. సామాన్యులు ప్రయాణం చేసే తరగతి రైలు పెట్టెలలోనే ప్రయాణం చేశాను. 15 రోజుల పర్యటనకు సుమారు మూడు వందల చిల్లర రూపాయలు మాత్రమే ఖర్చుపెట్టాను. తమిళనాడులోని ముఖ్యపట్టణాలను సందర్శించి జనతంత్రసమాజ్ పట్ల సుహృద్భావం ఉన్న పౌరులను కలిశాను. కార్యకర్తలతో ముచ్చటించాను కేంద్ర సంఘానికి నివేదిక సమర్పించాను జమా ఖర్చుల లెక్కల పట్టికలను అందజేశాను

జె పి ఆంధ్రప్రదేశ్‌లో పర్యటించ నిశ్చయించారు హైదరాబాదు, విశాఖపట్టణం విజయవాడలలో సభలు నిర్వహించడానికి నిర్ణయం జరిగింది విజయవాడలో జె పి ఆహ్వాన సంఘ ఏర్పడింది. దానికి తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షులు. ప్రముఖ న్యాయవాది శ్రీ కె.వి.ఎస్ ప్రసాదరావు, శ్రీమతి మల్లాది సుబ్బమ్మ తదితరులు ఉపాధ్యక్షులు ఆంధ్ర న్యాయవాద కార్యచరణ సమితి మాజీ ప్రధాన కార్యదర్శి, న్యాయవాది శ్రీగొట్టిపాటి మురళీమోహన్ ప్రధాన కార్యదర్శి. సర్వశ్రీ వెంకయ్యనాయుడు (ఈనాడు భారతీయ జనతా పార్టీ కార్యదర్శులలో ఒకరు) (శివాజీ)ఈనాడు తెలుగుదేశం పార్టీకి చెందిన మాజీ పార్లమెంటు సభ్యులు) తదితరులు కార్యనిర్వాహక సభ్యులు నేను కూడా కార్యనిర్వాహక సభ్యులలో ఒకడిని మా ఇల్లు ఆహ్వాన సంఘ కార్యాలయం మిత్రుడు గొట్టిపాటి మురళీమోహన్ జె పి కార్యక్రమాన్ని జయప్రదం చేయటానికి నిధులు సమకూర్చే పనికి ఉపక్రమించాడు విరాళాలు వసూలు చేయటానికి నన్ను వెంటతీసుకొని వెళ్లేవాడు 'రామమూర్తిగారు జె పి కార్యక్రమ నిధిని అడగటానిక వచ్చారని' చెప్పేవాడు. విరాళం యిచ్చే పెద్దమనిషి నన్ను గౌరవించేవాడు నాకు ఆశ్చర్యం కలిగేది విరాళాలను యివ్వనని ఎవరూ అనలేదు తృణమో పణమోయిచ్చేవారు నిజానికి వారి తాహతును మించి యిచ్చేవారు మురళీమోహన్ మీద వుండే ప్రేమాభిమానంతోయిచ్చేవారు. అలా సుమారు 50 వేల రూపాయలు వసూలు అయింది విరాళాలు వసూలు చేసే కార్యక్రమంలో నామీద మురళీ మోహన్‌కు గల గౌరవభావం వ్యక్తమయింది నా మనస్సు అతనిపట్ల కృతజ్ఞతా భావంతో నిండిపోయింది

జె పి ఎలాగూ విజయవాడ వస్తున్నాడు కదా యని ఆం ప్ర జనతంత్ర సమాజ్ ప్రథమ మహాసభను ఏర్పాటు చేయటానికి సంకల్పించాము మహాసభకు అనువయిన స్థలంగా మాంటిస్సోరి కళాశాల హాలును ఎంపిక చేశాం హాలులో వెయ్యిమందికన్న జనం, నేలమీద కూర్చున్నా కూడా పట్టరు అందుకని ప్రారంభ సమావేశానికి హాజరు కావడానికి వచ్చే పౌరులకు ప్రవేశ పత్రాలు జారీచేయతలచాం అదీగాక కమ్యూనిస్టులు జె పి పట్ల ప్రతికూల వైఖరి ప్రదర్శించ పూనటంతో భద్రతకై అలాంటి చర్యల తీసుకోవలసి వచ్చింది.

# జె.పి. ఆంధ్ర పర్యటన విశేషాలు

జయప్రకాష్ నారాయణ్ మున్ముందుగా హైదరాబాదు వచ్చారు. నేను హైదరాబాదుకు అప్పుడు వెళ్ళలేదు కనుక ఆ సంగతులు నాకు తెలియవు. 1975 మే నెల 4వ తేదీన జెపి విశాఖపట్టణంలో ఉన్నారు. అప్పుడూ నేను ఆయన వెంటలేను. కనుక అక్కడి విశేషాలు నాకు క్షుణ్ణంగా ఎరుకలేవు. కాగా విన్న విషయం ఒకటి చెప్పటం యుక్తియుక్తం. జెపి విశాఖపట్టణంలో విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించారు. మొదట్లో ఆయన దేశ పరిస్థితిని గురించి మాట్లాడతారని అందరూ ఆశించారు. కాని ఆయన వరకట్నం సమస్యను గురించి ఉపన్యసించారు. వరకట్న దురాచారం ఎలా అభిలషణీయం కాదో వివరించి వరకట్నం తీసుకోనని నిశ్చయించిన యువకులను చేతులెత్తమన్నారట. 3వేల మంది విద్యార్థులున్న సభలో సుమారు పది మంది మాత్రం చేతులెత్తారట. మామూలుగా జెపి శాంత చిత్తులు. అలాంటి ఆయనకు కోపం వచ్చింది. బహుశ అది చీకాకేమో! సభలో నుండి ఇద్దరు ముగ్గురు విద్యార్థులు లేచి తాము వరకట్నం తీసుకొనదలచామని, దానిని తప్పుగా తాము పరిగణించటం లేదని అన్నారుట. జెపి ఉద్విగ్నులయారట. వరకట్నం తీసుకోవడం ఎలా క్షంతవ్యం కాదో ఆయన విశదీకరించారట. ఈ సంఘటన విన్న మా బోంట్లకు ఆంధ్ర యువకులపై ఆశలు పటాపంచలయాయి. ఇప్పటికీ వరకట్న దురాచార విషయమయి తెలుగు యువకులలో, అధిక సంఖ్యాకులలో, వ్యతిరేక భావం లేకుండుట శోచనీయం. జెపి 1975 మే 5వ తేదీ విజయవాడ రావటానికి నిర్ణయమయింది. ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. ఇంతలో ఒకవార్త జెపి కార్యక్రమ నిర్వాహకుల చెవిని సోకింది. కొలది రోజుల క్రితం కమ్యూనిస్టుల ప్రాబల్యంలో నున్న రెండు కార్మిక సంఘాలు - అందులో లాగుడు బండ్ల కార్మిక యూనియన్ ఒకటి - జెపి కార్యక్రమాలను భగ్నం చేయటానికి నిర్ణయించాయట. ఆహ్వాన సంఘ నాయకులు కలత చెందారు. జెపి కార్యక్రమాలను విజయవంతం చేయడం, జెపిని రాబొయ్యే ప్రమాదం నుండి రక్షించుకోవటం వారి స్వంత బాధ్యతగా వారు తలపోసారు. విజయవాడ చుట్టుప్రక్కల ప్రాంతాలనుండి 4 వేల మంది సుశిక్షితులయిన రాష్ట్రీయ స్వయం సేవకులను (ఆర్ ఎస్ ఎస్ వారిని) సమీకరించడానికి నిశ్చయించారు. ఈ నిర్ణయం కేంద్ర ప్రభుత్వ గూఢచారి వర్గాలు ఎలా తెలిసికున్నాయో కాని వారు కేంద్ర ప్రభుత్వానికి ఈ వార్తను అందించారట. ఆనాడు కేంద్ర ప్రభుత్వంలో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అంతరంగిక శాఖామంత్రి (హోం మినిస్టరు). జె.పి కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరగాలని, ఇందిరా గాంధీకి యిచ్చినంత గౌరవం, భద్రత జెపి కి యివ్వాలని, జె.పి పై ఈగ కూడా వాలకుండా చూడవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం పోలీసులదని బ్రహ్మానందరెడ్డిగారు హెచ్చరించారట. వెన్వెంటనే విజయవాడలోని పోలీసు ఉన్నతాధికారులు అటకాయింపు

చర్యలకు, విధ్వంసకార్యక్రమాలకు, జె.పి. విజయవాడ రాక సందర్భంగా, ఆపు యివ్వాలని కమ్యూనిస్టు పార్టీ వారికి కబురు పంపారట ఈ విషయాలన్నీ మాకు తర్వాత తెలిశాయి.

ఒక రోజు ఒక పోలీసు కానిస్టేబులు వచ్చి నన్ను విజయవాడ డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంటుగారు కలవమన్నారని చెప్పారు. నిజానికి ఆహ్వాన సంఘంలో నేను ఏ పదవిలోనూ లేను. కాకపోతే పదవులలో వున్న వారు నన్ను గౌరవించటంచేత, కార్యకర్తలలో కాస్త వయస్సు మళ్ళిన వాడినవటం చేత (అప్పటికి నాకు 56 సం॥లు) బహుశం నేను నాయకుడనని పోలీసులు భావించారేమో! 'విషయం ఏమిటో చెప్పారా?' అని అతనిని అడిగాను. జె.పి. తాలూకు బహిరంగ సభకు జరుగవలసిన ఏర్పాట్లను గురించి మీతో సంప్రతించటానికేమో అని అతడు జవాబిచ్చాడు "నేను రాను, ఇపుడు రాలేను ఈ రోజు సాయంత్రం సభా ప్రదేశానికి వస్తాను వారిని కూడా అక్కడికి రమ్మనమని చెప్పు" అని అతనికి బదులు పలికాను. సభ జరుగవలసిన చోటు విజయవాడలోని పి.డబ్లు.డి గ్రౌండ్. అది ప్రభుత్వ స్థలం దానిని వాడుకోవటానికి అనుమతిని వెంటనే యివ్వక, జాగు చేసి, చివరి మూడు నాలుగు రోజులలో అంగీకరించింది ఆంధ్ర ప్రభుత్వం ఆ స్థలం విజయవాడ నగరం మధ్యలో వుంది అదికాకపోతే పోరంకి వైపు పొలాలలో సభను పెట్టవలసి వుండేది. సాయంత్రం నేనూ తదితర మిత్రులూ సభా ప్రదేశానికి వెళ్లారు 'ప్లాను' చూచి దాని కనుగుణంగా గుంజలు పాతిస్తున్నాం. ఆ స్థలం ప్రక్కనే విజయవాడ పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగారి ఆఫీసు, నివాసమున్నూ ఉన్నాయి మమ్మల్ని చూసి ఆయన 'గ్రౌండ్' లోకి వచ్చారు. మా చేతిలోని 'ప్లాను' అడిగి తీసుకున్నారు బాగుందని తృప్తి పడి వెళ్ళారు ప్రజలు వివిధ 'గదులలో' కూర్చోవటానికి, వేదిక క్రింద నాయకులు కూర్చోవటానికి ప్రత్యేక స్థలం, వేదిక వీటిని చూచి ఆయన సంతృప్తి చెందారు సుమారు 3 లక్షల జనం వస్తారని ఎందుకొని దాని కవసరమైన ఏర్పాట్లను ఆహ్వాన సంఘం రూపొందించింది

బహిరంగ సభ ఏర్పాట్లకు తుది మెరుగులు దిద్దడానికి ఆహ్వాన సంఘం సమావేశమయింది తెన్నేటి విశ్వనాథంగారు, గౌతులచ్చన్నగారు తదితర మిత్రులు హాజరయినారు జయప్రకాష్ నారాయణ్ ఉపన్యాసాన్ని ఎవరు తర్జుమా చేయాలనే ప్రశ్న ఉదయించింది ఎవరో ప్రస్తుతం జ్ఞాపకం రావడం లేదు తెన్నేటి విశ్వనాథంగారి పేరును సూచించారు ఆయన విని ఊరుకున్నారు మిత్రుడు మురళీమోహన్ నా పేరును ప్రతిపాదించాడు ఎక్కువ మంది తమ ఆమోదం తెలిపారు మిగతావారు అభ్యంతరం చెప్పలేదు అలా తర్జుమాదారుగా నేను ఎంపికయ్యాను జె.పి. కార్యక్రమాన్ని ఖరారు చేశాం. ఉదయం 7-15 గంటలకు విజయవాడలో రైలు దిగుతారు ఉదయం 10 గంటలకు అం.ప్ర జనతంత్ర సమాజ్ మహా సభను ప్రారంభిస్తారు

అక్కడ సువారు 12 గంటల వరకు ఉంటారు. మరల మధ్యాహ్నం 3 గంటలకు పి.డబ్ల్యు.డి. గ్రౌండ్సులో బహిరంగసభ. రాత్రి 9-30 గంటలకు ఉద్యమ నాయకులతో ఇష్టాగోష్టి సమావేశం. రాత్రి 11-30 కి మదరాసుకు రైలులో ప్రయాణం. ఇలా కార్యక్రమాలు ఎక్కువగా క్రిక్కిరిసి వున్నాయి. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే పూజ్యులు గోరాగారు నాస్తిక కేంద్రంలో జె.పి. కార్యక్రమాన్ని ఏర్పాటు చేయ తలచారు. ఆ విషయాన్ని ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ గోట్టిపాటి మురళీమోహన్ ప్రస్తావించారు. అతడు జె.పి. ఆనాటి కార్యక్రమాన్ని విశదీకరించి గోరాగారి సమావేశానికి వీలు కల్పించలేనని చెప్పి తన నిస్సహాయతను వెల్లడించాడు. తరువాత గోరాగారు నన్ను కలిసి తమ కేంద్రంలో సమావేశానికి జె పి. రావడానికి అవకాశం కల్పించమని కోరారు. నాకు వారి ప్రతిపాదన నచ్చలేదు దానికి కారణం లేకపోలేదు. జె.పి ఉద్యమం సాగేరోజుల్లో బీహారు రాష్ట్ర ప్రభుత్వం విద్యార్థులపై కాల్పులు సాగిస్తే అందుకు నిరసనగా శాసన సభ్యులను రాజీనామా చేయవలసిందిగా జె.పి. కోరారు. జె.పి. 'డిమాండు'ను ఖండిస్తూ గోరాగారు పత్రికా ప్రకటన చేశారు. భారత ప్రభుత్వ దృష్టిలో జె.పి. ఇందిరాగాంధి వ్యతిరేకి కనుక ఆకాశవాణి గోరాగారి అభిప్రాయ ప్రకటనను ప్రముఖంగా ప్రసారం చేసింది. జె.పి. ఉద్యమంతో మమేకమయిన నేను 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'అనే ఆంగ్ల దిన పత్రికలో గోరాగారు జె.పి.పై చేసిన విమర్శను ఖండిస్తూ ఒక లేఖ రాశాను. నా యితర లేఖలవలె దీనిని కూడా విజయవాడ 'ఎడిషన్' సంపాదకులు రంగస్వామిగారు ప్రథమ లేఖగా రెండు కాలంల శీర్షికతో ప్రచురించారు. నా అసమ్మతి ప్రజల దృష్టికి వచ్చింది అప్పటి నుండి జె.పి. ఉద్యమానికి గోరాగారు వ్యతిరేకులనే భావం నాలో పొడసూపి బలపడింది. ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శి మురళీమోహన్ కాదన్న తరువాత నేను వారి ప్రతిపాదనను బలపరచలేనని గోరాగారికి చెప్పాను. వారు నా సమాధానం విని మిన్నకున్నారు

# జె.పి. విజయవాడ కార్యక్రమాలు

అది 1975వ సంవత్సరం మే నెల 5వ తేదీ. ఉదయం 7 గంట ప్రాంతంలో విజయవాడ రైల్వే స్టేషను జనంతో కిటకిట లాడుతున్నది. జె.పి.ని విజయవాడకు తెచ్చే రైలు ప్లాటు ఫారం మీద ఆగింది నాలుగు వేలమంది జన ప్రవాహం ఒక్కసారిగా ఆయన వున్న రైలు పెట్టెవైపు కదిలింది ఆ జనం త్రోపులాటలో నేను వెనుకకు నెట్టబడ్డాను జె.పి. ప్లాటు ఫారం బయటికి వచ్చి కారెక్కాడు. అతని కారువెంట ఆహ్వాన సంఘం తాలూకు స్వచ్ఛంద సేవకుల కారుపోవలసి వుండెను కాని పోలీసులతో నిండిన జీపు ఆయనను అనుసరించింది. అప్పటికిగాని పోలీసుల ఎత్తుగడ నాకు అవగతం కాలేదు. జె.పి. భద్రతకు తాము జవాబుదారీ వహించాలని, కనుక ఆయన కారు ముందూ వెనుక తమ బలగాలతో నిండిన కార్లు వుండాలని జె పి విజయవాడ రాకుముందు పోలీసులు సూచించారు. జె.పి. రక్షణ భారాన్ని ఆహ్వాన సంఘపు సేవకులు వహించగలరని ఆహ్వాన సంఘం పోలీసుల అభ్యర్థనను మర్యాదగా తిరస్కరించింది. కాని వారు చివరకు తమ పట్టు నెగ్గించుకున్నారు. స్వచ్ఛంద సేవకుల కారుకన్నా మున్ముందుగా తమ జీపును నడిపించారు

నేను ప్రజాస్వామ్య వాది, న్యాయవాది అయిన మిత్రుడు వై వి. హనుమంతరావు (తర్వాత ఆయన జనతాపార్టీ నాయకుడిగా శాసన సభకు విజయవాడ నుండి పోటీ చేశాడు) కారులో జె.పి. వసతి గృహానికి బయలు దేరాను. త్రోవలో కారు కాస్త యిబ్బంది పెట్టడంతో అక్కడికి చేరటం కాస్త ఆలస్యమయింది. లోపలికి వెళ్ళాను. అక్కడ జె పి అంతరంగిక కార్యదర్శి అబ్రహాం ఏదో రాస్తున్నాడు. నేను అతనిని సమీపించి 'ఏమి రాస్తున్నారు?' అని అడిగాను జె.పి.గారి కార్యక్రమాన్ని నమోదు చేస్తున్నానని చెప్పాడు. అప్పటికి ఉదయం సుమారు 8 గంటలు అయింది ప్రథమ కార్యక్రమం జె.పి. నాస్తిక కేంద్ర దర్శనం అని చదివాడు. "అలాగయితే జయప్రకాశ్ నారాయణగారిని ఉదయం 10 గంటలకు మాంటిస్సోరీ కాలేజీ హాలు వద్దకు తీసుకొని రండి నేను, ఆహ్వాన సంఘం-వారు ఆయనకోసం అక్కడ కనిపెట్టుకొని ఉంటాము'' అని చెప్ప అబ్రహాం ఏమి జవాబు చెప్తాడో అని ఎదురు చూడకుండా ఇంటిలో నుంచి వెలువడి వీధిలో చక చకా నడిచి వెళ్లసాగాను. నా వెన్వెంట అబ్రహాం పరుగెత్తుకొని వచ్చాడు. "జె.పి. రాగానే మిమ్మల్ని గురించి వాకబు చేశారని, ఆయనను నేను కలిసి కోవాలని'' చెప్పి నన్ను జె.పి దగ్గరికి తీసుకొని వెళ్ళాడు. జె.పి గడ్డం గీసుకుంటున్నాడు. "రామ్మూర్తి నీకోసం అడిగాను'' అన్నాడు. అవాంతరం వల్ల నేను అక్కడికి చేరటానికి ఆలశ్యం అయిదని చెప్పాను 'అబ్రహాం రూపొందించిన కార్యక్రమం నీకు నచ్చినట్లు లేదని' అన్నాడు

అవునని సమాధానం చెప్పాను. 'గోరా గారు నా చిరకాల మిత్రుడు. నేను ఆయన సర్వోదయోద్యములో కలసి పనిచేసిన విషయం నీకు తెలుసుకదా! వారు తమ నాస్తిక కేంద్రానికి రమ్మంటే కాదనలేకపోయాను' అని అన్నాడు. అంతకు క్రితం గోరాగారు మురళీ మోహన్‌తో జె.పి. నాస్తిక కేంద్రానికి వచ్చే ప్రసక్తి తేవడం, నాతో దరిమిలా ప్రస్తావించడం, వారు సరాసరి హైదరాబాదులో వున్న జె.పి.కి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక ఆఫీసు ద్వారా ఆహ్వానం పంపిన వార్త నా బుర్రలో తళుక్కున మెరిశాయి అంతేకాదు, పత్రికలవారితో నాకున్న అనుభవాన్ని పురస్కరించుకొని, పత్రికలు పనిచేసే తీరును స్ఫురణకు తెచ్చుకొని పట్టణానికి విచ్చేసిన మహానాయకుల కార్యక్రమాలలో తొలిదానికి వచ్చే ప్రచారం తరువాతి కార్యక్రమాలకు రాదని తెలుసు కనుకు 'గోరాగారి సమావేశానికి మీరు వెళ్లడానికి నా అభ్యంతరం లేదు. కాని ఉద్యమం ముందు, స్నేహాలు తరువాతగా వుండాలని నా అభిప్రాయం' అని పల్కాను నా వాక్కులో వున్న ధృఢత్వాన్ని జె.పి. గ్రహించి జనతంత్ర సమాజ్ మహాసభ తర్వాత విద్యార్థుల సమావేశానికి ముందు అక్కడికి వెళ్ళివస్తానని అన్నారు. నేను సరే అన్నాను.

జనతంత్ర సమాజ్ మహాసభ సరిగ్గా ఉదయం 10-30 గంటలకు ప్రారంభమయింది. జె.పి.గంటకు పైగా మాట్లాడారు ఆయన ఆంగ్లంలో ఉపన్యసించారు. తర్జుమా లేదు. జె.పి ఆ సభలో మధ్యాహ్నం 12-30 గంటల వరకూ ఉన్నారు. సభ జయప్రదమయింది. తరువాత ఒంటి గంటకు ఆయన నాస్తిక కేంద్రానికి వెళ్ళారని అక్కడ గంటన్నర వున్నారని, ఆ కార్యక్రమాల హడావుడిలో ఆయన భోజనం చేయటం ఆలస్యమయిందని, వేళకు క్రమంగా తీసుకోవలసిన మందులు వేసుకోలేదని, తను చాలా ఆందోళనకు గురి అయానని జె పి. మరో కార్యదర్శి - ఆమె జె.పి. యెడల విశేష భక్తి శ్రద్ధలున్న మహిళ - తరువాత నాతో చెప్పారు మధ్యాహ్నం 3 గంటల నుండి 4-30 గంటల వనరే జె పి. విద్యార్థుల కార్యక్రమంలో పాల్గొన్నారు.

సాయంత్రం 5 గంటలకు పి.డబ్ల్యు డి మైదానంలో బహిరంగ సభ పోలీసులు ఏనాడో అక్కడ నెలకొల్పిన వేదికను ఆహ్వాన సంఘం వాడుకున్నది రెండు అంతస్తులున్న వేదికపై జె పి. ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షులు ప్రసాదరావుగారు, సభాధ్యక్షులు తెన్నేటి విశ్వనాధంగారు, తర్జుమాదారు నేను మాత్రం ఉన్నాం మరొకరు అక్కడ నిలుచోడానికి కూడా చోటులేదు. ఒకటవ అంతస్సుతో వున్న వేదికపై ఉద్యమ నాయకులు ఆసీనులయ్యారు. ఇసుకవేస్తే రాలని జన సముద్రం. పశ్చిమ గోదావరి నుండి రాయలసీమ వరకూ, ఖమ్మం జిల్లాల నుండి జనం అశేష సంఖ్యలో వచ్చారు సభా ప్రారంభంలో 3 లక్షల మంది ఉంటారని పత్రికల వారి అంచనా. జె పి. ఉపన్యాసం ప్రారంభించిన అరగంటకు ఉరుములూ, మెరుపులతో బ్రహ్మాండమయిన వర్షం మొదలయింది రెండున్నర లక్షల మంది సభాస్థలి వదిలి వెళ్లేరు అందులో ఒక లక్షమంది దాకా మైదానం చుట్టూ

వున్న చెట్లు, దుకాణాలు, కార్యాలయాల వసారాల్లో తలదాచుకున్నారు లక్షన్నర జనం చెల్లాచెదరయిపోయారు. జె పి కూర్చున్న వేదికకు ఆచ్ఛాదనలేదు. ఆందరం తడుస్తున్నాం జె పి. ఉపన్యాసాన్ని ఆపలేదు ఎవరో గొడుగు తీసుకొని వచ్చి ఆతనికి పట్టామంటే ఆయన నిరాకరించాడు ఉపన్యాసం గంగా ప్రవాహంలాగా గంభీరంగా సాగిపోతున్నది నేను నాశక్తినంతా కూడకట్టుకొని తర్జుమా చేస్తున్నాను 50 వేలమంది ప్రజలు తడిసి ముద్ద అవుతూ కూడా కదలకుండా, చలించకుండా అలాగే నిలబడి వింటున్నారు ఎవరోవచ్చి ఉపన్యాసాన్ని ఆపితే బాగుంటుందేమోనని సూచించాం ఆ మాటలు విన్న జె.పి విన్నా కాతరు చేయలేదు ప్రసంగాన్ని కొనసాగించాడు మిత్రుడు కొమరగిరి కృష్ణమోహన్ అని గుర్తు - ఆంధ్రోద్యమంలో పేరెన్నికగన్న జనసంఘ నాయకుడు, వక్త, కార్యదీక్షాపరుడు, తరువాత మచిలీపట్నం నుండి వెలువడే మాసపత్రిక సంపాదకుడు - వేదికమీదికి వచ్చి తన ఉత్తరీయాన్ని మడిచి దాంతో జె.పి. శిరస్సును కప్పాడు. జె పి దానిని త్రోసివేయలేదు ఆయన యింకా మాట్లాడుతూనే వున్నారు ఆయన అలా మొత్తం గంటన్నర భాషణ చేసిన తరువాత శబ్ద ప్రసారణ యంత్రం 'ఆంప్లిఫయరు' లోకి నీళ్ళు పోవడంతో లౌడు స్పీకర్లు పనిచేయడం మానుకున్నాయి అపుడు, గత్యంతరంలేక జె పి. తన ప్రయత్నాన్ని విరమించాడు ఆనాటి రాత్రి చాలామంది శ్రోతలు తమ జేబులలో వున్న కరెన్సీ నోట్లు తడిసి ముద్దపడంతోత యెంత ఇబ్బంది పడ్డారని తరువాత తెలిసింది.

రాత్రి 10 గంటలకు నాయకులతో యిష్టాగోష్ఠి సమావేశంలో పాల్గొని జె పి. ఆ రాత్రి 11-30 గంటలకు మద్రాసుకు రైలులో వెళ్ళారు. స్టేషనులో ఆయనకు ఘనమయిన వీడ్కోలు యిచ్చాం విజయవాడ పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగారు నాతో 'హమ్మయ్యా! మన పని ముగిసింది. మనమంతా కలసికట్టుగా పనిచేశాం'' అన్నారు. ''ఇప్పటిదాకా మనం మిత్రులం ఇకమీదట మనం ప్రత్యర్థులం'' అని అన్నాను. ఆయన చిరునవ్వునవ్వారు

మరునాడు పత్రికలలో జె పి కొరకు ఆహ్వాన సంఘం రూపొందించిన కార్యక్రమాల విశేషాలు పతాక శీర్షికలతో వివరంగా వచ్చాయి. నేనూ ఆహ్వాన సంఘం వారు సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాం నాస్తిక కేంద్రపు కార్యక్రమం - సమయం అననుకూలమయినందువలననోఏమో - పత్రికలలో అసలు రాలేదు. లవణం ప్రత్యేకంగా పంపిన వార్త 7వ తేదీ పత్రికల్లో వచ్చింది నేను గట్టిగా పట్టుపట్టకపోతే జె పి. ముమ్మందుగా నాస్తిక కేంద్రానికి వెళ్ళేవారు నేను ఏర్పాటు చేసిన జనతంత్ర సమాజ్ మహాసభ విశేషాలు పత్రికల్లో నామమాత్రంగా వచ్చేవి. ఇక్కడ నేను 'స్వార్థంతో' ప్రవర్తించాను. అయితే అది నా వ్యక్తిగత లాభాన్ని ఆశించి కాదు. ఉద్యమంపై నాకున్న గాఢాభిమానమే నన్ను అలా ప్రేరేపించింది గోరా అభిమానులు నన్ను గురించి ఏమనుకున్నారో నాకుతెలియదు; తెలిసికోవాలని నేను ప్రయత్నించలేదు.

# ఎమర్జెన్సీ విధింపు - నా జైలు జీవితం

తెల్లవారితే 1975 సం॥ జూన్ 26వ తేదీ. సూర్యోదయం కాకముందు ఐదు గంటలకు ఎవరో మా యింటి గేటు వద్దనున్న ఎలెక్ట్రిక్ గంటను మోగించారు. నిద్రలేచి తలుపులు తీశాం. పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు గారు, సర్కిల్ ఇన్‌స్పెక్టరు మరి కొందరు పోలీసులు కనపడ్డారు. 'అయ్యగారు మీతో మాట్లాడడానికి వచ్చారు' అని అన్నాడు ఒక కానిస్టేబులు. నా కర్థమయింది నన్ను అరెస్టు చేయడానికి వారు వచ్చారని. ఇంతలో సూపరింటెండెంటుగారు ముందుకు వచ్చి "మిమ్మల్ని అరెస్టు చేయడానికి రావలసినందుకు చింతిస్తున్నాను" అంటూ వారంటు కాపీని నా చేతికిచ్చారు. జె.పి. విజయవాడ సందర్శన సమయంలో ఆ పదవిలో వున్నది వీరే జె.పి.కి తేది 5-5-1975 రాత్రి వీడ్కోలు యిచ్చినపుడు రైలు వద్దకు వచ్చింది వీరే. "మీ విధి మీరు నిర్వర్తిస్తున్నారు, తప్పదు కదా" అని అంటూ నిల్చున్న పళంగా వచ్చేయాలా బట్టలు సర్దుకోవటానికి అవకాశం యిస్తారా అని అడిగాను. "పరవాలేదు, బట్టలు సర్దుకోండి" అన్నారు. ఇంటి లోపలికి వెళ్ళి నా పత్ని సుబ్బమ్మతో విషయం చెప్పాను. "అదేమిటండీ!" అన్నది ఆమె. "మనం చేస్తున్న పనుల ఫలితం ఇది" అన్నాను. బట్టలు సర్దడానికి ఆమె పూనుకున్నది 5 నిమిషాలు గడిచింది. "రామ్మూర్తిగారూ" అని పిలుపు. వాకిట్లోకి వచ్చాను "ఇంకా కొంతమంది మిత్రులను కలవాలి అమ్మగారు 3 టౌను పోలీసు స్టేషనుకు బట్టలు తెస్తారులెండి పోదాము" అన్నారు పోలీసు ఉన్నతాధికారి. వారి వెంట నడిచాను. వారు తమ స్వంత కారులో నన్ను కూర్చోబెట్టి బయలు దేరారు. "గొట్టిపాటి మురళీ మోహన్‌గారి యింటికి వెళ్ళాలి. మీకు త్రోవ తెలుసునా" అని అడిగారు. సరిగా తెలియదని బదులు పలికాను. మురళీ మోహన్ ఇంటికి వెళ్ళాము. "రామ్మూర్తిగారు వచ్చారు" అని కానిస్టేబులు కేకపెట్టాడు. మిత్రుడు మురళీ బయటికి వచ్చాడు. అతనిని కూడా అరెస్టు చేసి నెంబరు 3 టౌను పోలీసు స్టేషనుకు తీసుకొని వచ్చారు. వెంట వచ్చిన పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు పేరు రామమూర్తి. కాబట్టి అనృతదోషం లేదు. నేను వచ్చానని మురళీ మోహన్ బయటికి వచ్చాడు. లేకపోతే దొరకకపోను. విజయవాడలో ఎమర్జెన్సీలో అరెస్టు కాబడినవారిలో నేను ప్రథముణ్ణి. మిత్రుడు మురళీమోహన్ రెండవవాడు కమ్యూనిస్టు పార్టీ(మార్క్సిస్టు) పట్టణ కార్యదర్శి కామ్రేడ్ అయితా రాములు మూడవవారు కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కృష్ణా జిల్లా కార్యదర్శి కామ్రేడ్ అట్లూరి శ్రీమన్నారాయణ నాల్గవవారు. నక్సలైట్లలో చారు మజుందార్ (ఎర్రజెండా) వర్గానికి చెందిన ప్రకాశరెడ్డి అయిదవవారు.

ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో సుబ్బమ్మ నా దుస్తులను హోల్డాలులో కట్టి

పోలీసు స్టేషనుకు వచ్చింది ఆమె పత్రికా విలేఖర్లకు ఫోనులు చేసిందట. ఇంకా ఎవరెవరిని అరెస్టు చేశారని ఆమెను వారు అడిగారట. తనకు తెలియదని ఆమె చెప్పిందట. ఆమె ముఖంలో భయంగాని, విషాదం గాని కన్పించలేదు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమంలో కొందరిని డెటిన్యూలుగా అరెస్టు చేయటం, వారికి ఏ హాని తలపెట్టకుండా 4, 5 నెలల తరువాత వదలి వేయటం ఆమెకు తెలుసు. అలాంటివే ఈ అరెస్టులు అని ఆమె భావించింది కొంతసేపు పోలీసు స్టేషనులో వుండి ఇంటికి వెళ్లింది

మధ్యాహ్నం 12-30 గంటల ప్రాంతంలో గుంటూరు నుండి డాక్టరు యలమంచిలి శివాజీని తీసుకొని వచ్చారు పోలీసులు. విజయవాడలో అరెస్టు కాబడిన 5 గురిని, అతనిని కలిపి 6 గురిని 'వ్యాను'లో కూర్చోబెట్టి తీసుకొని వెళ్తున్నారు ఎక్కడికి తీసుకొని వెళ్తున్నారో మాకు చెప్పలేదు. కొద్ది పదవులలో వున్న పోలీసు అధికారులకు కూడా తెలియదు. ప్రయాణం చేస్తున్నాం మాకు కాపలాగా మాతోపాటు వ్యానులో వస్తున్న పోలీసులతో. త్రోవ పొడుగునా వ్యానులో వున్న మమ్మల్ని ఎవరూ చూడటానికి అవకాశం లేకున్నా - ప్రకాశరెడ్డి తప్ప మిగిలిన అయిదుగురము ప్రభుత్వ వ్యతిరేక నినాదాలిస్తూనే వున్నాం.

రాత్రి 8గంటల ప్రాంతంలో వ్యాను దిగాము. అది పెద్ద జైలు. గేటుదాటగానే పెద్ద హాలులోకి మమ్మల్నితీసుకొని వెళ్ళారు. "రాజమండ్రికి వచ్చిన మీకు పురజనుల తరపున స్వాగతం పలుకుతున్నాను" అన్నాడు బాలాజీ దాస్. అతని పేరు నాకు పరిచితమే. అతడు కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ తూర్పు గోదావరి జిల్లా కమిటీకి ప్రధాన కార్యదర్శి; రాజమండ్రి పురపాలక సంఘానికి ఉపాధ్యక్షుడు. మమ్మల్ని రాజమండ్రి జైలుకు తెస్తారనీ జైలు అధికారులకు ముందుగా వర్తమానం లేదు డిటెన్యూల కని ఒక వార్డును సామాను తీసివేసి, సున్నాలు కొట్టించి వాసయోగ్యం చేయటానికి అధికారులకు రెండు గంటలు పట్టింది. రాత్రి పదిగంటలకు గృహ ప్రవేశం చేశాం.

తారీఖు 28న కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పత్రిక సంపాదకుడు బొమ్మారెడ్డిగారు విజయవాడలో మా ఇంటికి వచ్చి మమ్మల్ని రాజమండ్రి సెంట్రలు జైలులో వుంచారని సుబ్బమ్మకు చెప్పారట తేది 27న పత్రికలలో అరెస్టుల వార్తలు లేవు. 26వ తేదీన అరెస్టు వార్తలను అచ్చులో కూర్చొని పత్రికల వారు కూర్చున్నారట. మధ్యాహ్నానికి ముందుగా చూపించి అనుమతి తీసుకొననిదే ఎమర్జెన్సీకి సంబంధించిన ఏ వార్తను ప్రకటించరాదని పత్రికల వారిపై ఆంక్షలు విధించారుట అప్పటికి అత్యవసర పరిస్థితి(ఎమర్జెన్సీ) అంటే ఏమిటో ప్రజలకు అర్థమయింది. హైదరాబాదులో దక్కన్ క్రానికల్‌లో ఉదయం 10 గంటలకు ప్రత్యేక సంచికను ప్రకటించిందట. అందులో అరెస్టు కాబడిన మా పేర్లు వున్నాయట. బొంబాయిలో ఉదయం అచ్చువేసిన దినపత్రికల ప్రత్యేక

సంచికలలో కూడ మా పేర్లు అచ్చువేశారట. జయప్రకాశ్ నారాయణను 25వ తేదీ అర్ధరాత్రే అరెస్టుచేశారు గుంటూరులో శివాజీని రాత్రి 2 గంటల ప్రాంతంలో అదుపులోకి తీసుకొన్నారు. దేశం మొత్తం మీద అనేక మంది పాత కాంగ్రెసు వారిని, సోషలిస్టు, కమ్యూనిస్టు (మార్క్సిస్టు)లను, జయప్రకాశ్ నారాయణ్ అనుయాయులను అరెస్టు చేశారు అత్యవసర పరిస్థితిని ప్రకటించిన వెంటనే అరెస్టు చేయబడిన రాడికల్ హ్యూమనిస్టును దేశం మొత్తం మీద - నేను ఒక్కడినే. తరువాత సి టి దరు మొదలగు వారిని డెటిన్యూలుగా తీసుకోవటం జరిగింది.

డెటిన్యూ అంటే నేరారోపణ చేయకుండా నిర్బంధంలోకి తీసుకోవబడిన వ్యక్తి అని అర్థం అంటే న్యాయస్థానంలో డెటిన్యూపై కేసు పెట్టరు; పెట్టనవసరం లేదు. కాకపోతే జూనులో 75లో అమలులోవున్న శాసనం ప్రకారం జిల్లా మేజిస్ట్రేటు డెటిన్యూను అరెస్టు చేసిన అయిదు రోజులలోగా అరెస్టుకు కారణాల పట్టికను డెటిన్యూకు అందజేయాలి నాకు కృష్ణా జిల్లానుండి అలాంటి పత్రం చేరింది నా అరెస్టుకు కారణాలు - 1) బీహారు తరహా ఆందోళనను తేవడానికి కృసి చేయడం, 2) సమగ్ర విప్లవంను (టోటల్ రెవల్యూషన్) - ఇది జయప్రకాశ్ నినాదం - సాధించటానికి పనిచేయటం, 3) జగ్గయ్యపేటలో ఉపన్యసిస్తూ సైనికులను తిరుగుబాటు చెయ్యమని ఉద్బోధించడం ఈ పత్రం చదివి నవ్వుకున్నాను

పది పదిహేను రోజుల తరువాత నన్ను చూడటానికి వచ్చిన నా సతీమణి సుబ్బమ్మ, నా కుమారుడు కామేశ్వరరావు వలన విజయవాడ పరిస్థితులు మరికొన్ని తెలిశాయి 28వ తేదీన ఉదయానికి విజయవాడ గోడలపై ప్రభుత్వం విధించిన ఆత్మయిక పరిస్థితనిని నిరసిస్తూ గోడలమీద కాగితాలు అంటించబడ్డాయట. అలా అతికించిన వారెవరో ఎవరికీ తెలియదట కొలది రోజులకు అన్ని పత్రికలవారిని - దినపత్రికలు, పక్షపత్రికలు, వార, మాస పత్రికలు - జిల్లా కలెక్టరు పిలిపించి సమావేశపరిచారట. 1974 నవబంబరులో సుబ్బమ్మ పబ్లిషరుగా (ప్రింటరుగా), నేను సంపాదకుడిగా ప్రారంభింపబడిన 'వికాసం' పేరుగల మాసపత్రిక పబ్లిషరుగా సుబ్బమ్మకు పిలుపు వచ్చిందట అపుడు కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు పత్రికల వారిని బెదిరించారట గోడలమీద పోస్టర్ల విషయం ప్రస్తావించారట ఎమర్జెన్సీ అంటే ప్రజలలో భయోత్పాతం ఏర్పడిందట. ఇద్దరు ముగ్గురు మిత్రులు - వంగమూడి నటరాజ్, వై.వి. హనుమంతరావు, కామ్రేడ్ బొమ్మారెడ్డి - తప్ప తతిమ్మావారు సుబ్బమ్మతో మాట్లాడటం మానివేశారట ఆవిడ కనిపిస్తే వేరొక వీధిలోకి మళ్ళేవారట. ఎమర్జెన్సీ విధించబడటం భారతదేశ చరిత్రలో అదే మొదటి సారి. ఇప్పటి వరకు అదే చివరిసారి.

# డెటిన్యూగా

రాజమండ్రి జైలులో నేను సుమారు నాలుగున్నర నెలలు వున్నాను. అది ఒక వింత అనుభవం. పాత కంగ్రెసువారు, జనసంఘీయులు, కమ్యూనిస్టు మార్క్సిస్టులు, సోషలిస్టులు, స్వతంత్ర పార్టీవారు, ఏ పార్టీకి చెందని నేను, ఎమర్జెన్సీ వేటుకు గురి అయిన సామాన్య పౌరులు, ఆత్యయిక పరిస్థితిలో అదుపులోకి తీసుకోబడిన దుర్నీతిపరులయిన వ్యాపారస్తులు, వివిధ తెగలకు చెందిన నక్సలైట్లు, ఆర్.ఎస్.ఎస్. వారు ఒక ఆనందమార్గీయుడు యిలా పన్నెండు రకాల మనుష్యులు డెటన్యూలు. వీరందరినీ కట్టివేసిన ఒకే ఒక బంధం ఇందిరా గింధీ అణచివేతకు గురి కావడం; వర్గ బేధాలను అధిగమించి స్థూలంగా ఐక్యతను చేకూర్చిన సూత్రం అది. అందరికి ఒకే వంట, ఒకే భోజనశాల. అలాగే అయిదుగురితో కూడిన ఒకే పరిపాలక వర్గం. సాధారణ సమస్యలను పరిపాలక వర్గ సభ్యులు పరిష్కరించేవారు. అత్యవసరం పరిస్థితుల్లో డెటిన్యూల జనరల్ బాడీ -- ఒకప్పుడు అది 45 మందితో కూడి వుండేది -- సమావేశమయ్యేది. అంతర్గత ప్రజాస్వామ్యం దాని లక్షణం.

1976 ఏప్రిల్‌లో నేను జైలు నుండి విడుదల అయిన తరువాత, హైదరాబాదుకు నివాసం మార్చిన తదుపరి నేను ఆంధ్ర ప్రభలో సీరియల్‌గా రాసిన పది వ్యాసాలను చిన్ని పుస్తకం 'జైలు అనుభవాలు' అనే పేరుతో ప్రచురించాను. అందులో రాసిన విషయాలన్నీ ఇక్కడ మరల ఏకరువు పెట్ట తలచటం లేదు గుంటూరు జిల్లాకు చెందిన లాయరు శ్రీ భీమిరెడ్డి సుబ్బారెడ్డి, ఆదే జిల్లా వాసి కృష్ణారెడ్డి పాత కాంగ్రెసు వారు ఒకరు కామరాజు గ్రూపు, మరొకరు నిజలింగప్ప గ్రూపు. కామరాజు గ్రూపు ఆనాటికి ఇందిరాగాంధికి అనుకూలమే. కాని బహుశః ఎవరు ఎలాంటి వారో తేల్చుకోలేకపోయారో, అనవసర మానసిక శ్రమ ఎందుకని భావించారో ఏమోకాని ఇరువురిని తెచ్చి రాజమండ్రి జైలులో పడవేశారు. కొత్తపేటకు చెందిన సుబ్బరాజుగారు కూడా పాత కాంగ్రెసు నాయకులే. సర్వశ్రీ జూపూడి యజ్ఞనారాయణ, కొమరగిరి కృష్ణమోహనరావు డా॥ పి.ఎల్.ఎన్.రాజు తదితరులు జన సంఘీయులు. సర్దార్ గౌతు లచ్చన్న, డా॥ యలమంచిలి శివాజీ స్వతంత్ర పార్టీ వారు. సర్వశ్రీ అయితా రాములు, అట్లూరి శ్రీమన్నారాయణ, బాలాజీదాస్, కమ్యూనిస్టు మార్క్సిస్టు పార్టీ పాలిట్‌బ్యూరో సభ్యులు ఎం.బి.(ఎం బసవ పున్నయ్య) కమ్యూనిస్టు మార్క్సిస్టులు మిత్రులు తూమాటి బాలకోటేశ్వరరావు, తుమ్మల చౌదరి సోషలిస్టులు. సర్వశ్రీ ప్రకాశరెడ్డి, రామారావు (ఏలూరు), టి.వి. (ఈనాడు ప్రముఖ కార్టూనిస్టు), రామమోహనరావు (ఇప్పుడు రాజమండ్రిలో వైద్య వృత్తి చేస్తున్నారు). డా॥ కాటా నారాయణ రావు (వైద్యులు, శాంతి సంఘంలో నాయకులు) వె. ఎస్. కోటేశ్వరరావు (గుంటూరులో పీడరు) కొలా వెంకయ్యగారలు వివిధ

తెగలకు చెందిన నక్సలైట్లు. మిత్రుడు గోట్టిపాటి మురళీ మోహన ఇత్యాదులు ఆం.ఎస్.ఎస్. వారు. ఉదయం లలిత నృత్యం సాయంత్రం వేళ ప్రళయ తాండవం చేసే ఆనంద మార్గీయుడు కూడా సహవాసియే. బజారు ధర కన్న ఎక్కువ ధరకు ప్రభుత్వం సరఫరా చేస్తున్న మైదాపిండిని కొనుగోలు చేయడానికి నిరాకరించటం వల్ల తహసీలుదారు కోపాగ్నికి గురి అయి, కట్టు గుడ్డలతో - చినిగిపోయిన లుంగీ బనియనులతో - ఉన్న పళంగా నిద్ర నుండి మేల్కొలపబడి డెటిన్యూగా రాజమండ్రి సెంట్రలు జైలుకు తీసుకొని రాబడిన చిన్న రొట్టెల దుకాణదారు కూడా మావాడే. మా కమిటీ వారు వెంటనే జైలు అధికార్లతో మాట్లాడి జైలు నిబంధన ప్రకారం మాకు యివ్వబడిన దుస్తులను అతనికి యిప్పించారు.

పదిహేను రోజుల కొకసారి డెటిన్యూ కుటుంబీకులు డెటిన్యూను చూడవచ్చును. గంటసేపు సంభాషించవచ్చును. కుటుంబీకులకు ఉత్తరాలు వారానికి ఒకటి రాయవచ్చును. తెల్లకాగితం మీద మేము ఉత్తరం రాసి చిరునామా చేర్చి యిస్తే జైలు అధికారులు చదివి అభ్యంతరకరమైన అంశాలను కొట్టివేసి పోస్టు చేసేవారు. నెలకు 20 రూపాయలకు మించకుండా ప్రతి డెటిన్యూ తన అవసరాలకు తన స్వంత ఖర్చు పెట్టుకోవచ్చును. కాని ఆ పైకం జైలు అధికారుల వద్దనే ఉండాలి. డెటిన్యూ ఇంటినుండి తెప్పించుకున్న పుస్తకాలను జైలు అధికారులు ఆమోదించిన తరువాత డెటిన్యూ తన దగ్గర ఉంచుకొని చదువుకోవచ్చును. డెటిన్యూ ఇతర ఖైదీలతో కలవరాదు రాజమండ్రిలో ఆటలాడటానికి క్రీడా స్థలం లేదు. రెండు బ్లాకులలో వుండేవారం. కాగా, 5, 6 చిన్న గదులు వుండేవి. భోజనానికి డెటిన్యూకు రోజుకు 5 రూపాయలు ఇచ్చేవారు. జైలు వార్డరు ఊరిలో కొనుగోలు చేసి సరుకులు తెచ్చేవాడు. కాగా 20 నుండి 35 శాతం అతని కమీషను క్రింద ఆ పైకంలో తరుగుపోయేది. శారీరకంగా డెటిన్యూలను హింసించేవారుకాదు.

సర్వ సాధారణంగా భార్య దృష్టిలో భర్త గొప్పవాడుగా కనిపిస్తాడు. ఆ సూత్రం సుబ్బమ్మకు వర్తించిందేమో "మీకు జైలులో - అనుకోకుండా - చాలా విశ్రాంతి దొరికింది. జైలు నుండి బయటికి వచ్చే నాటికి మీరు ఒక మంచి పుస్తకం రాస్తే - నా సొమ్ములను అమ్మి అయినా సరే - అచ్చు వేయిస్తాను. తప్పక రాయండి" అని సుబ్బమ్మ నాకు ఉత్తరం రాసింది. దానిని గురించి ఆలోచించి నిర్ణయం తీసుకొనేలోగా ఒక సంఘటన జరిగింది. గొట్టిపాటి మురళీ మోహన్ రిట్ రాసి - లాయర్ కదా - హైకోర్టుకు పంపాడు. అలాంటి కాగితాలను జైలు అధికారులు విధిగా కోర్టులకు, ప్రభుత్వానికి పంపాలి. హైకోర్టు అతనిని విడుదల చేసింది. అతడు విజయవాడ వెళ్ళగానే మా యింటికి వెళ్ళి "నేను 'రిట్' వేసి విడుదలయి వచ్చాను. తనని వేయమని మీరు వారిని కోరండి. రిట్ మీద ఆయన విడుదల అయ్యే అవకాశాలున్నాయి" అని

సుబ్బమ్మతో చెప్పాడు. ఆమెకు ఆశ పుట్టింది. రిట్ దాఖలు చేయండి అని రాసింది రిట్ వేశాను ఇక మొదలయింది కోర్టులో పోరాటం.

రాజమండ్రిలో నాతోపాటు డెటిన్యూగా వున్న అనేక మందికి రిట్టులు రాసిపెట్టాను చివరకు ఆనందమార్గీయునికి కూడా రాసిపెట్టాను. ఒక్కోసారి నలుగురు అయిదుగురు విభిన్న వర్గాలకు చెందిన వారిని చేర్చి ఒక రిట్ రాసి పెట్టడం జరిగింది. రిట్‌లలో పిటిషనర్లందరినీ రిట్‌లలో వాదన చేసుకోవటానికి హైదరాబాదులోని చంచల గూడా సెంట్రల్ జైలుకు తీసుకొని వెళ్ళారు కోర్టులలో కాలహరణం అవుతుంటే, తమరిని చూడటానికి వచ్చే కుటుంబీకులకు యిబ్బంది అవుతుందని తలంచి అలాంటి వారిలో కొందరు తిరిగి రాజమండ్రి వచ్చేశారు నేను మాత్రం హైదరాబాదులోనే వుండిపోయాను హైదరాబాదులో నా మూడవ కుమారుడు మల్లాది వెంకటేశ్వర్లు (వి ఎల్.మల్లాది, వి. మల్లాది, ప్రస్తుతం వెంకట్ మల్లాదిగా అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వున్నవాడు) ఉండటంవల్ల అతడు నన్ను తరచూ చూడటానికి వస్తున్నందువలన నేను హైదరాబాదులో చంచల్‌గూడా జైల్లోనే ఉండటం తటస్తించింది. మేము డెటెన్షను శాసనంలో లోపాన్ని కనుగొనడం, వెంటనే ఇందిరా గాంధి ఆశాసనాన్ని సవరించటం, మరల మేము మరో లోపాన్ని ఎత్తి చూపటం, మరల ఆమె శాసనాన్ని మార్పించడం యిలా సాగింది డెటిన్యూల మధ్య ప్రభుత్వం మధ్య పోరు. ఏదయినా నా రిట్‌ల విషయమయి శాసనాలను చదవడం, 'లా' పాయింట్లను వెతకడం, హైకోర్టు చుట్టూ తిరగడంతోనే 'పుణ్య కాలమంతా' గడిచిపోయింది. నేను మంచి గ్రంధాన్ని రాసే అవకాశం లేకపోయింది అది చేజేతులా చేసుకున్న పొరపాటు; బలహీనత. సుబ్బమ్మ సలహాను పాటించి రిట్ వేసిన చర్య ఫలితం. బహుశః జైలులో నుండి త్వరగా బయటపడాలని నాకూ వుందేమో! లేక పోతే ఆమె సూచనను నేను - పెద్దగా ఆలచించకుండా -ఎందుకు ఆమోదిస్తాను? ఇంతకూ రిట్ వేయకపోయినా ఉద్గ్రంధాన్ని రాయగలిగేవాడినో కాదో! అంత శక్తి సామర్థ్యం, పాండిత్యం, ప్రతిభ, పట్టుదల నాకు లేదేమో! ఏది ఏమయినా నేను జైలులో మంచి పుస్తకం రాయలేదు, ఆమె దానిని అచ్చు వేయించవలసిన ఆగత్యం, అవకాశం ఆమెకు కలుగలేదు.

జైలుకు ఎలా వెళ్ళానో అలా తిరిగి వచ్చేను. నిజానికి నేను జైలుకు వెళ్ళలేదు. జైలుకు తీసుకొని పోబడినాను. గాంధిగారు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నవారివలె, కళ్ళు తెరచుకొని అరెస్టు చేస్తారని తెలిసి దానికి సిద్ధపడి - రాజమండ్రిలోని డెటిన్యూలం ఎవరం - జైలు జీవితాన్ని ఆహ్వానించలేదు. ఇది ముఖ్యమయిన అంశమని నా నిశ్చితాభిప్రాయం ఇది గమనార్హం. తనను గురించి తాను తెలిసికోవడం - అర్ధవంతంగా - తప్పనిసరిగా వుండవలసిన మంచి లక్షణమేమో!

# రాజమండ్రి జైలు విశేషాలు

డెటిన్యూలకు శారీరక కష్టం లేకపోయినా మానసిక క్లేశం ఉండేది  స్వేచ్ఛ అనేది గాలి లాంటిదని, అది వున్నప్పుడు దాని విలువ తెలియదని, లేనప్పుడు దానిని కోల్పోయిన వ్యక్తి ఉక్కిరి బిక్కిరి అవుతాడని ఇటాలియను జాతి నిర్మాత గారి బాల్డీ అన్నట్లు జ్ఞాపకం. ఈ వ్యధకు లోనుకాని బందీ ఉండడు. అయితే కొందరు దానిని బహిర్గతం చేస్తారు. మరి కొందరు మనస్సులో దాచి పెట్టుకొని బాధపడ్తారు. కొందరు డెటిన్యూలు కడు మీదవారు  వారు సంపాదిస్తే తప్ప వారి కుటుంబాలకు గడవదు. డెటిన్యూలుగా జైలులో కాస్తో, కూస్తో - ఇబ్బంది లేకుండా - వారు భోజనం చేస్తుంటే, కుటుంబాలు పస్తులుంటాయని తెలిసి వారు వ్యధ చెందకుండా ఎలా ఉంటారు. మాలో ఎక్కువ మందికి అలాంటి యిబ్బందులు లేవు. కాకపోతే జైలు జీవితం వల్ల మనోధృతినిన, మానసిక స్థయిర్యాన్ని కోల్పోకుండా బ్రతకడానికి శ్రమించడమే మేము చేయవలసిన పని. చాలామందిమి కుటుంబ విషయాలను తోటివారితో చర్చించేవారం కాదు. కాకపోతే వీలయినంత మానసిక శాంతిని స్వంతం చేసుకోవటానికి తాపత్రయపడేవాళ్ళం. అందుకని మేము పూనుకునే ప్రయత్నం వ్యక్తిని బట్టి విభిన్న రూపాలలో వుండేది. ఒక మిత్రుడు అతిగా తినేవాడు. 'స్టోరు'గదిలోకి వెళ్లి - అడపాదడపా - వేరుసెనగపప్పో, కందిపప్పో, అరటి పండ్లో నోట్లో వేసుకొని వస్తుండేవాడు. వస్తువులు తక్కువయినవని 'స్టోరు'ను నిర్వహిస్తున్న డెటిన్యూ అంటే తను తిన్నానని చెప్పేవాడు. మరొక డెటిన్యూ అతిగా మాట్లాడుతుండేవాడు. ఇంకొకతను ఎవరితోమాట్లాడకుండా మౌనంగా కూర్చునేవాడు. వేరొక డెటిన్యూ పుస్తకాలు చదువుతూ కాలం గడిపేవాడు. ఒకానొక డెటిన్యూ తోటి డెటిన్యూలతో సంభాషిస్తూ, ఛలోక్తులు విసురుతూ తను నవ్వుతూ యితరులను నవ్విస్తూ ప్రొద్దు పుచ్చేవాడు. ఒకతను రోజూ వచ్చే దినపత్రికలను మొదటి నుండి చివరి వరకూ చదువుతూ ప్రొద్దుపుచ్చేవాడు. ఇవన్నీ అంతరాంతరాలలో దాగివున్న వ్యధను అధిగమించడానికే ఎవరికి వారు - ప్రత్యేకంగా, విలక్షణంగా, విశిష్టంగా -చేపట్టే పనులు. నిజానికి ఇవి వారు తెలసి, బుద్ధి పూర్వకంగా - ఆలోచించి, తర్కించుకొని, నిర్ణయించుకొని చేసేవి కావు. అనాలోచితంగా జరిగేవి. సహజమయినవి. నేను గ్రంధపఠనంలో, పత్రికలు చదవడంలో, మిత్రులతో సంభాషించడంలో, దేశ స్థితిని అందులో ముఖ్యంగా రాజకీయ పరిస్థితిని గురించి ఆలోచించడంలో నిమగ్నమయ్యేవాడిని.

జూలై 75లో గోరాగారు హఠాన్మరణం చెందారు. జైలులో సంస్మరణ సభ జరిపాం. నేనూ ప్రసంగించాను. ఆయన వ్యక్తిత్వాన్ని మూర్తిమంతాన్ని విశ్లేషించాను. నిజాయితీగా మాట్లాడాను. తరువాత సుబ్బమ్మ దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. తను నాస్తిక కేంద్రానికి వెళ్ళి చూచివచ్చానని,

సుబ్బమ్మతో చెప్పాడు. ఆమెకు ఆశ పుట్టింది. రిట్ దాఖలు చేయండి అని రాసింది రిట్ వేశాను ఇక మొదలయింది కోర్టులో పోరాటం.

రాజమండ్రిలో నాతోపాటు డెటిన్యూగా వున్న అనేక మందికి రిట్లులు రాసిపెట్టాను చివరకు ఆనందమార్గీయునికి కూడా రాసిపెట్టాను. ఒక్కోసారి నలుగురు అయిదుగురు విభిన్న వర్గాలకు చెందిన వారిని చేర్చి ఒక రిట్ రాసి పెట్టడం జరిగింది. రిట్‌లలో పిటిషనర్లందరినీ రిట్‌లలో వాదన చేసుకోవటానికి హైదరాబాదులోని చంచల గూడా సెంట్రల్ జైలుకు తీసుకొని వెళ్ళారు కోర్టులలో కాలహరణం అవుతుంటే, తమరిని చూడటానికి వచ్చే కుటుంబీకులకు యిబ్బంది అవుతుందని తలంచి అలాంటి వారిలో కొందరు తిరిగి రాజమండ్రి వచ్చేశారు నేను మాత్రం హైదరాబాదులోనే వుండిపోయాను హైదరాబాదులో నా మూడవ కుమారుడు మల్లాది వెంకటేశ్వర్లు (వి ఎల్.మల్లాది, వి. మల్లాది, ప్రస్తుతం వెంకట్ మల్లాదిగా అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వున్నవాడు) ఉండటంవల్ల అతడు నన్ను తరచూ చూడటానికి వస్తున్నందువలన నేను హైదరాబాదులో చంచల్‌గూడా జైల్లోనే ఉండటం తటస్థించింది. మేము డెటెన్షను శాసనంలో లోపాన్ని కనుగొనడం, వెంటనే ఇందిరా గాంధి ఆశాసనాన్ని సవరించటం, మరల మేము మరో లోపాన్ని ఎత్తి చూపటం, మరల ఆమె శాసనాన్ని మార్పించడం యిలా సాగింది డెటిన్యూల మధ్య ప్రభుత్వం మధ్య పోరు. ఏదయినా నా రిట్‌ల విషయమయి శాసనాలను చదవడం, 'లా' పాయింట్లను వెతకడం, హైకోర్టు చుట్టూ తిరగడంతోనే 'పుణ్య కాలమంతా' గడిచిపోయింది. నేను మంచి గ్రంధాన్ని రాసే అవకాశం లేకపోయింది అది చేజేతులా చేసుకున్న పొరపాటు; బలహీనత. సుబ్బమ్మ సలహాను పాటించి రిట్ వేసిన చర్య ఫలితం. బహుశః జైలులో నుండి త్వరగా బయటపడాలని నాకూ వుందేమో! లేక పోతే ఆమె సూచనను నేను - పెద్దగా ఆలచించకుండా -ఎందుకు ఆమోదిస్తాను? ఇంతకూ రిట్ వేయకపోయినా ఉద్గ్రంథాన్ని రాయగలిగేవాడినో కాదో! అంత శక్తి సామర్థ్యం, పాండిత్యం, ప్రతిభ, పట్టుదల నాకు లేదేమో! ఏది ఏమయినా నేను జైలులో మంచి పుస్తకం రాయలేదు, ఆమె దానిని అచ్చు వేయించవలసిన ఆగత్యం, అవకాశం ఆమెకు కలుగలేదు.

జైలుకు ఎలా వెళ్ళానో అలా తిరిగి వచ్చేను. నిజానికి నేను జైలుకు వెళ్ళలేదు. జైలుకు తీసుకొని పోబడినాను. గాంధిగారు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నవారివలె, కళ్ళు తెరచుకొని అరెస్టు చేస్తారని తెలిసి దానికి సిద్ధపడి - రాజమండ్రిలోని డెటిన్యూలం ఎవరం - జైలు జీవితాన్ని ఆహ్వానించలేదు. ఇది ముఖ్యమయిన అంశమని నా నిశ్చితాభిప్రాయం ఇది గమనార్హం. తనను గురించి తాను తెలిసికోవడం - అర్థవంతంగా - తప్పనిసరిగా వుండవలసిన మంచి లక్షణమేమో!

సుబ్బారెడ్డిగారికి తను యింకా ఎంతకాలం జైలులో వుండవలసి వస్తుందో అని తోచింది కాబోలు తన సహచరులు ఎన్నాళ్ళు జైలు జీవితం గడిపారో తెలుసుకోవాలనే ఆలోచన కల్గింది. 'ఎ' బ్లాకుకు ఒక చివరన పెద్దగా ఎవరితో మాట్లాడకుండా మౌనంగా, కూర్చుంటున్న ప్రకాశరెడ్డిని - ఎర్ర జెండా నక్సలైటును, ఇంతా రమణారెడ్డి వర్గం వాడిని - సమీపించి 'మీరు మొత్తం ఎంతకాలం జైల్లో వున్నారని' అడిగాడు. అతడు ఒక క్షణం ఆలోచించి గుణించి లెక్కకట్టి నాలుగున్నర సంవత్సరాలన్నాడు. దాంతో సుబ్బారెడ్డిగారు గాభరాపడ్డారు. ఇక యిలా లాభం లేదనుకొని అదే బ్లాకులో మరో చివర మంచం వున్న శ్రీ అట్లూరి శ్రీమన్నారాయణను అదే ప్రశ్న వేశాడు. "ఎందుకయ్యా నీకీ గోల" అంటూనే శ్రీమన్నారాయణ లెక్కలు వేసి రాజీయ హత్యకేసులో తను జైలులో వున్న కాలం కూడ కలిపి పన్నెండున్నర సంవత్సరాలని చెప్పాడు. సుబ్బారెడ్డిగారి గుండె జారిపోయింది. ఇక యీ బ్లాకు లాభం లేదని తలచి 'బి' బ్లాకులో కాస్త వయస్సు మళ్లినవాడు, సౌమ్యుడుగా కన్పించే ఎన్ రామారావుగారి వద్దకు వెళ్లి అడిగాడు అయన కాస్త జ్ఞాపకం తెచ్చుకొని "ఆ గాంధి వున్నాడే అయన ఉద్యమంలో సత్యాగ్రహిగా మొదటిసారి జైలుకు వెళ్ళానని, చివరిసారిగా 1974 రైల్వే పనివారి సమ్మెలో జైలులో వున్నానని' చెప్పి 1, 2, 3, 4, అర్థ సంవత్సరములు వెరసి 14 న్నర సంవత్సరాలని జవాబిచ్చాడు. ఇది విన్న సుబ్బారెడ్డిగారు బేజారయి పోయినారు 'వీళ్లంతా పాతకాపులు. వీరి మధ్య వచ్చి పడ్డానే నా దురదృష్టం. ఇక నాకేది దారి' అంటూ మరల 'ఎ' బ్లాకుకు తిరిగి వచ్చాడు. కొల్లా వెంకయ్యగారు తన ప్రదేశంలోనే కూర్చొని ప్రశాంతంగా చదువుకుంటున్నారు. ఆయనను సుబ్బారెడ్డిగారు సమీపించి నమస్కరించి అందరినీ అడిగిన ప్రశ్ననే అడిగారు "నిన్నగాక మొన్ననే వచ్చావు. అప్పుడే బయటికి పోవాలని అంత తాపత్రయమా." అని వెంకయ్యగారు కసురుకున్నారు. ఆయన వస్తుత: శాంత స్వభావులు. ఎవరినీ దూషించి ఎరుగరు. పరుష వాక్కులు ఆయనకు ఆమడ దూరం. అలాంటి ఆయన యిలా విసిరికొట్టేటప్పటికి సుబ్బారెడ్డిగారికి మతిపోయింది. నా వద్దకు వచ్చి ఆ విషయం చెప్పారు. "ఈరోజు దినపత్రిక చదివారా మీరు?" అని సుబ్బారెడ్డిగారని అడిగాను. లేదని సమాధానం చెప్పారు. లేదని సమాధానం చెప్పారు. "చదవండి. ఈ రోజు పార్వతీపురం కుట్రకేసులో వెంకయ్యగారికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. అందుకే ఆయన కాస్త చికాకుగా వున్నారు" అన్నాను సుబ్బారెడ్డిగారు అవాక్కయినారు. మనిషి చేష్టలుడిగి బ్రాన్పడిపోయాడు. పది నిముషాలయిన తరువాత తేరుకొని "వీళ్ల మధ్యకు వచ్చి పడ్డాను. నాకిక ముక్తి లేదు" అంటూ బ్లాకులో తన మంచం మీదికి చేరాడు. ఈ కథను మా కందరికీ రోజుకొకసారి అయినా సుబ్బారెడ్డిగారు చెప్పడం, ఎప్పటికప్పుడు చిలవలు పలవలు చేరుస్తున్నందువల్ల అది వినసొంపుగా వుండటం మాకు కాలక్షేపమయింది.

# చంచల్‌గూడలో కారాగార వాసం

నా 'రిట్' పిటీషనులో వాదన చేసుకోటానికి హైదరాబాదు జైలుకు తెచ్చారు కదా! నేను వచ్చేటప్పటికి డెటిన్యూలకు నాలుగు 'మెస్'లు వుండేవి. నాలుగు పొయ్యిలు. రాష్ట్రీయ స్వయం సేవక మెస్, నక్సలైట్ల మెస్, సోషలిస్టు మెస్, జమాయతు ఇస్లాంమియా మెస్ ఇలా నాలుగు వున్నాయి. మొదట్లో ఒకటే 'మెస్' ఉండేదట. కాని కొందరు విడుదల అయి మరల రావటంతో ఈ విభజన వచ్చిందట. డెటిన్యూ వార్డుకు రెండు బ్లాకులు వుండేవి. నేను మొదట్లో స్వయం సేవకుల మెస్‌లో చేరి తరువాత ఒక నెలకు సోషలిస్టు మెస్‌లో చేరాను. ప్రతి మెస్‌కు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొని ఆ ప్రతినిధుల కమిటీ డెటిన్యూల తరపున జైలు సూపరింటెండెంటుకు కలిసి మాట్లాడేది.

ఆనాడు స్వయం సేవకుల మెస్‌లో సర్వశ్రీ గొట్టిపాటి మురళీ మోహన్, దేశపాండే(రాష్ట్రస్థాయి నాయకులలో రెండవవారు), నరేంద్ర (ఈనాడు హిమాయత్‌నగర్ శాసన సభ్యుడు, భారతీయ జనతాపార్టీ రాష్ట్ర ప్రధాన కార్యదర్శులలో ఒకరు) శేషాచారి (అడ్వకేటు), గౌడ్ వుండేవారు. సర్వశ్రీ వరవర రావు (విరసం నాయకులు), తారకం(ఈనాడు ఆం.ప్ర. బహుజన పార్టీ ప్రధాన కార్యదర్శి), చెరబండరాజు(ప్రఖ్యాత విప్లవ రచయిత, కీర్తి శేషుడు) ప్రభృతులు నక్సలైట్లలో ప్రసిద్ధులు. ఎం టి. ఖాను (అపుడు 'పిలుపు' సంపాదకుడు, ఈనాడు ఆం ప్ర పౌరహక్కులు సభాధ్యక్షుడు), సీతల్ సింగ్ లష్కరీ( ఆనాడు సోషలిస్టు కార్మికోద్యమ నాయకుడు, తరువాత కాంగ్రెసు నాయకుడు. ఈనాడు లేడు), ఎ.వి.కె చైతన్య (రైల్వే లేబరు యూనియన్ నాయకుడు,యీనాడు సమతా పార్టీ నాయకుడు), కృష్ణారెడ్డి (ఆనాడు కల్వకుర్తి పంజాయతీ అధ్యక్షుడు, సోషలిస్టు) నాయని నర్సింహారెడ్డి (సోషలిస్టు కార్మికోద్యమ నాయకుడు, ఇపుడు జనతాపార్టీ నాయకుడు) నేను, తదితరులు లష్కరీచే నిర్వహింపబడే సోషలిస్టు మెస్ సభ్యులం. జమాయత్ ఇస్లామీ మెస్‌లో ఆనంద మార్గీయులు ముగ్గురు వుండేవారు.

ఒకరి సిద్ధాంతాలను తతిమ్మావారు తెలిసికోవాలని వారానికొకరు తమ సిద్ధాంతాన్ని వివరించటానికి సమావేశాలను నిర్వహించేవారు. అందువలన విజ్ఞానం పెరిగింది కనీసం జైలులో సహనభావం పెరిగింది. న్యాయమూర్తి మాధవరెడ్డి (తరువాత ఆం.ప్ర., బొంబాయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి) తన సోదర న్యాయమూర్తితో కలిసి యిచ్చిన తీర్పులో డెటిన్యూ నిర్బంధానికి కారణాలను జిల్లా మెజిస్ట్రేటు అందజేస్తే ఆ కారణాల పత్రాన్ని డెటిన్యూ ధర్మాసనం ముందుకు తెచ్చి చూపిస్తే ఆ దస్తావేజును తప్పక చూస్తామని తీర్పు చెప్పారు డెటిన్యూ అలా ఆ పత్రాన్ని ధర్మాసనానికి చూపినా తాము చూడమని న్యాయమూర్తులు చిన్నపరెడ్డి, జీవన

రెడ్డిలతో కూడిన ధర్మాసనం (తరువాత వారు సుప్రీం కోర్టు న్యాయమూర్తులయ్యారు) తీర్పు చెప్పింది. నా రిట్ పిటిషన్ రెండవ ధర్మాసనం ముందుకు వాదనలకు వచ్చింది. రెండు ధర్మాసనాలు విరుద్ధ తీర్పులను యిచ్చాయి కనుక నా రిట్‌ను రెండవ ధర్మాసనం విచారణకు తీసుకొనరాదని, దానిని ముగ్గురు న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనానినికి పంపాలని నేను వాదించాను. అంత ఆ న్యాయమూర్తుల ధర్మాసనం నా రిటన్‌ను ముగ్గురితో కూడిన 'ఫుల్‌బెంచ్' కి పంపారు. ఆ ధర్మాసనం నా వాదనను వని, 'బీహారు తరహా ఆందోళన' అనే పదజాలం అస్పష్టమని, 'సమగ్ర విప్లవం' అనేది కూడా ఆ కోవకు చెందినదేనని, ఏదయినా డెటిన్యూ నిర్బంధానికి చూపిన కారణాలలో ఏ ఒక్కటి అయినా అస్పష్టమయి చెల్లనిదయితే నిర్బంధించే ఉత్తరువు రద్దు చేయబడుతుందని ధర్మాసనం తీర్పు చెప్పి నా విడుదలకు ఉత్తర్వు జారీ చేసింది. నా కేసును నేనే వాదించుకొన్నాను

శ్రీ వి.యం. తార్కుండే వచ్చి వాదిస్తానని నా సతి సుబ్బమ్మకు ఉత్తరం రాస్తే ఆమె ఆ సంగతి నాకు తెలియజేసింది. ఆయనకు కృతజ్ఞత తెలియచేయవలసినదని, ఆం.ప్ర. హైకోర్టుకు నా వాదనాపటిమ చాలునని ఆయనకు రాయమని సుబ్బమ్మను కోరాను. అందువల్ల నేనే వాదన చేయడం జరిగింది. నాతోపాటు డా॥ యలమంచిలి శివాజీ, తెలంగాణాకు చెందిన ఇరువురు డెటిన్యూలు ఆ తీర్పు వల్ల విడుదల అయినారు. తెలంగాణా డెటిన్యూల తరఫున శ్రీ కె.జి. కన్నబిరాన్ ఉచితంగా వాదించారు. డా॥ యలమంచిలిశివాజీ రిట్ అచ్చం నాలాంటిదే కావడంతో అతనికి వేరే ప్రత్యేకంగా వాదన చేయాల్సిన అవసరం లేక పోయింది. పై చెప్పిన రిట్‌ల హియరింగు 1976 మార్చి మాసాంతంలో జరిగింది. నాకుమార్తె విజయలక్ష్మి వివాహం రేపనగా 1976 ఏప్రిల్ 8వ తేదీన తీర్పు వెలువడింది. నా భార్యకు అపరేషను జరుగవలసి వుండటంతో (తేది 12-4-1976న జరిగింది) నేను వచ్చాను. ఇదీ నా స్వంత రిట్ కథ. ఈ తతంగం సుమారు 8 నెలలు పట్టింది.

చంచల గూడ సెంట్రలు జైలులో నేనుండగా అనేకమయిన విచిత్ర సంఘటనలు జరిగాయి. స్థలాభావం చేత రిట్‌ని మాత్రం పేర్కొని వదిలి వేస్తాను. ఇంచుమించుగా ప్రతిదినం నరేంద్ర ఉస్మానియా ఆసుపత్రికి వెళ్లేవాడు. అతని వద్ద-క్షయ, కుష్టు, సుఖరోగాలకు తప్ప అన్ని వ్యాధులకు అన్ని వైద్యశాఖల చీట్లు వుండేవి అవన్నీ వైద్యులు సాధికారికంగా యిచ్చినవే అతనికి ఏ జబ్బు - తీవ్రమయినది లేదని అందరు డెటిన్యూలకు తెలుసు. నిషిద్ధ పత్రాలు, కరపత్రాలు తేవటానికి వెళ్తున్నాడని కూడా తెలుసు. అందుకనే ఏ డెటిన్యూ కూడా అతడు రోజూ ఆస్పత్రికి వెళ్లడమేమిటని పేచీ పెట్టలేదు. ఒకరోజు నరేంద్ర ఆసుపత్రికి వెళ్ళలేదు. "ఎందుకు వెళ్ళ లేదు" అని అడిగాను. ఆరోగ్యం బాగా లేదని అతని జవాబు. అది విని అందరం హాయిగా నవ్వుకున్నాం.

# 2వ భాగం

మరొకటి మేము దాఖలు చేసిన 'కాపురాల రిట్' విషయం. ఒకరోజు నేనుభోజనం చేసి వస్తుంటే నలుగురు మిత్రులు ఏదో విషయాన్ని చర్చిస్తున్నారు. నేను ఆగి విషయమేమిటని అడిగాను. వారిలో గొట్టిపాటి మురళీమోహన్ ఉన్నాడు. డెటెన్యూల భార్యలతో జైలు కాపురం చేయటానికి సౌకర్యాలు కలుగజేయమని తను రిట్ పిటిషన్ రాశాడట. ఎవరు దానిని వాదించాలన్నదే మీమాంసయట. నేను ఆ కాగితాన్ని తీసుకొని చదివాను. మీకు అభ్యంతరం లేకపోతే నేను వాదిస్తానన్నాను. వారు "సరే" అన్నారు. డెటిన్యూల భార్యలను రిట్‌లో రెస్పాండెంట్లుగాచేర్చాలికనుక, వారు తమ భర్తలతో జైల్లో వుండటానికి యిష్టపడుతున్నట్లు దాఖలు చేయాల్సి వస్తుందని మురళీమోహన్ భార్య ప్రభుత్వ సర్వీసులో డాక్టరవటం చేత ఆమె అలా అఫిడవిటు దాఖలు చేస్తే ఆమె ఉద్యోగానికి ముప్పు కలుగుతుంది కనుక మురళీమోహన్‌ను పిటీషనరుగా ఉండవద్దని చెప్పాను. అందరూ అంగీకరించారు. నేను, సర్వశ్రీ నరేంద్ర, బంగారు లక్ష్మన్న (ఈనాడు జనతాపార్టీ దళిత మోర్చా అధ్యక్షుడు) శేషాచారి యింకా డెటిన్యూలు పిటషనర్లం. రిట్ దాఖలు అయింది. విచిత్రంగా కన్పడిందేమో రిట్‌ను హైకోర్టు స్వీకరించి నోటీసులు జారీ చేయమని ఉత్తరువు యిచ్చింది. 6గురు పిటీషనర్ల భార్యలు జైలులో భర్తలతో కలసి కాపురం చేయటానికి అంగీకరిస్తూ అఫిడవిట్లు దాఖలు చేశారు. ప్రభుత్వం తరుపున రిట్‌ను వ్యతిరేకిస్తూ కౌంటరు అఫిడవిటు దాఖలు అయింది. పిటీషనర్లకు హైకోర్టులో వాదించే విధానం తెలియదనుకున్నారో ఏమో, లేక సామర్థ్యం లేదనుకున్నారేమో పిటీషనర్లు తరపున వాదించడానికి అలాయిదాగా వేరే న్యాయవాదిని నిర్ణీతమయిన ఫీజును మంజూరు చేస్తూ హైకోర్టు నియమించింది న్యాయమూర్తులు చెన్నకేశవరెడ్డి (తరువాత ప్రధాన న్యాయమూర్తి అయ్యారు) కొత్తపల్లి పున్నయ్య గారల ధర్మాసనం ముందుకు మా రిట్ హియరింగ్‌కు వచ్చింది. అంతకు ముందు వాయిదా రోజున న్యాయమూర్తుల అనుమతి తీసుకొని ఆం.ప్ర. హైకోర్టు న్యాయవాద సంఘ గ్రంథాలయాన్ని దర్శించి నోట్సు వ్రాసుకొని వచ్చాను. ముందొక పోలీసు, వెనుక ఒక పోలీసు గుండ్లు దట్టించిన తుపాకీలతో వెంట వస్తుంటే వారి మధ్య నేను నడుస్తుంటే నాకే నవ్వు వచ్చింది. హైకోర్టు న్యాయమూర్తి ముందు ఒకడే దండధరుడనే చోపుదారు వుంటాడు. నాకు మాత్రం ఇద్దరు నన్నుచూచి న్యాయవాది మిత్రులు విస్తుపోయారు. కుశల ప్రశ్నాదికములు చేశారు. కేసు పిలిచారు. లేచి నా మిత్రుల తరపున నేను వాదిస్తానని చెప్పాను. అనుమతి యిచ్చింది ధర్మాసనం ఈ రిట్ రాజ్యాంగపు 25 వ అధికరణం క్రిందకు వస్తుందని, పౌరుని మతానికి భంగం కలుగరాదని, మతమంటే విశ్వాసమనీ, మేము వివాహితులమని, మా భార్యలు మా సహధర్మచారిణులని, వారిని విడిచి వుండమని పెళ్ళినాడే ప్రమాణాలు చేశామని, అలా వారిని వదిలిపెట్టమని మమ్మల్ని

శాసించటానికి, నిర్బంధించడానికి ఎవరికీ, - చివరకు ప్రభుత్వానికి కూడా - హక్కు లేదనీ, మా భార్యలు రెస్పాండెంట్లుగా తాము జైలులో తమభర్తలతో కాపురాలు చేయటానికి సిద్ధంగా వుండి అఫిడవిట్‌లు దాఖలు చేశారని చెప్పి వాదన ప్రారంభించాను. చిత్రమయిన రిట్ కనుకనూ, డెటిన్యూల మీద సానుభూతి వున్నందువలననూ 20 మంది దాకా న్యాయవాదులు హియరింగు జరిగినంతసేపూ కోర్టులో కూర్చున్నారు. వారు హాజరు ఉండటం నా ఉత్సాహాన్ని పెంచింది వేదాల దగ్గర నుండి పెళ్ళి నాటి వివాహాల ప్రాశస్త్యాన్ని, రుషులు ఆ ప్రమాణాలను ఎలా గౌరవభావంతో చూచిందీ, రుషుల ప్రార్థనలలో 'నాకు మంచి భార్య నిమ్ము' అనే వాక్యాలను ఉటంకిస్తూ వివరించ సాగాను. తమ అమూల్యమయిన కాలాన్ని వృథా చేస్తున్నానని న్యాయమూర్తులు భావించారేమో "మీరు క్లుప్తంగా మీ వాదన వినిపించండి లా పాయింటును శ్రీ వి. వెంకట రమణయ్యగారు (కోర్టు నియమించిన లాయరు. తరువాత ఆం.ప్ర. అడ్వకేటు జనరలు అయినారు) విశదీకరిస్తారు" అని సీనియరు న్యాయమూర్తి అన్నారు. నాకు చిరుకోపం వచ్చింది. "పిటీషనర్లం పట్టభద్రులం. నల్గురం న్యాయశాస్త్రంలో పట్టభద్రులం. ఇద్దరం కోర్టులో ప్రాక్టీసు చేస్తున్న ప్లీడర్లం. కనుక కోర్టు భాష మాకు పరిచయము. కోర్టులో ఎలా ప్రవర్తించాలో, కోర్టువారికి ఏమి అధికారాలు ఉన్నాయో మాకు బాగా తెలుసు. కనుకు మమ్మల్ని తీరికగా వాదించనివ్వండి" అని అన్నాను. పబ్లిక్ ప్రాసిక్యూటరు ప్రభుత్వం తరుపున వాదించడానికి ఎదురుగా కూర్చుని వున్న మిత్రుడు భీమరాజు(ఆంధ్ర క్రైస్తవ కాళాశాలలో అతడు నేను ఇంటర్మీడియట్ తరగతిలో ఒకే సెక్షనులో చదువుకున్నాం) లేచి రామమూర్తి గుంటూరు జిల్లాలో పేరు ప్రఖ్యాతలున్న ప్లీడరని చెప్పాడు. అంత న్యాయమూర్తులు మిన్నకున్నారు. నేను వాదన కొనసాగించాను. మొత్తం రెండు గంటలు వాదన చేశాను. చివరకు సుప్రీంకోర్టు తీర్పును పేర్కొని చదివాను. ఒక డెటిన్యూ భౌతిక శాస్త్రంపై గ్రంథం రాస్తే ప్రకటనార్థం రాతప్రతిని పబ్లిషరు వద్దకు పంపిచటానికి జైలు అధికారులు నిరాకరించారు. డెటిన్యూ రిట్ దాఖలు చేశాడు. 'అతనిని ప్రభుత్వం భోజనం' చేయనిస్తున్నది, ఆటలు ఆడనిస్తున్నది, గ్రంథాలు, పత్రికలు చదువనిస్తున్నది. చివరకు పొలాల మీద వచ్చే మక్తాలు, ఇళ్ల మీద వచ్చే అద్దెలు, షేర్లమీద డివిడెండ్లు, ఫిక్సుడు డిపాజిట్లమీద వడ్డీలు తీసుకోనిస్తున్నవి. అతడు రాసిన పుస్తకం రాజ్యాన్ని ప్రమాదంలో పడవేసేది కాదు, దానివల్ల రాజ్యానికీ దేశానికి భద్రత నశించదని కనుక ఆ పుస్తకాన్ని ప్రచురించే హక్కు ఆ డెటిన్యూకు ఉందని సుప్రీం కోర్టు తీర్పు యిచ్చింది. పిటీషనర్ల భార్యలు జైలు నుండి బయటికి లోపలికీ అదేవనిగా తిరగరు వారు జైలులోనే ఉంటారు కనుక దేశభద్రతకు, ప్రజా భద్రతకు ప్రమాదం లేదని చెప్పాను. మమ్మల్ని జైలు గోడల మధ్య వుంచారు. అలాగే ఉంటాము. 'డిటెన్షను' అంటే నిర్ణయింపబడిన ప్రదేశంలో ఉంచడం కనుక మేము ఆ పరిమితులకు

వాసయోగ్యమయిన గదులు (గృహనిర్మాణం) కట్టించమని పిటీషనర్లు అభ్యర్థన అని నా వాదనను ముగించాను. తరువాత హైకోర్టు వారిచే నియమింపబడిన న్యాయవాది వెంకటరమణయ్యగారు పిటీషనర్ల వాదనను సమర్థవంతంగా బలపరిచారు. పబ్లికు ప్రాసిక్యూటరు రిట్ విచారణను మరుసటి రోజుకు వాయిదా వేయమని కోరాడు. వాయిదా యిచ్చారు. మరునాడు 'డిటెన్షన్' అనే పదానికి వేరుగా వుంచడం (సెగ్రిగేషను) అని ఆయన అర్థం చెప్పారు. జవాబులో " ఆ అర్థం తప్పు. 15 రోజుల కొకసారి భార్యాపిల్లలతో మేము సమావేశమయి మాట్లాడుతున్నాం; ప్రభుత్వం అనుమతి యిచ్చి అందుకు వలసిన సౌకర్యాలు కలుగజేస్తున్నది' ' అని వాదించాము. తీర్పు కొరకు వాయిదా వేశారు న్యాయమూర్తులు. తీర్పు మాకు వ్యతిరేకంగా వచ్చింది 400 మంది డెటిన్యూలకు వేరే గృహ వసత కల్పించవలసిన అవసరం ప్రభుత్వానికి కలుగలేదు. అప్పీలుకు నకలు దరఖాస్తు చేశాను. ఇంతలో నేను పెరోలు మీద వెళ్ళాను. తరువాత నన్ను హైకోర్టు విడుదల చేసింది కనుక నేను డెటిన్యూగా మళ్ళీ జైలులోకి పోవడం అగత్యం లేకపోయింది సౌకర్యాలు వగైరా కోరుతూ, విడుదలను ఆశిస్తూ డెటిన్యూలు రిట్‌లు దాఖలు చేయడానికి వీలు లేదని, వారికి మౌలిక హక్కులు (ఫండమెంటల్ రైట్సు) పోయాయి కనుక లేవని సుప్రీం కోర్టు తీర్పు యిచ్చింది. దాంతో మా కాపురాల రిట్ ముగిసింది. ఈ తీర్పు 'లా' రిపోర్టర్ల దృష్టిని ఆకర్షించలేదేమో అది 'లా జర్నల్స్'లో చోటు సంపాదించుకోలేకపోయింది. ఈ రిట్ స్థూలంగా హాస్యాస్పదంగా కన్పడినా ఇందులో మానవ నీతి, న్యాయసూత్రం యిమిడి వున్నాయి కనుక యింతగా రాయాల్సి వచ్చింది.

# ఆత్యయిక పరిస్థితికి వ్యతిరేకంగా

ఆత్యయిక పరిస్థితికి వ్యతిరేకంగా కృషిచేయటం అనేక రకాలుగా సాగింది (1) కేవలం తీర్మానాల రూపంగా, పత్రికా ప్రకటనలద్వారా నిరసన వెలిబుచ్చడం (2) ఎమర్జన్సీని సమర్థించకుండా మౌనం వహించడం. ఈ వైఖరులను ఎవరు ఎలా ప్రదర్శించారో పరికిద్దాం మొదటి దానిని కమ్యూనిస్టు మార్క్సిస్టులు అవలంబించారు. ఎమర్జెన్సీ విధింపబడిన మొదటి వారంలో గోడలమీద పోస్టర్లతో నిరసించిన తీరు, తరువాత తమ పార్టీ జిల్లా నాయకులను ప్రభుత్వం నిర్బంధించినా, తమ పాలిట్‌బ్యూరో సభ్యుడు బసవ పున్నయ్యను ఒక నెలరోజులు పైగా డెటాన్యేగా తీసుకున్నా, ఏ విధమయిన ప్రత్యక్ష కార్యాచరణకు దిగలేదు. పార్లమెంటు లో ఉపన్యాసాలకు వారి విమర్శపరిమితమయింది కాకపోతే పార్టీ సభ్యులకు, పార్టీ 'కేడర్ల' కు నోటిమాట ద్వారా ఎమర్జెన్స్ దుర్మార్గమని, అన్యాయమని చెప్పుకున్నారు అంతటితో వారి బాధ్యత తీరిపోయిందనుకున్నారు. సుందరయ్యగారు, మోటూరు హనుమంతరావుగారలు అజ్ఞాతవాసానికి వెళ్ళిపోయారనుకోండి

ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా కృషిచేసిన ఘనత శ్రీ వి.ఎం తార్కుండెది, జనతంత్ర సమాజ్‌ది. తన ఆంగ్ల మాసపత్రిక 'రాడికల్ హ్యూమనిస్టు' పుటలలో ఆత్యయిక పరిస్థితిని ఘాటుగా విమర్శిస్తూ రాశాడు. పౌర జీవితం నుండి వైతొలగిన మాజీ న్యాయమూర్తులను, విద్యా వేత్తలను సమీకరించాడు వారి ద్వారా 'ఎమర్జెన్సీ ప్రతిఘటన కేంద్రాలను నలకొల్ప గలిగాడు. పార్టీలకు అతీతంగా వున్న మేధావులను, పార్టీలలో చేరని విద్యావేత్తలను వారి దీర్ఘ నిద్రనుండి మేల్కొల్పాడు. తన అనుచరులను కార్యోన్ముఖులను చేశాడు. దరులాంటి వారిచేత సైకిలిస్టయిలు బులిటెనులు వేయించాడు. జనతంత్ర జమాజ్‌ను ఎమర్జెన్సీ వ్యతిరేక సంస్థగా రూపొందించాడు. అదే ఆయనకు పేరు ప్రఖ్యాతులను సంతరించి పెట్టింది. అందుకే అతనితో సహకరించటానికి ప్రతిపక్ష పార్టీలవారు 1976లో ముందుకు వచ్చి పౌరహక్కుల ఉద్యమాన్ని ప్రారంభించడానికి (1976 అక్టోబరులో పి.యు.సి.ఎల్. స్థాపన) తోడ్పడ్డారు.

ఎమర్జెన్సీని మాటలతో వ్యతిరేకించడమేకాక చేతలతో ఎదురు తిరిగి పోరాడినవారు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘం (ఆర్.ఎస్.ఎస్.) వారు వారి నాయకులు అజ్ఞాతవాసానికి వెళ్లడమేకాక, వారి అనుయాయులచేత బహిరంగంగా సత్యాగ్రహాలు చేయించారు. సందర్భం వచ్చింది కనుక ఇక్కడ ఒక్కమాట చెప్పాల్సి వస్తున్నది. నేను రాజమండ్రి సెంట్రలు జైలులో వున్నపుడు, ఎమర్జెన్సీ విధింపబడిన సుమారు వారంరోజులకు, మాకినేని బసవపున్నయ్యగారు (ఎం.బి) డెటిన్యూగా జైలుకు తీసుకొనిరాబడినారు. ఒకే హాలులో (మధ్య ఆర్చీలుండేవి) ఒక

చివర ఆట్లూరి శ్రీమన్నారాయణగారు, ఎం బి., నేను, డా॥ శివాజీ యిలా సుమారు 18 మందిమి వుండేవారం మా మంచాలమధ్య అడ్డుగోడలు లేవు. నేను గుంటూరులోని ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో బి.ఎ. మొదటి సంవత్సరం (ఆనాడు దానిని 'ఫర్స్ట ఇయర్' అనేవారు) చదువుతున్నపుడు -- 1937-38 జనవపున్నయ్య గారు బి.ఏ రెండవ సంవత్సరం చదువుతుండేవారు అప్పటికే వారు విద్యార్థి నాయకులు నేనూ విద్యార్థి ఉద్యమంలో పాల్గొంటూ వుండేవాడిని. అలా పరిచయం ఆ అవకాశం తీసుకొని తరుచు వారితో ఇష్టా గోష్టిగా మాట్లాడుతుండేవాడిని. కమ్యూనిస్టులకు, కమ్యూనిస్టు (మార్క్సిస్టు) లకు ఆర్.ఎస్.ఎస్. చుక్కెదురు కదా! మాటల సందర్భంలో ఎం.బి. రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘాన్ని తీవ్రంగా విమర్శించారు అంత నేను "వారు కాస్తయినా ఎమర్జెన్సీని ప్రతిఘటిస్తున్నారు కదా! మనవాళ్ళు (అంటే కమ్యూనిస్టు, మార్క్సిస్టు) అన్నమాట ఆ మాత్రం కూడా చేయటం లేదు." అన్నాను ఎం.బి మౌనం వహించారు. ఇది 1975 నాటి గాథ. నేను హైదరాబాదులోని చంచల్‌గూడా సెంట్రల్ జైలుకు వచ్చిన తర్వాత రాష్ట్రీయ స్వయం సేవక్‌ల ప్రతిఘటన యింకా తీవ్రరూపం దాల్చింది. బహిరంగ ప్రదేశాలలో వారి సభ్యులు బహిరంగంగా ఎమర్జెన్సీ వ్యతిరేక నినాదాలు చేసి, వ్యతిరేకంగా పోరాడమని ప్రజలకు విజ్ఞప్తి చేసి కరపత్రాలను పంచారు. పోలీసులవల్ల అరెస్టు చేయబడడమేకాక, 6,9,12 నెలల కారాగారవాస శిక్షలకు లోను కావడమే కాక, పోలీసు చేతిలో క్రూర హింసల -- బూటు కాళ్ళతో తన్నులు, లారీ దెబ్బలు, సిగరెట్లతో కాల్పులు, వాతలు యిత్యాదులు -- పాలయినారు. మొక్కవోని ధైర్యంతో అచంచల విశ్వాసంతో, అవమానాలను, హింసలను, జైలు జీవితాలను భరించారు. గుంపులో, మూకలో, జన సముదాయాలలో వుంటూ -- అందరితో చావు అందల మొక్కినట్లు భావించి -- అన్యాయాన్ని ఎదిరించి పోరాడటం ఒక ఎత్తు ఒంటరిగా, ఒక్క మనిషిగా పోరాటానికి దిగడం మరో ఎత్తు. మహాత్మాగాంధీ 1930, 1932 ఉద్యమాలలో ప్రజలకు దానికి కావలసిన స్థైర్యాన్ని యిచ్చాడు అదే అయన గొప్పతనం. గాంధీపేర, గాంధీ అనుచరులుగా -- ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధీ అనుకుంటారేమో!. అయన మహాత్మాగాంధీ -- 1930, 1932లలోని స్త్రీ పురుష సత్యాగ్రహులవలె అర్.స్.ఎస్. సత్యాగ్రహులు 1976లో తెలిసి, కళ్ళు తెరుచుకొని శాంతియుత పోరాటాన్ని జరిపారు. ఇవి వీరోచిత చర్యలు. త్యాగమూర్తులు వారు. సర్వశ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు, -- 'పిరాట్ల' ఆనాటి అఖిల భారత స్థాయి విద్యార్థి నాయకులు, ఈనాటి కృష్ణా పత్రిక సంపాదకులు, గ్రంథకర్త - వెంకయ్య నాయుడు (ఆనాడు విద్యార్థి నాయకుడు, ఈనాడు భారతీయ జనతాపార్టీ ప్రధాన కార్యదర్శులలో ఒకరు) ప్రభృతులు అజ్ఞాతవాసం చేస్తే డెటిన్యూలుగా జైలు పాలయ్యారు.

ఇక నాలుగవ కోవకు చెందిన వారి సంగతి. రాజకీయ స్పృహ కలిగి కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల సభ్యులు, వారి సానుభూతి పరులు కానివారు, ఆంధ్రప్రదేశ్‌లోని హేతువాదులు నాస్తికులు, అజ్ఞేయవాదులు. వీరికి అత్యయిక పరిస్థితి విధింపు సమ్మతం. కాకపోయినా ఏ

కారణాల వలననో -- ఎవరి కారణాలు వారికి ఉన్నట్లున్నాయి -- మిన్నకున్నారు. సమర్థించనూ లేదు. వ్యతిరేకించనూ లేదు. ఏదయినా వారు వ్యతిరేకించినట్లు బహిరంగ సాక్ష్యాలు లేవు.

దేశంలో చెడు ఎప్పుడు పెరుగుతుందని పరిశీలిస్తే కొన్ని అంశాలు వెలికివస్తాయి. చెడును ప్రత్యక్షంగా గాని పరోక్షంగా కాని పోషించేవారు, పెంపొందించేవారు, నాలుగు తెరగులు. (1) చెడును చేసేవారు (2) చెడు చేసేవారిని ప్రేరేపించేవారు, (3) చెడు చేసేవారికి సహాయం చేసేవారు (4) చెడును వ్యతిరేకించనివారు నాలుగు రకపు మనుషుల సంఖ్య తతిమ్మా వారి కన్న అత్యధికం వీరి ఉదాశీనత, నిర్లక్ష్యం చెడుచేసే వారికి పరోక్షంగా సాయపడతాయి. ప్రపంచంలో ఎక్కడయినా, ఎప్పుడయినా ప్రజాస్వామ్య వ్యవస్థ కూలిపోయినదంటే, నియంతలు ఉద్భవిల్లారంటే, నిరంకుశత్వం పెచ్చు పెరిగిందంటే ఆ దేశపు లేక ఆ ప్రాంతపు ప్రజలలోని విజ్ఞులలో అత్యధిక సంఖ్యాకులకు ప్రజాస్వామ్యంపై నిరాసక్తతయే కారణం. ఈ అంశం అందరికీ తెలుసు కాని ఎవరూ దీని విషయం పట్టించుకోరు. అంతటితో ఆగిపోయినా పరవాలేదు దేశవ్యవహారాలను, దేశ శ్రేయస్సును పట్టించుకోక పోవడం చాలా గొప్ప విషయమయినట్లు అది వారి విశిష్టత అయినట్లు వారు గర్విస్తారు. ఇక్కడే వస్తుంది అసలు చిక్కు. ఎప్పటికి మారతారో వారు! ఎప్పటికి వారి వైఖరిలో మంచి వైపు మార్పు కన్పిస్తుందో!

# జైలు నుండి విడుదల తరువాత

1976 ఏప్రిల్ 1వ తేదీన పేరోలు మీద చంచల్ గూడ నుండి బయటి ప్రపంచములోనికి స్వేచ్ఛా పౌరుడిగా అడుగిడినాను. కాకపోతే ఆ నెల 16వ తేదీకి మరల జైలులోకి తిరిగిరావాలని షరతు. నా జీవిత సహచరికి "ఓవరెక్టమీ ఆపరేషను జరగాల్సి వుంది" వెంటనే జరగాలని డాక్టరమ్మ చెప్తుంటే "రామ్మూర్తిగారు జైలు నుండి వచ్చిన తరువాతనే ఆపరేషను చేయించుకుంటాను' అని ఆమె పట్టుపడుతున్నానని రాశారు. అది సహజంగానే నాకు ఆందోళన కలిగించింది. మరొక విషయం మా అమ్మాయి విజయలక్ష్మి వివాహాన్ని తేది 9-4-1976న విజయవాడలో ఆమె చేయ సమకట్టింది. ఈ రెంటినీ పురస్కరించుకొని నేను పేరోలు అడిగితే ప్రభుత్వం మంజూరు చేసింది. నిజానికి నాకు పేరోలు అడగటానికి ప్రథమంలో మనస్కరించలేదు. కాని ఆమె ఆరోగ్యం దృష్ట్యా తప్పని సరి అయింది. నేను తలవంచక తప్పలేదు.

సర్వ సాధారణంగా వివాహాలు వధూవరుల స్వంత విషయాలు కావాలి. అయితే భారత దేశంలో అలాకాదు. అవి వధూవరుల కుటుంబాలు రెంటికి సంబంధాలు కలిపేవి. వాటికి సామాజిక ప్రముఖ్యత సంతరించుకొంది. అందుకే వివాహాలకు వధూవరుల బంధుమిత్రులు - దూరపు బంధువులు, పరచయస్తులు కూడా - పెద్ద సంఖ్యలో హాజరు కావడం ఆనవాయితీ అయింది. మా కుటుంబంలోని వివాహాలు మామూలుగా - మా బంధువులు, మిత్రులు, పరిచయస్తులు, ఉద్యమ సహచరులు వీరికి ఆసక్తిదాయకాలు కావాలి. అయితే నేను 1943 నుండి ఆంధ్రరాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యాలయ కార్యదర్శి, 1958 నుండి ఆంధ్ర రాడికల్ హ్యూమనిస్టు సమితి సమన్వయకర్త, 1969 నుండి రాడికల్‌హ్యూమనిస్టు సంఘ దక్షిణప్రాంత 'ఆర్గనైజరు', 1964 నుండి భారత హేతువాద సంఘ ఉపాధ్యక్షులలో ఒకడిని కావడంతో నాయకులుగా చలామణీ అయ్యేవారి చర్యలను సహచరులు, అనుయాయులు గమనించటం సహజం - కొన్ని సందర్భాలలో అనుకరించటం, అనుసరించటం - కనుక యితరులకు కూడా అలాంటి నాయకులు కుటుంబ జీవితాలను గురించి తెలిసికోవాలనే కోరిక బలంగా వుంటుందని భావించి నేను మా కుటుంబంలోని వివాహాల గురించి రాస్తున్నాను అంతేకాని నేను గొప్పవాడినని తలంచి యిలా రాయటం లేదని చదువరులను గ్రహించమని నా మనవి.

మా అమ్మాయి వివాహం తేది 9-4-76న సుబ్బమ్మ ఏర్పాటు ప్రకారం జరిగింది. ప్రసిద్ధ కవి, పండితులు కొండవీటి వేంకట కవిగారు సుబ్బమ్మ అభ్యర్థనను పురస్కరించుకొని నిడుబ్రోలు నుండి విజయవాడ వచ్చి ఆచార్యత్వం వహించి పెళ్ళిచేశారు. పెద్ద ఆర్భాటం లేకుండా పెళ్ళిని జరిపించాము. సుమారు 150 మంది మాత్రమే ఆహ్వానితులు. నన్ను చూడటానికి మిత్రులు

)రాల, బాపట్ల, తెనాలి ప్రాంతాల నుండి వచ్చారు. వరుడు పర్సా కిషన్‌రావుగారి ఏకైక పుత్రుడు గా॥ పట్టాభి రామారావు(బి.ఎస్‌సి, ఎం.బి. అండ్ బి.ఎస్). వారిది మరీ సనాతన కుటుంబం ాకపోయినా జమీందారుల కుటుంబం. పూర్వీకులు కట్టించిన దేవాలయానికి ధర్మ కర్తృత్వం వహించి దేవుని ఉత్సవాల్లో పీటల మీద కూర్చొని క్రతువును జరిపించవలసిన కుటుంబం. ఈ సంబంధాన్ని వధూవరులే ఎంపిక చేసుకున్నారు. కనుక ఇరుకుటుంబాల ప్రసక్తి లేదు. ఆనాటికి మా అమ్మాయి డాక్టరుగా (ఎం.బి, అండ్ బి.ఎస్ మరియు డి.జి వో). ఆమె వయస్సు ఆ సంవత్సరంలో 27సంవత్సరములు నిండుతుంది వధూవరులు పూర్తిగా మేజర్లవటంతో వారు ఇచ్ఛవచ్చిన జీవిత భాగస్వాములను ఎన్నుకోవటానికి వారికి సర్వహక్కులూ ఉన్నాయి. ప్రజాస్వామ్య వాదిగా సుబ్బమ్మ అంగీకరించింది. నేను సమ్మతి తెలిపాను. ఇక్కడ చిన్న చిక్కు ఉదయించింది. వరుని తల్లిదండ్రులకు అతడొక్కడే కుమారుడు. కనుక తమ పద్ధతిలో అతనికి వివాహం చేయాలని వారికి సహజ వాంచ. మా అమ్మాయి మాకు ఒక్కగానొక్క కూతురవటంతో మా ఆచారం ప్రకారం (హేతువాద పద్ధతిలో) పెళ్ళిజరిపించాలని సుబ్బమ్మ పట్టుదల. ఈ రెండు కుటుంబాల కోరికలలో వైరుధ్యం ఉండటంతో కొంత అయోమయ పరిస్థితి ఉదయించింది. చివరకు దానిని కూడా వధూవరులే పరిష్కరించుకున్నారు. ప్రథమంగా మా పద్ధతిలో విజయవాడలో ఉద్వాహం ఏప్రిల్ 9వ తేదీన జరిగేటట్లు, అదే నెల 12వ తేదీన హైదరాబాదులో వారి పద్ధతిలో సంప్రదాయం ప్రకారం పెళ్లి జరిగేటట్లు రాజీ సూత్రాన్ని వారిద్దరు కలిసి రూపొందించారు. సుబ్బమ్మకు ఈ రాజీ పథకం నచ్చలేదు. అయితే అప్పుడు విజయవాడలో దంతవైద్యునిగా ప్రయివేటు ప్రాక్టీసు చేస్తున్న నా రెండవ కుమారుడు డా॥ గోపాలకృష్ణమూర్తి (ఎం జి.కె మూర్తి) తన తల్లిని ఒప్పించాడు. ఇక 12వ తేదీన హైదరాబాదులో జరిగే పెళ్ళిని మామూలుగా వధువు తల్లిదండ్రులు మత తంతులో పీటలమీద కూర్చొని కన్యాదానం చేయాలి. నేనూ, సుబ్బమ్మ మత తంతులో పాల్గొనడం అసంభవం కనుక, ఎవరూ ఆ ప్రస్తావన తేలేదు. మా అమ్మాయి తన ఇంజనీరు అన్న కామేశ్వరరావును(ఇపుడు కె.అర్. మల్లాదిగా చలామణీ అవుతున్నాడు) తన భార్యతో కలసి కన్యాదానం చేయమన్నది. అతనికి మత తంతులో పెద్ద విశ్వాసం, పట్టుదల, తద్వ్యతిరేక దృక్పథం లేకపోవడంతో సమ్మతించాడు. అలా రాజీ పథకం ప్రకారం 9వ తేదీ విజయవాడలో జరిగిన పెళ్ళికి నా ముఖ్య స్నేహితులు, నా ఉద్యమ సహచరులు, విజయవాడ పట్టణంలోని మా మిత్రులు, సానుభూతి పరులు వచ్చి వధూవరులకు తమ శుభాకాంక్షలు తెలిపారు. తేది 8 ఏప్రిలునాడు నన్ను జైలునుండి విడుదల చేసే హైకోర్టు తీర్పు రావటంతో వచ్చినవారు నన్ను అభినందించారు. వరుని చెల్లెళ్ళు తమ వెంట పెళ్ళికి వచ్చారు హైదరాబాదులోని వివాహానికి మా అమ్మాయి అన్న తమ్ములు ముగ్గురు కామేశ్వరరావు, గోపాలకృష్ణమూర్తి,

వెంకటేశ్వర్లు వెళ్ళారు. మేము వెళ్లలేదు. ఆరోజుననే గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలో సుబ్బమ్మకు ఆపరేషను జరిగింది. ఆపరేషను తరువాత ఆసుపత్రి వైద్య సిబ్బంది పొరపాటువల్ల ఉదయించిన తప్పుడు నివేదిక (ఆమెకు క్యాన్సరు వ్యాధి ఉందని) వల్ల మాకుటుంబానికి కల్గిన చీకాకు, మనస్తాపం, తరువాత అదే రోజున ఆపరేషను జరిగిన మరొక స్త్రీ అండాశయాన్ని సుబ్బమ్మదిగా పేర్కొని నిలువ చేయటంలో, దానిని పరీక్ష చేయటం వల్ల ఈ పొరపాటు జరిగిందని తెలిసి మేము నిట్టూర్పు విడవటం జరిగింది( ఈ కథను తన ఆత్మ కథ 'పాతివ్రత్యం నుండి ఫెమినిజం దాకా'లో సుబ్బమ్మ వివరించింది). ఇలా మా అమ్మాయికి మా అల్లునితో రెండు పెళ్ళిల్లు జరుగడం విచిత్రం. బహుశః ఇలాంటి సన్నివేశం అపూర్వమేమో(అంతగా కాకపోతే అరుదేమో). రెండు సంప్రదాయాలకు చెందిన కుటుంబాల పరంగా ఇలా జరుగక తప్పదేమో! ప్రజాస్వామ్య సూత్రాల ననుసరించి మేము యీ పద్ధతిని అంగీకరించడం సమంజసమయినా వరుని తల్లిదండ్రులు ఆమోదించడం వారి విశాల హృదయానికి మచ్చు తునక. మా యీ చర్యలను గురించి నా ఉద్యమ మిత్రులు, ఉద్యమాభిమానులు ఏమనుకున్నారో నాకు - యీనాటికి - తెలియదు వారు దానిని తమ సంభాషణలలో, ప్రసంగాలలో లేవనెత్తలేదు మేము వారి అభిప్రాయాన్ని అడుగలేదు.

ఈ సందర్భములో మా రెండవ అబ్బాయి వివాహ ప్రసక్తి తేవడం అవసరం మా పిల్లలను - అందరికి చెప్పినట్లుగానే - వర్ణాంతర వివాహాలు చేసుకోమని మా దంపతులు ఇరువురం ప్రోత్సహించాం. మా పెద్ద అబ్బాయి సనాతన ఆచారాలను పాటించే నా తలిదండ్రుల వద్ద రెండు ఏళ్ళు వుండి చదువుకోవడం వల్లనేమో తన వధువును ఎంపిక చేసుకోవటంలో శాఖాబేధం మాత్రం పాటించనని, కులాంతర వివాహం చేసుకొనజాలనని స్పష్టంగా చెప్పాడు. అందువల్ల మా తల్లిదండ్రుల కులంలోని అమ్మాయిని (మాకు కులం లేదు కదా!) ఉషను పెళ్ళి చేసుకున్నాడు అది 1965 నాటి సంగతి. మా రెండవ కుమారుడు గోపాలకృష్ణ ఫలాని అమ్మాయిని - శ్రీమతి యనమండ్ర సత్యకళ్యానిని (ఎం.బి. అండ్ బి.ఎస్) - తన జీవిత సహచరిగా (ఆమెది కూడా మా తల్లిదండ్రుల కులమే) ఎన్నుకున్నాడు. కొన్ని పరిస్థితులలో ఆ వివాహం బాపట్లలో మా యింట 1967లో జరిగింది ఆ పెళ్ళికి బంధువులను, నా క్లయింట్లలో ముఖ్యులను, నా స్నేహితులను, నా ఉద్యమ మిత్రులను మా దంపతులం ఆహ్వానించాము. (ఆనాటికి హేతువాదం ముఖ్యాంశంగా వున్న రాడికల్ హ్యూమనిజంలో మా దంపతులిరువురము విశ్వాసం ఉన్న వారమేకాని అప్పటికి హేతువాద ఉద్యమంలోకాని భారత హేతువాద సంఘంలో కాని మేము, ముఖ్యంగా నేను బాధ్యతాయుత స్థానాలను చేపట్టలేదు). ఆహ్వానితులంతా విచ్చేశారు పెళ్ళి సలక్షణంగా హిందూ సాంప్రదాయ రీతిలో మత తంతుతోజరిగింది మా దంపతులం పీటలమీద కూర్చొనలేదు

తెనాలికి చెందిన ఉద్యమ మిత్రులు పెళ్ళికి వచ్చారు కాని - ఏదో సాకు చెప్పి - భోజనాలు చేయకుండా వెళ్లిపోయారు. బహుశః వారిని నేను యిలా పెళ్ళి జరిపించటం ఇష్టం లేకపోయిందేమో: వారు నాతో ఈ విషయాన్ని హెచ్చరించలేదు. నేను సంజాయిషీ చెప్పలేదు. తరువాత కొన్నాళ్ల తరువాత తెనాలిలో జరిగిన రాడికల్ హ్యూమనిస్టు గోష్ఠిలో మా చర్యను ఒక ఎం.ఎన్. రాయ్ అనుచరుడు విమర్శించాడు. నేను సమాధానం చెప్పకుండానే సుబ్బమ్మగారు బదులు పలికారు. వారి సమాధాన సారాంశం యిది : " మా అబ్బాయికి అప్పటికి 25 సం॥లు నిండాయి. అతడు మేజరు. అతనికి నచ్చిన అమ్మాయిని పెళ్ళాడటానికి అతనికి కల హక్కును ఎవరూ - మేమూ కూడా - కాదనడానికి 'లా' సమ్మతించలేదు. అతనికి హిందూ 'లా' ప్రకారం మా పిత్రార్జితపు ఆస్తిలో హక్కు వుంది. దానిని వినియోగించి మేము అతనికి పెళ్ళి జరిపించాము. మేము మైనరుకు పెళ్ళి చేయలేదని మీరు గుర్తుంచుకోవాలి కొందరిలాగా మేము మైనరుకు పెళ్ళి చేయలేదు. ( మా మాట వినంగానే గోష్ఠిలో పాల్గొంటున్న కొందరి మనుస్సులలో అలా చేసిన హ్యూమనిస్టులు మెదిలారు) కాకపోతే పుత్ర వాత్సల్యం పోనందున మేము మా అబ్బాయిని యింటి నుండి గెంటి వేయలేదు. రాడికల్ హ్యూమనిస్టులం మనం ప్రజాస్వామ్య వాదులం కదా!' ' సుబ్బమ్మగారి యీ సమాధానం విన్నవారికి అది తృప్తి కరం అయిందో లేదో మాకు తెలియదు. వారు దానిని ఇక తరచలేదు, చర్చించలేదు. బహుశః ఇందువలననేమో మా అమ్మాయి వివాహ విధానాన్ని మా హ్యూమనిస్టు మిత్రులు విమర్శించలేదు, చర్చకు పెట్టలేదు

# జైలునుండి విడుదల తర్వాత -2

జైలు నుండి 1976 ఏప్రిల్‌లో విడుదల అయిన తరువాత ఉయ్యూరులో శ్రీ వడ్డే శోభనాద్రీశ్వర రావు ఏర్పాటు చేసిన రెండు సమావేశాలలో పాల్గొన్నాను. అందులో పాల్గొన్న తదితరులు శ్రీ తుమ్మల చౌదరి (సోషలిస్టు నాయకుడు) ఇతనికి గుండె జబ్బు వస్తే ఆపరేషను నిమిత్తం రాజమండ్రి జైలు నుండి ఎమర్జెన్సీ వుండగానే విడుదల చేశారు. తరువాత అతనికి వెల్లూరులో విజయవంతంగా ఆపరేషను జరిగింది. శ్రీ గోపాలరావు గారు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ నాయకుడు. కాని జనసంఘ కార్యక్రమాల నిర్వహణ అతని బాధ్యతగా వుండేది. దేశ స్థితిని, ఎమర్జెన్సీ ప్రతిఘటనోద్యమ విశేషాలను చర్చించేవారు. రెండవ సమావేశంలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ ఆనాటి అధినేత శ్రీ ఆర్స్ ఇందిరా గాంధీకి రాసిన ఉత్తరంలోని అంశాలను చర్చించాలని తుమ్మల చౌదరి సూచించాడు. ఆ ఉత్తరంలో ఆర్స్‌గారు ఇందిరాగాంధీ 20 సూత్రాల పథకాన్ని బలపరచటానికి తమ సంఘ సంసిద్ధతను తెలియచర్చాడు. చర్చ తీవ్రతరం అవుతుందేమోనని అనుకున్నాను కానీ గోపాలరావు గారు దాని విషయంపై తనకు పూర్తి సమాచారం అందలేదని చెప్పినందున దానిపై చర్చ అర్ధాంతరంగా ముగిసింది.

ఎమర్జెన్సీలో ప్రజల బహిరంగ సభలనే కాక హాలు మీటింగులను కూడా నిషేధించింది ప్రభుత్వం. 1976 సెప్టెంబరు ఆఖరు నాటికి ఎమర్జెన్సీ సడలింపు జరగబోతుందని పుకార్లు వ్యాపించాయి. ఎప్పుడయితే మామూలు మార్గాల గుండా వార్తా ప్రసారం సాధ్యం కాదో పుకార్లు ప్రబలడం సహజం. పుకార్లలో వేటిని నమ్మాలో వేటిని నమ్మరాదో తేలని స్థితి. ఈ పరిస్థితి ప్రజలకు తప్పకుండా నష్టదాయకమే. తమాషా ఏమంటే యీ పరిస్థితిని కల్పించిన ప్రభుత్వం కూడా యిబ్బందులలో ఇరుక్కుంటుంది. అలా ఇందిరాగాంధీ ప్రభుత్వం చిక్కులలో పడ్డది. ఎంత నిరంకుశ పరిపాలన అయినా మనుష్యులలో కూడిన పరిపాలక వర్గం ద్వారానే పనిచేయాల్సి వుంటికదా! సరి అయిన సమాచారం లందకపోతే పరిపాలక వర్గం ఎలా సరి అయిన నిర్ణయాలను చేయగల్గుతుంది?

ఎమర్జెన్సీ 'ధర్మమా' అని పత్రికా స్వేచ్ఛపై ఆంక్షలు, ప్రజల సమావేశ స్వాతంత్ర్యంపై అదుపు, వాక్ స్వతంత్రంపై నిరోధం, సంఘ స్వాతంత్ర్యంపై జబర్దస్తీ యిలా ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలు చేపట్టబడినయి. కార్మికులు పోరాడి సంపాదించుకున్న సంవత్సరానికి వేతనంలోని 12.5 శాతం బోనసు సగానికి సగం తగ్గించబడింది. నిరసించిన వేలమంది కార్మికోద్యమ కార్యకర్తలను, నాయకులను జైళ్ళలో క్రుక్కింది ప్రభుత్వం. రహస్య కరపత్రాలను వేసిన వారిని వేటాడి, హింసించి జైళ్ళ పాలుచేసింది. సత్యాగ్రహులను అరెస్టుచేసి కోర్టు ద్వారా శిక్షించింది. ఈ చర్యలు సహజంగా ప్రభుత్వం యెడ నిరసన భావాన్ని, వైముఖ్యాన్ని పెంచింది. అయితే, అది బహిర్గతం కాలేదు. చాపక్రింద నీరులా వుంది. ప్రజల పౌర హక్కులు హరించబడినాయి. పరిపాలక వర్గంలోని చిన్న అధికారి కూడ ప్రజలపై దౌర్జన్యం చేయవూనాడు; పెత్తనం సాగించేవాడు. ఇదంతా ఇందిరాగాంధీపై ప్రజలకు ద్వేషాన్ని కలుగజేసింది.

# పౌరహక్కుల ప్రజాసమితి
# (సి.యు.సి.ఎల్) స్థాపన

జనతంత్ర సమాజ్ ఆధ్వర్యాన జరిగే ఎమర్జెన్సీ వ్యతిరేక ప్రతిఘటనోద్యమంలో శ్రీ తార్కుండే అనేకమంది పదవీ విరమణ చేసిన హైకోర్టు న్యాయమూర్తులను చేర్పగలిగారు. సర్వశ్రీ ఎం.సి. చాగ్లా, నెల్లూరి శ్రీనివాసరావు గారు వారిలో ప్రసిద్ధులు. బహుశః వీరంతా వయస్సులో పెద్దవారనియో, లేక వీరివల్ల తన పరిపాలనకు ముప్పు రాదనియో, లేక వీరికి సమాజంలో పేరు ప్రతిష్టలున్నాయి కనుక వారిని బందీలుగా చేస్తే ప్రభుత్వానికి అప్రతిష్ట వస్తుందనో - ఏ కారణమో చెప్పలేము - వీరిని ప్రభుత్వం అరెస్టు చేసి డిటెన్యూలుగా తీసుకోనలేదు. ఇదే సూత్రాలను సర్వశ్రీ మినూ మసానీ, నాని ఫల్కీవాలాల విషయంలో కూడా పాటించింది. ఉదాహరణకు అత్యయిక పరిస్థితి కాలంలో పౌరుల మౌలిక హక్కులు నిలుపుదల చేయబడినాయి (సస్పెండు) అని సుప్రీంకోర్టు 'ఎడిఎమ్. జబ్బల్‌పూర్ కేసు'లో తీర్పు చెప్పినపుడు 'న్యాయం ఆత్మహత్య చేసుకుంది' (జ్యుడిషియల్ సుయిసైడు) అనే శీర్షికలో ఆ తీర్పును తీవ్రంగా విమర్శిస్తూ ఘాటయిన సంపాదకీయాన్ని తన ఆంగ్ల మాసపత్రిక 'రాడికల్ హ్యూమనిస్టు'లో రాశాడు. ఆయనను ఇందిరాగాంధీ ప్రభుత్వం అరెస్టు చేయించ లేదు. ఇదంతా శ్రీ తార్కుండే పేరు ప్రతిష్టలను ఇనుమడింప చేసింది. అంతే తే. 30-9-76న ప్రతిపక్ష రాజకీయ పార్టీల నాయకులు తార్కుండేను కలిసి "మీరొక్కరే ఎమర్జెన్సీని విమర్శించి ప్రతిఘటన చేయడం లేదు; మేమూ అలాగే చేస్తున్నాం" అని ఆయనకు చెప్పి మనమంతా ఏకోన్ముఖంగా కలిసి కట్టుగా పనిచేద్దామని సూచించారు. తార్కుండే అంగీకరించాడు. అంతకు క్రితం అనేకమంది ప్రతిపక్షాల పార్లమెంటు సభ్యులను అరెస్టు చేసిన ఇందిరాగాంధీ అలా వికలాంగమయిన పార్లమెంటు సమావేశాన్ని నిర్వహిస్తే ప్రతిపక్ష పార్టీల నాయకులు పాత కాంగ్రెసువారు, జన సంఘీయులు, సోషలిస్టులు, ఎంగీటర్సు, డిఎంకె వారు ఎమర్జెన్సీని తీవ్రంగా దుయ్యబడ్తూ ప్రసంగించారని రహస్య బులిటనుల ద్వారా దేశానికి తెలిసింది. ఈ సంఘటన ఆమె జనరంజకత్వాన్ని దెబ్బకొట్టింది. ఇదంతా ఆమె మనస్సులో మెదులుతున్నదేమో తార్కుండే ప్రభృతులు 1976 సంవత్సరం అక్టోబరు నెల 17, 18 తేదీలలో సమావేశ పరచ తలపెట్టిన ఢిల్లీ హాలు మీటింగుకు ఇందిరాగాంధీ ప్రభుత్వం అనుమతి యిచ్చింది. పౌర హక్కుల పట్ల ఆసక్తి పట్టుదల వున్న వారందరికీ - పార్టీల వారితో సహా - ఆహ్వానాలు వచ్చాయి. నేను ఢిల్లీ వెళ్ళాను. జయప్రకాశ్ నారాయణ ఆరోగ్యం డిటెన్యూగా జైలులో వుండగా దెబ్బతిన్నది. కనుక ఆయన సభకు రాలేదు. ప్రతిపక్ష పార్టీల నేతలు వచ్చారు. అరుణ శౌరి, బి.జి. వర్గీస్ లాంటి ప్రముఖ పత్రికా విలేఖరులు వచ్చారు. ఒక్కొక్కరు సుదీర్ఘ ఉపన్యాసాలు చేశారు. పాత కాంగ్రెసుకు చెందిన శ్రీ శాంతిభూషణ్ ప్రసిద్ధ న్యాయవాది, తరువాత జనతా ప్రభుత్వంలో న్యాయశాఖా మంత్రి అప్పుడే ఇండియాలో అమ్మకానికి విడుదల అయిన ఇర్వింగ్ వాలెస్ నవల 'రిపబ్లికు'ను గురించి గంట పైగా మాట్లాడారు. చరణ్ సింగ్ (ఇప్పుడు కీర్తిశేషుడు) ఉపన్యసించాడు. కమ్యూనిస్టు మార్క్సిస్టులు, సోషలిస్టులు ప్రసంగించారు. మొదటి రోజు అంతా ఉపన్యాసాలతో

సరిపోయింది. సర్వశ్రీ యడవల్లి శివరామ శాస్త్రి, (ఆం.ప్ర. అడ్వొకేట్ల సంఘాధ్యక్షుడు), టి. లక్ష్మీకాంతమ్మ (ఎం.పి) నేను మహాసభకు హాజరయిన తెలుగువారం. పౌరహక్కుల ప్రజా సమితి అనే పేరుతో సంఘాన్ని స్థాపించడానికి నిర్ణయించింది సభ. నిబంధనావళి రాయడానికి, రెండవ రోజున సమర్పించడానికి ఒక ఉప సంఘాన్ని నియమించింది. ఆ రాత్రి తార్కుండే ఇంటిలో కూర్చొని తార్కుండే, అరుణ శౌరి, బి.జి. వర్గీసులు సంఘ నియమావళిని తయారు చేశారు. సర్వశ్రీ అరుణ శౌరి, బి.జి. వర్గీసు దానిని స్వయంగా టైపు చేశారు. మరునాడు సభలో దానిని చర్చకు పెట్టారు. దానిని మహాసభ ఆమోదించింది.

ఆ సంఘానికి 'పౌరహక్కుల ప్రజాసమితి' (పీపుల్స్ యూనియన్ ఆఫ్ సివిలు లిబర్టీస్ అండ్ డెమోక్రటిక్ రైట్సు - పియుసిఎల్‌డిఆర్) అనే పేరు పెట్టారు. ఆ సంఘం అన్ని స్థాయిలలో సమన్వయ సంఘాల ద్వారా పనిచేయాలని, ఏ ఒక్క రాజకీయ పార్టీ దానిని స్వప్రయోజనాలకు వాడుకోరాదని, సమన్వయ సంఘాలు తమ సభ్యులను, అవి ఏర్పడిన తరువాత చేర్చుకోవాలని ('కో ఆప్ట్' చేసుకోవాలని) నిర్ణయించబడింది. జయప్రకాష్ నారాయణ గౌరవాధ్యక్షులుగాను, వి.ఎం. తార్కుండే కార్య నిర్వాహక అధ్యక్షులుగాను, శ్రీ కృష్ణకాంత్ (ఆనాడు కాంగ్రెసు పార్టీలోని 'ఎంగ్రీటర్సు' నాయకుడు, ప్రస్తుతం ఆం.ప్ర. గవర్నరు) ప్రధాన కార్యదర్శిగాను ఎంపిక చేయబడ్డారు. మూడవ రోజున తే. 19-10-78న శ్రీ కృష్ణకాంత్ ఇంటిలో ప్రముఖులందరూ సమావేశమయినారు. నేనూ వెళ్ళాను. జాతీయ సమితి సభ్యుల పేర్లను ఖరారు చేశారు. నాయకులందరిని అందులో చేర్చారు. రాష్ట్ర మహాసభలు జరిపి రాష్ట్రశాఖలను నిర్మించడానికి తీర్మానించబడింది. ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర మహాసభను జరిపించే బాధ్యతను సర్వశ్రీ తెన్నేటి విశ్వనాథం, టి. లక్ష్మీకాంతమ్మ, ఎం.వి. రామమూర్తి గారలకు అప్పచెప్పారు. తరువాత లక్ష్మీకాంతమ్మగారి ఢిల్లీలోని వసతి గృహంలో ఆమెతో మాట్లాడి, ఆం.ప్ర. మహాసభ ఏర్పాట్లను గురించి చర్చించి బరువు బాధ్యతలతో నేను తిరిగి హైదరాబాదు చేరాను.

విజయవాడ రాగానే కమ్యూనిస్టు మార్క్సిస్టు నాయకుడు మాకినేని బసవ పున్నయ్యగారితో (ఎం.బి) సంప్రతించాను. సారధ్య సంఘాన్ని వేస్తే బాగుంటుందని ఆయన సూచించారు. కామ్రేడ్ గుంటూరు బాపనయ్య (మార్క్సిస్టు, వ్యవసాయ కార్మిక సంఘ నాయకుడు) పేరును ఎం.బి. సారధ్య సంఘ సభ్యునిగా ప్రతిపాదించారు. సర్వశ్రీ కాళోజీ నారాయణరావు (సుప్రసిద్ధ ప్రజాకవి, గాంధీగారి ఉద్యమాలలో పనిచేసి కారాగారవాసం చేసిన దేశభక్తుడు), గుంటూరు బాపనయ్య, తెన్నేటి విశ్వనాథం, లక్ష్మీకాంతమ్మ, నేను సారధ్య సంఘ సభ్యులం. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి చేసి పదవీ విరమణ చేసిన ఎక్బోటే గారిని పి.యు.సి.ఎల్.లోకి తేవాలని విశ్వప్రయత్నం చేశాం. సర్వశ్రీ అమ్మన్నరాజా ( మాజీ ఎం.ఎల్.ఏ.) స్వాతంత్ర్యయోధురాలు, ప్రముఖ కాంగ్రెస్‌వాది), లక్ష్మీకాంతమ్మ నేను ఎక్బోటేగారిని కలిసి పి.యు.సి.ఎల్. ఆంధ్రప్రదేశ్ శాఖ మహా సభకు అధ్యక్షత వహించమని కోరాము, ఆలోచించి చెప్తామన్నారు. తర్వాత మరల వారిని కలిశాము. తమకు అనారోగ్యంగా వుందని అందువల్ల ఆ బాధ్యతను స్వీకరించలేమని అన్నారు. 'మీరు మహాసభకు రాలేకపోయినా మిమ్మల్ని, మీ పరోక్షంలో, ఆం.ప్ర.పి.యు.సి.ఎల్.కు అధ్యక్షునిగా ఎన్నుకుంటాం. మీరు సమ్మతించండి' అని అభ్యర్థించాం. వారప్పుడు అసలు విషయం బయటపెట్టారు. వినోబా భావే నెలకొల్పిన 'ఆచార్య కుల్'లో (ఆచార్యుల సంఘం) తను సభ్యుడనని కనుక

పౌరహక్కుల ఉద్యమంలోకి రాలేనని చెప్పారు. వినోబా భావే ఎమర్జెన్సీని 'అనుశాసన పర్వం' అని అభివర్ణించారు. దాంతో తృప్తిపడి ఊరుకున్నారు. ఇందిరా గాంధిని విమర్శించలేదు; పల్లెత్తుమాట అనలేదు. అలాంటి మహనీయుడు ఆమెను వ్యతిరేకించడు కదా! అంతటితో ఆగక దేశంలోని కొందరు మేధావులను కూడగట్టి 'ఆచార్య కుల్' అని వారి కూటమికి పేరుపెట్టినవారిని ప్రోత్సాహితులను చేశారు. సర్వశ్రీ అమ్మన్నరాజా, లక్ష్మీకాంతమ్మ, ఎం.వి. రామమూర్తులం విసుగుచెంది, వేష్టపడి ఎగ్నేటే గారి గృహం నుండి వెనుతిరిగాం.

తే 19-10-1976న బెజవాడలో పి.యు.సి.ఎల్ ఆం.ప్ర. మహాసభ జరిగింది. సారధ్య సంఘ సభ్యులం వేదికమీద కూర్చున్నాం. తెన్నేటి వారి పేరును పిలిచి వేదికమీదికి రమ్మనమని నేను కోరినా వారు రాలేదు. సభికుల సరసనే కూర్చున్నారు. వారికి బహుశః తదితరులతో సమాన ప్రతిపత్తిని యివ్వనందువల్ల వారికి అసంతృప్తి కలిగినదేమో యని తలచాను. తరువాత ఉపన్యాసం యివ్వమని ఆహ్వానిస్తే వచ్చి బ్రహ్మాండంగా మాట్లాడారు. ప్రత్యేక ఆంధ్రోద్యమంలో ఆంధ్రమహా సభ నాయకులలో ఒకరయిన శ్రీ ఎస్. శ్రీనివాసులు రెడ్డి ఉపన్యాసాల ఫలితంగా అప్రతిష్టపాలయిన శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ మహాసభలో వేదికమీద - అందులో విజయవాడ వేదికమీద) కూర్చోవడాన్ని చాలామంది ఆంధ్రోద్యమ మిత్రులు సహించక లేచిపోయారు. తమ అసమ్మతిని నాకు చెప్పి వూరుకున్నారు. కానీ సభాముఖంగా ఆ ప్రస్తావన తీసుకుని రాలేదు. విమర్శలు, నిరసనలు, ఖండనలు చేపట్టలేదు. అది పౌర హక్కుల ఉద్యమం పట్ల వారి గాఢాభిమాన ఫలితమని నా విశ్వాసం. కమ్యూనిస్టు మార్క్సిస్టులు, సోషలిస్టులు, జన సంఘం వారు, పాత కాంగ్రెస్ వారు, జయ ప్రకాష్ ఆలోచనా సరళిని ఆమోదించే సర్వోదయ వాదులు రాడికల్ హ్యూమనిస్టులు పార్టీలతో సంబంధం లేని ప్రజాస్వామ్య వాదులు, మేధావులు పలువురు మహాసభకు విచ్చేశారు. 23 జిల్లాలో 22 జిల్లాలనుండి వెయ్యిమందికి పైగా ప్రతినిధులు వచ్చారు. ఇక సంఘ నిర్మాణం / బాధ్యతలను స్వీకరించి పదవులను చేపట్ట వలసిన వారి ఎంపిక మిగిలాయి. మంతనాలు, సంప్రదింపులు సాగాయి. సర్వశ్రీ తెన్నేటి, కాళోజీ, గుంటూరు బాపనయ్యలతో అధ్యక్ష వర్గాన్ని, ఎం.వి.రామమూర్తిని కార్యనిర్వాహక అధ్యక్షునిగా ఎంచి సూచించారు. అది జనసంఘ్ వారికి నచ్చలేదు. రేపు ఎన్నికలు అనంగా అర్ధరాత్రి వరకు తర్జన భర్జనలు జరిగాయి. చివరకు తెన్నేటి విశ్వనాధం గారిని అధ్యక్షులుగా, సర్వశ్రీ కాళోజీ, గుంటూరు బాపనయ్య, లక్ష్మీ కాంతమ్మలు ఉపాధ్యక్షులుగా ఎం.వి రామమూర్తి ప్రధాన కార్యదర్శిగా అనేక మంది నాయకులతో రాష్ట్ర సమన్వయ సంఘం ఏర్పడింది. ఇలా ప్రభవించింది ఆం.ప్ర. పౌర హక్కుల ప్రజా సమితి.

హైదరాబాద్‌లో తే: 25.12.76 పౌర హక్కుల సభ పెడుతున్నాం రమ్మనమని కబురు పంపారు అమ్మన్న రాజాగారు. అంతకు ముందు అదే నెల 20వ తేదీన నీలం సంజీవ రెడ్డిగారి (తరువాత భారత రిపబ్లికు మాజీ అధ్యక్షులు) సభ జరిగిందట హైదరాబాద్‌లో హాల్‌లో. జనం బాగా వచ్చారట. సంజీవ రెడ్డిగారు చాలా గట్టిగా ఎమర్జెన్సీ విధింపును విమర్శించారట. సంజీవ రెడ్డిగారి ప్రసక్తి వచ్చింది కనుక కొన్ని సంగతులు స్ఫురణకు వస్తున్నాయి. గుంటూరులో నీరా రెడ్డి అనే ప్లీడరు నిజాయితీగల పాత కాంగ్రెస్ పార్టీ కార్యకర్త. అతనిని డిటెన్యూగా రాజమండ్రి జైలులో నిర్బంధించింది ప్రభుత్వం. కొన్ని నెలల తరువాత అంటే 1976 ఏప్రిల్‌కు పూర్వమే అతనిని విడుదల చేసింది ప్రభుత్వం. నేను ఏప్రిల్ నెలలో అతని యింటికి అతనిని చూడడానికి వెళ్ళాను. 'సభలో మీరు ప్రసంగించ నవసరం లేదు. మీరు కొన్ని గ్రామాలను - రెడ్లు పెద్ద రైతులుగా వున్న గుంటూరు జిల్లాలోని నత్తెనపల్లి, నర్సారావు పేట తాలూకాలలోని కొన్ని గ్రామాలను - సందర్శించి రైతులను పల్కరించిపొండి. ప్రజలకు ధైర్యం వస్తుంది' అని చెప్పి నీరారెడ్డి సంజీవ రెడ్డిగారిని కోరారట. ఆయన రావడానికి అభ్యంతరం లేదు. కాని కామరాజ నాడారు గారితో మాట్లాడడానికి మదరాసు వెళ్ళాల్సి వస్తున్నదని వాయిదా వేశారట. నేను రెండవ సారి నీరారెడ్డి ఇంటికి వెళ్ళాను. అప్పుడు నీరారెడ్డి లేడు. ఒక మిత్రుడు - నీరా రెడ్డికి ముఖ్యుడని అనుకుంటాను. సంజీవ రెడ్డి గారితో ఫోనులో మాట్లాడుతున్నాడు. కొన్ని గ్రామాలు మీరు సందర్శించాలి. మీరు తప్పక రావలసి వుంటుందని అతడు సంజీవ రెడ్డి గారిని అభ్యర్థిస్తున్నాడు. ఆయన వస్తాను కాని యిప్పుడు వీలు కాదు అంటున్నారు. ఇక్కడ నీరారెడ్డి స్నేహితుడు ఫోనులో ఆయనను బ్రతిమిలాడుతున్నాడు. ఇంకొకసారి మాట్లాడాం అన్నారు సంజీవరెడ్డిగారు. ఫోను సంభాషణ ముగిసింది. 'ఏం బాబూ! యింత బహిరంగంగా, అందులో నీరారెడ్డి యింటి నుంచి మాట్లాడుతున్నావు. ఇలా అయితే నీరా రెడ్డిని మరల డిటెన్యూగా తీసుకొని పోతారు. జాగ్రత్తగా వుండండి' అని హెచ్చరించారు. ఇంతకు క్రితం కృష్ణాజిల్లాలో సంజీవ రెడ్డిగారి పర్యటన ఏర్పాటు చేయిద్దామని జన సంఘం వారు ప్రయత్నించారు కాని కృతకృత్యులు కాలేక పోయారు.

తే: 25.12.76 హైదరాబాద్ సభకు కరపత్రాలు అచ్చు వెయ్యలేదు. టైపు చేసిన చీట్లే ఆహ్వాన పత్రాలు. అయినా ఐదు వందల మంది దాకా వచ్చారు. కన్వేరి భవన్ హాల్ నిండి పోయింది. శ్రీ బాయిల్ రెడ్డి (ప్రసిద్ధులయిన హైకోర్టు సీనియర్ అడ్వకేట్, తర్వాత జనతా రాజ్యసభ సభ్యులు, జనతా ఆం.ప్ర. శాఖ అధ్యక్షులు, ఇప్పుడు భారతీయ జనతాపార్టీని బలపరిచే నాయకులు) శ్రీమతి అమ్మన్న రాజా, నేను ఉపన్యాసకులం. ఉపన్యాసాలు తీవ్ర ధోరణిలో సాగాయి. ఎమర్జెన్సీ అమలులో వున్న సమయంలో అంత మంది జనాన్ని సభలో చూచేటప్పటికి నాకు అమితంగా ఉత్సాహం వచ్చింది. కొంచెం ఘాటైన పదజాలంతో ఇందిరా గాంధీని, భారత ప్రభుత్వాన్ని దుయ్యబట్టాను. సభ ముగిసింది. సంచి చేత పట్టుకుని ఒక్కడినే రోడ్డు మీద నడిచి పోతున్నాను. చీకటి అయింది. వెనుతిరిగి చూస్తే ఒక మనిషి నన్ను అనుసరిస్తున్నాడని తెలిసింది. ఇంతలో అతడు నన్ను సమీపించాడు. రఃవోజా మీ ఉపన్యాసం చాలా బాగుంది. ఇందిరమ్మను మీరు బాగా

విమర్శించారు. మిమ్మల్ని ప్రభుత్వం అరెస్టు చేయవచ్చు. కాస్త జాగ్రత్తగా వుండండి అని అతడు నన్ను హెచ్చరించాడు. ప్రభుత్వ సిఐడిలను పసిగట్టగల నేర్పు నాకు వుందని నా నమ్మకం, ధీమా. అతడు ప్రజల పట్ల సానుభూతి యింకా చావని సిఐడి అని గ్రహించడానికి ఎక్కువ సమయం పట్టలేదు. అతనికి కృతజ్ఞతలు చెప్పి చకచకా నడిచిపోయాను. సరాసరి విజయవాడ వెళ్ళకుండా వరంగల్‌లో నా బావమరిది డా. కె.ఎస్.ఆర్. శాస్త్రి (సుబ్బమ్మగారి తమ్ముడు, డాక్టరు. నేత్ర వైద్యుడు, ఎంఎస్ డిగ్రీ హోల్డరు) యింటికి వెళ్ళాను. అక్కడ ఒక రోజు వుండి విజయవాడ వెళ్ళాను. పూర్వాపరాలు ఆలోచించి రాత్రికి రాత్రి నా నివాసాన్ని హైదరాబాద్ మార్చాలని నిర్ణయించాను. నన్ను ప్రోద్బలం చేసిన కారణాలు ఇవి (1) నన్ను విజయవాడలో మరల అరెస్టు చేస్తే నన్ను రాజమండ్రి సెంట్రల్ జైల్‌కు తీసుకొని పోతారు. అప్పుడు నన్ను చూడడానికి సుబ్బమ్మగారు 15 రోజుల కొకసారి రాజమండ్రి రావాలి. ఆనాడు కలకత్తా మెయిలు తప్ప ఉదయం ప్రయాణానికి అనువయిన రైలు లేదు. అందులో తెల్లవారు ఝామున చోటు దొరకడం కష్టం. అప్పటికే రెండు ఆపరేషన్‌లకు లోనయిన నా సహచరి సుబ్బమ్మ గారికి అది చాలా కష్ట దాయకం. నేను హైదరాబాద్‌లో కాపురముంటే, నన్ను మరల అరెస్టు చేసినా నగరంలో వున్న చంచల్ గూడా లేక సికింద్రాబాద్ సెంట్రల్ జైళ్ళలో నిర్బంధిస్తారు. నివాస గృహం నుండి బస్సులలో ఆ జైళ్ళ వద్దకు చేరవచ్చు; నన్ను చూడవచ్చు. (2) ముందు చూపుతో నేను 1961లోనే దరఖాస్తు చేసి 1964లో స్వాధీనం పొందిన హౌసింగ్ బోర్డు యిల్లు ఒకటి నాకు మెహిదీపట్నంలో వుంది. దానిని ఇటీవలనే ఖాళీ చేయించినందువల్ల నివాస గృహానికి అద్దె చెల్లించ వలసిన అగత్యం లేదు. (3) నా కార్యక్రమాలు విస్తరిస్తున్నాయి కనుక, సుబ్బమ్మ గారి కార్యకలాపాల పరిధి పెరిగినందువలన హైదరాబాద్ మా యిరువురికి అనువుగా వుంటుంది.

# 1977 ఎన్నికలు

5 సంవత్సరాల కొకసారి లోక్‌సభకు గాని, రాష్ట్ర శాసనసభకు గాని ఎన్నికలు జరగాల్సి వుంది. లోక్‌సభకు 1971లో ఎన్నికలు జరిగిన విషయం, అప్పుడు ఇందిరాగాంధీ 'గరీబ్ హటావో' (బీదరికాన్ని తొలగిద్దాం) అనే నినాదంతో విశేషంగా విజయం సాధించిన సంగతి, మామూలుగా సిండికేటు అని పిలవబడే స్వతంత్ర పార్టీ, పాత కాంగ్రెసు పార్టీ (కాంగ్రెసు -ఒ), జనసంఘ్ పార్టీల కూటమి ఘోర పరాజయం పాలుకావడం సర్వులకూ విదితమే. సాధారణ క్రమంలో తిరిగి ఎన్నికలు 1976లో జరుగవలసి వుండగా లోక్‌సభ జీవితాన్ని పార్లమెంటులో తను ఆమోదింప చేయించిన శాసన ఫలితంగా మరో సంవత్సరం పొడిగించటం జరిగింది. అయితే, ప్రజాభిప్రాయ ప్రకటనకు అవకాశం లేకుండా చేసినందు వల్ల, పత్రికలపై 'సెన్సార్‌షిప్' ద్వారా ఆంక్షలు విధించినందు చేత ప్రజలు ఏమని భావిస్తున్నారో ఇందిరా గాంధీకి తెలియలేదు. ఆమె చుట్టూ చేరిన ఆమె వంది మాగధులు ఆమె కీర్తి ప్రతిష్టలు మిన్నుముట్టాయని ఆమెకు తెలియజెప్పారు. కేంద్ర గూఢచారి శాఖవారు కూడా అదే పాట పాడారు. ప్రజలలో ఆమె యెడల గాఢాభిమానం నెలకొన్నదని ఆమెకు విన్నవించారు. ఆమె వారందరి మాటలను విశ్వసించి 1977లో ఎన్నికలను ఆదేశించింది. అయితే, ఎమర్జెన్సీని ఎత్తివేయలేదు. డెటెన్యూలను విడుదల చేయలేదు. కాకపోతే అత్యయిక పరిస్థితి విధింపు ఫలితంగా ఉద్భవించిన కట్టుదిట్ట నిబంధనలను సడలించింది.

రానున్న పరిణామాలను ముందుగానే పసిగట్టిన ప్రతిపక్ష రాజకీయ పార్టీలు హడావుడిగా ఐక్యత కొరకు ప్రయత్నాలు సాగించాయి. జయప్రకాష్ చొరవతో ప్రతిపక్ష పార్టీల కూటమి ప్రతిపక్ష రాజకీయ పార్టీలు రద్దు చేయబడకుండానే - 'జనతాపార్టీ' అనే పేరుతో పుట్టింది. అది ఇందిరాగాంధీ కాంగ్రెసును (మొదట్లో దానిని కాంగ్రెస్ 'ఆర్' అనేవారు, తరువాత కాంగ్రెస్ 'ఐ' అన్నారు) వ్యతిరేకంగా, ధీటుగా ఎన్నికల పోరుకు సమాయత్తం అయింది.

ఈ సందర్భంలో కాస్త పూర్వ చరిత్ర నెమరు వేసుకోవడం సమయోచితం. పార్లమెంటులోని ప్రతిపక్ష నాయకులను పలువురిని డెటెన్యూలుగా ఇందిరాగాంధీ అరెస్టు చేయించిన తదుపరి 1975లో ఒకసారి పార్లమెంటు సమావేశాన్ని ఏర్పాటు చేయడం, ఆ సమావేశంలో పార్లమెంటులో మిగిలిన ప్రతిపక్షాల వారు ఆమెను తీవ్రంగా విమర్శించిన విషయం గుర్తే కదా! రహస్యంగా ప్రకటింపబడిన 'బులిటెన్'ల ద్వారా డెటెన్యూలను ప్రతిపక్ష రాజకీయ పార్టీల కార్యకర్తలకు ఆ వార్తలు చేరాయి; రాజమండ్రిలోని డెటెన్యూలకూ తెలిశాయి. నేను రెండు రోజులు ఆలోచించి ప్రతిపక్షాల వారు ఆమోదించవలసిన కనీస కార్యక్రమాన్ని రూపొందించాను. దానిని గురించి ఆలోచించ వలసిందని పాత కాంగ్రెసు, స్వతంత్ర, జనసంఘ్, సోషలిస్టు నాయకులను కోరాను. వారు దానిని చర్చించడానికి అంతగా ఉత్సాహం ప్రదర్శించ లేదు. జనసంఘ్ నాయకుడయిన శ్రీ కొమరగిరి కృష్ణమోహన్ ఇలా అన్నాడు. "మా నాయకులకు నీపాటి తెలివితేటలు లేకపోలేదు. వారు ఆలోచించగలరు. వారు మాకు మార్గదర్శకత్వం వహించగలరు. వారి సూచనలు, ఆదేశాలు మాకు చేరే వరకుమేము యిలాంటి ఆలోచనలను చేయం." నిజానికి క్రిష్ణమోహన్ నా మిత్రుడు. ప్రత్యేకాంధ్రోద్యమంలో కలిసి పనిచేశాం. నా మీద ఆదరాభిమానాలు వున్న వ్యక్తి అయితే అతడు క్రమశిక్షణనను

పాటించే కార్యకర్తయే కాని ఆలోచనాపరుడు కాడు. అతడి చివరి మాటలలో కనీస కార్యక్రమంపై ప్రతిపక్ష పార్టీల సమైక్యతను సాధించే ప్రయత్నాన్ని నేను విరమించాను. ఇది రాజమండ్రి సెంట్రలు జైలులో జరిగిన సంఘటన.

నేను హైదరాబాదులో చంచల్‌గూడ జైలులో వుండగా, 1976 ఫిబ్రవరి, మార్చి ప్రాంతంలో, ప్రతిపక్ష పార్టీల సమైక్య కార్యాచరణ పథకానికి బాటలువేయడానికి ఉద్యమించ వలసిన అవసరం వుందని రాష్ట్రీయ స్వయం సేవక సంఘ రాజకీయ విభాగానికి చెందిన దేశ్‌ముఖ్ గారితో (ఆయన ఆంధ్ర ప్రదేశ్‌లో ఆ విభాగంలో రెండవ స్థానంలో ఉన్నారు) ప్రస్తావించగా 'ఇంకా దానికి సమయం రాలేదని' జవాబిచ్చారు. నిజానికి రాష్ట్రీయ స్వయం సేవక సంఘానికి రాజకీయ విభాగం అంటూ ఆ పేరుతో లేదు. కాకపోతే కొందరు ప్రముఖులను జనసంఘ్‌లో చేరి పని చేయమని సంఘ నాయకులు మూజువాణిగా ఆదేశిస్తారు. వారు కీలక పదవులలో వుండి - పెద్ద ఆర్భాటం లేకుండా - వారు అభిమానించి బలపరిచే జనసంఘాన్ని నడిపిస్తారు. ఇలా ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతిపక్షాలకు చెందిన డెటెన్యూలు ముందు చూపుతో ఆలోచించాలనే నా ఆకాంక్ష వమ్మయింది. నక్సలైట్లు మాత్రం ఆనాటి నుండే వారిలో వారు ఐక్యతగా ప్రయత్నాలుచేస్తూనే వున్నారు. ఒకనాడు చంచల్‌గూడ జైలులోని నక్సలైటు డెటెన్యూలు గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకుంటున్నారు. వారి ముఖాలలో సంతృప్తి ఆనందం తొణికిసలాడుతున్నాయి. విషయ మేమిటని వారిని వాకబు చేశాను. ఐక్యతా ప్రణాళికపై నక్సలైటు నాయకులు సంతకాలు చేశారని నక్సలైటు డెటెన్యూలకు వార్త అందిందట. వారిని అభినందించాను. తర్వాత మూడు రోజులకు వారు విషణ్ణ వదనాలతో కన్పించారు. ఐక్యతా సౌధం కూలిపోయిందని వార్త చేరిందట. వారిలో ఐక్యత కోసం ప్రయత్నాలు 1976 నుండి యిప్పటి దాకా అంటే 1944 దాకా సాగుతూనే ఉన్నాయి. ఇప్పటికీ ఆ ఐక్యత వారికి కనుచూపు దూరంలోనే వుంది.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ గారు ఇందిరా కాంగ్రెసులోని 'యంగుటర్క్స్' కదా! సర్వశ్రీ చంద్రశేఖర్, రామ్‌ధన్, కృష్ణకాంత్, ఆమె ఆ గ్రూపుకు చెందినవారని మనందరికి తెలుసు. ఆమె ఒకప్పుడు ఇందిరా గాంధీకి అంతరంగికురాలు. ఎమర్జెన్సీ విధింపును వ్యతిరేకించి ఎదిరించిన వీరాంగన. అప్పటికే మూడుసార్లు పార్లమెంటుకు ఎన్నికయిన ప్రతిభాశాలి. ఆమె హనుమకొండ నియోజక వర్గం నుండి లోక్‌సభకు 1977లో పోటీ చేయాలని మొదట్లో సంకల్పించారు. నాకెందుకో వారి ఆలోచన నచ్చలేదు. వారిని హనుమకొండ నుండి పోటీకి దిగవద్దని సలహా చెప్పాను. చివరకు ఆమె తన ఆధ్యాత్మిక గురువుగారి సూచనను స్వీకరించి ఆ ప్రయత్నం విరమించి సికిందరాబాదు లోక్‌సభ నియోజక వర్గాన్ని ఎంపిక చేసుకున్నారు. జనతా కూటమివారు ఆమె క్రొత్త ప్రతిపాదనకు సమ్మతి తెలిపారు. హనుమకొండ నియోజక వర్గం నుండి తెలంగాణాకు చెందిన సత్యనారాయణ రెడ్డిగారు జనతా కూటమి అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయారు. (వారు సికిందరాబాదు జైలులో డెటెన్యూగా వుండేవారు. వారు ఆ జైలులోని డెటెన్యూలకు 'మేయరు'. వారి సౌమ్య స్వభావం, దృఢ కార్యతత్పరత, త్యాగబుద్ధి సర్వులకూ వారియెడ గౌరవ భావాన్ని ఒనగూర్చేవి. తరువాత వారు రాజ్యసభ సభ్యురాలుగా రాణించారు. ఆ తరువాత వారు గవర్నరుగా నియమితులయ్యారు. వారిని కాంగ్రెసువారు కూడా ఆ పదవి నుండి కదిలించ లేదు. (వారు ప్రస్తుతం ఉత్తరప్రదేశ్ గవర్నరుగా వున్నారు).

జనతా కూటమి రాష్ట్ర కార్యాలయానికి వెళ్లి శ్రీ వి. రామారావు గారిని కలిసి (ఆనాడు వారు ఆ కార్యాలయానికి కార్యదర్శి. జనసంఘ నాయకులు. ఈనాడు భారతీయ జనతా పార్టీ ఆం.ప్ర. శాఖకు అధ్యక్షులు) ఎం.ఎన్. రాయ్ అనుచరుడిగా నేను పార్టీ రహిత ప్రజాస్వామ్య సిద్ధాంతానికి కట్టుబడిన వాడినయినా ఆనాటి పరిస్థితులలో జనతా కూటమి విజయానికి కృషి చేయదలచానని వారికి చెప్పి నా సేవనువాడుకోమని కోరాను; వారు మర్యాదగా సంతోషంగా నన్ను మన్నించారు కాని ప్రత్యేకంగా పని చెప్పలేక పోయారు. అంత నేను లక్ష్మీకాంతమ్మ గారి ఎన్నికల కార్యక్రమంలో పని చేయనారంభించాను. వారి వెంట తిరుగుతూ అనేక ఎన్నికల సభలలో ఉపన్యసించాను. సికిందరాబాదు లోక్‌సభ నియోజక వర్గంలో ఏడు అసెంబ్లీ నియోజక వర్గాలు వుండేవి. వీటికి బాధ్యులయిన వారందరినీ అభ్యర్థి ప్రతిరోజు ఒక నిర్ణీత సమయంలో కలవాలని ఎప్పటికప్పుడు ఎన్నికల కార్యక్రమ పురోగతిని సమీక్షించు కోవాలని లక్ష్మీకాంతమ్మ గారికి సూచించాను. అలా ఆమె చేయగా ఆసిఫ్‌నగర్ అసెంబ్లీ నియోజక వర్గంలో పని చాలా కుంటుపడిందని తేలింది. దానిని మెరుగుపరచటానికి సర్వులూ ఎంతో ప్రయత్నించారు. కాని అది ఫలించలేదు. చివరకు ఆమె ఓడిపోయారు. ఆసిఫ్‌నగర్ అసెంబ్లీ నియోజక వర్గంలోనే ఆమె ప్రత్యర్థి ఆమెపై 13 వేల వోట్ల ఆధిక్యత సంపాదించారు. అదే ఆమె ఓటమికి కారణభూతమయింది.

ఆం.ప్ర. జనతాపార్టీ మహిళా విభాగ్‌కు శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మగారు సమావేశకర్తగా ఎంపిక చేయబడ్డారు. ఆమెకు నా జీవిత సహచరి సుబ్బమ్మగారు తోడ్పడ్డారు. బోలారం నుండి మలక్‌పేట దాకా అనేక సభలలో ప్రసంగించారు. ఆ కథ అంతా తన ఆత్మకథలో వివరించారు. అలా 1977 లోక్‌సభ ఎన్నికలలో మా దంపతులం మా వంతు బాధ్యతను నెరవేర్చాం.

# ఆంధ్ర హ్యూమనిస్టు అధ్యయన శిబిరాలు-1

ప్రతి ఉద్యమానికి, ప్రతి రాజకీయ పార్టీకి అధ్యయన తరగతులు రెండు మూడు రకాలుగా ఉపకరిస్తాయి. (1) ముమ్మొందుగా ఉద్యమ నాయకులను, పార్టీ నాయకులకు తమ పార్టీ, ఉద్యమాల చరిత్రను, జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను, దేశ, రాష్ట్ర సమస్యలను అవలోడనం చేయడానికి, లోతుగా అధ్యయనం చేయటానికి, శ్రోతలకు తెలియజేయడానికి తగిన అవకాశం, జ్ఞానం, అవగాహన, సమర్థత కలిగిస్తాయి. (2) అధ్యయన శిభిరంలో పాల్గొనే ఉద్యమ అభిమానులకు, పార్టీ సభ్యులకు మరింత విషయజ్ఞానాన్ని, సునిశిత గ్రాహ్యశక్తిని, విచక్షణా సామర్థ్యాన్ని, వివేకాన్ని కలుగజేస్తాయి. (3) క్రొంగొత్త వారిని ఉద్యమ కార్యకర్తలుగా, పార్టీ కార్యకర్తలుగా మలుస్తాయి తద్వారా ఉద్యమ వ్యాప్తికి, రాజకీయ పార్టీ ప్రాబల్యానికి దోహదం చేస్తాయి. కోస్తా ప్రాంతంలో గుంటూరు జిల్లాలోనే మంతెనవారి పాలెం, క్రొత్తపట్నం (ఈనాడు ప్రకాశం జిల్లాలో ఉంది) కమ్యూనిస్టు అధ్యయన శిబిరాలు కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి వ్యాప్తిని విశాలం చేయడానికి, పార్టీ కార్యకర్తలలో విషయ జ్ఞానాన్ని లోతుగా గాఢంగా పెంచటానికి ఎంతగానో తోడ్పడినయి అ సంగతిని గ్రహించిన హ్యూమనిస్టులం మొదటి నుంచి అధ్యయన శిబిరాలపై నొక్కు పెట్టాం. ఎ.జి.కె.(అవుల గోపాల కృష్ణమూర్తి) జీవించి వుండగా అతని ఆధ్వర్యంలో జరిగిన పెనర లంక, అవనిగడ్డ, ఇంకొల్లు అధ్యయన శిబిరాలు పేరెన్నిక కన్నవి ఈ అంశం నా మనస్సులో మెదలటం ఆరంభించినది.

చీరాలకు 5 మైళ్ళ (8 కి.మీ) దూరంలో వున్న కారంచేడు గ్రామం ఇటీవల దళితులపై జిగిన హత్యాకాండ, దౌర్జన్యం వల్ల ప్రసిద్ధమయింది. ఆ 'దురదృష్ట' సంఘటన జరుగక పూర్వమే ఆ గ్రామం యితరం కారణాల వల్ల పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకున్నది. జస్టిస్ పార్టీ నాయకుడయి 9 సం॥ వరుసగా జిల్లా బోర్డు అధ్యక్షుడయిన జాగర్లమూడి కుప్పస్వామిగారిది ఆ గ్రామమే అపుడు చీరాల సబ్‌తాలూకా - ప్రకాశం జిల్లా ప్రత్యేకంగా ఏర్పడక పూర్వం - గుంటూరు జిల్లాలో వుండేది ఆచార్య రంగాగారి ముఖ్య అనుచరులయిన దగ్గుబాటి పాపయ్య గారిది కారంచేడు 20, 30 సంపన్న గృహస్తులకు నివాస స్థలం అది అత్యధిక జనాభా కమ్మవారుగా వుండేది కూడా అదే. ఇవన్నీ గాక ఉదార స్వభావం కల వారికి, ప్రజాసేవ, మానవ సేవ చేయ సంకల్పించి అందుకు సమకట్టే వారికి ఆలవాలం ఆ గ్రామం. పదాన్యుల విరాళాలలతో, స్వశక్తి తో విద్యాలయాలు, ఆస్పత్రులు, వ్యాయామ శాలలు, ప్రజోపయోగ సంస్థలు, భవనాలు వీటిని స్థాపించుకొని, నిర్వహించగల సంకల్పం, పూనిక, సామర్థ్యం ఆ గ్రామస్తులది ఆ గ్రామంలో నివసిస్తున్నారు. యార్లగడ్డ దుర్గయ్య గారు (పూర్తిపేరు దుర్గా ప్రసాద్ అయినా యావన్మంది

గ్రామస్తులు వారిని దుర్గయ్య గారనే ఆప్యాయంగా, గౌరవంగా పిల్చుకుంటారు) నేను చీరాలలో ప్లీడరీ వృత్తి చేస్తున్నపుడు 1972వ సంవత్సరంలో ఆయన నా వద్దకు వచ్చి తనను పరిచయం చేసుకొని తను ఒక ధర్మ నిధిని తమ గ్రామాభివృద్ధి కొరకు స్థాపించ తలచానని అందుకు అవసరమయిన 'ట్రస్టు డీడును' (ధర్మనిధి స్థాపన దాన పత్రాన్ని) తయారు చేయించి యిమ్మని అడిగారు. తన ధర్మ నిధి చేయపూనిన పనులను విశదీకరించి జీవిత ధర్మ కర్తలుగా వుండేవారి పేర్లను, మూడింటిని నాకు యిచ్చారు అది ఆనాడే 10 ఎకరాల సుక్షేత్రమయిన మాగాని భూమియని గుర్తు ఆనాడు ఎకరం ఒక్కింటికి 30 వేల రూపాయలు. నేను విస్తుపోయాను. ఒకసామాన్య గృహస్తు అంత త్యాగం చేయగల్గడం నాకు అపూర్వంగా తోచింది. వారిని అభినందించాను. అంతటితో తీప్తి పడక "ఒక సలహా చెప్ప వచ్చా?' అని వారిని ప్రశ్నించాను. "సలహా చెప్పగల సమర్థులనే కదా మీ వద్దకు వచ్చింది" అన్నారాయన. "మీరు ముగ్గురు ధర్మకర్తలను సూచిస్తున్నారు. అందులో మీరు ఒకరని నాకు తెలుసు కాని ఉత్తరోత్తరా తతిమ్మా యిరువురి నైజం మారిపోయి, వారు మీపై కార్పణ్యం, ద్వేషం పెంచుకంటే ధర్మ కార్య నిర్వహణ కుంటుపడవచ్చును. అంతేగాక మీరు ఆశించిన ధర్మ కార్యాలకు ధర్మనిధి ద్రవ్యం, భవనాలు, సిబ్బంది, పేరు ప్రఖ్యాలు మరొక ప్రయోజనం సాధించడానికి ఉపయోగింపబడవచ్చును ఇదంతా మీ జీవిత కాలంలోనే, మీ కళ్ల ఎదుటనే సంభవించడానికి అవకాశం ఉంది. మీ రొక్కరే ధర్మకర్తగా ఉండటం మీరు ఏకారణం వల్లనయినా అశక్తులఅయినపుడు, ఇతరుల సహాయ సహకారాలు అవసరమని భావించినపుడు, మీకు నిజాయితీపరులు, సహృదయులు అయిన వ్యక్తులు తటస్థించినపుడు కాని లేక మీ జీవితాంతాన వ్యవహరించే ధర్మకర్తలుగా కాని - నియమించటం మంచిది నా సలహాను మీరు పాటించగలిగితే అలా రాస్తాను. లేకపోయినా మీరు ఎలా రాయమంటే అలా పత్రాన్ని తయారుచేస్తాను అని చెప్పాను. వారికి సలహా నచ్చింది. నా సూచన మేరకు ధర్మ నిధి స్థాపన పత్రపు ముసాయిదాను రాసి యిచ్చాను. వారు రిజిష్టర్డు చేశారు. అలా 'కారంచేడు గ్రామనిధి' ఉదయించింది. 'ధర్మ ట్రస్టులు' ఏర్పరచదలచేవారికి ఇది ఆసక్తిదాయకం కాగలదని యీ విషయాన్ని గురించి రాస్తున్నాను.

దుర్గయ్యగారికి నాపై గల అభిమానం ఒక సందర్భంగా వ్యక్తమయింది తేది 10-1-1972 నుండి విజయవాడను కేంద్రంగా పెట్టుకొని ఆంధ్ర న్యాయవాది కార్యాచరణ సమితి వ్యవహారాలను నడిపాను కదా! చీరాలలో ప్లీడరీ చేయుట, చీరాలలో నివసించడం ఆగిపోయింది. కొంత కాలం రహస్య జీవితం కూడా కడపాల్సి వచ్చింది కదా! ఆరోజుల్లో దుర్గయ్యగారు మా గుమాస్తాగా పనిచేస్తున్న - నిజానికి ఆయన నాగుమాస్తా అనేదాని కన్నా నా మిత్రుడు అనడం సత్యం, న్యాయం, ధర్మం - పింగళి సీతాపతి గారి వద్దకు వచ్చి "రామ్మూర్తిగారు యిల్లు పట్టకుండా ప్రజా

కార్యక్రమాలపై తిరుగుతున్నారు. ఇల్లు గడవటానికి ఏమయినా ఏర్పాటు చేశారో లేదో నాకు తెలియదు నేను కొన్ని బస్తాల ధాన్యాన్ని వారి ఇంటికి చేర్చతలచాను. వారు స్వీకరించగలరో లేదు కనుగొని నాకు చెప్పండి" అన్నారు వెంటనే, సీతాపతి గారు" ఆ ఇబ్బంది లేదు. వారు అన్ని ఏర్పాట్లు చేసి పెట్టారు" అని బదులు పలికారట ఈ సంగతి నాకు తరువాత తెలిసింది దుర్గయ్యగారిపై నా గౌరవభావం యినుమడించింది

మిత్రుడు కొల్లా సుబ్బారావు ఎం.ఏ. ది కారంచేడు గ్రామానికి 5 మైళ్ళలో వున్న నాగుల పాలెం గ్రామం. అతనికి ఆ పరిసర ప్రాంతాలలో, ఆ తాలూకాలో నిజాయితీపరుడని, మంచివాడని, ఆలోచనా పరుడని మంచి పేరున్నది హ్యూమనిస్టు అధ్యయన తరగతులను నడపతలచానని నేను మిత్రుడు కొల్లాతో సంప్రతించాను. కారంచేడు ఆ ంకు అనువయిన ప్రదేశమని, దుర్గయ్య గారిని అడిగితే అందుకు వలసిన వ్యయభారాన్ని ఆ వ భరించగలరని, దుర్గయ్య గారికి నాపై సదభిప్రాయం ఉందని నాకు చెప్పాడు అంత కార కు వెళ్ళి దుర్గయ్య గారిని అడిగాను. వారం రోజులు ఒక ంద మందికి మించకుండా శిబిర ులకు కావలసిన వసతి సౌకర్యాలను తాను తన 'గ్రామ నిధి పున ఉచితంగా సమకూర్చగ ని నాకు చెప్పారు నాకు వారి మాటలతో ఏనుగంత బలం వచ్చి ది

---

# హ్యూమనిస్టు అధ్యయన శిబిరాలు -2

ఆంధ్ర ప్రాంతంలో మూడు హ్యూమనిస్టు శిబిరాలను నిర్వహించాం. 1973లో, 1974లో, 1976లో అవి జరిగాయి. మొదటి రెండు 5 రోజులు, చివరిది 7 రోజులు నడిపాం. వాటిలో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, వివిధ ఉద్యమాల - సోషలిస్టు, కమ్యూనిస్టు, గాంధీయిస్టు - పోకడలు, ఎం.ఎన్. రాయ్ జీవిత చరిత్ర, కాంగ్రెస్‌లో, రాడికల్ డెమొక్రాటిక్ పార్టీలో, రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమంలో వరుసగా రాడికల్ కాంగ్రెసువాదుల, రాడికల్ ప్రజాస్వామ్యవాదుల, రాడికల్ హ్యూమనిస్టుల పాత్ర, హ్యూమనిస్టు తాత్విక చింతన, మానవవాద నీతి, మానవవాద ఆర్థిక విధానం, హ్యూమనిస్టు రాజకీయాల విశిష్టత, ప్రస్తుత జాతీయ పరిస్థితి, అంతర్జాతీయ పరిస్థితి, మానవవాదం: మహిళలు, మానవవాదం: కార్మికోద్యమం యిలాంటివి చర్చనీయాంశాలు. ప్రతి విషయం మీద ఒక ఉపన్యాసం, తరువాత ప్రశ్నలు; జవాబులు వుండేవి. సత్యాన్వేషణ, ప్రశ్నించే మనస్తత్వం వీటిని పెంపొందించటానికి ప్రత్యేకంగా శ్రద్ధ వహించేవారం. శిబిరవాసులలో ఉపాధ్యాయులు విద్యావేత్తలు ఎరువుగా ఉండటంతో వారు అడిగే ప్రశ్నలకు చర్చలను రేకెత్తించే అంశాలకు తృప్తికరమయిన, సమర్థవంతమయిన సమాధానాలను యివ్వటానికి ఉపన్యసించే మిత్రులు చాలా శ్రమపడవలసి వచ్చేది. శిబిరంలోని అధ్యాపకులూ, శిబిరవాసులూ ఇరువురూ నిజాయితీతో, సత్యాన్వేషణే పరమలక్ష్యంగా చర్చలలో పాల్గొనేవారు. కేవలం తమ వాక్చాతుర్యంతో, పాండిత్య ప్రకర్షతో ప్రశ్నించేవారిని - హడలెత్తించి, బెదరించి, గదమాయించి - నిరుత్తరులను చేసే విధంగా కాక చేతనయినంత వరకు వారికి తగు సమాచారం అందజేసి, అవసరమయిన దృక్పథం కల్గించి వారికి తృప్తిని, సంతృప్తిని ఒనగూర్చటం పరమావధిగా ఎంచేవారం. సర్వశ్రీ ఎం.వి. రామమూర్తి, రావిపూడి వెంకటాద్రి, ఎస్.వి. బ్రహ్మం, సి.హెచ్. రాజారెడ్డి, కొల్లా సుబ్బారావు, కోగంటి రాధాకృష్ణ మూర్తి, టి.ఎన్.ఎల్. హనుమంతరావు ప్రభృతులు వివిధ విషయాలపై తరగతులను తీసుకునేవారు. ప్రతి చర్చనీయ విషయానికి 2 నుండి 3 గంటల వరకు సమయం కేటాయించేవారం. కనీసం ఒక గంట ప్రశ్నోత్తరాలకు, చర్చకు ప్రత్యేకంగా యివ్వడం జరిగేది. చర్చలలో శిబిరవాసులు అందరూ పాల్గొనవచ్చును. ప్రశ్నలు శిబిరంలో అధ్యాపకులుగా వ్యవహరించేవారినే అడిగేవారు. అధ్యాపకులే సమాధానాలు చెప్పేవారు. చర్చలలో అందరూ మాట్లాడవచ్చును. కాని, చర్చను లేవనెత్తేవారు మరీ క్లుప్తంగా మాట్లాడవలెననే నిబంధన ఉండేది కాదు.

ఒకసారి రెండవ శిబిరంలో - 1974లో ఒక మిత్రుడు ఒక వ్యాఖ్య చేశాడు. దానికి ప్రాముఖ్యత వుంది కనుక దానిని యిక్కడ ఉటంకిస్తున్నాను. "ఎప్పుడూ శిబిరంలో చెప్పినవారే అధ్యాపకులుగా ఎందుకు వుండాలి? అది మంచి పద్ధతి కాదు" అనేదే ఆ వ్యాఖ్య సారాంశం. "వారే అధ్యాపకులుగా వుండవలసిన పనిలేదు; మరెవరయినా అధ్యాపకత్వాన్ని నిర్వహించవచ్చును. కాకపోతే పైచెప్పిన వారు - సర్వ సాధారణంగా - సీనియరు సభ్యులు కనుక వారికి అవకాశం యివ్వడం సంభవిస్తున్నది. తతిమ్మా మిత్రులు - మార్క్సిజం నుండి హ్యూమనిజానికి ప్రయాణం చేసిన తరువాత కామ్రేడ్లు అనే పదాన్ని వాడటం మానివేశాం - అధ్యాపకత్వం చేపట్టటానికి సిద్ధపడితే, అంగీకరిస్తే తప్పక వారికి ఆ

బాధ్యత అప్పగింప బడుతుంది'' అనే సమాధానం శిబిర నిర్వాహకులనుండి యివ్వబడింది. తమాషా ఏమంటే ఈ వ్యాఖ్యను చేసిన మిత్రుడే తను ఏర్పాటుచేసిన అధ్యయన శిబిరంలో – అది వేరే ఉద్యమం సందర్భంగా అనుకోండి – ఉపన్యసించటానికి పైన పేర్కొనబడిన వారిని – అధ్యాపకులలో పాతవారిని ఆహ్వానించాడు. ఈ సంఘటనను గురించి చెప్పడంలో ఉద్దేశ్యం అనుభవం నుండి గుణపాఠాలు నేర్చుకోగల్గడమే. అవి: (1) పాతవారికి అనుభవం ఎక్కువ. (2) క్రొత్తవారికి అధ్యాపకత్వం స్వీకరించటానికి అవకాశం యివ్వాలి. (3) ఒకసారి క్రొత్త మిత్రునికి అవకాశం యిస్తే, బాధ్యత వప్పజెప్తే అతడు సీనియరు మిత్రుని అంత సమర్థవంతంగా విధి నిర్వహణ చేయక పోయినా తన చిత్తశుద్ధిలో చేసే ప్రయత్నంలో అతడు ఎదుగుతాడు; అచిరకాలంలో ప్రజ్ఞావంతుడవుతాడు.

మూడవ శిబిరం (1976)ను గురించి ప్రత్యేకించి చెప్పటం అవసరం. ఆర్థిక శాస్త్రానికి సంబంధించిన ఉపన్యాసం సర్వ సాధారణంగా మిత్రుడు కొల్లా సుబ్బారావుకు యిచ్చేవారం. ఆయన ఆర్థిక శాస్త్ర విషయంగా ఎం.ఎ. ప్యాసయ్యాడు. కేవలం డిగ్రీయే కాక అధ్యయనపరుడు. ఈసారి క్రొత్త ప్రయోగం చేయ సంకల్పించాం. ఆర్థిక శాస్త్ర సంబంధమైన విషయాలను రెండుగా విభజించాం. ఒకటి సిద్ధాంత భాగం; రెండవది ఆచరణ, విధానాల విభాగం. మొదటి దానిపై ప్రసంగించటానికి వారణాసి సత్యనారాయణ మూర్తిగారిని ఆహ్వానించాం. ఆయన కళాశాలలో చదివిన విషయం ఆంగ్ల సాహిత్యం. అయితే, ఆయన జిజ్ఞాసువు. స్వయంకృషిలో ఆర్థిక శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. మార్క్సిస్టు ఆర్థిక సిద్ధాంతాన్ని విమర్శిస్తూ ఆంగ్లంలో చక్కని గ్రంథాన్ని రచించారు. దానిని కలకత్తా హ్యూమనిస్టు మిత్రుడు సుశీల్ ముఖర్జీ తన 'మినర్వా అసోసియేట్సు' అనే గ్రంథ ప్రచురణ సంస్థ తరఫున ప్రకటించాడు. అంతేగాక సూర్యనారాయణ మూర్తిగారు తెలుగులో కథలు, నవలలు రాసి పేరు ప్రఖ్యాతులు సంపాదించిన వ్యక్తి. ఆయన కలం పేరు 'వాసమూర్తి.'

మూడవ శిబిరంలో మరొక విలక్షణత్వం వుంది. ప్రప్రథమంగా నల్గురు మహిళలను ప్రసంగించడానికి ఆహ్వానించాం. సర్వశ్రీ కోమల (మిత్రుడు ఇన్నయ్య సహచరి) సూర్యకుమారి. (వెంకటస్వామి సతీమణి), విజయలక్ష్మి (ఎస్.ఎ. బక్షి భార్య, మల్లాది సుబ్బమ్మలు వారు. వారంతా శిబిరానికి వచ్చారు; పండిత ప్రసంగాలను చేశారు. మహిళలకు అవకాశాలు కల్పిస్తే, బాధ్యతలను కట్టబెట్టే వారు ప్రతిభా వ్యుత్పత్తులతో వాటిని నెరవేర్చ గలరనే అంశం రుజువయింది. దీనిని గొప్ప అనుభవంగా నేను స్వీకరించాను.

ఈ శిబిరాల నిర్వహణలో నా వైఫల్యం, ఉద్యమ వైఫల్యం ప్రముఖంగా కొట్టవచ్చినట్లు దర్శనమిచ్చాయి. వందమంది వరకు శిబిరవాసులకు దుర్గయ్యగారు సౌకర్యాలు కలుగచేస్తామంటే ఏనాడు 60 మందిని మించి శిబిరవాసులను పోగు చేయలేకపోవటమే అది. ఈ అశక్తత, 1977 నుండి నేను హైదరాబాదులో నివాసం ఏర్పరచు కోవటం యీ రెండూ ఆంధ్ర ప్రాంతంలో శిబిర నిర్వహణ బాధ్యతను నేను చేపట్టలేక పోవటానికి కారణాలు.

దుర్గయ్య గారిని గురించి రెండు మాటలు రాయందే ఈ అంశ చరిత్ర పూర్తికాదు. ఆయన 'గాంధీయిస్టు' అని చెప్పుకోనక్కర్లే గాంధీవాది. నిరాడంబర జీవి. ముతక బట్టలు ధరిస్తూ, ఆకు చెప్పులలో తిరుగాడే వ్యక్తి. వివిధ రుచులతో, పలు రకాల భోజ్య పదార్థాలతో విందు భోజనాన్ని ఆశించని సామాన్యుడు. భోగాలు అనుభవించడానికి వలసిన సంపదలేని వాడు కాదు. అన్నీ వున్నా అక్కరలేదనుకునే అసామాన్యుడు. వ్యాయామం, మిత భోజనం,

సాధారణ జీవితం, గ్రంథావలోకనం, ప్రజాసేవ ఇవి ఆయన విశిష్టత్వాలు. వ్యాయామశాల, ఆస్పత్రి, కర్మలు చేసుకోవటానికి అనువయిన భవనం, బీద హరిజన విద్యార్థులకు విద్యావకాశాలు కల్పించటం ఆయన తన ధనంతో, తను స్థాపించిన గ్రామాభివృద్ధి ధర్మ సంస్థలో చేసే మంచి పనులు. భవన నిర్మాణాన్ని కంట్రాక్టరులకు అప్పచెప్తే వారు దానిని కట్టుదిట్టంగా నిర్మించరని, పైగా ఎక్కువ మొత్తంలో ధనాన్ని ఖర్చుచేయవలసి వస్తుందని తానే భవన నిర్మాణానికి పూనుకొని ఆ భవనాలను పటిష్టంగా, బలంగా కట్టేవారు. ఇతరులు చేసేదానికన్నా వేల మొత్తంలో తక్కువ ఖర్చుచేసేవారు. లెక్కలను జాగ్రత్తగా రాసేవారు. ఆయన వ్యక్తిత్వానికి ముగ్ధుడనయి వారిని గురించి ఒక పత్రికలో వ్యాసం రాయడానికి వారి అనుమతిని అడిగాను. ససేమిరా వీల్లేదన్నారు. మంచి పనులు చేసేవారున్నారు; పేరు ప్రఖ్యాతులను, కలలో కూడ కోరని, వ్యక్తులు మన దేశంలో మహా అరుదుగా దర్శనమిస్తారు. అలాంటి వారి సంఖ్య ఎంతగా పెరిగితే దేశం అంతగా బాగుపడుతుందేమో!

# మానవవాద ఉద్యమంలో పదవీ బాధ్యత

**1976లో** కారంచేడులో జరిగిన హ్యూమనిస్టు అధ్యయన శిబిరానికి శ్రీ సి.టి. దరు (భారత హ్యూమనిస్టు సంఘ ప్రధాన కార్యదర్శి) వచ్చి రెండు తరగతులలో అధ్యాపకత్వం నెరపి వెళ్ళారు. వారి రాక ఆంధ్ర మిత్రులకు ఉత్సాహ కారణమయింది. ఆయన తిరిగి వెళ్లిన సుమారు ఆరు నెలలకు అకాల మరణం చెందారు. ఉత్తమ నాయకుని, నిజాయితీ గల కార్యకర్తను, పట్టుదల, కార్యదీక్ష కల సభ్యుని, అన్నింటికన్నా మిన్న సహృదయుడయిన మిత్రుని మానవవాద మిత్రులు, ఉద్యమం కోల్పోవటం సంభవించింది.

మానవవాద సంఘ జాతీయ సమితి సమావేశానికి నేనూ, ఇన్నయ్య బొంబాయి వెళ్ళాం. రేపు సమితి సమావేశం అనగా రాత్రి మిత్రుడు తార్కుండే బొంబాయిలో తన స్నేహితుని యింట్లో భోజనానికి ఆహ్వానించాడు. నన్ను హ్యూమనిస్టు సంఘ కార్యదర్శి బాధ్యతను చేపట్టమని కోరాడు. మామూలుగా తార్కుండే సూచనలను నేను ఆదేశాలనుగా స్వీకరించేవాడిని. అలాంటి వాడిని యీ పర్యాయం అతని కోరికను కాదన్నాను. "నా శక్తియుక్తులు హ్యూమనిస్టులు యితరులతో కలిసి పనిచేయగల సంస్థలలో ఎక్కువగా ఉపకరిస్తాయని నా విశ్వాసం. హ్యూమనిస్టు సంఘం కుటుంబ సంస్థ. దీనిని ఎవరయినా నిర్వహించవచ్చును. కాని ఇతరులతో ఆ కలిసి పని చేసే ఓర్పు, సహనం, సమయోచిత ప్రవర్తన యిలాంటి లక్షణాలు కావాలి. కనుక పౌర హక్కుల ప్రజా సమితిలో నాకు స్థానం కల్పించండి. మీరు అధ్యక్షులుగా వున్నారు కనుక (జయప్రకాష్ మరణానంతరం కార్య నిర్వాహక అధ్యక్షునిగా వున్న ఆయన అధ్యక్షులయినారు) మరొక హ్యూమనిస్టు ముఖ్యమయిన కీలక పదవిలో వుండటం అనుచితమవుతుంది. నాకు సహాయ కార్యదర్శి పదవియో లేక జాతీయ ఆర్గనైజరు పదవియో యిచ్చి పని చేయమనటం మంచిది" అని చెప్పాను. ఆయనకు నా ప్రతిపాదన అంగీకారయోగ్యం కాలేదు. "జనతంత్ర సమాజ్‌లో, పౌర హక్కుల ప్రజా సమితిలో నేను పనిచేస్తున్నప్పుడు అనేకమంది సహృదయులు, చిత్తశుద్ధి కలవారు, పవిత్ర శీలురు మన ఉద్యమం పట్ల అభిమానాన్ని ప్రదర్శిస్తున్నారు. వారిని హ్యూమనిస్టు ఉద్యమంలోకి ఆహ్వానిస్తాను. వారిని ఉత్తమ మానవ వాదులుగా తీర్చిదిద్దగల వ్యక్తి మన సంఘంలో ప్రధాన పదవిని చేపట్టి ఆ బాధ్యతను నిర్వర్తించాలి. అందుకే నేను నిన్ను తాత్కాలికంగా (మరో మహాసభ జరిగి ఎన్నిక జరిగే వరకు) ఆ పదవిని చేపట్టమని కోరుతున్నాను" అని ఆయన బదులు పలికాడు. వారి మాటలు ఇన్నయ్యకు నచ్చాయి. తార్కుండే ప్రతిపాదనను అతడూ సమర్థించాడు; నాకు సమ్మతం కాలేదు. 'రేపు ఆలోచిద్దాం' అని చెప్పి మా బసకు వెళ్ళిపోయాం. మరునాడు వర్షంలో చిక్కుకుని రైలు పడవనందున సమావేశానికి మేమిరువురం గంటన్నర ఆలస్యంగా వెళ్ళాం. అప్పటికే నన్ను ప్రధాన కార్యదర్శిగాను, ఇన్నయ్యను సహాయ కార్యదర్శిగాను ఎంపిక చేస్తూ తీర్మానాన్ని రాసేసేరు. చేసేది లేక ఆ బాధ్యతను చేపట్టాను.

**1978లో** ఢిల్లీలో జరిగే రాడికల్ హ్యూమనిస్టు జాతీయ సభకు నన్ను అధ్యక్షత వహించమని తార్కుండే కోరాడు. నేను సమ్మతించాను. నేను, సుబ్బమ్మ, ఇన్నయ్య ముగ్గురం ఢిల్లీ వెళ్ళాం. గాంధీ ప్రతిష్ఠాన్ హాలులో మహాసభ సమావేశమయింది. సమావేశం జయప్రదం అయింది కాని దిన పత్రికలలో దానిని గురించిన వార్తలు ప్రకటితమవలేదు. దేశ కేంద్రమయిన

ఢిల్లీకి రాష్ట్ర కేంద్రాలయిన నగరాలకు అదే తేడాయని నేను గ్రహించాను. తార్కుండే ఎడల పత్రికాధిపతులకు, పత్రికా రచయితలకు గౌరవమే. అది వ్యక్తిగతం. కాని మానవవాద ఉద్యమం పట్ల వారికి ఆసక్తి లేదని తెలుసుకున్నాను. ఉద్యమం - సనాతనిగా కాక - పౌరహక్కుల ప్రజా సమితి (పి.యు.సి.ఎల్), జనతంత్రి సమాజ్ లాంటి సంస్థల ద్వారా పనిచేస్తున్నందు వల్ల అలా జరుగుతున్నదేమో!

ఢిల్లీ మహాసభను గురించి ఒక విషయాన్ని చదువరులకు ఎరుక పర్చటం నా విధి. మొదటి నుంచి, కనీసం **1958** నుండి మహిళోద్యమం పట్ల, మహిళా సంక్షేమం పట్ల అభిమానం పెంచుకుంటూ వచ్చాను. **1962-64** సంవత్సరాల్లో సుబ్బమ్మ నిర్వహించిన కుటుంబ నియంత్రణ శిబిరాల్లో, సభలలో పాలుపంచుకుంటూ వచ్చాను. **1974**లో నేను, సుబ్బమ్మ మిత్రుల సాయంతో స్థాపించిన 'వికాసం' మాస పత్రికలో - దాని కథ అలాయిదాగా చెప్పాను. మహిళలకు ప్రత్యేక శీర్షికను ప్రవేశపెట్టాను. ఇలాంటి నేను ఉద్యమాల సందర్భంగా మహిళలు తమ ప్రమేయాన్ని పెంచుకోవాలని ఆకాంక్షించడంలో ఆశ్చర్యం లేదు. ఢిల్లీ మహాసభలో చిట్టచివరి అంశంగా జాతీయ కార్యనిర్వాహక సమితి ఎన్నిక వచ్చింది. కొంతమంది పేర్లను మామూలుగా తార్కుండే ప్రతిపాదించటం మేము ఆమోదించటం ఆనవాయితీ. ఈసారి ఆయన తన జాబితాలోని కొన్ని పేర్లను చదివి యింకా కొన్ని పేర్లను చదివేలోగా ముందుగా అధ్యక్ష స్థానం నుండి నేను కొన్ని పేర్లను చెప్పసాగాను. నేను చెప్పిన మొదటి పేరు శ్రీమతి చిత్ర తార్కుండేది. ఆమె వి.ఎం. తార్కుండే భార్య. తార్కుండే ఆమె పేరు ఎందుకు అని అంటూ అభ్యంతరం చెప్పబోయాడు. 'ఆమె మీకన్నా ముందుగా ఎం.ఎన్. రాయ్ అనుచర వర్గంలో చేరారు. ఆమె రాయ్ నడిపిన అన్ని ఉద్యమాలలోనూ పాల్గొన్నారు. ఈనాడు రాడికల్ హ్యూమనిస్టు ఆంగ్ల మాస పత్రికకు గౌరవ మేనేజరుగా వ్యవహరిస్తూ, ఆ పత్రిక పటిష్టతకు, వ్యాప్తికి తోడ్పడుతున్నారు. మీ అభ్యంతరం చెల్లదు అని నేను గట్టిగా పలికాను. నా గొంతులోని ధృఢత్వాన్ని గమనించాడేమో ఆయన యిక మాట్లాడ లేదు. తరువాత సర్వశ్రీ మల్లాది సుబ్బమ్మ, శ్రీమతి ఉప్రై (రాజస్తాన్‌లోని ఉదయపూర్ కళాశాల అధ్యాపకురాలు) శ్రీమతి ఉష (మీరటులో పరిశోధకురాలు), లక్నో విశ్వ విద్యాలయంలో రీడరు. వీరి పేర్లు చదివాను. అందరూ ఆమోదించారు. మణిబెన్ కారా పేరు తార్కుండే చదివిన జాబితాలో ఉంది. ఆమె **1937** నుంచి ఎం.ఎన్. రాయ్ సహచరులు, కార్మిక నాయకులు, మహిళోద్యమ కార్యకర్త, సంఘ సేవకురాలు, మహాసభ రెండు రోజులు జరిగింది. రెండవ రోజు రాత్రి తార్కుండే ఆ రాత్రి జాతీయ సమితి సభ్యులకు విందు యిచ్చారు. అప్పుడు ఆయన మాట్లాడుతూ నీవు నన్ను కొందరి మిత్రుల పేర్లు చదవకుండా చేసావు. నేను మిత్రుడు జి.ఆర్.దల్వీ (ఆర్థిక శాస్త్రవేత్త) పేరు, తదితరుల పేర్లు సూచించాలని అనుకున్నాను. నీవు అడ్డుపడ్డావు అన్నాడు. ఇంతకన్నా సమితి సభ్యుల సంఖ్య ఉండరాదని మన సంఘ నిబంధనావళి లేదు. కాబట్టి వారి పేర్లను కూడా చేరుద్దాం అన్నాను. అంతటితో ఆ సంభాషణ ముగిసింది. ఇదంతా నేను చెప్తే తార్కుండేకు మహిళోద్యమంపై అభిమానం లేదని, మహిళలపై గౌరవం లేదని అనుకుంటే పొరపాటు. ఆయన ప్రత్యేకించి మహిళోద్యమంపై మొదట్లో శ్రద్ధ చూపలేదు. అంతే. **1976** వేసవిలో నైనిటాలులో నేను, సుబ్బమ్మ అఖిల భారత హ్యూమనిస్టు శిబిరానికి వెళ్తే సుబ్బమ్మను కుటుంబ నియంత్రణపై ప్రసంగించాలని (నీవు అందులో ప్రత్యేకంగా

శిక్షణ పొందావు కదా అని అంటూ) కోరింది తార్కుండేయే. ఆమె తనకు ఇంగ్లీషు రాదని అంటే రామ్మూర్తి తర్జుమా చేస్తాడులే అని తెలుగులో ఆమె ఉపన్యసించడానికి అవకాశం కల్పించింది ఆయనే. 1980లో, 1983లో ఆమెను ప్రోత్సహించి ఆమె చేత జయపూర్, బొంబాయి సభలలో ఇంగ్లీషులో మాట్లాడించింది ఆయనే. ఆమె మహిళా సమస్యలపై వ్యాసాలు రాస్తే, నేను వాటిని ఆంగ్లంలోకి తర్జుమా చేస్తే, ఢిల్లీలోని స్టెర్లింగు పబ్లిషర్సు 'స్త్రీలు, సంప్రదాయం, సంస్కృతి, (ఉమెన్ ట్రెడిషన్ అండ్ కల్చరు) అనే పేరుతో గ్రంథ రూపంలో ప్రచురిస్తే సుబ్బమ్మపై ఆదరంతో ముందుమాట రాసింది ఆయనే. చివరకు సుబ్బమ్మ భారత దేశంలో మహిళోద్యమ వ్యాప్తికి కృషిచేస్తూ, పర్యటిస్తే తాను సంఘం తరఫున ధన సహాయం చేయగలనని సూచించింది ఆయనే. హ్యూమనిస్టు సంఘం ప్రధాన కార్యదర్శిగా రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర బెంగాలు రాష్ట్రాలను పర్యటించాను. అక్కడి మిత్రులను మరింత దీక్షగా, పట్టుదలగా ఉద్యమంలో పాల్గొనమని అభ్యర్థించాను.

# హైదరాబాదులో తొలి పి.యు.సి.ఎల్. కార్యక్రమాలు

ఎమర్జెన్సీని ఇందిరమ్మ 1977 ఫిబ్రవరిలో లాంఛనాయుతంగా తీసివేసింది. అంతకు క్రితమే దానిని పార్లమెంటు ఎన్నికల సందర్భంగా సడలించటం గురించి తెలుసుకున్నాం కదా! ఎప్పుడయితే అత్యయిక పరిస్థితిని తీసివేయడం జరిగిందో అప్పటినుంచి పత్రికలకు ధైర్యం వచ్చింది. ఎమర్జెన్సీ అమలులో వున్న కాలంలో ప్రభుత్వాలు, ప్రభుత్వాధికారులు జరిపిన దుర్మార్గాలు, దౌర్జన్యాలు, అక్రమాలు, అన్యాయాలు, ఘాతకాలు, ఎన్‌కౌంటర్ల పేరుతో హత్యలు వెలికి రాసాగాయి. పత్రికలలో పోటీ వేసుకున్నాయి. శ్రీ పి.వి. నరసింహారావును ఆం.ప్ర. ముఖ్యమంత్రిగా తొలగించిన తరువాత అధ్యక్ష పరిపాలన తరువాత శ్రీ వెంగళరావును ముఖ్యమంత్రిగా ఇందిరమ్మ ఎంపిక చేసిన నాటినుండి జరిగిన దుష్కార్యాలను తెలిసికున్న ఆంధ్ర ప్రజానీకం తీవ్రంగా కలవరపడ్డది. ఎమర్జెన్సీలో నిర్బంధితులను ఇతర ప్రదేశాలు అంటే మదరాసు, మధ్యప్రదేశ్, ఢిల్లీల కంటే - మెరుగుగా చూసిన విషయం వాస్తవమయినా చేజిక్కిన నక్సలైట్లను అక్రమంగా 'లా'కు విరుద్ధంగా ఎన్‌కౌంటర్ల పేర హతమార్చడం, నక్సలైట్ అభిమానులని సంశయించి పలువురు, వేలమంది ప్రజలను నిర్బంధించి హింసల పాల్జేయటం రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాన్ని అప్రతిష్టపాలు చేసినాయి. కార్మికుల బోనసును 12.5 శాతం నుండి 6.25 శాతానికి తగ్గిస్తే, 'ఇది ఏమని' ప్రశ్నించిన కార్మిక నాయకులను, కార్మికులను హింసించిన తీరు, వారి నాయకులను అరెస్టు చేసిన విధానం, కొన్నిచోట్ల వారిపై కాల్పులు సాగించిన పద్ధతి యివన్నీ తెలుగు ప్రజలను కోపోద్రిక్తులను చేశాయి.

పి.యు.సి.ఎల్. కార్యక్రమాల్లో నాయకులు శ్రద్ధ చూపసాగారు. సర్వశ్రీ జి.సి. కొండయ్య·· , గౌతు లచ్చన్న, కమ్యూనిస్టు మార్క్సిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య ప్రభృతులు (సుందరయ్యగారు అత్యయిక పరిస్థితి కాలం యావత్తు అజ్ఞాతవాసంలో వున్నారు) పౌర హక్కుల ప్రజా సమితి సమావేశాలకు హాజరయి, చురుకుగా చర్చలలో పాల్గొంటూ, తీర్మానాలను రూపొందిస్తుండే వారు. ఎమర్జెన్సీ కాలంవరకు కమ్యూనిస్టు సానుభూతిపరుడయి, ఎమర్జెన్సీని ఎదిరించాలనే లక్ష్యంపై కమ్యూనిస్టు పార్టీ లోపల నుండి విడివడి, ఇందిరాగాంధీ అణచివేతకు గురి అయిన నిర్బంధితులకు సాయపడసాగిన - పార్టీతో నిమిత్తం లేకుండా అందరి నిర్బంధితులకు - శ్రీ కన్నభిరాన్‌ను (హైకోర్టు అడ్వకేటు) పియుసిఎల్ రాష్ట్ర సమన్వయ సమితిలో చేర్చుకున్నాం. ఆయన తన సాయాన్ని అర్థించిన అందరి నిర్బంధితుల కేసులను చేపట్టి వాదించాడు. నేను హైదరాబాదులో చంచల్‌గూడా కేంద్ర కారాగారంలో వుంటూ నా కేసును, కాపురాల రిట్‌ను, వాదించడానికి హైకోర్టుకు తరచువచ్చే రోజుల్లో ఆయన పరిచయం అయింది. అది అభిమానంగా మారి గౌరవంగా రూపొందింది. ఆయన కూడా ఆసక్తిగా, శ్రద్ధగా తన నిశిత మేధాశక్తిని వినియోగించి పియుసిఎల్ సమావేశాలకు అర్థం చేకూర్చేవాడు.

పి.యు.సి.ఎల్. అనేక రాష్ట్ర ప్రభుత్వ చర్యలను ఖండించటం, నిరసన తెల్పటం చేయడమే కాక కృష్ణాజిల్లా ఉయ్యూరులో రైతులు వ్యవసాయ కార్మికులయిన దళితుల మధ్య సంఘర్షణలు జరిగితే దళితులపై జరిగిన దౌర్జన్యకాండను ఖండించింది. ఇలాంటి పౌర సమస్యలను పౌరహక్కుల ప్రజా సమితి ఎత్తుకున్నది. అప్పటినుంచి ముఖ్యమయినది సుందరయ్యగారి

సూచన మేరకు తలపెట్టిన చర్య. వెంగళరావు ముఖ్యమంత్రిగా వున్న కాలంలో ప్రజలపై జరిగిన అక్రమాలకు, అన్యాయాలకు, దౌర్జన్యాలకు, క్రూర హింసలకు, ఎన్ కౌంటర్ల పేర జరిగిన హత్యాకాండకు నిరసనగా హైదరాబాదులో పెద్ద బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శన జరిపి, వాటిపై దర్యాప్తును డిమాండు చేస్తూ గవర్నరుకు మహా విజ్ఞాపన పత్రాన్ని సమర్పించాలనేదే ఆయన ప్రతిపాదన. దానిని అందరం ఏకగ్రీవంగా అంగీకరించాం. దానిని జయప్రదం చేయటానికి అందరం పూనుకున్నాం. అయితే ప్రధాన భారం సుందరయ్యగారి నాయకత్వాన పనిచేసే కమ్యూనిస్టు మార్క్సిస్టు పార్టీపై పడింది. (ఆ కాలంలో భారత కమ్యూనిస్టు పార్టీ ఇందిరాగాంధీని సమర్థించిందని, జయప్రకాష్ ఉద్యమాన్ని ఫాసిస్టు ఉద్యమంగా అభివర్ణించిందని, కాంగ్రెసు ప్రభుత్వాలకు అండదండలందించిందని విదితమే). ఏర్పాట్లు చురుకుగా సాగినాయి. అప్పుడు జనతాపార్టీ నగర శాఖ కార్యదర్శి అయిన శ్రీ కె. ప్రతాప్ రెడ్డి (అడ్వకేటు), సీనియరు అడ్వకేటు ప్రజా హితైభిలాషి శ్రీ బాబుల్ రెడ్డి, మొట్ట మొదటిగా హైదరాబాదు న్యాయవాదుల చేత ఎమర్జెన్సీకి వ్యతిరేక నిరసన ప్రదర్శింప చేసి వారి ఊరేగింపును నగర వీధులలో త్రిప్పిన శ్రీ యడవల్లి శివరామశాస్త్రి, స్థానిక సోషలిస్టు నాయకులు ఇలా ఎందరో ఈ ప్రదర్శన బాధ్యతను స్వీకరించి కృషిచేశారు. ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శిగా కామ్రేడ్ ఎస్.వి. భాస్కర రావు (ఆనాడు నగర కమ్యూనిస్టు మార్క్సిస్టు పార్టీ కార్యదర్శి; ఆరోగ్యాన్ని సైతం పట్టించుకోక తరువాత కీర్తిశేషుడయిన కార్యకర్త, నాయకుడు) విశేష కృషి చేశాడు. అప్పుడు అఖిలభారత పౌరహక్కుల ప్రజాసమితి ప్రధాన కార్యదర్శి అయిన శ్రీ కృష్ణకాంత్ ను (ఈనాటి ఆం.ప్ర. గవర్నరు) ప్రదర్శనకు నాయకత్వం వహించమని కోరాం. ఆయన వచ్చారు. సర్వశ్రీ క్రిష్ణకాంత్ (కిషన్ కాంత్), తెన్నేటి విశ్వనాథం, గౌతులచ్చన్న, కొండయ్య, బాబుల్ రెడ్డి, ప్రతాప రెడ్డి, నేను, కన్నభిరాన్ తదితర ప్రజా సమితి నాయకులు, సోషలిస్టు కమ్యూనిస్టు జనతా నాయకులు అగ్ర భాగాన నడువగా 20వేల మంది ప్రదర్శకులు నగర వీధులలో ఊరేగారు. మహా విజ్ఞాపన పత్రాన్ని గవర్నరుకు అందజేశారు. ఇది పౌరహక్కుల ప్రజాసమితి చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖించదగిన సంఘటన. దీనిని నిర్వహించి జయప్రదం చేసిన ఘనత, గౌరవం సుందరయ్య గారిది.

మరియొక సందర్భాన్ని గురించి వ్రాయక తప్పదు. ఉత్తర తెలంగాణాలో ఒక జిల్లాలో నక్సలైటు వర్గానికి చెందిన నాయకుల ప్రోద్బలంతో ప్రజలు ఒక భూస్వామి గడీని ముట్టడించారు. ఆ భూస్వామి ప్రజలపై కాల్పులు సాగించాడు. కొంతమంది చనిపోయారు. ఆ సంఘటనను నేను పత్రికా ముఖంగా ఖండించాను. ఆ గ్రామం వెళ్లి విషయాలు తెలిసికొని నిజ నిర్ధారణ కమిటీగా వ్యవహరిద్దామని నేను సుందరయ్య గారికి సూచించాను. వారి జవాబు వారి ఆలోచనా ధోరణికి ప్రతిబింబంగా నిలిచింది. "భూస్వాములు, జమీందారులు తరతరాలుగా ప్రజలను అణచివేస్తున్నారు; వారిపై దౌర్జన్యాలను సాగిస్తున్నారు. ప్రజలు వాటిని త్రిప్పి కొట్టుతున్నారు. ఆ సందర్భాలలో జనం ప్రతి హింసకు పూనుకోవడం సహజం; న్యాయం కూడాను. అయితే అణచివేత, దౌర్జన్యం జరిగిన కొంత కాలానికి ప్రజలను రెచ్చగొట్టి, వారిని ఉద్రేకపరచి, వారిని సమీకరించి జమీందారులపై, భూస్వామ్య వర్గాలపై, పెద్దగా మారణాయుధాలు లేని ప్రజల చేత దాడి చేయించటం అవివేకం. వ్యూహరీత్యా అసంగతం; ఎత్తుగడల రీత్యా ఘోర తప్పిదం. నేను నిజ నిర్ధారణ కమిటీ సభ్యునిగా ఆ

ప్రాంతానికి వస్తే నేను ఈ మాటలు చెప్పాల్సి వస్తుంది. మాకూ (కమ్యూనిస్టు మార్క్సిస్టులకూ), నక్సలైట్లకు వున్న విభేదాల వల్ల అది అవాంఛనీయ వివాదాలకు, అపోహలకు దారితీస్తుంది. కనుక నన్ను వదిలి వేయండి" అని సుందరయ్య గారు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అయితే ఈ సుందరయ్యగారే - ఇలా అన్న సుందరయ్యగారే భార్గవ కమిషను నక్సలైటు హత్యలపై జరిగిన విచారణలో ప్రముఖ పాత్ర వహించారని తెలుసుకుంటే వారిని గురించి దురభిప్రాయాన్ని ఏర్పరుచుకునే ప్రమాదం తప్పుతుంది.

# అసెంబ్లీ ఎన్నికలు: కాళోజీ అభ్యర్థిత్వం

**1972**లో ఆంధ్రప్రదేశ్‌లో అసెంబ్లీ ఎన్నికలు జరిగినాయి. మరల **1978**లో అసెంబ్లీ ఎన్నికలను ప్రకటించారు. ఈలోగా ఇందిరా కాంగ్రెసులో చీలిక వచ్చింది. బ్రహ్మానంద రెడ్డి అధ్యక్షతన చీలిక వర్గం వ్యవహరించ సాగింది. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రిగా వుంటున్న శ్రీ వెంగళరావు బ్రహ్మానంద రెడ్డి కాంగ్రెసులో చేరాడు. ఆంధ్రప్రదేశ్‌లో ఇందిరమ్మ వర్గం బ్రహ్మానంద రెడ్డి కాంగ్రెసు వర్గాన్ని అంతమొందించ పూనుకున్నది. శ్రీ చెన్నారెడ్డి ఇందిరమ్మ వర్గానికి నాయకత్వం వహించారు.

వెంగళరావు గారిది సత్తుపల్లి నియోజక వర్గం. ఆయన అప్పటికి రెండు పర్యాయాలు తిరుగులేని మెజారిటీతో ఎన్నికయ్యారు. మరల ఆయన ఆ నియోజక వర్గం నుండే పోటీ చేయడం ఖాయం. ఈ విషయాన్ని తెలిసిన మేము - వెంగళరావు గారిని ఎదిరించ తలచిన మేము అనగా సర్వశ్రీ కె.జి. కన్నబిరాన్, కె. ప్రతాప రెడ్డి, నేను, సోషలిస్టు మిత్రులం - తగిన అభ్యర్థి ఎవరా అని ఆలోచించసాగాము. ఎవరో - నాకు పేరు గుర్తుకు రావటం లేదు - కాళోజీ పేరు చెప్పారు. వెంటనే మిత్రుడు ప్రతాప రెడ్డి కాళోజీకి ఫోన్‌చేసి హైదరాబాదు రమ్మనమని కోరాడు. ఫోను వార్త అందిన 5 గంటలలో కాళోజీ వరంగల్ నుండి హైదరాబాద్ చేరాడు. రాగానే 'మీరు వెంగళరావు గారికి వ్యతిరేకంగా ఖమ్మం జిల్లాలోని సత్తుపల్లి నియోజక వర్గం నుండి పోటీ చేయాలన్నాము. వెంటనే ఏమాత్రం తటపటాయింపు లేకుండా ఆయన 'సరే' అన్నారు.

ఇక కాళోజీ ఎన్నిక ఏర్పాటును గురించి చర్చించాము. కాళోజీ స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసేటట్లు, జనతా, మార్క్సిస్టు పార్టీల మద్దతును కోరేటట్లు, నక్సలైటు వర్గాల సహకారాన్ని పొందేటట్లు నిర్ణయం జరిగింది. ఆనాడు ఆంధ్రప్రదేశ్ జనతా పార్టీకి అధ్యక్షుడుగా వున్న తెన్నేటి విశ్వనాథం గారిని మిత్రులు కలిసి వారి పార్టీ సహాయాన్ని గట్టి చేశారు. అలాగే మార్క్సిస్టు పార్టీ మద్దతు లభించింది. ఇంతవరకు రెండుసార్లు మార్క్సిస్టులే వెంగళరావుగారికి ఆ నియోజక వర్గంలో పోటీగా నిల్చారు. అయితే వారి అభ్యర్థికి ఏనాడు 12వేల కన్నా వోట్లు పోలు కాలేదు. శ్రీ కన్నబిరాన్ కృషి వలన నక్సలైటు వర్గాల తోడ్పాటు గ్యారంటీ అయింది. శ్రీ ప్రతాప రెడ్డి ఎన్నికల కమిటీకి కోశాధికారిగా వుండేటట్లు, నేను కాళోజీ ఎన్నికల ఏజంటుగా ఆయన ఎన్నికల కార్యాలయంలో బాధ్యత తీసుకునేటట్లు శ్రీ కన్నబిరాన్ నక్సలైటు వర్గాలవారు సత్తుపల్లి నియోజక వర్గంలో పనిచేసే విషయంలో సమైక్య సంచాలకులుగా వ్యవహరించేటట్లు తీర్మానం జరిగింది. ఎవరికి కేటాయించబడిన పనులలోకి వారము వెంటనే వెళ్లిపోయాము. సత్తుపల్లిలో ఎన్నికల కార్యాలయాన్ని ఏర్పాటు చేశాము. సర్వదా సర్వస్వతంత్రుడుగా వుండే కాళోజీని ఒంటరిగా ఎక్కడికి వెళ్లరాదని కార్యకర్తలు కట్టడి చేశారు. సహృదయుడయిన కాళోజీ వారి సలహాను మన్నించాడు. మొత్తం **160** మంది నక్సలైట్లు సత్తుపల్లి నియోజక వర్గానికి అంచెలంచెలుగా వచ్చారు. వచ్చీ రావటంలోనే సత్తుపల్లి వీధులలో [illegible] "మనుష్యులను చంపటానికి నీకెవరిచ్చారురా అధికారం వెంగళరావు" అని నినాదం యిచ్చారు. ఏనాడు వెంగళరావుని ఎవరూ ఇన్నాళ్లు 'రా' కొట్టి మాట్లాడలేదు. 'అలా వ్యతిరేకంగా వీధులలో అరుస్తుంటే అని ఊరకున్నారా

అని ఊహించి వెంగళరావు తమను ఓడించకతారని భావించి ఈ ఊరు పెద్దలు ఈ వివాదాలను వినకుండా వుండగలందులకు తగిన ఏర్పాట్లను చేసుకున్నారు.

కాంగ్రెసు (ఐ) అభ్యర్థి ఒక దళితుడు, కాంగ్రెసు (రి) అభ్యర్థి వెంగళరావుగారు, జనతా మార్క్సిస్టు పార్టీల మద్దతుతో స్వతంత్ర అభ్యర్థి కాళోజీ ఆ నియోజక వర్గంలో పోటీ చేశారు. ఎన్నికల తేదీ వారం రోజులుండగానే కాళోజీ నియోజక వర్గంలో విస్తృతంగా పర్యటించారు. ఆయా ప్రతిపక్ష పార్టీలకు చెందిన నాయకులు, ఇతర పెద్దలు అభ్యర్థితో పాటు వస్తుగా ఉండేవారు. పార్టీ నాయకులకు అందుబాటులో ఉండే నిమిత్తం, ఖర్చుల కోసం వారికి నిధులను అందజేసే దానికి, కాళోజీ పేరున వచ్చిన చందాలను, విరాళాలను స్వీకరించటానికి, మిడతల దండులాగా వచ్చి పడుతున్న వలంటీర్లను వివిధ కేంద్రాలకు కేటాయించటానికి ఎక్కువ కాలం అన్ని రోజులూ నేను పార్టీ కార్యాలయంలోనే వుండేవాడిని. సర్వశ్రీ కన్నబిరాన్, వసంతా కన్నబిరాన్, రమా మేల్కోటే, ప్రతాప రెడ్డి, మల్లాది సుబ్బమ్మ వగయిరాలు వచ్చి తలా ఒక వారం పది రోజులు వుండి పోతుండేవారు. శ్రీ వెంగళరావు రాష్ట్ర ముఖ్యమంత్రి కావటంతో ఈ నియోజక వర్గ ఎన్నికలు భారత పత్రికా ప్రపంచానికి ఆసక్తి కలిగించాయి. ఢిల్లీలోని పత్రికా విలేఖరులు కూడా వచ్చారు. 'స్టేట్స్‌మన్' (ఢిల్లీలోని ఆంగ్ల పత్రిక) విలేఖరి రాజన్ మూడురోజులు ఆ నియోజక వర్గంలో తిరిగాడు. ఎన్నిక తేదీ మూడు రోజులు వుండగా "కాళోజీ అభ్యర్థిత్వం ఎలా వుంది?" అని నన్ను అడిగాడు. "ఈ రోజు ఎన్నిక జరిగితే మేము అఖండ విజయం సాధిస్తాం. రెండు రోజులు గడిస్తే చెప్పలేము. డబ్బులు, సారా సీసాలు వీటితో కాంగ్రెస్ (రి) అభ్యర్థి నియోజక వర్గాన్ని నింపివేస్తాడు" అని చెప్పాను.

కాళోజీ అభ్యర్థిత్వానికి ఎంతో ప్రజాదరణ లభించింది. ఈ పరిస్థితిని రాష్ట్రంలో తన పార్టీ అభ్యర్థుల విజయానికి కృషి చేస్తున్న వెంగళరావు గారికి ఆయన మనుష్యులు తెలియజేశారు. అంతకు ముందు పత్రికా విలేఖరుల సమావేశంలో 'నేను అవలీలగా అఖండంగా గెలుస్తాను' అని చెప్పిన శ్రీ వెంగళరావు నియోజక వర్గంలోని స్థితిగతులను గమనించి ఎన్నికలు జరిగేదాకా - వారం రోజులు - నియోజక వర్గ సరిహద్దులను దాటలేదు. తన సహచరులను, అనుచరులను విమర్శించి వారిని అప్రమత్తం చేశారు. తన తమ్ముళ్లను, కొడుకులని గట్టిగా పని చేయమని ప్రోద్బలం చేశారు. దాంతో వారంతా ద్విగుణీకృతోత్సాహంతో పనిచేయసాగారు. ఎన్నిక తేదీ ఇక రెండు రోజులు వుండగా ఒక కారును [illegible] చేయించగలరా అని విజయవాడలోని మార్క్సిస్టు రాష్ట్ర నాయకుని అడిగాను. ఆయన నవ్వుతూ "అన్ని పోలింగ్ బూతులకు ఏజంట్లు దొరికారా!" అని అడిగారు. లభించారని నేను సమాధానం చెప్తే ఆయన సంతృప్తి చెందారు. మార్క్సిస్టులు పోటీచేసిన రెండు నియోజకవర్గాలలో వారికి 110 పోలింగ్ బూతులలో 60కి మించి ఏజంట్లు దొరకలేదు. నేను ఇచ్చిన వర్తమానం, ఒక్క పోలింగ్ బూత్‌లో తప్ప, వాస్తవమయింది. వెంగళరావుగారికి వ్యతిరేకంగా మాతో కలిసి పనిచేసి ఆయన ఊళ్లో పోలింగు ఏజంటుగా వుండటానికి అంగీకరించిన ఆయన మేనల్లుడు చివరి నిమిషంలో బంధు ప్రీతికి లోనయి హాజరు కాలేదు. విషయం తెలిసికున్న నేను మధ్యాహ్నానికి మరొకరిని నియమించాను.

ఎన్నికల ఫలితాలను ప్రకటించారు. వెంగళరావుగారికి 28వేల వోట్లు, కాళోజీకి సుమారు 18వేల వోట్లు, కాంగ్రెస్ (ఐ) అభ్యర్థికి సుమారు 10వేల వోట్లు వచ్చినాయి. కులాల

వారీగా లెక్కకట్టే కమ్మవారు, వెలమవారు వెంగళ్రావుగారిని బలపరచగా, వెనుకబడిన జాతులవారు కాళోజీకి వోటు చేశారు. దళితులు ఇందిరమ్మ కాంగ్రెసు అభ్యర్థిని సమర్థించి తమకు ఇందిరాగాంధీ యెడల గల భక్తి ప్రపత్తులను, అభిమానాన్ని, గౌరవాన్ని చాటుకున్నారు. కాళోజీకి పనిచేసిన వారము మా కృషిలో విజయాన్ని సాధించలేకపోయినా వెంగళ్రావుగారిని ఆ నియోజక వర్గం నుండి దాటిపోకుండా చేయగలిగాము. అందువల్ల కాంగ్రెసు (బి) 30 నియోజక వర్గాలలో ఘోర పరాజయాన్ని చవి చూడవలసి వచ్చింది. ఈ పరిణామం మా విజయంగా భావించాము.

# కాంగ్రెస్ ఎన్నికలలో విచిత్ర సన్నివేశాలు

కాంగ్రెస్‌కి సత్తుపల్లి నియోజక వర్గంలో ఎన్నికల ఏజంటుగా నేను పనిచేసినప్పుడు నాకు విచిత్ర సన్నివేశాలు ఎదురయినవి; విపరీత సంఘటనలు జరిగాయి. వాటిని ఉటంకించటం సముచితం.

ఒక రోజున 30 మంది నక్సలైటు కార్యకర్తలు ఒక గ్రామం వెళ్లడానికి సమాయత్తమవుతున్నారు. వారంతా పురుషులు. "మేము కూడా వారితో వెళ్తాము" అన్నారు సర్వశ్రీ లలిత (ఈనాటి 'అన్వేషి' సంపాదకులు) ప్రభృతులు. "వాళ్లకి భద్రత సమస్య కనుక వారు వెళ్లకుండటం మంచిదేమో" అన్నాను నేను. వారు 'స్త్రీ పురుష సమానత్వాన్ని' పేర్కొని తాము వెళ్లవలసిందేనని పట్టుపట్టారు. వారి వాదనలోకి తార్కిక బలాన్ని గుర్తించి నేను వారి అభ్యర్థనకు సమ్మతి తెలిపాను.

మరొక సంఘటనను గురించి తెలియజెప్పే ముందు నక్సలైటు కార్యకర్తలు నాకు ఇచ్చిన హామీ గురించి ముచ్చటించటం సమంజసం. 'నాకు చెప్పకుండా ఎట్టి పరిస్థితుల్లోను మీరు దౌర్జన్యానికి పూనుకోరాదని' అవసరమయితే నేను దగ్గర వుండి దౌర్జన్య కార్యకలాపాలను చేయిస్తానని చెప్పి నక్సలైటు వలంటీర్లను కోరాను. వారు సహృదయంతో నా ప్రతిపాదనను అంగీకరించారు. ఒక రోజున 40 మంది లారీ ఎక్కి పట్వారీ గూడెం గ్రామం వెళ్లారు. ఆ గ్రామ సర్పంచ్, పెత్తందారు వెంగళరావుగారి తోడల్లుడు, ఇటీవలనే వెంగళరావుగారి విమర్శకు లోనయినాడేమో ఆయన ప్రత్యర్థుల మీద కోపోద్రేక్తుడయి వున్నాడు. చేతులలో కర్రలతో వున్న తన 200 మంది అనుచరులతో ఆయన మా వలంటీర్లను ఊరి ముందట అటకాయించాడు. "ఈ ఊరిలో ప్రవేశించనీయము" అని బహిరంగంగా గట్టిగా పలికారు ఆయన మనుష్యులు. మా కార్యకర్తల చేతుల్లోను జెండాలు కట్టిన కర్రలున్నాయి. అంతేగాక ఊరిలో మమ్ములను బలపరిచేవారు 2 వందల మంది దాకా వెనుకబడిన జాతుల యువకులు ఉన్నారు. మా వలంటీర్లు ఊరిలోకి వెళ్లి తీరుతామని పట్టుపడితే పెద్ద కొట్లాట జరిగేది. ఊరు రణ రంగంగా మారేది. మావాళ్లు నాకిచ్చిన వాగ్దానాన్ని జ్ఞాపకం చేసుకొని సత్తుపల్లికి తిరిగి వచ్చారు. విషయమంతా నాకు వివరించారు. రేపు ఆ గ్రామం వెళ్దామని చెప్పాను. మరునాడు రెండు లారీల నిండా 100 మంది వలంటీర్లను జెండా కర్రలిచ్చి పంపాను. "ఏదయినా ప్రతిఘటన వస్తే నాకు కబురు పంపండి. నేను వెంటనే వస్తాను" అని చెప్పి పంపాను. రెండు లారీల వలంటీర్లు పట్వారీ గూడెం వెళ్లారు. క్రితం రోజున జరిగినట్లుగానే వెంగళరావుగారి తోడల్లుడి మనుష్యులు మా వాళ్లను 'గ్రామంలో ప్రవేశించరాదని' అడ్డు పెట్టారు. మా వలంటీర్లు నాకు సత్తుపల్లిలో ఇచ్చిన మాటను గుర్తు చేసుకొని పెద్ద మోటారు సైకిలుపై ఒక కార్యకర్తను కాంగ్రెస్ ఎన్నికల కార్యాలయానికి పంపారు. అతడు వచ్చి నాకు వార్త అందించాడు. నేను వెంటనే తదుపరి కార్యక్రమాన్ని నిర్ణయించవలసి వుంది. సత్తుపల్లి నియోజక వర్గంలో శాంతి భద్రతలను పరిరక్షించ వలసిన ఉన్నత పోలీసు అధికారి అందుబాటులో లేడు. క్షణాల మీద నిర్ణయానికి వచ్చాను. లేదా, కొట్లాట తప్పదని తేల్చుకున్నాను. వెంటనే ఆ వచ్చిన మోటారు సైకిలు వెనుక సీటుమీద కూర్చొని ప్రయాణం చేశాను. సత్తుపల్లికి పట్వారీ గూడానికి మధ్య ఒక గ్రామం ఉంది. దాని

పేరు యిప్పుడు స్ఫురణకు రావటం లేదు. ఆ గ్రామ ప్రజలలో మెజారిటీ వారు జనతా పార్టీని బలపరుస్తున్నారు. త్రోవలో ఆ గ్రామంలో రెండు ప్రదేశాలలో ఆగి "పట్వారీ గూడెంలో మన వాళ్లపై వెంగళరావు మనుష్యులు దౌర్జన్యం చేయబోతున్నారు. మీరంతా అక్కడికి హుటాహుటిన రండి" అని చెప్పి ప్రయాణం సాగించాను. క్షణాలలో ఆ గ్రామంలోని మా మనుషులు సైకిళ్ల మీద, ట్రాక్టర్ల మీద, కాలి నడకన చేతులలో కర్రలను పట్టుకొని బయలుదేరారు. వారు ఒక 150మంది దాకా వుంటారు. నేను ముందు వారు వెనుకన పట్వారీ గూడెం చేరాము. ఆ గ్రామంలో ప్రవేశించే చోట ఎవరూ లేరు. మావాళ్లు లేరు. వెంగళరావుగారి మనుష్యులూ లేరు. అంత నేను గ్రామంలోని మా ఎన్నికల కార్యాలయానికి వెళ్లాను. మా వలంటీర్లు భోజనాలు చేస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూచి నేను విస్తుపోయాను. సంగతి అంతా వారు చెప్పారు. ఆ గ్రామంలో వున్న పోలీసు ఔట్ పోస్టులో ఉన్న పోలీసు అధికారి వెంగళరావుగారి తోడల్లుని బ్రతిమాలి ఆయన ప్రతిఘటనను మాన్పించాడట. అప్పటికి మా కార్యకర్తలు - మా వలంటీర్లు 100 మంది, ప్రక్క గ్రామం నుంచి వచ్చినవారు 150, గ్రామంలోని వారు 200 మంది - వెరశి 450మంది వున్నారు. ఈ జనాన్ని చూచిన మా వాళ్లకు మహోత్సాహం కలిగింది. వెంగళరావుగారి తోడల్లుని యింటి మీదుగా ఊరేగింపు తీయాలన్నారు. అలా జరిగితే కొట్లాటలు, కాల్పులు తప్పవని నాకు తోచింది. సత్తుపల్లి నుంచి వచ్చిన వలంటీర్లను ప్రక్కనే వున్న మరో గ్రామానికి పొమ్మన్నాను. త్రోవలోని గ్రామం నుంచి వచ్చిన వారిని వారి గ్రామానికి వెళ్లవలసినదని ఆదేశించాను. మా వలంటీర్లకు నా మీద విపరీతమయిన కోపం వచ్చింది. నన్ను నిందించసాగారు. "రేపు తీరికగా సత్తుపల్లి కార్యాలయంలో నన్ను తిట్టండి. ప్రస్తుతం నా మాట మన్నించండి" అన్నాను. గత్యంతరం లేక వారు నా మాట విన్నారు. సంఘర్షణ తప్పిపోయినందుకు సంతసించాను. మరునాడు ఎన్నికల కార్యాలయంలో నన్ను మా వలంటీర్లు దుయ్యబట్టారు. 'నీవు పిరికిపందవు" అని తిట్టారు. తిట్టి, తిట్టి అలసిపోయి వారు ఊరుకున్నారు.

మరొక సంఘటన అశ్వారావు పేట, ఇద్దరు మా వలంటీర్లు బియ్యం, ఎండుపప్పు, మిరపకాయలు మూట్లు తీసుకొని అశ్వారావు పేట ఫిర్కాలో వున్న అడవిలోని గ్రామాలకు వెళ్లారు. ప్రజలలో కలిసి మెలిసి వుంటూ ఎన్నికల ప్రచారం సాగిస్తున్నారు. వారి ప్రచార ఫలితంగా వెయ్యి వోట్లు వెంగళరావుగారికి వ్యతిరేకంగా పడే స్థితి కల్గింది. అది తెలిసిన కాంగ్రెసు గూండాలు వారిని అడవిలో పట్టుకొని అశ్వారావు పేట కాంగ్రెసు శిబిరంలో - ఎన్నిక తేదీ ముందు రోజు రాత్రి - నిర్బంధించారు. ఆ వార్తను మోటారు సైకిలు వార్తాహరుడు నాకు అందించాడు. వెంటనే అదే మోటారు సైకిలు మీద అశ్వారావు పేట బయలుదేరాను. త్రోవలో ఒక గ్రామంలో పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్ మకాం వేసి వున్నాడని తెలిసింది. రాత్రి 11 గంటల 30 నిమిషాలకు ఆయనను లేపాను. విషయం చెప్పి మా వాళ్లను రక్షించే బాధ్యత మీదని చెప్పి అశ్వారావు పేటకు ప్రయాణం కట్టాను. మర్యాదగా మాట్లాడినా దృఢంగా వినిపించు ధోరణిలో మాట్లాడాను. మా వాళ్లకు ఏమి ప్రమాదం లేకుండా అప్పగించే బాధ్యత తనదని ఆయన నాకు హామీ యిచ్చాడు. నేను అశ్వారావు పేటలోని మా కార్యాలయానికి వెళ్లేటప్పటికి మా వాళ్లు ఒక వందమంది చేరుకొని నాకోసం కనిపెట్టుకొని ఉన్నారు. వెన్వెంటనే కాంగ్రెసు శిబిరం మీద దాడి చేద్దామని వారు సలహా చెప్పారు. వారి అభ్యర్థనను నేను తిరస్కరించాను.

ఎన్నికకు విఘాతం కలుగ జేసుకోవటం నాకు యిష్టం లేదని బదులు పలికాను. వారికి కోపం వచ్చింది. "మా స్నేహితులకు ఏమయినా ప్రమాదం సంభవిస్తే మీరు ప్రాణాలతో వుండరు" అని బెదిరించారు. "సరే! ప్రస్తుతానికి నా మాట వినండి" అని ప్రార్థించాను. వారు వారి ప్రయత్నాన్ని విరమించారు. కాంగ్రెసు వారు ఎత్తుకొనిపోయిన మా యిరువురు వలంటీర్లను ఎన్నికలు అయిపోయిన మరునాడు వారిని అపహరించు కొనిపోయిన మనుష్యులు వారి స్వగ్రామంలో దిగబెట్టారని తెలిసింది. నిబ్బరంగా గాలి పీల్చుకున్నాను.

జనతాపార్టీ అభ్యర్థిగా చేకూరి కాశయ్యగారు కొత్తగూడెం నియోజక వర్గం నుండి పోటీ చేస్తున్నారు. వారి సభలో ఉపన్యసించమని నన్ను కోరడానికి వారి కార్యకర్తలు కారులో సత్తుపల్లి వచ్చారు. త్రోవలో ఒక గ్రామంలో కాంగ్రెసు వలంటీర్లు వారిని కర్రలతో మోదారు. వారు సత్తుపల్లి వదలిన అరగంటకు నేను బయలుదేరాను. కాంగ్రెసువారు దౌర్జన్యం చేసిన గ్రామం వచ్చిన తరువాత ఆ గ్రామంలోని జనతాపార్టీ ఎన్నికల కార్యాలయం వారు చెప్తే నాకు యీ సంగతి తెలిసింది. నా వెంబడి ఆదిరాజు వెంకటేశ్వర రావుగారు ఉన్నారు. (ఆయన దిన పత్రికలలో విలేఖరి. తరువాత 'రాజధాని' పత్రిక సంపాదకుడు. ఇప్పుడు ఢిల్లీలో ప్రముఖ పత్రికా విలేఖరి). నేను కారులో వస్తున్నానని తెలిసి కాంగ్రెసువారు యీ దారుణానికి ఒడిగట్టారని ఆయన విశ్వసించారు. అలా హైదరాబాద్‌కు వార్త పంపాను. మరునాడు ఉదయం ఆకాశవాణిలో "రామ్మూర్తిపై హత్యా ప్రయత్నం" అనే వార్త ప్రసారమయింది. అనేకమంది నా యోగ క్షేమాలను గురించి వాకబు చేశారు.

# ప్రపంచ హ్యూమనిస్టుమహాసభ

**1970**లో బోస్టన్‌లో జరిగిన ప్రపంచ హ్యూమనిస్టు మహాసభకు గోరాగారు వెళ్ళి వచ్చిన తరువాత హ్యూమనిస్టు సంఘాధ్యక్షుడు తార్కుండే ప్రపంచ మహాసభకు వెళ్తే బాగుండుననే ఆలోచన నాకు కల్గింది. ఢిల్లీలో జరిగిన హ్యూమనిస్టు సంఘ కేంద్ర కమిటీ సమావేశంలో 1974లో జరిగే మహాసభకు తార్కుండే వెళ్ళాలని సూచించాను. తార్కుండే ప్లీడరుగా సంపాదిస్తున్నాడు కనుక అతడు తన స్వంత ఖర్చులో విదేశానికి ప్రయాణం చేయడం అతనికి కష్టం కాదు. అతనిలో పట్టుదల పెంచాలనే తాపత్రయంలో "కావాలంటే మేమంతా చందా వేసుకుని మిమ్మల్ని పంపుతాం" అన్నాను. ఆయన కోపగించుకోలేదు. చిరునవ్వు నవ్వాడు. 1974లో జరిగిన మహాసభలో ప్రసంగించే వక్తలలో అతడు ఒకడుగా ఎంపిక చేయబడ్డాడు. ఆయన ప్రపంచ మహాసభకు వెళ్ళిరావడం భారత హ్యూమనిస్టు ఉద్యమానికి స్థాయిని గౌరవాన్ని సంపాదించి పెట్టింది.

1970 నుండి ప్రపంచ మహాసభలలో ఒక ప్రముఖ హ్యూమనిస్టుకు "హ్యూమనిస్టు అవార్డు" యివ్వడం ప్రారంభించింది అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంస్థ. భారత దేశంలో ఎమర్జెన్సీలో తార్కుండే నిర్వహించిన వీరోచిత పాత్ర ప్రపంచ మానవవాదుల దృష్టిని ఆకర్షించింది. 1978లో లండనులో జరుగనున్న ప్రపంచ హ్యూమనిస్టు మహాసభలో ఆయనకు 'హ్యూమనిస్టు అవార్డు'ను యివ్వడానికి అంతర్జాతీయ సంస్థ డైరెక్టర్‌ల బోర్డు తీర్మానించింది. ఈ వార్త తెలిసి భారత హ్యూమనిస్టులం ఎంతో సంతసించాం. శ్రీ సి.టి. దరు మరణానంతరం నేను భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘ ప్రధాన కార్యదర్శి పదవిని స్వీకరించానని ఇంతకు ముందే తెలియచేశాను కదా. 1978 ఢిల్లీ మహాసభలో నన్ను మరల ఆ పదవికి ఎన్నుకున్నారు. ఎప్పుడో ఒకప్పుడు విదేశాలకు పోయిరావాలనే వాంఛ నాలో ఎప్పటినుంచో నెలకొని వుంది. ఇప్పుడు మా సంఘాధ్యక్షునికి ప్రపంచ మహాసభలో అవార్డు ప్రదానం జరిగే సమయంలో నేను ఆ మహాసభకు హాజరు కావడం యుక్తమని తోచింది. 1978లో లండన్‌లో జరిగే మహాసభకు నాతోపాటు రమ్మనమని నా సహధర్మచారిణి సుబ్బమ్మ గారిని కోరాను. ఆమె బహుశః ఖర్చుకు దడిసిందేమో రానన్నారు. అంత నేనొక్కడినే వెళ్దామని ఏర్పాట్లు చేసుకుంటున్న తరుణంలో అబూ దబీలో ఉద్యోగం చేస్తున్న నా మూడవ కుమారుడు వి.ఎల్. మల్లాది ఫోను చేసి తన తల్లిని కూడా వెళ్ళమని, ఖర్చు విషయం ఆలోచించవద్దని, ఆమెకు అదనంగా అయ్యే ఖర్చును తను భరించగలనని చెప్పాడు. ఆమె అంగీకరించింది. ప్రయాణపు ఏర్పాట్లు చాలా మార్చవలసి వచ్చింది. ఎట్టకేలకు ఢిల్లీలో విమానం ఎక్కే నిమిత్తం హైదరాబాద్ నుండి ఢిల్లీకి ప్రయాణం కట్టాము. హైదరాబాద్‌లోని హ్యూమనిస్టు మిత్రులు ఆదరంగా మాకు నాంపల్లి స్టేషన్‌లో వీడ్కోలిచ్చారు. రేపు ప్రపంచ హ్యూమనిస్టు మహాసభ మొదలవుతుందనగా లండన్ చేరాము. మహాసభ ఐదు రోజులు జరిగింది. వందమంది పైగా విదేశాలనుంచి ప్రతినిధులు వచ్చారు. ఇంగ్లండులోని మానవ వాదులు పలువురు పాల్గొన్నారు. మొదటి రోజు మహాసభ ప్రారంభోత్సవం జరిగింది. రెండవరోజు నుండి పలు విషయాలపై చర్చలు సాగించడానికి అనువుగా ప్రతినిధులు విభాగాలలో సమావేశమయినారు. పాల్ కర్ట్జ్ (అంతర్జాతీయ

హ్యూమనిస్టు సంఘాధ్యక్షులలో ఒకరు, తత్వవేత్త, రచయిత అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని సెక్యులర్ హ్యూమనిస్టు ఉద్యమ నాయకుడు, బహుగ్రంథ కర్త (అధ్యక్షతన హేతు వాద వ్యతిరేక దృక్పథాలు, ఘోరములు' అనే అంశంపై చర్చ సాగించే విభాగంలో నేను, సుబ్బమ్మగారు కూర్చున్నాం. మూడవరోజున అనుకుంటాను తార్కుండేను ప్రస్తుతించి హ్యూమనిస్టు అవార్డును యిచ్చారు. పట్టు ప్రదానం చేశారు. దానితో పాటు పారితోషికం, ధన రూపంగా, ఏమీ యివ్వకపోయినా అవార్డు ప్రదానమే ప్రతిష్ఠాత్మకం. నాలుగవ రోజున వివిధ దేశాలలోని హ్యూమనిస్టు సంఘాల ప్రతినిధులు నివేదికలను సమర్పించాల్సి వుంది. అంతర్జాతీయ సంస్థ కార్యనిర్వాహక కార్యదర్శి నా వద్దకు వచ్చి తార్కుండేను సన్మానించాం కనుక ప్రప్రథమంగా నివేదికను సమర్పించే అవకాశం భారత దేశానికి యిస్తున్నాం. రాడికల్ హ్యూమనిస్టు సంఘ ప్రధాన కార్యదర్శిగా మీరు ఆ నివేదికను సమర్పించండి. మీకు ఐదు నిమిషాలు కాలవ్యవధి యిస్తున్నాం. దయచేసి కాలపరిమితిని దాట వద్దు అని చెప్పాడు. నేను సంతోషంగా అంగీకరించాను. నివేదికను ముఖతః సమర్పించాను. రాసి చదువలేదు. నాకు కేటాయించబడిన వ్యవధిని అతిక్రమించ లేదని తలిచాను. తర్వాత కలిసిన అంతర్జాతీయ సంస్థ కార్యదర్శితో ఆ మాటే అన్నాను. అతడు చిరునవ్వుతో 'పది సెకండ్లు ఎక్కువ తీసుకున్నారు' అన్నాడు. ఆనాడు ప్రపంచ ఉద్యమానికి అనుబంధంగా 37 దేశీయ సంస్థలున్నాయి.

లవణం, శ్రీమతి హేమలతా లవణం లండన్ మహాసభకు వచ్చారు. అప్పటికి నాస్తిక కేంద్రాన్ని అంతర్జాతీయ సంఘానికి అనుబంధం చేయలేదు. అయితే అనుబంధ సంస్థల వారే కాక ప్రపంచంలోని హ్యూమనిస్టు లందరూ మహాసభలో పాల్గొనే అవకాశం వుంది. అలా గోరాగారు 1970, 1974 మహాసభలలో పాల్గొన్నారు. అదే పద్ధతిలో లవణం దంపతులు లండన్ మహాసభకు వచ్చారు. లవణం నాస్తిక కేంద్ర కార్యకలాపాలపై నివేదికను ఇచ్చాడు. తార్కుండే ఎమర్జెన్సీలో నిర్వహించిన పాత్ర ఏమంత గొప్పది కాదని ఎవరో భారతీయులు మహాసభలో గుసగుసలు పోతున్నారని తనకు తెలిసిందని తార్కుండే నాతో అన్నాడు. ఇలా అసూయకు లోనుకావడం భారతీయుల ప్రత్యేక లక్షణమని భావించే నేను వ్యథ చెందాను.

లండనులో ఇండియా లీగు వారు ప్రత్యేకంగా సభ జరిపి తార్కుండేను సన్మానించారు. లీగ్ అధ్యక్షుడు శ్రీ ఫెన్నరు బ్రాక్వే (బ్రిటిష్ పార్లమెంట్ మెంబరు, భారత స్వాతంత్ర్యానికి ఎంతో దోహదం చేసిన వ్యక్తి) సభకు అధ్యక్షత వహించాడు. నేను, సుబ్బమ్మగారు, తార్కుండే సోదరి, కుమార్తె, తార్కుండే గాక సభకు 32 మంది వచ్చారు. ఆ సంవత్సరం జరిగిన లీగు సమావేశాలలో అది అధిక సంఖ్యలో సభ్యులు హాజరయినదని వందన సమర్పణం చేసిన కార్యదర్శి చెప్పాడు. మహానగరాలలో సభలు అలావుంటాయని నాకు అప్పుడు తెలిసింది (ఇప్పుడు హైదరాబాద్‌కు కూడా అదే అవస్థ పడుతున్నది) టెలివిజను వగయిరా సౌకర్యాలు వుండడం వల్ల అలా సంభవిస్తున్నదని నేను అనుకుంటాను.

బ్రిటిషు హ్యూమనిస్టు తత్వవేత్త బ్లాక్‌హాం, పాల్‌కర్ట్జ్, ప్రభృతులతో పరిచయమయింది. న్యూయార్కు నుండి వచ్చిన వెక్స్లరు దంపతులతో స్నేహం అయింది. థేమ్సు నదిపై ప్రయాణంలో సౌత్ ప్లేసు సొసైటీ హాల్‌లో యివ్వబడిన పార్టీలో తోటి హ్యూమనిస్టు మిత్రులను కలవడం తటస్థించింది.

ఏక కాలంలో ఉపన్యాసాలను ఇంగ్లీషులో, ఫ్రెంచిలో ప్రసారం చేసినందున అలా వినడానికి

అనువయిన సాధనాలను, ప్రతినిధులను అందించటం చేత ప్రతినిధులు తమకు అర్థమయిన భాషలలో ప్రసంగాలను వినగలిగారు.

మహాసభ అయిపోయిన తరువాత వివిధ దేశాలలోని మానవవాద సంఘ నేతలను కలుద్దామని వారికి ముందుగా ఉత్తరాలు రాశాను. అయితే ఆగస్టునెల ఐరోపా వాసులకు వేసవి కావటంతో వారంతా తాము వేసవి విశ్రాంతికి వెళ్తున్నామని నన్ను కలవలేమని విచారం వెలిబుచ్చుతూ ఉత్తరాలు రాశారు. 5 రోజులు లండన్‌ను చూసి ఇంగ్లండు, స్కాట్లండులలో పది రోజులు గడిపి, 12 రోజులు బస్సుపై ఐరోపాలోని 8 దేశాలలో పర్యటించి హైదారబాదు తిరిగి వచ్చాను. ఎన్నో విషయాలు తెలిశాయి. ఎన్నో నగరాలను దర్శించాము. 13 దేశాల వారు మాతో పాటు బస్సు ప్రయాణీకులుగా వుండటంతో వారి ఆచారాలు, అలవాట్లు, సంస్కృతి తెలుసుకోగలిగాం. మహాసభను గురించి 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలో సుబ్బమ్మగారి వ్యాసం ప్రచురితమయింది.

# భార్గవా కమిషను-1

బొంబాయిలో జరిగిన అఖిలభారత జనతంత్ర సమాజ్ మహాసభకు నేను వెళ్లాను. మిత్రుడు కన్నభిరాన్ వచ్చాడు. ఆయన, తార్కుండే మహాసభకు ముందు ఏమి మాట్లాడుకున్నారో నాకు తెలియదు. తార్కుండే నన్ను పిలిచి ఆం.ప్ర.లో రాష్ట్ర ప్రభుత్వం నక్సలైట్లను ఎదురుదాడుల పేర (ఎన్‌కౌంటర్ పేర) హత్య చేయించిన సంఘటనలపై జనతంత్ర సమాజ్ విచారణ చేయించటం అవసరమని ఆ ప్రయత్నంలో నన్ను సహకరించమని చెప్పారు. 1943 నుండి కూడా తార్కుండే సూచనలను ఆదేశాలుగా స్వీకరించే నేను అందుకు అంగీకరించాను. బూటకపు ఎదురు దాడులపై న్యాయ విచారణ చేయించాలనే తీర్మానం మహాసభలో ఆమోదించబడింది. అందుకు కృషి చేయుటానికి ఉప సంఘాన్ని నియమించే అధికారం తార్కుండేకు యివ్వబడింది. ఇదంతా 1977 డిసెంబరులో జరిగిందని గుర్తు. ఆనాడు తార్కుండే జనతంత్ర సమాజ్‌కు భారత అధ్యక్షుడు. జనతంత్ర సమాజ్ ఉపసంఘ నియామకం చేయబడింది. అందులో సర్వశ్రీ తార్కుండే, అరుణ శౌరి (ఆర్థిక శాస్త్ర) నిపుణుడు, ఐక్యరాజ్య సమితిలో ఉద్యోగం చేసి విరమించినవాడు, తదుపరి ప్రఖ్యాత పత్రికా విలేఖరి ఆ తర్వాత 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' ఆంగ్ల దినపత్రిక సంపాదకుడు, పరిశోధక పత్రికా ప్రపంచంలో పేరెన్నిక కన్న వ్యక్తి ఈనాడు పత్రికలలో ప్రత్యేక విశిష్ట శీర్షికలలో వారం వారం వ్యాసాలు రాస్తున్నవాడు), వర్గీస్ (పత్రికా రచనలో ప్రసిద్ధుడు, తరువాత ప్రఖ్యాత దిన పత్రికలకు సంపాదకుడు, ఈనాటికీ ప్రజా సమస్యలపై వైదుష్యంతో నిండిన వ్యాసాలను విశ్లేషణాయుతంగా రాస్తూ ప్రజలలో ప్రబోధం సాగిస్తున్నవాడు), నాభా కృష్ణ చౌదరి (సోషలిస్టు నాయకుడిగా నిజాయితీ పరుడుగా, కీర్తి ప్రతిష్టలను ఆర్జించుకున్న ఒరిస్సాకు చెందిన మహామహుడు - యీనాడు ఆయన యికలేడు) వీరు ఆంధ్రేతర ప్రాంత సభ్యులు. సర్వశ్రీ కన్నభిరాన్, కాళోజీ (స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రజాస్వామ్యవాది, ప్రజాస్వామ్య ఉద్యమాలలో పాలు పంచుకునేవాడు, 'నా గొడవ' పేరులో కవిత్వం రాస్తూ 'ప్రజా కవిగా' పేరు ప్రఖ్యాతులు పొందినవాడు, ఈనాడు శ్రీ పి.వి. నరసింహారావు ప్రధానమంత్రిగా వున్న కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వం చేత 'పద్మభూషణ్' బిరుదు ప్రదానం పొందిన మహనీయుడు). కె. ప్రతాప రెడ్డి (సీనియరు అడ్వకేటు, జనతాపార్టీకి హైదరాబాద్ నగర ప్రథమ అధ్యక్షుడు, ప్రజాస్వామ్యవాది, తర్వాత 1990 సార్వత్రిక ఎన్నికలలో సికిందరాబాద్ నుండి జనతాపార్టీ అభ్యర్థి, జనతంత్ర సమాజ్ ఆంధ్రప్రదేశ్ శాఖకు అధ్యక్షుడు, ఇప్పుడు పౌర హక్కుల ప్రజా సంఘం (పియుసిఎల్) ఆంధ్రప్రదేశ్ శాఖకు అధ్యక్షుడు బల్వంత రెడ్డి (ఆర్థిక శాస్త్రవేత్త, స్వతంత్ర సంస్థ అయిన పరిపాలనా వ్యవహారాల కళాశాల అధ్యాపకుడు, తదుపరి ప్రిన్సిపాల్, దేశ విదేశాలలో పేరుపొందిన ఆర్థిక శాస్త్ర నిపుణుడు, విద్యార్థి దశ నుండి సోషలిస్టు భావాలు కలవాడు, నేటికీ పై చెప్పిన కళాశాలలో అధ్యాపక వర్గంలో సీనియరు సభ్యుడుగా వుంటున్నవారు), నేను జనతంత్ర సమాజ్ ఉపసంఘ సభ్యులం. ఆనాటికి రాడికల్ హ్యూమనిస్టు జనతంత్ర సమాజ్‌లో కేంద్ర కార్య నిర్వాహక వర్గం సభ్యుడిగా, పియుసిఎల్ ఆం.ప్ర. శాఖ ప్రధాన కార్యదర్శిగా ఉన్నానని చెప్పటం సందర్భోచితం.

శ్రీ కన్నభిరాన్ (అది తమిళ నామం: తెలుగులో దాని అర్థం 'కృష్ణ ప్రభువు') పట్టుదలగా ఆం.ప్ర. పోలీసుల చేతిలో ఎదురు దాడుల పేరుతో హత్యలకు గురి అయిన వారి కేసుల దర్యాప్తుకు పూనుకున్నాడు. సర్వశ్రీ కె. ప్రతాప రెడ్డి, బల్వంత రెడ్డి ప్రభృతులు ఆయనతో పాటు తెలుగునాట పర్యటించి ఎక్కువగా ఆయనకు సాయపడ్డారు. ముసాయిదా నివేదికను తయారు చేసి ఢిల్లీవెళ్ళి తార్కుండే చేత ఆమోదింప చేసి పత్రికలకు విడుదల చేశాడు. జనతంత్ర సమాజ్ ఉప సంఘాన్ని పత్రికలవారు, ప్రజలు సౌలభ్యం కోసం 'తార్కుండే కమిటీ' అని పిలువసాగారు. ఆ ఉప సంఘానికి శ్రీ కన్నభిరాన్ సమావేశ కర్త. నివేదికను ఆనాడు కేంద్రంలో వున్న జనతా ప్రభుత్వ ప్రధానమంత్రి మురార్జీ దేశాయ్‌కి సమర్పించారు. ఆయన దానిని సానుభూతితో చదివి తగు చర్య తీసుకోమని భారత ప్రభుత్వ ఆంతరంగిక శాఖకు (హోం శాఖకు) పంపాడు. ఆ ఉత్తర్వును యిచ్చిన కొంది రోజులకే ఆయన విదేశ పర్యటనకు వెళ్ళాల్సి వచ్చింది. ఆనాడు శ్రీ చరణ్ సింగ్ భారత ప్రభుత్వ ఆంతరంగిక శాఖమంత్రి (తదుపరి ఆయన సుమారు 6 నెలలు భారత ప్రధాన మంత్రిగా పనిచేసి పార్లమెంటు విశ్వాసాన్ని పూరకుండానే పదవీ విరమణ చేసిన రైతు నాయకుడు. ఇప్పుడు కీర్తిశేషుడు. మొదట్లో ఆయన వారసుడుగా ఉత్తరప్రదేశ్ రైతు నాయకుడయి, జనతాపార్టీ నాయకుడిగా రూపొంది, ఈనాడు కాంగ్రెసులో చేరిన శ్రీ అజిత్ సింగు తండ్రి). ఆయన శాఖలోని ప్రధాన కార్యదర్శి ఆలోచించి చర్య వల్ల మొరార్జీ దేశాయి విదేశీ పర్యటన ముగించుకొని తిరిగి వచ్చేలోగా బూటకపు ఎన్ కౌంటర్లలోని నక్సలైట్ల హత్యలపై దర్యాప్తు చేయటానికి 'కమిషను'ను నియమించమని ఆం.ప్ర. ప్రభుత్వానికి అధికారం యివ్వడం జరిగింది. ఆ ఉత్తర్వుపై శ్రీ చరణ్ సింగ్ దస్కతు చేయడం సంభవించింది. ఆం.ప్ర. రాష్ట్ర ప్రభుత్వంలో వెంగళరావు గారు ముఖ్యమంత్రి. ఆ ప్రభుత్వం మీదనే మా ఫిర్యాదు. అలాంటి స్థితిలో హత్యలను ఏ ప్రభుత్వం చేయించిందో ఆ ప్రభుత్వాన్ని విచారించ మనడం, కమిషన్ నియమించ మనటం అక్రమమని, అన్యాయమని, మోసపూరిత చర్యయని మేము భావించం. మా ఉపసంఘ అభిప్రాయాలను తార్కుండే మొరార్జీ దేశాయికి ఎరుకపరిచాడు. ఇది తెలిసిన మొరార్జీ మండిపడ్డాడు. "మీకు ఆమోదయోగ్యమైన పదవీ విరమణ చేసిన సుప్రీంకోర్టు న్యాయమూర్తిని మీరు పేర్కొంటే ఆయనను ఏకసభ్య కమిషనుగా నియమింప చేస్తాననీ" మొరార్జీ అన్నట్లు తెలిసింది. అలా మాజీ సుప్రీంకోర్టు న్యాయమూర్తి భార్గవాను ఏకసభ్య కమిషనుగా నియమించింది ఆం.ప్ర. రాష్ట్ర ప్రభుత్వం. ఇది రాష్ట్ర ప్రభుత్వం కమిషనును నియమించటం - అభిలషణీయ చర్య కాకపోయినా ఆనాటి పరిస్థితులలో తార్కుండే కమిటీ దీనిని ఆమోదించక తప్పలేదు. కమిషన్ ముందు విచారణకు సిద్ధపడింది. కమిషన్ ప్రప్రథమంగా సమావేశమయింది హైదరాబాదులోని రాజభవన్ హాలులో. తార్కుండే ఢిల్లీ నుంచి వచ్చి జనతంత్ర సమాజ్ ఉపసంఘం తరఫున నేరారోపణ పత్రాన్ని సమర్పించారు. రాష్ట్రంలోని ఉప సంఘ సభ్యులు, జనతాపార్టీ ప్రముఖులు, నక్సలైటు సానుభూతిపరులు, ప్రజాస్వామ్యవాదులు వీరితో సభా వేదిక కిటకిటలాడి పోయింది. నక్సలైట్ల పౌర హక్కుల సంస్థలలో ఒకటయిన ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ - 'ఒ.పి.డి.ఆర్' కమిషను నక్సలైట్ల మరో పౌర హక్కుల సంస్థ - ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘం (ఏపిసిఎల్‌సి) విచారణలో పాల్గొన[illegible] ప్రత్యేక సమావేశ స్థలంలో జరిగాయి. ప్రజోద్యమ కార్యకర్తలపై ఆంధ్రప్రదేశ్

పోలీసులు జరిపిన ఘోర హింసలను పియుసిఎల్ దర్యాప్తు చేసి సాక్ష్యాధారాలతో వివరంగా విజ్ఞాపన పత్రాన్ని సమర్పించింది. దానిని సకాలంలో కమిషనుకు అందజేయటానికి ముద్రించే విషయంగా (ఆనాటి ప్రగతి ఆర్టు ప్రింటర్సు భాగస్తుడుగా అధిపతి) విశేష శ్రమ చేశారు.

ముమ్ముందుగా కమిషను బూటకపు ఎన్‌కౌంటరు హత్యల కేసును ఎత్తుకుంది. అందరినీ కలుపుకొనిపోయ్యే కన్నభిరాన్ మనస్తత్వ ఫలితంగా జనతా పార్టీ నాయకుడు అడ్వకేటు అయిన శ్రీ అయ్యపు రెడ్డికి (మొదట్లో ఇప్పుడు కాంగ్రెసువాది) పౌరుల తరఫున కేసు వాదనను నివేదించే అవకాశం, గౌరవం లభించింది. విచారణలకు కమ్యూనిస్టులు, నక్సలైట్లు, జనతంత్ర సమాజ్ ఉప సంఘ సభ్యులు, పియుసిఎల్, ఎపిసిఎల్‌సి లాంటి పౌరహక్కుల సంఘాల వారు, జనతా పార్టీవారు, ప్రజాస్వామ్యవాదులు, రాజకీయాలలో ఆసక్తి చొరవ, ప్రవేశం కల విద్యావంతులైన స్త్రీలు - సర్వశ్రీ వసంతా కన్నభిరాన్, రమా మేల్కోటే, లలిత, వీణా శత్రుఘ్న ప్రభృతులు (తరువాత 'స్త్రీ శక్తి సంఘటన', 'అన్వేషి' వగయిరా సంస్థలవారు) వీరంతా విచారణలకు హాజరయ్యేవారు. కమ్యూనిస్టు మార్క్సిస్టు నాయకుడు సుందరయ్యగారు స్వయంగా వచ్చి చురుకుగా పాల్గొనేవారు. ప్రజల తరఫున వాదించే పనిని శ్రీ కన్నభిరాన్ చేపట్టేవాడు. ఆయన ఎప్పుడయినా హాజరు కాకపోతే మిత్రుడు కె. ప్రతాప రెడ్డి, నేను - మేమూ న్యాయవాదులం కనుక - ఆ బాధ్యతను నెరవేర్చేవారం. ఆనాటి కమ్యూనిస్టు మార్క్సిస్టు శాసన సభ్యుడు శ్రీ ఓంకార్ (వరంగల్లు జిల్లాలోని నర్సంపేట నియోజక వర్గం నుండి ఎన్నికయినవారు, ఎమర్జెన్సీ డెటెన్యూ, ఈనాటి మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ - ఎంసిపిఐ - నాయకుడు) మాకు కొండంత అండగా నిలబడ్డాడు. తార్కుండే కమిటీ తీర్పు సాక్ష్యాలను - పోలీసులు అపహరించుకొని పోకుండా కొన్ని రోజులు ఉప్పల్‌లో ఉండే ఓం ప్రకాష్ గుప్తాగారి (ప్రఖ్యాత స్వాతంత్ర్య యోధుడు, మొరార్జీ దేశాయిగారి అంతేవాసి, గాంధీవాది తదుపరి కీర్తిశేషులు) కస్తూరిబా కేంద్రంలో (వారి సతీమణి విద్యాదేవి గారు ఆయన సహధర్మచారిణియే కాక ప్రముఖ మహిళోద్యమ కార్యకర్త) ఉంచటం, తరువాత చాలా కాలం మిత్రుడు ఓంకార్ ఎంఎల్ఏ క్వార్టర్సులో భద్రంగా నివసింప చేయటం సంభవించింది.

నెలలో వరసగా 15 రోజులు కమిషను విచారణను కొనసాగించేది. అలా విచారణ 15 నెలలు సాగింది. పత్రికా విలేఖరులు, సంపాదకులు ఎంతో సహకరించేవారు. ఆంగ్ల దిన పత్రికలు 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్', 'హిందూ'లు, తెలుగు దిన పత్రికలు 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రప్రభ', 'ఆంధ్రజ్యోతి', 'ఈనాడు' కమిషను విచారణల వార్తలను ప్రముఖంగా, సుదీర్ఘంగా ప్రకటించేవి, తద్వారా పౌర హక్కుల ఉల్లంఘనకు సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వ చర్యలు ప్రజల దృష్టికి వచ్చినయి. ప్రజలలో పౌర హక్కుల ఎడ ఆసక్తి, అభిమానం, ఆదరణ పెరిగినయి.

## భార్గవాకమిషను- 2

కమిషను నియామకం చేయించటం ఒక ఎత్తు; దాని ముందు సాక్ష్యాధారాలను చూపించటం మరో ఎత్తు. అదే జరిగింది భార్గవా కమిషను విషయంలో. అందుకు జరిగిన కృషిలో కామ్రేడ్ ఓంకార్, నక్సలైటు మిత్రులు, తదితరులు ఎక్కువగా శ్రమించారు. గ్రామాలను దర్శించి సాక్షులను కలిసికొని వారు సాక్ష్యం యివ్వడానికి అంగీకరిస్తున్నా, సాక్షుల తల్లిదండ్రులకు, దగ్గరి బంధువులకు వుండే భయ సందేహాలను పోగొట్టి వారిని కోర్టులో హాజరు పర్చడం అసాధ్యం కాదు కాని చాల కష్టతరమైనది. నల్గురు నక్సలైట్లను పోలీసులు బందీలుగా చేసి అడవిలో అమానుషంగా కాల్చిన సంఘటనకు ప్రత్యక్ష సాక్షి అయిన వ్యక్తిని హైదరాబాదుకు తీసికొని రావడం ఎంతో కష్టమయితే అతనిని పోలీసులు అపహరించకుండా కాపాడటం మరో కష్టతరం. ఆ సాక్షి హైదరాబాదు రాకముందు అతడు భార్గవా కమిషను ముందు సాక్ష్యం చెప్పకుండా చేయాలని పోలీసులు చాలా ప్రయత్నించారు. ఆ యువకుడు వ్యవసాయ కార్మికుడు; పేదవాని క్రింద లెక్క. అతనికి వేల సంఖ్యలో ధనాశ చూపారు. ఆం.ప్ర. రోడ్డురవాణా సంస్థలో కండక్టరుగా శాశ్వత ఉద్యోగం యిప్పిస్తామన్నారు. అతడు లొంగలేదు. అతని తల్లిని సమీపించి తన కుమారుని ఒప్పించమని ఆమెను బ్రతిమిలాడారు; ఆమె కుమారునికి మంచి భవిష్యత్తు వుండేలా చేస్తామన్నారు. "నా కొడుకును అమ్ముకుంటానా? పొండి" అని ఆమె కసిరికొట్టిందట. ఈ విషయం తెలిసిన నేను ఆ యువకుని సత్య నిరతికి, త్యాగానికి, ధైర్యానికి మనస్సులో జోహారు అర్పించుకున్నాను. ఆ యువకుడు హైదరాబాదు వచ్చి, తార్కుండే కమిటీ యివ్వగలిగిన ఆశ్రయాన్ని స్వీకరించి నిబ్బరంగా, నిర్భయంగా తను చూచినది చూచినట్లు సాక్ష్యం చెప్పాడు.

మరియొక సాక్షి విషయం. అతడు హైదరాబాదులో ఉద్యోగం చేస్తుండగా నక్సలైట్లు అతని గదిని తాము సమావేశం కావటానికి సంకేత ప్రదేశంగా నిర్ణయించుకున్నారట. ఆ సంగతిని పసిగట్టిన పోలీసులు అతని గదిపై మామూలు దుస్తులలో దాడిచేసి అతనిని పట్టుకున్నారు. కాల్చి వేస్తామని బెదిరిస్తూ అతని కణతకు రివాల్వరును గురి పెట్టారు. అతనిని బలవంతంగా సంకేత పదాన్ని (ప్యాస్ వర్డ్) పలికేటట్లుచేసి ఒక్కొక్కరుగా వస్తున్న నల్గురు రహస్య జీవితం గడుపుతున్న నక్సలైట్లను వరుసగా బంధించారు. ఆ నల్గురే పోలీసుల చేత పైన ఉదహరింపబడిన కేసులో పోలీసుల చేత బూటకపు ఎదురు దాడిలో హత్య చేయబడినవారు. తన బలహీనత వలననే ఆ నల్గురు కామ్రేడ్లు అసువులు బాశారని తెలిసికున్న ఆ యువకుడు కృంగిపోయాడు. జనతాపార్టీ కేంద్రంలో ప్రభుత్వానికి రావడం, నక్సలైట్ల హత్యలపై విచారణ చేయటానికి భార్గవా కమిషను నియమింపబడటం తెలిసిన ఆ యువకునికి ధైర్యం కలిగింది. సాక్ష్యం చెప్పడానికి అంగీకరించాడు. పోలీసువారు అతని సాక్ష్యం కమిషను ముందుకు రాకుండా చేయాలని విశ్వ ప్రయత్నం చేశారు. అతని తల్లిదండ్రులను కలిసి హెచ్చరించారు. బ్రతిమిలాడారు. ఆ గ్రామ సర్పంచి చేత వారికి చెప్పించారు. అతనికి వివాహం అయింది. భార్య యింకా కాపురానికి రాలేదు. అతడు సాక్ష్యం చెప్తే తన కుమార్తెను కాపురానికి పంపనని అతనికి పిల్లనిచ్చిన మామ చేత చెప్పించారు. తన

భార్యను - అతని సోదరిని - వదిలి వేస్తానని అతని బావ బెదిరించేలా చేశారు. అతడు చలించ లేదు. కమిషను ముందు సాక్ష్యం చెప్పాడు. రాష్ట్ర ప్రభుత్వం తరఫున కమిషను ముందు పనిచేసే న్యాయవాది ఎదురు సవాళ్లు (క్రాస్ ఎగ్జామినేషన్) చేయవలసి వుంది. అందుకోసం కేసును వాయిదా వేశారు. వాయిదా నాటికి అతడు హాజరవుతాడో లేదోనని అనుమానం శ్రీ కన్నభిరాన్‌కు కలిగింది. పూనాలో ఆ యువకుడు ఉద్యోగం చేస్తున్నాడు. పూనా వెళ్లి అతనిని కలిసి వద్దామని మిత్రుడు కన్నభిరాన్ అన్నాడు. నేను అంగీకరించగా, యిరువురం హైదరాబాదు నుండి బస్సులో ప్రయాణం చేసి పూనా చేరాం. ఆ యువకుడు పని చేసే ఫ్యాక్టరీ వద్దకు వెళ్లి అతనిని గురించి వాకబు చేద్దామని అనుకుంటున్న తరుణంలో అతడే ఫ్యాక్టరీ ఎదుట మాకు కన్పించాడు. వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లు ఎంతో ఆనందం కలిగింది. ఇంతలో అతనితో మాట్లాడుతున్న ఇద్దరు వ్యక్తులు కన్పించారు. కన్నభిరాన్ గారు అతనిని పలకరించారు. వారిలో ఒకరు తనకు పిల్లనిచ్చిన మామగారని, రెండవవారు సోదరి భర్తయని అతడు మాకు పరిచయం చేశాడు. "సార్లూ! మీరు ధనవంతులు; విద్యావంతులు. సమాజంలో పేరు ప్రఖ్యాతులు కలవారు. మిమ్మల్ని పోలీసులు, ప్రభుత్వం ఏమీ చేయరు. మా విషయం అలాకాదు. వారికి మేము - కష్ట జీవులం, బీదలం - లోకువ. మేము వారి మాటలను మన్నించక పోతే వారు మమ్మల్ని కష్టనష్టాలు పాలు చేస్తారు. దయయుంచి కమిషన్ ముందుకు మరల రమ్మనమని మా వాడిని అడగకండి; ఒత్తిడి చేయకండి. మమ్మల్ని మా మానాన బ్రతకనీయండి. "అనే అర్థంలో - వారి మాటలలో - వారు అన్నారు. మేము విస్తుపోయాం. "ఏమి మాట్లాడాలి, ఎలా మాట్లాడాలి" అని మేము ఆలోచించసాగాము. ఇంతలో ఆ యువకుడు - తనవారు చూడకుండా - కనుసైగ చేశాడు. వారి వద్ద సెలవు తీసుకొని మేము సంతృప్తిగా తిరుగు ప్రయాణం కట్టాము. హైదరాబాదుకు వచ్చే బస్సులో మాకు 'సీట్లు' దొరకలేదు. చిన్న బల్లవేసి నన్ను కూర్చోపెట్టాడు కండక్టరు. కన్నభిరాన్ పనిముట్లు పెట్టె (టూల్ బాక్సు)పై కూర్చొని ప్రయాణం చేశాడు. ఇంత కష్టపడినా మాకు బాధ అనిపించలేదు.

పైన చెప్పిన యువకుని సాక్ష్యం చెప్పే రోజు వచ్చింది. అతడు వస్తాడా, రాడా అని తర్క వితర్కం చేస్తూ మేమంతా ఉత్కంఠతో ఎదురు చూస్తున్నాం. ఆ యువకుడు కమిషను ముందు హాజరయ్యాడు. తృప్తిగా నిట్టూర్పు విడిచాం. ప్రభుత్వ న్యాయవాది లేచి పిటీషను దాఖలు చేశాడు. దానిని కమిషను పరిశీలించి, చూడమని కన్నభిరాన్‌కు యిచ్చింది. ఆ సాక్షిని కన్నభిరాన్ బలవంతాన ఎత్తుకొని వచ్చారని ('కిడ్నాప్') అందులో ఆరోపణ వుంది. అది అసత్యారోపణ అన్నారు కన్నభిరాన్. రెండు గంటల సేపు సాక్షి ఒక్కడే తన ప్రైవేటు గదిలో కూర్చోవాలని, తరువాత కమిషన్ వారు అతనిని పిలుస్తారని, అతనికి యిష్టమయితే అతడు సాక్ష్యం చెప్పవచ్చని, యిష్టం లేకపోతే స్వేచ్ఛగా వెనుతిరిగి పోవచ్చని కమిషన్‌వారు ఉత్తరువు యిచ్చారు. కమిషను మధ్యాహ్న సమావేశం ముందుకు సాక్షిని హాజరు పరిపించారు. అతని యిష్టా యిష్టాలను గురించి న్యాయమూర్తి భార్గవ ప్రశ్నించారు. అతడు గంభీరంగా 'సాక్ష్యం చెప్తాను' అన్నాడు. ప్రభుత్వ న్యాయవాది వేసిన చిక్కు ప్రశ్నలకు, ఎదురు సవాళ్లకు సరిగ్గా సమాధానం చెప్పాడు ఆ సాక్షి. నిజం చెప్పే వ్యక్తి తడబడవలసిన అవసరం లేదు కదా! తటపటాయింపు వుండదు కదా! అతని సాక్ష్యం విన్న తరువాత మాలో విజయ భావం కలిగింది. ఏ కేసు కాకేసుపై ఎప్పటికప్పుడు

కమిషన్ తీర్పు చెప్పాలని కన్నభిరాన్ అభ్యర్థించాడు. 'ఆలోచిస్తాం' అన్నారు న్యాయమూర్తి.

పై కేసులో సాక్ష్యాలు ముగింపుకు వచ్చే సమయంలో పత్రికా విలేఖరి ఆదిరాజు వెంకటేశ్వర రావు కన్నభిరాన్‌ను కలిశాడు. హత్యకు గురి అయిన ఆ నల్గురు నక్సలైట్లను చంపిన పోలీసు ఆఫీసరు 'తనే వారిని కాల్చిచంపానని' తన ఎదుట అంగీకరించాడని, అతడలా మాట్లాడిన 'ఆడియో టేపు' తన వద్ద ఉన్నదని చెప్పి ఆ టేపును వినిపించాడు. అతని సాక్ష్యాన్ని కమిషను ముందు ప్రవేశ పెట్టాలనే నిర్ణయం జరిగింది. అతడిని సాక్షిగా హాజరుపరిచాం. టేపు తనవద్ద ఉందని అతడు చెప్పాడు. ఆ 'టేపు'ను తీసుకొని రమ్మనమని న్యాయమూర్తి భార్గవ అతనిని ఆదేశించి విచారణ మరల 15 రోజులకు వాయిదా వేశారు. ఈలోగా జరిగిన పరిణామాల వల్ల కమిషను పనిచేయడం ఆగిపోయింది. ఆ కథ తర్వాత చదువుదాం.

# భార్గవా కమిషను - 3

1978లో అసెంబ్లీ ఎన్నికలు ఆంధ్రప్రదేశ్ రాజకీయ చిత్రపటంలో మార్పులు తెచ్చాయి. బ్రహ్మానంద రెడ్డి కాంగ్రెసు శాసనసభలో తన ప్రాధాన్యతను కోల్పోయింది. ఇందిరాగాంధీ పక్షానికి చెందిన కాంగ్రెసు శాసనసభా నాయకునిగా శ్రీ ఎం. చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. వెంగళరావుగారు భార్గవా కమిషను విచారణలో పరోక్షంగా ప్రధాన నిందితుడయినా, విమద్‌లాల్ కమిషను ముందు ప్రత్యక్షంగా ప్రధాన నిందితుడుగా నిలబడినా ఆయన బాహాటంగా ఆ విచారణలకు అడ్డుకట్టలు వేయలేదు. ఆయన వైఖరి పోలీసు వర్గాలను ఇరుకున పెట్టింది. భార్గవా కమిషను విచారణలో ప్రభుత్వం తరఫున వాదించడానికి ముగ్గురు న్యాయవాదులను, వారికి సహాయం చెయ్యటానికి ఒక డిప్యూటీ సూపరింటెండెంట్‌ను, ఒక సర్కిలు ఇన్‌స్పెక్టర్‌ను, ఇద్దరు సబ్ ఇన్‌స్పెక్టర్లను, 30 మంది పోలీసు కానిస్టేబుల్స్‌ను ప్రభుత్వం నియమించింది. అందులో ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు నాకు పరిచయస్తుడు. "మా పోలీసుల మనోస్థైర్యాన్ని మీరు పోగొడ్తున్నారు" అని నాతో అన్నాడు. "40వేల మంది పోలీసులలో మేము 200 మంది మీద మాత్రమే నేరారోపణ చేశాం. (ఆనాటికి పోలీసు బలగం అంతే. రానురాను వారు 70వేల సంఖ్యకు పెరిగారు). వారిని ఉద్యోగాల నుండి తొలగిస్తే మీకు మంచి పేరు నిలుస్తుంది కదా" అని అన్నాను. అతడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. అతడు ఇతరులతో పోలిస్తే సౌమ్యుడే. అతనేం చేయగలడు! తన నిస్సహాయతను చిరునవ్వుతో ప్రదర్శించాడు.

న్యాయమూర్తి భార్గవా ముందు విచారణలో నిందితులయిన పోలీసు అధికారులు తట్టుకోలేక పోతున్నారు. కమిషను తాత్కాలిక నివేదికను యిస్తే వారిపై వేటు తప్పదని వారికి తెలుసు; వారిని రక్షించపూనిన ఉన్నత పోలీసు అధికారులకు ఆ విషయం స్పష్టంగా అర్థమయింది. వారు కమిషనును అంతం చేయ సమకట్టారు. చివరకు చెన్నారెడ్డి కాంగ్రెసు ప్రభుత్వం చేత కమిషను విచారణ రహస్యంగా (ఇన్ కెమెరాలో) జరగాలని కమిషనుకు సూచన చేయించారు. కమిషనును నియమించింది రాష్ట్ర ప్రభుత్వమే కనుక అలాంటి సూచనను (డైరెక్షనును) యివ్వటానికి రాష్ట్ర ప్రభుత్వానికి అధికారం వుంది. ఆ సూచన ఆదేశంతో సమానం. దానర్థం కమిషను విచారణాంశాలను పత్రికలు ప్రకటించ రాదు. కమిషను ముందు జరిగే విచారణ విషయాలు ప్రజలకు తెలిస్తేనే పౌరహక్కుల పరిరక్షణ యెంత అవసరమో ప్రజలు గ్రహించగలరు. ఆ అవకాశం లేనప్పుడు మేము విచారణలో పాల్గొనడం అనవసరమని తార్కుండే కమిటీ భావించి సహాయ నిరాకరణం చేసింది. దాంతో కమిషను విచారణను న్యాయమూర్తి భార్గవా అర్థాంతరంగా ముగించారు.

15 నెలలు నెలకు 15 రోజులు అంటే మొత్తం 225 రోజులు జరిగిన విచారణ తాత్కాలిక నివేదిక తీర్పు లేకుండానే ముగిసింది. కాకపోతే పౌరహక్కుల యెడ ప్రజాస్పందన, పౌర హక్కులను గురించి ప్రబోధం జరిగాయి. ఆకాశవాణి వార్తలలో - దినానికి 5సార్లు ఆంగ్లంలో, తెలుగులో, హిందీలో ప్రసారం చేయబడిన వార్తల బులిటెన్లలో - తార్కుండే కమిటీ పేరు విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది. తెలుగుదేశంలో వుండే తార్కుండే కమిటీ సభ్యులకు ముఖ్యంగా కన్నభిరాన్‌కు పేరు ప్రతిష్టలు దక్కాయి. పియుసిఎల్ నాయకుడిగా

నా పేరు కూడా ప్రజలకు పరిచయం అయింది. తార్కుండే పేరు అవినీతి పరులయిన పోలీసువారికి సింహస్వప్నమయింది.

ప్రభుత్వం కమిషను సందర్భంగా కనీసం 15 లక్షల రూపాయలు ఖర్చుచేసి వుంటుంది. విచారణ జరిగిన ప్రతి దినానికి వరుసగా 1500, 500, 250 రూపాయల చొప్పున ప్రభుత్వ న్యాయవాదులకు పారితోషికంగా చెల్లించింది ప్రభుత్వం. కమిషనుకు న్యాయ పరమైన సలహా యివ్వటానికి మరొక అనుభవజ్ఞుడైన అడ్వకేటును రోజుకు 1500 రూపాయల పారితోషికం మీద ప్రభుత్వం నియమించింది. ఇక యితర సిబ్బంది విషయం చెప్పనక్కర లేదు. అంతా ఖర్చుతో కూడిన పనియే కదా! మాకు - ప్రజల తరఫున పనిచేసే మాకు - సాక్షుల రవాణా, వసతి ఖర్చులు తప్ప వేరే వ్యయం లేదు.

కామ్రేడ్ ఓంకార్ కార్యాలయం నుండి రాత్రి 2 గంటలకు యింటికి వెళ్తుంటే వీధులు నిర్మానుష్యంగా ఉండేవి. త్రోవలో పోలీసుల సిబిడి కార్యాలయాలు వున్నా మాకు ఏ ప్రమాదాన్నీ పోలీసులు తలపెట్టలేదు. కమిషన్ విచారణ వారి నైతిక ధృతిపై అంతగా దెబ్బతీసింది.

ఇక కమిషను విచారణ విశేషాంశం ఒకదానిని పేర్కొనటం సముచితం. సుందరయ్యగారు కమిషనును "మిస్టర్ భార్గవా!" అని సంబోధించేవారు. ఆయన, నేను కమిషను న్యాయమూర్తిని గౌరవంగా చూచినా మా మాటలలో పరుషత్వం, కాఠిన్యం, రాజీలేని మనస్తత్వం పొడసూపేవి. మిత్రుడు కన్నభిరాన్ పద్ధతి వేరు. అతని మాట తీరులో దృఢత్వం, రాజీలేని వైఖరి స్ఫురించినా మార్దవం, మర్యాద, లౌక్యం ప్రస్ఫుటంగా కన్పించేవి. బహుశః అనేక సంవత్సరాలు రాష్ట్ర ఉన్నత న్యాయ స్థానంలో పలువురు న్యాయమూర్తుల యెదుట వైవిధ్యం కల కేసులలో వాదించటం వలన ఆయనకు ఆ సామర్థ్యం, ప్రజ్ఞ కలిగాయేమో!

'తార్కుండే కమిటీ, భార్గవా కమిషను ఏమి సాధించాయి' అని ఎవరయినా అడిగితే పరిహాస ధోరణిలో నేను చెప్పే సమాధానం ఒకటే. శ్రీ శివశంకర్‌ను ఇందిరమ్మకు ప్రసాదించటం. ఇది విడ్డూరంగా కన్పిస్తుంది. కమిషను ముందు రోజుకు 15 వందల రూపాయల పారితోషికంతో ప్రభుత్వం తరఫున న్యాయవాదిగా పనిచేసింది శ్రీ శివశంకరే (తరువాత ఇందిరమ్మ కాంగ్రెసు మంత్రి వర్గంలో కేంద్రంలో న్యాయశాఖ మంత్రి; ఇపుడు సిక్కిం రాష్ట్ర గవర్నరు). కమిషను ముందు న్యాయవాదిగా పనిచేయుటకు పూర్వం సుమారు 3 సంవత్సరాలు ఆయన ఆం.ప్ర. హైకోర్టులో తాత్కాలిక న్యాయమూర్తిగా పనిచేసి మరల న్యాయవాది వృత్తి చేపట్టారు. 225 రోజులు కమిషను ముందు పనిచేస్తే వారికి 3లక్షల ముప్పది ఏడున్నర వేల రూపాయలు పారితోషికంగా ముట్టాయి. వారు సికిందరాబాదు నియోజక వర్గం నుండి పార్లమెంటుకు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీచేశారు. వారు మున్నూరు కాపు కులానికి చెందిన వారవడంలో - ఆ కులం వారిలో జంట నగరాలలో ధనవంతులయిన వ్యాపారస్తులు వున్నారు - కులస్తుల నుండి భారీ యెత్తున ధన సహాయం వచ్చింది. దాంతో వారిని విజయం వరించింది. సమర్థులు కావటంతో ఇందిరమ్మ గ్రూపు వారికి తేలికగా లభించింది. కాంగ్రెసు అధిష్ఠాన వర్గంలో స్థానం దొరికింది.

నిజానికి భార్గవా కమిషను ఎదుట తార్కుండే కమిటీ సభ్యునిగా, పియుసిఎల్ ఆం.ప్ర. శాఖ ప్రధాన కార్యదర్శిగా పాల్గొనడం వల్ల నాకు విశేషానుభవం, అనేకమంది ప్రజోద్యమ కార్యకర్తలతో పరిచయం, ప్రజా సేవకులలో సాన్నిహిత్యం కలిగాయి.

# జ్ఞాన పునర్వికాసోద్యమం

ఎం.ఎన్.రాయ్ మార్క్సిస్టు నాయకుడుగా వున్న రోజుల్లోనే మార్క్సులోని హ్యూమనిజాన్ని గుర్తించాడు. మార్క్సు మానవవాది కనుకనే మార్క్సిజాన్ని రూపొందించాడని గ్రహించాడు. ఐరోపా సంస్కృతికి చిట్టచివరి పరిణామమని పేర్కొన్నాడు. మానవ సామాజిక సాంస్కృతిక చరిత్రను అధ్యయనం చేసిన ఫలితంగా ఆ నిర్ణయానికి వచ్చాడు. అందుచేతనే మార్క్సిస్టునని గర్వంగా చెప్పుకుంటూ, సత్యాన్వేషణకు, స్వేచ్ఛపిపాసకు మార్క్సిజం దోహదం చేస్తుంది కనుకనే జిజ్ఞాసాపరులు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆదరించాలని ప్రకటించాడు. మార్క్సిజం పిడివాదం కారాదని, మార్క్సిజం ఒక మార్గాన్ని మాత్రం సూచించేదని ఎలుగెత్తి చెప్పాడు. అలా మార్క్సిస్టులలో విలక్షణమయిన, ప్రత్యేకమయిన మార్క్సిస్టుగా నూతన పంథాను చేపట్టాడు. ఇదంతా అతని జీవితంలో 1919 నుండి 1946 వరకు నడచిన కథ. ఐరోపా ఉదారవాద ఉద్యమంలో కనిపించే ప్రజాస్వామ్య లక్షణాలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రస్ఫుటమవుతున్న సామాజిక న్యాయంపట్ల ఆపేక్ష , రెండవ ప్రపంచ యుద్ధ పరిసమాప్తి తరువాత మిళితమయి నూతన జీవన రీతి, జీవిత సిద్ధాంతం ఉద్భవిస్తాయని అతడు ఆశించాడు. స్టాలిను నిర్మించిన 'ఇనుప తెర' (ఐరన్ కర్టెను) ఫలితంగా ఆ అవకాశం చేజారిపోయింది ఆశాభంగం కలిగింది. మానవజాతి సామాజిక చరిత్రను, సాంస్కృతిక జీవితాన్ని మరోసారి అవలోడనం చేశాడు. మానవజాతి సాంస్కృతికంగా విషమ స్థితిలో వుందని తెల్సుకున్నాడు. ఇన్నాళ్ళు రాజకీయాధికారం ద్వారా మాత్రమే సామాజిక విప్లవాన్ని సాధించవచ్చని గట్టిగా నమ్మిన అతడు సాంస్కృతిక విప్లవ ఆవశ్యకతను గమనించాడు. రాజకీయార్థిక వ్యవస్థతో సమదీటుగా మానవ జీవితంలోని భావ ప్రపంచం మనుగడ సాగిస్తున్నదని అవగాహనకు వచ్చాడు. జ్ఞానపునర్వికాసం యొక్క ప్రాధాన్యతను తెలుసుకున్నాడు. భారత రినైజన్సు ఇన్‌స్టిట్యూట్(భారత జ్ఞానపునర్వికాస సంస్థ)ను 1946లో డెహ్రాడూన్‌ల స్థాపించాడు. దేశం మొత్తం మీద అలాంటి సంఘాలు (వాటిని రినైజాన్సు క్లబ్‌లను ఆయన పిలిచేవాడు) ఉనికిలోకి రావాలని ఆశించేవాడు.

జిజ్ఞాసాపరులు, నిజాయితీగా భావాలను నిస్సంగులుగా అధ్యయనం చేసేవారు. వాస్తవ మేధావులు తరుచు కలుస్తూ తమ తమ భావాలను వివరిస్తూ, విశదపరుస్తూ, తరచి చూచుకుంటూ, నిగ్గుతేల్చుకుంటేనే సత్యాన్వేషణ స్వేచ్ఛాపిపాస ఉన్నత స్థాయిలో వికసించగలవని విశ్వసించాడు. భారత దేశ ప్రాచీన సాంస్కృతిక చరిత్రను - ఇతర దేశాల సాంస్కృతిక చరిత్రను కూడా - సునిశితంగా అధ్యయనం చేసి దానిలోని అవాంఛనీయం నష్టదాయంకం, అసంగతం అయిన అంశాలను త్యజించి ప్రయోజనాంశాలను, హేతుబద్ధత కలిగిన విషయాలను వెలికితీయటమే

జ్ఞాన పునర్వికాసోద్యమ ప్రధాన లక్ష్యం కావాలని అభిలంషించాడు అందువల్లనే 'మేము హ్యూమనిస్టులం' అని బాహాటంగా ప్రకటించుకొనని అనేకమంది మేధావులను ఆహ్వానించి డెహ్రాడూనులో అధ్యయన శిబిరాలను నడిపాడు. ఒక శిబిరం 1946లో వరుసగా, అవిచ్ఛిన్నంగా 30 రోజులు జరిగినదని తెలిస్తే చాలామంది ఆశ్చర్యానికి లోనవుతారు జ్ఞానపునర్వికాసోద్యమం భారతీయులకు అవసరమని నొక్కి చెప్పూ, భారత దేశమంతా పర్యటించాడు. 'మానవ నాగరికత' (సావేజరి నుండి సివిలైజేషను వరకూ), 'ఇండియా సందేశం' (ఇండియాస్ మెసేజ్), 'పిల్లి ఆత్మకథ' (క్రైం, కాజ్ అండ్ కర్మ), 'భౌతిక వాదం' (మెటీరియలిజం), చివరగా రాసిన (హేతుత్వం, ఉద్వేగవాదం, విప్లవం' (రీజన్, రొమాంటిసిజం అండ్ రెవల్యూషను - 2 సంపుటాలు) అతడు కోరిన వికాసోద్యమానికి దోహదం చేశాయి. అతడు ప్రారంభించి నడిపిన 'మార్క్సిస్టు మార్గం' (మార్క్సియను వే), తరువాత వచ్చిన 'మానవవాద మార్గం'(హ్యూమనిస్టు వే) త్రైమాసిక పత్రికలు ఆ ఉద్యమ వ్యాప్తికి ఆయన చేసిన కృషి చిహ్నాలే

1946లోను ఎం.ఎన్.రాయ్ మరణానంతరమున్నూ డెహ్రాడూన్‌లో జరిగిన అధ్యయన శిబిరాలకు - ఎలెన్ రాయ్ జీవించివున్న కాలంలో కూడా - నేనూ, ఎం జి.కె. హాజరు కాలేక పోయాము. వాటి తేదీలు మాకు - ఇద్దరం ప్లీడర్లం కదా! మా వేసవి సెలవులు వేరు ఉత్తరాది వారి వేసవి సెలవులు వేరుగా ఉండేవి - అననుకూలం అయినందువల్ల అలా జరిగింది. 1961 వేసవిలో జరగాల్సిన శిబిరానికి వెళ్దామని గట్టిగా అనుకున్నాం 1960 డిసెంబరులోనే ఎలెన్‌రాయ్ హత్య కావించబడింది తరువాత ఒకసారి నడిపిన శిబిరంలో పాల్గొని మార్క్సిజంపై ప్రసంగించాను

భావ పునర్వికాస ఉద్యమానికి వలసిన సారస్వతం తెలుగులో కొంత వచ్చింది 'ఎం.ఎన్.రాయ్ వ్యాసాలు', 'పిల్లి ఆత్మకథ', 'మానవ నాగరికత', 'హేతుత్వం, ఉద్వేగవాదం, విప్లం' ఎం ఎన్.రాయ్ రచనలకు అనువాదాలు వీటిని అనువదించిన వారిలో కీర్తిశేషులు ఎ వి మోహన్, కోగంటి రాధాకృష్ణమూర్తి, డా॥ భట్టిప్రోలు హనుమంతరావు, ఈనాటికి రాస్తున్న డా ॥ ఎన్.ఇన్నయ్య వున్నారు. త్రిపురనేని వెంకటేశ్వరరావు రచించిన 'వేదాలనుండి శంకరుని వరకు' 'శంకరాద్వైతం', కీర్తిశేషుడు డా॥ జి వి. కృష్ణారావు రాసిన 'ఆర్య నాగార్జుని మాధ్యమిక వాదం' 'బొమ్మ పలికింది' జిజ్ఞాసపరుల ఆలోచనలపై కీ శే త్రిపురనేని గోపీచంద్ రచించిన గ్రంథం శ్రీ బి.రామకృష్ణ 'చార్వాకుడు' అనేపేరుగల పుస్తకం రావిపూడి వారి 'చార్వాకుల కథలు' ఆ కోవకు చెందినవి.

ఆంధ్రప్రదేశ్‌లో రినైజాన్సు క్లబ్‌లు తెనాలి, చీరాల, కాకినాడలలో మాత్రమే స్థాపించబడి కొన్ని సంవత్సరాలు పనిచేసినయి. ప్రాచీన తాత్విక శాస్త్రంలో ఆధునిక విజ్ఞానానికి నాంది ప్రస్తావన చేసిన కపిల, కణాదుల సిద్ధాంతాలు, చార్వాకుని తత్వం వీటి అధ్యయనం, పరిశీలన

జ్ఞానపునర్వికాసానికి దోహదం చేయగలవని చెప్పటం అప్రస్తుతం కాదు

ఆంధ్రప్రదేశ్ జ్ఞాన పునర్వికాస మహాసభను హైదరాబాదులో 1978 డిసెంబరులో సమావేశపరిచాం తెలుగుదేశంలోని హ్యూమనిస్టులు, తదితరులు ప్రతినిధులుగా వచ్చారు సుప్రసిద్ధ చరిత్రకారులు, మేధావి, కళాజీవి డా॥సంజీవదేవ్ మహాసభకు అధ్యక్షత వహించారు వారి అధ్యక్షోపన్యాసాన్ని ఆంగ్లంలో అచ్చువేయించాము. దాని శీర్షిక 'మానవ వికాసం' (ఆన్ ఫోల్డ్‌మెంట్ ఆఫ్ మాన్) పండితులకూ పామరులకూ యిద్దరినీ అది అలరించింది. జ్ఞానోదయం కలిగించింది. ప్రబోధపూరితంగా వుంది అపుడు భారత సామాజిక శాస్త్ర పరిశోధనా సంస్థ (ఇండియన్ కౌన్సిలు ఆఫ్ సోషల్ సైన్సు రిసెర్చి -ఐ.సి.ఎస్ ఎస్.ఆర్) హైదరాబాదు శాఖ డిప్యూటీ డైరెక్టరుగా వున్న శ్రీ పోలు సత్యనారాయణను ఆం ప్ర. రినైజాన్సు సమితి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోవడం జరిగింది అయనకు ఆంధ్రప్రదేశ్ కళాశాలలోని అధ్యాపకులతో సన్నిహిత సంబంధాలు ఉండటం వల్ల ఆయన కృషి వల్ల ఉద్యమమూ, సంస్థా రెండు అభివృద్ధిలోకి వస్తాయని ఆశించాము మొదటిది విశేషంగా జరిగింది కాని రెండవ ఆశయం నెరవేరలేదు. ఆయన పట్టుదల, ప్రోత్సాహమూ లభించినందువల్ల అధ్యాపకులూ, మేధావులూ ఎన్నో పరిశోధనలు సాగించారు. ఎన్నో రచనలు చేశారు అది ముదావహం కాని సంస్థాపరంగా ప్రగతి లేక పోయింది పని వత్తిడి ఫలితంగా ఆయన సంస్థ శాఖలను స్థాపించలేకపోయారు రాష్ట్రం మొత్తం మీద అదే భావపునర్వికాసోద్యమానికి ఆలంబనంగా, కేంద్రంగా వుండే సంస్థ నిర్మాణానికి పూనుకో బడిన ప్రథమ ప్రయత్నం ఇప్పటికీ అదే చివరి ప్రయత్నం.

మిత్రుడు ఎన్.వి బ్రహ్మం 1946లో డెహ్రాడూన్‌లో 30 రోజులు జరిగిన అధ్యయన శిబిరానికి వెళ్ళి వచ్చాడని, తదుపరి ఆనాటి నుండి 1969 నాటి ఢిల్లీ రాడికల్ హ్యూమనిస్టు మహాసభలో రాడికల్ హ్యూమనిస్టు సంఘ నిర్మాణం జరిగే వరకు రాడికల్ హ్యూమనిస్టు భావ ప్రచారానికి ఎనలేని కృషి చేశారని ఇంతకు క్రితం తెలుసుకున్నాం కదా! రినైజాన్సు ఉద్యమ నిర్వహణ బాధ్యతను అతడు చేపట్టాలని నేను అతనిని కోరాను ఆయన సమ్మతించాడు. హైదరాబాదు మహా సభకు వచ్చాడు సంస్థలో పదవీ బాధ్యతలను చేపట్టే వారిని మహా సభలో ఎన్నుకొనే తరుణం వచ్చి సమయానికి నేను శ్రీ పోలు సత్యన్నారాయణ పేరు ప్రతిపాదించాను అది మిత్రుడు బ్రహం మీది ద్వేషంతో, అసూయతో, కినుకతో చేసిన పని కాదు. యిరువురి వ్యక్తులలో ఒకరిని మాత్రమే ఎంపిక చేయడానికి వీలైన సందర్భములో అంచనాలు వేసుకోవడంలో జరిగిన ప్రక్రియ ఫలితం. శ్రీ బ్రహ్మం నా చర్యను గురించి ఎలా భావించాడో ఏమో! ఏదైనా ఉద్యమం ఎడల అతని భావంలో మార్పు లేదు తన చేతనయినంతవరకూ, తనకు అవకాశం ఉన్నంతవరకు ఆ భావ వ్యాప్తి చేస్తూనే ఉన్నాడు. కాకపోతే ఈనాటికి అతడికి హేతువాద సిద్ధాంత కర్తగా 'హేతువాది' పత్రిక సంపాదకుడుగా పేరుపొందిన మిత్రుడు రావిపూడి వెంకటాద్రికి శంకరాద్వైతాన్ని మదింపు వేయటంలో అభిప్రాయ బేధాలు వచ్చాయి. అయినా శ్రీ బ్రహ్మం యొక్క విజ్ఞానపర స్వభావాన్ని, కృషినీ ఎవరూ, ఇప్పుడు కూడా కాదనటం లేదు అతడి వ్యాసాలలో సునిశిత పరిశీలనా దృష్టి, విశ్లేషణా శక్తి ద్యోతకమవుతున్నాయి.

# కుల నిర్మూలనోద్యమం

1974లో ప్రారంభింపబడిన కుల నిర్మూలనోద్యమం యింకా చైతన్యంతో సజీవంగా కొనసాగుతున్నదంటే దానికి ముఖ్య కారణాలు మూడు ఉద్యమం యొక్క అవశ్యకత యింకా సమాజానికి కావలసి వుండటము మొదటిది. ఉద్యమపు సిద్ధాంత బలం రెండవది. ఉద్యమాన్ని చేపట్టి నడిపిస్తున్న వారి చిత్తశుద్ధి, పట్టుదల, కార్యదీక్ష మూడవ అంశం.

ఉద్యమానికి ఆలంబనగా వుండేవారు నలుబది యేబది మంది వున్నా ఉద్యమానికి జీవగర్రలు యిద్దరు ముగ్గురు వుంటారు. కుల నిర్మూలనోద్యమం కూడా యీ సూత్రానికి మినహాయింపు కాదు. కుల నిర్మూలన సంఘ స్థాపనోద్దేశ్యం మిత్రుడు సురమౌళి మనస్సులో మొదట్లో మెదలినా అతడు ఆ సంఘానికి సిద్ధాంత కర్తగా వున్నా దానికి అధ్యక్షులుగా వుండి గౌరవాన్నిచ్చిన ఘనత శ్రీ వీరాస్వామి గారిది. ఆయన అప్పట్లో ఆం.ప్ర. ప్రభుత్వంలో న్యాయశాస్త్ర విభాగానికి కార్యదర్శిగా వుండేవారు (ఇపుడు భారత సమాజవాది పార్టీ ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు). సంఘ కార్యభారాన్ని తన భుజస్కంధాలపై పెట్టుకొని మోసినవాడు మిత్రుడు డి.జి. రామారావు(ప్రభుత్వోద్యోగి, హైదరాబాదు పురపాలక సంఘ కమ్యూనిటీ ప్రాజక్టు ఆఫీసరు, తదుపరి యునిసెఫ్‌లో బాధ్యత తీసుకున్న అధికారి, యిపుడు 'ఉపకార్' అనే స్వచ్ఛంద సంస్థ స్థాపకుడు, సంచాలకుడు). ఈ ముగ్గురిని పేర్కొన్నంత మాత్రాన తతిమ్మా వారి కృషిని విస్మరించినట్లు కాదు వారు ఉద్యమానికి చేసిన సేవను తక్కువ అంచనా వేసినట్లు కాదు. ఎందరో ఆచరణశీలురు, సమాజంలో పేరు ప్రఖ్యాతులు కలవారు సంఘానికి అండగా నిలబడ్డారు; తమ శక్తి యుక్తులను దానికి ధారపోశారు. లక్ష్మి నాగేశ్వరుల జంట, వెంకటేశ్వరి రామారావుల జోడు, హేమలతా లవణంలు, యిలా ఎంతో మంది దంపతులను పేర్కొనవచ్చును. మిత్రుడు రామారావు ప్రధాన కార్యదర్శి పదవి నుండి తప్పుకొని ఉపాధ్యక్ష పదవి చేపట్టినపుడు అనేక సంవత్సరాలు ఆ బాధ్యతను చేపట్టి సమర్థవంతంగా నిర్వహించిన వారు వి. నాగేశ్వర్ గారు. ఇపుడు ఆ పదవిలో ఉంటూ సంఘాన్ని ముందుకు తీసుకొని వెళ్తున్నవారు ఆర్. సూర్యనారాయణ మూర్తిగారు ప్రస్తుతం సంఘాధ్యక్షులు శ్రీ సురమౌళి (లోహియా సహచరుడు, అనుచరుడు, సోషలిస్టు, పత్రికా రచయిత, గ్రంధకర్త). ఇప్పుడు కీర్తి శేషులు.

సంఘం మొదట్లో తలపెట్టిన ప్రప్రథమ కార్యక్రమం కులాంతర వివాహాలు. రెండవది కులభావ నిర్మూలన. మూడవది కులాంతర వివాహాలకు ప్రభుత్వం చేత, సమాజం చేత ప్రోత్సాహకాలను అందచేయించటం. ఈ ఆశయాల సాధనలో సంఘం కృతకృత్యమయినదని చెప్పటం అతిశయోక్తి కాదు. సంఘం చేసిన పనులలో మొట్టమొదటిదిగా ప్రజల దృష్టిని

ఆకట్టుకుంది రాష్ట్రసదస్సు తరువాత జరిగింది జిల్లా శాఖల నిర్మాణం, మహాసభల రూపంలో జిల్లా కూటములు. ఉద్యమం అనేక జిల్లాలకు వ్యాప్తి అయింది; సంఘం పలు జిల్లాలో ఉనికిని సంపాదించుకున్నది అనాడు పనికట్టుకొని అధ్యక్ష కార్యదర్శులుగా వున్న వీరాస్వామిగారలు, మిత్రుడు డి.జి రామారావు ఆంధ్రప్రదేశ్‌ను విస్తృతంగా పర్యటించారు. అనాడు గుంటూరు జిల్లా శాఖలో నేనూ చేరాను కుల నిర్మూలనోద్దేశ్యంతో జరిగే కులాంతర వివాహాలకు సంఘం 'ఆదర్శ వివాహాలు' అని నామకరణం చేసింది ఇరువది ఏళ్ళనుండి అలాంటి ఆదర్శ వివాహాలను పెక్కింటిని సంఘం ప్రోత్సహించింది, ఆధ్వర్యం వహించి జరిపించింది. ఈనాడు కొంతమంది సంఘ నిర్వాహకుల ప్రమేయంతో పెళ్ళిళ్ళు చేసుకుంటున్నా తమంత తాముగా కులాంతర వివాహాలను చేసుకునే వారి సంఖ్య అశేషంగా ఉంది. అదే ఉద్యమ ఆశయ సఫలత్వం, సంఘానికి తృప్తి

గాంధీజీ ప్రబోధం వల్ల ప్రభావితులయిన అనేకమంది పురుషులు తమ 'అగ్ర' వర్ణ అహంకారాన్ని విడనాడి దళిత (అనాడు 'హరిజన') స్త్రీలను పెళ్ళాడారు. ఎవరినో ఉద్ధరించాలని వారు అనాడు అలా ప్రవర్తించలేదు కులభావన నిచ్చెనమెట్ల సమాజాన్ని (ఈ పదజాలాన్ని మిత్రుడు అవుల గోపాలకృష్ణ మూర్తి వాడుకలోకి తెచ్చాడు) సుస్థిరం చేస్తుందని గ్రహించి, ఆ అసమానతను బదాబదలు చేయాలని వారు అలాంటి ఆచరణకు ఉపక్రమించారు. దర్శి చెంచయ్యగారి పేరును ఉటంకించకుండా కుల నిర్మూలనోద్యమాన్ని గురించి రాయడం అపచారం. తరువాత నాస్తికోద్యమ నిర్మాతలు గోరాదంపతులు కుల సంకెళ్లను ఛేదిస్తూ అనేక పెళ్ళిళ్లకు ఆచార్యత్వం వహించారు. ఆంధ్రలో కమ్యూనిస్టులు చేయించిన ఉద్వాహాలు కోకొల్లలు. దానిని ఉద్యమంగా చేపట్టి వారు ముందుకు సాగారు. రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ సారధిగా జీవించిన ఎ.జి.కె. కులాంతర వివాహాలకు ప్రోద్బలం అందించాడు; ఆచార్యత్వం వహించాడు. ఇలా ఎందరో సంస్కరణాభిలాషులు; ఎందరో మహనీయులు. ఈ నేపథ్యంలో ఆం ప్ర కుల నిర్మూలన సంఘం ఉదయించింది.

షెడ్యూలు జాతుల వారికి, షెడ్యూలు తెగల వారికి రిజర్వేషను సౌకర్యాలను కల్పించాలనటంలో, కొంతమందికి తప్ప, బహు సంఖ్యాక ప్రజలకు అభ్యంతరం లేదు. వారి అస్తిత్వం ప్రత్యేకం, వారి స్థితిగతులు అసాధారణం. కాగా వెనుకబడిన జాతువారికి కులాలను బట్టి రిజర్వేషను సౌకర్యాలను సమకూర్చాలనటం నాకు మ్రింగుడు పడని భావం. ఆం.ప్ర. కుల నిర్మూలన సంఘం ఆ నినాదాన్ని ఎత్తుకోవడం నాకు నచ్చలేదు. క్రమంగా సంఘంలో ఆసక్తి చూపడం తగ్గించాను; చివరకు మానివేశాను. ఇది 1978కి పూర్వం జరిగిన విషయం. కులాలను బట్టి రిజర్వేషనులు యిస్తే కులభావన నశింపు కాకుండా, యింకా బలపడుతుందని నా ఆలోచన.

కుల నిర్మూలన సంఘం ' ఈ నినాదాన్ని చేపట్టి తన ఆదర్శానికి భిన్నమయిన రీతిలో సంచరిస్తున్నదని నా నిశ్చయ నిర్ణయం.

1978లో నా మూడవ కుమారుడు వెంకటేశ్వర్లు పెళ్లి జరిగింది నేను దానికి ఏ పేరు పెట్టలేదు. 'ఆదర్శ వివాహం', 'మిశ్రమ వివాహం', 'అభ్యుదయ వివాహం', 'కులాంతర వివాహం' అనే పేర్లతో పిలువలేదు వివాహానికి అనేక మంది మిత్రులను ఆహ్వానించాను. మా దంపతుల మీది అభిమానంతో, ఆప్యాయతతో, వాత్సల్యంతో పలువురు పెళ్ళికి వచ్చి ఆశీర్వదించారు శ్రీ సి. నారాయణ రెడ్డి గారు (ఈనాడు పద్మభూషణ్ బిరుదాంకితులు, జ్ఞానపీఠ్ అవార్డు స్వీకర్తలు, ప్రభుత్వ సాంస్కృతిక విభాగపు ప్రత్యేక సలహాదారు) ఆచార్యత్వం వహించారు. సర్వశ్రీ ఆవుల సాంబశివారావు (ఈనాడు ఆం.ప్ర. హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, మాజీ లోకాయుక్త, మాజీ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, సంస్కారి), జి. వీరాస్వామిగారలు వధూవరులకు శుభాకాంక్షలు అందించారు. ఈ సంఘటన కుల నిర్మూలన సంఘం వారి దృష్టిని ఆకట్టింది రామ్మూర్తి మాటల పోచుకాలు కాడు, చేతలలో దిట్ట అని సంఘం వారు తలచారేమో - నిజానికి ఆ దంపతులను మెచ్చుకోవాలి - సంఘ కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడిని కమ్మని నన్ను ఆహ్వానించారు. నేను అంగీకరించాను. ఏదో కొన్ని అభ్యంతరాలు వున్నందున సంఘానికి దూరంగా ఉండటం మంచిది కాదేమోననే భావం ఆనాడు నాలో ప్రబలంగా వుంది సంఘీయులు నన్ను ఆదరించారు; గౌరవించారు.

సంఘం ఏర్పాటు చేసిన ఒక సదస్సులో రిజర్వేషనులను గురించిన నా ఆలోచనను సదస్యులకు తెలియజేశాను; విశదీకరించాను రిజర్వేషను విధానానికి నేను వ్యతిరేకిని కాదని, కాగా కులం ప్రాతిపదికగా యివ్వబడే రిజర్వేషనులు నాకు నచ్చవని, సాంఘిక విద్యా విషయిక వెనుకబడిన తనం (కుటుంబాలను లెక్కలోకి తీసుకొని) గీటురాయి కావాలని, ఆ వ్యక్తి కుటుంబీకులు చేసే వృత్తి, ఆ కుటుంబంలోని విద్యాస్థాయి (మూడు తరాల వరకు పరిగణనలోకి స్వీకరించి) రిజర్వేషనులకు అర్హులా అనర్హులా అనే అంశాన్ని తేల్చడానికి ముఖ్యాంశాలు కావాలని నేను ఆ సదస్సులో వివరించాను. మిత్రుడు సురమౌళి మాట్లాడుతూ 'రామ్మూర్తి సూచన ఆలోచనీయాంశం' అన్నాడు. శ్రీ టి. ఎల్ నారాయణగారు (ఆం ప్ర పబ్లిక్ సర్వీసు కమీషను మాజీ సభ్యులు) 'ఇది అగ్రవర్ణస్తుల కుచ్చితపు పథకం' (పదాలు అవి కాకపోవచ్చు కాని భావం అదే) అన్నారు మరొక సభలో వీరాస్వామిగారు ప్రసంగిస్తూ "బ్రాహ్మణ కన్యలు, కట్నాలు యివ్వలేని పరిస్థితిలో, ఇతర కులాలవారిని పెళ్ళాడుతున్నారు" అన్నారు. నేను అభ్యంతరం చెప్పి ఉపన్యసించాను. అలా అందరినీ శంకించటం తగదని హెచ్చరించాను. ఏనాడో యివ్వబడిన మండల్ కమీషను నివేదికను త్రవ్వి తీసి శ్రీ వి పి.సింగ్ (జనతా పార్టీ నాయకుడు,

ఆనాడు దేశ ప్రధానమంత్రి) దానిని అమలు పరచటానికి నిశ్చయించాడు. దేశం అతలాకుతలమయింది. ప్రజలు రిజర్వేషనులకు అనుకూలురుగా, వ్యతిరేకులుగా రెండు వర్గాలుగా చీలిపోసాగారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా అందోళనల అగ్నిజ్వాలలు వ్యాపించాయి.

ఇరువర్గాల విద్యార్థులను యువకులను ఒకచోట చేర్చి మాట్లాడించిన ఘనత పి.యు సి.ఎల్ ది. (అ ప్రస్తావన తరువాత వస్తుంది). ఆం ప్ర. కులనిర్మూలన సంఘపు కార్యనిర్వాహక వర్గం యీ సమస్యను చర్చించ పూనింది ప్రధాన కార్యదర్శి శ్రీ వి. నాగేశ్వర్ యింట్లో సమావేశం. సుదీర్ఘంగా సమాలోచనలు సాగినయి వీరాస్వామి గారు అధ్యక్షత వహిస్తున్నారు. నా వాదనను శ్రీమతులు లక్ష్మి, బి. వెంకటేశ్వరి గారలు బలపరిచారు వీరాస్వామిగారు కూడా కాస్త రాజీ ధోరణిని ప్రదర్శించతలచినట్లు నాకు తోచింది ఇంతలో మిత్రుడు సురమౌళి సమావేశంలోకి అడుగిడినాడు. జరుగుతున్న చర్చా విశేషాలను తెలుసుకున్నాడు తన పాత ధోరణిలో కులాల ప్రాతిపదికమీద రిజర్వేషనులను సమర్థిస్తూ తీర్మానాన్ని చెప్పాడు (డిక్టేట్ చేశాడు). అధిక సంఖ్యాక సభ్యులు ఆమోదించారు తరువాతి కాలంలో నేను ఆ సంఘ కార్య నిర్వాహక సంఘ సభ్యత్వానికి రాజీనామా పెట్టకపోయినా, ఆ సమావేశాలకు హాజరు కావడం మానివేశాను. తర్వాత జరిగిన మహాసభలో నన్ను కార్యనిర్వాహక సభ్యుడిగా ఎన్నుకోలేదు. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ కార్యనిర్వాహక సభ్యులుగా ఎన్నుకోవబడినారు. ఆమె ఇంకా ఆ పదవిలోనే కొనసాగుతున్నారు.

# కుల నిర్మూలన : అభ్యుదయ వివాహ వేదిక

1970 నుండి మత తంతు లేని వివాహాలకు ఆచార్యత్వం వహిస్తున్న నేను, 1974 నుండి వివాహ సమస్యపై తీవ్రంగా ఆలోచిస్తున్న నేను 1983 నాటికి నా లోచనలకు ఒక రూపకల్పన చేసుకోకల్గాను. కుల ప్రసక్తి లేని, కట్న రహిత, మత తంతుకు ఆస్కారం లేని వివాహాలను చేయించటం ఉద్యమంగా చేపట్టాలని భావించాను. శ్రీమతి మల్లాది సుబ్బమ్మను సంప్రతించాను. ఆమె నా ఆలోచనా విధానాన్ని ఆమోదించింది. కుల నిర్మూలన సంఘం వారు చేయించే, చేసే పెళ్ళిళ్లు విధిగా కులాంతరపువి అయివుండాలి. అయితే మతతంతు ఉన్నదా లేదా అనేది వారికి ప్రధానాంశం కాదు. వరునికి కట్నం యిచ్చే పద్ధతికి వారూ వ్యతిరేకులే. మొదటి రెండు అంశాలకు సవరణలు కావాలని నా కోరిక. వధూవరులు కుల ప్రసక్తి లేకుండా వివాహమాడటం ముఖ్యమని నా అభిప్రాయం. ఒకే కులపు వారినిగా సమాజం వారిని పరిగణించినా వారు కులభావన లేకుండా పెళ్ళాడటంలోనే విశిష్ఠత ఉందని నా భావం. దీనిని మిత్రులు ఎన్ ఇన్నయ్య, పోలు సత్యనారాయణ, సి లక్ష్మన్న దంపతులతో చర్చించాము. కులాంతర వివాహం చేసుకోవడమే అభ్యుదయానికి గీటురాయి అని వారు అభిప్రాయపడ్డారు వారివి అన్నీ కులాంతర వివాహాలే. కులనిర్మూలనలో వారు విశ్వాసం వున్న వారే కులాంతర వివాహం చేసుకోకుండా, తమ కులంలోనే పెళ్ళాడటం ఎలాంటి అభ్యుదయమో వారికి తోచలేదు. కమ్యూనిస్టుల కుటుంబాలలోని పెళ్ళిళ్లను, ప్రేమ వివాహాల జంటలను అభ్యుదయ వివాహాలకు ప్రతీకలుగా నేను పేర్కొన్నాను. ఇన్నయ్య దంపతులు కులాంతర వివాహాలు మాత్రమే అభ్యుదయ కరాలని యిప్పటికీ విశ్వసిస్తున్నారు శ్రీ పోలు సత్యన్నారాయణ దృష్టిలో నేను సూచించిన అభ్యుదయ వివాహం అభ్యంతరం కాదు. కాని కులాంతర వివాహమే శ్రేష్టం డా॥ సి. లక్ష్మన్న ఇన్నయ్యతో ఏకీభవిస్తారు.

1983లో నేను, సుబ్బమ్మగారు తదితర మిత్రులు అందరం కలిసి అభ్యుదయ వివాహ వేదికను స్థాపించారు నార్లవారిని కలిసి గౌరవాధ్యక్షులుగా ఉండమని కోరాం. వారు ఆదరంతో అంగీకరించారు మిత్రుడు పోలు సత్యనారాయణ అధ్యక్షుడుగా, సుబ్బమ్మగారు ప్రధాన కార్యదర్శిగా, నేను కోశాధికారిగా ఆ సంఘం చాలా కాలం పనిచేసింది. శ్రీ పోలు ఇందిరాగాంధి సార్వత్రిక విశ్వ విద్యాలయంలో ఉద్యోగానికి ఢిల్లీ వెళ్తే శ్రీమతి మమతా లక్ష్మన్న (యిపుడు డాక్టర్ మమతా లక్ష్మన్న) అధ్యక్షులయ్యారు. నార్లవారి మరణానంతరం మరొకరిని గౌరవాధ్యక్షులుగా ఎన్నుకోలేదు ఇప్పిటికీ ఆ సంఘ ఆధ్వర్యంలో అభ్యుదయ వివాహాలు జరుగుతున్నాయి. శ్రీమతి సుబ్బమ్మ ఆ పెళ్ళిళ్ళలో ఆచార్యత్వం వహిస్తున్నారు.

ఈ సందర్భంలో కొంచెం వెనుకచూపు అవసరమనిపిస్తుంది అభ్యుదయ వివాహవేదిక స్థాపించబడే వరకు చాలామంది సహృదయులు నన్ను వారు చేసే, చేయించే వివాహాలలో ఆచార్యత్వం వహించమనేవారు. నేను అంగీకరించి చేసేవాడిని. నేను వేదికమీద ఉండి మంగళ సూత్రం కట్టించనని ముందుగా చెప్పేవాడిని. వారు వెంటనే అంగీకరించేవారు కొన్ని వివాహాలలో వారి వాగ్దానాలను వారు నిలుపుకోలేదు పూలదండలో మంగళ సూత్రాన్ని పొదిగి ఒకచోట మంగళసూత్రం_కట్టించమని, వధువు ముత్తవ చేత అడిగించి మరొకచోట నన్ను యిబ్బంది పాలు చేశారు. అంతటితోబయట కళ్యాణ మంటపాలకు వెళ్ళి ఆచార్యత్వం నెరపడం మానుకున్నాను. తరువాత ఒక సందర్భంలో ''రామ్మూర్తిగారు మా అమ్మాయి పెళ్ళి చేయాలి'' అని ఒక మిత్రుడు ఫోను చేశాడు. "ఆయనే ఆచార్యత్వం వహించాలా. నేను ఆ పెళ్ళి చేయించకూడదా'' అని సుబ్బమ్మగారు ప్రశ్నిస్తే ఆ మిత్రుడు తడబడి "మీరు చేస్తానంటే అభ్యంతరం ఏముంది?'' అని చెప్పి ఆమెచేత పెళ్ళి జరిపించాడు. అప్పటి నుండే అభ్యుదయ వివాహాలన్నింటికి ఆమెదే ఆచార్యత్వం. అలాంటి వివాహాలకు కొన్నింటికి అభ్యుదయ వివాహ వేదిక కార్యస్థానమయిన మా యింటి వెలుపల, కళ్యాణ వేదికలలో పెళ్ళిళ్లకు -ఆమె అక్కడికి వెళ్ళి ఆచార్యత్వం వహించడం సంప్రదాయమయింది.

అభ్యుద వివాహ వేదిక ఆదర్శాలను, లక్ష్యాలను అంగీకరిస్తున్నామని, కులం వెలుపల వివాహం చేసుకోవడానికి అభ్యంతరం లేదని వ్రాసి యిచ్చినవారికి వధువులను, వరులను సూచించే బాధ్యతను వేదిక చేపట్టింది. పలువురు స్త్రీ పురుషులు అలా తమ పేర్లను నమోదు చేయించుకునేవారు. ఆ దరఖాస్తు ఫారంలోనే తన పేరు, తన తండ్రి పేరు, జనన తేదీ లేక వయస్సు, చదువు, ఉద్యోగం వుంటే ఎలాంటి ఉద్యోగం, నెల జీతం లేక ఆస్తిపై సంవత్సర ఆదాయం, హోదా (కన్య/విడాకులు పొందిన స్త్రీ/వితంతువు - అలాగే మార్పులతో పురుషుని పరంగా - ఎత్తు, రంగు, శాకాహారియా లేకా మాంసాహారియా, తనకున్న యిష్టా యిష్టాలు వధువు లేక వరునికి వుండాలని తను కోరే చదువు, ఉద్యోగం యీ వివరాలన్నీ రాసి యివ్వాలి. వధువు లేక వరుడు శాఖాహారిగా లేక మాంసాహారిగా వుండాలని, మద్యం సేవించరాదనీ, లేక మోతాదుగా త్రాగినా ఫరవాలేదని, ఎట్టి పరిస్థితులలో త్రాగుమోతు కారాదని వేదిక సాయాన్ని ఆపేక్షించేవారు రాసి యివ్వవచ్చు. అంటే కుల ప్రసక్తి, లేకపోవడం, వరకట్నాన్ని యివ్వకపోవడం/ తీసుకొనకపోవడం, మతతంతు (మంత్రాలు, మంగళ సూత్రం) లేకపోవడం యీ మూడు వేదిక విధించే షరతులు. తతిమ్మా విషయాలలో వధూవరులు వారి యిష్టా యిష్టాలను తెలియపరచవచ్చు

వేదిక ఆధ్వర్యంలో అనేక వివాహాలు జరిగాయి అవి ఎక్కువగా ప్రేమ వివాహాలే. ఒకటి తప్ప అవి అన్నీ జయప్రదం అయినయి. వివాహితులు సుఖంగా, ఆనందంగా జీవయాత్ర

చేస్తున్నారు. వీలయినంత వరకు వివాహమయిన వెంటనే - పెళ్ళి అపుడు హాజరులో లేని - వారి వారి తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి వారికి నమస్కరించి వారి ఆశీర్వాదాలను కోరమని ఆ నూతన వధూవరులను మేము కోరడం వల్ల, చాలామంది మా సలహాను పాటించినందుచేత అచిరకాలంలోనే వారి తల్లిదండ్రులు వారి యెడల వ్యతిరేక భావాన్ని విడనాడటం, వారిని పూర్వ మాదిరిగానే, వారిని తమ కుటుంబ సభ్యులుగా స్వీకరించడం జరిగేది. వారి వైవాహిక జీవితాల స్థిరత్వానికి యిది దోహదం చేసేది.

వేదిక వైఫల్యాన్ని కూడా పేర్కొనటం సముచితం వేదిక వధూవరులకు కావలసిన సమాచారాన్ని అందించగలిగింది. కాని పెళ్ళి సంబంధాలను కుదుర్చలేకపోయింది. నిజానికి పెళ్ళిసంబంధాలు కుదిర్చే పనిని వేదిక ఏనాడు నెత్తిన వేసుకోలేదు. పెళ్లి సంబంధాలు కుదర్చడం అంత తేలిక విషయం కాదు కదా! మరొక అంశాన్ని యిచ్చట ప్రస్తావించాలి. ప్రేమించి వితంతువులను వివాహమాడే వారున్నారు కాని వేదిక అందించే సమాచారాన్ని ఆధారంగా తీసుకొని విధవలను పెళ్లాడడానికి సిద్ధమయ్యే పురుషులు కరువయినారు ఈనాటికి ఆ స్థితి ఉండడం ఆశ్చర్యకరమే. మనస్తత్వాలు కలవనందున భార్య నుండి విడాకులు తీసుకున్న ఓ యువకుని "విడాకులు తీసుకున్న యువతిని పెళ్లాడడానికి నీకు అభ్యంతరం లేదు కదా?" అని ప్రశ్నిస్తే "దయచేసి కన్యను సూచించండి" అని బదులు పలికాడు. ఒక విప్లవకారుణ్ణి యిలాంటి ప్రశ్నే వేస్తే అచ్చంగా అలాంటి సమాధానమే వచ్చింది రాజకీయార్థిక విషయాల్లో విప్లవస్వభావం వున్నా సామాజిక సాంస్కృతిక రంగాల్లో అది 'హూష్ కాకి' అవుతున్నదని గ్రహించాను.

అభ్యుదయ వివాహ వేదిక 1983లో "వివాహం : నేడు, రేపు" అనే అంశం మీద రెండు రోజులు సెమినారు జరిపింది. ఆ సందర్భంగా వచ్చిన పరిశోధనా వ్యాసాలు, పత్రాలు వీటిని గ్రంథరూపంగా ప్రచురించింది. ఒక వ్యాసంలో శ్రీమతి ఎం. కోమల కులాంతరం కాని వివాహాలను నిషేధించాలని రాశారు. అది ఆమె దృఢాభిప్రాయం తద్వ్యతిరేక దృక్పథంతో నేను వ్యాసం రాశాను. "ప్రేమ వివాహాలు అభిలషణీయం కదా! ప్రేమించే ముందు మీదే కులం అని తెలిసికొని ప్రేమించాలా? కాకపోతే కొంతకాలం అవతలి మనిషిని అభిమానించిన తరువాత మీకులమేది అని అడిగి తెలుసుకొని, కేవలం కులం తేడా కారణంగా, ప్రేమించడం మానివేయాలా? అలా చేస్తే కులం పేరుతో యితర కులస్తులను వివాహమాడరాదని ఆంక్షలు పెట్టిన బ్రాహ్మణ మతస్థులకూ - 'బ్రాహ్మణేతరులు' చాలా మంది యీనాడు బ్రాహ్మణ మతాన్నే అభిమానిస్తున్నారు; అమలు పరుస్తున్నారు - కులస్తులు అయిన వారిని పెళ్ళాడరాదనే 'ఆధునిక సంఘ సంస్కర్తలకు' తేడా ఏమిటని నేను ప్రశ్నించాను. ఇరువార్గలు కులాన్ని త్రోసిరాజనడం లేదు, కులానికే ప్రాధాన్యతను యిస్తున్నయి 'ఇది వ్యక్తి స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి గొడ్డలిపెట్టు కాదా' అని సవాలు

చేశాను. ఈ వాదన కొత్తది కాదు 'కులంలో వివాహాలను నిషేదించాలని భారత హేతువాద సంఘ స్థాపకుడు శ్రీ ఎస్. రామనాధన్ 1960 ప్రాంతంలో సూచించినప్పటి నుండి కొనసాగుతున్నదే. ఆనాడే నాబోటి వారం ఆయన ప్రతిపాదనను ఎదుర్కొన్నాం

చివరగా - నాకు తెలిసినంత వరకు - వివిధ సిద్ధాంతాలను ఆమోదించేవారి వైఖరులను వివరిస్తాను సోషలిస్టులు - అందులో ముఖ్యంగా లోహియా సహచరులు, అనుచరులు కులాంతర వివాహాలే కులనిర్మూలనకు మార్గాలని గట్టిగా నమ్ముతారు; వాదిస్తున్నారు కూడా. మతాంతర వివాహాలను కూడా ప్రోత్సహిస్తున్నారు. సర్వశ్రీ జార్జి ఫెర్నాండెజ్, జయస్వాల్ మతాంతర వివాహాలు చేసుకున్నవారు కాగా సురమౌళి, స్నేహలతా రెడ్డి కులాంతర వివాహాలు చేసుకున్నవారిలో ప్రసిద్ధులు కమ్యూనిస్టులు కులాంతర వివాహాలను పనికట్టుకొని పట్టుదలగా 1955 నుండి 1955 వరకు చేయించారు. చేసుకున్నారు. కాని కులనిర్మూలనోద్యమాన్ని చేపట్టలేదు. కులాన్ని అంతగా పట్టించుకోలేదు "మాకు కులం లేదు" అని అదేపనిగా చెప్పుకోలేదు. రాడికలు వాదులు (యీనాటి రాడికల్సుకు వారికి తేడా వుందని గమనించాలి) రాడికల్ హ్యూమనిస్టులు కులాన్ని త్రోసిరాజనాలంటారు. వీరిలో శ్రీ ఎస్.ఎ.బక్ష్ మతపు ఎల్లలు దాటి జి వెంకట స్వామి, శ్రీ జి వీరన్నలు కులపు హద్దులను అతిక్రమించి వివాహాలు చేసుకున్నారు గోరాగారి ఉద్యమంలో కులభావన నశింపు ప్రప్రథమ కర్తవ్యం కుల విధ్వంసం వారి లక్ష్యాలలో ఒకటి. అలాంటి కులాంతర వివాహాలు చేయడం, చేయించడం, చేసుకోవడం వారి ప్రత్యేకత. రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, స్థాపన కాలపు స్థితినుండి, బాగా వృద్ధి చెందింది. వారి దృష్టిలో జాతీయతకు ప్రధమ స్థానం ఉంది కనుక వారు కులాన్ని ఆమోదించరు. వారి సమావేశాలలో, సమ్మేళనాలలో కులాన్ని పట్టించుకొనరు ఆహార విహారాదులలో కులపు ఊసురాదు. కాగా పెళ్ళిళ్ళ విషయంలో కులాంతర వివాహం చేసుకోమని శాఖలలో, శిబిరాలలో, సమ్మేళనాలలో చెప్పరు. కులాంతర వివాహాలను ప్రోత్సహించరు. ' ఏ సభ్యుడయినా చేసుకుంటే దానిని యీసడించక పోగా ఆమోదిస్తారు. ఆనాటి రాష్ట్రీయ స్వయం సేవక సర్వ సంఘ సంచాలక్ ఆర్సుగారు హైదరాబాదుకు 1977లో వచ్చినపుడు నేను వారిని కలిసికొని 3 నిమిషాలు సంభాషించిన తరుణంలో కులాంతర వివాహాలను ప్రోత్సహించమని కోరాను "అభ్యంతరం ఏనాడూ లేదే! మీ సూచనను గురించి ఆలోచిస్తాను " అన్నారు ఈనాడూ రాష్ట్రీయ స్వయం సేవక సంఘంలో అదే వైఖరి ప్రస్ఫుటమవుతున్నది. ఇంతకూ చెప్పదలుచుకున్న దేమంటే కులాన్ని త్రోసిరాజన్న ప్రేమవివాహాలు యీనాడు జరుగుతున్నాయి కాని పెద్దలు, స్నేహితులు, హితులు ఏర్పాటు చేసిన చేస్తున్న పెళ్ళిళ్లలో కులపు గోడలు అధిగమించరానిదిగా ఉన్నాయనేదే వాస్తవం.

# ప్రజాస్వామ్య ఉద్యమం

ప్రజాస్వామ్యం పరిపుష్టంగా మనుగడ సాగించాలంటే పటిష్టమయిన రాజకీయ పార్టీల ఉనికి అవసరమనే భావం యీనాటికి ప్రబలంగా ఉంది. 1948లో రాడికల్ డెమొక్రటిక్ పార్టీని రద్దు చేసినపుడు పార్టీ రహిత ప్రజాస్వామ్య భావన మొలకెత్తింది. దానిని గోరా ఎత్తుకున్నారు. సర్వోదయ వాదులు ఆమోదించారు. జయప్రకాష్ నారాయణ్ సమర్థించాడు. 1974లో జనతంత్ర సమాజ్ (సి.ఎఫ్.డి.) ఆవిర్భవించినపుడు ఏ పార్టీకి చెందని (నాన్ పార్టీ) వ్యక్తుల కూటమి యొక్క ఆవశ్యకత ప్రజల దృష్టికి తీసుకురాబడినది. 1969 నాటికి - అఖిల భారత స్థాయిలో పార్టీ ప్రజాస్వామ్యానికి ప్రత్యామ్నాయంగా పార్టీ రహిత ప్రజాస్వామ్యం సూచింపబడే స్థితి అంతరించింది. పార్టీ రహిత ప్రజాస్వామ్యం సుదూర లక్ష్యమని, ఈనాడు ఆచరణ సాధ్యం కాదనే ఆలోచన మేధావి వర్గంలో చోటుచేసుకున్నందవలన ఆ పరిణామం సంభవించి వుండవచ్చును. 1969 నాటికి రాజకీయ పార్టీ డొల్లతనం, ప్రజాస్వామ్యానికి పార్టీల ఉనికికి మధ్యవున్న వైరుధ్యం - యీనాడు అవగతమయినట్లుగా - ప్రజలకు తెలియలేదు. రాడికల్ హ్యూమనిస్టులు ఏ పార్టీలోనూ సభ్యులు కాదలచనందున వారి ఆచరణలో ప్రజాస్వామ్య ఉద్యమం అంటే పౌరుల ప్రజాస్వామ్య ఉద్యమమే (సిటిజన్సు ఫర్ డెమోక్రసీ). ఈ కొలది పరిచయ వాక్యాలతో నాకు తెలిసిన జనతంత్ర సమాజ్ చరిత్రను ఎరుకపరుస్తాను.

అత్యయిక పరిస్థితి కాలంలో జనతంత్ర సమాజ్ ప్రజాస్వామ్య జ్యోతి ఆరిపోకుండా ఎలా కాపాడిందీ ఇంతకు క్రింతం తెలుసుకున్నాం. ఎమర్జెన్సీని ఎత్తివేసిన తదుపరి ఆ సంస్థ నిర్మాణాత్మక ఆలోచనా రీతిని అర్థం చేసుకున్నాం. జయప్రకాష్ నారాయణ్ ఇచ్చిన 'సంపూర్ణ క్రాంతి' (టోటల్ రెవల్యూషన్) నినాదాన్ని చర్చించడం జరిగింది. పర్యవసానంగా సంపూర్ణ క్రాంతి అంటే సామాజికార్థిక రంగాలో పౌరులకు స్వేచ్ఛ ఒనగూడినందున సరిపోదని జీవితంలోని అన్ని రంగాలలోనూ ప్రజాస్వామ్య భావన వ్యాప్తి పొందాలని జనతంత్ర సమాజ్ రెండు సంవత్సరాలకు ఒకసారి జరిగే మహాసభలలో నిర్ణయించింది అహమ్మదాబాదు, బెంగుళూరు, బొంబాయి, హైదరాబాదు మహాసభలలో ఈ భావానికి అనుగుణమయిన కార్యక్రమాల రూపకల్పన జరిగింది. చైతన్యవంతులయిన పౌరులే ప్రజాస్వామ్యానికి అండగా వుండగలరనే నిశ్చయానికి వచ్చింది. శాసన సభలకు - కేంద్రంలో కాని, రాష్ట్రాలలో కాని - జరిగే ఎన్నికలలో పార్టీలే పోటీచేసే అభ్యర్థులను ఎంపిక చేయటం సర్వసామాన్యంగా జరుగుతున్నది. ఎన్నిక అయిన అభ్యర్థుల చర్యలపై అజమాయిసీ వారి పార్టీలకే వుంటున్నది అంటే పార్టీ, దేశం, నియోజక వర్గం వరుసక్రమంలో ఎన్నుకోబడిన శాసన సభ్యుని విశ్వాసాన్ని, శ్రద్ధను పొందుతాయి అతనికి లేక ఆమెకు ఓట్లను యిచ్చి అతని విజయానికి దోహదం చేసిన నియోజక వర్గ ఓటర్లు మరల ఎన్నికలు వచ్చేవరకు నిష్క్రియాపరులు, అశక్తులు, నిష్ప్రయోజనపరులు అవుతున్నారు. శాసన సభ్యుని

ప్రవర్తనను, ఎన్నికలకు ఎన్నికలకు మధ్య ఉండే కాలంలో, అజమాయిషీ చేయగల, అదుపులో వుంచగల సామర్థ్యం, శక్తి, పౌరులకు లేకుండా పోయింది. వారికి ఆ శక్తిని, అధికారాన్ని సంతరించే నిమిత్తం 'ఓటర్ల సముతుల నిర్మాణానికి' జనతంత్ర సమాజ్ పిలుపునిచ్చింది ఎం.ఎన్.రాయ్ ఊహించిన నిర్మాణ ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా సంఘాలు చేయాలని సంకల్పించిన పనులు - శాసన సభ్యులను ఎంపిక చేయడం, వారిపై అదుపు కలిగి వుండటం, పౌరులకు ప్రబోధం అందించటం - అన్నీ ఓటర్ల సముతుల చేయగలవని అనుకోలేదు. కనీసం రెండు విధులను అవి నెరవేర్చగలవని తలపోయడం జరిగింది ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థులను ఎంపిక చేయటం, పౌరులకు విజ్ఞానాన్ని పంచడం యీ రెండూ అవి చేయగలిగితే చాలని భావించడం జరిగింది శాసన సభ్యులను తిరిగి పిలిపించే హక్కు (రీకాల్) నియోజకవర్గ ఓటర్లకు సంప్రాప్తించాలంటే రాజ్యంగ సవరణ అవసరం అది అంత తేలికగా, అంత త్వరగా జరిగేది కాదు. కనుక విజ్ఞతతో ఓటర్ల సముతుల నిర్మాణ కార్యక్రమాన్ని జనతంత్ర సమాజ్ చేపట్టింది. దీనిని రూపొందించే లోగానే 1977 పార్లమెంటు ఎన్నికలు జరిగాయి. ఎమర్జెన్సీ ప్రభావం ఆ ఎన్నికలపై పడింది 'ప్రజాస్వామ్యమా లేక నియంతృత్వమా" అనేది ఆనాటి నినాదమయింది 1980 నాటికి గాని ఓటర్ల సముతుల నిర్మాణం జనతంత్ర సమాజ్ కార్యక్రమం కాలేకపోయింది. 1980 పార్లమెంటు ఎన్నికలలో సికిందరాబాదు నియోజక వర్గం నుండి యీ భావాలతో పోటీ చేయాలని ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు, సోషలిస్టు నాయకుడు, సర్వోదయోద్యమకార్యకర్త చుండి జగన్నాథంగారు (యీనాడు వారు లేరు) సంకల్పించారు నన్ను సంప్రతించారు దానిని రూపకల్పన చేయడానికి ఒక సదస్సును హైదరాబాదులో ఏర్పాటు చేశాం సర్వశ్రీ ఆవుల సాంబశివారావు, ఉమ్మెత్తల కేశవరావు (స్వాతంత్రయోధులు; సర్వోదయ నాయకులు - వారు యిపుడు కీర్తిశేషులు) ప్రభృతులు ప్రసంగించారు. ఆశించినదానికన్నా ఎక్కువ స్పందన, బలం ఒనగూడాయి ఓటర్ల సముతుల నిర్మాణ ఆవశ్యకతను ఎన్నికల సమయంలో ప్రజల దృష్టికి తెచ్చే నిమిత్తం పార్లమెంటు ఎన్నికలలో అభ్యర్థులను నిలబెట్టాలని ఆలోచన వచ్చింది. వారిని 'ఓటర్ల సముతుల ఉద్యమ ప్రచార అభ్యర్థులని (క్యాండిడేట్సు ఫార్ ఓటర్సు కౌన్సిలు మూవ్‌మెంట్) పిలవాలని నిర్ణయించాము అభ్యర్థులను నిర్ణయించే సమయాలనికి శ్రీమతి మల్లాది సుబ్బమ్మ అభ్యర్థులుగా స్త్రీలకు అవకాశం ఉండదా అని ప్రశ్నించి, తను అభ్యర్థిగా పోటీ చేయడానికి సిద్ధమని ప్రకటించింది సికిందరాబాదు, హైదరాబాదు పార్లమెంటరీ నియోజకవర్గాల నుండి వరుసగా చుండి జగన్నాథంగారిని, మల్లాది సుబ్బమ్మగారిని ఎంపిక చేయడం జరిగింది. చందాలవల్ల, విరాళాలవల్ల వసూలయిన ధనం నాల్గువేల రూపాయలకు చెరిసగంగా ఇరువురు అభ్యర్థులకు పంచాం అభ్యర్థులు నామినేషన్లు వేశారు. 'లా' దృష్టిలో వారు స్వతంత్ర అభ్యర్థులే సికిందరాబాదు నియోజక వర్గంలో 11 మంది అభ్యర్థులు - పోటీకి దిగారు హైదరాబాదు నియోజక వర్గంలో ఆరుగురు అభ్యర్థులు రంగంలో ఉన్నారు. ఎన్నికలలో ఓటర్లు సముతుల ఉద్యమ ప్రచార

అభ్యర్థులు గట్టి పోటీ యివ్వగలుగుతారని లేక గెలుస్తారని ఎవరం తలచలేదు. అనుకున్నట్లుగానే వారు ఓడిపోయారు. వారికి డిపాజిట్లు గల్లంతయినవి

హైదరాబాదు నియోజక వర్గ అభ్యర్థిగా నున్న సుబ్బమ్మగారికి నేను పనిచేయడం తప్పనిసరి కదా! శ్రీ ఉమ్మెత్తుల కేశవరావుగారు మాకు ఒక సర్వోదయ కార్యకర్తను సాయం పంపారు. ఆయన మతరీత్యా హిందువు ఆయనభార్య ముసల్మాను మతానికి చెందినవారు. ఆయనకు తెలుగు, హిందీ, ఉర్దూ భాషలు వచ్చు నిజాయితీపరుడు, సహృదయుడు. మేము ముగ్గరం ప్రచార బాద్యతను చేపట్టాం. ఆ నియోజక వర్గంలో 7 అసెంబ్లీ నియోజక వర్గాలున్నాయి. చార్మినారు, చాంద్రాయణగుట్ట, యాకుత్‌పురా, కార్వాన్, చేవెళ్ళ, వగయిరాలు అవి. తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో కరపత్రాలు వేసి పంచాం సభలను నిర్వహించాము. వీధి మూల సమావేశాలను జరిపాం. పేటల కూడలులలో ఆటో రిక్షా - పట్టణ ప్రచారంలో వాడిన వాహనం - కారును - చేవెళ్ళ, వికారాబాదు, తాండూరు నియోజక వర్గాలలో దానిని వాడాం - ఆపి మైకులో ప్రచారం చేశాం అంతటితో ఆగక తెలుగులో, ఇంగ్లీషులో, ఉర్దూలో - తలా 5 నిమిషాలు పట్టే ప్రసంగాలను పొందుపరిచిన 'క్యాసెట్టు'ను తయారు చేశాం. దానిని ఉపయోగించేవారం ధనాభావం చేతను, కార్యకర్తల కొరతవల్లను ఎక్కువ సంఖ్యలో 'క్యాసెట్ల'ను తయారుచేయించలేదు; వాడలేదు (1983 ఎన్నికలలో తెలుగుదేశం యీ రకపు ప్రచార విధానాన్ని భారీ ఎత్తున చేపట్టింది) నామినేషన్లు వేసిన వెంటనే ప్రచారం చేయసాగేము. విరామం లేకుండా తిరిగాము అన్ని అసెంబ్లీ నియోజక వర్గాలు - వీలయినంత వరకు - పర్యటించాం. గ్రామాలకు కూడా వెళ్ళాం కొన్ని సభలలో శ్రోతలు 'మావూరు రమ్మనమని' ఆహ్వానించేవారు వారి ఆహ్వానాన్ని మన్నించ ప్రయత్నించాం జయప్రకాష్ నారాయణపై వుండే గౌరవభావం వలన, నూతన ప్రయోగం కనుక పత్రికలవారు సుబ్బమ్మగారి అభ్యర్థిత్వానికి ప్రచారం యిచ్చారు. ఆమె బొమ్మవేసి జీవిత సంగ్రహ వార్తలు రాశారు. "ఆమెకు మేధావుల మద్దతు ఉందికాని ప్రజల అండదండలు లేవు" అని ఒక దినపత్రిక రాసింది ఉర్దూ దినపత్రిక 'శియాసిత్' కూడా ఆమెను గురించి రాసింది. గుజరాతు జనతంత్ర సమాజ్ నాయకులు హైదరాబాదులోని గుజరాతీ మాతృభాషగా కల ఓటర్లకు పంచే నిమిత్తం గుజరాతీ భాషలో రాయబడిన కరపత్రాలను అహమ్మదాబాదులోనే ముద్రించి మాకు పంపారు. వాటిని ఆ ఓటర్లకు పంచాం. ఫలితాలు వచ్చాయి. కాంగ్రెసు పార్టీ అభ్యర్థి ప్రప్రధముడుగా ఎన్నికయ్యాడు. తరువాత వరుస క్రమంలో మజ్లిస్ అభ్యర్థి ఓవైసీ, భారతీయ జనతాపార్టీ అభ్యర్థి నరేంద్ర వచ్చారు వీరు ముగ్గురికి తలా లక్షకుపైగా ఓట్లు వచ్చాయి. నాలుగవ స్థానంలో సుబ్బమ్మగారు వచ్చారు. ఆమెకు సుమారు ఆరువేల ఓట్లు వచ్చాయి కాంగ్రెసు (ఓ) అభ్యర్థి(మాజీ కేంద్ర ఉపమంత్రి) మూడువేల చిల్లర ఓట్లు, రామరాజ్య పరిషత్ అభ్యర్థికి 5 వందలలోఓట్లు వచ్చాయి. సికిందరాబాదు పార్లమెంటు సీటుకు పోటీచేసిన జగన్నాథంగారికి చాలా తక్కువ ఓట్లు వచ్చాయి. ఒకక్రొత్త ఆలోచనను, భావాన్ని ప్రజల దృష్టికి తెచ్చామనే సంతృప్తి కలిగింది

# ప్రజాస్వామ్య ఉద్యమం - 2

1980 పార్లమెంటు ఎన్నికల సందర్భంగా ఒక ఆసక్తిదాయకమైన సంఘటన జరిగింది. 1977లో ఇందిరాగాంధి కాంగ్రెసు పార్టీ ఘోర పరాజయం పొందినదని మనకు తెలుసు. ఆమె కూడా ఓడిపోయారు. అయితే ఆమె మొండి మనిషి కనుక - అందరు పేరుప్రఖ్యాతులు సంపాదించిన నాయకులూ మొండివారే అలా ఉండలేని వారు అగ్రాతి అగ్రనాయకులు కాలేరు - మరల అధికారానికి రావడానికి సంకల్పించి పట్టుదలగా పనిచేశారు మొరార్జీ దేశాయి ప్రధాన మంత్రిగా వున్న జనతా ప్రభుత్వం కేంద్రంలో పడిపోయింది తరువాత భాతర రిపబ్లికు అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డిగారి ధర్మమా అని ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన రైతు నాయకుడు శ్రీ చరణసింగు లోక్‌సభ విశ్వాసాన్ని ఆశించకుండానే రాజీనామా చేశారు. ఎన్నికలు తప్పనిసరి అయినాయి. ఆమె గ్యారంటీగా గెలిచే నియోజకవర్గం అవసరమయింది. 1977 ఎన్నికలలో 42 మందిలో 41 మంది ఆమెపార్టీ వారిని ఎన్నుకున్న ఆంధ్రప్రదేశ్ కన్న ఆమెకు బలమున్న రాష్ట్రం కనబడలేదు మెదక్‌లో లోక్‌సభ నియోజకవర్గం నుండి ఆమె పోటీచేయా ని నిర్ణయింపబడింది. పాత కాంగ్రెసు పార్టీవారు శ్రీ కరణం రామచంద్రారావును ఆమెకు వ్యతిరేకంగా అభ్యర్థిగా ఎంపిక చేశారు. అది సర్వశ్రీ కె.జి. కన్నబిరాన్, కె. ప్రతాపరెడ్డి, కేశవరావ్ జాధవ్(సోషలిస్టు నాయకుడు, లోహియా సహచరుడు అనుచరుడు)లకు నచ్చలేదు. శ్రీ రామచంద్రారావు ఇందిరాగాంధికి సమదీటులయిన అభ్యర్తికాడని వీరి నమ్మకం ప్రతాపరెడ్డిగారి యింటిలో మంతనాలు సాగిస్తున్నారు. యాధృచ్ఛికంగా ఆ సమయములో రెవరెండు ఎం.ఎ థామస్(క్రైస్తవ మత గురువు, జాతీయవాది, దేశభక్తులు, ఎమర్జెన్సిని వ్యతిరేకించి పౌరహక్కుల ఉద్యమానికి ఎనలేని సేవ చేసినవారు, 'భారతదేశాన్ని జాగరూకతతో కాపాడే సంస్థ' (విజిల్ ఇండియా) స్థాపక అధ్యక్షులు, పి.యు.సి.ఎల్ లో చే స్వేచ్ఛా పిపాసి) హైదరాబాదులో ఉండటం తటస్థించింది. వీరు నలుగురు మెదక్ నియోజకవర్గంలో ఇందిరాగాంధికి వ్యతిరేకంగా పోటీ చేయతగిన అభ్యర్థి కొరకు అన్వేషణ సాగిస్తున్నారు. శ్రీ జయపాల్ రెడ్డి తగిన అభ్యర్థియని వారికి తోచింది(ఈనాడు జనతాపార్టీకి రాజ్య సభలో నాయకుడుగా వున్నవారు. ఈయనను శ్రీ రామచంద్రారావు స్థానే ఇందిరా గాంధీకి వ్యతిరేకంగ [illegible] షను' వేయమని కోరారు ఆయన - ఏ కారణం చేతనో - నిరాకరించారు. [illegible] గురు మిత్రులు తీవ్ర సమాలోచనకు దిగారు ఒకరోజు రాత్రి ఒంటిగంటకి నన్ను పి [illegible] ్మనమనే కబురుతోపాటు మిత్రుడు కె. ప్రతాపరెడ్డి కారు మా యింటికి వచ్చింది. అంత అర్జంటు పని ఏమిటో తెలియక విస్తుపోయాను. ప్రతాపరెడ్డిగారి యింటికి చేరాను. అక్కడ మిత్రులు సమావేశంలో వున్నారు "మీరు ఇందిరాగాంధీతో మెదక్

లోక్‌సభ నియోజక వర్గంలో పోటీకి దిగాలి" అని ఒక మిత్రుడు - ప్రతాపరెడ్డి, కన్నభిరాన్ గారలతో ఎవరో ఒకరు - పలికాడు ఆశ్చర్యం నుండి తేరుకున్నాను. అప్పటికి వోటర్ల సమ్మతుల సందర్భంగా సదస్సు జరగటం, సర్వశ్రీ చుండి జగన్నాథం, మల్లాది సుబ్బమ్మల అభ్యర్థిత్వాలు ఖరారుకావటం జరిగిపోయింది నేను మిత్రులకు అభివందనాలు తెలిపి వారి కోరికను మన్నించలేనని సవినయంగా మనవి చేశాను (తరువాత తెలిసింది నా పేరు సూచించింది రెవరెండు ఎం ఎ థామస్ గారని) తరువాత సంఘటనలు చకచకా జరుగసాగినయి మిత్రుల సమాలోచనల ఫలితంగా వారు - రెవరెండు థామస్ తప్ప మిగతా ముగ్గురూ - మెదక్‌లో నామినేషన్లు వేసేటట్లు, ఆలోచించి వారిలో ఒకరిని అభ్యర్థిగా తరువాత ఎంపిక చేసేటట్లు నిర్ణయమయిందట. వారు ముగ్గురూ చివరిరోజు మధ్యాహ్నం 2.30 గంటలకు నామినేషన్లు వేశారు మధ్యాహ్నం మూడు గంటలకు నామినేషన్ల ఘట్టం పరిసమాప్తి కాబోతున్నసమయంలో గం 2 55 నిమిషాలకు శ్రీ జైపాలరెడ్డి నామినేషన్ పడింది. వారంతా అబ్బురపడినారు. నామినేషన్ల ఉపసంహరణ తేదీన సర్వశ్రీ కె ప్రతాపరెడ్డి, కె జి కన్నబిరాన్ గారలు - వీరి మధ్య వచ్చిన అంగీకార ఫలితంగా రంగం నుండితప్పుకున్నారు శ్రీ జాథవ్ పోటీకి సమాయాత్తమవుతున్నారు. శ్రీ చరణ్ సింగ్‌ను సంప్రతిస్తే "మీరు ఎంతధనాన్ని వెచ్చించ గలరు?" అని జాథవ్‌ను ప్రశ్నించారట ఆ ప్రశ్న అసంబద్ధంగా తోచింది జాథవ్‌కు ఆయనకు మనఃక్లేశం కలిగింది ఉపసంహరణ తేది నుండి నాలుగు అయిదు రోజులు గడిచాయి. జాథవ్ పోటీ నుండి విరమించాలని నిర్ణయం జరిగింది శ్రీ జైపాల్ రెడ్డి ఒక్కరే బరిలో - ఇందిరా గాంధీ ప్రత్యర్థిగా వున్నారు ఆయనకు లక్షకు పైగా ఓట్లు వచ్చాయి సకాలంలో నామినేషను ఉపసంహరించనందున 'లా' ప్రకారం పోటీలో వున్న - తదుపరి ఆయన ప్రచారం చేయకపోయినా - జాదవ్‌కు 50 వేల పైచిలుకు ఓట్లు వచ్చాయి. ఇందిరాగాంధీకి అఖండ విజయం లభించింది ఆమె మరల భారతదేశ ప్రధానమంత్రి అయినారు. ఆం.ప్ర జనతంత్ర సమాజ్ మహాసభను హైదరాబాదులో ఒస్మానియా హాలులో జరిపాం. మిత్రులు -సర్వశ్రీ ప్రతాపరెడ్డి, కె.జి. కన్నబిరాన్, కాళోజీ సోషలిస్టులు- అంతా సహకరించారు సభ జయప్రదమైంది. సభ ప్రజల దృష్టిని ఆకట్టుకున్నది. క్రొత్తవారు ఉద్యమంలోకి వచ్చారు.

జయప్రకాష్ ఉండగా సర్వోదయ నాయకులు జనతంత్ర సమాజకు అండగా నిలబడ్డారు. అందులో సర్వశ్రీ సిద్ధరాజ్ దఢ్డా, ఠాకూర్ దాస్ భంగ్, గోవిందరావు దేశపాండే జనతంత్ర సమాజ్ జాతీయ సమితిలో ఉండేవారు సంస్థ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనేవారు జయప్రకాశ్ మరణానంతరం శ్రీ వి ఎం తార్కుండే జనతంత్ర సమాజ్, అఖిల భారత అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. మరికొన్ని సంస్థలు అలాంటివి ఉద్భవించాయి వారు తార్కుండే దగ్గరికి వచ్చి

ఈ సంస్థలన్నింటికీ ఒక సమన్వయ సంఘం వేయాలన్నారు. 'ప్రజాస్వామ్యాన్ని' బలపరిచే ప్రజాస్వామ్య సమన్వయ సమితి' (కో-ఆర్డినేషన్ కమిటి ఫర్ స్ట్రెంతనింగ్ డెమోక్రసీ) ఢిలీలో ఏర్పడింది. దానికి తార్కుండేనే అధ్యక్షులుగా ఉండమని కోరారు. ఆయన అంగీకరించారు ఈ సంఘటన జరిగే ముందు ఢిల్లీలో లేని జనతంత్ర సమాజ్ కార్యకర్తలలో ఆయన సంప్రతించలేదు. ఆ అంశం నన్ను కలవర పరిచింది తార్కుండే సహృదయుడు. అందరినీ కలుపుకోవాలనే ఆదుర్దా కలవాడు. అతని తాపత్రయాన్ని - మంచి అర్ధంతో తీసుకోవాలి. తదితరులు వాడుకుంటున్నారని నాకు తోచింది. నిజానికి 'పీపుల్స్ కమిటీ' స్వరూప స్వభావాలను సర్వోదయ నాయకులు సరిగా అకలింపు చేసుకోలేదని - నాదృష్టిలో - నా భావం. ప్రజా కమిటీల నిర్మాణం క్రింది నుండి - గ్రామ స్థాయి నుండి, పట్టణాలలో పేటల స్థాయి నుండి - జరగాలని హ్యూమనిస్టుల ఆలోచన. సర్వోదయ నాయకులు పైనుండి కార్యక్రమానికి ఉపక్రమించారు. సర్వోదయ నాయకులు 'పీపుల్స్ కమిటీ' సరిగా పనిచేయలేదని నా విశ్వాసం వారికి అలాగే తోచిందేమో తరువాత వారు మరొక 'ఆలిండియా పీపుల్స్ కమిటీ'ని వేశారు. ఆ తరువాత కొంత కాలానికి 'లోక్ స్వరాజ్' అనే సంస్థను స్థాపించారు. ప్రజాస్వామ్యమును - గాంధీజీ, జయప్రకాష్ నారాయణులు ఆశించిన దానిని - నెలకొల్పడానికి వీలయితే ఎన్నికలలో పోటీ చేయటం, చేయించటం దాని లక్ష్యాలలో చోటు చేసుకుంది. అందులో శ్రీ. కె. ప్రతాపరెడ్డికి కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో ప్రముఖ స్థానం లభించింది. 'విజిల్ ఇండియా'కు ఆయన భారతదేశ స్థాయిలో కోశాధికారి అయినాడు. ఢిల్లీలో తార్కుండే అధ్యక్షతన జరిగిన సమావేశంలో ఎన్నికలలో - ప్రజాస్వామ్య విధానాన్ని బలపరిచే నిమిత్తం - అభ్యర్ధులను నిలబెట్టాలనే ఆలోచన వచ్చింది. బీహారులో గ్రామీణ ప్రజలలో విశేషంగా శ్రమిస్తున్న సర్వోదయ నాయకులు ఆచార్య రామమూర్తి సహితం వెనుకంజవేశారు. ఏదయినా సర్వోదయ నాయకులు 'లోక్ స్వరాజ్' ఆలోచనలు కార్యరూపం తాల్చలేకపోయాయి. ఇపుడు వారు స్వదేశీ ఉద్యమాన్ని చేపట్టారు. బహుళార్ధ పెట్టుబడిదారీ సంస్థల ప్రవేశాన్ని వ్యతిరేకిస్తున్నారు.

తార్కుండే తరువాత ప్రఖ్యాత పత్రికా రచయిత (ఎమర్జెన్సీలో డెటిన్యూ, ప్రజాస్వామ్యవాది మాజీ పత్రికా సంపాదరకుడు) శ్రీ కులదప్ నయ్యర్ జన తంత్ర సమాజ్‌కి అధ్యక్షుడిగా ఎన్నుకోబడినారు. అయనే ఇప్పటికీ ఆ పదవిలో కొనసాగుతున్నారు. శ్రీ ఎన్ డి. పాంచోలీ ప్రధాన కార్యదర్శి. పంజాబ్ దురంతాల నివేదికను దేశానికి సమర్పించిన సందర్భంలో ఆయనను కేంద్ర ప్రభుత్వం అరెస్టు చేసింది. జనతంత్ర సమాజ్ కాశ్మీర్‌పై యిచ్చిన ప్రధమ నివేదిక పౌర హక్కుల ప్రజాసమితితో కలిసి యిచ్చినది. రెండవ నివేదిక (1994) సమర్పించిన ఉపసంఘంలో సర్వశ్రీ తార్కుండే, కులదీప్ నయ్యర్, ఎన్‌డి. పాంచోల్ తదితరులు సభ్యులు. ప్రధమ నివేదిక కాశ్మీర్

పండిట్‌లను గురించి పట్టించుకోనందున విమర్శలకు గురి అయింది. దానిని గురించి పౌరహక్కుల ఉద్యమ సందర్భంగా రాస్తాను. ప్రజాస్వామ్యం ప్రమాదంలో ఉన్నప్పుడల్లా జనతంత్ర సమాజ్ చురుకుగా వ్యవహరించింది. ఇందిరాగాంధి మరణానంతరం 1984లో జరిగిన శిక్కుల ఊచకోత సందర్భంగా జనతంత్ర సమాజ్ తార్కుండే అధ్వర్యంలో అలాయిదాగా - పౌర హక్కుల ప్రజా సంఘంతో కలవకుండా - నివేదిక సమర్పించింది. అస్సాంపై ఆ సంస్థ నివేదిక గమనార్హం.

1984 ఎన్నికలలో జనతంత్ర సమాజవ్ ఆం.ప్ర. శాఖ ఓటర్లను జాగృతం చేసే సంస్థ ప్రకటనను తెలుగుచేసి ప్రజలకు పంచిపెట్టింది. శ్రీ కె. ప్రతాపరెడ్డి అనేక సంవత్సరాలు ఆం.ప్ర శాఖకు అధ్యక్షులుగా వున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో హ్యూమనిస్టులు రాష్ట్ర మహా సభలకు హాజరవుతున్నా, రాష్ట్ర కార్యనిర్వాహక వర్గంలో సభ్యులుగా వుంటున్నా జిల్లా శాఖల నిర్మాణంలో, రాష్ట్ర స్థాయి అధికార పదవులను చేపట్టడంలో శ్రద్ధాసక్తులు కనబరచలేదు. అది శోచనీయం. అనేక ఉద్యమాలలో హ్యూమనిస్టు, హేతువాద, పౌరహక్కుల, ప్రజాస్వామ్య - ఒకేసారి క్రియాశీలకంగా పాల్గొనలేకపోవడం కారణం కావచ్చు. లేక రాజకీయ కార్యక్రమాలను ఎత్తుకుంటున్న జనతంత్ర సమాజ్తో మమేకం కావటం యిష్టంలేక కావచ్చు. ఏదయినా ఈ విషయంలో నా వైఫల్యాన్ని అంగీకరించడం తప్పనిసరి.

# పత్రికా ప్రచురణ

1973 మే నుండి ప్రజా కార్యక్రమాలకు - యించుమించుగా - పూర్తికాలాన్ని నేను వినియోగిస్తుండటంతో నా పని పెరిగింది. హ్యూమనిస్టు పత్రిక 'సమీక్ష' ఆగిపోయింది. నేను పత్రికను స్థాపించాలని ఉద్దేశించాను. సుబ్బమ్మగారితో ఈ విషయం ప్రస్తావించాను. ఆమె నా ప్రతిపాదనకు సంతోషంగా సమ్మతి తెలిపారు. పత్రికను 'వికాసం' అనేపేరుతో విజయవాడ నుండి ప్రచురించాలని, సుబ్బమ్మగారు పబ్లిషరుగా, ప్రింటరుగా ఉండాలని, అది నా సంపాదకత్వంతో వెలువడాలని నిర్ణయించాం. పత్రికకు మచిలీపట్నంలోని కృష్ణాజిల్లా కలెక్టరు కార్యలయములో 'డిక్లరేషను' ధాఖలు చేశాం పత్రిక 1/4 క్రౌను సైజు. పుటలు 32. నాకు వ్యాసాలు రాయడం చేతనవును కాని పత్రికలు నడపడంలో అనుభవంలేదు ఇతరులు నడిపిన 'రాడికల్ హ్యూమనిస్టు', 'సమీక్ష' లాంటి తెలుగు పత్రికల సంపాదక వర్గాల సభ్యుడిగా మాత్రమే ఉన్నాను. ప్రథమంలో మూడు నాలుగు సంచికల వరకు మిత్రుడు సి నరసింహారావు (భావుకుడు, నవలా రచయిత, తరువాత గ్రంధకర్త, మానసిక విజ్ఞాన మాసపత్రిక 'రేపు' సంపాదకుడు, ప్రచురణ కర్త, ఎంతో ప్రసిద్ధిగాంచిన 'వ్యక్తిత్వ వికాసం' అనేపేరుగల పుస్తకం రాసిన రచయిత) సహాయం పొందాను. శీర్షికలు, ఉపశీర్షికలు పెట్టడం, వ్యాసాల మధ్య వ్యాసాల ముఖ్య వాక్యాలను ఉటంకించడం, 'ప్రూఫులు' దిద్దటం వీటన్నింటిని అతడు దగ్గర వుండి నేర్పాడు. వ్యాసాల ఎంపిక విషయం కూడా అతనితో చర్చించేవాడిని. 'ప్రజాస్వామ్య పథంలో' , 'దిన పత్రికల తీరుతెన్నులు', 'సినిమా', 'రేడియో', 'మహిళా లోకం', సాహిత్యం, 'లైంగిక విజ్ఞానం' యిలాంటివి పత్రికలోని విషయ విభాగాలు. ఒక్కొక్క విభాగాన్ని ఒక్కొక్కరు నిర్వహించేవారు శ్రీ ఇన్నయ్య పరిచయం చేసిన సర్వశ్రీ సి ధర్మారావు (సాహితీవేత్త, విమర్శకులు, సహృదయులు), డా॥ యాదగిరిరెడ్డి (ఆనాటికే ఉస్మానియా విశ్వవిద్యాలయ మానసిక శాస్త్ర శాఖ రీడరు) వరుసగా 'సినిమా', 'లైంగిక విజ్ఞానం', 'కాలం'లను నడిపేవారు. 'దినపత్రికల తీరుతెన్నులు' విభాగానికి మిత్రుడు పోలు సత్యనారాయణ బాధ్యత వహించేవారు. సుమారు ఆరుమాసాలు 'మహిళాలోకం' శీర్షిక క్రింద శ్రీమతి వి. కోమల వ్యాసాలను రాసేవారు. అందుచేత పత్రికలో వైవిధ్యం ప్రతిభ గోచరించేది.

1974 నవంబరులో పత్రిక ప్రథమ సంచికను శ్రీమతి హేమలతా లవణం ఆవిష్కరించారు. మేము 1977లో హైదరాబాదు రాగానే పత్రికను హైదరాబాదుకు తరలించాం ఎమర్జెన్సీ రోజుల్లో పబ్లిషరుగా వున్న సుబ్బమ్మగారు మేనేజింగు ఎడిటరుగా వ్యవమరించేవారు సంపాదకుడిగా నా పేరును తొలగించలేదు. 1975 సం॥ మధ్య కాలం నుండి ఆమె 'మహిళా లోకం శీర్షికను

నిర్వహించారు  పత్రిక తాలూకు అన్ని పనులు తానే చూస్తూ మిత్రుడు సి.హెచ్ రాజరెడ్డి సాయంతో పత్రికనుసమర్థవంతంగా నడిపారు  జైలునుండి బయటికి వచ్చిన తరువాత పత్రిక బాధ్యతను నేను స్వీకరించాను. కొన్ని సంవత్సరాలు చాలా జాగ్రత్తగా నడిపాను. తరువాత సుబ్బమ్మగారు, నేను అనేక యితర కార్యక్రమాలను చేయపూనటంతో, నేను భారత దేశంలో పలు పట్టణాలకు పర్యటనల సందర్భంగా వెళ్తుండటంతో నేను పత్రికపై పూర్తి శ్రద్ధను ప్రదర్శించలేకపోయాను. అంతేగాక చాలామంది చందాదారులు తమ చందాలను కొనసాగించలేదు మొదట్లో మా స్నేహితులు, బంధువులు మా కోరిక మీద అనేక మందిని చందాదారులుగా చేర్పించారు. తరువాత మేము వారిని సహాయం చేయమని ప్రత్యేకంగాకోరటం జరుగలేదు. వారూ ఉత్సాహం చూపలేదు. తెనాలిలోని హ్యూమనిస్టులు గురజాల సీతారామయ్య, పి అచ్చుతరామ్, ఎం. బసవపున్నారావు ప్రభృతులు పత్రిక ఆగిపోయే సంవత్సరం క్రితం వరకు దానికి చందాదారులను చేర్చించారు.

పత్రికకు ఎక్కువగా వ్యాపార ప్రకటనలు ఉండవని తెలిసి సానుభూతిపరుల ధనసహాయాన్ని ఆపేక్షించాను. 'రినైజాన్సు సమితి' అనే సంస్తను స్థాపించి దాని మద్దతును పత్రికకు యిచ్చాం. మిత్రులు కోగంటి రాధాకృష్ణమూర్తి, కొల్లా సుబ్బారావు, ఆవుల సాంబశివారావు, గుంటుపల్లి గోపాలకృష్ణయ్య, మా దంపతులు, గోరంట్ల రాఘవయ్య, గురిజాల సీతారామయ్య ప్రభృతులం విరాళాలను అందించాం  పత్రిక విజయవంతంగా నడవకపోవటానికి ముఖ్య కారణం దాని స్వభావమే. పత్రికలో ఈనేక ఉద్యమ వార్తలకు, వాటిని గురించిన వ్యాసాలకు చోటువుండేది. మానవవాదం, పౌరహక్కులు, ప్రజస్వామ్యం, మహిళా జాగృతి, హేతువాదం, జ్ఞాన పునర్వికాసం, సున్నిత హాస్యం, సాహిత్యం, కళలు ఈ అంశాలన్నింటికి పత్రికలో అవకాశం ఉండటం పత్రిక ప్రత్యేకత. అదే దాని బలం, బలహీనత కూడాను. తమాషా ఏమంటే మనిషి సంపూర్ణ మానవ వ్యక్తిగా ఎదగడానికి పత్రిక ఉపకరించేది  పాక్షిక దృక్పథం కలవారు, ఏదో ఒక్క అంశం మీదనే దృష్టిని కేంద్రీకరించి పనిచేసేవారు ఈ 'వికాసం' పత్రిక తమది కాదని తలచేస్థితి వచ్చింది. పత్రిక బాగానే ఉంటున్నదని అందరు అనేవారు గాని దానిని తమదిగా చేసుకోవడానికి పలువురు ప్రజోద్యమ కార్యకర్తలు ముందుకు వచ్చేవారు కాదు.  ఇలా 1982 చివరిలో పత్రికను నిలిపివేయాల్సివచ్చింది

పత్రికను విశాల దృక్పథంతో నడిపేవాళ్ళం  భిన్నాభిప్రాయ ప్రకటనలకు అవకాశం యిచ్చేవారం. సుబ్బమ్మగారి గోరాగారి ప్రశంస,మిత్రుడు ఎన్.వి. బ్రహ్మం గోరాగారిని విమర్శిస్తూ రాసిన వ్యాసం, 'రాయిజాన్ని తిరగరాయాలి' అన్నశీర్షిక క్రింద శ్రీ ఇన్నయ్య వ్యాసాలు, వాటికి శ్రీ రావిపూడి వెంకటాద్రి ఇచ్చిన సమాధానాలు యిలాంటి వాటికి 'వికాసం' పత్రికలో చోటు

యివ్వబడేది. సత్యాన్వేషణ, స్వేచ్ఛా పిపాస పత్రిక ముఖ్య లక్ష్యాలుగా ఉండేవి.

'వికాసం' పత్రిక ఆగిపోవటం సుబ్బమ్మగారి వ్యథకు కారణమయింది. మరల పత్రికను ప్రచురించాలని ఆమె తలపోయసాగారు చివరకు 1989 'స్త్రీ స్వేచ్ఛ' అనే పేరుతో మాసపత్రికేను నెలకొల్పారు. సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్ (కధకులు, నవలా రచయిం్త్రి, గ్రంధ కర్త, పత్రికా రచయిత, యిటీవల వారి నవల కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందినది) ప్రథమ సంచికను ఆవిష్కరించారు. పత్రిక ప్రింటరు, పబ్లిషరు, సంపాదకులు శ్రీమతి మల్లాది సుబ్బమ్మయే. దానిని క్రమం తప్పకుండా ప్రతి నెలా ప్రకటిస్తున్నారు 'స్త్రీ స్వేచ్ఛ' పత్రిక ఆమె నడిపే సంస్థల వార్తలకు, మహిళా సమస్యలకు, ఉద్యమాల సమాచారానికి, మహిళా ప్రబోధానికి ప్రాముఖ్యతనిస్తున్నది నాకు మహిళోద్యమంపై గల ఆసక్తి, అభిమానం వల్ల నేను ఆమెకు అప్పుడప్పుడు పత్రికా నిర్వహణలో సాయం చేసేవాడిని.

# గ్రంథ ప్రచురణ

వామపక్ష ఉద్యమాలను నేను శ్రద్ధగా పరిశీలించేవాడిని. వాటి సిద్ధాంతాలను అధ్యయనంచేస్తుండేవాడిని. అవి చేసిన మంచి పనులను నేనూ నెరవేర్చాలని ఆశించేవాడిని. 'విశాలంధ్ర పబ్లిషర్సు' 'ప్రజాశక్తి బుక్ డిపో'ల వలె పుస్తక ప్రచురణ చేయాలని ఆశించేవాడిని అలాంటి కార్య చేపట్ట కలనా అని సందేహ మనస్కుడను అయ్యేవాడిని. ఏదయినా ఊరక ఆలోచిస్తూకూర్చుంటే ఏమీ చెయ్యలేమని భావించి నా ఆలోచనలను మిత్రులకు ఎరుకపరిచాను. అంతకు క్రితం రెండు మూడు చిన్న పుస్తకాలను అచ్చువేయించాము కనుక ఆ విషయంలో నా ఆసక్తిని గమనించారు మిత్రులు. 'హ్యూమనిస్టు రాజకీయాలు', 'రాడికల్ హ్యూమనిజం . సిద్ధాంతం, ఆచరణ' అనేవి ఎం.ఎన్ రాయ్ ఉపన్యాసాలు వాటిని ఆ క్రమంలో మిత్రులు ఎన్ వి. బ్రహ్మం, సిహెచ్ రాజారెడ్డిగారలు ఆంగ్లం నుండి అనువదించారు. 'హ్యూమనిస్టు ఆర్థిక విధానం' అనే చిన్న పుస్తకం 1956లో జరిగిన అధ్యయన శిబిరపు ఆలోచనల సంపుటి. దీనిని శ్రీ రావిపూడి వెంకటాద్రి తెలుగు సేత చేశారు శ్రీ మూకందిలాల్ రచించిన 'గోపూజ' అనే పొత్తమును తెలుగులోకి తర్జుమాచేసి ప్రచురించడము జరిగింది. మిత్రుడు కొల్లా సుబ్బారావు తన స్వంత ఖర్చుతో తన రచన 'హ్యూమనిస్టు విద్యా విధానం' అనే పుస్తకాన్ని అచ్చు వేశాడు 'గతి తార్కిక భౌతిక వాదం' అనేపేరు గల గ్రంథాన్ని శ్రీ రావిపూడి ప్రతిభావంతంగా రాసి వెలుగులోకి తెచ్చాడు. 'రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ రద్దుకు పూర్వం చాలా సారస్వతం బయటికి వచ్చింది. శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి రచించిన 'ఇండియాలో విప్లవం' అనువదించిన 'ఎం.ఎన్.రాయ్' వ్యాసాలు, శ్రీ ఎ.వి. మోహన్ అనువదించిన 'పిల్లి ఆత్మకథ' (ఎం.ఎన్ రాయ్ రచన), శ్రీ కోగంటి సుబ్రహ్మణ్యం అనువదించిన ఎం.ఎన్.రాయ్ ఉపన్యాసం 'యుద్ధానంతర భారతదేశం', శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి తర్జుమా చేసిన 'మధ్యతరగతి' (ఎలెన్ రాయ్ రచన), 'కలకత్తా మహాసభ', 'నవ్యమానవ వాదం' (ఎం.ఎన్.రాయ్ రాసింది) అలాంటివి. సాహిత్యంలో హ్యూమనిస్టుల రచనల సంగతిని గురించి ప్రస్తావించటం లేదు. హ్యూమనిస్టు సారస్వతాన్ని ప్రజలకు అందుబాటులోకి తీసుకొని రావడానికి మిత్రులం అంగీకరించాం. దానికొక సంస్థకావాలని తీర్మానించాం ఆ సంస్థ స్వరూపంపై చర్చించాం ధర్మ సంస్థలను 'ట్రస్టు' ఏర్పాటు చేద్దామని నేను సూచించాను. శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తికి (ఆయన ఎప్పటినుంచో 'ప్రజాసాహిత్య పరిషత్తు'), 'కవిరాజా పబ్లిషర్స్' అనే పేర్లతో గ్రంథాలను ప్రచురించిన అనుభవం వుంది అదీగాక 'సరళా పబ్లికేషన్సు' ఆయన సంస్థయే. ఆ పేరుతో ఆయనకు తెనాలిలో పుస్తకాల దుకాణం కూడా కలదు. 'లిమిటెడు కంపెనీ' పెడితే బాగుంటుందని ఆయన అన్నారు. పెట్టుబడిదారి పద్ధతికీ కమ్యూనిజానికి ఈ రెంటికీ ప్రత్యామ్నాయంగా హ్యూమనిస్టులు సహకార ఆర్థిక విధానాన్ని సూచిస్తుండగా కంపెనీని

స్థాపించడం అనుచితమని నాకు తోచింది. అయినా అనుభవం, బాధ్యతకల మిత్రుడు చెప్తున్నందున నేను అంగీకరించాను. 'ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్' అనే పేరుతో షేరు ఒక్కింటికి రూ.500 ల చొప్పున లక్షరూపాయల పెట్టుబడితో 1974లో కంపెనీని రిజిష్టర్డు చేశాం. 5 షేర్లు వున్న వ్యక్తి డైరెక్టరుగా వుండటానికి అర్హులని రాశాం. అలా 5 షేర్లు తీసుకున్న సర్వశ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి, గురిజాల సీతారామయ్య, గుంటుపల్లి గోపాలకృష్ణయ్య, మాదంపతులు ఇరువురము డైరెక్టర్లము శ్రీ కొల్లా సుబ్బారావు ఒక షేరు తీసుకున్నారు. మిత్రుడు గుంటుపల్లి గోపాలకృష్ణయ్య 1942 నుండి నాకు పరిచయం. అతనిది ఇంకొల్లు. అప్పటి నుండి ఎం.ఎన్.రాయ్ అనుచరుడు (ఇపుడు అతడు కీర్తిశేషుడు) డైరెక్టర్ల బోర్డుకు నేను అధ్యక్షుడిని. శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి మేనేజింగ్ డైరెక్టరు. ఆయన రచించిన 'ఎం.ఎన్ రాయ్ జీవితం : సాహిత్యం' అనే గ్రంధాన్ని ప్రధమ గ్రంథంగా వెలువరచటానికి అంగీకరించాం. శ్రీ రావిపూడి తెనుగు చేసిన 'ఫాసిజం', శ్రీ భట్టిప్రోలు మనుమంతరావు(తరువాత డాక్టర్ హనుమంతరావు, ఆయన యీనాడు మన మధ్యలేరు) ఆంధ్రీకరించిన 'మానవ నాగరికత'(రెండూ ఎం.ఎన్ రాయ్ రచనలే) ప్రచురించాం ఇవన్నీ ప్రజాస్వామ్య ప్రచురణలు ప్రయివేట్ లిమిటెడ్ తరపున వెలువడినాయి. నవ్యమానవ వాద సూత్రాలు 1946 రాడికల్ డెమోక్రాటిక్ మహా సభలో ఆమోదింపబడి 1948 కలకత్తాలో పార్టీ రద్దు అయిన తరుణంలో సవరణకు లోనయినవి. 'నవ్యమానవ వాదం' అనేపేరు గల గ్రంథం మొదట్లో 1947లో వచ్చింది. దానిని ఎ.జి.కె. అనువదించాడు కదా! 1948లో రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ అవతరణ తర్వాత ఆ గ్రంథం సవరణకు లోనయి మరో కూర్పుగా వచ్చింది. సవరణ చేయబడిన కలుపబడిన భాగాలు నేను తెలుగులో రాసాను. నన్ను ఎ.జి.కె.ను అనువాదకులుగా పేర్కొంటూ ఆ గ్రంధాన్ని కంపెనీ అచ్చువేసింది. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ గ్రంథాలు 'మనం దేనికి బానిసలం?', 'తల్లే పిల్లను చంపితే', 'విముక్తి ఉద్యమాలు మహనీయులు' ఆమె ఖర్చుమీద కంపెనీ పేరుతో వేశాం. ఆ మూడు పుస్తకాల సంపుటి 'ఆధునిక స్త్రీ' అనే పేరుగల దానిని కూడా కంపనీయో ముద్రించింది. అలాగే నా రచన 'ఎమర్జెన్సీ జైలు అనుభవాలు' ప్రచురణ యోగ్యమయింది. దాని ఖర్చు నేను భరించాను.

మిత్రుడు వెంకటాద్రి స్వంతంగా వెలువరుస్తున్న 'ఎం.ఎన్.రాయ్ : కమ్యూనిస్టులు' అనే ఉద్గ్రంథాన్ని కంపెనీ పేరుతో వేశాడు. ప్రతి గ్రంథంలోనూ ప్రచురణ సంస్థ లక్ష్యాలను హ్యూమనిస్టు తత్వాన్ని, సిద్ధాంతాన్ని తెలియపరచే 'పరిచయం' ఉండేది డైరెక్టర్ల పేర్లు 5, ఏకైక 'షేరు హోల్డరు' శ్రీ కొల్లా సుబ్బారావు పేరు వెరసి 6 పేర్లు ఆ 'పరిచయం' క్రింద వుండేవి.

కంపెనీ పేరుతో గ్రంథాలను ప్రచురిస్తున్న సందర్భంలో సుబ్బమ్మగారి పుస్తకాలను విక్రయించే సందర్భంలో ఒకే సంస్థ పేరుతో పుస్తకాలను కొనుగోలు చేయడానికి జిల్లా

గ్రంథాలయ సంస్థల కార్యదర్శులు వెనుకాడటం గమనించాం. అపుడు ఆమె 'మల్లాది పబ్లికేషన్సు' అనే పేరుతో గ్రంథాలను అచ్చువేయడం ఆరంభించారు. మిత్రుడు కోగంటి రాధాకృష్ణమూర్తి స్వంత రచన 'గాంధీ మార్గం' అనే గ్రంథాన్ని కంపెనీ పేర వేయటంతో యిక కంపెనీ వేరే గ్రంథాలు వేయటానికి పైకం లేకపోయింది. ఈ సందర్భంలో కంపెనీ వేరే క్రొత్త పుస్తకాలను వెలువరించడం ఆగిపోయింది. ఎన్నో ఆశలతో ప్రారంభించబడిన ప్రయత్నం యిలా అర్థవంతంగా ముగిసిపోయింది. ఇప్పటి ఆ గ్రంథాల ప్రతులు నిల్వలో ఉన్నాయి.

శ్రీ ఇన్నయ్య ప్రోద్బలంతో 'ప్రత్యేక ఆంధ్రోద్యమం', 'జిల్లెల్ల మూడి అమ్మ: తస్మాత్‌జాగ్రత్త' రాసాను. వాటిని ఇతరులు ముద్రించారు. శ్రీమతి సుబ్బమ్మ తన అనేక రచనలను ప్రచురించుకుంటూ నావి ఏమీ లేకపోతే బాగోలేదని తలంచి నా వ్యాసాల సంకలనాలను రెండింటిని 'ఆలోచనా తరంగాలు', 'భావ వీచికలు' అనే శీర్షికలు కలవాటిని వెలుగు చూపించారు.

# మహిళోద్యమం

1941, 1942 సంవత్సరాలలో నేను బెనారస్ విశ్వవిద్యాలయంలో చదువుతున్నప్పుడు విద్యార్థి ఉద్యమంలో యువకులు చురుకుగా పాల్గొనడం చూచిన నాకు ఉద్యమాలలో మహిళల ప్రవేశమూ ప్రమేయము అవసరమనే భావం కలిగింది 1944లో కలకత్తా రాడికల్ పార్టీ మహా సభకు వెళ్లినపుడు పార్టీ కార్యకర్తలుగా వున్న మహిళలను చూచి అబ్బురపడే వాడిని. జవహర్ లాల్ నెహ్రూ సోదరి విజయలక్ష్మి పండిట్ ఉన్నతోన్నత పదవులను అధిష్టించడం గమనించి ఆమె మీది గౌరవంతో నా ఏకైక కుమార్తెకు ఆమె పేరు పెట్టాను. ఇలా మహిళలు ప్రజా జీవితంలో ప్రవేశించాలని కోరుకునేవాడిని. కాని నా తల్లి తండ్రులు హిందూ సనాతన ధర్మావలంబనులు అవటం చేత - నేను వారికి ఒక్కడినే సంతానం కనుక- నా సతీమణి వెంకట సుబ్బమ్మ నావలె మార్క్సిష్టు తత్వాన్ని వంట బట్టించుకుంటే కుటుంబంలో కలతలు వస్తాయని నా ఆశలను చంపుకున్నాను. నిజానికి ఆమెను ప్రోత్సహించలేదు. బాపట్ల స్థానిక మహిళా సంస్థలలో బాపట్ల స్త్రీల గృహ పారిశ్రామిక సహకార సంఘం, స్త్రీ హితైషిణీ మండలులలో ,వరసగా కార్యదర్శి, సహాయ కార్యదర్శి, కార్యదర్శి పదవులను చేపట్టినపుడు ఆమె తను 1937లో మానివేసిన చదువును మరల ప్రారంభిస్తానని సంకల్పిస్తే ఆమె ప్రయత్నాన్ని హర్షించి సహాయం చేయతలచాను ఆమె స్వశక్తితో మెట్రిక్యులేషను, ప్రీ యూనివర్శిటీ, కుటుంబ సంక్షేమ కార్యకర్తల శిక్షణ ' కోర్సు'లను, బి.ఏ చదువుతున్నప్పుడు నేను అంతకు క్రితం చేసిన పొరపాటును - ఆమెను మొదటినుండీ ప్రోత్సహించక పోవడం - గ్రహించాను. పశ్చాత్తాప పడ్డాను. అందుకు ప్రతిఫలంగా ఆమె కార్యక్రమాల్లో ముఖ్యంగా కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో తోడ్పడ్డాను ( 1964-66). ఆమె మునిసిపాలిటీ సభ్యత్వానికి పోటీ చేస్తే (1968) చేతనయినంత సాయం చేశాను. ఆమెకు మానవవాద తత్వం, సిద్ధాంతం అవగాహన కావడానికి కృషిచేశాను. (ప్రత్యేక ఆంధ్రోద్యమంలో కలిసి ఆంధ్ర ప్రాంతం పర్యటించాం 1973) 'వికాసం' పత్రిక పెట్టినపుడు ఆమెలో స్వయంకృషి పద్ధతి పెంచాలని మొదట్లో ఆమెను పత్రికకు వ్యాసాలు రాయమని కోరలేదు. తరువాత ఆమె తగు కృషి చేస్తే ఆమెకు పత్రికలో రాయడానికి అవకాశం యిచ్చాను ( 1975). దీని తాలూకు గాథను ఆమె తన ఆత్మకథ ' పాతివ్రత్యం నుండి ఫెమినిజం దాకా ' లో వివరించారు. 1977లో జనతాపార్టీ ఎన్నికల సభలలో ఉపన్యాసాలు యిచ్చినపుడు 1978లో కాళోజీ సత్తుపల్లి నియోజక వర్గంలో అభ్యర్థిగా పోటీచేసిన సందర్భంగా ప్రచారంలో పాల్గొన్నపుడు ఆమె నాతోపాటు లండన్ వచ్చి ఐరోపాను పర్యటించినపుడు, 1979లో కూరగాయలు ఎగుమతి నిషేధ ఉద్యమంలో పనిచేసినపుడు, 1980లో హైదరాబాద్ పార్లమెంటర్ నియోజకవర్గంలో 'ఓటర్ల సముతుల ప్రచార అభ్యర్థిగా' పోటీ చేసినపుడు నాకు ఆమె శక్తి యుక్తులు బాగా అవగతమయినయి. ఆమెకు

మహిళోద్యమ కార్యకర్త కాగల సామర్థ్యం, పట్టుదల ఉన్నాయని గ్రహించాను ఆమెకు మహిళోద్యమంలో కల అవకాశాలను గుర్తించి ఆమెకు సంపూర్ణ సహకారం యివ్వతలచాను 1980లో ఆమె తను స్వంతంగా మిత్రుల సహకారంతో 'మహిళాభ్యుదయ సంస్థ' నిర్మాణానికి పూనుకున్నపుడు ఆమెకు బాసటగా నిలబడ్డాను ఆనాటినుండి యీనాటి వరకు ఆమెతో కలిసి ఆమె స్థాపించిన మహిళాభ్యుదయ సంస్థలో, ఆమె చేపట్టిన ప్రాజక్టులలో, నిర్వహించిన, నిర్వహిస్తున్న సంస్థలలో, సభలలో, మహాసభలలో, సెమినార్లలో, శిక్షణ శిబిరాలలో, కార్యక్రమాలలో ఆమెతోపాటు పనిచేస్తున్నాను, 'పురుష ఫెమినిస్టు' గా చలామణి అవుతూ పాటుపడుతున్నాను మహిళోద్యమం ఆమెది. ఈనాడు మహిళోద్యమానికి నాయకత్వం వహించవలసినవారు స్త్రీలు. 19వ శతాబ్దంలో పురుషులు మహిళా శ్రేయస్సుకు పాటుపడ్డారు 20వ శతాబ్దపు తొలి అర్థ భాగంలో పురుషులు నడిపిన ఉద్యమాలలో స్త్రీలు పాల్గొన్నారు మహిళా దశాబ్ద ప్రారంభం నుండి (1975) మహిళోద్యమాలకు ,మహిళాభ్యుదయ కార్యక్రమాలకు వారే నాయకత్వం వహిస్తున్నారు వారే అగ్ర భాగాన నిలబడుతున్నారు. ఈ పరిణామం నన్ను ఆలరించింది. 1986 నుండి ఆమె తలపెట్టిన కార్యాలలో ఎక్కువగా కృషిచేయ నారంభించాను

శ్రీమతి సుబ్బమ్మ పుస్తకాలకు ప్రూఫులు దిద్దడం, సెమినార్ల వ్యాసాల సంకలనాలను, గ్రంథాలను అచ్చు వేయించడం, ఆమె తెలుగు గ్రంథాలను ఇంగ్లీషులోకి తర్జుమా చేయడం యిలాంటి పనులను చేపట్టాను. ఆమె సుమారు 50 పుస్తకాలు రచిస్తే, 40 పై చిలుకు కరపత్రాలు, 500 వ్యాసాలు రాస్తే అందులో కొన్నింటిని - పదకొండు గ్రంథాలను, కొన్ని వ్యాసాలను ఇంగ్లీషులోకి అనువదించాను. 'హైందవ స్త్రీలు', 'ఇస్లాం ః స్త్రీలు' ' స్త్రీ విముక్తి' ( స్త్రీ విమోచన ప్రణాళిక), 'మహిళలు ః సంస్కరణ', ఆత్మకథ ( ఫియర్‌లెస్ ఫెమినిస్టు), ' మహిళోద్యమ చరిత్ర ( 1860-93) అనే పేరుగల గ్రందాలు ' వుమెన్, ట్రెడిషన్ అండ్ కల్చరు' 'సాగా ఆఫ్ ఉమెన్స్ స్ట్రగుల్' 'భారతీయ స్త్రీ', 'మారుతున్న సమాజంలో స్త్రీ' అనే వ్యాస సంకలనాలు, ' మానవ హక్కులు ః మహిళల హక్కులు' ' మతధర్మ శాసనాలు' 'స్త్రీలపై అత్యాచారాలు' అనే కరపత్రాలు నా అనువాదానికి నోచుకున్నవి. వాటిలో రెండు గ్రంథాలను - ' వుమెన్ ట్రెడిషన్ అండ్ కల్చర్' (1985), 'ఇస్లాం ః స్త్రీలు' (1988) - ' స్టెర్లింగు పబ్లిషర్సు' (ఢిల్లీ) వేస్తే ఒక దానిని ' హైందవం ః స్త్రీలు' అజంతా ఇంటర్ నేషనలు (ఢిల్లీ) అచ్చువేశారు మరొకదానిని ' సాగా ఆఫ్ ఉమెన్స్ స్ట్రగుల్‌ను (1985) ఇండియన్ అథెయిస్టు పబ్లిషర్సు (ఢిల్లీ) వేశారు. చివరి పుస్తకం 1994లో అచ్చు అయింది ఇలా సుబ్బమ్మగారి రుణం తీర్చుకున్నాను మహిళోద్యమం యెడ నా బాధ్యత నెరవేర్చుకున్నాను.

# ప్రబోధ కార్యక్రమాలు

నేను వృత్తిరీత్యా న్యాయవాదిని, ప్రవృత్తి రీత్యా అధ్యాపకుడిని, ఇది నన్ను గురించి నాకున్న అవగాహన. ఒక విషయాన్ని, అంశాన్ని వివరించటంలో, విశదీకరించటంలో నాకు ఆసక్తి ఎక్కువ. ఆవతలివారు వింటున్నారా లేదా అని కూడా గమనించకుండా తెలియజేప్పటం - నా ఆప్తుల దృష్టిలో - నా బలహీనత అయితే " మీరు అధ్యాపకులు అయితే విద్యార్థుల కష్టాలకు మితి ఉండదు" అని కొందరు నన్ను ఘాటుగా విమర్శిస్తారు నేను వారు అంటున్నంత దుర్మార్గుడిని కాను. ఒక విషయం చెప్తాను. అర్థమయిందా అని అడుగుతాను అర్థం కాలేదంటే మరల ' ఓపికగా , తేలిక భాషలో తెలివిడి చేస్తాను. అర్థమయింది అని వినే వ్యక్తి అనేవరకు ఎన్ని పర్యాయాలయినా విసుగు లేకుండా పదే పదే మాట్లాడటం నా అలవాటు అయితే విన్న విషయం బోధ పడినదిని తలూపి లేక బదులు పలికి చెప్పినదానికి విరుద్ధంగా ప్రవర్తిస్తే నాకు అరికాలి మంట నెత్తికొస్తుంది విపరీతమయిన కోపం వస్తుంది మామూలు మనుషులయితే ఆ క్రోధాగ్నిలో మండిపోతారు కాని ఈ కోపం క్షణ కాలమే ఉంటుంది అయినా ఉన్నంత కాలం దాని తీవ్రత చాల హెచ్చుగా ఉంటుంది. ఈ అంశాన్ని మనసులో పెట్టుకొనియే నన్ను చాలమందివిమర్శిస్తారు ఇది నా బలహీనతః నా బలం కూడాను శిక్షణ శిబిరాలలో అధ్యాపకుడిగా నేను రాణిస్తానని నన్ను గురించి నా అంచనా ఏదయినా దానిపైన తుది తీర్పు యితరులదిగా వుండాలి కదా! అధ్యయన శిబిరాలలో - లెస్లీ సహాని ప్రజస్వామ్య కార్యక్రమ శిక్షణ శిబిరం, మానవవాద, హేతువాద అధ్యయన శిబిరాలకు - ఏడు, మూడు రోజులకు ఒక దినానికి - సరిపడేటట్లు అధ్యయనాంశాలను జాబితా రాయడం, వాటికి తగిన సమయం దొరికేటట్లు కాలాన్ని కేటాయించే పట్టికను ( టైం టేబిలును) తయారుచేయడం నాకు యిష్టం. (క్రొత్తవారికి బోధనా విషయంపై ప్రసంగించే బాధ్యతను యిస్తే వారు కష్టపడి తయారవుతారు శిక్షణపొందే వారికే కాక అధాపకులుగా వచ్చేవారికి ప్రయోజనం సిద్ధిస్తుందని నా విశ్వాసం

ప్రసంగాలు చేయడం, ఉపన్యాసాలు యివ్వడం, సెమినార్లకు పరిశోధనా వ్యాసాలు రాయడం, గోష్టులతో పాల్గొనడం నాకు యిష్టం కనుక ఎవరయినా నన్ను అలాంటి పనులకు ఆహ్వానిస్తే నేను ఎన్నడూ కాదనను. సభలను, సమావేశాలను ఏర్పాటు చేయడం, మహాసభలను జరిపించడం నాకు ఆసక్తి కలిగిన విషయాలు. నాకు తెలిసినది, కాస్త అయినా సరే, యితరులకు చెప్పాలని నా ఆకాంక్ష. అసలు మనుష్యులు లేకుండా నేను బ్రతకలేనేమో! మానవుడు సంఘజీవి అనేదానికి నేనే నిదర్శనం

పట్టుమని సుమారు 10 సంవత్సరాలు, నెలకొక లేఖ చొప్పున - ఇండియన్ ఎక్స్ప్రెస్ పత్రికలో సంపాదకునికి లేఖలు రాసాను, అడిగినదే తడవుగా తెలుగులో, ఇంగ్లీషులో

ఉపన్యాసాలిచ్చాను, రెండు భాషలలో సెమినార్లలో పరిశోధనా పత్రాలు రాశాను అధ్యయన తరగతులలో పాఠాలు చెప్పాను, వ్యాసాలను, పరిశోధనా పత్రాలను రాసి నిర్వాహకులకు అందించాను. శాసనసభ, పార్లమెంటు జాయింటు సెలెక్టు కమిటీల ముందు సాక్ష్యం చెప్పాను, శ్రోతలు ప్రశ్నలడగాలని నా కోరిక అందుకని ధారాళంగా, ఒక్క బిగిన ఉపన్యాసం యివ్వడం కాక నేను మరో క్రొత్త విధానాన్ని రూపొందించాను సంభాషణా ధోరణిలో మాట్లాడి వినేవారిని ప్రశ్నలు వేస్తే వారిచేత సమాధానాలు చెప్పించుకుంటూ పాఠాన్ని కొనసాగిస్తాను. ఈ రీతిలో అధ్యాపకుడుః శిక్షణ పొందే వ్యక్తి ఇద్దరు కలిసి విషయాన్ని కనుగొంటారన్న మాటః ఇరువురూ సమిష్టిగా సత్యాన్వేషణ చేస్తారు, జ్ఞాన సముపార్జన చేస్తారు

1943 నుండి శిక్షణ శిబిరాలలో, అధ్యయన తరగతులలో నేను రాసిన పరిశోధనా పత్రాలు చాలవరకు అముద్రితాలుగా వున్నాయి. అందులో సగానికి పైగా సార్వకాలికాలు ః అన్ని కాలాలకు ఉపకరించేవి.

కొంతమంది నా ఉపన్యాసాలను, సెమినారు పేపర్లను చదివి నన్ను అభినందించిన సమయాలు లేకపోలేదు అయితే కాలక్రమేణ సహృదయంతో అలా ప్రవర్తించగల వారి సంఖ్య సమాజంలో తగ్గిపోతున్నది. ఏదయినా పొగడ్తలకు ఉబ్బిపోకుండా, తెగడ్తలకు బాధపడకుండా జీవించే స్థితి మనిషికి వస్తేనే ప్రశాంతగా, ఆనందంగా మానవులు జీవించగలరని నా నమ్మకం

# పౌరహక్కుల ఉద్యమం - 1

# పి.యు.సి.ఎల్. నూతన స్వరూపం

భార్గవా కమిషను విచారణ ఆగిపోయిన తరువాత పి.యు.సి ఎల్. కార్యక్రమాలలో స్తబ్దత ఆవరించింది ఇది ఒక్క అంధ్ర ప్రదేశ్‌లోనే కాదు. దేశం మొత్తంమీద యిదే జరిగింది. 1976లో పి యు.సి.ఎల్ ఆవిర్భవించిన తరుణంలో వున్న అసాధారణ పరిస్థితి అపుడు లేదు. 1980 ఎన్నికలలో విజయం పొంది ఇందిరా గాంధి మరల కేంద్రంలో అధికారానికి వచ్చినా ఆమె కూడా అత్యయిక పరిస్థితి నుండి గుణపాఠాలను నేర్చుకున్నారు. నూతన స్థితి గతులు నూతన ఆలోచనలకు, నూతన సంఘాల పుట్టుకకు దారి తీసినవి. అప్పటికే తమ మాతృ సంస్థ రాడికల్ హ్యూమనిష్టు సంఘంలోనే కాక మరొక్క ప్రజా సంస్థలో మాత్రమే ఏ హ్యూమనిస్టు - తార్కుండే తప్ప ఎవరయినా సరే - అయినా పని చేయతగుననే అభిప్రాయానికి నేను వచ్చాను. 1980లో బొంబాయి అఖిల భారత హేతువాద మహాసభలో క్రొత్త బాధ్యతను నేను స్వీకరించాను. ఆ కథ హేతువాద ఉద్యమ చరిత్రను గురించి రాసేటప్పుడు ముచ్చటిస్తాను. అందువలన " పౌరహక్కుల ఉద్యమంలో పూర్వం పాల్గొన్నట్టుగా శ్రమించలేనని" తార్కుండేకు చెప్పాను, ఆయన నా భావాలతో ఏకీభవించలేదు " " మనం - మానవ వాదులం - సంఖ్యలో చాల తక్కువ మందిమి ఉన్నాం నీవు యిలా నియమాలు పెట్టుకుంటే మనం ప్రారంభించిన ఉద్యమాలు నెలకొల్పిన సంస్థలూ మన సేవలను కోల్పోతయి కనుక నీ దృక్పథాన్ని మార్చుకోవలసినది" అని నన్ను కోరారు. నేను అంగీకరించలేక పోయాను "సరే మరొకరి పేరును సూచించు" అన్నారు. మిత్రుడు కె జి. కన్నబిరాన్ పేరు చెప్పాను, ఆయన సంతసించాడు.

పౌర హక్కుల ప్రజాసమితిని పునర్నించాలనే సంకల్పంతో మరో మహాసభ 1980లో జరిగింది నేను ఆ మహాసభకు హాజరు కాలేదు అంతవరకు పౌరహక్కులు, ప్రజాస్వామ్య హక్కులు రెంటికోసం కృషిచేసే పి.యు.సి ఎల్. తన లక్ష్యాలలో నుండి ప్రజాస్వామ్య హక్కులను మినహాయించింది. వివిధ రాజకీయ పార్టీలు జనతంత్ర సమాజ్ లాంటి పార్టీయేతర సంఘాలు వాటిని దేశంలో సుస్థిరం చేయాలని పనిచేస్తున్నయి కనుక పౌరహక్కుల సాధనకు మాత్రమే పి యు.సి ఎల్ పరిమితం కావాలనే భావానికి ఆదరణ లభించింది అంతేగాక దేశంలోని తీవ్రవాద 'విప్లవ' పార్టీలవారు, గ్రూపులవారు పౌరహక్కుల ఉద్యమంలో పాల్గొనడం, పి యు.సి ఎల్ యొక్క కొన్ని రాష్ట్ర శాఖలలో - ఉదాహరణకు ఢిల్లీ, బెంగాలు - చురుకుగా పనిచేస్తుండటం, అఖిల భారత స్థాయిలో వారు కృషిచేయటానికి సంకల్పించటం నూతన సంస్థా నిర్మాణానికి దారి తీసింది 'మేధావి' వర్గానికే సంస్థ సభ్యత్వాన్ని పరిమితం చేయాలని ప్రథమంలో తార్కుండే

లోచించినా మహాసభకు ప్రతినిధులుగా వచ్చిన వారి భావాలను తెలుసుకున్న తరువాత అన్ని రగతుల వారికి ప్రవేశం వుండేలాగున సభ్యత్వ రుసుమును తక్కువ మొత్తంలో వుండేలాగు (ంత్సరాని రు. 12లు) తీర్మానింపబడింది. అలా క్రొత్త రూపంతో, క్రొత్తద్వార ప్రవేశంతో పి యు.సి.ఎల్. ునర్వవస్థీకృతమయింది నేను మహాసభకు వెళ్లకపోయినా నన్ను జాతీయ కార్యవర్గ సభ్యుడిగా ెన్నుకున్నారు. మిత్రుడు క.బి. కన్నబిరాన్ కు జాతీయ ఆర్గనైజరు పదవి లభించింది అప్పటికే ఆయన ఆధ్రప్రదేశ్‌కు పరిమితమయి పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల కమిటి ( ఎ.పి.సి.ఎల్.సి) కి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు.

దేశంలో, రాష్ట్రంలో ఎప్పుడు అవసరమయితే అప్పుడు పౌరహక్కుల ఉద్యమాలు, సంఘాలు ఉద్భవిస్తాయిని మనకు చరిత్ర తెలియచెప్తున్నది. 1936లో కమూయునిస్టు పార్టీపై నిషేధాజ్ఞాలను బ్రిటిషువారి అదుపులో వున్న భారత ప్రభుత్వం అమలు చేస్తున్న నేపథ్యంలో ఇండియన్ సివిలు లిబర్టిన్ యూనియను అవతరించింది దానికి జవహారులాల్ నెహ్రూ అధ్యక్షుడుగా వుండేవారు. 1962లో కమ్యూనిస్టు పార్టీలోని ఒక వర్గాన్ని ( ఈనాటి సి.పి ఎం. మార్క్సిస్టులు, నక్సలైట్లు) భారత ప్రభుత్వం డెటిన్యూలుగా నిర్బంధించింది ఆ సమయంలో సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ ఎన్ సి ఛటర్జీ అధ్యక్షతన అఖిల భారత పౌరహక్కుల సంఘం ఉదయించింది. నక్సలైట్లు శ్రీకాకుళం పోరాట ఫలితంగా అనేకమంది ఆం ప్ర రాష్ట్ర ప్రభుత్వ దమనకాండకు గురి అయినారు. అప్పుడు 1969 లో ఆం ప్ర లో పౌరహక్కుల సంఘం పుట్టింది. తరువాత ప్రఖ్యాత నక్సలైటు నాయకుడు శ్రీ టి నాగిరెడ్డి సహచర అనుచర వర్గానికి తదితర నక్సలైట్లకు అభిప్రాయ బేధాలు పొడ సూపినయి. తత్ఫలితంగా నక్సలైట్ల ఆధ్వర్యాన నడిచే పౌరహక్కుల సంఘం 1974లో గుంటూరు మహాసభలో రెండుగా చీలింది రెండు వర్గాలు వివిధ నామాలతో రెండు సంఘాలను స్థాపించుకొని పనిచేయసాగారు ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ ( ఆర్గనైజేషన్ ఫార్ పీపుల్స్ డెమొక్రాటిక్ రైట్సు ఒ.పి.డి.ఆర్) ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల కమిటీ ( ఎ పి.సివిల్ లిబర్టిన్ కమిటీ : ఎ పి సి.ఎల్.సి ) అవి.

హైదరాబాదు నగరంలో పి.యు.సి ఎల్ శాఖను స్థాపించడానికి శ్రీ కన్నబిరాన్ ఎంతో కృషిచేశారు. అనేక మందిని సంస్థలో జీవిత సభ్యులుగా చేర్పించారు. సభ్యులుగా చేరమని పలువురిని ప్రాధ్బలం చేశారు డా॥ బల్వంతరెడ్డి సమావేశంలో లేకపోయారు. వారి పరోక్షంలో ఆయనకు అధ్యక్షునిగా, ప్రీ సిరిల్ రెడ్డిని ( న్యాయవాది, 'సలహా' సంఘ నాయకులు, తరువాత ' నలుపు ' పత్రిక సంపాదకులు) ప్రధాన కార్యదర్శగా ఎన్నుకోవడం జరిగింది. శ్రీ సిరిల్ రెడ్డి సభ్యత్వాన్ని పెంచారు శాఖను పటిష్టం చేశారు. ఆయన పదవీ విరమణ చేస్తే జి మనోహర్ ( న్యాయవాది) నగరశాఖ ప్రధాన కార్యదర్శి అయినారు ఆయన ఆ పదవిని నిర్వహించే కాలంలో

నగరంలో వివిధ మతస్తుల మధ్య కత్తిపోట్లు సంఘటనలు సంభవించాయి. ఒక నెలరోజులు పైగా 'మతకలహాల' వేర కత్తిపోట్లు సాగాయి అనేక మంది అమాయక జనం అనువులు పాశారు ఈ స్థితిలో హిందూ ముసల్మాను మతాలకు చెందిన స్త్రీ పురుషుల మనోహావాలను, అభిప్రాయాలను, వైఖరులను తెలుసుకునే నిమిత్తం ఒక బృందం పాతనగరంలో పర్యటించాలని మహిళాభ్యుదయ సంస్థ అధ్యక్షులు శ్రీమతి మల్లాది సుబ్బమ్మగారు ప్రతిపాదించారు. పి.యు.సి ఎల్.కు చెందిన శ్రీ జి మనోహర్, శ్రీ జావిద్ మరియొక మహిళ ( ఆమె హిందువయి ముస్లింను వివాహమాడారు) మహిళాభ్యుదయ సంస్థతో సహకరించ నిర్ణయించి ఆ సంస్థ బృందంలో చేరి పాతనగరంలో 5 రోజులు పర్యటించారు బృందం తయరు చేసిన నివేదికపై వారు దస్కతులు చేశారు. నేనూ ఈ బృందంలో సుబ్బమ్మగారితో వున్నానని చెప్పటం ప్రత్యేకంగా పేర్కొనవలసిన అవసరం లేదనుకుంటాను మా బృందపు నివేదికకు పత్రికలవారు ప్రచారం యిచ్చారు ఇతర రాష్ట్రాల పత్రికలు కూడా నివేదిక సంగ్రహ పాఠాన్ని ప్రకటించాయి. శ్రీ మనోహర్ పి.యు.సి ఎల్. ఉనికి ప్రజల దృష్టికి రావడానికి ఎంతో శ్రమించారు. చాలవరకు కృతకృత్యులయ్యారు

# పౌరహక్కుల ఉద్యమం - 2

## మద్రాసు మహాసభ

1982 మార్చిలో మాద్రాసులో పి.యు.సి.ఎల్. మహాసభ జరిగింది.ఈలోగా ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక సంఘటన జరిగింది. పీపుల్స్ వార్ గ్రూపు నక్సలైట్లు ఒక భూస్వామిని ఆయన పొలంలో పనిచేస్తుండగా దాడిచేసి గొడ్డళ్లతో నరికారు. ఆయన గ్రామం వరంగల్ కరీంనగర్ జిల్లాల సరిహద్దుల్లో వుంది. ఆయన కాళోజి సహాధ్యాయి ; శ్రీ కె. ప్రతాపరెడ్డికి మేనమామ. ఆ హత్య ఏ పరిస్థితులలో ఎందుకు జరిగిందో విచారించటానికి సర్వశ్రీ కాళోజి, కేశవరావు జాధవ్, నేను బృందంగా ఆ గ్రామం వెళ్లాం. అనేక మంది గ్రామస్థులను కలిసి విచారించాం. హతునికి చెడ్డపేరు లేదని తేలింది. స్త్రీల విషయంలో ఆయన దుష్ప్రవర్తనుడు కాదు. ఇతరుల ఆస్తులను మోసంచేసి లాక్కున్నవాడు కాదు. వడ్డీ వ్యాపారి కాదు. తన దగ్గర పనిచేసే వ్యవసాయ కార్మికులను, పాలేర్లను బాధపెట్టే వ్యక్తి కాదు. అతని లోపమల్లా ఆ గ్రామంలో మంచి పేరున్న భూస్వామి కావడమే. నక్సలైట్లు ఏ వ్యక్తినయినా చంపితే అతని దుష్ట గుణాలను, దుష్కృత్యాలను బహిర్గతం చేస్తూ హత్య చేసిన రెండు మూడు రోజులలోగా కరపత్రాన్ని వేయటం వారు సర్వసాధారణంగా చేసే పని. కాని ఈ హత్య సందర్భంగా వారు కరపత్రం వేయలేదు హతుని ఎందుకు చంపాల్సి వచ్చింది ప్రజలకు సంజాయిషీ చెప్పలేదు. ( నక్సలైట్లు మంచి వ్యక్తుల ఉనికిని - అందులోనూ వారికి మంచి పేరుంటే - సహించలేరు. దుర్మార్గులను, సంఘ వ్యతిరేక శక్తులను వారు ఎదుర్కోగలరు. కాని సద్గుణాలు కలవారిని, పేరు ప్రఖ్యాతులున్నవారిని వారు వ్యతిరేకించడం కష్టం. ఇది తెలిసియే వారు అలాంటటి వారిని భూమిమీద బ్రతకకుండా చేస్తారు. తరువాత తెలుగుధేశ పరిపాలనా కాలంలో తెలుగు దేశానికి చెందిన మండల ప్రజాపరిషత్ అధ్యక్షుడు మల్హారరావును వారు చంపివేయటం దీనికి తార్కాణం, హతుని గ్రామానికి వెళ్లిన మేము తిరిగి వచ్చిం. ఇంకా మా నివేదికను రూపొందించలేదు. ఈలోగా ఎ.పి.సి.యల్. సి. ప్రధాన కార్యదర్శిగా వుంటున్న డా॥ బాలగోపాల్ ' పొలిటికల్ అండ్ ఎకనామిక్ వీక్లీ' అనే ఆంగ్ల పత్రికలో ఒక వ్యాసం రాస్తూ " ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్లు ఒక భూస్వామిని చంపితే కొంతమంది ' సహృదయులు' పనిగట్టుకొని దర్యాప్తుకు వెళ్లారు. ఒక వర్గ శత్రువు చనిపోతే ఎందుకు వారంత హడావుడిగా ప్రవర్తించారో అనూహ్యం" అని వ్యాఖ్యానించాడు. ( ఈనాడు-1994లో - డా॥ బాలగోపాల్ భావాలు మారాయనుకోండి. ఆ కథ ముమ్ముందు వస్తుంది). ఆ రోజుల్లో 1981-82లో, హత్య దర్యాప్తుకు వెళ్లిన మేము ముగ్గురం నక్సలైట్లతో ముఖాముఖిగా ఢీకొనడానికి సంసిద్ధంగా లేము అది మా బలహీనతయని ఈనాటి నా భావం). అందుచేత నక్సలైట్లు చేసిన హత్య

నింద్యమని, ఖండింపతగినదని ఏకాభిప్రాయానికి వచ్చిన మేము నివేదికను పత్రికలకు విడుదల చేయలేదు. కాని నక్సలైట్ల ఈ దుశ్చర్య నన్ను మానసికంగా బాధించింది. అంత మదరాసులో జరిగే మహాసభలో చర్చించే నిమిత్తం నేను రెండు తీర్మానాలను తయారు చేశాను. వాటి విషయమయి ముందుగా పియుసిఎల్ అధ్యక్ష కార్యదర్శులకు నోటీసు లిచ్చి తెలియజేశాను. తీర్మానాల సైకిలిస్టయిలు ప్రతులను మహాసభలోని ప్రతినిధులకు పంచాను

రెండు తీర్మానాల సారాంశం యిది. " కేవలం ప్రభుత్వం ప్రజలపై చేసే అత్యాచారాలనేకాకా రాజకీయపార్టీలు, గ్రూపులు, వారి దళాలు ప్రజలపై సాగించే దమన కాండను నిరసించాలి అనేది మొదటి తీర్మానం. " సోదర పౌరహక్కుల సంఘాలలో పదవులలో వున్నవారు పి యు.సి.ఎల్ లో ఏ స్థాయిలోనూ, పదవులలో వుండరాదు" అనేది రెండవది. అప్పటికే పియుసిఎల్ నిబంధనావళిలో ఒక నియమం వుంటున్నది. " ఏ రాజకీయ పార్టీలోను అధ్యక్ష, కార్యదర్శ, కోశాధికారి పదవులలో వున్నవారు పియుసిఎల్‌లో - ఏ స్థాయిలోనూ - పదవులను చేపట్టటానికి అనర్హులు " అనేది ఆ షరతు. రాజకీయపార్టీల వారికి అన్వయించే నిబంధనను సోదర పౌరహక్కుల సంఘాలవారికి కూడా వర్తింపచేయాలని నా అభిప్రాయం. తీర్మానాలు మహాసభలో చర్చకు వచ్చాయి. తార్కుండే అధ్యక్షత వహిస్తున్నారు. ప్రధాన కార్యదర్శిగా వున్న శ్రీ వై.బి ఛిబ్బర్ ( యిప్పుడూ ఆయనే ఆ పదవిలో వున్నారు) 'ఇది నియమావళికి సంబంధించిన అంశం నియమావళిని మార్చడానికి మహాసభకు అధికారం లేదు. అది సంస్థ జాతాయ సమితి ఆలోచించవలసిన విషయం' అని చెప్పి అభ్యంతర పెట్టాడు. నియమావళిని తీసి చూచి తార్కుండే తీర్మానాన్ని త్రోసివేశాడు. సంస్థ జాతీయ సమితి తరువాత జరుగబోయే సమావేశంలో దీనిని చర్చించగలదని ప్రకటించాడు. విషయం తెలియనివారు నేను కన్నబిరాన్‌ను మనసులో పెట్టుకొని ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టానని సందేహించవచ్చని నేను ముమ్ముందుగా ఆలోచించి " ఈ తీర్మానం మిత్రుడు కన్నబిరాన్‌కు వర్తిస్తుంది. కన్నబిరాన్‌పై నాకు వ్యక్తిగతంగాద్వేషం లేదు. ఒక సూత్రాన్ని ప్రతిపాదిస్తున్నాను అలా దీనిని గ్రహించండి" అని చెప్పాను, అప్పుడు కన్నబిరాన్ సభలో వున్నాడు. ఆయన ఏమీ మాట్లాడలేదు. ఆ తీర్మానంపై చర్చ అలా ముగిసింది.

నా మొదటి తీర్మానం చర్చకు వచ్చేలోగా ఆనాడు పి.యు.సి.ఎల్. తమిళనాడు శాఖకు అధ్యక్షుడుగా వున్న శ్రీ చో ( 'తుగ్లక్' పత్రికా సంపాదకుడు. పేరు ప్రఖ్యాతులున్న వ్యక్తి) హింస ఎట్టి పరిస్థితిలో పనికిరాదనే తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. మహాసభలో 40-50 మంది నక్సలైటు భావాలున్నవారు ఉన్నారు. వారు పలు రాష్ట్రాలనుండి వచ్చారు. బీహారు నుండి వచ్చిన శ్రీ సత్యనారాయణ సిన్హా వారిలో ప్రముఖుడు. నక్సలైట్లకు చో తీర్మాణం ఆగ్రహకారణమయింది. వారు గట్టిగా వ్యతిరేకించారు. ఎమర్జెన్స్ కాలంలో ఎమర్జెన్స్‌కి వ్యతిరేకంగా జార్జి ఫెర్నాండెజ్‌కి తలపెట్టిన హింసాత్మక చర్యలను ఆనాడు నిరసించని చో యీ తీర్మానాన్ని ప్రతిపాదించడం చాల

మందికి అసంబద్ధంగా తోచింది. నేను అలాగే అభిప్రాయ పడ్డాను. అంతేకాదు హింస ఏ పరిస్థితుల్లోను పనికిరాదనటం అసమంజసమని నేను భావించాను నేనూ దానికి వ్యతిరేకించాను. తీర్మానం వీగిపోయింది (తరువాత తత్ఫలితంగా ఈ విషయాన్ని పత్రికలలో రాసి చో పి.యు.సి.ఎల్ నుండి తప్పుకున్నాడు.) ఈ సందర్భంలో ఒక సంఘటనను గురించి రాయవలసి వుంది శ్రీ కేశవరావ్ జాధవ్ (లోహియా సహచరుడు, అనుచరుడు, సోషలిస్టు. పి.యు.సి ఎల్. లో చురుకుగా పాల్గొనే నాయకుడు ప్రసంగిస్తున్న తరుణంలో బొంబాయి నుండి ప్రతినిధిగా వచ్చిన ఒక మహిళా కార్యకర్త ' పెంట' అని అతని ఉపన్యాస విషయాన్ని అభివర్ణించి యీసడించింది అయితే జాధవ్ సంస్కారి కనుక ఆమెకు అదే భాషలో బదులు పలుకలేదు. తార్కుండే ఆమె మాటను వినలేదో లేక విని దాటవేసాడో ఏమోకాని ఆమెను మందలించలేదుః ఆమె ప్రవర్తనను అభిశంసించలేదు. తార్కుండే నిర్లక్ష్యం శ్రీ కేశవ్‌రావ్ జాధవ్‌కు మన క్లేశం కలిగించింది. తరువాత అతడు పి.యు.సి.ఎల్.కు దూరం అయినాడు నా తీర్మానం చర్చకు వచ్చింది. మహాసభలో వున్న నక్సలైటు మిత్రులకు నా మీద కోపం వచ్చింది. మిత్రుడు సత్యనారాయణ సిన్హా (ఆయన మాజీ రాడికల్ డెమోక్రటిక్ పార్టీ నాయకుడు. నాకు అలా ఆయన అప్పుడు నా కామ్రేడ్. తరువాత ఆయన చనిపోయారు ) ముఖంలో అది ద్యోతకమయింది చాలమంది నక్సలైట్లు నా తీర్మానాన్ని ఎదుర్కొన్నారు. అపుడు శ్రీ అరుణ్ శౌరి ( అనాడు ' ఇండియన్ ఎక్స్‌ప్రెస్' దిన పత్రిక కార్యనిర్వాహక సంపాదకుడు) లేచి తను రాజీగా ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్తానని, అది రామ్మూర్తికి నచ్చితే అతడు తన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని చెప్పాడు. నేను అంగీకరించాను, పియుసిఎల్. ఏనాడూ హింసను సమర్థించలేదని, శాంతియుత మార్గాన్ని ప్రజాస్వామ్య జీవన విధానాన్ని లక్ష్యాలుగా స్వీకరించిందని ( ఇవి నిబంధనావళిలో మాటలు) అతని తీర్మాన సారాంశం. అతని తీర్మానం నాకు సంతృప్తికరంగా లేకపోయినా సంస్థలో ఐక్యతను కాపాడే నిమిత్తం నేను నా తీర్మానాన్ని ఉపసంహరించుకున్నాను మహాసభ అంగీకరిస్తే శ్రీ అరుణశౌరి లేచి తన తీర్మానాన్ని ఉపసంహరించుకుంటానన్నాడు. నేను అభ్యంతర పెట్టాను తార్కుండే నా అభ్యంతరాన్ని తను సమర్థిస్తున్నానని ప్రకటించకుండానే అరుణశౌరి తీర్మానాన్ని ఓటుకు పెట్టాడు. అది ఏకగ్రీవంగా ఆమోదింపబడినదని నా అభిప్రాయం. తను లేచి దానిని వ్యతిరేకించానని అంటాడు మిత్రుడు మల్లిఖార్జునశర్మ ( అతడు ఆనాడు ప్రముఖ నక్సలైటు సికిందరాబాద్ నక్సలైటు కుట్ర కేసులో ముద్దాయిగా వుంటూ రెండు సంత్సరాల జైలు జీవితం తర్వాత జామీనుపై వున్నవాడు. తరువాత పియుసిఎల్ ఆం.ప్ర. శాఖకు ప్రధాన కార్యదర్శి అయినాడు) తరువాత ఎం. ఏ , ఎల్ఎల్.బి., ఎం.ఫిల్. డిగ్రీలు సంపాదించి గ్రంథకర్తగా పుస్తక ప్రచురణ సంస్థ అధిపతిగా ప్రజస్వామ్యంపై గాఢాభిమానంతో పనిచేస్తున్నాడు). ఆ గందరగోళంలో అతని వ్యతిరేకతను నేను గమనించలేదు. అలా మద్రాసులో ప్రారంభమయింది నక్సలైట్లపై నా విమర్శ

# పౌరహక్కుల ఉద్యమం - 3
# ( ఎన్.టి.ఆర్. తొలగింపు)

1983లో జరిగిన ఆం.ప్ర. ఎన్నికల ఫలితంగా తెలుగుదేశ ప్రభుత్వం ఏర్పడింది. శ్రీ నాదెండ్ల భాస్కరరావు విచ్ఛిన్న చర్యల పర్యవసానంగా, కాంగ్రెసు వారి కుట్ర మూలంగా గవర్నరు రామ్‌లాల్ ఎన్.టి.ఆర్. ప్రభుత్వాన్ని రద్దు చేశాడు. శ్రీ నాదెండ్లను ముఖ్యమంత్రిని చేశాడు. దాంతో ఆంధ్ర ప్రజల నిరసన పెల్లుబికింది. భారతదేశంలోని కాంగ్రెసు వ్యతిరేక నాయకులు గవర్నరు చర్యను ఖండించారు తెలుగుదేశపు శాసన సభ్యులు కొందరు చీలి తనను సమర్థిస్తున్నారని శ్రీ నాదెండ్ల భాస్కరరావు వాదించాడు. అతడు యిచ్చిన సంఖ్యా వివరాలను నమ్మానన్నాడు గవర్నరు. ఆ లెక్క తప్పని, శాసన సభ్యులు తన వెంటనే ఉన్నారని ఎన్ టి.ఆర్ చెప్తూ తనను బలపరిచే శాసన సభ్యులను తీసుకొని కర్నాటక రాష్ట్రానికి తరలి వెళ్లాడు. ఆ సమయంలో శ్రీమతి మల్లాది సుబ్బమ్మ చొరవతో సర్వశ్రీ వసంతా కన్నబిరాన్, వాసిరెడ్డి కాశీరత్నం, వి. ప్రభావతి, సుబ్బమ్మలు సమావేశ కర్తలుగా హైదరాబాదు స్త్రీలు మున్ముందుగా నిరసన సభ జరిపారు. ఆ కథ సుబ్బమ్మ గారి ఆత్మకథలో వర్ణితం. పి.యు.సి.ఎల్ నాయకులుగా కన్నబిరాన్ నిరసన సభ జరిపించటానికి పూనుకున్నాడు. ' ఈనాడు' పత్రికాధిపతి రామోజీరావు సహకరించారు. సర్వశ్రీ నానీ ఫల్కీవాలా (ప్రఖ్యాత ' రాజ్యాంగ' న్యాయశాస్త్ర నిపుణులు) వి.ఎం తార్కుండే, అరుణశౌరీ వీరు వక్తలు సభను కాచిగూడలోని బసంత్ టాకీసు హాలులో ఏర్పాటు చేయడం జరిగింది. హాలులో 1500 మంది, హాలు ప్రాంగణంలో సుమారు 3 వేల మంది ఉపన్యాసాలను విన్నారు. శబ్ద ప్రసారణ యంత్రాలను హాలు బయటకూడా పెట్టించాం. అశేష ప్రజానీకం చోటు లేక హాలు ఎదుట వున్న వీధిలో నిలబడి పోయారు. అనేక మంది ఏర్పాట్లను పర్యవేక్షిస్తున్న నన్ను నిందించారు. సభాధ్యక్షుడిగా కాళోజీని కూర్చోబెట్టారు శ్రీ కన్నబిరాన్. ఆరోజున ఫల్కీవాలా, తార్కుండే, అరుణశౌరి ఒకరిని మించి మరొకరు ఉపన్యసించారు. శ్రీ కన్నబిరాన్ పరిచయం చేస్తూ మాట్లాడారు. నేను వందన సమర్పణం చేయవలసి వుంది కాళోజీ మరచిపోయి సభను ముగించపోతున్నాడు. అపుడు నేను ముందుకు వచ్చి ప్రసంగించాను నా మీది అభిమానంతో 1977లో జనతా పార్టీ ఎన్నికల ప్రచార సందర్భంగా 1978, 79లోని భార్గవా కమిషను విచారణ కాలంలో నా పేరు చిరపరిచితమయిన హైదరాబాదు మధ్యతరగతి ప్రజానీకం - లేచిన వారు మరల కూర్చొని - ఓపికగా, శ్రద్ధగా నా పలుకులను ఆలకించారు. ఇది నాకు నూతన అనుభవాన్ని ప్రసాదించింది శాసనసభ్యులలో ఎన్ టి.ఆర్. అనుచరవర్గం చెక్కు చెదరలేదు వారి సంఖ్య తగ్గలేదు. గతిలేక, విధిలేక ఆ గవర్నరు రామ్‌లాల్ మరల ఎన్ టి ఆర్.ను పిలిచి ప్రభుత్వాన్ని నిర్మించమని కోరవలసి వచ్చింది.

# పౌరహక్కుల ఉద్యమం - 4

# దమన వ్యతిరేక సదస్సు (మార్)

ఆంధ్రప్రదేశ్‌లో పి.యు.సి.ఎల్. శాఖను నెలకొల్పాలని ఒక సమావేశాన్ని పిలిచాడు శ్రీ కన్నబిరాన్. ఏబది మందిమి చేరాము సర్వశ్రీ బల్వంతరెడ్డి, కె. ప్రతాపరెడ్డి, మల్లిఖార్జునశర్మ కె నరసింహాచారి ( తర్వాత నగరశాఖకు అధ్యక్షుడు)÷ నేను తదితరులం ఉన్నాం సుమారు నాలుగు అయిదు గంటలు చర్చించాము. ఏ నిర్ణయానికి రాకుండా సభను వాయిదా వేయటం జరిగింది. ఈ స్థితిలో 1983 ద్వితీయార్థంలో అనుకంటాను శ్రీ మల్లిఖార్జునశర్మ శ్రీ కన్నబిరాన్‌ను కలిసి అతనిచేత పి యు.సి.ఎల్. ఆం ప్ర. శాఖా నిర్మాణం నిమిత్తం ఒక ఉప సంఘాన్ని వేయించి తెచ్చాడు. దానిలో సర్వశ్రీ మల్లిఖార్జునశర్మ, ప్రతాప రామసుబ్బయ్య ( గుంటూరు జిల్లా కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలలో ముఖ్యులు, కార్యకర్త, ఆలోచనాపరుడు,బహుగ్రంథకర్త, మల్లిఖార్జునశర్మతో కలిసి హైదరాబాదులో మార్క్సిస్టు స్టడీ సర్కిల్ స్థాపకుడు) కె ప్రతాపరెడ్డి, ఎం.వి రామమూర్తి ప్రభృతులు సభ్యులు మల్లిఖార్జునశర్మ సమావేశకర్త. ప్రథమ రాష్ట్ర మహాసభను సమావేశపరచ నిశ్చయించాం. ప్రముఖ స్వాతంత్ర్య వీరుడు, అండమాన్ జైలులో బంధితుడు, అధ్యయనపరుడు భగవత్‌సింగ్ సహచరుడు అయిన శ్రీ విజయకుమార్ సిన్హాను మహాసభ అధ్యక్షత వహించమని, పి.యు సి ఎల్. భారత కార్యదర్శి శ్రీ వై పి ఛిబ్బర్‌ను ప్రారంభం చేయమని కోరాడు మల్లిఖార్జునశర్మ. మహాసభ హైదరాబాదులో తార్నాకాలో 1984లో జరిగింది కన్నబిరాన్, కాళోజీ, వసంతా కన్నబిరాన్, రమా మేల్కోటే ప్రభృతులు వచ్చారు. ఆ మహాసభ నన్ను రాష్ట్ర శాఖ అధ్యక్షునిగా మిత్రుడు మల్లిఖార్జునశర్మను ప్రధానకార్యదర్శిగా, శ్రీ కె ప్రతాపరెడ్డిని ఉపాధ్యక్షునిగా ఎన్నుకున్నారు

మిత్రుడు మల్లిఖార్జునశర్మ పీపుల్స్‌వార్ గ్రూపుతో సంబంధాలను త్రెంచుకున్నా అతనికి తీవ్రవాద రాజకీయవారులపై అభిమానం పోలేదు. ఆం.ప్ర సివిల్ లిబర్టీస్ కమిటీ వారితో సఖ్యతకోసం, సమిష్టి కార్యచరణకోసం తహతహలాడేవాడు. వారుమాత్రం అతనిని వీలయినంత వరకు దూరంగానే వుంచేవారు. అయినా అతడు తను నమ్మిన పంథా దృష్ట్యా వారితో కలిసి పనిచేయ తలపెట్టేవాడు. శ్రీ ఎన్ టి.రామారావు నాయకత్వాన తెలుదేశ ప్రభుత్వం పట్టణ పోలీసు బిల్లును, గూండా నిరోధక బిల్లును ప్రతిపాదించింది వాటిలోని సెక్షనులు ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగం కలిగించేవి. అవి ఆమోదింపబడితే మొదటి దెబ్బ తమపై పడుతుందని గ్రహించిన నక్సలైట్లు సమిష్టి కార్యాచరణకు మల్లిఖార్జునశర్మను ఆహ్వానించారు అతడు వారి ప్రతిపాదనను ఆంగీకరించాడు. ( పి యు.సి.ఎల్ కు తెలుగులో ' పౌరహక్కుల ప్రజాసంఘం అని

పేరుపెట్టాడు శర్మ ఇకముందుఆ పేరుతోనే వ్యవహరిస్తాను) మా సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశాలు సర్వసాధారణంగా శనివారం సాయంత్రం ప్రతాపరెడ్డిగారి ప్లీడరీ ఆఫీసులో జరిగేవి. దమన నీతికి వ్యతిరేకంగా ఒక సదస్సును సమావేశ పరచ నిశ్చయింపబడింది. దానికి ' దమన వ్యతిరేక ఉద్యమం' ( మూవ్‌మెంట్ ఎగెయినస్టు రిప్రెషను) అని పేరు పెట్టాలని నిర్ణయం జరిగింది. ముమ్మందుగా పౌరహక్కుల అవశ్యకతను వివరిస్తూ, పౌరహక్కుల ఉద్యమ చరిత్రను తెలియజేస్తే, దమన వ్యతిరేక ఉద్యమ ఆశయాలను, లక్ష్యాలను విశదీకరిస్తూ ఒక చిన్న పుస్తకాన్ని శ్రీ కన్నబిరాన్ సమర్థవంతంగా తయారు చేశారు. అందులో ప్రభుత్వం తలపెట్టిన బిల్లులపై తక్షణ విమర్శకూడా చోటుచేసుకున్నది. బసంత్‌టాకీస్ హాలులో సదస్సు కూడింది. రాష్ట్రం నలూమూలలనుండి 5 వందల మందిదాకా వచ్చారు. కాళోజీ, కన్నబిరాన్, ప్రతాపరెడ్డి ప్రభృతులంతా ప్రసంగించారు. నేనూ, శర్మ మాట్లాడాము ప్రతాపరెడ్డి సమావేశకర్తగా ఉద్యమ నిర్వాహక కమిటీ ఏర్పడింది.

సదస్సు జరుగుతున్న సమయంలో నక్సలైటు హింసవల్ల బాధితులమని చెప్పకుంటూ నలుబడి మంది సదస్సు జరిగే హాలు ప్రాంగణంలోకి వచ్చి నక్సలైటు వ్యతిరేక నినాదాలు యివ్వసాగారు. వారిని రాష్ట్ర పోలీసులు వెంబడి వుండి తీసుకొని వచ్చారని తెలిసింది. వారు ఒక అరగంట సేపు అలా గోలచేసి " ప్రజలకు పౌరహక్కులు అక్కరలేదా? ఎంతసేపూ నక్సలైట్లకేనా పౌరహక్కులు?" అని కేకలు వేస్తూ సదస్సును భంగపరచాలని ప్రయత్నం చేశారు కాని ప్రతినిధులు సంయమనంతో వ్యవహరించినందువల్ల సంఘర్షణ జరుగలేదు. విచ్ఛిన్నకారులు నిష్క్రమించారు. సదస్సు ప్రశాంతంగా సాగింది. ఈ సంఘటన జరిగిన మూడవ రోజు ఉదయం ప్రతాపరెడ్డిగారు కోర్టుకు వెళ్లపోతున్న సమయంలో పౌరహక్కుల కమిటి ( ఎ.పి సి.ఎల్.సి.) సంయుక్త కార్యదర్శి శ్రీ కొదండరామిరెడ్డి వచ్చి సదస్సు రోజున కమిటీ ఉపాధ్యక్షులయిన డా॥ శ్రీ రాజగోపాల్ గారిని విచ్ఛిన్నకారుల చీకాకు పరచారని, వారి చొక్కా చించారని సభను భగ్నం చేయదతలచిన వారి చర్యను ఖండిస్తూ పత్రికా ప్రకటన యివ్వాలని ప్రతాపరెడ్డిగారిని అభ్యర్థించారు. ఆయన పని తొందరలో వుంటూ ' సాయంతత్రం కలుద్దం లెండి' అని చెప్పి వెళ్లిపోయారు. సాయంత్రం పౌరహక్కుల కమిటీ నాయకుడు వచ్చి కలిశాడు. డా॥ రాజగోపాల్‌గారు కూడా వచ్చి సంఘటన వివరాలు తెలిపారు. అంతా విని " మనం ఆ రోజుననే, కాకపోతే మరురోజుననే, పత్రికా ప్రకటన యిచ్చి వుండవలసింది. ఇన్ని దినాలు గడిచిన తరువాత పత్రికా ప్రకటన చేస్తే దానికి విలువ వుండదు" అని ప్రతాపరెడ్డిగారు తన అభిప్రాయం వెలిబుచ్చారు. " మీరు దమన వ్యతిరేక ఉద్యమ సమన్వయ కమిటీ సమావేశకర్త కదా మీరు ప్రకటన యివ్వడం సమంజసం" అన్నారు శ్రీ కోదండరామరెడ్డి. "నేను యివ్వను కావాలంటే మీ పౌరహక్కుల కమిటీ తరుపున యివ్వండి" అని బదులుపలికారు శ్రీ ప్రతాపరెడ్డి.శ్రీ కోదండరెడ్డి ఉద్రేకపడి ప్రతాపరెడ్డిగారికి

చిత్తశుద్ధి లేదని నిందించారు ఇదంతా జరుగుతున్నపుడు కేవలం ప్రేక్షకుడుగా, శ్రోతగా వున్న నేను కలుగజేసుకొని " మీరు అలా మాట్లాడితే ఇక సంయుక్త కార్యాచరణ పొసగదు" అని ఖండితంగా చెప్పాను, దాంతో 'మార్' (మూవ్‌మెంటు ఎగయినెస్టు రిప్రషను) కథ ముగిసింది ఇదంతా 1986లో జరిగినట్లు గుర్తు

1984లో ఇందిరా గాంధి హత్య జరిగిన మూడు నాలుగు రోజులలో ఢిల్లీలో శిక్కుల ఊచకోత జరిగింది. హత్యలు, గృహదహనాలు, లూటీలు జరిగాయి. కొందరు కాంగ్రెసు నాయకులు గ్రామాల నుండి గూండాలను లారీలలో తెచ్చి శిక్కులను వేటాడి చంపారు. ఒక్క ఢిల్లీలేనే మూడు వేల మందికి పైగా శిక్కులు చనిపోయారని భారత ప్రభుత్వపు అంచనా. అనధికార అంచన పదివేలు. ఢిల్లీలో శిక్కులను సజీవంగా తగలేశారు ఈ ఘోరకలిమీద దర్యాప్తు చేయించి ఆనాటి పి యు సి.ఎల్ అధ్యక్షుడు శ్రీ రజన్ కోఠారి (ప్రఖ్యాతి సామాజికి శాస్త్రజ్ఞుడు, మేధావి, గ్రంధకర్త) నివేదికను ప్రచురించారు. దానిలో దుష్ట సంఘటనలనే కాక నిందితులను కూడా పేర్కొన్నారు ( ఇంతవరకు ఈ దుర్మార్గం జరిగి పది సంత్సరాలయినా నిందితులపై కేసుల విచారణ పూర్తికాలేదు). కాన్పూరు, ఆగ్రా లాంటి ఉత్తరప్రదేశ్‌లోని పట్టణాలలో శిక్కులపై ఇలాంటి దాడులే, జరిగాయి హత్యలు సాగాయి. ( ఈ సంఘటనలే, వాటి స్మృతులే పంజాబులోని శిక్కుల ప్రతిఘటనకు దారి తీసినయి )

# పౌరహక్కుల ఉద్యమం - 5

పి.యు.సి.ఎల్ అఖిల భారత మహా సభను హైదరాబాదులో జరపమనే సూచన వచ్చింది నేను తటపటాయిస్తుంటే శ్రీ ప్రతాపరెడ్డి 'జరుపుదాం' అన్నారు ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా మహాసభ ఏర్పాట్లకు పూనుకున్నాడు విరాళాలను పోగుచేశారు. తన క్లయింటు ఒకాయనకు బ్యాంకు వీధిలోఖాళీ స్థలం, షామియానా వగైరా సామాగ్రి వుంటే ఆయనకు సభాస్థలిని నిర్మించ పనిని ఒప్పచెప్పారు. డబ్బులతో నిమిత్తం లేని పనులను మిగతా మిత్రులం చేపట్టాం మాజీ సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి చంద్రచూడ్ సభాప్రారంభకులు తార్కుండే అధ్యక్షులు పౌరహక్కుల యెడ శ్రద్ధాసక్తులు కల ప్రజోద్యమాల వారు, మేధావులు, మధ్యతరగతి వారు, కార్మికోద్యమ కార్యకర్తలు వీరందరితో సభాస్థలి నిండిపోయింది బాలలపై నిర్బంధకాండను వ్యతిరేకిస్తూ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలతో అవిశ్రాంతంగాపోరాడుతున్న శ్రీమతి షీలా బార్సేకు పౌరహక్కుల అవార్డు ప్రదానం చేశారు సన్మానమేగాక 20 వేల రూపాయల బహుమానాన్ని యిచ్చింది పౌరహక్కుల ప్రజా సంఘం పౌరహక్కుల స్వదేశం హైదరాబాదు ప్రజలకు అందింది ఈ మహా సభ 1986లో జరిగిందని నాకు జ్ఞాపకం.

మహాసభ జరుగుతుండగా నక్సలైటు బాధితులు - 'మార్' సదస్సు వద్ద ఆందోళన చేసినవారే. పోలీసులు తెచ్చిన మనుషులే - వచ్చి ప్రదర్శన చేశారు పూర్వం అడిగి ప్రశ్నే కేకలు వేస్తూ అడిగారు "నక్సలైట్లకేనా పౌరహక్కులు? నక్సలైటు బాధితుల పౌరహక్కుల కోసం మీరు పోరాడరా?" అని బిగ్గరగా అరుస్తూ హంగామా చేశారు వారిని తార్కుండే సద్దుమనిగేట్లు చేసి తన ఉపన్యాసంలో వారికి సమాధానం చెప్పాడు పౌరహక్కుల స్వరూప స్వభావాలను విశదీకరించాడు. ప్రధానంగా ప్రజల పౌరహక్కులను హరించేది, హరించేస్తున్నది ప్రభుత్వాలేనని నొక్కి వక్కాణించాడు "అయితే ఏ ఇతర వర్గాలయినా - రాజకీయ పార్టీలయినా, గ్రూపులయినా ప్రజల పౌరహక్కులకు భంగకరంగా ప్రవర్తిస్తుంటే, ఖండిస్తాం, ఎదుర్కొంటాం" అని వివరించాడు ఈ సమాధానం ప్రదర్శకులను నిరుత్తరులను చేసింది తార్కుండే ఆలోచనలలో, భావాలలో, వైఖరిలో యిది క్రొత్త మలుపు ఇది ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల ప్రజాసంఘంలో పనిచేసున్న మాబోంట్లకు సంతృప్తిని కలుగజేసింది.

సభాస్థలిని ఏర్పాటుచేసి, సర్వాంగ సుందరంగా అలంకరించిన శ్రీ ప్రతాపరెడ్డిగారి క్లయింటు 15 వేల రూపాయలకు బిల్లు యిచ్చాడు అది చూచి నా గుండె ఆగిపోయింది. బిత్తర పోయాను. నా అవస్థను గమనించి " అదంతా నేను చూచుకుంటానులే రామ్మూర్తిగారూ" అన్నారు శ్రీ ప్రతాపరెడ్డి కాస్త ఊరట చెందాను. కాని నాకు మనశ్శాంతి కరువయింది. అంతకు క్రితం ఒక స్వచ్ఛంద సంస్థ అధిపతిని నేను విరాళం అడిగితే ఆయన 5 వేలు యిస్తానన్నాడు. ఆ

మొత్తం తీసుకొని రాగలను కదా అనే ధీమాతో వున్నాను. ఆయన పరిస్థితులలో మార్పు రావడం వల్ల ఆయన తన వాగ్ధానాన్ని చెల్లించుకోలేక పోతున్నానని బాధపడుతూ నాతో చెప్పాడు. నేను నిస్పృహకు లోనయ్యాను. దోషభావంతో క్రుంగి పోయాను. చివరకు ఎలాగో అలాగు తంటాలు పడి నేను 2 వేల రూపాయలు ప్రోగుచేసి ప్రతాపరెడ్డిగారికి యిచ్చి ఊపిరి పీల్చుకున్నాను. మిగతా దానిని - ఎంత భారీ మొత్తమో - అంతటినీ ఆయనే పెట్టుకున్నారు. ఆయన సహృదయుడు, గుండె గల మనిషి. ఆయన ప్రజాస్వామ్య ఉద్యమాలకు ఎల్లప్పుడూ అండ. పెద్ద దిక్కు అన్నా అతిశయోక్తి కాదు.

అవార్డు ప్రదానం జరిగిన తరువాత అవార్డుల స్వీకర్త ఎమతి షీల బార్సే అఖిల భారత మహాసభలో మాట్లాడుతూ తమ ప్రభుత్వాలతో న్యాయస్థానాలతో పోరాడుకుంటే, ప్రభుత్వ న్యాయవాదులు అదేపనిగా వాయిదాలు కోరుతుంటే, సంవత్సరాల తరబడి వాయిదాలు యిచ్చిన సుప్రీంకోర్టును ప్రభుత్వ న్యాయవాదుల కోర్కెలను మన్నించవద్దని, తను దాఖలు చేసిన పిటిషన్లను విచారణకు తీసుకోమని కోరితే సుప్రీంకోర్టు తనపై ఆగ్రహించిందని చెప్పింది అంతటితో ఆగక ఆ పిటీషన్లపై వాదించేహక్కును తనకు లేకుండా చేసి, వాదనచేసే బాధ్యతను యింకొకరికి సుప్రీం కోర్టు ఒప్పచెప్పిందని, ఇది 'న్యాయస్థానాల నిరంకుశత్వమని' ఆమె ఘంటాపథంగా, బెరుకులేకుండా, నిర్భయంగా న్యాయమూర్తి చంద్రచూడ్ ఎదుట బల్లగుద్ది పలికింది. ఆమె ఈ ప్రసంగం యిప్పటికీ - 8 సం॥ తరువాత కూడా - నా చెవులలో మార్మోగుతున్నది. రాజకీయ పార్టీలు తమ విద్యుక్త ధర్మాలను విస్మరిస్తున్న ఈ తరుణంలో, పార్టీయేతర సంస్థలూ ప్రజోద్యమాలు బలహీనంగా వున్న ఈ కాలంలో గతిలేక ప్రజానీకం న్యాయస్థానాలవైపు - రక్షణ కోసం - అర్రులు చాస్తున్నది న్యాయస్థానాలు ఎక్కువ సందర్భాలలో ప్రజలకు అండగా నిలబడుతున్నాయి. కాని యిటీవల అవి తమకు లేని అధికారాలను చలాయించే మనస్తత్వాన్ని అలవరుచుకుంటున్నాయి. తమ పరిధిని మించి ప్రవర్తిస్తున్నాయి. రాజ్యాంగం ఇతర రాజ్యాంగ అధికార సంస్థలకు - శాసన సభలకు, ప్రభుత్వాలకు - కేటాయించిన అధికారాలను వాడ పూనటానికి సంశయించటం లేదు. ఈ ధోరణి ప్రమాదకరం. ఇటీవలి సంవత్సరాలలో 1990 నుండి 1994 వరకు - ఈ ధోరణి ఎక్కువవుతున్నది. ఇది అలవాటుగా మారుతుందేమోనని ప్రజాస్వామ్యం యెడల అభిమానం, రాజ్యాంగం పట్ల గౌరవం కలవారు కలత చెందుతున్నారు. శ్రీమతి షీలా బార్సే చేసిన ఆరోపణ - కొన్ని సందర్భాలలో సత్య స్వరూపం తాల్చరాదని ఆశించటం అస్వాభిపకం కాదు; నేరం అంతకన్నా కాదు.

# పౌరహక్కుల ఉద్యమం - 6
# కరీంనగర్ నివేదిక : నక్సలైట్లు

తెలంగాణా నక్సలైట్లు వారి ఉద్యమ ప్రారంభంలో భూస్వాములపై, వడ్డీ వ్యాపారస్తులపై, ప్రజా పీడకులపై చర్యలు - కొట్టడం, చంపడం, ఆస్తులను లూటీ చేయడం - చేస్తుండేవారు. తరువాత వారి కార్యక్రమాలలో మార్పు వచ్చింది. పోలీసు గూఢాచారులని తాము అనుమానించిన వారిని, తమపై సమాచారం పోలీసులకు అందజేస్తున్నారని తాము భావించిన వారిని, 'విప్లవ' గ్రూపులలో వుండి తమకు వ్యతిరేకంగా కాని లేక విడిగా కాని పనిచేస్తూ పలుకుబడిని ప్రాబల్యాన్ని పెంచుకుంటున్న కార్యకర్తలను చంపబడవలసిన వారి జాబితాలో చేర్చటం, ప్రజా కోర్టుల పేరుతో వారిని నేరస్తులుగా నిర్ణయించిన కాళ్ళు చేతులు నరకడం, హింసించి చంపడం, తలలు, కనుబొమ్మలు గొరిగించి వికృత రూపులను చేసి అవమానించడం 1987 నాటికి ఎక్కువమయింది. వారి యీ చర్యలు కేవలం పోలీసు గూఢాచారి వర్గాలలోనేకాక సామాన్య ప్రజానీకంలో సహితం అలజడిని కలుగజేసినయి. పత్రికలలో వార్తలు ఆందోళనకరంగా రాసాగాయి. పౌరహక్కుల సంఘాలు ప్రజల హక్కులను పట్టించుకోవనే నిందా వాక్యాలు వినపడసాగాయి. ఈ ఆరోపణ ఎ.పి.సి.ఎల్.సి - విషయంలో నిజం కావచ్చు కాని పౌరహక్కుల ప్రజా సంఘం విషయంలో నిజం కాదని నాకు తోచింది. ఆనాడు ఆం.ప్ర. శాఖకు డా ॥ బల్వంత రెడ్డి అధ్యక్షులు. నేను ప్రధాన కార్యదర్శిని. శ్రీ ప్రతాపరెడ్డి ఉపాధ్యక్షులు. మిత్రుడు కె. శ్రీనివాసమూర్తి సహాయకార్యదర్శి. నేనూ, శ్రీనివాసమూర్తి మరియొకరు కరీంనగర్ జిల్లా పర్యటనకు వెళ్ళాం. నక్సలైట్ల తల్లిదండ్రుల యిళ్లను, సోదరుల గృహాలను పోలీసులు 'ప్రజల'చేత నేల మట్టం చేయించగా, ధ్వంసం చేయించగా, కప్పులు ఊడపీకించగా వాటిని చూచాము. వాటిని అలా విధ్వంసం చేసినవారు పోలీసుల మనుషులు; కాకపోతే పోలీసులకు భయపడి వారి వుత్తరువుల మేరకు అలా ప్రవర్తించినవారు. నక్సలైట్ల 'డిమాండ్ల'ను - విరాళాలిమ్మని, ఫలాని పని చెయ్యమని పట్టించుకోనని లేక తిరస్కరించిన వ్యక్తులను నక్సలైట్లు చేతులు నరికారు, కాళ్లు తీసివేశారు, చంపివేశారు. వారిలో చాలామంది భూస్వాములు 'వారికి 25, 30 ఎకరాలను మించిలేవు. మాగాణి పొలాలు, ప్రత్తి పొగాకు పండే భూములతో పోలిస్తే వారి ఆస్థి అంతటిపై వచ్చే ఆదాయం పై చెప్పిన పొలాలలో ఎకరానికి వచ్చే ఆదాయాన్ని మించివుండదు. ఏదయినా ఇలా న్యాయాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం నింద్యం; తగని పని. ఆ జిల్లా నుండి తిరిగి వచ్చి చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లు నివేదిక తయారుచేసి పత్రికా విలేఖరుల సమావేశంలో విడుదల చేశాను. ఇది నేను నక్సలైట్ల చర్యలపై ప్రప్రథమంగా చేసిన బహిరంగ విమర్శ కనుక పత్రికల వార రెండు 'కాలముల' శీర్షికలతో ప్రకటించారు. అంతేగాక ఇతర రాష్ట్రాల పత్రికలకూ యిది చేరింది. అది పౌరహక్కుల కమిటీ (ఎ.పి.సి.ఎల్.సి) ప్రధాన కార్యదర్శి డా॥ బాలగోపాల్ పౌరహక్కుల ప్రజా సంఘపు అఖిల భారత అధ్యక్షులు న్యాయమూర్తి రాజేంద్ర సచార్‌కు

(ఆయన ఢిల్లీ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, సోషలిస్టు) రాసినలేఖ. అందులోని అంశాలు యివి : (1) సిద్ధాంత చర్చ చేసి నక్సలైట్లను విమర్శించడం తప్పు. (2) ప్రభుత్వం ప్రజలపై చేసే దమన కాండను, హింసను పౌరహక్కుల సంఘాలు పట్టించుకోవాలి కాని రాజకీయ గ్రూపులు, పార్టీలు వీరి చర్యలను గురించి జోక్యం కల్గించుకోరాదు (3) పౌరహక్కుల ప్రజా సంఘం తమ పరిధిని - ఈ నివేదిక సందర్భంగా -అతిక్రమించింది. నాకు చీకాకు కల్గింది. ఈ లేఖ ప్రతి డా॥ బాల గోపాల్ నాకు పంపలేదు - ఎవరు పంపారో తెలియదు - ఆలేఖ ప్రతితో దానిని పొందుపరిచే ఉత్తరం లేదు ఏదయినా విషయం ఉంటే నాతో సరాసరి వ్యవహరించాలి కాని, ఏదో చిన్నవాడు తప్పుచేస్తే తండ్రికి చెప్పినట్లు, నాపై పితూరీ చేయటం నాకు తప్పుగా తోచింది అంత అతనిని లేఖకు జవాబురాసి, తన లేఖను, నా లేఖకు సైక్లోస్టలయిలు ప్రతులు తీయించి పత్రికా విలేఖరుల సమావేశం పెట్టి వారికి రెంటినీ అందింపచేశాను. మొదటి నివేదికకు వచ్చిన దానికన్నా ఎక్కువగా దీనికి ప్రచారం వచ్చింది. ఢిల్లీలోని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్', 'ఎడిషన్' ప్రముఖంగా ప్రచురించింది. ఆ దినమే నేను ఢిల్లీలో మా సంస్థ జాతీయ సమితి సమావేశానికి వెళ్లాను. ప్రధాన కార్యదర్శి శ్రీ ఛిబ్బర్ మాత్రం 'నీ వ్రాతను చూచాను' అన్నాడు. ప్రజాసంఘ అధ్యక్షుడు రాజేంద్ర సచార్ కాని, సలహాదారుడు తార్కుండే కాని యిది ఏమిటని అడగలేదు. సమావేశపు రెండవ రోజు అం.ప్ర. పై నా నివేదికను సమర్పిస్తూ రాష్ట్ర పరిస్థితులను కూలంకషంగా - నక్సలైట్ల చర్యలతో సహా వివరించాను. తరువాత ప్రసంగించిన శ్రీ కన్నబిరాన్ తన దృక్పథాన్ని వివరించాడు. మేమిరువురం పేరులు పెట్టుకొని కాని, అన్యాపదేశంగా కాని ఒకరి నొకరం విమర్శించుకోలేదు. కరీంనగర్ నివేదికను తార్కుండే సంపాదకుడుగా వున్న 'రాడికల్ హ్యూమనిస్టు' ఆంగ్ల మాసపత్రికకు పంపాను. మార్పులు చేర్పులు, పాదసూచికలు, వ్యాఖ్యలు, ముందు మాటలు లేకుండా దానిని యధాతథంగా తార్కుండే ప్రచురించాడు. ఈ నివేదికను నేను ప్రచురించటం రాజేంద్ర సచార్ గారికి నచ్చినట్లు లేదు. అలా అని నాతో ఆయన అనలేదు తార్కుండే దీని విషయం నాతో చర్చించలేదు. కాగా మాదృక్పతాలు స్పష్టంగా తేలిపోయాయి ప్రభుత్వం ప్రజలపై హింసను మాత్రమే 'సోల్లీ' పౌరహక్కుల సంఘాలు పట్టించుకోవాలని శ్రీ కన్నబిరాన్ భావం (ఇప్పుడు ఆయన వైఖరిలో మార్పు వచ్చింది. నక్సలైట్లు చేసే దారుణ హత్యలను, వ్యక్తుల అపహరణలను (కిడ్నాపింగులను), సాధారణ పోలీసులను మట్టుపెట్టటాన్ని, ఓట్లు వేయవద్దని, ప్రచారం చెయ్యొద్దని ప్రజలను బెదిరించటం వీటిని ఆయన విమర్శిస్తున్నారు). ప్రభుత్వాలు ప్రజలపై సాగించే దమన కాండను పౌరహక్కుల సంఘాల వారు ముఖ్యంగా (మెయిన్లీ) వ్యతిరేకించాలనీ, రాజకీయ పార్టీలు, సంస్థలూ, గ్రూపులు చేసే అత్యాచారాలను ఉదాసీనత వహించ బాలమని తార్కుండే దృక్పథం. ప్రభుత్వమూ, రాజకీయ పార్టీలు, ముఠాలు, దళాలు - ఇరు వర్గాలు ప్రజలపై సాగించే హింస సమానంగా (' ఈక్వల్లీ') గర్హ్యనీయమని నా అభిప్రాయం

నేను ప్రధాన కార్యదర్శి పదవి నుండి తప్పుకునేటప్పుడు నేను రాసి అచ్చువేసిన నివేదికలో యీ విషయాలు, తదితరాలు పొందుపరిచాను.

# పౌరహక్కుల ఉద్యమం - 7

# 59వ రాజ్యాంగ సవరణ

1988లో పౌరహక్కుల ప్రజా సంఘంలో జరిగిన ఎన్నికలలో డా॥ బల్వంతరెడ్డి అధ్యక్షులయినారు నేను ఉపాధ్యక్షుడినయ్యాను. శ్రీ కె శ్రీనివాస మూర్తి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడినాడు. ఇందిరాగాంధీ అమృతసర్ స్వర్ణ దేవాలయంపై సైనికులచేత దాడి చేయంచటం, తరువాత పంజాబులో పోలీసుల దమనకాండ, దర్మిలా పంజాబ్‌లో శిక్కు యువకుల హింసాయుత ప్రతిఘటన ఇందిరాగాంధీ మరణానంతరం రాజీవ్‌గాంధీ దేశ ప్రధానమంత్రిగా ఎన్నిక కావడం సర్వులకూ తెలిసిన విషయాలే. పంజాబులో శిక్కుల వ్యతిరేకతను - అది యించుమించుగా చెదురు మదురు తిరుగుబాటే - తట్టుకునే నిమిత్తం పంజాబ్‌కు మాత్రమే వర్తిస్తుందని చెప్తూ పంజాబులో ఎమర్జెన్సీ విధింపును రాజ్యాంగ బద్ధం చేయటానికి అవసరమయిన రాజ్యాంగ సవరణలను పొందుపరుస్తూ రాజీవ్ గాంధీ కాంగ్రెసు ప్రభుత్వం 59వ రాజ్యాంగ సవరణ బిల్లును ప్రకటించింది. ఈ బిల్లు సవరణలు చాలా మౌలికమైనవి ఇంచుమించుగా 42వ రాజ్యాంగ సవరణలోని అంశాలు 59వ రాజ్యాంగ సరవణలో చోటుచేసుకున్నాయి ఆ బిల్లు ప్రమాదకరమని నక్సలైట్లతో సహా అందరమూ భావించాము దానిని ఎదిరించ తలచాము.

ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల కమిటీవారు (ఎ.పి.సి ఎల్.సి) శ్రీ ప్రతాపరెడ్డిగారిని సంయుక్త కార్యాచరణకు ఉపక్రమిద్దామని, ఆ సమన్వయ సంఘానికి ఆయనను సమావేశకర్తగా ఉండమని కోరారు. ఇది మామూలుగా నక్సలైట్లు - ఆ మాటకు వస్తే కమ్యూనిస్టుల పద్ధతి - విధానం. సోదర సంస్థల నాయకత్వంతో వారి నాయకత్వం సరాసరి వ్యవహరించదు. సోదర సంస్థలలోని కొంత మందిని వారు ఎంపిక చేసుకొని వారు వ్యవహరిస్తారు. అలా చేస్తే తప్ప వారు చెప్పే 'క్రింది నుంచి సంయుక్త సంఘటన' (యునైటెడ్ ఫ్రంట్ ఫ్రం బిలో) వారనుకున్న రీతిలో సాధ్యం కాదు. ఎవరితోనయితే వారు సంయుక్త సంఘటనకు సిద్ధపడతారో వారిని ఒక సంస్త తరువాత మరియొక సంస్థను వరుస క్రమాలలో ముందు అన్నింటికన్నా పెద్దదానిని, తరువాత మిగిలిన వాటిలో పెద్దదానిని యిలా తాము తప్ప అందరినీ రంగం నుండి తప్పించటమే వారి ఎత్తుగడ. శ్రీ ప్రతాపరెడ్డిగారు సాదా సీదా మనిషి. కృత్రిమం, కుట్ర అయన స్వభావానికి అమడ దూరం కనుక పౌరహక్కుల కమిటీవారి ప్రతిపాదనను అయన కాదనలేదు. ఆయనను ముమ్మందుగా ఒప్పించి నన్ను ఫలానా తేదీ సమావేశానికి రమ్మనమని కబురు పెట్టారు. నేను వారు నిర్ణయించిన తేదీకన్నా ముందు ఒక తేదీకి అన్ని పౌరహక్కుల సంఘాలవారిని పిలిచాను. అప్పటికి రాష్ట్రంలో 6 సంఘాలున్నాయి. పౌరహక్కుల కమిటీ, పౌరహక్కుల ప్రజా సంఘం, మార్క్సిస్టులు

కమ్యూనిస్టులు వీరిరువురు కలిసి పనిచేసే ఆం.ప్ర. పౌరహక్కుల సంఘం(అసోసియేషను) ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థలు అదే పేరుతో రెండు, భారతీయ జనతాపార్టీకి దగ్గరగా వుండే మానవహక్కుల సంఘం(హ్యూమన్ రైట్సు అసోసియేషన్) అవి తమాషా ఏమిటంటే కమ్యూనిస్టులు రాలేదు. ఒక ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాలేదు. జనతా పార్టీ వారు వచ్చారు. పౌరహక్కుల కమిటీ, పౌరహక్కుల ప్రజా సంఘం, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంఘాలలో ఒకటి హ్యూమన్ రైట్సు అసోసియేషన్ వెరసి నాల్గు సంఘాలు (ఆరింట నాలుగు వచ్చినయి). అందరం కలిసికట్టుగా పనిచేద్దామని నేను ప్రతిపాదించాను రాని వారితో సంప్రతించటానికి నాకు అధికారం యిచ్చారు. కమ్యూనిస్టులతో సంప్రతించాను. జనసంఘం వారు మాలోకి వస్తే వారు రాలేమన్నారు. మార్క్సిస్టులతో మాట్లాడాను వారు నక్సలైట్లతో తాము కలిసే ప్రసక్తి లేదన్నారు. ఈ విషయాన్ని మానవహక్కుల సంఘం వారికి చెప్తే వారు మేమూ రామన్నారు. ఇక ఆరింట మూడు సంఘాలు మిగిలాయి. అందులో ప్రజాస్వామ్య పరిరక్షణ సంస్థకు చెందిన శ్రీ అయిలయ్యను (ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరు) విజ్ఞప్తిని రాయమన్నాం. విజ్ఞప్తి ముసాయిదా ప్రజాసంఘ పరిశీలన నిమిత్తం మాకు ముందుగా యిచ్చారు. ప్రతాపరెడ్డిగారి యింటిలో సమావేశమయినాం. నక్సలైట్లతో వుండే విద్యార్థి, యువజన, మహిళా సంఘాల ప్రతినిధులు కూడా వచ్చారు. శ్రీ అయిలయ్య ముసాయిదాలో నేనూ ఒక చిన్న సవరణ సూచించాను. 59వ రాజ్యంగ సవరణను వ్యతిరేకించమనే వాక్యంలో 'ప్రజలను కోరుతున్నాం' అనే పదజాలానికి బదులు "ప్రజాస్వామ్యంలో నమ్మకం ఉన్నవారిని కోరుతున్నాం" అనేదే ఆ సరవణ. ఈ సవరణకు అయిలయ్య ఒప్పుకొన లేదు. డా॥ బాలగోపాల్ సమ్మతించలేదు. వారి తాలూకు విద్యార్థి యువజన మహిళా సంఘాల ప్రతినిధులు వారి నాయకులకు వంతపలికారు. గంటన్నర సేపు చర్చించాం. మా వాళ్లూ మాట్లాడారు అందరం అంగీకారానికి రాలేకపోయాం. మరుసటి రోజు రాత్రి ఆదరంతో డా॥ బాలగోపాల్ మా యింటికి వచ్చి నాకు నచ్చచెప్ప ప్రయత్నించారు. నా సూచన కొంతమందికి సిద్ధాంతపరంగా అభ్యంతరకరం అని చెప్పాడు. అందరు ప్రజలను - ప్రజాస్వామంలో విశ్వాసం లేనివారిని కూడా - ఊరేగింపులో, ప్రదర్శనలో పాల్గొనమంటే వారు బాంబులు వేస్తే హింసాయుత చర్యలు చేస్తే రాజ్యంగ సవరణ వ్యతిరేక ఉద్యమానికే దెబ్బతగులుతుందని నా వాదన. అంతేగాక ప్రజలపై హింసను సాగించటానికి తమకు హక్కు వున్నదని వాదించేవారికి ప్రభుత్వ దమన నీతిని నిరసించే హక్కు నైతికంగా లభించదని నా అభిప్రాయం. మా సంఘపు వాళ్ళలో నేను ఎక్కువగా మాట్లాడినా ముందు చర్చలద్వారా మా వైఖరికి మేము అందరమూ సమ్మతించాము. చివరకు మాకూ నక్సలైటు పౌరహక్కుల సంఘాల వారికీ పొంతన కుదరలేదు. సంయుక్త కార్యాచరణ రూపం తాల్చలేదు ఇరు వర్గాల వారు వేరు వేరుగా సభలను సదస్సులను నిర్వహించాం. '59వ

రాజ్యాంగ సవరణను ఎందుకు వ్యతిరేకించాలి' అనే శీర్షికతో కరపత్రాన్ని నేను రాసి నా ఖర్చుతో మా పౌర హక్కుల ప్రజాసంఘం తరుపున ప్రచురించాను. పరాయి పట్టణాలలో. గ్రామాల్లో కూడా దీని విషయమై సభలు పెట్టాం. సంయుక్త కార్యాచరణ పథకం విజయవంతం కాలేదని నేను భారత సంఘాధ్యక్షుడు న్యా॥ రాజేంద్ర సచార్ గారికి రాస్తే మాకు ఢిల్లీలో అలాంటి యిబ్బందులు రాలేదని జవాబు రాశారు ఢిల్లీలో పీపుల్స్‌వార్ నక్సలైట్లు లేరని, ఆంధ్రప్రదేశ్, ఢిల్లీ వీటి రెంటి పరిస్థితులు వేరు వేరని నేను ప్రత్యుత్తరం రాసాను.

జనతంత్ర సమాజ్, పౌర హక్కుల ప్రజా సంఘం తరపున తార్కుండే ప్రభృతులు కాశ్మీరు వెళ్ళి అక్కడి స్థితి గతులను గురించి నివేదిక సమర్పించారు. వారు జమ్మూకు వలస వచ్చిన కాశ్మీరీ పండితులను కలవలేదు నివేదికలో వారి ప్రసక్తి రాలేదు వారు అలా అని స్పష్టంగా చెప్పకపోయినా ఆ నివేదిక కాశ్మీరులోని తీవ్రవాదులను సమర్థించేదిగా వుందనే భావాన్ని కలిగించింది దానిని విమర్శిస్తూ నేను హైదరాబాదులోని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' ఆంగ్ల దినపత్రికకు ఉత్తరం (సంపాదకునికి లేఖ) రాసాను అది అచ్చయింది అది ఆ పత్రిక వారికి నచ్చింది కాబోలు ఆ పత్రిక తాలూకు అన్ని 'ఎడిషన్సు'లో అచ్చు వేశారు. ఇలా కేంద్ర నాయకత్వంతో నాకు విభేదాలు -సిద్ధాంతపరంగా - పొడసూపసాగాయి.

# పౌరహక్కుల ఉద్యమం - 8

## పౌరహక్కులూ : న్యాయవాదులూ

బొంబాయి అఖిల భారత పౌరహక్కుల ప్రజా సంఘు మహాసభకు శ్రీ కన్నబిరాన్, నేనూ, శ్రీ శ్రీనివాసమూర్తి వెళ్ళాము ఉదయపూర్ మహాసభకు శ్రీ కన్నబిరాన్, నేనూ, విజయవాడ మిత్రులూ వెళ్ళాం. పూనా మహాసభలకు ఆంధ్రప్రదేశ్ నుంచి శ్రీ కన్నబిరాన్ కాక సర్వశ్రీ బల్వంత రెడ్డి, రామిరెడ్డి, సురమౌళి, శ్రీనివాసమూర్తి, రామమూర్తి ప్రభృతులు పన్నెండుమందికి పైగా వెళ్ళాం. దీనికి ప్రోత్సాహకుడు శ్రీనివాసమూర్తియే. అతడు ప్రధాన కార్యదర్శిగా వున్న మొదటి రెండు సంవత్సరాలు 1988-90లలో బాగా పనిచేశాడు తిరుపతి, కర్నూలు, విజయవాడ, గుంటూరు ఇత్యాది పట్టణాలలో జిల్లా శాఖలు వెలిశాయి. ప్రజా సంఘు వ్యాప్తి కోసం శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, గుంటూరు, కర్నూలు పట్టనాలను నేను సందర్శించాను క్రొత్తవారు సభ్యులుగా చేరారు నూతన కార్యకర్తలు ఉదయించారు. సంఘం జీవం పోసుకున్నది

1990లో ఆంధ్ర విద్యోదయ కాలేజీలోజరిగిన మహాసభ ముందు శ్రీమతి గీతా రామస్వామి (ఇబ్రహీంపట్నం ప్రాంతంలో ఆమె స్వచ్ఛంద సంస్థనునడుపుతూ వ్యవసాయ కార్మికులు, కవులుదార్ల మధ్య పనిచేస్తున్నారు. ఆమె భర్త శ్రీ సిరిల్‌రెడ్డి) నాయకత్వాన ఇబ్రహీం పట్న ప్రాంత గ్రామస్తులు కొందరు శ్రీ కె. ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా ప్రదర్శన చేశారు వారి గ్రామంలోని భూస్వామికి శ్రీ ప్రతాపరెడ్డి హైకోర్టులో న్యాయవాదియట ఆ కారణం చేత అతడు పౌరహక్కుల ప్రజా సంఘంలో వుండతగడని వారి అభిప్రాయం మేమంతా ఆ ప్రదర్శనను చూచాం. వారి వాదనను విన్నాం. అధ్యక్షుడుగా వున్న ప్రతాప రెడ్డి పేరును బల్వంతరెడ్డి సూచించలేదు. అయితే ఈ సమస్య నన్ను కలవర పరిచింది న్యాయవాద వృత్తిలోని నీతికీ పౌరహక్కుల ఉద్యం డిమాండు చేసే నీతికి వైరుధ్యం గోచరించింది ఒకసారి 'సండే అబ్జర్వరు' అనే ఆదివారం వారపత్రికలో ఒక ప్రముఖ పత్రికా రచయిత, పౌరహక్కుల ఉద్యమంలో కార్యకర్త - ఆల్వారజ్ అనుకుంటాను -శ్రీ తార్కుండేను తప్పుపట్టాడు తార్కుండే ఒక ప్రజా కంటకుడయిన పోలీసు ఆఫీసరు తరుపున సీనియరు ప్లీడరుగా సుప్రీంకోర్టులో వాదించాడుట తన క్లయింటు పశ్చాత్తాప పడితే శిక్షను తగ్గించమని మాత్రమే తాను వాదించానని, అతడు నిర్దోషియని తాను వాదించలేదని తార్కుండే సమాధానం చెప్పాడు ఏదయినా యిది ప్లీడరీ చేస్తున్న న్యాయవాదులందరినీ ఇబ్బంది పెట్టే సమస్య. బొంబాయిలో ఎం.ఎ రాణే, ఢిల్లీలో తార్కుండే, హైదరాబాదులో ప్రతాపరెడ్డి, కన్నబిరాన్ వగైరా మిత్రులు చర్చించి, తరచి చూచి, ఆలోచించి తేల్చుకోవలసిన ప్రశ్న. నేనుప్లీడరీ 1983 ఏప్రిల్ నుండి మానివేశాను కనుక నన్ను ఈ సమస్య బాధించలేదు; బాధించదు. ఇది న్యాయవాదులందరికీ, పౌరహక్కుల ఉద్యమంలో కృషిచేసే కార్యకర్తలకూ నాయకులకు సంబంధించిన సమస్య. అంతేకాక ప్రజాస్వామ్య ఉద్యమాలలో పాలుపంచుకునేవారికి, వాటి యందు ఆసక్తి గలవారికి కలత, చీకాకు కలిగించే సమస్య కనుకనే ఈ సమస్యను గురించి రాయటం జరిగింది

అనేక కారణాలవల్ల శ్రీనివాసమూర్తి మొదటి మూడు సంవత్సరాలు పనిచేసినంత చురుకుగా చైతన్యవంతంగా పనిచేయలేకపోయాడు. అం ప్ర. శాఖలో స్థబ్దత వచ్చింది. ఇప్పటికి 5, 6 సం॥ల నుండి ఏ పదవి చేపట్టకుండా తన విజ్ఞతతో కూడిన సలహాలతో పౌరహక్కుల ప్రజా సంఘానికి అండగా నిలబడిన సీనియరు సోషలిస్టు నాయకుడు శ్రీ చక్రధర్ మరోసోషలిస్టు నాయకుడు సురమౌళి (4 సం॥ ఆయన నగర శాఖ అధ్యక్షుడుగా వ్యవహరించారు) వీరల సహాయంతో సలహాలతో పౌరహక్కుల ప్రజా సంఘ పునర్నిర్మాణం 1992లో జరిగిది. శ్రీ కె ప్రతాపరెడ్డి అధ్యక్షుడుగా, సురమౌళి, శ్రీమతి మల్లాది సుబ్బమ్మలు ఉపాధ్యక్షులుగా, శ్రీ రావెల సోమయ్య (లోహియా అనుచరుడు, సోషలిస్టు, రాడికల్ హ్యూమనిస్టు భావాల యెడ ఆదరం కల వ్యక్తి, ఒకనాడు అం.ప్ర. సోషలిస్టు పార్టీ ఛైర్మను) ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయినారు. సంఘం పెద్దగా, అవిశ్రాంతంగా పనిచేయలేకపోయినా అవసరం కలిగినపుడు చైతన్యవంతంగా కృషి చేస్తున్నది. భారత మానవ హక్కుల కమీషను హైదరాబాదు వచ్చినపుడు కమీషనుకు విజ్ఞాపన పత్రం సమర్పించింది. పోలీసుల చేత హత్యచేయబడిన పత్రికా విలేఖరి రసూలు కేసులో, స్త్రీలపై జరిగే అత్యాచారాల కేసులో విచారణను డిమాండు చేసింది. సక్రమయిన విచారణను చేపడితే కమీషనుతో సహకరిస్తామని చెప్పింది.

ఒక విషయం చెప్పి ముగిస్తాను నక్సలైట్లు - తుపాకీ పట్టిన గ్రూపులు మూడూ - పోలీసులను ఖతం చేస్తున్నారు పోలీసులు నక్సలైట్లను 'ఎన్ కౌంటర్లు' పేర హతమారుస్తున్నారు. నిజానికి వారిద్దరి మధ్య జరిగేది ప్రకటింపబడని యుద్ధం దానికి సంబంధించి ఏ వైపు వారిని గురించి అయినా కలవరం చెందటం అనవసరమని నా భావం కాకపోతే నక్సలైట్లు కానిపోలీసులు కాని అమాయక ప్రజలను హింసస్తున్నా, చంపుతున్నా తప్పక అందోళన చెందవలసినదే. కాకపోతే బూటకపు ఎదురు దాడులను ఖండించడం, వ్యతిరేకించడం తప్పనిసరి. ఈ రకపు దృక్పధానికి బాసటగా వున్న తర్కాన్ని కొంత పరిశీలించడం అవసరం తుపాకీ గొట్టం ద్వారా అధికారాన్ని కైవసం చేసుకోవాలని, తెలుసుకొని బుద్ధిపూర్వకంగా ప్రాణాలకు తెగించి పోరాడేవారు సాయుధ పోరాట మార్గాన్ని చేపట్టిన నక్సలైట్లు. తమ విధి నిర్వహణలో ప్రాణాలకు ముప్పు - సామాన్య పౌరులకన్నా -ఎక్కువగా ఉంటుందని తెలుసుకొని, కళ్ళు తెరుచుకొని పోలీసు బలగంలో ఉద్యోగాలలో చేరినవారు పోలీసులు. మామూలుగా మానవులకు సంభవించే ప్రమాదాలు వీరికి సంభవిస్తే పెద్దగా కలవలరపడవలసిన అవసరం లేదు. ఇక ప్రజలంటారా వారి విషయం వేరని అందరూ అంగీకరిస్తారు ఇకపోతే బూటకపు ఎదురుదాడులు. బందీగా పట్టుబడిన ఏ వ్యక్తినీ చెట్టుకు కట్టివేసి కాల్చడం అనాగరికం; ప్రజాస్వామ్య వ్యతిరేకం అందుచేతనే ప్రజానీకమంతా దానిని గర్హించాలి. నిందితుని ప్రాణాలు తీయమని ఉత్తరువు యివ్వడానికి ఒక్క న్యాయస్థానానికి మాత్రమే -అదయినా విచారణానంతరం నిందితుడు దోషి అని, మరణ దండన అతనికి తగిన శిక్షయని భావించినపుడే -హక్కు ఉన్నది. ఇటీవల అసలు మరణ శిక్షను ఏ పరిస్థితులలోను విధించరాదని 'ఆమ్నేస్టీ' అంతర్జాతీయ సంస్థ అందోళన చేస్తున్నది పౌరహక్కులకు సంబంధించిన సమస్యలు కనుక వీటి ప్రస్తావన చేవలసి వచ్చింది.

# భారత హేతువాద సంఘం - 1

# మాడ్లిన్ హేర్ రాక

హేతువాద ఉద్యమంతో నా సంబంధం 1973లో మొదలయిందని ఇంతకు క్రితం చెప్పాను అది ఏదో రూపంలో 1993 దాకా కొనసాగింది ఈ ఇరువది సంవత్సరాలలో నేను మూడు రంగాలలో కృషి చేశాను. సౌలభ్యం కోసం దానిని మూడు విభాగాల క్రింద వివరించవచ్చు. ఒకటి భారత హేతువాద సంఘంలో నా పాత్ర. రెండవది ఇతర రాష్ట్రాలలోని ఉద్యమంతో నాకు గల పరిచయాలు. మూడవది ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమ సంబంధంగా నా ప్రమేయం వాస్తవానికి ఈ మూడింటిని కలిపి చూడగలిగితేనే హేతువాద ఉద్యమంలో నా కృషి గోచరమవుతుంది ఇంచుమించుగా 1976 వరకు హేతువాద ఉద్యమ సందర్భంగా నా ప్రయత్నాలను ఇంతకు పూర్వం రాయటం జరిగింది. ఇక తరువాత కథ ముమ్మందుగా దేశీయ స్థాయిలో నా జోక్యాన్ని గురించి ముచ్చటిస్తాను.

మిత్రుడు ఎ. సూర్యనారాయణ సారథ్యం విషయం తెలియ చెప్పాను కదా. భారత హేతువాద సంఘపు పాలఘాట్ (కేరళ) మహాసభ విషయం స్ఫురణకు తెచ్చుకోవాలి ఆ పట్టణంలో - అది జిల్లా ముఖ్యపట్టణం మాత్రమే - కేరళ హేతువాద మహాసభ రెండురోజుల పాటు జరిగింది. చివరి రోజున భారత హేతువాద మహాసభ అక్కడే, ఆ ప్రదేశంలోనే కూడింది నేను దానికి హాజరయ్యాను. కేరళ మహాసభకు ప్రతినిధులు 150 మంది దాకా వస్తే భారత మహాసభకు 60-70 మధ్య మాత్రమే రాగలిగారు. దానికి కారణాలు రెండు. ఒకటి, భారత మహాసభ కార్యక్రమాలు ఇంగ్లీషులో సాగింపబడటం ఆ భాష అర్థంకాని వారు రారుకదా! భారత హేతువాద సంఘ సభ్యత్వం వేరు రాష్ట్ర సంఘ సభ్యుడయినంత మాత్రాన ఒక వ్యక్తి సరాసరి భారత సంఘ సభ్యుడుగా పరిగణింపబడడు. అంటే యింకా స్పష్టంగా చెప్పాలంటే రెండు సంఘాల సభ్యత్వం వేరు వేరుగా ఉండేవి. పాలఘాటు మహాసభ 1975 లో జరిగిందని నాకు జ్ఞాపకం.

తరువాతి కథను కొద్ది పరిచయ వాక్యాలతో ప్రారంభిస్తాను మళయాళీ ఎక్కడ వుంటే అక్కడ హేతూద సంఘం ఉంటుందనీ, తమిళుడు ఎక్కడ వుంటే అక్కడ ద్రవిడ కజగం (ఇ.వి.ఆర్. స్థాపించిన సంస్థ. దానిని డి.ఎమ్.కె అన్నా-డి.ఎం.కె., ఎం జి.ఆర్. పేరుమీద ఉన్న డి.ఎం.కె రాజకీయ పార్టీలతో కలగా పులగం చేయవద్దు) ఉనికిలోకి వస్తుందని - సర్వ సాధారణంగా చెప్పేమాట. ఇది నా అనుభవంలోకి వచ్చిన విషయం కూడాను. ద్రవిడ కజగంలో నుండే పై చెప్పిన రాజకీయ పార్టీలు పుట్టాయి. సర్వశ్రీ కరుణానిధి, ఎం.జి.ఆర్. పార్టీ

స్థాపకులయ్యారు. (ఈనాటి ఎం జి.ఆర్ డి.ఎం.కె పార్టీ అధినేత యిపుడు తమిళనాడు ముఖ్యమంత్రిగా వున్న కుమారి జయలలిత). ఇ.వి. ఆర్ ది ఒక సామాజిక సాంస్కృతిక ఉద్యమం. దానికి బ్రాహ్మణ వ్యతిరేకత, ద్రవిడ సంస్కృతిపై గాఢాభిమానం, నాస్తికత్వం పట్టుకొమ్మలు. ఇ.వి.ఆర్. తరువాత ఆయన భార్య మణియమ్మ, శిష్యుడు వీరమణి ఆ ఉద్యమాన్ని నడిపారు. మణియమ్మ మరణానంతరం అది వీరమణి నాయకత్వాన కొనసాగుతున్నది. ద్రవిడ కజగం ఉద్యమ రూపంలోనే మనగలుగుతున్నది. నా యీ కబుర్లలో హేతువాద చరిత్రను మొత్తాన్ని దర్శనం చేసుకోవాలనుకుంటే చదువరికి ఆశాభంగం అవుతుంది. అలా రాయడం నా ఉద్దేశ్యం కాదని నేను మరోసారి హెచ్చరించాల్సి వస్తుంది. నా ప్రమేయం, నా జోక్యం, చెప్పుకోతగిన నా పాత్ర ఏ మేరకు వుంటే అవే కన్పిస్తాయి సంఘాలు, వాటిలోని అంతర్గత విభేదాలు, నాయకులు మధ్య స్పర్థలు, కీచులాటలు, వాటి పలితాలు, వాటి పరిష్కారాలు మాత్రమే గోచరమవడం వల్ల ఉద్యమం అంటే యిదే కాబోలు అని పాఠకునికి అభిప్రాయం కలిగితే, ఒకవేళ నారచనలు కలిగిస్తే ఆ భావం పొరపాటని, అది అసమగ్రపు ఆలోచనా ఫలితమని గ్రహిచడం అవసరం. ఉద్యమం ఎప్పుడూ సువిశాలం. వేల లక్షల మంది మనస్సులలో నాటుకున్న భావాలు, వారి హృదయాలలో చోటు చేసుకున్న తత్సంబంధమయిన ఉద్వేగాలు, అందుమూలంగా వారిలో కలిగే నమ్మకాలు, విశ్వాసాలు, వారి కార్యశీలత యివన్నీ ఉద్యమ సంబంధమయిన ముఖ్యాంశాలు. ఉద్యమాభిమానులందరూ ఉద్యమానికి సారద్యం వహించే సంఘంలో సభ్యులుగా వుండరు. ఒక ఉపమానంలో చెప్పాలంటే ఉద్యమం ప్రజానీకం లాంటిది సంఘం వారి సేన. సంఘ నాయకత్వంలో ప్రవేశం పొందినవారు సేనా నాయకులు. ఉద్యమ అధ్యక్ష కార్యదర్శులు ఆ సేనకు ప్రధాన నాయకశ్రేణిలోని వారు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే నేను రాసేకథలు చదివి ఉద్యమ స్వభావాన్ని ఏ పరిస్థితులలోనూ - అపార్థం చేసుకోవద్దని మరోసారి గుర్తు చేయడానికే

ఇక అసలు కథకు వద్దాం. 1978-80లోని భారత హేతువాద నాయకత్వానికి వద్దాం. శ్రీ లోఖండ్‌వాలా (బొంబాయి నగరవాసి) అధ్యక్షుడు. కార్యదర్శి శ్రీ ఎ. సూర్యనారాయణ. ఉపాధ్యక్షులు సర్వశ్రీ పవనన్ (కేరళ), ఎస్. నరసింహం(మదరాసు), ఎం.వి. రామమూర్తి(అం.ప్ర) ప్రభృతులు. కోశాధికారి శ్రీమతి వసుంధర(సూర్యనారాయణ భార్య). పత్రిక సంపాదకుడు మిత్రుడు శేషాద్రి (మదరాసు). పత్రిక 'ఇండియన్ రేషనలిస్టు' అనే పేరుతో ఇంగ్లీషులో వెలువడేది(ఈనాడు లోకండ్‌వాలా, శేషాద్రి కీర్తిశేషులు).

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో (యు.ఎస్.ఎ - మామూలుగా అమెరికా అంటున్నాం) టెక్సాసు రాష్ట్రంలో కేంద్ర కార్యాలయాన్ని నెలకొల్పి నాస్తికోద్యమాన్ని నడుపుతున్న శ్రీమతి మాడ్లిన్ హేర్ (ఆమె పత్రిక పేరు 'అమెరికన్ నాస్తికవాది -అమెరికన్ ఎథియిస్టు - ఆమె సంఘం పేరు

వేరు) భారత దేశ పర్యటనకు వస్తామన్నారు. ఆ వార్త అమె లేఖ ద్వారా శ్రీ ఎ. సూర్యనారాయణకు చేరింది. అలాగే జోసెఫ్ ఎడమరకు చేరింది (జోసెఫ్ ఎడమరు క్రైస్తవ కుటుంబంలో జన్మించాడు. నాస్తికోద్యమ భావాలకు దగ్గరయినాడు. కేరళలో హేతువాద ఉద్యమంలో తగు పాత్రను నిర్వహించాడు. గోరాగారితో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొని 'పార్టీలెస్ డెమోక్రట్' (పార్టీరహిత ప్రజాస్వామ్యవాది) అనే పేరుగల పత్రికను ఆంగ్ల భాషలో ప్రచురించాడు. ఇందిరమ్మ దౌష్ట్యానికి లోనయి కారాగార వాసం చేసి ఢిల్లీలో పత్రికా విలేకరిగా స్థిరపడ్డాడు అయితే కేరళ హేతువాద ఉద్యమంతో సంబంధాన్ని త్రెంచుకోలేదు. గ్రంథకర్తగా, అనువాదకుడుగా, ప్రచురణ కర్తగా రూపొందాడు శ్రీమతి మాడ్లిన్ హేర్ ఢిల్లీలో దిగారు తన భారత పర్యటనలో సాయపడమని ఎడమరుకును కోరారు. ఆయన సమ్మతించి ఆమెను పలు ప్రాంతాలకు తీసుకొని వెళ్ళారు. అమె వెంట అమె కుమారుడు ముర్రే, ఆమె మనువరాలు కూడా వచ్చాడు (గోరాగారి కుటుంబంలాగానే ఆమెది నాస్తిక కుటుంబం) ఆమె బృందం హైదరాబాదు వచ్చింది. నేను అమె బసచేసిన హోటలుకు వెళ్ళి వారిని కలసి మాట్లాడాను తరువాత - కొన్ని రోజుల తరువాత - ఆమె మదరాసు వెళ్లారు మిత్రుడు సూర్యనారాయణ అభ్యర్థనమేరకు నేను మదరాసు వెళ్లాను. అమె శేషాద్రి ఇంట్లో బసచేసింది. అక్కడ ఆమెతో అమెరికా, భారతదేశాలలోని ఉద్యమాల చరిత్రను తడివి చేశాము మదరాసు సమావేశంలో ఎడమరుకు లేరు ఆ మూడు రోజుల వ్యవధిలో ఆయన కేరళ వెళ్ళారు. మాడ్లిన్ హేర్అమెరికాకు తిరిగి వెళ్ళారు. ఆమె రాక హేతువాద ఉద్యమంలో ప్రధాన వ్యక్తులయిన సూర్యనారాయణ, ఎడమరుకుల మధ్య అగాధానికి దారితీసింది.

# భారత హేతువాద సంఘం - 2

# విషమ పరిస్థితి

మాడ్లిన్ హేర్ ప్రముఖ నాస్తికవాదిగా గుర్తింపును (ఏథియిస్టు అవార్డును) ఎడమరుకుకు యిచ్చింది ఆనాడు ఢిల్లీ హేతువాద సంఘానికి ఎడమరుకు అధ్యక్షుడు మరొక కార్యకర్త కార్యదర్శిగా వుండేవారు మాడ్లిన్ హేర్‌కు చేర్చే నిమిత్తం కొన్ని హేతువాద గ్రంధాలను సారస్వతాన్ని శ్రీ సూర్యనారాయణ ఢిల్లీ హేతువాద సంఘానికి పంపారు వాటిని ఏ కారణం చేతనో మాడ్లిన్ హేర్ వెంటతీసుకొని పోలేదు వాటి ఖరీదు మూడు వందల ముప్పది రూపాయల చిల్లర శ్రీ సూర్యనారాయణ వృత్తి రీత్యా ఆడిటరు లెక్కలు సరిగిఆ వుండకపోతే అతడు సహించలేడు ఎడమరుకు వెళ్ళడానికి రానుపోను టిక్కెట్టు మాడ్లిన్ హేర్ కొన్నారు. ఆతిథ్య బాధ్యత ఆమె వహించింది. అయినా ఖర్చులు ఉంటాయి కదా! టిక్కెట్టు కొరకు వాటికోసం అతడు విరాళాలు వసూలు చేశాడని శ్రీ సూర్యనారాయణ సందేహం. టిక్కెట్టు మాడ్లిన్ హేర్ పంపిన సంగతి శ్రీ సూర్యనారాయణకు తెలియదు. ఆయనకు ఎడమరుకుపై కోపం కలిగింది కారణాలు మూడు. 1 మాడ్లిన్ హేర్ పర్యటనను రూపొందించి నిర్వహించే బాధ్యత, గౌరవం భాదత హేతువాద సంఘానికి హక్కుగా దక్కవలసి వుండగా ఎడమరుకు దానిని కాజేశాడు 2 ఎడమరుకు తన అమెరికా పర్యటన కోసం విరాళాలు వసూలు చేయటం తప్పు. 3 భారత హేతువాద సంఘం ఢిల్లీ పంపిన పుస్తకాలు కాని దాని తాలూకు పైకం గాని భాదత హేతువాద సంఘానికి ముట్టలేదు. ఇది అతని మనస్సులో ఉన్నాయని నా అంచనా. అంత శ్రీ సూర్యనారాయణ-ఒక సర్క్యులరు ఉత్తరం రాసి దేశంలో సుమారు 400 మందికి పంపాడు. దాంట్లో ఎడమరుకు మోసగాడని, తన స్వార్థం కొరకు విరాళాలు వసూలు చేస్తున్నాడని రాశాడు దానకి జవాబుగా మరోప్రకటనను ఎడమరుకు ప్రముఖ హేతువాదులందరికి పంపాడు. అందులో శ్రీ సూర్యనారాయణ నయా 'పోప్'గా, 'ఖొమిని' గా అభివర్ణించాడు. శంకరాచార్యులవలె వ్యవహరిస్తున్నాడని నిందించాడు. దానికి ప్రత్యుత్తరమిచ్చాడు సూర్యనారాయణ. ఈ లేఖలు నన్ను దిగ్భ్రాంతికి లోనుచేశాయి. భాదత హేతువాద సంఘ కార్యనిర్వాహక వర్గ సమావేశంను పిలిచి యీ లేఖ శ్రీ సూర్యనారాయణ విడుదల చేయలేదు. అధ్యక్షుడు లోఖండ్‌వాల్ అనుమతి తీసుకొనలేదు ఉపాధ్యక్షులను సంప్రదించలేదు. మదరాసులో వున్న తన మిత్రులను మాత్రం సంప్రదించినట్లు తెలిసింది. కేరళ హేతువాద సంఘంలో ఎడమరుకు తగినంత బలం వుంది. ఆనాడు కనీసం మూడవ వంతు మంది రాష్ట్ర సమితి సభ్యులు అతనికి అనుకూలురని నా అంచనా. కేరళ హేతువాద సభ జరిగింది. పవనన్ అధ్యక్షతన భారత హేతువాద సంఘానికి

ప్రత్యామ్నాయంగా నూతన హేతువాద సంస్థను ప్రారంభించడానికి ప్రయత్నాలు చేయాలనే తీర్మానం ఆమోదింపబడింది. ఇది సహజంగా నాబోటివారికి, లోఖండ్‌వాలాకు ఆందోళన కల్గించింది. మళయాళీలు దేశం అంతటా ఉండటం, హేతువాద ఉద్యమంలో పనిచేసేవారిలో ఎక్కువమంది మళయాళీలు కావటం మా అలజడికి కారణం. హేతువాద ఉద్యమంలో చీలిక రావచ్చునే భావమే భరించరానిదయింది

ఉత్తర భారతదేశంలో హేతువాద ఉద్యమాన్ని సంఘటితం చేయటానికి 'ఉత్తర భారత హేతువాద సమాఖ్య' ను నార్త్ ఇండియన్ రేషనలిస్టు ఫెడరేషను, ఎడమరుకు స్థాపించ పూనాడు. ఎడమరుకు తనను గురించి వాడిన నిందావాక్యాలకు కినిసి శ్రీ సూర్యనారాయణ ప్రధాన కార్యదర్శి పదవికి రాజీనామా పెట్టాడు. ఈ పరిస్థితులలో అధ్యక్షుడు లోఖండ్‌వాలా ఒక సమావేశాన్ని హైదరాబాదులో ఏర్పాటు చేయమన్నాడు మదరాసు నుండి సర్వశ్రీ సూర్యనారాయణ, వసుంధరలు వచ్చారు. శ్రీ లోఖండ్‌వాలా బొంబాయి హేతువాద సంఘంలో తనకు ఎంతో సహాయకారిగా వుంటున్న మళయాళీ మిత్రుని వెంట పెట్టుకొని వచ్చాడు. అతనికి ఎడమరుకు సన్నిహితుడు. మాయింట్లోను, లోఖండ్‌వాలా వున్న హోటలు గదిలో సమావేశాలు జరిగాయి. ఒక రాజీ సూత్రాన్ని ప్రతిపాదించాడు ఆ మళయాళీ మిత్రుడు (ఆయన పేరు వెంటనే స్ఫురించటం లేదు) ఉత్తర భారత హేతువాద సమాఖ్యను స్థాపించే ప్రయత్నాన్ని ఎడమరుకు విరమించాలని, ఎడమరుకు తన కార్యకలాపాలను ఢిల్లీ హేతువాద సంఘానికి పరిమితం చేసుకోవాలని, శ్రీ సూర్యనారాయణ తన రాజీనామాను ఉపసంహరించుకోవాలని దాని ముఖ్యాంశాలు. ఆ రాజీని లోఖండ్‌వాలా గారు, నేను బలపరిచాము వసుంధరగారు కూడా ఆ రాజీని అంగీకరించమని శ్రీ సూర్యనారాయణతో చెప్పారు అతడు విధిలేక సమ్మతించాడు. అయితే హోటలు గదినుండి ఇంటికి వచ్చిన తరువాత (ఆ దంపతులు అప్పట్లో మా యింట్లో అతిధులు) శ్రీ సూర్యనారాయణ తనంత బాధకు లోనయిన వ్యక్తిక మరొకడు లేదు అని అన్నాడు. ' ఈ దినము జరిగింది మీకు విజయం నిజానికి ఎడమరుకుకు ఓటమి, అన్నాను. ఆయన బాధపడడం మానలేదు "వ్యక్తులు, ఎంతవారయినా, పని మానేసినందువల్ల ఉద్యమాలు నశించవు, కాకపోతే కుంటుపడతాయి మీ కింకా అసంతృప్తి వుంటే పదవి వదిలి వెయ్యండి నేను చేపట్టాను" అని చెప్పాను శ్రీ సూర్యనారాయణ మౌనం వహించాడు రాజీని సర్వశ్రీ సూర్యనారాయణ, ఎడమరుకు అమలు చేశారు కాని సూర్యనారాయణ గారి పనిలో చురుకుదనం పోయింది.

శ్రీ లోఖండ్‌వాలా పూనికపై 1980లో బొంబాయిలో అఖిల భారత హేతువాద మహాసభ జరిగింది. పవనన్, ఎడమరుకు అతని కుమారుడు సనాల్ ఎడమరుకు, అనేకమంది

తెలుగు వారు, మళయాళీ మిత్రులు మహాసభకు వచ్చారు నా ఆహ్వానంపై హ్యూమనిస్టు మిత్రులు ఎ.బి.షా, డబ్ల్యు ఎస్ కానే. ఎం ఎ రాణే ప్రభృతులు హాజరయినారు. నా కోరికను మన్నించి సుప్రీంకోర్టు న్యాయమూర్తి చిన్నపరెడ్డిగారు మహాసభకు ప్రారంభోత్సవం చేశారు హైదరాబాదులోని ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు డా॥ పి భార్గవ అధ్యక్షత వహించారు. మహాసభ బాగా జరిగిపోతున్నది భారత హేతువాద సంఘానికి నూతన నియమావళి కావాలని పవనన్ (అప్పటికి ఆయన బలవత్తరంగా వున్న కేరళ హేతువాద సంఘానికి -- కేరళ యుక్తివాద సంఘం అని దాని పేరు -- అధ్యక్షుడు) ప్రతిపాదించాడు అందరం ఆమోదించాం కొన్ని మౌలిక సూత్రాలను పేర్కొని ముసాయిదా నియమావళి తయారుచేయడానికి నేను, సనాల్ ఎడమరుకు సభ్యులుగా ఉపసంఘాన్ని నియమించింది మహాసభ ఆ మొదటిరోజు రాత్రంతా కష్టపడి ముసాయిదా తయారు చేసి మరునాడు మహాసభ ముందు పెట్టాం మహాసభ దానిని ఆమోదించింది సాయంత్రం సభకు లోఖండ్‌వాలా అధ్యక్షత వహిస్తున్నారు ఏదో ఒక అంశం మీద లోఖండ్ వాలా వ్యాఖ్యను ఎడమరుకు (తండ్రి కొడుకులు) నిరసించి గట్టిగా మాట్లాడారు దాంతో అవతల బహిరంగ సభ ఉందని చెప్పూ లోఖండ్‌వాలా నిష్క్రమించాడు. మిగత కార్యక్రమాలను నన్ను నడపమని వెళ్ళిపోయాడు. నేనూ ఎడమరుకు ప్రవర్తనకు వ్యథ చెందాను అర్థంతరంగా సభను ముగిస్తానన్నాను. పవనన్ జోక్యం చేసుకొని శాంతియుత వాతావరణాన్ని కల్పించాడు మహాసభ జయప్రదంగా ముగిసింది. లోఖండ్‌వాలా అధ్యక్షులుగా, పవనన్, ఎడమరుకు, సూర్యనారాయణ ప్రభృతులు ఉపాధ్యక్షులుగా, నేను ప్రధాన కార్యదర్శిగా, సనాల్ ఎడమరుకు సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడినాము భారత హేతువాద సంఘంలో చీలికను నివారించటంలో నా పాత్రకూడా ప్రముఖంగానే వుంది

ఆ మహాసభ సందర్భంగా బొంబాయి హేతువాద సంఘ అధ్యక్ష కార్యదర్శులుగా వున్న సర్వశ్రీ లోఖండ్‌వాలా, సామంత్‌లు తమ స్వయం కృషితో వసూలు చేసిన విరాళాల మొత్తంలో ఖర్చులు పోగా నలుబది వేల రూపాయిలు మిగిలిందని లోఖండ్ వాలాగారు చెప్పారు. ఆ పైకాన్ని ఏమి చేయాలన్నది చర్చకు వచ్చింది. ఇరువది వేల రూపాయలు బొంబాయి హేతువాద సంఘానికి చెందాలని మిగతా పైకం 20 వేల రూపాయలు 'హేతువాద ట్రస్టు' కు చెందాలని తీర్మానించాం. భారత హేతువాద సంఘ అధ్యక్ష, కోశాధికారి, ప్రధాన కార్యదర్శి హోదాలో వున్నవారు. సర్వశ్రీ లోఖండ్‌వాలా, సామంత్‌లు వ్యక్తులుగాను ట్రస్టుకు ధర్మకర్తలుగా వుండాలని ఏకగ్రీవంగా నిర్ణయింప బడింది.

# భారత హేతువాద సంఘం - 3

# 1981 - 1992

సంఘ ప్రధాన కార్యదర్శిగా నేను బొంబాయిలో జాతీయ సమితి సమావేశాన్ని ఏర్పాటు చేశాను. దానికి శ్రీ సూర్యనారాయణ (మాజీ ప్రధాన కార్యదర్శి) వచ్చారు ఢిల్లీకి తను పంపిన గ్రంథాల విషయమయి లెక్కచెప్పకపోవటంలో ఎడమరుకుది తప్పులేదని తరువాత తెలిసిందని ఒప్పుకున్నారు. అంతటితో ఆయనకు జోసఫ్ ఎడమదుకుకు వున్న తగాదా ముగిసింది కోవూరు పర్యటన ఫలితంగా హేతువాద ఉద్యమం యెడ సానుభూతి దేశమంతటా నెలకొనప్పటికి సంఘపరంగా బలం తక్కువగానే ఉంది కేరళలో మాత్రమే రాష్ట్ర శాఖలకు ప్రజా ప్రాతిపదిక వుండేది. తతిమ్మా రాష్ట్ర సంఘాలు ఉదాహరణకు ఒరిస్సా, మధ్యప్రదేశ్ సంఘాలు నామమాత్రంగా ఉన్నాయి. నూతన నిబంధనావళి ప్రకారం 4 జిల్లా సంఘాలుంటే తప్ప రాష్ట్ర శాఖకు అస్తిత్వం వుండదు ఢిల్లీలో మాత్రం రాష్ట్ర శాఖ పనిచేస్తున్నది. కర్నాటక రాష్ట్ర సంఘం భారత సంఘంలో చేరలేదు సంఘాన్ని అన్ని రాష్ట్రాలలో వ్యాప్తి చేయాలని ప్రయత్నించాను. రాజస్తాను, గుజరాత్, మహారాష్ట్ర, బెంగాలు, ఉత్తరప్రదేశ్‌లో వున్న హ్యూమనిస్టులను హేతువాద సంఘ నిర్మాణాన్ని తమ తమ రాష్ట్రాలలో చేపట్టమని ఎంతో అనునయంగా చప్పాను. సూత్ర ప్రాయంగా వారు అంగీకరించారు కాని నా ఆలోచన కార్యరూపం దాల్చలేదు. 1982 ఢిల్లీలో మహాసభను ఎడమరుకు ఏర్పాటు చేశారు 1982లోగా లోఖండ్ వాలా మరణించారు. ఉద్యమం మంచి నాయకుని కోల్పోయింది ఆంధ్ర ప్రాంత హేతువాదులు, నేను వెళ్ళాం. చేశంలో పలు ప్రాంతాలనుండి హేతువాదులు వచ్చారు కేరళ హేతువాదులు మంచి సంఖ్యలో వచ్చారు. నా సూచన మేరకు బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపసాధ్యక్షులుగా వున్న శ్రీ బి. నరసింహయ్యను భాదత దేశగౌరవ సంఘాధ్యక్షులుగా (ఛైర్మన్) వుండమని అభ్యర్థించాము అంతకుముందు బంగుళూరు వెళ్ళినపుడు వారితో పరిచయం అయింది వారు అంగీకరించారు. సనాల్ ఎడమరకును ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు సర్వశ్రీ పవనన్, జోసెఫ్ ఎడమరుకు, రావిపూడి వెంకటాద్రి నేను ఉపాధ్యక్షులమయాం. కోవూరు పర్యటనలవలె నరసింహయ్యగారు భాదత దేశంలో పర్యటించాలని ఆయన వెంట శ్రీ స్వామినాధన్ లాంటి ఇంద్రజాలికుని, శ్రీ పి.కె. నారాయణన్ లాంటి 'హిప్నటిస్టు'ను తీసుకొని వెళ్లాలని నా ఆలోచన. నరసింహయ్యగారి అనుమతి పొందాలని ఆశపడి ప్రయత్నించాను ఆయన అనారోగ్యం, ఆయన తన కార్యకలాపాలనుండి నెల రోజులు కూడా విడిపడలేకపోవడం నా పథకానికి అడ్డు వచ్చినయి. నరసింహయ్యగారు బ్రహ్మచారి ఆయన అధ్యాపక వృత్తి చేస్తున్నపుడు సంపాదించిన లక్ష

రూపాయలు బెంగుళూరు బసవన్ గూడిలో వున్న కళాశాలకు విరాళంగా యిచ్చి ఆ కళాశాలకు ప్రిన్సిపాలుగా, డైరెక్టరుగా జీతం లేకుండా పనిచేస్తున్నారు కళాశాల హాస్టలులో గదిలో వుంటూ ఒక చాప, పరుపుచుట్ట, ఒక పెట్టే మాత్రంగా ఆస్తిగా జీవయాత్ర సాగిస్తున్న హేతువాది. ఇతరత్రా గాంధీయవాది నిరాడంబర జీవి. అటువంటి మహా వ్యక్తి సేవలను సర్వులూ కోరతారు. స్థానికంగా వారానికి ఒకరోజు బెంగుళూరు పట్టణంలో సంవత్సరాల తరబడి ఒక ఉపన్యాసాన్ని యిచ్చేవారు హేతువాద ఉద్యమ సందర్భంగా అందరికి అచ్చట అందుబాటులో వుండేవారు 'పిల్ల' సాయిబాబా బండారాన్ని బయిట పట్టిన సత్యశోధకుడు.

కేరళ హేతువాద సంఘపు అధ్యక్షుడు శ్రీ పవనన్. ఆయన భారత కమ్యూనిస్టు పార్టీ అనుయాయి. ప్రధాన కార్యదర్శి శ్రీ కమలనాథన్ మార్క్సిస్టు భావ ప్రభావానికి లోనయినవాడు. వారిద్దరూ ఆయా పార్టీల సభ్యులు కాదేమోనని నా నమ్మకం. కేరళ హేతువాద సంఘంలో వారికి, ఎడమరుకుల మధ్య విభేదాలు వచ్చి కేరళ హేతువాద సంఘం భారత హేతువాద సంఘంతో సంబంధం త్రెంచుకున్నది. ఇదంతా జరిగిన నెల రోజులకు నాకు తెలిసింది. నేను పరిస్థితులను మార్చలేకపయాను. శ్రీ సనాల్ ఎడమరుకు తనతో అంగీకరించే హేతువాదులతో కేరళ శాఖను ఉనికిలోకి తెచ్చాడు. అఖిల భారత మహాసభను 1985 ఆం.ప్రం హేతువాద సంఘం విజయవాడలో జరిపింది దానికి హైదరాబాదులో వున్న భూగర్భ భౌతిక శాస్త్ర కేంద్రానికి డైరెక్టరుగా వున్న డా॥ వినోద్ కుమార్ గౌర్ గారిని ప్రారంభకులుగా పిలిచాం. ఆయనను భారత హేతువాద గౌరవ సంఘాధ్యక్షులుగా ఎన్నుకున్నాం. కేరళ నుండి తదితర ప్రాంతాలనుండి ప్రతినిధులు వచ్చారు. సనాల్ ప్రధాన కార్యదర్శిగా కొనసాగాడు. సర్వశ్రీ జోసఫ్ ఎడమరుకు, రావిపూడి వెంకటాద్రి ఉపాధ్యక్షులు అయ్యారు.

భారతదేశంలోని హేతువాదులను, నాస్తికులను, హ్యూమనిస్టులను, సెక్యులరిస్టులను అందరినీ కలిపి వారి మధ్య సమన్వయం తెచ్చి ఒక పటిష్టమైన ఉద్యమాన్ని నిర్మించాలని నా సంకల్పం. ఒకసారి జంటనగరాలలోని ఇ.వి.ఆర్. అనుయాయులు ఆయన జన్మదినోత్సవ సభను ఏర్పాటు చేశారు. ప్రసంగించమని సర్వ న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు గారిని, జ్వాలాముఖిని, నన్ను కోరారు. మేము మాట్లాడాము. ఆ సభలో ఆయనతో నాకు పరిచయం అయింది హేతువాద ఐక్యతను గురించి ప్రస్తావించాను. ఆయన సూత్రప్రాయంగా అది అవసరమేనని తను సహకరిస్తానని చెప్పారు. తరువాత ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. ఆయన ఏదో కారణం చెప్తూ వుంటే కాలయాపన జరిగింది. ఈ విషయం అంతకుముందు శ్రీ పవనన్‌తో చెప్తే "వీరమణి సూర్యనారాయణతో కూడ కలసి పనిచేయడానికి అంగీకరించలేదు ఇపుడు మీతోనూ అంతే. అతని దృష్టిలో మీరు బ్రాహ్మణులు కదా!" అని అన్నాడు. "ఆవిషయం నాకు వదిలిపెట్టండి. నేను ప్రయత్నిస్తాను" అని హామీ యిచ్చాడు. ఇది 1980లో బొంబాయిలో జరిగిన

సంభాషణ ఐక్యతకు, సమన్వయానికి నేను ఒక సూత్రాన్ని రూపొందించాను. కనిసం 4 రాష్ట్రాలలో శాఖలున్న సంఘం భారత స్థాయి సంఘమని, రెండు జిల్లాలో మాత్రమే శాఖలున్న సంఘం రాష్ట్ర స్థాయి సంఘమని, రెండు తాలూకాలలో శాఖలున్న సంఘం జిల్లా స్థాయి సంఘమని ఈ సంఘాలకు అయా స్థాయి, సమన్వయ కమిటీలలో స్థానాలు ఉండాలనేదే నా ప్రతి పాదన. ఈ సూచన ముసాయిదా ప్రతిని దేశం మొత్తంలో వుండే అన్ని రకాల సంఘాలకు పంపాను. దీనిని గోరాగారి 'పాజిటివ్' నాస్తికుల నాయకుడు శ్రీ లవణం త్రోసిపుచ్చాడు. భాదతస్థాయి సమన్వయ సంఘంలో అన్ని వర్గాలవారికి సమానస్థాయి ప్రవేశం ఉండాలన్నాడు. శ్రీ వీరమణి ఆనాసక్తత, శ్రీలవణం వ్యతిరేకత ఉద్యమ సమన్వయానికి నేను చేసే ప్రయత్నాలను నిరుత్సాహపరిచినయి. ఆ విషయాన్ని నేను అంతటితో వదిలివేశాను. భాదత హ్యూమనిస్టు సంఘం, హేతువాద సంఘం, భాదత సెక్యులర్ సంఘం ఈ మూడు భాదత సంఘాలతో నేను సమన్వయ సమితిని స్థాపించవచ్చు. కాని అది నేను ఆశించిన ఫలితాన్ని తీసుకొని రాలేదు. కేవలం హ్యూమనిస్టు సమాఖ్యగా మిగిలిపోతుంది. అది నా లక్ష్యం కాదు గదా!

1986లో భారత హేదువాద సంఘానికి నేను అధ్యక్షుడునయినాను. సనాల్ పబ్లిషరుగా, ఎడిటర్‌గా వుండి 'మోడరన్ ఫ్రీ థింకర్' అనే పేరుతో ఇంగ్లీషులో మాసపత్రికను నడిపేవాడు. మదరాసులో సర్వశ్రీ సూర్యనారాయణ, జ్యోతి శంకరులు 'ఫ్రీ థాట్' అనే పేరుతో ఇంగ్లీషులో నడిపారు. అది 1973 నుండి 1979 వరకు కొనసాగింది.

హైదరాబాదులో, ఢిల్లీలో భాదతదేశ స్థాయిలో రెండు అధ్యయన తరగతులు జరిగినయి. కేరళలో, ఆంధ్రప్రదేశ్‌లో రెండు సంవత్సరాల కొకసారి మహాసభలు జరిగేవి. ఒరిస్సా శాఖ తిరిగి పనిచేయడం ప్రారంభించింది. మధ్యప్రదేశ్ శాఖ చైతన్యాన్ని పొందింది. లోఖండవాలా మరణంతో బొంబాయి శాఖ కార్యక్రమాలు కుంటుపడినాయి. 1980 మహాసభలో నిర్ణయించినట్లు హేతువాద ట్రస్టు పేర బొంబాయిలో శ్రీ సామంత్ చేత బ్యాంకులో వేయబడిన 20 వేల రూపాయల నిధిని ఢిల్లీకి (ప్రధాన కార్యదర్శి సనాల్ ఢిల్లీలో వుండటంతో ఢిల్లీలోనే భారత హేతువాద సంఘ కార్యాలయం వుండేది) మార్పించడానికి ప్రధాన కార్యదర్శికి అధికారం యిస్తూ తీర్మానించాం. భారత హేతువాద సంఘపు గ్రంధాలయం మదరాసులో శ్రీ సూర్యనారాయణ యింట్లో వుంటుంటే (అందులో చాలవరకు పుస్తకాలు భారత హేదువాద సంస్థ స్థాపకుడు శ్రీ ఎస్. రామనాథన్‌వి గ్రంధాలయం ఆయన పేరుతో నడిచేది) దాని విషయం చేయతగు పనిని సూచించటానికి నాకు అధికారం యిచ్చారు. శ్రీ సూర్యనారాయణ తన ఉద్యోగ సందర్భంగా మదరాసు వదిలిపెట్టటంతో ఆ సందర్భమయిన ప్రయత్నం ఫలించలేదు. 1988లో కేరళలో జరిగిన భారత హేతువాద మహాసభలో భారత హేతువాద సంఘాధ్యక్షునిగా శ్రీ రావిపూడి వెంకటాద్రి పేరును సూచిస్తానని ఆయనతో చెప్పాను. ఆయన అంగీకరించాడు. కాని రేపు

ఎన్నికగా కావించారు. ఎన్నికైన నేను అనారోగ్యంవల్ల రాజీనామా చేశాను. ఒంగోలులో ఆంధ్ర హేతువాద మహాసభ సమయంలో జాతీయ సమితి శ్రీ రావిపూడిని అధ్యక్షునిగా ఎన్నుకున్నది. సంవత్సరం అయిన తరువాత 1990లో శ్రీ రావిపూడిని అధ్యక్షునిగా నన్ను ఛైర్మనుగా ఢిల్లీ మహాసభలో ఎన్నుకున్నారు. నరసింహయ్యగారి తరువాత శాస్త్రజ్ఞుడు వినోద్‌కుమార్ గౌర్, న్యాయమూర్తి జనార్ధనరావు (బొంబాయి) వరుసగా ఛైర్మనులుగా ఎన్నుకోబడ్డారు. 1992 93వ సంవత్సరాలలో ప్రఖ్యాత చరిత్రకారుడు బొంబాయి విశ్వవిద్యాలయ ప్రొఫెసరు ఛైర్మను అయినాడు. నేను ఛైర్మనుగా వున్న కాలంలో పెద్దగా నేను ఉద్యమానికి సంఘానికి చేసింది లేదు. కాకపోతే 1990 ఢిల్లీ మహాసభను చెక్కి వచ్చాను. ఇద్దరు శ్రీ సనాల్ రావిపూడిలే పనిచేస్తూ వచ్చారు.

హేతువాద ట్రస్టు తాలూకు నిధి ఢిల్లీలో బ్యాంకుకు తరలించబడింది. ఆనిధిని అలాగే ఉంచడం జరిగింది. ప్రతి సంవత్సరం వచ్చే వడ్డీతో అది పెరిగింది. ఈ నిధిని బొంబాయి నుండి తరలించటం శ్రీ సామంత్‌కు అయిష్టమయింది. రెండు పర్యాయాలు నేను సామంత్‌ను కలిసి మాట్లాడినా ఆయన వైఖరి మారలేదు. అతని సహాయనిరాకరణ వల్ల ఆ నిధిపై వచ్చే వడ్డీ మొత్తాలను కూడా సంఘ కార్యక్రమాలకు (ట్రస్టు షరతులు అలా వున్నా) వాడలేకపోయాం. పత్రిక కార్యాలయాల నిర్వహణ బాధ్యతను ఖర్చును శ్రీ సనాలే భరించేవాడు. కాకపోతే అధ్యక్ష హోదాలో నేను వున్న కాలంలో నేను ధనమో పణమో విరాళ రూపంగా యిచ్చి నా మనస్సును సమాధాన పరుచుకునేవాడిని.

# హేతువాద ఉద్యమం

# రాష్ట్రాలలో పర్యటనలు

హేతువాద ఉద్యమ కార్యకర్తగా నేను ఆంధ్ర ప్రదేశ్ మాత్రమే కాక యితం రాష్ట్రాలలో కూడ పర్యటించాను మధ్యప్రదేశ్‌లోని భిలాయ్ నగరాన్ని రెండుసార్లు దర్శించాను ఒకసారి వారి మహాసభలో ప్రసంగించడానికి, మరొకసారి వారి సభలో ఉపన్యసించటానికి వెళ్ళాను రండవసారి హేతువాద సద్ధతిలో వివాహానికి కూడ ఆచార్యత్వం వహించాను. ఆపట్టణంలో 30 మంది చురుకయిన కార్యర్తలున్నారు. అందులో ఆరుగురు దంపతులు కూడ వున్నారు. ఇది నాకు ఉత్సాహకారణమయింది

నేను సనాల్ యిద్దరం శ్రీ అద్వైత పూనికతో భువనేశ్వర్‌లో జరిగిన ఒరిస్సా రాష్ట్ర మహా సభలో పాల్గొన్నాం. సుమారు 8 జిల్లాల నుండి ప్రతి నిధులు వచ్చారు మహా సభ ఉద్యమానికి ఊపిరి పోసింది. 'ఒక బిడ్డ చాలు' అనే ఉద్యమాన్ని నడుపుతున్న దంపతులను కలిశాం.

హ్యూమనిస్టు కార్యకలాపాల సందర్భంగా నాపర్యటనలో హ్యూమనిస్టులను హేతువాద కార్యక్రమాల్లో పాల్గొనమని కోరేవాడిని ఢిల్లీ రాష్ట్ర మహాసభ ఢిల్లీ ప్రక్కన వున్న పట్టణంలో జరిగితే అందులో ప్రసంగించాను. ఎక్కువగా నేను తిరిగింది కేరళలో ఇంచుమించుగా అన్ని జిల్లా ముఖ్య పట్టణాలలో మహాసభలకు వెళ్లడం మాట్లాడటం జరిగింది. 1974లో పాలఘాటులో జరిగిన అఖిలభారత హేతువాద మమాసభకు క్రితం రోజున జరిగిన కేరళ యుక్తివాద మహాజభకుకూడ హాజరవటం అచ్చట ప్రతినిధుల శ్రద్ధాసక్తులను గమనించటం సంభవించింది మరల 1981లో కోయిలోను (క్విలన్) లో కూడిన కేరళ యుక్తివాద మహాసభకు నేనూ సుబ్బమ్మగారూ యిరువురం వెళ్ళాము 500 మంది ప్రతినిధులు వచ్చి రెండు రోజులు రోజుకు పదిగంటలు ఓపికగా ఉపన్యాసాలు విని చర్చలలో పాల్గొన్నారు. సుబ్బమ్మగారి ప్రసంగాన్ని నేను ఇంగ్లీషులోకి తర్జుమా చేశాను నేను ఉపన్యసించాను. సవాల్ ఎడమరుకు, అతని తల్లి శ్రీమతి సోలీ ఎడమరుకు వచ్చారు ఉపాధ్యక్ష పదవికి సోలీ ఎడమరుకుగారు పోటీ చేశారు. ఆమె ఒక్క ఓటుతో ఓడిపోయారు

కేరళ యుక్తివాద సంఘంలో అన్ని రాజకీయ పార్టీలవారు -- సోషలిస్టులు, కమ్యూనిస్టులు, మార్క్సిస్టు లెనినిస్టులు - మార్క్సిస్టులు కానివారు, ఏ రాజకీయ పార్టీకి చెందని హేతువాదులు అందరూ సభ్యులుగా వున్నారు. విశ్వవిద్యాలయాల్లో, కళాశాలల్లో ఆధ్యాపకులుగా వుండేవారు సంతోషంగా మహాపభలకు విచ్చేసి వివిధ అంశాల మీద పండిత ప్రసంగాలు చేయడం పరిపాటి. శాస్త్రం, సారస్వతం, కళలు అన్నింటినీ హేతువాద దృక్పథం నుండి పరిశీలించటం జరిగేది.

యుక్తివాద సంఘంలోని వివిధ వర్గాలు వారు సారస్వతాన్ని విక్రయించేవారు. కనీసం 200 పుస్తకాలు ప్రదర్శించబడేవి మహాసభల ప్రతినిధులలో ఊరేగింపులలో మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొనేవారు కనీసం 100కు తగ్గకుండా వుండేవారు. రాష్ట్ర కార్యదర్శి (తిరుచూరు) నివేదికపై చర్చ నాలుగు గంటలు పట్టేది. జరిగిన మహాసభకు న్యాయమూర్తి జహగీర్‌దార్ వచ్చి బ్రహ్మాండమయిన ఉపన్యాసం యిచ్చారు నేనూ మాట్లాడాను. ఆ పట్టణం కేరళ సాస్కృతిక కేంద్రంగా ప్రసిద్ధి చెందింది శ్రీ పవనన్ స్వంత ఊరు పేరు ప్రఖ్యాతులున్న కేరళలోని కవులు, కథా రచయితలు, నవలా గ్రంధకర్తలు, సాహితీ వేత్తలు అందరూ పాల్గొనటం ఆ మహాసభ ప్రత్యేకత కేరళ సాహిత్య పరిషత్తుకు పవనన్ కార్యదర్శి కావటం వల్లనే అది సాధ్యమయింది. సాహిత్య పరిషత్ కార్యాలయంలో మళయాళ సాహితీ మూర్తుల, కళాకారుల, పండితుల చిత్రపటాలు అన్ని గోడలను అలంకరించాయి వారి రచనలను మళయాళం నుండి ఇంగ్లీషులోకి అనువాదం చేయించి, ప్రముఖ గ్రంధ విక్రయ సంస్థ ద్వారా దేశమంతటా అమ్మడం ఆ సాహిత్య పరిషత్ విశిష్టత. మహాసభ చివరి రోజున సాగిన ఊరేగింపు కనుల పండువు చేసింది.

కేరళ యుక్తివాద సంఘంలో చీలిక రాక పూర్వం సంభవించిన రెండు సంఘటనలను పేర్కొనడం సమంజసం మాజీ ముఖ్యమంత్రి శ్రీ అచ్చుతన్ ప్రసంగిస్తూ (ఆయన కమ్యూనిస్టు నాయకులు) కమ్యూనిస్టులు మతాన్ని సహేతుకంగా, పట్టుదలగా ఎదుర్కొనక పోవటం వారి తప్పిదం అందువలననే పోలండు లాంటి తూర్పు ఐరోపా దేశంలో క్రైస్తవ మత ఛాందస వర్గం ప్రబలయిందని అన్నారు ఇలాంటి ఆత్మ విమర్శ నన్ను ఆశ్చర్య పరిచింది. శ్రీ అచ్యుతన్ నిజాయితీకి మారుపేరు.

కోయిలోను, తిరుచూరు మహాసభలలో ఏదో ఒక రానిలో -- ఎదో గుర్తు రావడం లేదు -- నేను ఉపన్యసిస్తూ పొరుగువాడి విషయం పట్టించుకొనని నాస్తికులకన్న తోటి మనుష్యులకు సాయపడే ఆస్తికులు -- మహాత్మా గాంధీ, స్వామి వివేకానందలు -- మెరుగు'' అని అన్నాను. చాలమంది హేతువాదులు ముఖముఖాలు చూచుకున్నారు ఎవరూ 'ఎందుకు అలా మాట్లాడారని' నన్ను ప్రశ్నించలేదు దుయ్యబట్టలేదు.

కేరళ యుక్తివాద సంఘం తరపున ఒక మాసపత్రిక వెలువడేది దాని సంపాదకుడు శ్రీ పవనన్. దానికి చందాదారులు వేల సంఖ్యలో వుండేవారు. అది గాక అనధికార పత్రికలు యింకా రెండుమూడు వుండేవి. వాటికి అధికార పత్రికకు ఉన్నంత ప్రాచుర్యం లేకపోయినా అవికూడా తగుమాత్రం సంఖ్యలో అమ్ముడుపోయేవి

కేరళ యుక్తివాద సంఘంలో చీలిక వచ్చిన తరువాత ఎడమరుకు వర్గం కేరళ హేతువాద సంఘం పేర చలామణీ అయింది వారి కొట్టాయం, ఎర్నాకులం, త్రివేండ్రం మహాసభలలో ప్రారంభోపన్యాసాలు చేశాను. ప్రతినిధుల సంఖ్య వందన్నర మించలేదు (కేరళ

యుక్తవాద సంఘం బలంకూడా తగ్గిందని విన్నాను). సంఘానికి శ్రీ సీని ప్రధాన కార్యదర్శిగా వుండేవారు జన్మత ముసల్మాను అయిన శ్రీ ముప్పయ్యార్ అధ్యక్షుడు శ్రీ ఊమెన్ చైతన్యం తొణికిసలాడే యువ కార్యకర్త విద్యార్థి నాయకత్వ శ్రేణి నుండి సంఘ నాయకులలో ఒకడయినాడు కొట్టాయంలో కేరళ సాహిత్య ప్రవర్తక సంఘ కార్యాలయాన్ని దర్శించి సంఘ నాయకులతో మాట్లాడాను వేల సంఖ్యలో మళయాళ గ్రంధాలను -- విజ్ఞాన సర్వస్వాలకు కూడ -- ప్రచురించి ॥ జిల్లా ముఖ్య పట్టణాలలోని తన విక్రయ కేంద్రాలలో ప్రజలకు అందిస్తున్న ఏకైక స్వచ్ఛంద సంస్థ గ్రంధ రచయితలకు పుస్తకపు విలువలో 25-30 శాతం పారితోషికంగా (రాయల్టి) యిచ్చే సంస్థ అలాంటి దానిని తెలుగువారు యెప్పటికయినా స్థాపించి నడపగలరా అనే ప్రశ్న నన్ను -- యీనాటికీ వేధిస్తున్నది

ఎడమరుకులు -- తండ్రీ కొడుకులు -- తమ 'ఇండియన్ ఎథియిస్టు పబ్లిషర్సు' చేత ప్రచురింప చేస్తున్న గ్రంధాలు వందన్నర పైగా వున్నాయి అవి మళయాళంలో, ఇంగ్లీషులో కూడా వెలువడుతున్నాయి ఆదీగాక వారు తేరళి అనే మళయాళ పత్రికను నడుపుతున్నారు. గ్రంధాలు ఎక్కువగా రాసేది తండ్రి జోసఫ్ ఎడమరుకు సనాల్ రాసిన పుస్తకాలు కూడా వున్నాయి కోవూరు జీవిత చరిత్రను, కోవూరు రచనలను ప్రజలకు అందించిన ఘనత జోసఫ్ ఎడమరుకుది. ఈ సారస్వతమే కేరళ హేతువాద సంఘానికి జీవగఱ్ఱ

ఎడమరుకులు నా మీద ఆదరంతో నాకిచ్చిన ప్రచారం వల్ల, మొదట్లో కేరళ యుక్తి వాద సంఘం నన్ను కేరళ ప్రజానికానికి పరిచయం చేసినందుచేత నా పేరు ఆంధ్రలో కన్న కేరళలో ఎంపరికి తెలియవచ్చింది సుబ్బమ్మగారి మహిళోద్యమ గ్రంధాలు మళయాళంలో శ్రీ సనాల్ సంస్థ ప్రచురించడంతో ఆమె పేరు కూడా బాగా వ్యాప్తిలోకి వచ్చింది

# ఆంధ్రప్రదేశ్ హేతువాద ఉద్యమంలో - 1

కోవూరు.పర్యటనలవల్ల, కోవూరు సాహిత్య ప్రచారం చేత, 'చార్వాక' పత్రిక వ్యాప్తి ఫలితంగా, హేతువాద సంఘ స్థాపనకు పరిస్థితులు ఒనగూడాయి ఏలూరు హేతువాద మిత్రులు శ్రీ గుసాసీ ఆధ్వర్యంలో రాష్ట్ర హేతువాద మహాసభను ఆ పట్టణంలో ఏర్పాటు చేశారు మేము దంపతులము మహాసభలో పాల్గొన్నాం ఒక్క జిల్లా మినహా అన్ని ఆంధ్ర ప్రదేశ్ జిల్లాలనుండి ప్రతినిధులు 500 మంది దాకా వచ్చారు మహాసభ జయప్రదంగా జరిగింది. సర్వశ్రీ విజయం (గోరాగారి కుమారులు) సాంబశివరావు (గోరాగారి సోదరుడు) కూడా మహాసభలొ వున్నారు వారి సహాయాన్ని ఆపేక్షించాను. ఉద్యమాన్ని నడిపే ప్రయత్నంలో నాస్తికులు సాయపడతారని సంఘంలో పదవులను స్వీకరించలేరని చెప్పారు. వారికి సభాముఖంగా కృతజ్ఞతలు తెలిపాను. బహిరంగ సభ తరువాత సంఘ నిర్మాణ బాధ్యతను మహాసభ నిర్వాహకులు నా పైన పట్టారు మిత్రులు సర్వశ్రీ రావిపూడి వెంకటాద్రి, ఎస్.వి బ్రహ్మంలు వెంట పట్టుకొని వ్చి నాకు శ్రీ కత్తి పద్మారావును (ఈనాడు ప్రముఖ దళితోద్మమ నాయకులు) ఉద్యమాన్ని ఆదుకోగల వ్యక్తియని పరిచయం చేశారు మిత్రుడు రావిపూడి వెంకటాద్రి పేరును అధ్యక్షునిగా సూచించాను. వెంటనే శ్రీ కత్తి పద్మారావు నాతో సభాముఖంగా మీరు తొందరపడుతున్నారు అని అన్నాడు. మీకు అవకాశం వస్తుంది, వేచి వుండండి అని చెప్పి సంఘానికి కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలకు తలా ఒక్కరు చొప్పున ముగ్గురు, ఒక మహిళ, నల్గురు ఉపాధ్యక్షులు ఉండేటట్లు, అలాగే నలుగురు సహాయ కార్యదర్శులు వుండేలాగు జిల్లాకు ఒకరు చొప్పున కార్యనిర్వాహక వర్గ సభ్యులుండాలని నేను సూచించాను. అందరూ సమ్మతించారు. ఉపాధ్యక్షులుగా శ్రీ కత్తి పద్మారావు, శ్రీమతి మల్లాది సుబ్బమ్మల పేర్లు ప్రకటించాను. తతిమ్మా రెండు స్థానాలకు ఆ ప్రాంతీయుల కొరకు ఖాళీలుంచాం గుసాసీని ప్రధాన కార్యదర్శిగా పేర్కొన్నాను. కార్యనిర్వాహక వర్గ సభ్యుల ఎంపిక, ఇద్దరు సహాయ కార్యదర్శుల ఎంపికజరిగింది.

1980 ప్రాంతంలో శ్రీ ఎస్ వి. రావును ( నర్సారావుపేట కాలేజీ ప్రిన్సిపాల్. ఇప్పుడు కీర్తి శేషులు) శ్రీ కత్తి పద్మారావు ఒక సంఘ కార్యనిర్వాహక సమావేశంలో పరిచయం చేశాడు. ఆయన హేతువాద పత్రిక పెట్టపోతున్నారని నాకు తెలియపర్చాడు; శ్రీ రావిపూడి రాసిన 'మార్క్సిస్టు వాస్తవికత గ్రంథం విషయం ప్రస్తావించాడు 1981లో రాజమండ్రిలో ద్వితీయ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మహాసభ జరిగే లోగా శ్రీ కత్తి పద్మారావు ఉద్యమ విస్తరణకు ఎంతో కృషిచేశాడు. కోస్తా ప్రాంతమంతా తిరిగి హేతువాదం పైవిశేషంగా ఉపన్యాసాలు చేశాడు. శ్రీ రావిపూడి రచనలద్వారా ఉద్యమానికి బలం చేరూర్చాడు శ్రీ రావిపూడి అభ్యర్థన మేరకు నేనూ, సుబ్బమ్మగారు

ఆలోచించి ఆం.ప్ర హైకోర్టున్యాయమూర్తి జీవన్‌రెడ్డి గారిని (ఇపుడు వారు సుప్రీంకోర్టు న్యాయమూర్తి) మహాసభలో ప్రారంభపన్యాసం చేశమని ఆహ్వానించాం వారు మహాసభకు విచ్చేసి ప్రబోధయుతమయిన ప్రసంగాన్ని చేవారు 300 మందికి పైగా ప్రతినిధులు వచ్చారు మహాసభ రెండురోజులు జరిగింది. శ్రీ జోసఫ్ ఎడమరుకు మహాసభకు రావడం హర్షదాయం ఆయనచేత శ్రీ ఎస్.వి. రావుగారి 'హేతువాదం' అనే మాసపత్రికను ఆవిష్కరణ చేయించాను. అది మిత్రుడు తోటకూర వెంకటేశ్వర్లుకు (చార్వాక సంపాదకుడు) కష్టం కలిగించిందని గ్రహించాను అప్పటికే చార్వాక పత్రిక క్రమంగా వెలువడటం లేదు. అయినా అయిదుకోట్ల ఆంధ్రులకు ఒక్క పత్రిక చాలదు అధికం ఫలం అనే సూక్తి ననుసరించి అలా చేయడం సంభవించింది. ఎవరో ఒక ప్రతినిధి రావిపూడి 'మార్క్సిస్టు వాస్తవికత' ను విమర్శించాడు శ్రీ రావిపూడి అనుయాయులు ఆ గ్రంధ ప్రచురణను సమర్ధిస్తూ కరపత్రం పంచారు మరుసటి రోజు ఎన్నికలలో శ్రీ కత్తి పద్మారావు ప్రధాన కార్యదర్శి పదవికి పోటీచేస్తాడని వినవచ్చింది శ్రీ రావిపూడి అనుయాయులు రాజమండ్రి హేతువాద ఉద్యమ నాయకుని పోటీ పెట్టతలిచారు ఇరువర్గాలు ఎన్నికలలో తలపడటానికి సమాయుత్తమవుతున్నాయి నేను, సుబ్బమ్మగారు చేయగలిగినది లేక గమనిస్తూ ఊరుకున్నాం. శ్రీ ఎస్.వి గారు వచ్చి "మీరు కలుగజేసుకోకపోతే పరిస్థితి విషమిస్తుంది" అని హెచ్చరించి నన్ను జోక్యం చేసుకోమని కోరారు. "నా మాట వినేవారు ఎవరు?" అని నేను ప్రశ్నించాను మీరు "ఊ అనండి, నేను రంగం సిద్ధం చేస్తాను" అని చెప్పి ఒక్కొక్క వర్గానికి నలుగురు చొప్పున ఎనిమిది మందిని ఆయన ఒకచోట చేర్చాడు. అందరూ రెండుగంటలు మాట్లాడారు నేను ఒక రాజీ ప్రతిపాదన చేశాను. 'శ్రీ రావిపూడి అధ్యక్షులు, శ్రీ కత్తి పద్మారావు ప్రధాన కార్యదర్శి, రాజమండ్రి మిత్రుడు కార్యాలయ కార్యదర్శి, ప్రతి జిల్లా నుండి వర్గానికి ఒకరు కార్యనిర్వాహక సభ్యులు' అనేదే నా సూత్రం. 'నన్ను నిర్వీర్యుణ్ణి చేస్తున్నారు' అన్నాడు శ్రీ కత్తి పద్మారావు జిల్లా నుండి రాష్ట్ర కార్యాలయానికి వచ్చే ప్రతి కాగితం మీకు ఒక 'కాపీ' కార్యాలయ కార్యదర్శికి మరో ప్రతి చేరుతుందని, అలాగే కేంద్రం నుండి జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలుకూడా వుండాలని నేను వివరించాను శ్రీ పద్మారావు సంతృప్తి చెందాడు అప్పటికి సంఘర్షణ తప్పిపోయింది

విప్లవ రచయితల సంఘానికి చెందిన శ్రీ త్రిపురనేని మధుసూదనరావు శ్రీ రావిపూడి రాసిన 'మార్క్సిస్టు' వాస్తవికత గ్రంథాన్ని గుడివాడలో దుయ్యబట్టూ రచయితను పేరుపట్టి నిందిస్తే, గుడివాడ హేతువాద మిత్రుడు గణేశ్వరం బాబూరావు అసమ్మతి తెలిపి 'పరోక్షంలో నిందించడం ఎందుకు? ముఖాముఖి బహిరంగంగా వాదించుకోండి' అని సలహా చెప్తే శ్రీ మధుసూదనరావు 'దానికి తను సిద్ధమే' నన్నాడు. శ్రీ రావిపూడి తరపున ఆ సవాలును స్వీకరించాడు శ్రీ బాబూరావు. గుడివాడలో సభ జరిగింది ఆం.ప్ర. నుండి 200 మంది దాకా

ప్రత్యేకంగా వచ్చారు నేనూ వెళ్ళాను శ్రీ వరవరరావు (విప్లవ రచయితల సంఘం నాయకుడు) కూడా వచ్చారు ఈ సభ జరిగిన తరువాత విజయవాడలో జరిగిన కార్యనిర్వాహక వర్గ సమావేశంలో 'హేతువాద సంఘాధ్యక్షుడిగా వుంటూ మార్క్సిజాన్ని ఘోరంగా ఖండించిన శ్రీ రావిపూడిని అభిశంసించడమయింది' అనే తీర్మానాన్ని చర్చకు పెట్టాడు శ్రీ కత్తి పద్మారావు ఆ సమావేశానికి నేనూ హాజరయినాను సభ్యులందరూ మాట్లాడారు చర్చ మూడుగంటలు పట్టింది సభ్యులు రెండు వర్గాలుగా చీలిపయారు చివరలో, "ఇద్దరికీ సమానంగా ఓట్లు వున్నాయి కాకపోతే ఈ పరిస్థితిలో, అధ్యక్షునికి అదనంగా ఓటు (కాస్టింగు వోటు) వుంది' అన్నాను 'విషయాన్ని గ్రహించి తీర్మానాన్ని చర్చించి వదిలివేయడమయినది' అందామని శ్రీ కత్తి పద్మారావు సూచించాడు అందరూ అంగీకరించారు అప్పటికి సంఘానికి మరో గండం గడిచింది

కార్యనిర్వాహకవర్గ సమావేశాన్ని పదిహేను దినాలలో వేయమని శ్రీ పద్మారావు సూచిస్తే 2 నెలల తదనంతరం వేద్దామని రావిపూడి అంటే కోపగించుకొని గుంటూరులో రాష్ట్ర మహాసభ జరిపి శ్రీ రావిపూడిపై క్రమశిక్షణ చర్య తీసుకున్నాడు శ్రీ పద్మారావు. దాంతో ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమ ప్రతీకగా వున్న సంఘం చీలింది. ఇదంతా సుబ్బమ్మ గారు రాసిన 'హేతువాద ఉద్యమ చరిత్ర అనే చిరు గ్రంథంలో వివరించబడింది

# ఆంధ్రప్రదేశ్ హేతువాద ఉద్యమంలో - 2

1983లో భీమవరంలో రాష్ట్ర మహాసభ జరపడానికి నిశ్చయించారు ఆం.ప్ర హేతువాద మిత్రులు. ఎవరయినా ప్రముఖుని ఆహ్వానించమన్నారు శ్రీ రావిపూడి వెంకటాద్రి. డా॥ పి.ఎం భార్గవా గారిని సంప్రదించాను. వారు పనిచేసే జీవశాస్త్ర పరిశోధనా సంస్థ సి.సి.ఎం బి.లో (సెంటరు ఫార్ సెల్యులర్ అండ్ మాలిక్యులర్ బయాలజీ, డిప్యూటీ డైరెక్టరుగా) ఆ సంస్థకు ఆనాడు డా॥ భార్గవా డైరక్టరుగా వున్న డా॥ ఎల్ ఆర్. శివ సుబ్రహ్మణ్యం గారిని సూచించారు. నేను వెళ్ళి వారిని ఆహ్వానించాను డా॥ భార్గవా సిఫారసు చేసినందువల్ల వారు అంగీకరించి ప్రారంభోపన్యాసం చేశారు సుప్రసిద్ధ నవలా చరయిత్రి వాసిరెడ్డి సీతాదేవిగారు (ఈనాడు డా॥ సీతాదేవిగారు) భీమవరం మహాసభకు వచ్చి ప్రసంగించారు మిత్రులు నరసింహారాజు, నాగేశ్వరరావుల కృషివల్ల మహాసభ జయప్రదమయింది. నేనూ, సుబ్బమ్మగారు మహాసభకు వెళ్ళాం. తరువాత రాష్ట్ర మహా సభ 1985లో విజయవాడలో జరిగింది వెడనలోని ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనరు శ్రీ వరప్రసాదరావు కృషివల్ల మహాసభ బాగా జరిగింది. అపుడే జరిగిన భారత మహా సభకు మరల డా॥ పి ఎం. భార్గవా సాయంతో డా॥ వినోద్‌కుమార్ గౌర్ గారిని అమ్వానిస్తే వారు వచ్చి విశ్లేషణాయుతమయిన ప్రసంగం చేశారు అలాగే 1987లో గుంటూరులో రాష్ట్ర మహాసభకు డా॥ భార్గవా మాట సహాయంతో డా॥ గౌరీశంకర్‌ను ప్రారంభోపన్యాసం చేయటానికి పిలిచాను గుంటూరు మహాసభలకు వచ్చిన పెద్దలు ఆంగ్ల భాషలో మాట్లాడితే దానిని తెలుగులో చెప్పడం నా వంతు. ఇలా రావిపూడి కోరిక మేరకు ఆయనకు నేను అండగా నిలబడేవాడిని ఆయన నన్ను భారత సంఘ వ్యవహారాలలో బలపరిచేవాడు. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన హేతువాద అధ్యయన తరగతులలో -- నెల్లూరు, విజయవాడ, తెనాలి, ఇంకొల్లు, హైదరాబాదులలో -- విషయ ప్రధానంగా భాషణ చేయటం జరిగేది. అలాగే శ్రీమతి సుబ్బమ్మ విజయవాడ, తెనాలి, హైదరాబాదు అధ్యయన తరగతులలో మాట్లాడారు అనేక మహాసభల సందర్భంగా జరిగే బహిరంగ సభలలో, వేరే సభలలొ ఉపన్యసించేవారం.

శ్రీ కోటపాటి మురహరిరావు ధర్మకార్యాలకు -- ముఖ్యంగా హేతువాద భావాల వ్యాప్తికి ట్రస్టును ఏర్పచర తలిస్తే వారికి ట్రస్టు దస్తావేజు ముసాయిదాను నేను రాసి యిచ్చాను. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారిపేర అవార్డు యిచ్చే నిమిత్తం వారు తెలుగు విశ్వ విద్యాలయానికి పదివేల రూపాయలు యిచ్చారు. దానిపై వచ్చే వడ్డీకి కొంత మొత్తం కలిపి విశ్వవిద్యాలయంవారు 'కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి అవార్డు' ను హేతువాద ప్రచారం చేసిన వ్యక్తికి ప్రతి ఏటా యిచ్చేవారు. సర్వశ్రీ వాసిరెడ్డి సీతాదేవి, మల్లాది సుబ్బమ్మ, రావూరి భరద్వాజ మొదలగు ప్రభృతులతో ఉన్న ఉపసంఘం సిఫారసు మేరకు మొదటి సంవత్సరం

1988 -- అవార్డు స్వీకర్తగా రావిపూడిని ఎంపిక చేసింది విశ్వవిద్యాలయం తరువాతి సంవత్సరం -- 1989లో అదే అవార్డు సందర్భంగా నా పేరును సూచించ దలచి ఏమో -- నాజీవితాంశాల సంగ్రహ పట్టికను అవార్డు దాత శ్రీ మురహరిరావు నన్నడిగి తీసుకున్నారు తీరా అవార్డు ఉపసంఘసమావేశంలో అవార్డు ప్రథమ స్వీకర్త శ్రీ రావిపూడి ఉత్తరాన్ని ఆయన చదివి వినిపించారు ఆ వుత్తరంలో అవార్డు స్వీకారానికి తగిన వారినిగా అర్హులని రావిపూడి సూచించారు ఆ పేర్లలో నాపేరు లేదు తర్జనభర్జన చేసి ఉపసంఘం నన్ను అవార్డును స్వీకరించడానికి ఎంపిక చేసింది 1989 అవార్డును నా కిచ్చింది విశ్వవిద్యాలయం. అదే అవార్డు 1992లో మల్లాది సుబ్బమ్మ గారికి యిచ్చారు 1994లో ప్రముఖ హేతువాది మిత్రుడు పి అచ్చుత్ రామ్‌కు (తెనాలి) యిచ్చారు

1989లో ఒంగోలులో జరిగిన రాష్ట్ర మహాసభకు అనారోగ్య కారణంగా నేను వెళ్ళలేదు. వీలయినంత త్వరగా ఉద్యమాలనుండి వైదొలగాలనే నా కోరిక అనారోగ్య ఫలితంగా ఫలించింది ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి

# ఆంధ్రప్రదేశ్ హేతువాద ఉద్యమంలో - 2

1983లో భీమవరంలో రాష్ట్ర మమాసభ జరపడానికి నిశ్చయించారు ఆం.ప్ర హేతువాద మిత్రులు. ఎవరయినా ప్రముఖుని ఆహ్వానించమన్నారు శ్రీ రావిపూడి వెంకటాద్రి. డా॥ పి.ఎం భార్గవా గారిని సంప్రదించాను. వారు పనిచేసే జీవశాస్త్ర పరిశోధనా సంస్థ సి.సి.ఎం బి.లో (సెంటరు ఫార్ సెల్యులర్ అండ్ మాలిక్యులర్ బయాలజీ, డిప్యూటీ డైరెక్టరుగా) ఆ సంస్థకు ఆనాడు డా॥ భార్గవా డైరక్టరుగా వున్న డా ॥ ఎల్ ఆర్. శివ సుబ్రహ్మణ్యం గారిని సూచించారు. నేను వెళ్ళి వారిని ఆహ్వానించాను డా॥ భార్గవా సిఫారసు చేసినందువల్ల వారు అంగీకరించి ప్రారంభోపన్యాసం చేశారు సుప్రసిద్ధ నవలా చరయిత్రి వాసిరెడ్డి సీతాదేవిగారు (ఈనాడు డా॥ సీతాదేవిగారు) భీమవరం మహాసభకు వచ్చి ప్రసంగించారు మిత్రులు నరసింహారాజు, నాగేశ్వరరావుల కృషివల్ల మహాసభ జయప్రదమయింది. నేనూ, సుబ్బమ్మగారు మహాసభకు వెళ్ళాం. తరువాత రాష్ట్ర మహా సభ 1985లో విజయవాడలో జరిగింది వెడనలోని ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనరు శ్రీ వరప్రసాదరావు కృషివల్ల మహాసభ బాగా జరిగింది. అపుడే జరిగిన భారత మహా సభకు మరల డా॥ పి ఎం. భార్గవా సాయంతో డా॥ వినోద్‌కుమార్ గౌర్ గారిని అమ్వానిస్తే వారు వచ్చి విశ్లేషణాయుతమయిన ప్రసంగం చేశారు అలాగే 1987లో గుంటూరులో రాష్ట్ర మహాసభకు డా॥ భార్గవా మాట సహాయంతో డా॥ గౌరీశంకర్‌ను ప్రారంభోపన్యాసం చేయటానికి పిలిచాను గుంటూరు మహాసభలకు వచ్చిన పెద్దలు ఆంగ్ల భాషలో మాట్లాడితే దానిని తెలుగులో చెప్పడం నా వంతు. ఇలా రావిపూడి కోరిక మేరకు ఆయనకు నేను అండగా నిలబడేవాడిని ఆయన నన్ను భారత సంఘ వ్యవహారాలలో బలపరిచేవాడు. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన హేతువాద అధ్యయన తరగతులలో -- నెల్లూరు, విజయవాడ, తెనాలి, ఇంకొల్లు, హైదరాబాదులలో -- విషయ ప్రధానంగా భాషణ చేయటం జరిగేది. అలాగే శ్రీమతి సుబ్బమ్మ విజయవాడ, తెనాలి, హైదరాబాదు అధ్యయన తరగతులలో మాట్లాడారు అనేక మహాసభల సందర్భంగా జరిగే బహిరంగ సభలలో, వేరే సభలలొ ఉపన్యసించేవారం.

శ్రీ కోటపాటి మురహరిరావు ధర్మకార్యాలకు -- ముఖ్యంగా హేతువాద భావాల వ్యాప్తికి ట్రస్టును ఏర్పచర తలిస్తే వారికి ట్రస్టు దస్తావేజు ముసాయిదాను నేను రాసి యిచ్చాను. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారిపేర అవార్డు యిచ్చే నిమిత్తం వారు తెలుగు విశ్వ విద్యాలయానికి పదివేల రూపాయలు యిచ్చారు. దానిపై వచ్చే వడ్డీకి కొంత మొత్తం కలిపి విశ్వవిద్యాలయంవారు 'కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి అవార్డు' ను హేతువాద ప్రచారం చేసిన వ్యక్తికి ప్రతి ఏటా యిచ్చేవారు. సర్వశ్రీ వాసిరెడ్డి సీతాదేవి, మల్లాది సుబ్బమ్మ, రావూరి భరద్వాజ మొదలగు ప్రభృతులతో ఉన్న ఉపసంఘం సిఫారసు మేరకు మొదటి సంవత్సరం

సంఘాధ్యక్షులు) కలిసి శ్రీ లెవీ ఫ్రాజెల్ భారతదేశం వస్తున్నారని తెలిసి హైదరాబాదు తగిన ప్రదేశమని ఆయనకు నచ్చ చెప్పటానికి హైదరాబాదులోని హ్యూమనిస్టు హేతువాద మిత్రుల సమావేశం ఏర్పాటు చేద్దామన్నాడు డా॥ ఇన్నయ్య ఆలాగే మిత్రుల సమావేశం పిలిచాం హైదరాబాదులో మహాసభ పెట్టడానికి తతిమ్మా సంఘాలవారిలో సంప్రతించడానికి నాకు అధికారం యిచ్చారు మిత్రుడు లవణం ఫోనులో ఆంగీకారం తెలిపాడు. నేను ఉత్తరాలు రాస్తే ఇతర సంఘాలవారు - రాడికల్‌హ్యూమనిస్టు సంఘాధ్యక్షులు డా॥ ఇందుమతీ పరేఖ్(బొంబాయి) కూడా - జవాబు యివ్వలేదు 1992 నవంబరులో సర్వశ్రీ లెవేఫ్రాజెల్, వేగీలాండ్ హైదరాబాదు వచ్చారు హ్యూమనిస్టు హేతువాద మిత్రుల సమావేశం ఏర్పాటు చేశాం నా॥ అవుల సాంబశివారావు గారిని అధ్యక్షత వహించమని కోరితే ఆయన ఆ బాధ్యత నాకే అప్పగించారు నేను హైదరాబాదును అంతర్జాతీయ మహాసభకు అనువయిన ప్రదేశమని చెప్పాను ఒక హ్యూమనిస్టు మిత్రుడు వ్యతిరేకించి హైదరాబాదులో తగిన వసతి సౌకర్యాలు, వలసిన కార్యకర్తల బలగం లేవన్నాడు అందరినీ మాట్లాడమన్నాను ఆ ఉదయమే పట్టణానికి వచ్చిన మిత్రులు శ్రీ రావిపూడి (అప్పుడు ఆయన భారత హేతువాద సంఘాధ్యక్షుడు), శ్రీ అంచా బాపారావు భా హే. సంఘ సహాయ కార్యదర్శి బొంబాయి పట్టణం తగిన ప్రదేశమని చెప్పారు శ్రీ లెవీఫ్రాజెలు ఢిల్లీ వైపు మొగ్గుచూపారు ఆయన ఢిల్లీ వెళ్ళి మిత్రులతో మాట్లాడి ఢిల్లీ తగిన చోటని సిఫారసు చెశారు ఆ విషయమయి ఐ.హెచ్ ఇ.యు తో ఒప్పందానికి రావడానికి శ్రీ సనాల్‌ను 1993 జూలయిలో బెర్లిను రమ్మన్నారట. ఈలోగా శ్రీ రావిపూడి అమెరికాలో పర్యటించి, హాలండు వెళ్ళి ఐ.హెచ్.ఐ యు. నాయకులతో మాట్లాడి తిరిగి వచ్చాడట ఢిల్లీలో ప్రపంచ మహాసభ జరపటానికి ఒప్పందం చేసుకొని సనాల్ తిరిగి వచ్చాడు. సభ్యత్వ రుసుము సంవత్సరానికి 100 రూపాయలకు పెంచడం, 1995లో జరగాల్సిన ఢిల్లీ మహాసభ ఏర్పాట్లు చేయడం వంటి వాటిని చర్చనీయాంశాలుగా పెట్టి తేది 17.8 1993 దిన జాతీయ సమితి సమావేశాన్ని పిలిచాడు తేది 12 8 1993న హైదరాబాదులో రాష్ట్ర హ్యూమనిస్టు సంఘు, రాష్ట్ర హేతువాద సంఘాల సమిష్టి సమావేశంలో జాతీయ సమితి సమావేశాన్ని వాయిదా వేయాలని సనాల్‌కు రాయడానికి నిర్ణయం జరిగింది. ఆ సమావేశానికి వచ్చిన రాష్ట్ర సంఘ ఉపాధ్యక్షులు మల్లాది సుబ్బమ్మగారిని ఢిల్లీ వెళ్ళి ఆ సమావేశాన్ని ఆపించమంటే తనొక్కతే ఢిల్లీ వెళ్ళనని ఆమె చెప్పారట. రామ్మూర్తిగారిని పొమ్మనమని అంటే వారి నడగండి అన్నారట ఫోను చేసి నన్ను ఢిల్లీ పొమ్మన్నారు శ్రీ రావిపూడిగారు. ఆ నెల 10వ తేదీ సాయంత్రమే నేను ఆస్పత్రి నుండి తిరిగి యింటికి చేరానని కనుక ఢిల్లీ ప్రయాణం చేయలేనని చెప్పాను. తరువాత సంఘ వ్యతిరేక చర్యలకు శ్రీ రావిపూడిపై చర్య తీసుకుంటానని, 1992లో భారత సంఘ ఉపాధ్యాక్షురాలుగా ఎన్నుకోబడిన శ్రీమతి సుబ్బమ్మను తాత్కాలిక అధ్యక్షురాలిగా ఉండమని నచ్చ చెప్పాలని సనాల్

నన్ను మూడు దినాలు మూడు సార్లు టెలిఫోనులో కోరాడు. తొందరపాటు చర్య వద్దని నేను మూడుసార్లూ హితవు చెప్పాను. సనాల్ భారత హేతువాద సంఘానికి 80 వేల సభ్యత్వం ఉందని దరఖాస్తులో రాస్తే ఆ అంకె తప్పని అమెరికాలో, హాలండ్‌లలో శ్రీ రావిపూడి చెప్పి వచ్చారని శ్రీ సనాల్ ఆరోపణ. చివరకు అతడు సుబ్బమ్మగారితో సరాసరి మాట్లాడితే - యించుమించుగా బ్రతిమిలాడే ధోరణితో మాట్లాడితే - ఆమె అంగీకరించారు. శ్రీ రావిపూడిని అధ్యక్ష స్థానం నుండి తాత్కాలికంగా తొలగించినట్లు (సస్పెండు) శ్రీమతి సుబ్బమ్మను తాత్కాలిక అధ్యక్షురాలిగా ఎంపిక చేసినట్లు, ఢిల్లీ మహాసభ విషయమయి సమన్వయం చేయడానికి జాతీయ సంఘాన్ని నియమిస్తూ దానికి నన్ను ఛైర్మనుగా పేర్కొంటూ తేది 17-8-1994న తీర్మానాలు చేసిందట జాతీయ సమితి. ఈ విషయాలు తెలియజేస్తూ సర్క్యులరు వచ్చింది. శ్రీ రావిపూడి అమెరికాలో విరాళాలు వసూలు చేసి లెక్క చెప్పలేదనే ఆరోపణ కూడా అందులో ఉంది దాంతో సనాలును, సుబ్బమ్మను సస్పెండు చేస్తూ శ్రీ రావిపూడి వర్గం తీర్మానించింది సంఘ భారత మహాసభను 19 నవంబరున తెనాలిలో సమావేశమవటానికి నిశ్చయించింది వివరాలను వదిలేస్తే జరిగిన విషయాలు ఒకరికొకరు సస్పెండు చేయటం, తాత్కాలిక భారత సంఘ అధ్యక్ష పదవిని స్వీకరిస్తూ సుబ్బమ్మ సర్క్యులరు ఉత్తరం. (అందులో శ్రీ రావిపైడిపై ఆరోపణల ప్రసక్తి లేదు సంఘ శ్రేయస్సు దృష్ట్యా ఆమె ఆ పదవిని చేపట్టినట్లు ఉంది ఆం ప్ర. రాష్ట్ర ఉపాధ్యక్ష పదవికి రాజీనామా చేసినట్లు వుంది.) ఆం.ప్ర సంఘ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా లేఖ ఆమె రాష్ట్రాధ్యక్షునికి పంపారు. ఇక తరువాత ఆరోపణలు, ప్రత్యారోపణలలో తెలిసిన విషయాలు యివి 1992 మే నెలలో అమెస్టర్‌డామ్ అంతర్జాతీయ మహాసభ సందర్భంగా జరిగిన డైరెక్టర్ల మీటింగులో భా హే సంఘ దరఖాస్తు చర్చకు వచ్చిందట. ఆ సంఘ సభ్యత్వం 80 వేలని చదివితే తార్కుండే తరపున బోర్డు సమావేశంలో కూర్చున్న హ్యూమనిస్టు మిత్రుడు (అతడు భా హే సంఘ జాతీయ సమితి సభ్యుడట) ఇది 'అసత్యం' అన్నాడుట హ్యూమనిస్టు సంఘాధ్యక్షులు డా॥ ఇందుమతి పరేఖ్ 'ఇది అతిశయోక్తి' అని పలికారట వీరి అభ్యంతరాలను విని కూడా డైరెక్టర్ల బోర్డు భా. హే సంఘానికి పూర్తి సభ్యత్వం యిచ్చిందట అసలు ఇండియాలో ప్రపంచ సభను జరపటం కుదరదని, తగదని డా॥ ఇందుమతి చెప్పారట 1993 జూలయిలో జరిగిన డైరెక్టర్ల సమావేశంలో 'మీ సంఘాధ్యక్షుడే మీరు చెప్పిన సంఖ్య తప్పన్నాడు' అని శ్రీ సనాల్‌ను నిలదీశారట (దాంతో అతడు క్రోధావేశానికి లోనయి తొందరపాటుగా వ్యవహరించాడని నా నమ్మకం) మరో విషయం 1993 డిసెంబరులో డా॥ ఇందుమతి హైదరాబాదులో జరిగిన హ్యూమనిస్టు అధ్యయన తరగతుల్లో చేసిన ప్రసంగంలో నేను విన్నాను టెలిఫోనులో తనను (1992 నవంబరులో) బొంబాయిలో అంతర్జాతీయ మహాసభను జరపగలవా అని హ్యూమనిస్టు మిత్రుడొకరు అడిగితే 'పెట్టగలను' అని ఆమె చెప్పారుట 'నాకు మీరు యిలా అన్నట్లు తెలియదు తెలిస్తే

హైదరాబాదును సమావేశస్థలంగా మార్చి వుంచేవాడిని కాను అని నేను అపుడే అన్నాను.

ఈ పరిస్థితులలో యీ తగాదాలో మా దంపతులు ఇరుక్కోవడం మంచిది కాదని హితవుచెప్పి నేను జాతీయ సమన్వయ కమిటీ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి ఆ సంగతి శ్రీ రావిపూడికి తెలిపాను. శ్రీ రావిపూడి వర్గపు జాతీయ సమితి సమావేశపు తేది 18-11-1993 ఎజెండాలో రామ్మూర్తిపై క్రమశిక్షణ చర్య అని ఉండటంతో నేను తెనాలి సమావేశానికి పోతలచలేదు, పాలెపు మిత్రుడు గురిజాల సీతారామయ్య కుమార్తె వివాహానికి తెనాళీ వెళ్ళి, అక్కడ మహాసభకు వచ్చిన సునీల్ భట్టాచార్య (భారత జ్ఞాన పునర్వికాస సంస్థ కార్యదర్శి, హ్యూమనిస్టు) హితవుపై ఆమె తేది 19-11-1993 మహాసభకు వెళ్ళారు. తాత్కాలిక అధ్యక్ష పదవిని అంగీకరించడం తన తొందరపాటు చర్య అని దానికి తను చింతిస్తున్నానని చెప్పి వచ్చారు. నాపైన, ఆమెపైన రావిపూడి వర్గపు జాతీయ సమితి, మహాసభలు ఏ చర్యలూ తీసుకోలేదు. తరువాత సనాల్ ఎంత వత్తిడిచేసినా తన కేరళ రాష్ట్ర మహాసభకు రమ్మనమని కోరినా మా దంపతులం అతని కోరికను మన్నించలేదు. హేతువాద ఉద్యమానికి దూరంగా ఉండతలిచాం.

ఆంధ్ర హేతువాద సంఘ సభ్యత్వమే 300లు వుంటే భారత సంఘ సభ్యత్వం 80 వేలుగా ఎలా వుంటుందని 1992 మేలో డైరక్టర్ల సమావేశానికి తార్కుండే 'ప్రాక్సీ'గా హాజరయిన హ్యూమనిస్టు చెప్పాడట. తేది 19-11 1993 తెనాలి మహా సభలో 1979 నుండి 1993 వరకు చేరిన సభ్యుల సంఖ్య 2 వేలని శ్రీ రావిపూడి చెప్పారట. తరువాత ఆయన అప్పటికి 12 సం॥ నుండి ప్రచురించే హేతువాది పత్రికలో ఆ సంఖ్య అచ్చయింది. ఎన్ని సంవత్సరాలు చందాలు చెల్లించకపోయినా ఒకసారి చేరినవారిని తీసివేయలేదన్నమాట. అంటే మూడు వందలున్న ఆంధ్ర రాష్ట్ర శాఖ సభ్యత్వాన్ని రెండు వేలుగా చెప్పారన్నమాట. అంటే సుమారు ఏడు రెట్లు పెంచి చెప్పారనేది విదితం. 'హేతువాది' పత్రిక అదే సంచికలో భారత సంఘ సభ్యత్వం పదివేలకు మించదని రాశారు. అంటే పదివేలున్న సభ్యత్వాన్ని ఎనుబది వేలుగా శ్రీ సనాల్ చెప్పాడన్నమాట. ఎనిమిది రెట్లు ఎక్కువ చేసి రాశాడన్నమాట. రావిపూడిగారు ఆంధ్ర. సభ్యత్వాన్ని ఏడురెట్లు పెంచితే శ్రీ సనాల్ భారత సంఘ సభ్యత్వాన్ని ఎనిమిది రెట్లు పెంచాడని తేలుతుంది. ఒకరికొకరు 'మీరే అసత్య వాదులు, మీరే అబద్ధీకులు' అని నిందించుకోవటం ఎంత సబబు? 'చిల్లి' కాదు 'తూటు' అన్నట్లుంది.

పూర్వం మార్క్సిస్టులు చీలిస్తే ఇపుడు సర్వశ్రీ సనాల్, రావిపూడి, సుబ్బమ్మ, డా॥ ఇందుమతి గారలు ఉద్యమం చీలడానికి దోహదం చేశారు. ఎంత విచిత్రం? భారత హేతువాద సంఘంలో అతికష్టంమీద 1980లో ఐక్యత సాధించిన నేను యీ పరిణామం వల్ల ఓడిపోయినట్లుగా భావించాను.

# భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘం - 1

# జయపూర్ మహాసభ (1980)

1978లో హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ రాడికల్ హ్యూమనిస్టు మహాసభ జరిగింది దానికి ఆహ్వాన సంఘ బాధ్యతలను చేపట్టిన మల్లాది సుబ్బమ్మ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు గురిజాల సీతారామయ్యగారు అధ్యక్షులయినట్లు నాకు స్ఫురణకు వస్తున్నది. తన ఉద్యోగ కాలంలో ఏదో మంచిపని, చెప్పుకొనదగినది చేయాలని ఆమె ఆరాటం. అదీగాక నేను అఖిల భారత కార్యదర్శిని కదా! అందుకని అఖిల భారత అధ్యయన తరగతులను నడుప నిశ్చయించినాము మిత్రుడు శ్రీ ప్రతాపరెడ్డి సాయంతో ఆంధ్ర విద్యోదయ కళాశాల భవనాలను ప్రతినిధుల వసతికి, సమావేశాలకు వాడుకొనగలిగాం చాలా రాష్ట్రాల నుండి మిత్రులు వచ్చారు. దగ్గర కనుక మహారాష్ట్ర నుండి అత్యధికల సంఖ్యలో హాజరయినారు తెలుగు వారి సంగతి చెప్పనక్కరలేదు. సర్వశ్రీ తార్కుండే, వినోదు జైను, బి డి శర్మ, ఎం వి. రాణే ప్రభృతులు వచ్చారు. నాలుగురోజులు సాగిన సమావేశంలో మూడు దినాలు జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు, సిద్ధాంత పరిశీలన, కార్యక్రమాలపై చర్చసాగింది చివరి రోజున కార్యనిర్వాహక వర్గ సమావేశం. ఇండియన్ రినయిజాన్సు ఇన్‌స్టిట్యూట్ సర్వసభ్య సమావేశం నిర్వహింపబడినయి.

ఈ అధ్యయన తరగతుల నిర్వహణ ఖర్చులకుగాను డా॥ పి. కృష్ణ చైదరి(ప్రఖ్యాత హోమియోపతి వైద్యులు, హోమియో కళాశాలు ప్రిన్సుపాలు), శ్రీ యార్లగడ్డ రంగనాయకులు, శ్రీ కె. ప్రతాపరెడ్డి పెద్ద మొత్తాలు విరాళాలుగా యిచ్చారు. అనేకమంది హ్యూమనిస్టు మిత్రులు వలంటీర్లుగా పనిచేశారు. అందులో పేర్కొనవలసిన వారు శ్రీ జి వెంకటస్వామి అతని స్నేహితులు, జాస్తి జవహర్‌లాల్ ఇత్యాదులు

డెహ్రాడూన్‌లో జరిగిన అఖిలభారత అధ్యయన తరగతులు 1979లో నిర్వహింపబడినయి రామ్ నివాసమున్న భవనంలోనే సమావేశస్థలం సర్వశ్రీ శిబ్‌నారాయణరే, సునీల్ భట్టాచార్య, తార్కుండే తరగతులను తీసుకున్నారు. మార్క్సిజంపై ఉపన్యసించవలసిన ఢిల్లీ మిత్రుడు రాకపోతే నేను ఆ ఖాళీని పూర్తిచేశాను. విన్నవారు మెచ్చుకున్నారు. సాయంత్రం జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొన్నాను. మాకు వసతి ప్రఖ్యాత స్వాతంత్ర్య యోధుడు (టెర్రరిస్టు ఉద్యమంలో భాగస్వామి) పాండే భార్య నడుపుతున్న బడి తాలూకు హాస్టలులో, ఆమె నేపాలీ ఆమె సోదరి ప్రసిద్ధి పొందిన ఆంధ్రా విప్లవవీరుడు అన్నా ప్రగడ కామేశ్వరరావుగారు సతీమణి మిత్రుడు చంద్రోదయ దీక్షిత్‌తో పరిచయమయింది. తరగతుల అనంతరం ప్రొద్దుపోయేవరకు చర్చలు సాగించేవాళ్ళం.

1980లో జయపూర్‌లో హ్యూమనిస్టు మహాసభ జరిగింది నా సూచన మేరకు అధ్యక్షత వహించటానికి ప్రఖ్యాత మేధావి ఇండియన్ సెక్యులర్ సొసైటీ స్థాపకుడు, 'క్వెస్టు' పత్రిక (తరువాత దానికి 'న్యూ క్వెస్టు' అని పేరు మార్చారు) సంపాదకుడు, ఇస్లాంపై ప్రత్యేకంగా అధ్యయనం చేసిన మిత్రుడు శ్రీ ఎ బి.షాను తార్కుండే ఆహ్వానించగా ఆయన సంతోషంగా వచ్చి మహాసభకు అధ్యక్షత వహించాడు. మహాసభ సమావేశానికి ముందు తార్కుండే 5 నిమిషాలు సొమ్మసిల్లి కళ్ళు మూసుకుంటే అందరం ఆందోళనకు లోయినాం తెలుగువారం ఎక్కువగానే వెళ్ళాం సర్వశ్రీ రావిపూడి, కొల్లా సుబ్బారావు, ఎస్ ఎ బక్ష్, మల్లాది సుబ్బమ్మ ప్రభృతులు వచ్చారు సంఘ జాతీయ సమితిలో వారికి సభ్యత్వం వచ్చేలా చేయగలిగాను. న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసిన ఆవుల సాంబశివరావు గారిని అధ్యక్షులుగా ఎన్నుకున్నాం ప్రధాన కార్యదర్శిగా మిత్రుడు ఎం ఏ రాణేను(బొంబాయి హైకోర్టు అడ్వకేటు , 1946 నుండి ఉద్యమంలో ప్రముఖంగా పాటుపడుతున్న వ్యక్తి) ప్రధాన కార్యదర్శి పదవికి సూచించాను 'నీవు వుంటావని అనుకున్నానే' అని అన్నాడు తార్కుండే శ్రీ రాణె ఆ బాధ్యత తీసుకోడానికి మొదట్లో నిరాకరించాడు. అతనిని ఒప్పించే బాధ్యతను నెత్తిన వేసుకున్నాను అతనికి సాయం చేయడానికి నలుగురు సంయుక్త కార్యదర్శులు ఉండగలరని, అందులో నేను కూడా ఉంటానని అతనికి చెప్పి అతడు ఆ పదవిని స్వీకరించటానికి అంగీకరింపచేశాను సర్వశ్రీ సునీల్ భట్టాచార్య (ఢిల్లీ), డబ్ల్యు ఎస్ కానే(బొంబాయి), మనోజ్(కలకత్తా), నేను సంయుక్త కార్యదర్శులంగా ఎన్నికయ్యాం. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ తార్కుండే ప్రోత్సాహంతో ఇంగ్లీషులో మాట్లాడారు ఇరువురం జయపూర్ నుండి బయలుదేరి జోధ్‌పూర్ వెళ్ళి అక్కడ రెండు రోజులుండి మిత్రుల ఆదరణ పొంది సభలలో ఉపన్యసించి అహమ్మదాబాద్ చేరాము. సర్వశ్రీ ఎస్ ఎస్.వ్యాస్, 'నేతాజీ'లు (అక్కడ రైల్వే కార్మికులలో పనిచేస్తున్న హ్యూమనిస్టు మిత్రుని బిరుదనామం) ఎంతో అభిమానాన్ని మా పట్ల ప్రదర్శించారు. న్యాయవాదుల సంఘంలో, రోటరీ క్లబ్‌లో, మేధావుల బహిరంగ సభలో ప్రసంగించాను. అహమ్మదాబాద్‌లో మిత్రుడు గౌతమ ధాకర్ మా కొరకు సభను ఏర్పాటు చేశాడు అక్కడ నుండి బొంబాయి చేరుకున్నాం. అఖిల భారత హేతువాద మహాసభలో పాల్గొన్నాం. రాడికల్ హ్యూమనిస్టు సంఘ రికార్డును రాణేకు చేర్చాను. దాంతో నాపై నున్న హ్యూమనిస్టు సంఘ బాధ్యత చాలావరకు తగ్గింది.

1982లో మీరటు లో జరిగిన అఖిలభారత మహాసభకు మేము దంపతులం వెళ్ళలేదు న్యా॥ సాంబ శివారావుగారిని తిరిగి అధ్యక్షులుగా ఎన్నుకున్నారు ఉద్యమ పోకడను గురించి కొందరి మిత్రులకు కొంత అసంతృప్తి కలిగింది. సిద్ధాంత చర్చ అవసరమని తోచింది. మిత్రుడు ఆర్ ఎల్. నిగమ్ చాలా నిరాశకు లోనవటం గమనించాను. ఆయన (ఇటీవల గతించాడు) ఎం.ఎన్. రాయ్ అంతే వాసి. 1946 నుండి ఉద్యమంలో వుండి ఐ.ఆర్ ఐ కార్యదర్శిగా, 'రాడికల్

హ్యూమనిస్టు' ఇంగ్లీషు మాసపత్రికకు మేనేజింగు ఎడిటరుగా చాలాకాలం పనిచేసిన మిత్రుడు. హ్యూమనిస్టులు కొందరయినా తీరికగా కూర్చొని సిద్ధాంతాన్ని, కార్యక్రమాన్ని కూలంకషంగా చర్చించటం అవసరమని అతని అభిప్రయం. సాధారణంగా దగ్గర స్నేహితుల దగ్గర మాత్రం నిర్మొగమాటంగా మాట్లాడే స్వభావం ఆయనది. అలాంటి సమావేశం అవసరమని తార్కుండేకు సూచించాను. ఆయన అంగీకరించాడు. డా॥ ఇందుమతి పలుకుబడివల్ల బొంబాయిలోని ప్రాంతీయ సామాజిక శాస్త్ర పరిశోధనా కేంద్రంలో ప్రతినిధుల బసలకు వసతి, సమావేశ స్థలం లభించాయి. 30 మందికి మించని సమావేశం కావాలని నా అభిప్రాయం. కాని తార్కుండే కార్యక్రమ శైలిలో అది జరిగేపని కాదు. సుమారు 70 మంది దాకా హాజరయినారు. ఉద్యమంలో కురువృద్ధుల దగ్గరి నుండి సానుభూతిపరులదాకా అందరూ వచ్చారు. చర్చలు మామూలుకు భిన్నంగా లేవు. నాయకత్వ శ్రేణిలో వున్నవారెవరినయినా గట్టిగా విమర్శిస్తే ఉద్యమంలోకి అడుగుపెట్టపోతున్నవారు హ్యూమనిస్టులు తగాదా పడుతున్నారని నిజాయితీగానే భావించి యితరులకు చెప్తే ఉద్యమం అప్రతిష్టపాలు అవుతుందనే భయంపట్టుకున్నది. అప్పటికీ నేను విమర్శిస్తే విరామసమయంలో శ్రీ శిబ్ నారాయణరే నా వద్దకు వచ్చి మనకున్న జాతీయ నాయకుని పేరు ప్రఖ్యాతులకు నష్టం కలుగజేయవద్దని హెచ్చరించాడు. హ్యూమనిస్టులు కూడా మొగమాటానికి లోనయి నిజాయితీగా మనసులోని మాటలను బహిరంగంగా చెప్పలేని దుస్థితి సంభవించింది. కమ్యూనిస్టులు గిరులలో పల్టీలు కొట్తున్నా ఘాటుగా, లోతుగా, తీవ్రంగా ఆత్మవిమర్శ చేసుకునేవారు; ఇతర మిత్రులను విమర్శించేవారు. వారి కున్నంత అంతర్గత ప్రజాస్వామ్యం హ్యూమనిస్టు ఉద్యమంలో లేకపోతున్నదని బాధపడ్డాను. నా వెంబడి బొంబాయి వచ్చిన శ్రీమతి సుబ్బమ్మ , శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి గారలకు బొంబాయి పద్మశాలీ సంఘం, ఆంధ్ర మహాసభలు తమ సమావేశాల్లో వారిచేత ఉపన్యాసాలు యిప్పించుకొని వారిని గౌరవించారు. 'సింగడు అంద్దంకి పోనూ పోయాడు, తిరిగి రానూ వచ్చాడు' అనే సామెత ననుసరించి బొంబాయి వెళ్ళి ఆశాభంగంతో తిరిగి వచ్చాను.

1984లో అధ్యక్ష పదవిని చేపట్టమని డా॥ ఇందుమతి పరేఖ్‌ను అడిగితే ఆమె నిరాకరించారని తార్కుండే చెప్పాడు 'పోనీ ఆమెను నన్ను అడుగమంటారా' అని నేను అంటే 'అక్కర లేదు నేనే విషయం తలుసుకుంటాను' అన్నాడు తార్కుండే. ఆమె తను స్త్రీ హితకారిణి సమాజం మురికివాడలో నిర్వహిస్తున్న నిర్మాణ కార్యక్రమంలో తలమున్కలయి వున్నానని చెప్పి మూడు సంవత్సరాల వ్యవధి కోరారని తరువాత నాకు తార్కుండే వివరించాడు. అన్నమాట ప్రకారం ఆమె 1986లో ఆ పదవిని స్వీకరించారు హైదరాబాదు మహాసభలో. ఆ కథ తరువాత వస్తుంది.

# భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘం - 2

# కలకత్తా మహాసభ (1984)

ఎం ఎన్ రాయ్ శతజయంతి ఉత్సవ సందర్భంగా చేయవలసిన కార్యక్రమాలను చేపట్టేనిమిత్తం రినయిజాన్స్ ఇన్‌స్టిట్యూట్ (ఐ ఆర్ ఐ) ఒక ఉపసంఘాన్ని వేసింది దానిలో నన్ను కూడా సభ్యునిగా వేశారు దానికి సమావేశకర్త ఐ.ఆర్ ఐ కార్యదర్శి మిత్రుడు ఆర్ ఎం పాల్ (ప్రస్తుతం పి.యు.సి ఎల్. బులిటెన్ సంపాదకుడు). సభ్యులం ఏమిచేయవలెనో సూచిస్తూ ఉపసంఘం ఎదుట పెట్టాం. భారతీయ భాషలలో ఎం ఎన్ రాయ్ రచనలను, రాడికల్ హ్యూమనిస్టు సారస్వతాన్ని అనువదించి ముద్రించాలని నా అభిప్రాయం. శతజయంతి సందర్భంగా తక్కువ ధరతో రాడికల్ హ్యూమనిస్టు సిద్ధాంతాన్ని ఆచరణను పరిచయం చేసే పుస్తకాన్ని, అచ్చువేసి ప్రపంచ మానవవాదులకు అందజేయాలనేది మరో సూచన

1984లో కలకత్తాలో జరిగే మహాసభకు మా దంపతులం వెళ్ళాము నేను ఒక సమావేశానికి అధ్యక్షత వహించాను. శ్రీమతి సుబ్బమ్మ ఆంగ్లంలో మహిళా సమస్యల ప్రాధాన్యత గురించి ఆంగ్లంలో ప్రసంగించారు. ప్రతి సమావేశంలో 120 మంది స్త్రీ పురుషులు పాల్గొనేవారు చర్చలు వాడిగా వేడిగా సాగేవి చివరి రోజున జ్ఞాన పునర్వికాస సంస్థ (ఐ ఆర్.ఐ) సర్వసభ్య సమావేశం జరిగింది దానికి అధ్యక్షుడు తార్కుండేయే సభ్యులను , సానుభూతి పరులను అందరినీ సమావేశంలో పాల్గొననిచ్చాడు తార్కుండే ఆయనన పద్ధతియే అంత ఎవరన్నా అభ్యంతర పెడితే 'మన ఉద్యమంలో రహస్యాలు ఏమి వుంటయి?' అంటాడు. ఆ విషయముయి ఆయనతో మిత్రుడు పాల్ రాజీ కొరకు ఆయనతో వాదించి లాభం లేదని మేమంతా ఊరకుండటం సామాన్యం.గా జరిగేది ఏ కారణం వలనో మిత్రుడు ఆర్.ఎం.పాల్ రాలేకపోయాడు సమావేశపు రికార్డు ఆయన వద్దనే ఉంది ఎజెండాను సభ్యుల జ్ఞాపకాలను బట్టి పునర్నిర్మించాం. మిత్రుడు ఆర్ ఎం.పాల్‌ను పదవికి సిఫారసు చేసిన శ్రీ శిభ్‌నారాయణరే పాల్ తొలగింపును డిమాండు చేశాడు. నేను రే ప్రతిపాదనను బలపరిచాను ఆ విషయం నాకు వదిలిపెట్టండి అని తార్కుండే ఆ సమస్యను అప్పటికి దాటవేశాడు. శతజయంతి సందర్భంగా రాయ్ ఆలోచనా ధారపై ఒక పుస్తక ప్రచురణ విషయం తెలిసింది దానిని సూత్రప్రాయంగా తార్కుండే అంగీకరించాడు 'ఎవరు ఆ గ్రంథాన్ని రాయాలని నీ భావం' అని నన్ను అడిగాడు శ్రీ ఆర్ ఎల్ నిగం పేరు చెప్పాడు నిజం నిజాయితీయాలు గల కార్యకర్త. అప్పుడు ఢిల్లీలోనే వుంటున్నాడు 'నేను అతనిని అడిగి రాయిస్తాలే?' అని తార్కుండే అడిగితే నిరాకరిస్తాడని నాకు తెలుసు. కాని ఏమి చేయగలరు!(తరువాత నిగమ్‌ను అడగటం, అతడు కాదనడం, ఆ గ్రంథాన్ని హ్యూమనిస్టు

మిత్రుడు శితాంశుదాస్ చేత తార్కుండే రాయించి ప్రకటించడం జరిగింది). "కార్యదర్శి ఢిల్లీలోనే ఉండాలని లేదు. దేశంలో ఎక్కడయినా నివసించే వాడు కావచ్చును" అన్నాను నేను. నా అభిప్రాయం యీ విషయంలోమాత్రం ఆయనకు నచ్చేదికాదు. అధ్యక్ష కార్యదర్శులు ఒకే నగరవాసులు కావాలని అతని ఆలోచన. భారతీయ భాషలలో రాయ్ సాహిత్యం, రాడికల్ హ్యూమనిస్టు సారస్వతం తీసుకొనే రావాలని దానిని సూత్రప్రాయంగా అంగీరించారు. తెలుగులో ప్రచురణకు ఐ.ఆర్.ఐ. ధనసహాయం అక్కరలేదని మా రాష్ట్రంలో మేము ఆ బాధ్యత తీసుకొనగలమనీ చెప్పాను. తరువాత కాలంలో బెంగాలీలో, హిందీలో పుస్తక ప్రచురణకు ఐ.ఆర్.ఐ. ధన సహాయం చేసింది. హ్యూమనిస్టు ఉద్యమ సందర్భంగా నేను బెంగాలును రెండుసార్లు దర్శించాను. భారతదేశం మొత్తం మీద కార్యాలయానికి గృహవసతి -అద్దెయిట్లే ననుకోండి - వున్నది ఒక్క కలకత్తాలోనే. అక్కడ నెలకొకసారి 35 నుండి 50 మందిదాకా హ్యూమనిస్టు మిత్రులు కలుస్తుండేవారు. సభ్యులంతా మధ్యతరగతి వారు బాగా చదువుకున్నవారు. అచ్చట సుబ్రతోముఖర్జీ, మనోజ్, దేవవ్రత్ చౌదరీ, బెనర్జీ ఇత్యాది మిత్రులతో గాఢపరిచయం ఏర్పడింది. కలకత్తా మహాసభలో భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘానికి నన్ను అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

రెండు సంవత్సరాల అనంతరం 1986లో అఖిలభారత మహాసభ హైదరాబాదులో జరిగింది. ప్రతినిధులకు వసతిని శాసన సభ్యుల పాత హాస్టలులో యిచ్చాం. సభలను శాసన సభ్యుల నూతన హాస్టలు మూడవ అంతస్థు హాలులో జరిపాం. ఇందుమతి పరేఖ్ మహాసభకు అధ్యక్షత వహించారు. తరువాత ఆమెనే అధ్యక్షులుగా ఎన్నుకున్నాం. నూట ఏబది మందికి పైగా ప్రతినిధులు ప్రతి సమావేశంలో పాల్గొన్నారు కాలికి దెబ్బ తగిలి కర్రల సాయంతో నడుస్తున్న శ్రీమతి చిత్రా తార్కుండే నామీది వాత్సల్యంతో ధైర్యం చేసి మహాసభకు విచ్చేసారు. సర్వశ్రీ సునీల్ భట్టాచార్య, బి.ఎస్. శర్మ, ఎం ఏ. రాణే, డబ్ల్యు ఎస్.కానే, ఎస్ ఎస్. వ్యాస్, ఆర్.ఎస్.యాదవ్ బెంగాలీ మిత్రులు సరాసరి పదిమందిఇలా ఎందరో మిత్రులు వచ్చారు. సభ బాగా జరిగింది. ఆహ్వాన సంఘ కార్యకలాపాలలో మునిగిపోయి నేను ఎక్కువగా చర్యలలో పాల్గొనలేకపోయాను.

1966 నుండి రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ నాయకత్వ శ్రేణిలో వున్న నేను యిక అలాంటి పదవులతో కొనసాగటం సహచరుల యెడ అపచారమని తలచి తప్పుకొన తీర్మానించుకొన్నాను. 1987లో తెనాలిలో ఆం.ప్ర హ్యూమనిస్టు సంఘానికి శ్రీమతి సుబ్బమ్మ అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. అప్పుడు మహాసభలో నేనూ ఉన్నాను.

# భారతీయ రాడికల్ హ్యూమనిస్టు సంఘం - 3

# ఎం.ఎన్.రాయ్ శతజయంతి సెమినార్

ఎం ఎన్ రాయ్ శతజయంతి అంతర్జాతీయ సెమినారును బొంబాయిలో జరుపుటకు తీర్మాణించింది సంఘ జాతీయ సమితి ప్రధాన బాధ్యతను అధ్యక్షులు డా॥ ఇందుమతి పరేఖ్ తీసుకున్నారు బొంబాయి హ్యూమనిస్టు మిత్రులు ఆమెకు అండగా నిలబడ్డారు. సుమారు 20 మంది విదేశ హ్యూమనిస్టులు పాల్గొన్నారు. ఇంగ్లండుకు చెందిన హెర్మన్ బొండి దంపతులు (బ్రిటీషు హ్యూమనిస్టు సంఘాధ్యక్షుడు), జిమ్ హెరిట్ (రేషనలిస్టు ప్రెస్ అసోసియేషను, బ్రిటన్), అమెరికన్, యూరోపియన్ హ్యూమనిస్టులు వచ్చి ప్రసంగాలు చేశారు ఎం ఎన్ రాయ్‌ని అందరూ పేర్కొంటూ వివిధ విషయాలపై తమ సునిశిత విశ్లేషణను అందించారు. సుమారు 130 మందిదాకా పాల్గొన్నారు. తెనుగువారం 10 మందిమి హాజరయినాము ఒక సమావేశానికి న్యాయమూర్తి ఆవుల సాంబశివారావు, మరొక దానికి లవణం అధ్యక్షత వహించారు డాక్టర్ పి ఎం. భార్గవా పర్యావరణంపై మాట్లాడారు మేధావులు సర్వశ్రీ శిబ్‌నారయణరే భావాలపై అతిగా నొక్కుపెట్టే నేను వ్యాసం రాసి సావనీరుకు యిచ్చాను. సావనీరు తరువాత 5 సంవత్సరాలకు అచ్చయింది అందులో నా వ్యాసం చోటు చేసుకుంది ఈ సెమినారు ఎం.ఎన్. రాయ్ భావాలను, సిద్ధాంతాన్ని ప్రపంచ మానవ వాదులకు పరిచయం చేయడానికి ఎంతో ఉపకరించింది

డా॥ ఇందుమతి పరేఖ్ చొరవతో గ్రామ పునర్నిర్మాణం కోసం పనిచేసే కార్యకర్తల శిక్షణ శిబిరం హ్యూమనిస్టు సంఘం. లెస్లీ సహానీ ప్రజాస్వామ్య శిక్షణ కార్యక్రమం యీ యిరువురి ఆధ్వర్యంలో 1989లో లోనావాలా దగ్గర వున్న దేవీలాలీలో మూడు రోజులు జరిగింది మా దంపతులం వెళ్ళి పాల్గొన్నాం శ్రీమతి సుబ్బమ్మ ఆంగ్లంలో ప్రసంగించారు. శ్రీ మీనూ మసానీ సోదరి అక్కడే వుంటూ లెస్లీ సహానీ కార్యక్రమాన్ని పర్యవేక్షించారు(ఆమె చనిపోయారు). గ్రామాలలో పనిచేసేటప్పుడు ఉత్పన్నమయ్యే వివిధ సమస్యలను తీక్షణ దృష్టితో పరిశీలించడం జరిగింది

చివరి సారిగా హ్యూమనిస్టు కార్యక్రమాలలో పాల్గొనే ఉత్సాహంతో మా దంపతులం 1990లో ఢిల్లీలో జరిగిన భారత మానవవాద మహాసభకు వెళ్ళాము. అదే సమయంలో భారత హేతువాద మహాసభ జరుగుతున్నది ఒకపూట ఈ సభలో మరోపూట మరో సభలో పాల్గొన్నాం. నేను పాల్గొన్న చివరి భారత మహాసభలుయివే.

# ఇటీవలి కార్యక్రమాలు

రెండు మూడు సంవత్సరాలనుండి చెప్పుకోదగ్గ పనులు ఏమీ చేయలేకపోయాను కాకపోతే సుబ్బమ్మగారి పుస్తకాలను ఇంగ్లీషులోకి భాషాంతరీకరణ చేసి అచ్చు వేయించటంజరిగింది ప్రూఫులు చూడటం లాంటి మామూలు పనులు చేయటంతో కాలం దొర్లిపోయింది. ఆమె పుస్తకాలు 'ఫియర్‌లెస్ ఫెమినిస్టు' (ఆత్మకథ), 'ఉమెన్స్ మూవ్‌మెంట్ - రీజియనల్ పర్‌స్పెక్టివ్ మహిళోద్యమం 1860-1993), 'ఉమెన్ అండ్ సోషల్ రిఫార్మ్'(స్త్రీలు - సంఘ సంస్కరణ), 'స్టేటస్ ఆఫ్ ఇండియన్ ఉమన్' (స్త్రీల హోదా : వ్యాస సంకలనం), ' ఉమన్ ఇన్ చేంజింగ్ సొసైటీ' (మారుతున్న సమాజంలో మహిళలు . వ్యాససంకలనం) అవి 1994లో వెలుగు చూచినాయి

మహిళోద్యమ సందర్భంగా సుబ్బమ్మగారు స్థాపించిన సంఘాల, ట్రస్టుల జమాఖర్చు లెక్కలు, నివేదికలు తయారు చేయడం, ఒక కార్యక్రమంగా సాగింది. కుటుంబ సలహ కేసులతో లీగల్ అడ్వయిజర్‌గా క్లయింట్లకు సలహా చెప్పడం కొనసాగిన దినచర్య

కాకపోతే తేది 10-8-1994న సుబ్బమ్మగారు రాష్ట్ర ప్రభుత్వం నియమించిన మధ్య నిషేద కమిటీనుండి రాజీనామ పెట్టి తదుపరి ఆమె మద్యనిషేద సమితిని యితర మిత్రులతో కలసి జంటనగరాలలో, రాష్ట్రస్థాయిలో స్థాపిస్తే వాటిలో కోశాధికారిగా వ్యవహరించడం కొంత ప్రయోజకరమైన పని. రాష్ట్ర శాసన సభకు ఎన్నికల తేదీలు ప్రకటించబడేవరకు అది కొనసాగింది.

సుబ్బమ్మగారు మహిళాభ్యుదయ సంస్థ సంచాలకులుగా చేపట్టిన కుటుంబ సంక్షేమ పథకాలు అమలులో కొంత బరువు మోయటం జరిగింది.

దినచర్య పుస్తకం చూస్తే పుటలు నిండిన వైనం కన్పిస్తుంది కాని తీరాఆలోచిస్తే పెద్దగా ఏమీ కనిపించదు.

ఇదే జీవిత రహస్యం; ఇదే ప్రయోజన రాహిత్యం. తాతాచార్యుల వారు ఏం చేస్తున్నారయా అంటే 'తప్పులు చేసి దిద్దుకుంటున్నారు' అన్నట్లు, సోమిదేవమ్మగారు ఏమి చేస్తున్నారు అని అడిగితే 'పాలు ఒలకపోసుకొని ఎత్తుకుంటున్నారు' అని చెప్పినట్లు సాగిపోయింది జీవితం. ఏదో పొరపాట్లు చేయడం వాటిని సరిదిద్దుకోవడానికి నానా యాతన పడటం మామూలు అయింది. నా జీవితం కూడా యీ నీతి సూత్రానికి భిన్నంగా సాగలేదు. ఇదంతా నెమరు వేసుకుంటూ వుంటే కొంత బాధాకరంగా వుండేమాట నిజమేః కానీ అదే జీవిత విలక్షణత్వం

# మద్యపాన నిషేధోద్యమం - 1
# 'సారా వ్యతిరేకత'

ఈ ఉద్యమం 1992 నుండి మూడు దశలుగా సాగింది. 1992 నుండి 1-10-1993 వరకు జరిగిన సారా వ్యతిరేక ఉద్యమం మొదటి దశ అయితే 12-8-1994 నుండి ఆ సంవత్సరం ఆఖరు వరకు జరిగిన స్వదేశంలో తయారయ్యే విదేశీ మద్యాన్ని నిషేదించమనేది ఉద్యమం. రెండవది కల్లును కూడా నిషేధించమని తేది 8-3-1995 న ప్రారంభమయినది మూడవదశగా పేర్కొనవచ్చును వీటిలో నా ప్రమేయం వరకే తెలియజేస్తున్నాను

కొంచెం పూర్వ చరిత్ర వ్రాయండం అనుచితం కాదు. 1937లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మద్యనిషేధాన్ని ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వ ముఖ్యమంతి రాజాజీ ప్రవేశపెట్టారు. కాంగ్రెసు ప్రభుత్వం 1939లో రాజీనామా చేయడంతో ఆ ప్రయోగం ఆగిపోయింది మరల 1946లో ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో అధికారం స్వీకరించగానే నిషేధ ప్రయత్నం పునః ప్రారంభమయింది. దశలవారీగా ప్రారంభమయిన సారా నిషేధం 1949 నుండి ఆంధ్రప్రాంతంలో 1962 వరకు కొనసాగింది. చివరకు రద్దు కాబడింది ఆనాడు నిషేధపు రద్దును కోరన వారిలో నేనూ వున్నాను. నిషేధాన్ని బలపరిచే బలవత్తరమయిన వర్గం ప్రజలలో ఆనాడు లేదు. అదీగాక త్రాగడంపై నిషేధం కన్నా 'మోతాదుగా త్రాగమనే ప్రచారం' ఉపయుక్తమని ఆనాటి నా భావన ఆనాడు త్రాగుమోతుల సంఖ్య స్వల్పంగా వుండేది ఈనాడు వలె అది మితిమీరలేదు ఈనాటి పరిస్థితుల్లో మూడవ ప్రపంచ దేశాలలో ఒకటయిన మన దేశం - బీదరికంలో కుమిలిపోతున్న మనదేశం - త్రాగుడును అరికట్టకపోతే ప్రజల జీవన ప్రమాణం పడిపోవటం, ఆరోగ్యం దెబ్బతినడమే కాక ప్రశాంత కుటుంబ జీవితాన్ని గడపడానికి స్త్రీలకు గల మౌలిక హక్కును నిరాకరించడం అవుతుంది. 'ప్రసాదు' (ప్రభుత్వ సారా దుకాణం) వద్దకు సర్వవేళలా ఒరేవారి సంఖ్య ఈనాడు విపరీతంగా పెరిగింది పైగా సారా అమ్మకం వల్ల ప్రభుత్వాదాయాన్ని పెంచుకునే నికృష్ట స్థితికి ప్రభుత్వాలు దిగజారాయి. ఇలా అనేక కారణాలు నా వైఖరిని మార్చుకునేలాగు చేశాయి ఈనాడు నేను సంపూర్ణ మద్య నిషేధాన్ని ఆశించేవాడిని.

దూబగుంట మహిళలచే ప్రారంబింపబడిన సారా వ్యతిరేక ఉద్యమం అన్ని జిల్లాలకు ప్రాకింది. మహిళల మద్దతు సంపాదించింద నెల్లూరు, ప్రకాశం జిల్లా మహిళల పోరాట గాధలు, వేలం పాట నిరోధక చర్యలు మహిళలను ఉత్సాహపరిచాయి. తేది 12-9-1992న మల్లాది సుబ్బమ్మగారి చొరవతో 40 మహిళా సంఘాల ఆధ్వర్యాన 1500 మందితో ప్రర్శన జరిగింది; తదనంతరం మహిళలు సభలో సమావేశమయ్యారు కాంగ్రెసు మహిళా సంఘాలవారు,

వామపక్ష భావాలు కలవారు కూడా మహిళా సంఘాల బ్యానర్లతో పాల్గొన్నారు. మద్య తరగతి మహిళలు, శ్రామిక స్త్రీలు కలిసి చేసిన ఐక్య ప్రదర్శన యిది. 1993 జనవరి 30న ఒక చర్చావేదికను సుబ్బమ్మగారు నిర్వహించారు. అపుడు ఉద్యమ భవిష్యత్ వ్యూహాన్ని గురించి మహిళలు చర్చించారు సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మగారు, వామపక్ష మహిళా సంఘాల వారు, తదితరులు కలిసి ఏర్పాటు చేసిన ఐక్యవేదిక సమావేశంలో సుబ్బమ్మగారు పాల్గొన్నారు సంఘ నిర్మాణ విషయంలో బేధాభిప్రాయాలు వున్నా ఐక్యతను నిలబెట్టాలనే దృష్టితో దానిలో చేరారు; బలపరిచారు. కాని అందులోని తెలుగుదేశానికి, సి.పి.ఐ.కి, సి పి.ఎం కి చెందిన సభ్యులు వైఖరి, పనితీరు అమెకు నచ్చలేదు ఆమె ఐక్యవేదిక (స్త్రీ పురుషులతో) నిర్మించతలపెడ్తే వారంతా ఆమెను విమర్శించారు. ఆయా పార్టీలవారు తమ పార్టీలలోని పురుష సభ్యులతో కలిసి పనిచేస్తే తప్పులేదట కాని సుబ్బమ్మగారు ఐక్యవేదిక నిర్మించటం క్షంతవ్యం కాదట సంయుక్త సంఘటన 'పేరుతో ఇతరులపై పెత్తనం సాగించే మనస్తత్వం ఇది. ఆనాటి మహిళా ఐక్యవేదిక 'చేర్ పర్సన్' (అధ్యక్షురాలు) శ్రీమతి రేణుకా చౌదరి (ఆనాడు తెలుగుదేశం పార్లమెంటు సభ్యులు) అని తెలుసుకోవటం అవసరం తరువాత ఆమె శ్రీ కోట్ల విజయభాస్కర రడ్డితో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా అసెంబ్లీ ఎన్నికలలోకి దిగడం గమనార్హం సారా విషయమయి ఆలోచించడానికి రాష్ట్ర ప్రభుత్వం మంత్రి వర్గ ఉపసంఘాన్ని నియమిస్తే, అ ఉపసంఘ విచారణలో సుబ్బమ్మగారు, నేను విడివిడిగా సాక్ష్యాలు చెప్పాం. ఆమె సంపూర్ణ మధ్య నిషేధాన్ని డిమాండు చేశారు. నేను సారా, స్వదేశంలో తయారయ్యే విదేశీ మద్యం (ఐ.ఎం.ఎఫ్.ఎల్) కల్లులనువరుసగా దశలవారీగా నిషేదించాలని కోరాను శ్రీ విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాంగ్రసు ప్రభుత్వం సారా నిషేధాన్ని గురించి ప్రకటన చేస్తూ నెల్లూరు జిల్లాలో వెన్వెంటనే, తతిమ్మా రాష్ట్రం అంతటా తేది 2-10-93 నుండి సారా నిషేధం అమలులోకు వస్తుందని ప్రకటిచింది. తేది 9-5-1993న జన విజ్ఞాన వేదిక నిర్విహించిన చర్చావేదికలో 'దొంగసారా అరికట్టడానికి గ్రామాలలో ఏం చేయాలి?' అనే అంశంపై అద్యయన పత్రం సమర్పించాను సుబ్బమ్మగారు మరొక అద్యయన పత్రం సమర్పించారు తెలుగు దేశం జెండా లేకుండా, మహాత్మాగాంధీ బొమ్మవున్న జెండాతో మహిళల సారా వ్యతిరేక ఉద్యమాన్ని బలపరచటానికి తెలుగుదేశం నాయకుడు శ్రీ ఎన్ టి. రామారావు రాష్ట్ర పర్యటనకు వెళ్తూ, తనతోపాటు నెల్లూరు మహాసభలో పాల్గొనమని సుబ్బమ్మగారిని ఆయన అభ్యర్థిస్తే ఆమె ఆయన పర్యటన కార్యక్రమంలో పాల్గొన్నారు. దరమిలా కాంగ్రెసు శాసన సభా పార్టీ కార్యదర్శి శ్రీ కోదండరామిరెడ్డి చర్చావేదిక నిర్వహిస్తే దానిలోనూ సుబ్బమ్మగారు పాల్గొన్నారు. పార్టీలతో నిమిత్తం లేకుండా సమస్యలపై యితరులతో సమకరించే విధానం ఆమెది.

తేది 19-7-1993న మద్య నిషేధానికి పనిచేయడానికి రాష్ట్ర వ్యాప్త కమిటీని రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. దానికి శ్రీ వావిలా గోపాలకృష్ణయ్య అధ్యక్షులు 23 మంది

సభ్యులలో సుబ్బమ్మగారు ఒకరు. నిషేధాన్ని కోరి, దానికి ప్రచారం చేయడానికి నిరాకరించ తప్పని తలచి ఆమె సభ్యత్వాన్ని స్వీకరించారు. ప్రత్యేకంగం ప్రచారం చేయటానికి ఆమె హైదరాబాద రంగారడ్డి జిల్లాలను ఎన్నుకున్నారు. యధాశక్తి ప్రచారం చేశారు. 1993 డిసంబరులో స్త్రీల సమస్యల అధ్యయన సంస్థల మహాసభ మైసూరులో జరిగితే ఆమె అధ్యయన పత్రం సమర్పించారు. సారా వ్యతిరేక ఉద్యమంలో నేను ప్రత్యక్ష్యంగా పాల్గొనకపోయినా సుబ్బమ్మగారికి నైతిక సహకారాన్ని అందించాను. అంతవరకే నా పాత్ర.

# మద్యపాన నిషేధోద్యమం - 2
# (ఐ.ఎం.ఎఫ్.ఎల్. వ్యతిరేకత)

సారా నిషేధం వల్ల 800 కోట్ల రూపాయిలు నష్టపోయినట్లు ప్రకటించిన ఆం.ప్ర. రాష్ట్రప్రభుత్వం లోటును పూడ్చుకునడానికన్నట్లు 630 కొత్త ఐ ఎం.ఎఫ్.ఎల్. దుకాణాలకు అనుమతించింది. ఆ కోవకు చెందిన 'సీసా సారా' ను చవకగా విక్రయింపచేసింది దాంతో సారా త్రాగేవారు దానికోసం ఎగబడ్డారు. పూర్వ 10 రూపాయలు సారా కోసం వెచ్చించేవారు 50 రూపాలయలు చవకరకపు ఐ.ఎం.ఎఫ్.ఎల్. ను కొనుగోలు చేయసాగారు. త్రాగుమోతుల గృహిణుల యిక్కట్లు సమిసిపోలేదు ప్రభుత్వ విధానపు యీ లోపాన్ని సుబ్బమ్మగారు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, అదిలాబాదు, కరీంనగరుల పర్యటనలో గ్రహించారు కమిటీ జీవితాన్ని ప్రభుత్వం మరో సంవత్సరం పొడిగించింది. దరిమిలా జరిగిన కమిటీ ప్రధమ సమావేశం తే. 7/8/94న జరిగింది. అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తాను రాజానామా చేస్తానని ప్రకటించారు. సభ్యులు వారిని వారించ ప్రయత్నిస్తే సుబ్బమ్మగారు 'వారిని రాజీనామా చెయ్యనియ్యండి; నేనూ రాజీనామా చేస్తాను' అని చెప్పారు. వావిలాల వారు తే. 8/8/84న రాజీనామా చేశారు 'ఉద్యమాన్ని నేనుగా ప్రారంభించను, ఉద్యమానికి చేతనయిన మద్దతు ఇస్తాను' అన్నారు శ్రీ వావిలాల. సుబ్బమ్మగారు వెన్వెంటనే కార్యాచరణకు ఉపక్రమించారు తే 15/8/94న అనేక మహిళా సంఘాల ఆధ్వర్యంలో ప్రదర్శన, సభ జరుగుతుందని ప్రకటించారు; వాటిని అదేరోజున 23 మహిళా సంఘాల తరపున నిర్వహించారు. ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరెడ్డిని కలిసి ఐ.ఎం.ఎఫ్.ఎల్. నిషేధాన్ని కోరుతూ విజ్ఞాపన పత్రం సమర్పించారు. ఆగష్టు 18న గుంటూరులో పెద్ద బహిరంగ సభలో ప్రసంగించారు 20వ తేదీన హైదరాబాదు రంగారెడ్డి జిల్లాల సంపూర్ణ మధ్య నిషేధ సమితి స్థాపన జరిగింది. సర్వశ్రీ మల్లాది సుబ్బమ్మ, టి విజయలక్ష్మి (హైదరాబాదు నగర బి జె పి ఉపాధ్యక్షులు తన వ్యక్తిగత హోదాలో) బోయినపల్లి వెంకటరామారావు (సర్వోదయ నాయకులు) అధ్యక్షకర్గంగా, ఆర్య మహిళా ప్రతినిధి సభ అధ్యక్షులు శ్రీమతి సంధ్యావందనం లక్ష్మీదేవి ప్రధాన కార్యదర్శిగా, శ్రీ ఎం వి రామమూర్తి కోశాధికారిగా ఎన్నుకోబడినారు సెప్టెంబరు నెలలో సుబ్బమ్మగారు తూర్పుగోదావరి జిల్లాలో, విశాఖపట్టణంలో పర్యటించారు. తే 23/9/94 రాష్ట్ర మహాసభ జరిగింది రాష్ట్ర సంపూర్ణ మధ్య నిషేధసమితి ఏర్పడింది. 13 జిల్లాల ప్రతినిధులు పాల్గొన్నారు 9మంది సభ్యులతో అధ్యక్షవర్గం, ముగ్గురు ఉపాధ్యక్షులు, ఒక ప్రధాన కార్యదర్శి, నల్గురు సహాయ కార్యదర్శులు, ఒక కోశాధికారి, కార్యవర్గ సభ్యులు, స్థాయి సంఘ సభ్యులు ఎన్నుకోబడినారు మహాత్మాగాంధీ జన్మదినోత్సవం

తే 2/10/94 నాటికి సంపూర్ణ మద్యనిషేధాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టాలని మహాసభ డిమాండు చేసింది. ఉద్యమ లక్ష్యం, వ్యూహం, విధానం, కార్యక్రమం నిర్ణయింపబడినాయి. ప్రజలకు ప్రభుత్వానికి, పార్టీలకు విజ్ఞప్తులు, డిమాండ్లు, హెచ్చరికలు చేయడమైనది. నిరసన ప్రదర్శనలు జరుప నిశ్చయింపబడినది. మద్య నిషేధానికి మద్దతుగా పార్టీ నాయకుల సంతకాల సేకరణ చేసింది సమితి. తెలుగుదేశం పార్టీ నాయకుడు శ్రీ ఎ న్.టి. రామారావు సంతకం చేయ నిరాకరించారు. అందుకు సమితి నాయకులు అసమ్మతి తెలియజేశారు. బహుశః అది ఆయన దృష్టికి వచ్చిందో ఏమో మహాత్మాంగాంధి జన్మదినోత్సవంనాడు సికిందరాబాదులో గాంధీ విగ్రహానికి దండ వేయటానికి వచ్చిన శ్రీ ఎన్.టి రామారావు సుబ్బమ్మ గారిని విగ్రహపు వేదికపైకి ఆహ్వానించి ఆమెను మాట్లాడమని కోరారు. ఆయన వెళ్ళిపోయిన దరిమిలా సమితి కార్యకర్తలపైన, తదితర మహిళా నాయకులపై దారుణ హింసాకాండ జరిగింది. సుబ్బమ్మగారిని క్రిందికి బరబరా యీడ్చారు. అనేకమంది స్త్రీల జాకెట్లు, చీరలు చినిగిపోయాయి. సుమారు 130మందిని పోలీసులు అరెస్టు చేశారు. ఇదంతా ముఖ్యమంత్రి గాంధీ విగ్రహానికి దండలు వేయటానికి త్రోవ ఏర్పాటు చేసే ఉద్దేశ్యంతో జరిగింది. పోలీసు ఈ అమానుష కృత్యాలను ప్రజలు ఖండించారు. పత్రికలు తీవ్రంగా నిరసించినాయి తరువాత కూడా పోలీసులు రెండుసార్లు -- హైదరాబాదులో, విజయవాడలో -- మహిళా ఐక్యవేదిక నాయకులు కార్యకర్తలపై దుర్మార్గంగా చేయి చేసుకున్నారు. ఇదంతా అగ్నిలో ఆద్యం పోసినట్లయింది హైదరాబాదు పేటలలో వారం రోజులు మద్య నిషేధ సమితి పలుచోట్ల ధర్నాలు చేసింది. రంగారెడ్డి జిల్లా గ్రామాలలో సభలు పెట్టింది అలాగే జిల్లాలో కార్యక్రమాలు జరిగాయి. సంపూర్ణ మద్య నిషేధాన్ని, కల్లుమినహా ప్రవేశపెట్టామని చెప్పడంలో కాంగ్రెసు, తెలుగుదేశం, భాదతీయ జనతా పార్టీ నాయకులు పోటీపడ్డారు. తెలుగుదేశ ప్రభుత్వం ఏర్పడగానే సంపూర్ణ మద్యనిషేధాన్ని ప్రకటించారు శ్రీ ఎన్.టీ.రామారావు.

ఈ విజయానికి 4 స్రవంతులుగా జరిగిన ఉద్యమం దోహదం చేసింది. సంపూర్ణ మద్య నిషేధ సమితి, మహిళా ఐక్య వేదిక, 'జనశక్తి', 'ప్రజా ప్రతిఘటనలకు' చెందిన మహిళలు, బలవంతంగా నేషేధం తేవాలని ప్రయత్నించిన పీపుల్స్ వార్ నక్సలైట్లు ఎవరికి చేతనయినట్లు వారు సాయం చేశారు

మద్య నిషేధ సమితి 'సంపూర్ణ మద్య నిషేధ మంత్రిని కలిసి రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన శాసనాలలోని లోపాలను వివరించింది. ఆ లోపాలను సవరించుకోమని విజ్ఞప్తులు చేసింది. కాని లోపాలతో, లొసుగులతో శాసనం అలాగే వుంది. విదేశాలలోని భారతీయులకు, విదేశీయులకు, రాష్ట్రేతరులకు, పెద్ద హోటళ్ళకు, వైద్యుని సర్టిఫికెట్టు పొందిన త్రాగుడు అలవాటయిన వారికి, మత కార్యకలాపాలకు యిలా మినహాయింపులు యిచ్చింది శాసనం కల్లును శాసనపు పరిధిలోనుండి మనహాయించింది కల్లు దుకాణాలలో సారాయి, ఐ ఎం.ఎఫ్.ఎల్ దొరకడం

సాగింది దొంగసారా, గుడుంబా విపరీతంగా అమ్మకం జరుగుతున్నాయి రాష్ట్ర సరిహద్దులద్వారా అక్రమ రవాణా కొనసాగుతున్నది శాసనాన్ని సక్రమంగా అమలు చేయాలని సమితి డిమాండు చేస్తున్నది శాసనం 60 శాతం ఉపయోగకరంగా వున్నా కల్లును కూడా నిషేధిస్తే తప్ప దానిని సమగ్రవంతంగా అమలుచేయలేమని సమితి భావిస్తున్నది. రాష్ట్ర సంపూర్ణ మద్య నిషేధోద్యమ సమితి కార్యకలాపాల్లో ఎక్కువగా పాల్గొన్నవారిలో ముఖ్యులు సర్వశ్రీ మల్లాది సుబ్బమ్మ, టి. విజయలక్ష్మి, [illegible] లక్ష్మీదేవి, కె వి యాణిక్‌బాయ్, బి సి.హెచ్. రంగారెడ్డి, సోమంచి [illegible] ఆర్ శంకర్ ప్రభృతులు రెండవ దశలో సాగి ఎం ఎఫ్ ఎల్ నిషేధోద్యమంలో నేను ముఖ్యంగానే ప్రత్యక్షంగా పాల్గొన్నాను నా .సిద్ధాంత వ్యాసం 'ఈనాడు' దినపత్రికలో ప్రచురితమయింది రాష్ట్ర సమితి కోశాధికారిగా నా విధులను నేను నిర్వర్తించాను ఈనాడు పత్రికాధిపతులు శ్రీ రామోజీ కృషి అనన్యం

# మద్యపాన నిషేధోద్యమం - 3
# (కల్లుకు వ్యతిరేకంగా)

మద్యనిషేధోద్యమం మూడవ దశలోకి -- అంటే కల్లును కూడా నిషేధించమనే స్థాయికి -- చేరటానికి ముఖ్యంగా సరాసరిగా దోహదం చేసింది రాష్ట్ర సంపూర్ణమద్య నిషేధ సమితి తే. 20-2-95న నిర్వహించిన గోష్టి అని చెప్పటం అతిశయోక్తికాదు. ఎప్పటి నుంచో సంపూర్ణ మద్య నిషేధం కావాలని ప్రకటనలు చేస్తున్న సర్వోదయ సంఘం వారు తప్ప, సంపూర్ణ మద్య నిషేధ సమితి కాక, యితరు లెవ్వరూ కల్లు నిషేధాన్ని కోరటం లేదు. తెలుగు దేశం, బి.జె.పి వామపక్షపార్టీలు, చివరకు తీవ్రవాద నక్సలైటు పార్టీలు అన్నీ కల్లును మద్య నిషేధం నుండి మినహాయించాలని అంటున్నారు బహుశ ప్రజల వోట్లను కోల్పోతామనే భయం కావచ్చును.

కల్లును నిషేధించడ విషయంలో ఉన్న ముఖ్యమైన అభ్యతరాలు రెండు (1) కల్లును నిషేధిస్తే గీతపనివారికి ఉపాధి పోతుంది (2) కల్లు బీదవారికి అందుబాటులో ధర కలది. వీటిని పరిధీలిద్దాం కల్లును నిషేధిస్తే గీతపనివారికి పనిపోతుందన్నమాట వాస్తవమే తాటి, ఈత వగయిరా చెట్లులేని ప్రాంతంలో నిజమయిన గీత పనివారు లేరు వ్యాపారం చేసే గౌడ కులస్తులున్నారు వారందరిని గీతపనివారనడం హాస్యాస్పదం. అసలయిన కల్లును తయారుచేసేవారు చెట్లువున్న ప్రాంతాలవారే. అయినా వారి సఖ్య గణనీయమే. కాదనేది లేదు అయితే వారికి ప్రత్యామ్నాయ ఉపాధి చూపడం కష్టసాధ్యం కాదు. 'నీరా', తాటిబెల్లం మొదలయిన హానికరం కాని పదార్థములను తయారు చేయిస్తే ఆ సమస్య తీరిపోతుంది. అలా చేయాలనే సంకఽల్పం ప్రభుత్వానికి వుండాలి. ప్రస్తుతం ప్రభుత్వానికి రాజకీయ సంకల్పం లోపించింది. అసలు ప్రజలతో ప్రభుత్వం చర్చించే విధానం లేకపోవటం శోచనీయం హడావిడిగా నిర్ణయాలు చేయడం, వాటి ప్రకారం శాసనాలను అంత త్వరగానే తయారు చేయడం, ఆ శాసనాలను, నిబంధనలను అమలు చేయడం యీనాడు ప్రభుత్వాల తీరుగా తయారయింది. ప్రజాభిప్రాయాన్ని గౌరవించేటట్లుగా ప్రజా సంఘాలతో చర్చించే పద్ధతి లుప్తమయింది. ఇదంతా ప్రజాస్వామ్య వ్యవస్థకు దోహదం చేయదు.

ఇటీవల 1995 మార్చి 10,11 తేదీలలో తిరుపతిలో జరిగిన జాతీయ స్థాయి సెమినారులో కల్లును నిషేదించాలనే అభిప్రాయం రూపొందింది. దూరదృష్టి వున్న వారులు కల్లు నిషేధాన్ని వాంఛిస్తున్నారు. కల్లు గీత పనివారికి ప్రత్యామ్నాయ ఉపాధికి మార్గాలు అన్వేషించమని ప్రభుత్వాన్ని కోరుతున్నారు.

[illegible] మహిళా [illegible] నాడు అనగా తే. 8/3/95న హైదరాబాదులో సెక్రటేరియట్ వద్ద కల్లు [illegible] నిసేధ శాసనంలోని లోపాలను సవరించాలని డిమాండు [illegible] సమితి ధర్నా నిర్వహించింది. పత్రికలు ఆ వార్తను చిత్రాలతో [illegible] కల్లు నిషేదోద్యమం పుంజుకుంటున్నది

కల్లు ఐ ఎం ఎఫ్ ఎల్ నిషేదం జరిగే వరకు తక్కువ ధరలో దొరికేది, ఇపుడు దాని ధర [illegible] ఏదయినా సారా [illegible] ఎఫ్ ఎల్ తో పోలిస్తే దాని ధర తక్కువే, బీదవారికి అందుబాటులో వుండటమనేది కల్లు నిషేధం కోరడానికి దోహదం చేసే కారణం బీదవారు త్రాగి తమ ధనాన్ని ఆరోగ్యాన్ని, కుటుంబ శాంతిని నాశనం చేసుకుంటున్నారు కల్లు త్రాగి ఇలా సమస్యను విశ్లేషణ చేసి పరిశీలించకుండా మూక వుమ్మడిగా కల్లు నిసేధపు డిమాండును త్రోసి [illegible] పొరపాటు అవివేక చర్య అవుతుంది దీని విషయం విజ్ఞులు జాగ్రత్తగా ఆలోచించడం అవసరం

# విదేశాలలోని మిత్రులు

1940 ప్రాంతం నుండి 1994 వరకు రాసిన జ్ఞాపకాలలో ఎన్నో అవకతవకలు తొర్లి వుండవచ్చు ఎంతో మంది స్నేహితులు పేర్లు, హితుల నామధేయాలు జారిపోవటం సహజమే అయినా క్షంతవ్యం కాదు. జ్ఞాపకశక్తి తగ్గటం కూడా యీ విపరీతస్తితికి కారణభూతం కావచ్చు ఎన్నో సంఘటనలు చిన్నవి, పెద్దవి; ఎన్నో ఉద్యమాలు మంచివి, చెడ్డవి, ఎంతమందో సహృదయులు, దుర్మార్గులు జీవితంలో నాకు తటస్థించారు. ఆనాడు నాకు గట్టిగా తెలిసిన వారు యీనాడు వెనక్కు తిరిగి చూసుకుంటే పేర్లు కూడా స్మృతి పథంలో మెదలటం లేదు వారి పేర్లను నేను ఉటంకించకపోతే 'ఎంత దుర్మార్గుడు' అని ముక్కుమీద వేలు వేసుకోకుండా 'పోనీలే! వాడూ మనిషే కదా! వాడికీ బలహీనతలు, అశక్తతలూ ఉండటం మామూలే కదా!' అని తలంచి నన్ను దయార్ద్ర హృదయంతో పరికించమని అభ్యర్థిస్తున్నాను.

తెలిసినవారు, పరిచయస్తులు, హితులు, శ్రేయోభిలాషులు, అనేకమంది ఉంటారు. నిజమయిన స్నేహితులు కొలదిమంది మాత్రమే ఉంటారు. వాస్తవంగా మిత్రులని పిలవబడటానికి అర్హులు బహుస్వల్ప సంఖ్యలో దర్శనమిస్తారు మనిషి బలహీతనలను, అశక్తతలను త్రోసి రాజనకుండా అతని లేక ఆమె యొక్క మొత్తం వ్యక్తిత్వాన్ని -- యధాతథంగా, మొత్తంగా -- స్వీకరించేవారి సంఖ్య చాల కొలదిగా వుంటుంది. అంతమాత్రాన తన లోపాలను మన్నించమని, తన చేతకానితనాన్ని సామర్థ్యం క్రింద జమకట్టమని ఏ వ్యక్తీ అశించరాదు అది చాలా తప్పు. వర్జ్యనీయ చర్య.

నా వ్యక్తిగత జీవితంలో, నేను చేపట్టిన పథకాలలో నేను తలపెట్టిన కార్యాలలో, న ప్రజా జీవితంలో నాకు అండదండలందించిన మిత్రులు అనేకమంది యీ దేశంలో వున్నారు. వారందినికి పేరు పేరునా రాశానో లేదో అని భయ సందేహాలకు లోనవుతున్నాను. కనుక ఆ పరిశ్రమను చేపట్టకుండా విదేశాలలోని మిత్రులను కొందరిని మరల జ్ఞాపకం చేసుకుంటున్నాను

అమెరికా న్యూయార్కు నగరంలో వున్న వెక్స్ దంపతులు 1978నుండి మా దంపతుల యెడ అభిమానంతో వుంటున్నారు. నార్వేలో ఆస్లో నగరంలో అంతర్జాతీయ హ్యూమనిస్టు మహాసభ జరిగినపుడు నార్వే రమ్మనమని తాము ఏర్పాటు చేసుకున్న బసలో వసతి కల్పిస్తామని రాసినపుడు, అమెరికాలో బఫలో అలాంటి మహాసభకు న్యూయార్కు రమ్మని ఆహ్వానించినపుడు, ప్రతి సంవత్సరం నా సతి మల్లాది సుబ్బమ్మ జన్మదినానికి -- నేను మరిచిపోయినా తాము మరచి పోకుండా -- ముందుగా శుభాకాంక్షలు, దినచర్య పుస్తకాలు పంపిన మిత్రులు వారు. తమ లేఖద్వారా మా యోగక్షేమాలను అవిచ్ఛిన్నంగా తెలిసికుంటున్న దంపతులు వారు వారి హృదయ కుహరాలలో మాకు చోటిచ్చిన సహృదయులు వారు

దక్షిణ భారతంలో హేతువాద ఉద్యమాన్ని పరిశీలించటానికి హైదరాబాదు వచ్చిన సమయంనుండి మా దంపతులపై అభిమానాన్ని, వాత్సల్యాన్ని చూపుతూ తను స్థాపించిన ధర్మనిధి నుండి ఏటా మహిళాభ్యుదయ సంస్థకు విరాళాలిస్తున్న బ్రిటనులోని నేషనల్ సెక్యులర్ సొసైటీ మాజీ కోశాధికారి రేవదేఖరును విస్మరించలేను 1978లో నేను లండన్ సభకు వెళ్ళినపుడు వారు నేను లండనులో కారులో తిరుగుతూ సంభాషించుకున్న ఘట్టం చిరస్మరణీయం బ్రిటనులో నేషనల్ సెక్యులర్ సొసైటీ అధ్యక్షురాలు బార్బారా స్మోకరుకు మాపై గల ప్రేమాభిమానాలు మరువలేదు. ఈ నాడు 'ఇంటర్‌నేషనల్ హ్యూమనిస్టు న్యూస్'కు సంపాదకుడుగా వుంటున్న జిమ్ హెరిక్ శ్రీమతి సుబ్బమ్మను గురించి బ్రిటిషు హ్యూమనిస్టుల పత్రిక 'న్యూ హ్యూమనిస్టు' లో రాసిన వ్యాసాన్ని నా స్మృతి పథం నుండి చెరిపి వేయలేను బ్రిటిషు హ్యూమనిస్టు సంఘం మాజీ అధ్యక్షుడు శ్రీ హారీ స్టోప్స్ (ప్రఖ్యాత కుటుంబ నియంత్రణ ప్రచారకురాలు, బహుగ్రంథకర్త మేరీ స్టోప్సు కుమారుడు) మా యెడల ప్రదర్శించిన ఉదాత్తత గణనీయం.

హైదరాబాదు వచ్చినపుడు " సుబ్బమ్మా! నీవు ఏమి చేస్తున్నావని అడిగి ఆమె పుస్తకాలను చూచి నీవు ఎప్పుడూ మా సహాయాన్ని అడగలేదు ఎందుచేత" అని ప్రశ్నించి ఒక చిన్న ప్రాజక్టును అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం (ఐ హెచ్ ఇ.యు) చేత మహిళాభ్యుదయ సంస్థకు యిప్పించిన ఘనత ఐ హెచ్ ఇ యు కార్యదర్శి శ్రీమతి నెట్టీ క్లీన్ కు చెందుతుంది.

ఏనాడో 1978లో లండనులో చూసినా, ఉత్తర ప్రత్యుత్తరాలలో తన శుభాకాంక్షలను యిస్తూ మా కార్యక్రమాలపై ఆసక్తిని ప్రదర్శిస్తున్న పాల్‌కుర్జ్ జ్ఞాపకం ఉంచుకోవలసిన మహనీయుడు. అమెరికన్ 'ఎథియిస్టు' పత్రిక స్థాపకురాలు, అమెరికను నాస్తికోద్యమ నాయకులు శ్రీమతి మాడ్లిన్ హేర్ సుహృద్భావం నన్ను ఋణస్తుని చేసింది.

ఎవిలిన్ వెక్సరు స్నేహితురాలుగా మాకు ఉత్తరాలద్వారా పరిచయమయి, ఇండియా ఆమె వచ్చినా మేము కలవలేని 'విన్‌న్యూస్' సంపాదకురాలు శ్రీమతి హాస్కన్ శ్రీమతి మల్లాది సుబ్బమ్మ ఉద్యమాలకు, రచనలకు ఎంతో దొడ్డ మనసుతో ప్రచారాన్నిచ్చింది" ఆమె సుబ్బమ్మ యెడ చూపిన ఆదరణభావానికి మేము కృతజ్ఞులం

చివరగా చెప్తున్నాను, మా శ్రేయోభిలాషి నార్వే హ్యూమనిస్టు సంఘ మాజీ కార్యదర్శి, ఐ.హెచ్.యు. డైరెక్టరు లెవీ ఫ్రాజల్ మా యెడల స్నేహభావాన్ని ప్రదర్శించిన మహోన్నత వ్యక్తి, హైదరాబాదు వచ్చిన ప్రతిసారి నాతో సంభాషించటానికే తన అమూల్యమయిన కాలాన్ని వెచ్చించే సహృదయుడాతడు. మేము దంపతులం సాగిస్తున్న కార్యక్రమాలపట్ల శ్రద్ధాసక్తులను చూడడం అతని గొప్ప నైజానికి నిదర్శనం అతని మనస్సులో మాకు చోటుయివ్వడం మా 'అదృష్టం'.

# జ్ఞాపకం పెట్టుకోవలసిన వారు

ఎందరినో కలిశాను. ఎందరి చేతనో ప్రభావితుడనయినాను. ఎందరివలననో సహాయాలు పొందాను. ఎందరో నన్ను మన్నించారు గౌరవించారు వారందరిని పేర్కొనటం అసాధ్యం. కనుక ఒక్కొక్క రంగం తీసుకొని ముఖ్యులను పేర్కొంటాను.

మున్ముందుగా ప్లీడరీ వృత్తిలో నేను నిలబడడానికి సాయం చేసినవారు సర్వశ్రీ మద్దు లక్ష్మయ్య (చీరాలవాసి ఇపుడు కీర్తి శేషుడు), ఎస్. వెంకటేశ్వర్లు (స్వాములు అని సాధారణంగా పిలుస్తారు; వేటపాలెం గ్రామస్థుడు), పరిమి వెంకటనారాయణ (ఇంకొల్లు గ్రామస్థుడు. ఇపుడు లేడు) నేను గురజాలలో నాపినతండ్రి మరణానంతరం ప్లీడర్ చేస్తున్నపుడు పరోక్షంగా నాకు ఆత్మవిశ్వాసాన్ని కల్గించిన వారు కీర్తిశేషులయిన నా పినతండ్రి మల్లాది నరసింహమూర్తి గారు. ఆయన దావాలలో ప్లయింట్ల ప్రక్కన 'లా' పాయింటును రాసి వుంచేవారు తరువాత బాపట్ల న్యాయవాదులలో నాకు అదర్శంగా నిలిచినవారు వెలగపూడి సుబ్బారావుగారు. నేను తోటి ప్లీడరుతో తగాదాలో ఇరుక్కున్నపుడు తమ చొరవతో, నామీద వాత్సల్యంతో నన్ను ఆదుకొని ప్రమాదం నుండి గట్టెక్కించినవారు సర్వశ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి, కొమరవోలు నాగేశ్వరరావు (ఇపుడు వారిద్దరూ జీవించిలేరు). శ్రీ కొమరవోలు శ్రీనివాస వెంకటసుబ్బారావు. రాజకీయాల విషయంలో నాతో సర్వసాధారణంగా విభేదించినా, నేను అతనిని అనేక రకాలుగా చిక్కుల పాలు చేసినా, నా మీద అభిమాన గౌరవాలను కలిగిన కోన ప్రభాకరరావును (మాజీ గవర్నరు. ఇపుడు బ్రతికి లేరు) గుర్తుపెట్టుకుంటాను. తను ఆచార్య రంగా గారి గ్రూపుకు చెందినా, నేను రంగా గారి అనుచరుడిని కాకపోయినా, స్థానికి రాజకీయాలలో ఒక్కొక్కపుడు ఇద్దరం చెరో పక్షాన్ని బలపరిచినా స్నేహ ధర్మాన్ని నెరపేవారు ఆచంట రంగనాయకులు ( న్యాయవాది, మాజీ ఎం.ఎల్.సి).

రోటరీ ఉద్యమంలో నన్ను చేర్చి, నన్ను ప్రోత్సహించి నాకు అండగా నిలిచి, నా అభ్యుదయాన్ని కాంక్షించిన వారు డాక్టరు కత్తి సత్యనారాయణరావు గారు. నాటక రంగంలో నాకు సన్నిహితులు నాటక రచయిత, నటుడు, దర్శకుడు కీ.శే. కొరప్రాటి గంగాధరరావు, బ్రహ్మాండం నరసింహం (ఇపుడు తిరుపతిలో వున్నారు. ఉద్యానవన శాస్త్రవేత్త), టి. రాఘవరావు (ఇపుడు విశాఖపట్టణవాసి; క్రిమికీటక శాస్త్రవేత్త) గారలు

రాజకీయాలలో నాకు సరి అయిన పంథాను చూపిన కీ.శే. ఎం.ఎన్ రాయ్‌ను నేను స్మరించుకోవాలి. అనేక పర్యాయాలు నేను తనను విమర్శించినా, ఎదురుతిరిగినా, ఇబ్బంది పెట్టినా వాటిని వేటిని పట్టించుకోకుండా నా 'పెద్ద అన్నయ్య' వలె నన్ను మానవవాద రాజకీయాలలో, ప్రజాస్వామ్య ఉద్యమంలో, పౌరహక్కుల సంఘంలో, ఆదరించి బాధ్యతాయుత

పదవులను నాకు కట్టబెట్టి నేను యింతవాడిని కావడానికి దోహదం చేసిన న్యాయమూర్తి వి.ఎం. తార్కుండేలకు నేను రుణపడి వున్నాను. పై ఇద్దరు ప్రథమశ్రేణి నాయకులయితే నాతో నెయ్యం గరిపిన కీర్తిశేషులు ఆవుల గోపాలకృష్ణమూర్తి, గోరా గారలు ద్వితీయశ్రేణి నాయకులు.

మానవవాద సంఘంలో సర్వశ్రీ: సునీల్ భట్టాచార్య (ఢిల్లీ), సి.ఆర్.ఎమ్. రావు (ఢిల్లీ), బి.డి. శర్మ (ఢిల్లీ), డబ్ల్యుయు.ఎస్. కానే (బొంబాయి), ఎస్.ఎస్.వ్యాస్ (బోధపూర్) గారలు నాకు దగ్గర వ్యక్తులు

హేతువాద రంగంలో నేను మరచిపోకూడనివారు సర్వశ్రీ ఎ. సూర్యనారాయణ, జోసఫ్ ఎడమరుకు, సనాల్ ఎడమరుకు, రావిపూడి వెంకటాద్రిగారలు. కుల నిర్మూలనోద్యమంలో శ్రీ డి.జి. రామారావు మీద నాకు ఎంతో గౌరవం వుంది. ప్రజాస్వామ్య ఉద్యమంలో నాకు కొండంత బలాన్ని చేకూర్చిన వారు సర్వశ్రీ కె. ప్రతాపరెడ్డి, ఎన్.డి. పంచోలీ గారలు. పౌరహక్కుల ఉద్యమంలో కీ.శే. రెవరెండు ఎం.ఏ. థామన్, బల్వంతరెడ్డి, కె.జి. కన్నబిరాన్, రావెల సోమయ్యా నన్ను ౼భిమానించారు.

చివరగా, వారూ అనేక ఉద్యమాలలో నాతోపాటు పాల్గొనినా నాపై గౌరవాభిమానాలను ప్రదర్శించినవారు సర్వశ్రీ కీ.శే. గుంటుపల్లి గోపాల కృష్ణయ్య (మాజీ సర్పంచి, ఇంకొల్లు), పోలు సత్యనారాయణ (ప్రస్తుతం ఇందిరా గాంధీ సార్వత్రిక విశ్వవిద్యాలయ, హైదరాబాదు శాఖ సంచాలకులు), న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు, సి.హెచ్. రాజారెడ్డి (చీరాల), గురజాల సీతారామయ్య, ఎం. బసవపున్నారావులు (తెనాలి) నన్ను ప్రత్యేకాదరాభిమానాలతో చూచే కె. సోమకొండారెడ్డి గారిని (అడ్డకేటు) కృతజ్ఞతతో గుర్తుంచుకోవటం నా విధ్యుక్త ధర్మం. వీరిని గురించి మాత్రమే చెప్పినందువల్ల తక్కిన అనేక మంది మిత్రులను, సహచరులను ఉపేక్షించినట్లు కాదు. వారందరూ నన్ను ఆదరించిన వారే. బలపర్చినవారే. నాకు నైతిక ధృతి కల్గించినవారే. నన్ను ప్రోత్సహించినవారే. సహాయం చేసినవారే. ఎందరో మహానుభావులు అందరికీ నా వందనములు.

# సింహావలోకనం

నేను రాస్తున్న జ్ఞాపకాలను గురించిన సంగ్రహ వ్యాసాలను చదువుతున్న వారికి కొంతగా కొంత ఆశాభంగం కలిగి వుండవచ్చు 76 సంవత్సరాల వయస్సు వున్న వ్యక్తి, జాతీయ రాష్ట్రీయ ఉద్యమాలలో కాస్తో కూస్తో ప్రమేయమూ. భాగస్వామ్యమూ కలిగిన మనిషి కలం నుండి జాలు వారేవాస్తవ గాధలు, వ్యాఖ్యలు వారికి తృప్తికరం కాకపోవచ్చు. సాంఘికార్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో నడిచిన చరిత్రను తెలుసుకోవాలని కొంతమంది ఉత్సుకత ప్రదర్శిస్తే, మరికొందరు కొన్ని ఉద్యమాల కూలంకష చరిత్ర, రచనను ఆశించి వుండవచ్చు అలా కాక యింకా కొందరు జాతీయ చరిత్రను కాని రాష్ట్రీయ చరిత్రను కాని ఆపేక్షించటం, తదితరులు, తేదీలవారీతా, నా అనుభవాల జ్ఞాపకాల స్మృతులను, ముచ్చటలను పఠించాలని ఆతృత చెందడం జరిగి వుండవచ్చు వీరందరికీ నేను ఆశాభంగం కలిగించి వుంటాను

ఒకనాడు తెలుగు దేశంలోని ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని గురించి పరిశోధనాత్మక విశ్లేషణాయుత సుదీర్ఘ వ్యాసాన్ని (మోనోగ్రాఫ్) రాయమని శ్రీ పోలు సత్యనారాయణ ఆనాటి తన అధికార హోదాతో (డిప్యూటీ డైరెక్టరు,ఐ సి.ఎస్.ఎస్ ఆర్. దక్షిణ ప్రాంత విభాగం) నన్ను కోరితే (1983), తరువాత అం ప్ర రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమ చరిత్రను రాయటానికి నేను అం ప్ర హ్యూమనిస్టు సంఘం వారి ఆదేశాన్ని పొందితే, చివరకు శ్రీ పోలు సత్యనారాయణ, కృష్ణా పత్రిక దినపత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ ఆత్మకథ గ్రంథ ఆవిష్కరణ సభలో తమ ఉపాన్యాసాలలో (1990) నా జీవిత చరిత్రను రచించమని సలహా యిస్తే వీరి సూచనలను, ఆదేశాలను, సలహాలను వెన్వెంటనే పాటించలేకపోయాను. చివరకు మిత్రులు పిరాట్ల వారి ప్రోద్బలంతో నా అనుభవాల స్మృతులను తెలుగు ప్రజలకు అందజేయటానికి సమకట్టాను

అనుభవాలు ప్రతి వ్యక్తి జీవితంలోను అనేకం వుంటాయి అన్నింటికీ ప్రాధాన్యత - - వ్యక్తిగతంగా కాని, సామాజికంగా కాని -- ఉండక పోడం సహజం కనుక అన్ని అనుభవాలను గురించి రాయకపోవడం సబబే. అలాగే జ్ఞాపకాలు అన్నీ యితరులకు ఆసక్తిదాయకం కాకపోవటమూ మామూలు విషయమే. అనుభవాలను గురించి రాయటంలో, స్మృతులను నెమరువేసుకోవటంలో రచయిత స్వీయాత్మకత ధోరణి (సబ్జెక్టివు) కొంతగా కొంత - సరాసరిగా లేక పరోక్షంగా అలాకాక తెలిసి బుద్ధి పూర్వకంగా కాని తెలియకుండానే కాని -- చొరబడటం తప్పని సరిగా ద్యోతకమవుతుంది ప్రతి వ్యక్తి తనను గురించి గొప్పగా రాసుకోవటం, తన చర్యలకు, కార్యక్రమాలను ప్రాధాన్యతను ఆపాదించుకోవటం సర్వసాధారణంగా సంభవించేదే రచయిత ఎంత వస్తు నిష్ఠతో రాసినా, ఎంత నిస్సంగత్వాన్ని ప్రదర్శించ ప్రయత్నించినా అతని

బలహీనతలు, అవగాహనలో లోపాలు, యితరత్రా అశక్తతలు, తన ఊహాలను, ఆల బనలను, చర్యలను సమర్థించుకునే మనస్తత్వం బహిర్గతం కాక తప్పదు తన జీవితానుభవాలను తెలిపే ప్రక్రియలో పేర్కొనవలసిన వాటిని ఎంపిక చేయటంలో, తన జ్ఞాపకాలను వెలికి తీయటంలో -- అతనికి తెలియకుండానే -- రచయిత స్వీయాత్మక ధోరణి వ్యక్తమవుతుంది ఉపాధి వున్న ప్రతి వ్యక్తి కూడా యీ ప్రమాదాలను అధిగమించలేడని నా నమ్మకం

ఈ అనుభవాల సంకలనం, యీ జ్ఞాపకాల సంపుటి జాతీయ రాష్ట్రీయ స్థాయిలో చరిత్ర అనిపించుకోదు. ఏ ఒక్క ఉద్యమపు పోకడల స్ఫురణ కాదు రచయిత జీవిత చరిత్ర అంతకన్నా కాదు. అయితే యిది ఏదీకాక పోదు. పై చెప్పిన అన్నింటి లక్షణాలు యిందులో వున్నాయి. ఒకానొకచోట ప్రస్ఫుటంగా దర్శనమిస్తాయి. మరో సందర్భంలో అంతర్గతంగా కన్పిస్తాయి ఈ హెచ్చరికను మనస్సులో పెట్టుకొని చదువరులు వీటిని పరిచయం చేసుకున్నట్లయితే వారికి అసంతృప్తి మిగలదని మనవి చేసుకుంటున్నాను

చాలమంది సహచరుల పేర్లు, వారితో కలిసి నేను చేసి ప్రయత్నాలు, సాగించిన కార్యక్రమాలు, సంభవించిన సంఘటనలు యీ అనుభవాల దొంతరలో జ్ఞాపకాల మూటలో జారిపోయి వుండచ్చు. అది నేను బుద్ధిపూర్వకంగా చేసిన పనియని తలపోయ వద్దని వారిని సవినయనంగా కోరుతున్నాను వయస్సు మళ్ళుతున్న సమయంలో, వృద్ధాప్యంలో అడుగిడుతున్న పరిస్థితుల్లో -- కొదరు మిత్రులు 'నీవు వృద్ధుడివే' అంటున్నారు. నేను వారి వ్యాఖ్యను ఆమోదించలేకపోతున్నాను అంగీకరించటానికి మనస్కరించడంలేదు అది సహజమే కదా ! -- అనుభవాలన్నీ స్మృతి పథంలో మెదలవు జ్ఞాపకం రావు అదీగాక కొన్నింటిని యితరులకు ఆసక్తిదాయకాలు కావని వాటిని గురించి నేను -- తెలిసి కూడా -- రాసి వుండకపోవచ్చు. ఏదయినా, ఎలా జరిగినా, తమ పేర్లు, తమతో కలిసి నేను సాగించిన కార్యక్రమాలు, అనుభవించిన జీవిత సంఘటనలు నా రచనలో కన్పించకపోతే వారు అన్యథా భావించవద్దని నేను వారిని అభ్యర్థిస్తున్నాను.

ఇలాంటి రచన సాగించటంలో కొన్ని ఇబ్బందులు, కష్టాలు వుంటాయి నిజం చెప్పకపోతే రచయిత ఆత్మద్రోహం చేసుకున్నవాడవుతాడు. అసత్యమాడితే, అభూతకల్పనలు చేస్తే అనృతదోషానికి గురి అవుతాడు నిష్టుర నిజాలు బయట పడితే సహచరులు, అనుచరులు, మిత్రులు, యితరులు అలాంటి వారి మనస్సులకు క్లేశాన్ని కలిగించడం -- ఎంత వద్దనుకున్నా, ఎంతగా కాగూడదని ప్రయత్నించినా --, విధిగా జరుగుతుంది. ఈ రెండు ప్రమాదాలకు లోనుకాకుండా ఉండడం కత్తి మీది సాముయే. ఈ ప్రయత్నంలో నేను ఎంతవరకు నెగ్గాను అనేది చదువరులు తేల్చవలసిన విషయం అయితే ఒక్క కోరిక వెలిబుస్తాను పైకి స్థూలంగా

చూస్తే -- సాదా సీదాగా వున్నా -- మరోసారి చదివితే నేను నిజాలను దాచలేదని చదువరులకు తప్పక తోస్తుంది.

చివరగా ఒక్క మాట 1979 నుండి 1994 వరకు వున్న నా అనుభవాలకు, స్మృతులకు అక్షరరూపం యిచ్చే క్రమంలో నేను కొంత తొందరపాటు ప్రదర్శించానేమోననే సందేహం లేక భావం కొంతమంది చదువరులకు స్ఫురించవచ్చు. ఇంతగా రాసిన తరువాత, 'నా అనుభవాలు, స్మృతులు ఇతరులు తెలిసికోతగ్గవి కావు' అనే భావం నా మనస్సులో చోటు చేసుకోవటం కారణం కావచ్చు. అలాకాక, 'నేను చెప్పుకోతగినది ఏమి సాధించాను' అని ప్రశ్నించుకుంటే నాకు తోచిన సమాధానం నాకు నిరాశను, నిస్పృహను కలిగించి వుండవచ్చు. చిన్న చిన్న విషయాలను, సంఘటనలను, అంశాలను అదే పనిగా రాసి చదువరులకు విసుగును, అలసటను కల్గించటానికి మనస్కరించకపోవటం కావచ్చు. అవేవీ కాక, ఉద్యమాల పరంగా రాస్తే ఎవరికి యిష్టమయిన, నచ్చిన, ఆకర్షణీయమయిన, ఆసక్తిదాయకమయిన ఉద్యమాల చరిత్రను వారు చదువుకోగలరని నేను భావించి వుండవచ్చు ఎలాగయినా చివరలో తొందరపాటు కన్పిస్తే నేను క్షంతవ్యుడను.

'ప్రతి వ్యక్తి జీవితానుభవం నుండి యితరులు తెలుసుకోతగిన అంశాలు అనేకం వుంటాయి, పైగా ఇన్ని ఉద్యమాలలో ప్రవేశం కల్గిన (నా మాటలలో అయితే వేలు పెట్టిన) మీ బోటివారి స్మృతులు ప్రయోజాన్ని సాధిస్తాయి. అంతేకాక వయస్సు మళ్ళి -- మామూలు స్థాయిలో -- చైతన్యవంతమయిన కార్యక్రమాలకు కాస్త దూరంగా వుంటున్న యీ తరుణంలో మీ జ్ఞాపకాల సంగ్రహం అవసరం' అని నన్ను స్తబ్దత నుండి మేలు కొల్పి నా చేత వీటిని రాయించడమే కాక వాటిని తమ దినపత్రికలో ఆగష్టు 15వ తేదీ 1994 నుండి వరుసగా ప్రకటించిన మిత్రులు పిరాట్ల వెంకటేశ్వర్లుగారికి నేను కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను దీనిని చదివిన కృష్ణాపత్రిక చదువరులకు, తదితరులకు నేను రుణపడి యున్నాను. చదివి కాని చదవక కాని నన్ను ప్రోత్సహించిన మిత్రుల ఆదరాభిమానాలను నేను మరచిపోలేను

# వ్యక్తిగా నేను

నా వ్యక్తిత్వము కాల ప్రభావానికి లోను అయింది. నేను యిలా అవటానికి అంద కారణభూతులమే.

నాతల్లి విషయం. నా ఏడవయేట అనుకుంటాను నాకు భేది మందు ఇచ్చింది. నేను మం వేసుకున్న తరువాత అది పనిచేయడం ప్రారంభించిన తదుపరి ఆమె చూడకుండా మామిడిపం తిన్నాను. ఆమె పసిగట్టింది. నిలదీసి అడిగింది నాచేతను ఒప్పుకున్నాను నాకు ప్రాణా...ాయ సంభవిస్తుందేమోనని తల్లడిల్లిపోయింది ఆ మనః స్తితిలో నన్ను ఒక్కదెబ్బ వేసింది. మొదటిసారి ఇ చివరిసారి నా తండ్రిగారి శ్రాద్ధకర్మలు చేయనని ఆయనతో నేను ఖండితంగా చెప్పినా ఆయన న పల్లెత్తుమాట అనలేదు. అది ఆయన విశాల హృదయానికి నిదర్శనం

ఉద్యమాలలో నా సహచరులతో మొదట్లో సుమారు పది పన్నెండేళ్ళు నావ్యవహార స తలచుకుంటే నాకు యినాడు సిగ్గు వేస్తున్నది. నేను వారి కార్యక్రమాలను పర్యవేక్షించేటప్పుడు "పూర్వ ఏమి చేద్దామని నిర్ణయాలు తీసుకున్నాం. అందుతో ఎన్నింటికి కార్యరూపం ఇవ్వగలిగాం మిగతావాటి వేటిని అమలుపరచలేక పోయాం? వాటికి కారణాలు ఏమిటి? ఇప్పుడు వాటిని ఆచరణలో తేగలమా? అయితే, ఎలా చేయాలి?" అని వారితో చర్చించడమే కాని, " నీ సంసార బాధ్యతలు ఏ నీ సంపాదన, నీ ఆదాయం, నీ ఆస్తి ఎలాగున్నాయి? నీకుటుంబ సభ్యులు నీకు సహకరిస్తున్నారా లే తటస్థంగా వున్నారా లేక వ్యతిరేకిస్తున్నారా?' అని నేను వారిని అడిగిన 'పాపానికి' పోలేదు తరు నాతప్పు, నాస్వభావంలో లోపాన్ని గ్రహించాను.

ఏపురుషుడి అవలక్షణాలూ, లోపాలు, బలహీనతలు అతని భార్యకు అవగతం కాక తప్ప ఇన్ని తెలిసినా కాపురానికి వచ్చిన మొదటి ఇరువది సంవత్సరాలు నన్ను ఆమె తప్పు పట్టి ఎరుగ

తరువాతి దశలో సంప్రతింపులు, చర్చలు, వాదోపవాదాలు, భిన్నాభిప్రాయాలు, వ పట్టింపులు, తగాదాలు, సర్దుకోవడాలు, ఒకరి లోపాలను మరొకరు సహించడాలు సాగాయి.

ఇక యీనాటి స్థితి. ఒకనాడు ఎవరికయినా నేను సహాయం చేస్తే వారు నాకు ప్రత్యుపక చెయ్యాలని కోరుకొనకపోయినా వారు నామంచితనాన్ని గుర్తించాలని, నాకు కృతజ్ఞత తెలియజెయ్యా ఆశించేవాడిని ఇప్పటి పరిస్థితి వేరు నాధర్మం నేను నిర్వర్తించడమే కాని వారి కృతజ్ఞతాభావాన్ని, ద ప్రకటనను అభిలషించటం లేదు. ఇది సర్వసాధారణంగా జరుగుతున్న విషయం. ఒకానొకప్పుడు స్థాయిని నేను నిలబెట్టుకోలేక పోవచ్చును, అలా ఒకటి రెండు సార్లు జరిగింది కూడా.

# రచయిత కృషి

## రచనలు

ప్రత్యేకాంధ్రోద్యమం, జిల్లేళ్ళమూడి అమ్మ, హేతువాదం అంటే, ఎమర్జెన్సీలో జైలు అనుభవాలు, ఆలోచనా తరంగాలు, భావ వీచికలు.

## అనువాదాలు

ఎం.ఎన్. రాయ్ రచనలు:

నవ్య మానవవాదం, కమ్యూనిజానికి అవతల, మల్లాది సుబ్బమ్మ రచనలు

## గతంలో విద్యారంగం

ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యుడు, బాపట్ల కళాశాల స్థాపక కార్యనిర్వాహక సభ్యుడు.

## సేవారంగం

రోటరీ -గవర్నరు ప్రతినిధి

## వృత్తి సంఘం

న్యాయవాది సంఘాధ్యక్షుడు, బాపట్ల, చీరాల

## పత్రికా ప్రపంచం

'వికాసం' మాసపత్రిక సంపాదకుడు.

## ఉద్యమాలు

ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఆందోళన, కుల నిర్మూలన, కుటుంబ నియంత్రణ, మద్య నిషేధం, స్త్రీ విమోచన, పార్టీ రహితం, జ్ఞాన పునర్వికాసం ఇత్యాది ఉద్యమాలలో బాధ్యత గల స్థానాలను చేపట్టి నిర్వహించాడు